## ఉద్యోగపర్వము — ప్రథమాశ్వాసము

విషయము — పుటసంఖ్య

విషయము



## ఉద్యోగపర్వము — ద్వితీయాశ్వాసము

## ఉద్యోగపర్వము — తృతీయాశ్వాసము

విషయము

# అరణ్యపర్వము

( తిమ్మయ )

# ప్రథమాశ్వాసము



శ్రీనిత్యసౌందర్య, చిరకృపాధుర్య। మానితగుణధామ, మనువంశరామ,
కపటతాటకఁ జంపి కౌశికుభయము। నపుడ మాన్చినకుమారా! చిత్తగింపు.
అక్కథకుఁడు శౌనకాదిసన్మునుల। కక్కథాసూత్రమి ట్లని చెప్పఁదొడఁగె.
పంచమవేదంబు భారతంబెల్ల। సంచితభక్తి వైశంపాయనుండు
జనమేజయునకు విస్తరితవాక్ప్రౌఢి। వినిపించుచోట నవ్విభుఁ డిట్లువలికె:
"అనఘ, నీవలన మహాభారతంబు। వినఁగంటి నదియెల్ల విష్ణుకీర్తనము.
ఇందుఁబార్థులు జనియించి గాంధారి। నందనులును దాను నవభంగిఁ బెరిగి
గరిడిసాములుచేసి కార్ముకవిద్య। లరుదారనేర్చి రాజ్యముచవి మెఱిఁగి
బకహిడింబాదులఁ బట్టిసాధించి। ప్రకటితఖ్యాతి ద్రౌపదిఁ బెండ్లియాడి
రాజులగెల్చి చేర ధనంబుదెచ్చి। రాజసూయ మహాధ్వరంబు గావించి
శిశుపాలు నచ్యుతుచే గెలిపించి। వశులైనరాజుల వరుసమన్నించి
రాజరాజైన కౌరవరాజుతోడ। నోజ మాయాద్యూత మొగినాడి యోడి
తమపాలిరాజ్యంబు ధార్తరాష్ట్రులకుఁ। గ్రమమొప్పనిచ్చి[1]న కథయెల్ల వింటి.
అటమీఁది కథ నాకు నఖిలంబుఁ దెలియఁ। బటుభక్తి నెఱిఁగింపు భవ్యమునీంద్ర!
తమ్ములుఁ దానును ధర్మనందనుఁడు। నమ్మతి విపినవాసం బెట్లునడపె?
ధౌమ్యసమేతులై తవిలి పాండవులు। కామ్యకవనములోఁ గాపుండి రెట్లు?
అచ్చటఁ గిమ్మీరుఁడను మహావీరుఁ। బచ్చిరక్కసు నెట్లు పావని యణఁచె?
హరియును బాంచాలుఁ డవ్వనంబునకు। వరుసఁ బార్థులఁ జూడవచ్చుటయెట్లు?
హరునిచేఁ బాశుపతాస్త్రంబుగొనఁగఁ। బరఁగ నర్జునుఁడు తపంబెట్లుచేసె?
అతనికి మఱివచ్చి యఖిలదిక్పతులు। నితర దివ్యాస్త్రంబు లిచ్చి రేభంగి?
అమరావతికిఁ గ్రీడి యమరేంద్రువెంట। గమనింపఁ బనియేమి గలిగెనచ్చటను?
అతనిని నూర్వసి యాత్మమోహించి। యతఁడొల్లకున్న నేమని శాపమొసఁగె?
కాలకేయ నివాత కవచరాక్షసుల। నాలంబులో నరుఁ డణఁచుటేలాగు?

1 విక్రమ ధనులైన. (మా)

రోమశువెంటఁ బార్థులు నలువురును । దామటఁ దీర్థయాత్ర చరించుటెట్లు ?
సౌగంధికములకై చనుదెంచి భీముఁ । డా గంధమాదనం బనుగిరి నడుమ
హనుమంతుఁ బొడగాంచి యతనితో రామ । జననాథు కథయెల్ల జరిపె 1నేలాగు?
ఏమిమార్గంబున నిల ధర్మసుతుఁడు । పామైన నహుషు శాపవిముక్తుఁ జేసె ?
రా రాజు ఘోషయాత్రవ్యాజలీల । ఘోరాటవుల కేఁగి కుమతిచందమునఁ
బుత్త్రమిత్రకళత్రములుఁ దాను నచటఁ । జిత్రసేనునిచేతఁ జెఱఁజిక్కుటెట్లు ?
వారించి యంతలోవచ్చి యవ్విభుని । నేరీతి విడిపించె నింద్రనందనుఁడు ?
సైంధవుఁడేల యచ్చట భీముచేత । బంధనిర్బంధుఁడై భంగంబునొందె ?
ధర్మసూనునకుఁ బ్రత్యక్షమై ధర్ముఁ । డర్మిలి వరము లేమని యిచ్చిపోయె ?
ఈపుణ్యకథ నాకు నెఱిఁగింపు" మనినఁ । దాపసముఖ్యుఁ డా ధరణీశుఁజూచి
"విను జనమేజయ, వివిధపురాణ । వనధి యీభారత వనవిలాసంబు.
వినుమేను నీకును వినిపింపఁగంటి । సనకాదులకు లేని సౌఖ్యంబుగంటి.
కరిపురినుండట్లు కదలి పాండవులు । 2పారిని గామ్యకవనభూమికై నడచి
తమవెంట మంత్రినందను లొకవేయి । కొమరుగుఱ్ఱము లేనుఁగులు లక్ష లక్ష,
హీరరథారూఢు లింద్రసేనాది । వీరులు పదునాల్గువేవురు, మఱియుఁ
జటులతఁ గాల్బంట్లు శతలక్షసంఖ్య । లిటఁ బ్రతివింధ్యాదు లేవురుసుతులుఁ
దరుణి పాంచాలియు, ధౌమ్యుండుఁ, జెలులుఁ । బరఁగ సౌభద్ర సుభద్ర లిర్వురును
వనిత లూడిగములవా రొకలక్ష । చనుదేర నస్త్రశస్త్రంబులతోడ
నుత్తరంబుగఁబోవ నాదివి వే కదిసి । యత్తఱిఁ బౌరు లిట్లనిరి పాండవుల:

## వెన్నంటివచ్చు పౌరుల ధర్మజుఁడు వారించుట

"అడవులకక్కటా ! యరుగుచున్నారు । వడిఁగూడి మీవెంట వత్తుముమేము.
నింటఁగాల్పొందునే ! యీరున్నచోటు । కంట కాటవిగాదు కరిపురిమాకు.
కౌరవుండొప్పఁడు కడుక్రూరచరితుఁ । డేరీతి మముఁబ్రోచు నీపాటివాఁడు!
హరియున్నగుహ నక్కయాశ్రయించుటకు । సరియైన యచ్చోటఁ జాలము నిలువ.

---

1 నంతయును. 2 పారిమి. (మూ)

మిమ్ముఁజూచినఁజాలు మీ తోడి గోష్ఠి । నెమ్మినున్న నుజాలు నృపులార, మాకు."
అనుచునే తేర నయ్యమసూతి చూచి । "వనవాసభారంబు వలదు మీ కేల!
మా తోడి చలమున మముసేఁచెఁగాక । నీతిఁదప్పునె మీకు నృపుఁడు రారాజు!
మిన్నక మా వెంట మీరు వచ్చినను । ఉన్న సంతోషంబు నుడుగు నాతనికి.
మరలుఁడు వత్తుము మాపూన్కిఁదీర్చి; । నరులార, యెగ్గులెన్న కుఁడు కౌరవుల."
అనుచు వారలనిల్పి యల్లన నడచి । యనిమిషనదిపొంత నారాత్రినిలిచి
1 వేవఁ బోవుచు వెంట విమలాగ్నిహోత్రు । లై వచ్చు విప్రుల నతిభక్తిఁ జూచి:
"అయ్య, మీ రేటికి నరుగుదెంచెదరు? । చయ్యన మమునన్పి చనుఁడింక మరలి.
అడవులఁదిరుగుచు నగ్నిహోత్రములు । నడపుట నన్న మే నావేల్పులార!
పటుభంగిమమ్ము 2 నెప్పటియట్లచూచి । యిటనుండి దీవింపుఁ డింతియచాలు."
ననిన ధర్మజుఁజూచి యావిప్రులనిరి: । "వనమేటమీకు! భావ్యమెమాకు నిండ్లు!
3 నీనిమిత్తమున మునిశ్రేణి తపము । గానల మాకబ్బుఁ గాన వచ్చెదము;
రాజసూయాగ్నిహోత్రము మీరు దేర । రాజ, మాయగ్నిహోత్రములేమి వేఁగు!
ఎవ్వరుపూజింతు రిందుమేమున్న ! । నెవ్వరివారందు రిందు మేమున్న."
అనిన వారలరాక కంగీకరించి । జనపతి మదిలో విచారంబుచేసి
"అడవిలో వీరికి నాహారసుఖము । నడపలే నూరికి నడపనులేను.
ఏ రాజననివచ్చె నీసేనలెల్లఁ । గోరి వీరికి నెట్లు కూడావటింతు
నేమినేయుదు!" నని యిచ్చలోవగచు । నామహాత్ముని ధౌమ్యుఁ డల్లనపలికె:
"ఇదియేమిధర్మజ, యిచ్చలోనీవు । వదలితి నీపెంపు వనధిగంభీర!
ధైర్యమాపదలకుఁ దగినయౌషధము; । ధైర్యహీనుఁడౌచల ! తగునయ్యయిట్లు!
అన్నార్థమైవచ్చు నాశ్రితతతికి । నన్నంబు వెట్టలే ననరాదు నీకు.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

ఉపదేశమొసరింతు నొప్పార" ననుచు । నృపునకమ్మంత్ర మెన్నికమానియొసఁగి
"పొమ్ము సూర్యోదయంబున నిట్టిమంత్ర । మిమ్ములఁజఠియింపు మిష్టాన్నసిద్ధి.
అనుపమ సూర్యనారాయణమంత్ర । మనఘ, నాకిది వసు వాసతియిచ్చె.

---

1. నేని. 2. నప్పటిరీతు వీక్షింప. 3. ననిమిత్యము మునిశ్రేణికిఁగాన (మూ).

రణమధ్య జలమధ్య రాక్షసమధ్య । ఫణిమధ్యముల దీనిఁ బఠియింప జయము.
జనుల దుర్భిక్షదోషంబులు మాను; । నినుఁడు నిష్టాన్నంబు లిచ్చు నిశ్చయము."

## ధర్మజుఁడు సూర్యు నారాధించి హేమపాత్రిక వడయుట

అని పురోహితవరుఁ డానతిచ్చుటయు । జననాథుఁ డది పునశ్చరణంబు చేసి
సూర్యోదయమున మెచ్చుగ ననుష్ఠాన । కార్యంబు లటఁ దీర్చి కరములు మొగిచి
కమలాప్తునకు నమస్కారముల్ చేసి । విమలమంత్రముల నవ్వేల్పుఁ గీర్తింప
మణికిరీటముతోడ మహనీయకిరణ । గుణలసత్ప్రభతోడ గురుశక్తితోడఁ
గమలహారముతోడఁ గాంచనవర్ణ । విమలాంబర ప్రభావిభవంబుతోడ
హరిదశ్వరథముతో నరుణాయమాన । కిరణవిస్ఫురణ సంకీర్ణంబుతోడ
భువనసంరక్షణబుద్ధితో దివ్య । కవచకుండల శుభాకారంబుతోడ
వాలఖిల్యమునీంద్ర వర్తితామ్నాయ । జాల సంస్తుతులతో జయలక్ష్మితోడఁ
దపనుండు లోకబాంధవుఁ డంధకార । రిపుఁడు త్రిమూర్తివర్తిత శరీరుండు
అపుడు పార్థునకుఁ బ్రత్యక్షమై నిలువ, । నపరిమితానందుఁడై సాఁగి మ్రొక్కి
యంజలిచేసి దేహాంతరాపూర్ణ । సంజాతపులక విస్రంభుఁడై నిలిచి,
"కమలబాంధవ, దివాకర, లోకమిత్ర, । విమలతేజోరూప, వేదస్వరూప,
అంధకారవిరోధి, హంసాఖ్య, సప్త । సైంధవ, సర్వేశ, సకలశరణ్య,
ద్వాదశాత్మ, సమస్తదనుజసంహరణ, । భూదేవతాధార, భువనైకనేత్ర,
నాథ, మందేహారుణద్వీపవాస, । పాథోధిపూజిత, పరమకల్యాణ,
నిరుపమ, నిరవద్య, నిర్వాణబోధ, । నిరఘ, నిరంజన, నిత్య, నిస్సంగ,
పరమ, పరంధామ, పావన, ప్రథిత । పరహిత, పరమేశ, బ్రహ్మాండతేజ,
కర్మసాక్షి, త్రిలోకముల రక్షించు । ధర్మమూర్తిని నిన్ను దర్శింపఁగలిగె.
నివిడి నేక్రుంకుట నీయుదయంబు । భువనరాశికిఁ జావుఁబుట్టువుఁ గాదె!
సహజసత్త్వాధార, చండాంశుజాల, । గ్రహరాజ, తుహిన నిగ్రహ, నీకు శరణు.
కాలనిర్మాణంబుగావించి జంతు । జాలంబుఁ బ్రోచు భాస్కర! నీకు శరణు."
అని సన్నుతించిన యమసూతిఁ జూచి । దిననాథుఁ డనియెఁ: "బృథ్వీనాథ, వినుము
ఇదె నీకు నిచ్చెద హేమపాత్రంబు । వదలక యిది నీవు వరముగాఁ దాల్చి

పాంచాలికొసఁగు మప్పద్మాక్షి దీన । సంచితభక్తికి నశనంబు వండి
దయతోడ నన్న మొదలఁ బెట్టినను । జయభాతి నన్న మక్షయముగాఁ గలదు;
ఆయింతి భుజియించినంతటఁ గాని । పాయదన్నము పాత్రఁ బ్రతిదివసంబు"
అని హేమపాత్రిక నతఁడు నొసఁగి । చనియె సూర్యుఁడు నిజస్థానంబునకును.
అతఁడు నట్లు చేసి యజ్ఞాప్తకరుణఁ । బ్రతివేళ నన్నపర్వతము గావించె.
అంత విప్రులు తోడనరుదేర నృపులు । కాంతారములు చొచ్చి కౌరవు లలర
మొలచిన జవమున మూఁడహోరాత్ర । ములు నడవఁగ రాత్రి ముదురుచీఁకటిని

## కిమ్మీర సంహారము

గిమ్మీరుఁడను దైత్యకేతుండు బకుని । తమ్ముఁడు మేరుమందర ఘోరతనుఁడు
అరసి ముందటఁ బార్థులరుదెంచు త్రోవ । యడ్డగట్టుకొని యట్టహాసంబుచేసి
క్షితిధరంబులలోని సెలయేఱువోలెఁ । బతులలో నేతెంచు పాంచాలిఁ గొనుచు
మెఱుఁగుఁగోరలు మండ మింటికినెగసి । వెఱచి వేల్పులుపాఱ విభులకిట్లనియె:
"తలఁకక యేనున్న దారుణాటవుల । మెలఁగెద రేను గిమ్మీరుఁడన్వాఁడ;
బకునితమ్ముఁడ మిమ్ముఁ బఁణతితో మ్రింగి । ప్రకటలీలలఁ బ్రాఁతపగ నీఁగువాఁడ."
అనినఁ బాంచాలి భయంబందివణఁకి । "జననాథులార, యీసరణి రాఁదగునె!
తడయక యిటువచ్చి దైత్యునివాఁతఁ । బడితి మింతియకాక ప్రతికారమేమి!
అంతరిక్షముత్రాఁకె నందఁడు మీకుఁ; । జెంతలఁ జేరదు చెదరె మీసేన
కూడక తొలఁగక కొంతదూరంబు । వేడుక నన్ను మ్రింగి పోఁడేఁగుఁగాని.
ఈయుపాయంబున నిందఱఁజంపి । దాయలు ధర యేలఁదలఁచిరే యకట!
ఏమికాఁగలవార మిటమీఁద!" ననుచుఁ । గోమలి వాపోవఁ గొండొకనవ్వి
యనిలజుఁ డచలంబునంత పాషాణ । ముఱు వానిపై జవంబునఁ దాఁకవైవ
వక్షంబునలిసి యవ్వామాక్షివిడిచి । రాక్షసుఁ డంధకారపుఁ గొండవోలె
వ్రాఁకులవర్షంబు మారుతిమీఁద । పోఁక వర్షించుచో వేవేగనరుఁడు
పడకుండఁ బాంచాలిఁబట్టి యొక్కింత । యెడయిచ్చి తొలఁగిన, నెనఁగి భీముండు
యనిమిషాంతకుఁ బట్టి యతఁడునుదానుఁ । బెనఁగులాడుచు వచ్చి పృథివిపై వ్రాలి
మోఁచేతఁ బొడిచిన, మూర్ఛిల్లి యసుర । ప్రాఁచివీనువువోలెఁ బడియు వేఁదెలిసి
వికటాద్రిశృంగంబు విఱిచి వాంకించి । బకరిపువైచినఁ, బట్టి యాగట్టు

నసురఁగ్రమ్మఱనైచి యార్చి వాయుజుఁడు । వెస వానిడగ్గఱి విన్నాణ మొప్పఁ
గడకాలిఁగొడిసినఁ, గడువేగ త్రోలఁగి । యొడిసి వృకోదరు నుగ్రుఁడై యసుర
మెడనొక్కుచోఁ, మిసిమింతుఁడుగాక । సడముడి యురమున వాఁడిఁ దాఁకుటయు
నెత్తురుగ్రక్కి యన్నీచరాక్షసుఁడు । నుత్తుంగముష్టి నయ్యుర్వీశుఁ బొడిచె.
పొడిచిన సద్దైత్యభుజశక్తి కొంత । యడఁగుట తలపోసి యనిలసంభవుఁడు
ద్రౌపదివెఱచు నింతటఁ జాలుననుచు । నాపర్వతాకారు నదరంటఁబట్టి
బిరుసున బకునిఁజంపినరీతి నడుము । విఱిచి పాఱఁగవైచె విభుఁడుకీర్తింప.
కిమ్మీరు నీరీతి గెడపినపిదప । నమ్మహాభుజులు కామ్యకవనంబునకు
నరిగి బ్రాహ్మణయుతులై పర్ణశాల । [1]ఒరుసలుగాఁబన్ని యుండిరచ్చోట.

## పాండవుల యరణ్యవాసమునకు ధృతరాష్ట్రుఁడు విచారించుట

ఇటఁ బాండవులపోక కిచ్చ శోకాగ్ని । ఘటితంబుగా నంబికాతనూభవుఁడు
ఏకాంతముననుండి హితమంత్రితనము । నేకొన్న విదురునిఁ జీరి యిట్లనియె:
"విదుర, నామాటలు వినఁడయ్యెసుతుఁడు; । తుదిఁ బాండుపుత్త్రులఁ ద్రోచె నట్టడవి;
నేండ్లెన్నఁగా నెంత యిదెవచ్చెనపుడె; । యేండ్లుఁబూండ్లును మాకు నిలయేల లేదు;
వారంతవత్తురు వసుధయేలుదురు; । వైరమొక్కటినిల్చె వలయునే యింత!
ఆదిగర్భేశ్వరులైన నాసుతులు । ఆ దశనున్న వా రడవులలోన
నన్న నేరమిచూచి యాదశచూచి । యున్న నల్వురు నేమియుగ్గడింపుదురొ!
ధారుణీపతిఁ జేరి ద్రౌపది యిపుడు । వైరరజ్జువు నెంత వడివెట్టుచున్నొ!
యొడఁబడ నోడించి యుర్విఁగైకొనియెఁ । గొడుకు, ఈతగవును గూడునో లేదొ!
మానుపరాదయ్యె; మఱి యాడి రోడి; । రీనిర్ణయము ముట్టె నేటికిఁ జింత!
ఇంక మీఁదటికార్య మెఱిఁగింపు విదుర! । బొంకక నాకుఁ జెప్పుము మీఁదు తెలిసి."
అనుటయు విదురుఁ డయ్యవనీశుఁ బలికె । "వనవాస మీడేర్చి వత్తురు వారు;
గుణములరాఁ బెనఁగుదురు రాజ్యంబు; । రణమునఁగాని రారాజీఁడు నేల;

---

1. 'వరుసలు' అనుపదమును వ్యావహారికోచ్చారణము ననుసరించి 'ఒరుసలు' అని ప్రయోగించి యుండుదురు.

అప్పుడు రణములో యమసూతిగెలుచుఁ; । జెప్పనేటికి నేలుక్షితియెల్ల నొకఁడ.
ధర్మవుజూదమే ధర్మజుతోడ । సర్మిలినాడినా రవనీశ ! మీరు.
చెప్పిరి శకునికి జితుఁడను దైత్యుఁ । డిప్పాచికల మాయ నిచ్చినాఁడనుచు.
మాయగా నెఱిఁగియు మదినింతకరుణ । నీయగ్రతనయుండు నేరఁడు నిలుప.
తనసొమ్ముగాఁజూచె ధర్మజుసొమ్ము; । తనయుండె నీకు నాతఁడు ద్రోహిగాక !
అతనినొక్కనిఁ జంపి యన్వయంబునకు । హితమొనరింపవే యిది నీకుఁగీర్తి.
అంతఁ బార్థులువత్తు రా ప్తులునీకు । నింతభూచక్రంబు నిత్తురుగెలిచి."
అనిన నెంతయు నల్గి యాంబికేయుండు । "తనయుని విడుమంటి తగునయ్య విదుర !
మాటిమాటికి నిట్టిమాట వోవిడువ । వేటిమంత్రివి! యిచ్చ నెఱుఁగవు పెద్ద.
మొదలు 1విఱిచిన మాను మొలచునే వెనక? । యదిర కౌరవుఁజంపి యలతునెకులము !
పో పొమ్ముచాలు; నీబుద్ధులువిన్నఁ । జూపెట్ట నాకేది సోమవంశంబు?
కొడుకు మొన్నను నంటి కొలువులోనవ్వ; । విడుమేల నీతోడి విమమనంగతము.
వానిఁజంపఁగనేల? వాఁడేమిచేసె? । మాని నీవేపొమ్ము మా యొద్దవిడిచి".

## ధృతరాష్ట్రునిపైఁ గోపమెత్తి విదురుఁడు పాండవులకడకుఁ బోవుట

అనుటయు విదురుఁడిట్లనుఁ: "గోపమేల? । యొనసి యేనిజమాడి 2యొడమైతినీకు.
మది3నొచ్చునని భీతిమానక హితము । విదురునిగతి మీకు వినిపింపరొరులు.
పోయెద నాకేమి భూములులేవె? । నీయాత్మజుఁడు నీవు నెగడినఁజాలుఁ.
ఖాండవకోపాగ్ని ప్రబలిననాఁడు । మండలనాథ, నామాట చింతింపు;
ప్రతినలు వారికిఁ బ్రతివచ్చునాఁడు । మతినప్పుడైన నామాట తలంపు."
అనిమ్రొక్కి రథమెక్కి యాప్రొద్దికదలి । కినియక పార్థులేఁగిన త్రోవపట్టి
కామ్యకవనము డగ్గఱఁ బోవఁబోవ, । ధౌమ్యుఁడప్పుడు పాండుతనయుల కెల్ల
విదురుని నల్లంత వ్రేలఁజూపుటయు । మదిసందియముపుట్టి మారుతాత్మజుఁడు
"జూదమాడఁగ ధర్మసుతుఁ బిల్వ మఱియు । నీదొరఁ బంచెనోయిట్టి 4బండంగి?
ఆయుధంబులు నాఁడు హరియింప మఱచి । యాయుత్తములు వీని ననుపనోపుదురు.

1. విడిచిన, 2. యొనయైతి. 3. మెచ్చునని. (మా) 4. బండగుఁడు, అకతాయి. శ. ర.

జడలుగట్టియు నింక శమనసందనుఁడు । తొడఁగునొకో వారితో జూదమాడ!''
అనునంత విదురుని యనుసూతిదెచ్చి । గొనకొని పూజించి కుశలంబులడిగి
తల్లి సేమము లక్ష్మి తరువాత నడిగె: । "నుల్లంబు నీ కేల యొకరీతియయ్యె?
తెలిసియుండవు నిన్ను, ధృతరాష్ట్రసుతులు । పలికిరో యేమైన భావ్యంబుదప్పి?
నీభోగములకని నియమించు ధనము । మాభక్తి గలదని మాన్పిరో యిడక?
ఏటికి నీకురా నింతదూరంబు? । మాటపుట్టక రావు మానైకధనుఁడ''
వనుటయు ధృతరాష్ట్రుఁడడిగిన విధముఁ, । దనయుని విదురుని తా నాడువిధము,
భూపతి దానికై పొమ్మన్న విధము । నా పార్థులకుఁ జెప్పి యతఁడు వెండియును
"నరనాథ, 1మీరు కానలలోనివారు । పురుడింపఁ 2దామిభపురిలోనివారు
నని తలఁతురు; గాని 'నైశ్వర్యమునకు । మనసు గెల్వరు, మీరు మరలెద' రనుచు
నిదినన్ను నడుగుదు; రేనురారందుఁ; । బదిలమైయుందురు; పగలు రేయెపుడు
వారు మీపై నెత్తివచ్చు యత్నంబు । గోరుదు 3రింతగాల్కొనసీని మదిని;
మీరును బదిలమై మెలఁగుఁడు మేలు; । కౌరవులకు మీకుఁ గట్టదు సంధి.
ఒకవేళ నాంబికేయుఁడు మీకువగచు; । నొకవేళ కొడుకుతోనుండు మంతనము.''
అనుచు నన్నియుఁ జెప్ప "నక్లేని మాకు । ఘన సహాయార్థమై గలిగితివీవు;
కూడి పోదముగాని కుండకు'' మనుచు । వేడుక నిలిపి రవ్విభునిఁ బాండవులు.

## విదురుఁ డొడ్డైర ధృతరాష్ట్రుఁడు సంజయు నంపుట

విదురుఁ డక్లేఁగిన కలితిమైనట్లు । మదిలోన నొక్కటి మఱచినయట్లు
ధృతిలేని యట్లునై ధృతరాష్ట్రుఁడతనిఁ । జతురతఁ దొడ్డైర సంజయు ననుప
నతఁడును బోయి కామ్యక వనభూమి । వ్రతవేషమున నున్న వారిఁ బాండవులఁ
బొడగాంచి యాదరంబున నాంబికేయుఁ । డడిగిన కుశలంబు లందఱనడిగి,
విప్రులకాతని వినతి యేర్పఱచి, । సుప్రసన్నుని ధర్మసుతుఁజూచి మఱియు
"నీయార్పుపనఁజుమీ నృప, సోమకులము । పాయక నిలుచు నుపాయంబుఁ గనిమె.
నీవు వర్ధిల్లుము నృపులలో మిగుల; । నీవనవాసంబు నిట్లయుండెడిన!
దేవ, యావిదురుఁ బుత్తెమ్మనావెంట । భూవిభుండును బిల్వఁ బుత్తెంచె నన్ను.''

1. తాము. 2. మీరిభే. 3రింక గాల్కొన నినిమదిని. (మూ)

అని కార్యమెఱింగించి యాపార్థు లనుపఁ । గొనితెచ్చె విదురు నక్కురురాజుపొంతకి.
తెచ్చిననలరి పార్థివుఁడును విదురు । గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కూర్మి నిట్లనియె
"తమ్ముఁడ, నాకు నేత్రమ్ములు నీవు; । ఇమ్మాడ్కిఁ బోదురే యిట నన్ను విడిచి!
నీ వెరవున నిట్లు నెఱపవు నీతి । నీ విభవార్థమై నెఱపితి నీవు (1)
ఏవింటి వినకుంటి హితమాడు" మనుచు । నావిదురుని బెద్ద యాదరించినను,
పాండవుల్ వడిరొదు పాట్లు భూపతికి । నొండొండ వివరింపుచుండె నాతఁడును.

## దుర్యోధనుఁడు పాండవులపై నెత్తి పోఁదలఁచుట

అంత దుర్యోధనుఁ డయ్యిరువురకు । నంతరంగము లేకమై యుండు టెఱిఁగి
శకునిని గర్ణు దుశ్శాసనుఁ గూడి । యొకనాఁడు మంతనంబుండి యిట్లనియె:
"విదురుఁ డూఱక రెండు వీళ్ళకుమంత్రి; । పదరిపొమ్మననేల? పతి పిల్వనేల?
వైరులలోనుండి వచ్చినయాతఁ । డీరాజు వెఱపింప కేటికిమాను!
అరులదాస్యము పాపఁడయ్యెనే వెఱచి? । నరనాథు నాకును నమ్మంగరాదు.
ఎంతటఁ బెట్టునో యిరువుర చెలిమి! । కౌంతేయులకు నాస గలిగిన ట్లుండె;
నెయ్యదిబుద్ధి నాకెఱిఁగింపుఁ" డనిన । నయ్యంగపతి పల్కె: "నాజియే బుద్ధి;
కూరలుఁ గాయలుఁ గూళ్ళుగాఁ గుడిచి । వారు నొచ్చినవేళ వనభూములందుఁ
బొదల నున్నారని పోదలనీరాదు; । అదను దప్పిన కార్య మనుపఁబడునె!
మనమెత్తి పోయిన[1] మనమెత్తుకోయి । మునివేషధారులు మూఁకఁజిక్కుదురు.
పంతంబులాడినఁ బగ నిల్పనగునె! । చింతింపనేటికి? సేనఁ బన్నింపు;
గురుభీష్మ విదురులు కోటిచెప్పినను । పురమె కార్యంబు యోధులఁ బిల్వఁబంపు."
అనునంత శకునియు ననుజుండు నిదియ । యనువైన రాజకార్యంబన్న నతఁడు
లోకంబు హల్లకల్లోలంబు గాఁగ । భీకర ప్రస్థాన భేరి వేయించి,
ఘోటఘోటీ భట గురుతరదంతి । కోటి కొల్లనుగూర్చి కనకకుంభగ్రున
గొల్లెనకంబాలు గొడుగులుఁ బడగ । లల్లన విలుమోపు లమ్ముల వండ్లు
మెత్తనిశయ్యలు మెఱుఁగు కొప్పెరలు । ముత్తెపుఁ బీటలు మొగిఁ బల్లకీలు
పసిఁడి మంచంబులుఁ బట్టుమేల్కట్లుఁ । బొసఁగ సరాతులు బోనకావళ్ళుఁ,

---

1. మనమెత్తి (మూ)

బరిచారకులఁ బాడిపసులు సస్గంధ । పరిసుఖ వస్తు సంపదలు నేతేర
మండలపతి కొకమాట సూచించి । పాండుకుమారులపై దండువెడల

## వ్యాసుఁ డాతని వారించుట

నెఱిఁగి వేదవ్యాసుఁ డింతలో వచ్చి । తెఱఁగొప్పఁ గురురాజుఁ దేరెక్కనీక
నిలిపి యిట్లను: "నీకు నీతి యెక్కడిది । వెలుఁ డ నాజికి వేళయే యిదియు!
కనచంబులూన్చి నాగంబులు పోలె । వసనిఁ బోనాడి వారలుక నున్నారు.
అఱవఁ గాకియు లేని యూళ్ళకాననముల । జఱిగొని గొడ్డేఱ సమయఁ బోవెదరు.
సుదతి నెత్తుక పోవుచును భీముచేత । మొనగిన కీచుల్మారు మీరు గన్గొనరె!
అంభోధి ముని జుట్టినట్లు మీసేన । జంభారి తనయుఁడే చాలు రూపణఁప.
వలను వారలఁబిల్చి వారిరాజ్యమున । నిలుపు నిల్పని నిన్ను నిలుపరువారు."
అనునంత ధృతరాష్ట్రుఁ డచటికివచ్చి । "మునినాథ, నీవాక్యములు వీఁడు వినును;
వేభంగిఁ జెప్పిన వినఁడు నామాట; । నాభాగ్యమున వచ్చినాఁడ వీవేళ.
దైనసహాయులై తనరు పాండవుల । నేవెంటఁ దాగెల్వనెత్తి పోయెడిని!
మారుతి ననుజూచి మన్నించెఁగాక, । యూరకే తానైన నోర్చునే మొన్న!
ఆధర్మసుతుమీఁది యాగ్రహంబుడుగ । బోధింపవయ్య నాపుత్రకు." ననిన,
"మైత్రేయుఁ డనుమానిని మామారు వచ్చి । పుత్రుని బోధించు భూపాల!" యనుచు
వ్యాసుఁడేఁగిన, యుద్ధయాత్ర చాలించి । యాసుయోధనుఁడు సైన్యము వీడుకొలిపి
యేకార్యమునకు సహింపక యుండ । నాకౌరవునిమీఁది యాదరంబునను

## మైత్రేయుఁడు దుర్యోధనునకు హిత మువదేశించుట

మైత్రేయుఁడే తెంచి మనుజేంద్రుచేతఁ । బుత్రసమేతుచేఁ బూజలు వడసి
యతనిసభావేది నర్థిఁగూర్చుండి । హితమతి రారాజు నీక్షించిపలికె
"అతి శాంతనిధియైన యామసూతియోర్పు । గతి, నీతి, దైన్యంబుగా నీవుదలఁతు;
వట్టిరాజలిగిన నఖిలంబుఁ గాల్చు; । నెట్టన నెఱుఁగవే నీవు పాండవుల?
అరయు నేఁ దీర్థయాత్రకుఁబోయి । వారలఁ గామ్యక వనభూమిఁ గంటి;

వేలసంఖ్యల విప్రవితతి నిత్యంబు । నోలిఁ జుట్టును నగ్నిహోత్రముల్ చేసి
యరికుల క్షయముగా నాశీర్వదింపఁ । బెరుగుచున్నది వారి పెద్ద తేజంబు.
అనుదినంబు వా రస్త్రశస్త్రముల । కొనసాంపుమరుపూజ యుద్ధంబుగోరి.
అమరులు వారు మీరసురులు దలఁప । సమరంబు నిజమైన జయము వారలదె.
భూమిపాడఱుచును బులులు ఘోషింప । నేమిచేసెదవీవు? ఇదె వారు నరుగఁ
బృథివి రోగములు దుర్భిక్షదోషములుఁ । బ్రథితంబులయ్యె భూప్రజల కీవేళ.
చలమేల వారి రాజ్యము వారికిమ్ము । బలవంతులకు హీనబలు లెంతపెద్ద!
వారువచ్చిన నీకు వర్ధిల్లులక్ష్మి; । యారయు ధర్మరాజట్టివాఁ''డనిన,
నలి నూర్ధ్వబాహుఁడై నవ్వి రారాజు । "తలత్రిక్కనాడితి తపసి, నన్నిట్లు;
నీతిఁ జెప్పఁదువని నీరాకగోరి । భూతలాధిపుఁడున్న పూనిక యొప్పె.
జగతి దుర్యోధనసంపదలనఁగ । నెగడితిఁ జట్టనే నీకన్నులకును!
బొక్కఁడన్నము వెట్టఁ బొగడుదురతని; । నిక్కడివారి మీరెగ్గులాడుదురు.
వారట మేమిట వలసినట్లగుదు; । మూరక పొ'' మ్మన్న నుగ్రుఁడై మౌని
"యారూఢి నీకితవవునె యీబుద్ధి! । ... ... ... ... ... ...
శాపజలంబెత్తి "చనునె యీబుద్ధి! । దీపింపఁ జెప్పినఁ దెగడితి నన్ను;
ఓరి, నీతొడలు వాయుజు గదన్విఱిగి । ఘోరాజిఁబడుఁగాక కుంభిని వణఁక."
అని ధాత్రిపైఁ జల్లి యమ్మౌని వోవ । జనపతి భీతిల్లె; సభ పెల్లగిల్లె.

## కృష్ణుఁ డాదిగాఁగల బాంధవులు పాండవులఁ జూడఁబోవుట

అంత నక్కడ శౌరి యా ద్రుపదుఁడును । గాంతారమునకు [1]నొక్కటఁ గూడిపోయి,
భామాసమేతులఁ బాండునందనుల । నామహావనములో నర్మిలిఁ గాంచి,
నతులు గాఢాలింగనములు దీవనలు । ధృతి నుచితంబుగాఁ దీర్చి యచ్చోటఁ
బూజితులై ధర్మపుత్త్రుని దశకు । వేజాడ శోకింప వీక్షించి యతఁడు
"ఇంత విచారింపనేల ధీరులకు? । జంతుల కిట్టివి చనుదెంచుఁ బోవు.
చుట్టాల మిముఁ జూడ శోకాగ్నులారె; । నిట్టిచో వచ్చితి రిది నాకుఁ జాలు.

---

1. నొక్కఁడ (మూ.)

అరి చీర లొలుచుచో హరిణాక్షి చీర । హరి మాకుఁ గలఁడని యఖిలంబునెఱిఁగె.
ఆపదలకు శౌరి యడ్డ మౌననుట । యేపదములఁ గాంతుమిది క్రొత్తగాదు.
ఇట్లు [1] గాఁగలదని యెఱిఁగియు జూద । మట్టి పాపాత్ముతో నాడితిఁ గొంత.
కౌరవులకు మాకుఁ గలహంబన్తైన । నీకు మమ్మరయుఁడీ యారీతి.'' యనిన,
నచ్యుతుం డిట్లను "నక్కటా! నిన్ను । విచ్ఛాయుఁ జేసిరే విమతులు సిరిని !
ఎట్టు వేగించెద రీకాననముల! । నెట్టన ధృతిగదా! నిన్ను రక్షించె.
వెస నెనుబదియాఱు వేవురు ద్విజులు । పసిఁడి పళ్లెరములఁ బంతి నిత్యంబు
భుజియింప నుండెడి పుణ్యుఁ డిట్లైన । నిజముగా నెవ్వని [2] నిల్చు సంపదలు!
జలధి మధ్యంబున సౌంభకుఁ డనఁగఁ । గలఁడు మాయావి రాక్షసుఁ డొక్కరుండు ;
నే లేనివేళల నేతెంచి పురము । చాల నొప్పించు నసాధ్యుఁ డెవ్వరికి.
ఘనతరంబయిన మాగధుని తేరెక్కి । పనివడి నే వానిపై నెత్తిపోయి
వధియింపఁ బట్టె సంవత్సరత్రయము; । బుధపూజ్య, యేనున్నఁ బుట్టునె యిన్ని!
మిన్నక యదయుఁడై మిమ్మింత చేసె । నన్నరాధముఁడు రాజై యుండునెట్లు?
ఆడుట యెట్లు మాయపు జూద మట్లు! । ఈ డాంబికముల వాఁ డెల్ల మీతండ్రి.
నరనాథ, యొకమాయ నాకునుగలదు; । ధర [3] యెల్ల గెలుతు యుద్ధపు జూదమాడి.
అడవుల మీ కేల! యరుదెమ్ము కూడి; । నిడివిఁ బండ్రెండేండ్లు నిండించినట్లు.''
అని చక్రమెత్తి మహాక్రోధమెత్తి । వనమాలి కదలుచో, వాసవి యెదుట
"నిలుదేవ, పనులెంత నిను మోచిరావు! । [4] కొలఁదిగాదిది; మీఁదఁ గలుగుఁగార్యంబు.
నీచక్రములకుఁగా నీచక్రమునకు । నేచి పాటెడుపాటి యింతయులేదు.
మమ్ము మానుషులఁ జేసి మాచేతఁ గొంత । రమణ ధరిత్రిభారము మాన్పవలదె!
మొదల నారాయణ మునివఁట! నీకు । నెమరుగా నిలుచునె యీచరాచరము!
వేగిరపడరాదు విను మింతకంటె । నా గుణాధములు చేయఁగలేరు కీడు.
పూనిక లీడేర్చి పోయినఁ గాని, । మానవులెఱుఁగరు మమ్ము ధూర్జుదుతు.'
అని పట్టువలచిన నలుక వోవిడిచి । దనుజారి గోత్రారి తనయునిఁ జూచి
"సమరంబులలో నీకు సారథినగుదు; । హిమకాంతి [5] కులదీప, యిది నీకు వరము.''

1. గలఁడని 2. నేర్చు 3. ధమ్ము 4. కలది 5. కర (మూ).

## ద్రౌపది కృష్ణునితోఁ దనపడ్డ పరిభవము చెప్పికొనుట

అనియె సంతటఁజేరి హరికిఁ బాంచాలి । వినుమి కేశవ ప[illegible] [illegible] బొడఁగ
"అన్న, యేమియునేరఁ డరయ ధర్మజుఁడు; । తను [illegible] నమ్మ్రపచోటఁ దమ్ములఁ జెఱచె.
క్షమగాని యెఱుఁగఁడు; క్షాత్రంబుచోట । క్షునురోల! శత్రు లక్ష్యము గైకొనిరి.
వరవుగాఁజేసి యీడ్వఁగ నన్నునింత । కరుణఁ జూడఁను; నైరిఁగడపఁడు దివికి.
ఇతని ప్రాభవమెన్న నితనిలాచెన్న । నతఁడు తమ్ములకైన నేఁడయ్యె సెలవు.
వనవహ్నిలో వ్రేల్తు వారిధిఁజొత్తు । మొనసి చుల్కని ప్రాణములు మోవఁజాల."

## ద్రుపదుఁ డామె నూరార్చుట

అనినఁ బాంచాలుఁ డయ్యతివఁ గోపించి । తనయ, రమ్మని పిల్చి తగఁగౌఁగిలించి:
"నీబన్న మెఱుఁగఁడే నృపసార్వభౌముఁ । డో బాల, యనువుగాకున్నాఁడు గాక.
హరితోడుగా నీతఁ డరుల నిర్జించి । తరలాక్షి, నీ శోక తాపముల్ మాన్పు.
నృపవధూమణు [1] లంత నీయడ్గులొత్త । నపుడు ధర్మజు నీవు నాత్మమెచ్చెదవు.
వాణికి రమకు శర్వాణికి శచికి । [2] క్షోణికి సరి నీవు శోకింపఁ దగునె!
ఈభీముఁ డీనరుండెంతకు లేరు! । శోభనంబగుఁ, గొంత సోకోర్చి నిలుము;
కోపింపకుము వారిఁ గూఁతుర!" యనుచు । నాపతివ్రత శోకి మాతఁడు మాన్ప,
హరిపల్కు "నర్జునుండన్నట్లు మనకు । వెరవుగా దిప్పుడు వేగిరించినను.
కయ్యమయ్యెడుఁ గాని కాకపోదెపుడు । తొయ్యలి, నాఁడు నీదుఃఖంబు మాను.
పాండుసూనుల ధర్మపాశ సంయుతుల । నొండాడవల"దని యుపశాంతి నునిచె.
కృష్ణపాంచాలు రీక్రియఁ బాండుసుతుల । తృష్ణవాయఁగఁజేసి ధృతి నూఱడించి
మరలుచో, నృపుఁ డభిమన్యు సుభద్ర । నరుదార హరివెంటననిచె; వెండియును
బాంచాలపతివెంటఁ బాంచాలిసుతుల । నంచెఁ గానవవీథి నలయరేరనుచు.

## పాండవులు ద్వైతవనమున కేఁగుట

అనిచి యారాజు కామ్యక వనవాస । మనుజనమేతుఁడై యంతఁ జాలించి
ద్వైతవనంబు సంతత రమ్యమనియుఁ, । జూత నూతనలతా శోభితంబనియు,

---

1. అంపలు అను నర్థమునఁ బ్రయుక్తము. 2. శోణికి. (మూ)

సురసదీ కల్లోల శోభితంబనియు, । బరిపక్వ ఫలవృక్ష బంధురంబనియు,
బ్రహ్మర్షి ముని ప్రవర సంభావితంబనియు । బ్రాహ్మణతతిచెప్పఁ బనవుట్టికదలి
కార్మ్యకవ్యనమను నెలవుఁ జేరంగఁ బోయి యా డ, । దుర్మదమృగములఁ దునియఁ జేయుచును,
ఉరుతర భీతి దైత్యులు గనిపాఱ । నరుదెంచి యందు నొప్పారు తావులను
గొంతకాలంబుడఁ గువలయేశ్వరుని । [1]కాంతి హీనతఁ జూచి కురువలి సుతుఁడు
కాంతయు వినుచుండఁగా నేకతమున । శాంతి విశాలు నజ్జనపాలుఁ బలికె

## భీముఁ డన్నతో వైరులఁ జక్కాడి వత్తు ననుట

"బయలేల యీఁదెదు పాపపురాజ! । నయమె యీ దేహంబు నవయింప నిచట!
[2] కనుములొత్తినవీపు కదుములుగట్టి । ఘనమైన యెండ వక్త్రము గాజువాఱి,
కాననధూళి సంగము [3] బిరుసెక్కి । యూనిన పొగవలె నున్నాఁడ వకట!
విప్రనిర్ణయమిది వినుమన్న విడవు । [4] నీ ప్రాణమేమి పన్నెనో రాతధాత? ,
మృదుఁడైనఁ దపమున్న మెచ్చునింతకును । మడిచికట్టెను మమ్ము మాటాడనీక.
వైరులఁ జెండాడి వసుధగైకొనఁగ । నేరవు నీవని నృపులు నవ్వెదరు.
మనమిందుఁ బదుమూఁడు మానంబులయ్యెఁ । జనుదెంచితిమి వర్షసంఖ్యలైనట్లు.
నిజకులోచిత ధర్మనియతికిఁ జొరక । ప్రజలు మెత్తురె యిట్టిపాటు నాతండ్రి !
జనలోకమునలేని సభనీకుఁ గలిగి । పొనర నింద్రప్రస్థపురమును గలిగి
పద్మనాభునివంటి బంధుండు గలిగి । పద్మాక్షి శాల, యీపాటు నీకేల !
ధరఁబెద్దకాలంబు దలఁపకయున్న, । నరిరాజు గాల్కొన్నయట్లు [5] నూల్కొనిన
గోరఁబోయెడివోట గొడ్డలి వలయు; । చేరుకే రాజ, నీసేన నిన్నిపనుకు ?
అర్థిఁ గొరవుఁజాకుచున్నట్లు నీవు । పార్థివ, యీడెదు బలు వెన్నవింక !
ప్రతిన నీవెఱుఁగుదు పనుపుము నన్ను । శతసంఖ్య వైరులఁ జక్కాడివత్తు.
గాండీవిఁ బుత్తెమ్ము కర్ణునిఁ జంప । మండలాధిప, నీవు మఱివత్తుగాని.
కలకాలమిల యేలఁగాఁ గోరికాదె । కలిగించి రజ్ఞాన ఘనచర్య మనకు.
ఈ తేజములవార మెవ్వారు మనల । నేతెంచి వెదకిన నిల డాఁగఁగలమె !"

---

1. కాంత. 2. కరల్లొత్తిన. 3. బిదుసేంగి. 4. 'బ్రహ్మ నీహృదయమును దాళితోఁ జేసెనేమి' అని యర్థము. ప్రాణము – హృదయము అను నర్థమున వాడినట్లు తోఁచుచున్నది.
5. గాల్కొనిన (మూ)

## ద్రౌపది భీముని ప్రసంగము బలపఱచుట

అనునంత ద్రుపదరాజాత్మజ పలికె । "అనిలజుమాట సత్యము ధర్మతనయ!
పెట్టిపంతువుగాక భీము గాండీవి; । నట్టైనఁ గరిపురంబు నీకిపుడు.
సిరిబోఁటి నినుబాసి చిరవిరహమున । విరిదమ్మికొలఁకుల విష్ణుఁడెందమునఁ
గొమ్మరైన ముత్యాల గొడుగుల నీడ । రమణీయ కృపగల రాజునేత్రముల
నున్నది నీవైన నొల్లవుగాని । ఎన్నఁడు నేర్చెదు హితమైన నేర్పు?
అడవులఁ గూరగాయలు దినునపుడు । పొడమని కోపంబు పొడమునే యపుడు?
పులి పేద్దవడ్డట్లు భూపాల, డస్సి । చులకనై యున్నాఁడు చూచితే భీము?
ఉలుక వెండలఁ గ్రాఁగి యుల్లంబు ద్రేఁగి । వెలిబొమ్మ భావమై విజయుఁడున్నాఁడు.
నలగిన నకులుఁ గానల నుండఁగనినఁ । జలమేది వగవఁడే సౌబలుఁడైన?
ఫలమూలములు దేరఁ బాలయ్యెఁ గర్మ । ఫలమూలమున మాద్రి బ్రాతిలేఁజూలు.
రారాజునకు మీరు రాజ్యాభివృద్ధి । గోరి తపంబున్నకొలఁది నున్నారు.
[1] కుమ్మరపురువంద్రు కుట్టని తేలు । నిమ్మల నీశాంత మింతకుఁదెచ్చె.
గదయు గాండీవంబుఁ గల సహోదరులఁ । బొదలఁ బెట్టితి; వైరిఁ బొదలఁ బెట్టితివి.
కడకంటఁ గోపమెక్కడఁ గంట లేదు; । పొడుఁడని తమ్ములఁ బోనేల యిత్తు?
వని దూటిపలికిన నాతఁడిట్లనియె । "పని మీఁదఁ గలుదు; చెప్పకుఁడెఱుంగుదును;

## ధర్మజుఁడు వారల శాంతింపఁజేయుట

దేశకాలములింత దృష్టింపవలయు; । నాశకాలము రాక నడుఁకరు రిపులు;
ఓరుపు నేరుపు నుభయంబువలయు; । వేరంబు గొన్నచో వేగిరమేల?
విపుల వానప్రస్థవిధిఁ గొన్నియేండ్లు । విపినంబు చూతము విమతు లుప్పొంగ.
ఏలఁగాలము లేదె మొలనాగ, మనకు! । నీలోన వారికి నిలప్రింగరాదు.
ఓకుపులేని [2] నాఁడువిద, నేనేమి । కౌరవుఁడేమి విఖ్యాతియెక్కడిది?
ఇప్పుడు తమ్ముల నేఁబుత్తునేని । తప్పుఁగార్యము; సేనతఱుచు వారలకు.
ద్రోణగాంగేయులు తోడుగాఁజూతు; । రేణాంకధరుఁడైన నెదురె వారలకు!

---

1. కొమ్మల. 2. వాఁడు, (మూ)

ఇంకఁ గృపాచార్యుఁ డెంచఁగఁజాలఁ! । డింక నశ్వత్థామ యెంతటివాఁడు!
వారికిలేనివి వలయుఁ బ్రాణంబు; । బూరసుసంసిద్ధ మోఘునే గెలువ?
పరబల నిజబల ప్రౌఢిమ దెలిసి । కులాత్మ, మఱికదా తలపడవలయు.”
అనిన భీముఁడుపల్కు నలుసనవ్వుమర: । “మనసుమెత్తనిమాట మనుజేంద్రుమాట;
యిట్టి నిర్ణయమైన నేనేలమెత్తు! । నిట్టి తలంపైన నేనేలమెత్తు!
వారికి వెఱచినవారమై కాదె । ఘోరాటవులలోనఁ గుందెద మధిప!
ఇంద్రుకంటెను వారలెక్కుడె! యొకటఁ । నింద్రుగెల్చినక్రీడి యెక్కుడవోయె?
కోపమెత్తక కొమ్మఁగొని పోరిరనక । యీపాటికనుపు మాయిరువురి నటకు.”
అని గదాహస్తుఁడై యాఁగోపవృత్తి । ననుపమ క్రోధియై యనిలనందనుఁడు
తగుధాటిఁ గదలుచోఁ, దమ్మునియాత్ర । నగుమొగమమర మానవపతి మాన్చి:
“ఎఱుఁగుదు నీసత్త్వ; మెల్లకౌరవులఁ । బఱపుదు నీబారి బకహిడింబారి!
నరుఁడు నీవునుగల్గ నాకునెచ్చోటు । నరకని తోఁపదు సత్యమీపలుకు.
పగవానిఁ గుఱుచగాఁ బ్రభుఁ డాడరాదు; । పగతుని మేటిగా భావింపవలయు;
నని యేనుబొగడితి నాచార్య భీష్ముఁ । గినియకు నీవు వేగిరపుమానిసివి.
వనవాసమీడేర్చి వారిపైఁ [1] జనుట । కనుమతింపుదు నిన్ను నర్జును ననికి.
అనుపమ రాజసూయము సేయఁబట్టి । మనతోడ నోపరు మహిరాజులెల్ల.
కవచకుండలములు గలవాఁడు కర్ణుఁ । డవిరళ బలు వాని నని గెల్వరాదు.
సవ్యసాచికి శస్త్ర సంపదకొంత । దివ్యులచేత సిద్ధించుట మేలు.
ఏయనువుననైన నీశ్వరుకరుణ । నాయతశస్త్రసహాయి గాఁగలఁడు.
హరిసహాయుల కసాధ్యములెవ్వి మనకు! । నరులనెల్ల జయించి యవనియేలుదము
పదరకుం.” డనుచు భూపతిసహోదరుల । సదమద సంగరోత్సాహంబులుడిపి,
ద్వైతవనంబులో ధరణిదేవతల । చేతఁ బురాణవిశేషముల్ వినుచుఁ
బర్ణశాలలలోన బహుతరానంద । వర్ధితసౌఖ్యుఁడై వసియించె ననుచు
జనమేజయునకు వైశంపాయనుండు । మును వినిపించిన ముఖ్యమార్గమున
నక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథవినిపింప హర్షించివారు
అనఘాత్మ తరువాతనైన వృత్తాంత । మనుపొప్పఁ జెప్పవే యని యడుగుటయు,

1. జనఁ – వనుమతింపుదు. (మూ)

భర్గబాణాసన ప్రళయకుఠార! । భార్గవగర్వ నిర్భగ్న ప్రవీణ!
జనక సుతాస్యాంబుజ గ్రహరాజ! । ఘనతరార్ణోరాశి కల్పితబంధ!
ప్రకట లంకానామ పట్టణాభీల! । సకల శత్రువిదార! జగదేకవీర!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్ర దీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచితారణ్యాఖ్య విపుల పర్వమున । నరుదు మీఱంగఁ బ్రథమాశ్వాసమయ్యె.

---

# ద్వితీయాశ్వాసము



శ్రీకరగుణధామ, సిద్ధసంగ్రామ, । కాకుత్స్థకులసోమ, కౌశల్యారామ,
పవమాన తనయుచేఁ జలువారిరాశి । నివిడి దాఁటించిన కృప, చిత్తగింపు.
అక్కథకుఁడు శౌనకాదిసన్మునుల । కిక్కథాసూత్రమిట్లని చెప్పఁదొడఁగె:

## వేదవ్యాసాగమనము

"ఆరీతి నృపులు ద్వైతారణ్యమునను । ధారుణీసురులును దాము నంతంత
వేదశాస్త్ర పురాణ విమలప్రసంగ । మోదితహృదయులై ముఖ్యమార్గమున
నున్నంత, నచటికి నుదయార్కతేజుఁ । డున్నతాజినవాసుఁ డురుకృపాధనుఁడు
ననఘుఁడు వ్యాసమహాముని వచ్చి । మనమలరంగ సమ్మతి నాదరించి
పూజితుఁడై [1] రాజపూజితు ధర్మ । రాజుఁ గృపాదృష్టి రాజిల్లఁజూచి,
"ధర్మజ, యీమహాదారుణాటవుల । శర్మలీలల మీరు చరియించు టరుదు;
విప్రులు వెంటరా విపులతీర్థంబు । లప్రయాసంబున నాడంగఁగలరు.
వైరిజయార్థంబు [2] వలె మీకుఁ జింత; । కౌరవులకు మీకుఁ గలుగుఁ గయ్యంబు;
వారలెఱుంగని వాడిబాణములు । వారక యొకకొన్ని వలయు గాండివికి.
అరయఁ [3] బ్రతిస్మృతియను మహావిద్య । నరనాథ, యిచ్చెద నాచేతఁ గొనుము.
అది క్రీడి కెఱిఁగించి యాతని నీవు । వదలని తపము నిర్వర్తింపఁ బనుపు.
శతమఖుఁడాదిగాఁ జనుదెంచి దివిజు । లతనికి నొసఁగుదు రఖిలశస్త్రములు.
అమరులు తొల్లి వృత్రాసురుభీతిఁ । దమ శస్త్రబలము సుత్రామునియింట
నిల్లడచేసి; రాయీ యుపాయమున । నల్లనకొడుకున కవి యిచ్చునతఁడు."
అని ప్రతిస్మృతివిద్య నతఁడిచ్చి మఱియు । "మనుజేంద్ర, మీరింక మసలకుఁడిచట.
నాల్గువర్షంబులు నడచెనీయడవి । మేల్గీడుఁ దెలియునే మెండైనయాడ!

1. రాజ్య 2. వలె=వలయు ననుట. 3. బ్రహ్మస్మృతి (మూ) ఇటుపైఁ బాఠాంతర మనఁగాఁ దిమ్మయ సోమనల రచనలలో నొకటి.

ఒండుచోటికిఁబొండు వహోమ[1]కాష్ఠములుఁ । బండ్లుఁ దీయనినీరుఁ బసగల్గఁజూచి.”
అనిమానివోయిన నచ్చోటువాసి । మనుజేంద్రులరిగి కామ్యకవనభూమి
ననిచి సరస్వతీనదిపొంతవిడిసి । యనురక్తినుండుచో నట నొక్కనాఁడు
నృపతి యర్జునుఁజూచి నెమ్మినిట్లనియె: । “రిపులనేరీతి నిర్జింతుము మనము!
కర్ణుఁడందు నభేద్య[2]కవచుండు ఘనుఁడు; । నర్ణింప భీష్ముండు [3]వసుధకుగురుఁడు;
గురుని నిర్జింప నెక్కుడులేవు శరము; । లరయఁ [4]జావెఱుఁగఁడాహవమునఁ గృపుఁడు;
నీకునులేవు ద్రోణికిఁగల శరము; । లాకౌరవునినేర్పులట్టివి గదను.
వ్యాసోపదిష్టమై వచ్చినవిద్య । యోసవ్యసాచి, నీకొసఁగెద నిపుడు;
అదియనుష్ఠించు; నీకభవునికరుణఁ । బదిలంబుగాఁగల్గుఁ బాశుపతంబు.
అమృతసంభవమైన యాతూపుగాని । విమతసంభవమైన వెఱపుఁ [5]బోనడఁప
దాయస్త్ర[6]మబ్బిన నటమీఁద దివిజు । లాయుధంబులు నీకు నర్థినీఁగలరు.”

## అర్జున తపశ్చర్య

అని విద్యయిచ్చిన, నాప్రభావమున । ఘనకాంతి నుప్పొంగి గాండీవధరుఁడు
యాత్రకు యమసూతి యనుమతి వడసి । చిత్రభానుని వేల్చి శివునిఁ బూజించి
యగ్రజులకు మ్రొక్కి యతివకుఁ జెప్పి । యుగ్రకార్ముక తూణ యుగళంబుతోడ
నిలఁ బాదచారియై యీశాన్య వీథిఁ । దులలేని ధైర్యంబు తోడుగా నడచి
మంచుఁగొండయు గంధమాదన గిరియు । నంచితగతి దాఁటి యటు పోవఁ బోవ
‘నిలు పోకు’ మని [7]మ్రోసె నింగి వాక్యంబు; । జలజల పుష్పవర్షంబులుఁ గురిసె.
అప్పుడు పులకితుఁడై పోక నిలిచి । యప్పార్థుఁడచ్చోట నతివృద్ధు నొకని
విప్రుని వీక్షించి విస్మితుండైన [8]సుప్రసన్నతఁ బార్థుఁ జూచి విప్రుండు
“ఓరాజ, విను మానులున్న యీయడవి । ఘోరాస్త్ర[9]ములుపూని క్రుమ్మరఁ[10]దగునె!
నీ వెవ్వఁడవు? మఱి నీకేమి కోర్కి? । యీవెంట నీకోర్కు లిచ్చోనె గలవు.
నిలు పోకు పోయిన [11]నింకఁ బోనీను । మలయుచు నింకఁ బొమ్మా చూత!” మనుచు

---

1. కాష్ఠంబు-పండ్లు నీరుననందు. 2. కవచకుండలుఁడు 3. వరకుమారుండు 4. నిచ్ఛామృత్యుఁడా నృపుఁడైన 5. నడచు-నా. 6. మహిమను. 7. తోఁచె 8. సుప్రసన్నుని 9. ములనీవు 10. నగుసె. 11. నిన్ను. (పా.)

జంకించుటయు బుద్ధిచలన మాస్యమున । కంకురింపమి చూచి యాతండు మెచ్చి
యింద్రుండై పొడసూపి యిట్లను "నీకు । నింద్రియార్థితమెద్ది? యిచ్చెదవరము.
సురపద గ్రహపద సురరాజపదము । లరవింద భవపదం బారుద్రపదము
మొదలుగా నున్నవి [1] మొగివేడు." మనిన, । ముదమంది తండ్రికిమ్రొక్కి యర్జునుఁడు
"వైరిజయార్థంబు వలయు బాణములు । గౌరీశుచే నాకుఁ గలిగిం[2]పు దేవ!
తరుణీసమేతుఁడై తమ్ములుఁ దాను । నురుతరాటవులందు నుండి మాయన్న
యమ తనూభవుఁడు నన్ననిచె నీపనికి; । రమణఁ బోరాట కౌరవులకు మాకు;
నేయనువునఁ దూపు లిప్పింపు." మనిన, । నాయింద్రుఁడతని దయాదృష్టిఁజూచి
సరవిఁ బంచబ్రహ్మ శైవ మంత్రమును । [3]గరమర్థి యోగభాగముఁ గృపచేసి,
"యెలమి నర్జున, యేఁగు మీమంత్రయోగ । బలమున ధూర్జటి ప్రత్యక్షమగును.
అంతలో నేవత్తు నమరులఁ గూడి; । చింతితా[4]ర్థములెల్ల సిద్ధించు నీకు."
అనిచెప్పి దేవేంద్రుఁడరిగినఁ గ్రీడి । యనువొప్ప నింద్ర కీలాచలంబెక్కి
తాల తమాల హింతాల తక్కోల । సాల [5]రసాలాది సకల వృక్షములఁ
బెనఁగొన్న గాడ్పులఁ బెరయునెత్తావి । ననయంబుఁ జొక్కుచు నట పోయి పోయి
సురదుందుభులమ్రోఁత శ్రుతులలోఁ దూఱ । హరహరా యనుచు రమ్యప్రదేశమునఁ
బద్మాసనంబునఁ బదిలుఁడై హృదయ । పద్మంబులో నీశుఁ బశుపతి నునిచి
కదలక [6]ఊహాపుగతిఁ జక్క [7]నిలిచి । మదికి నానంద తన్మయత నిచ్చుచును,
ఒగి నొక్కనెల త్రిరాత్రోపవాసములఁ । దగ రెండు నెలలంతఁ దద్ద్విగుణమున,
నోలి [8]మూణ్ణెలలు పక్షోపవాసముల, । నాలుగునెలలు మిన్నక వాయుభుక్తి
గడపి, వెండియు నిట్లుగాదని లేచి । వడి నూర్ధ్వ బాహుఁడై వసుధ వేల్మోపి
ఘోరపుఁ దపముఁ గైకొనిన, నచ్చోటి- । వారలు తపసు లీశ్వరుఁ గానఁబోయి
జయవెట్టి పలికిరి: "శర్వ, సర్వేశ, । దయసేయవే! క్రీడి తపమున్నవాఁడు;
తపమన్నఁ దపమె! యుద్ధతి భీమధూమ । కపట హాలాహలాక్రాంత విష్టపము.
ఇంతటఁ బ్రత్యక్షమీవుగాకున్న । జంతు సంతతిఁగాల్చు సత్య మత్తపము.
నిమిషమాత్రము వాఁడు నిలిపిన భక్తి । కమలసూతికిఁ బెద్దకాలంబు వట్టు.

---

1. మ్ములనగ్గు 2. చు. 2. కరుణించి 4. త్ర 5. కుద్దాలాది 6. యా. 7. నిలిపి.
8. మూఁడు నెలల. (పా.)

రవి రశ్మి సోఁకదు; రవమీఁదఁ పక్షి ; । పవనంబు పైరాదు; పాఱవు నదులు;
పొనర యోఁగ [1]నిరూఢి భూత భేతాళ । దనుజనిర్జరుల కాతనిఁ గానరాదు.
మక్కువ నాపార్థు మనసులోఁ గాక । యిక్కడ మఱియెంత యీశ! నీయునికి.
ఈవయ్యెడకువచ్చి యీవయ్యవరము । వేవేగ." యనిన నవ్వేలుపు నవ్వి

## శివుఁడు మాయాకిరాతుఁడై అర్జునొద్దకు వచ్చుట

పోయెదనని వారిఁ బొనఁగ వీడ్కొలిపి । పాయక యుమచూడఁ బ్రమథులు చూడ
జొత్తార్చు [2]కనులు జుంజుఱు వెండ్రుకలును, । హత్తి కాటుకకొండయన నొప్పు మేను,
జడిగొన్న పికిలిపుంజముల దండయును, । ముడిచిన జడసుళ్ళెమున నాకుపొరక,
చిఱికినమ్ములు విండ్లుఁ, జివురాకుచీర, । గవులు కంపునఁగెంపుఁ గదురుమీసములుఁ
గలిగిన [3]చెంచై యుగంబులనాఁటి । ఖల దైత్యమృగ వేఁటకారుండు నిలిచె (?)
శివుఁజూచి గౌరియుఁ జెంచెతరూప । మవిరళస్థితిఁ దాల్చి యతనిసేవించె.
తమతమ కాంతలుఁ దారు నాక్షణము । ప్రమథులు శబరులై బలసి రవ్విభుని.
గాటమై దివిజులోకసమునఁ జూడ । వేఁట నెపంబుగా [4]విభుఁడట్లు గదలి
యరుదెంచి యింద్ర కీలాచలంబెక్కి । హరిసూను పౌరుషంబరయు వేడుకను
సూకరాకృతి నింద్రసుతుఁ [5]దాఁకుమనుచు । మూకాసురునిఁ బంప మోదించియతఁడు
తొంటివరాహంబు త్రోడరెనోయనఁగ । గెంటక ధరకుడిగ్గిన మేఘమనఁగ
నడతెంచు నంజనగ శృంగమనఁగఁ । గెడయ నీశ్వరుఁడు గ్రక్కిన విషమనఁగఁ
జూచిన దిశలెల్లఁ జుఱచుఱమండఁ । జాఁచినమూతి నక్షత్రముల్ దొరుఁగ
నడుగువెట్టినచోట ననలంబు మొలవ । నొడిసి రొప్పిన మ్రోఁతలురుములై తోఁప
గొఱిజతాఁకున మహాకుధరంబులగల । బిఱుసైన నడపునఁ బృథివి గంపింపఁ,
జాలరోమములఁ బర్వతవృక్షసమితి । కోలాహలంబుగా, ఘుర్ఘురాభీల
రవములు లోకభైరవములై చెలఁగ । భువనభాండము మ్రింగఁబోవు చందమునఁ
గొమ్ములు దివికోట కొమ్ములు దాఁకి । డమ్ములు చెడి కొత్తడమ్ములు గూల,
నద్రిభేదికుమారు నణఁపంగ వలసి । యద్రులెల్లను [6]బోత్రియై వచ్చెననఁగ,

---

1. విభూతి 2. కన్నులు జుంజుఱువెండ్రుకలు. 3. చెంచయ్యె 4, విశ్వేశుఁ డపుడు.
5. దాఁకనపుడు (సా). 6. బోద్ది. (మూ)

నేసిన శరలీల నేతేరఁ జూచి । యాసవ్యసాచి సాయకము సంధించి
వలదని మునులెల్ల [1]వారించుజడికి । నిలుపక క్రోడంబు నెఱినాట నేయ
హరుఁడు మున్నేసిన యలుగుతో మృగము । తరుశైవ గిరివోలె ధారుణిఁ ద్రెళ్ళి
యామేను చాలించి యసురమై తోఁచి । భూమి నదృశ్యమైపోయెఁ; బోయినను

## వరాహమునకై పరమేశ్వరార్జునులు కలహించుట

'నాశరంబునఁ జచ్చె నాపంది' యనుచు । నీశానుఁ డచ్చోట నింతులుఁ దాను
గైకొని నిలిచిన, గాండీవిచూచి । 'నీకు నెక్కడిపంది? నీశరమేది?
యేఁ బందినేసితి నిదినాశరంబు; । పైఁబడఁ బనిలేదు పాయుము శబర!
ఎదఁటు గూడి నా రిలయీనినట్లు! । సందడిగానేల [2] సతులు నిచ్చోట!
[3]చూరానఁ దోలఁగుము తోలఁగక యున్న । ఘోరాస్త్రముల [4]నిన్నుఁ గూలుతు' ననిన
నగుచు నర్జునుఁజూచి నందివాహనుఁడు । "తగు నీకు [5] వింత ప్రతాప మెట్లైన;
నీవొకవిలుకాఁడ [6] వీవిశ్వమునకు! । నీవలివా రంతయెఱుఁగని [7] వారు.
ఏసెదనంటి నన్నేయు [8] మాచూత; । మీ [9] సటలును నేర్పు లేమిఁక లేవొ!
కోలాధిపతికినై కోలకై మనకు । నాలంబు గలిగిన నదియు నుత్తమము."
అని శైలకార్ముకుఁ డమ్ముసంధించి । మనుజేంద్ర సుతునేయ, మది లెక్కగొనక
యభవుని బాణధారాభిషేకమునఁ । ద్రిభువన [10]ంబులు మెచ్చ దేవేంద్రసుతుఁడు
ముంచిన, నదులు సముద్రంబు చొచ్చు । చంచున నదివోయి శంభునందణఁగె.
హరుని తూపులువచ్చి యైదుమనాఱు । నరి నింద్రసుతుని వక్షము నుచ్చిపోవు.
అంతనర్జునుఁ డాత్మ నచ్చెరువంది । "యింత [11] వాఁ డెవ్వాఁడో యితరుఁడు గాఁడు!
శబర [12]వేషంబునఁ జరియింపుచున్న । విబుధ విశేషంబు వేయు [13]ను నేల
ఎడపక వృష్టిగ్రహించు పర్వతము । వడువున మచ్ఛరావలి వీఁచు గొనియె.
నేనైన నొచ్చితి నితనిబాణముల । మానరాదు [14] రణంబు మాటాడి." యనుచు

---

1. వడికాపుమనఁగ 2. శబరులి. 3. దూరించి 4. మిస్ము 5. సింతప్రతాప మెక్కడిది. 6. వే. 7. వారి. 8. ము 9. సటుపులు. 10. వంద్యుని. 11. వాఁడూఱక 12. రూపంబున. 13. వేమిటికి. 14. శరంబు మాటుకు (పా)

దిశల రోఁచులువర్వ దివ్యబాణములు । శశధరుపై లక్షసంఖ్య లనేసి,
కాలశోషిత వార్ధిగతిఁ గవదోనలు । చాల శూన్యములైన, శంకించి మఱియుఁ
"దొల్లి నాకక్షయ తూణీరయుగము । కల్లగా దనలుఁడు కరుణించినాఁడు.
అవియు శూన్యములయ్యె నకట యీమెఱుఁగు । తపులఁడు నాకు వృథాయుద్ధ [1] మయ్యె
దివ్యబాణములెల్లఁ దెరువులు దప్పె; । దివ్యచేష్టితమిది తెలియుచుండుదము."
అని తరులును గిరు లటునిటుఁ జెదర । ధనువు ద్రిప్పుచుఁ బాండుతనయుండు గదిసి
హరుని వ్రేసిన, మేఘమరనెల మ్రింగు । కరణి విల్లుగ్రహించి కాలకంధరుఁడు
నరుని చెయ్యొడిసిన, నరుఁడంతఁ బోక । కరవాలమున శూలిఁగదిసి మైవ్రేసె.
అదియు సుభాషితం బవివేకియెదుటఁ । జదివినయట్లైనఁ, జలనంబులేక
శిలలు వ్రాఁకులు రువ్వి శివునేవిధమున । నిలువరింపఁగ లేక నిజశక్తిఁజొచ్చి
మునులకుఁ బట్టని ముక్కంటిఁబట్టి । పెనఁగియుఁ ఒడఁద్రోయ బీరంబు [3] లేక
తలపడి ముష్టియుద్ధమున వక్షంబు । తల మోము బరులోలిఁ దాటించి యార్వ
నిలనింత చల [4] మరి నేఁగాననుచుఁ । దలదన్ని [5] శంభుఁ డాతని మూర్ఛవుచ్చి,

## పాశుపత ప్రదానము

తెలియుచో ముక్కన్నుఁ దెగగల జడలుఁ । బులితోలు రాకాసి బొమ్మ పెండెమ్ము
ముడికినందని నెలముడి పాఁపతొడవు । బుడిబుడిమను ఢక్క పునుకజన్నిదము
ముమ్మొనకైదువు ముదితసామేను । నెమ్మొల పేరులు నెకిరింతయొద్దు
నట తోలుపచ్చడం బౌఁదలయేఱు । పుటపుట నగుజింక బూడిద పూఁత
చెలువార సన్నిధిసేసి యీశ్వరుఁడు । పలికెఁ గృపా [6] దృష్టిఁ బాండు నందనుని
"నీ తపోనిష్ఠకు నీక్షాత్రమునకుఁ । బ్రీతచిత్తుఁడ నైతిఁ బృథివీశతనయ !
అడుగుము నీకిష్టమైనవరంబు । తడయకయిచ్చెదఁ ద్రైలోక్యమైన.
అరసిచూచితిఁగాని యన్యంబుగాదు । శరపాత కరపాత సంకటంబోర్వ.
వగవకు వింటికి వాఁడి తూపులకు; । మగుడింతు నాయందు మగ్నంబులయ్యె.
మొదల నరుండను మునివి నీచేత । వదలక యీగాండీవము నాఁడుఁగలదు.

---

1. మేల 2. నరుచుఁ జెయ్యొడ్డిన 3. చెడక. 4. పాది. 5. శబరుఁ డాతని, 6. బుద్ధి. (పా)

సురకార్యపరుఁడవై క్షోణిపై నిపుడు । సురల కార్యము దీర్పఁ జూచెదు తెలియు."
అనుచు నమ్ములు విల్లునతనికి నీఁదు । ఘనభక్తిఁ బరవశగతి నర్జునుండు
చక్కఁ జాఁగిలి మ్రొక్కి సంప్రీతి వెలయ । నక్కాలకంఠు నిట్లని సన్నుతించె
"శర్వ, సర్వేశ్వర, శాంకరీరమణ, । గీర్వాణసేవిత, గిరిరాజచాప,
కైలాస నిజవాస, కరిచర్మవాస, । ఫాలలోచన, పశుపతి, శూలపాణి,
సామగానామోద, సహజప్రసాద, । కామసంహార, చంద్రఖండావతంస,
పంచాక్షరీప్రాణ, పరమకల్యాణ, । పంచవక్త్రవిలాస, పటుజయోల్లాస,
భక్తపరాధీన, భక్తనిధాన, । భక్తిసాధ్య, సమస్తపావనచరిత,
ఆనందరూప, బాహాబలాటోప, । నానాశ్రుతిస్మృతి న్యస్తార్థదీప!
కాలకంధర, కృపాకర, కృత్తివాస, । నీలలోహిత, భవానీ ప్రాణనాథ,
శరణంబు రక్షించు శరణంబు నీకుఁ । బరిచారకుఁడ భక్తిపసలేనివాఁడ.
మునిప్రియ, హంకారమున నీకుఁ బూజ । లొనరింప నేరక యురుతరపంచ
గుణములఁ దగిలి నిర్గుణరూప, నిన్ను । గణుతింపనేరక భావింపలేక
తెలిపిన నెఱుఁగక తెలిసినవారి । వలనైన నెఱుఁగక వాగ్వాదమునకుఁ
జొచ్చుట యొండె నీచులబుద్ధిలోన । వచ్చుట యొండె [1]నావహులెల్ల నిట్లు
కమలసంభవుఁడైనఁ గానంగలేని । విమలాత్మ, నినుగంటి విఖ్యాతిగంటి.
ఇంతకంటెను వరంబెయ్యది నాకు! । కంతుసంహార, యేనకా పుణ్యనిధిని.
ఏసితి వ్రేసితి హితదివ్యతనువు । గాసిగా వ్రచ్చితిఁ గడఁగి నొక్కితిని;
అపరాధ మోర్వు మే నజ్ఞాని నధిక । చపలుండ నిజభక్తి చాలనివాఁడ.
రక్షింపు ఘన లోకరక్షా విహార! । రక్షింపు రాక్షసరాజ సంహార!
అభవ, 'నమస్తే వివేక ప్రసంగ !' ... ... ... ... ... ...
గిరిశ, 'నమస్తే వికీర్ణభస్మాంగ' । పరమ, 'నమస్తే జపక్రియాసంగ !'
కౌరవు లదయులై కౌంతేయముఖ్యు । ఘోరాటవులఁ ద్రోచి కుతల మేలుచును
న్నారు; వారితో యుద్ధంబు గలుగ । నున్నదిమాకు మహోగ్రమై యింక.
అరుదైన పాశుపతాస్త్రంబు నాకు । వరముగా నీవె యీశ్వర, మెచ్చి తేని.
అందు ననేక సహస్ర శూలములుఁ । గ్రందైనగదలు సర్పములు బాణములు
శర [2]ధాదు లుగ్రపిశాచ [3]భూతములు । సరిఁ బుట్టునని వింటి సంధానవేళ.

1. నావహాళ్లు. 2. ధులును. 3. బాణములు. (పా)

దీనిచే [1] దనుజదైతేయ యక్షాది । సేనలు గెలుతు నిర్జింతుఁ గౌరవుల."
అని యడిగిన రుద్రుఁ డట్లకాకనుచుఁ । దనతూపు హోమమంత్రములతో నిచ్చి
"నీకెదురింక లేదు నీచులమీఁదఁ । దూఁకొని యీయమ్ము తొడుగకు" మనుచు
నానతియిచ్చి గణాలితో శూలి । కానరా కరిగెను గడుచోద్యమగుచు.
ఇంద్రజుచే శూలియిచ్చిన శరము । సాంద్రదీధితి నొప్పఁ జలియించె వసుధ;
లవణాబ్ధికలఁగె; శైలంబు లూటాడెఁ; । దివిజ [2] బ్రహ్మాండంబు దిర్దిరఁదిరిగె.
హరుమేను సోఁకిన యాప్రభావమున । నరుమేను దివ్యగంధముఁ బవిత్రంబు
శుభకాంతియుతమునై సురకళగలిగి । త్రిభువన దీప్తమై దృష్టింపఁ గలిగె.

## దివ్యాస్త్రలాభము

అప్పుడింద్రుఁడు వహ్నియముఁడు దైత్యేంద్రుఁ । డప్పతి పవనుండు యక్షవల్లభుఁడు
గొలఁది ముప్పదిమూఁడు కోటుల సురలు । కలిత విమానాగ్రగతి నేఁగుదెంచి
"తమకార్యమగు వసుధాభారహరణ । మమరేంద్రసుతుఁడు సేయఁగఁ బూనె" ననుచుఁ
జెలఁగుచు నతనిఁ గాంచిన, వాక్యపుష్ప । ఫలజలముల వారిఁ బార్థుఁడర్చించి
మ్రొక్కి ఫాలమునందు మోడ్పుఁ గేలమర । "నక్కజ మేను జేయఁగఁ గన్నతపము!
మృడునిఁ జూడఁగఁగంటి మిముఁజూడఁగంటిఁ; । గడఁగి పాశుపతాశుగము దాల్పఁగంటిఁ;
బనివడ ధర్మజుపగ దీర్పఁగంటి; । ననిమిషాధిపులార! యదియు మీకరుణ.
ఎలమి నానతి యీరె యేమిసేయంగ । వలయుఁ గార్యము." లన్నవారు మోదించి
"యలయక తప మనేకాయుతవర్ష । ములు తొల్లి చేసిన మునివి నీవనఘ!
ఇది నేటి తపముగా దీతపంబునకుఁ । గదియునే నిను నంబికాప్రాణవిభుఁడు!
అతనితోఁ బెనఁగి దివ్యాంగుండవైతి । సుతుఁడ, నీవిభవంబు చూడనక్కజము.
అవనీ మహాభారహరణంబు నిన్నుఁ । దవిలెఁ గాదనరాదు దైవకార్యంబు.
మాకు నశేషసామర్థ్యంబులైన । భీకరాస్త్రము లిచ్చు ప్రేమ వచ్చితిమి.
కొనుమవియును నీకు ఘోరాహవమునఁ । బొనరిన యొక్కొక్క పోరామిఁ దీర్చు."
నని యందు యముఁ డిచ్చె నతులమార్తాండ । ఘనకాంతి మండలాఖండదండంబు;
నరుల సహస్రసంఖ్యలఁ గట్టివైవ । దొరకు పాశములిచ్చెఁ దోయధిరాజు;
ఆయత దైత్యమాయలనెల్ల గ్రమింగ । నేయు కౌబేరాస్త్రమిచ్చె నర్థపుఁడు;

1. నమర ... గంధర్వ. 2. చుక్కలుడుల్లె దిక్కులు. (పా)

## అమరావతీ గమనము

అంతశ్శాత్రవకోటి నడఁప వీఁడోపుఁ । జింతింప వలదని జిష్ణుఁ డుప్పొంగి
తాను వజ్రంబిచ్చు తలఁపునఁ బొందు । సూనుని సంప్రీతిఁజూచి మైనిమిరి,
"భూవర, యింకనాపురి కేఁగుదెంచి । యీవు నాయస్త్రంబులిచ్చినఁ గొంచు
నందు మీతల్లి జయంతునిఁజూచి । యిందువచ్చెదుగాక యే నంత ననుప;
మాతలిఁ బుత్తెంతు మణిరథంబిచ్చి । ప్రీతినెల్లిటి." కన్న బీభత్సుఁడుబ్బి
కాయంబుతోడ స్వర్గముఁ జూడఁగలుగు । సాయకంబులు నంద సమకూరునాకు
వచ్చెదనని మ్రొక్క వానిదీవించి । వచ్చినసురలతో వాసవుఁ డరిగె.
త్రిదశేంద్రు సారథి తెచ్చుతేరునకు । నెదురు చూచుచునుండె నిటఁగిరీటియును.
మందరాద్రికి నంత మఱునాఁడురథము । కందర నిబిడాంధకారంబు వాయ
మాతలి గొనితెచ్చి మనుజేంద్రుఁబలికె । "ఏతెంతుగాక దేవేంద్రజ! దివికి.
యుగసహస్రము తపమున్న వారలకుఁ । దగ నశ్వమేధ శతంబువారలకుఁ
గలుగనిరథ మెక్కఁగంటివి; వేల్పు । వెలఁదులు నినుజూచువేడ్క నున్నారు."
అనిన గంగాస్నాన మతఁడాచరించి । [1]యెనసిన వేడ్కతో నింద్రుతేరెక్కి
యరుదేర, నరుదుగా నప్సరస్స్త్రీల । సురకుమారుల నన్పి సురచక్రవర్తి
తనమంత్రి [2]తోడ బృందారకుల్ గొలువ । [3]ఘన పుణ్యులగు యాగకర్తలు గొలువఁ,
బెద్దగద్దియమీఁదఁ బేరోలగమునఁ । దద్దయువేడ్క నందను రాకగోరి
యున్నచో, నంత గృహోపాంతసీమ । నన్నృపాలక పుత్త్రుఁ డరదంబుడిగ్గి
సురలు నెవ్వరు నింత చూపట్టరనుచుఁ । బురకాంతలోలి గుంపులు గట్టిచూడ,
హరునిగెల్చితినని యమరేంద్రుఁ గాన । నరుదెంచు మకరాంకుఁడన నేఁగుదెంచి
యయ్యకు వేల్పుల కంతఁ బొందునకు । నయ్యెడ మునులకు నందంద మ్రొక్కి
యమరాధిపతి చూప నర్ధపీఠమున । సమసీమ మేనులు సరిరాయనుండె.
అప్పుడు గదిసి విద్యాధరస్త్రీలు । తప్పక చామరద్వయమున వీవఁ
గంకణ ఝణఝణ త్కారముల్ వినుచు । నంకురితానందుఁడై యున్నసుతుని
వీక్షించి యావజ్రి వేయి కన్నులకు । నక్షీణ సుఖసిద్ధి యయ్యె నా కనుచు
నతనికిఁ దన పత్నియగు శచీదేవిఁ । జతురతఁ జూపి యాసతికి మ్రొక్కింపఁ

1. దినకర నిభమైన తేరెక్కి వేడ్క 2. గొలువ. 3. ననిమిషనాథుఁడు నాస్థానసీమ. (పా)

దిలకితమతిఁ జెక్కు దీవెనలిచ్చి । నలినాక్షి నీరాజనంబు లిప్పించి
తొలఁగక యలజయంతుని కంటెఁ జూడఁ । గల పుత్త్రకుని బెద్దగా గారవించె.
అంతఁ గొండొక కాల మమరేంద్రు పురిని । సంతోషముననుండి జనకునిచేత
నరుఁడు దివ్యాస్త్ర సంధానప్రకార, । మరయఁ బ్రయోగ[1] సంహారమార్గములు,
నస్త్రమంత్ర జప క్రియాప్రకారములు, । నస్త్రాధిదేవ పూజాకర్షణములు
నాదిగా నెఱుఁగుచు నప్సరసాంగ । నా దివ్యగాన మానంబులు వినుచుఁ(?)
దుంబురునింటఁ బ్రస్తుత నాట్యవిద్య । సంబరంబునఁ జూచు సమయంబునందు

## ఊర్వశీ మోహము

నొక్కనాఁడూర్వశి యుడురాజవదన । చక్కనిలావణ్యసౌభాగ్యజలధి
మునుపు నారాయణముని యూరుకాండ । మునజనించిన ముఖ్యమోహనగాత్రి
నల నలకూబర నవజయంతాది । తిలకితాకారుల దృష్టిఁగైకొనని
శృంగారవతి యూర్వశీకాంత.యచట । నంగజనిభమూర్తి నర్జునుఁజూచి
మనసులోఁబొడము మన్మథవికారమునఁ । గనువాల్చి పులకలంగమునఁ బెంపొలయ
నికటమనోరథంబిచ్చెఁ జూపులకు । సుకుమారుఁ డేరాజసుతుఁడొకో వీఁడు!
ఏపుణ్యవతియొకో యితని కౌఁగిటను । దీపించి సుఖవార్థిఁ దేలుచుండెడిది!
పౌరిని నీతని ముఖంబునఁ గలకళల । నెరవుదీసుక చంద్రుఁడిచ్చెఁగాఁబోలు!
మరుఁడు మరుండనుమాటయేగాని । పరికింపనితఁడెపో భావజన్ముండు;
సురలోకసతులకుఁ జూపులవిందు । మరగించు మన్మథమాయయోగాక;
సకల లావణ్యపుంజముఁగూర్చి బ్రహ్మ । యకలంకు వీనిఁ జేయఁగఁబోలుఁ గాక;
ఇంతచక్కనిరూప మే నెందుఁగానఁ; । గాంతిఁ బురూరవుకంటెఁ జెల్వొండు.
మగవారలకునైన మరులు పుట్టింపఁ । దగుమూర్తి యితనికిఁ దగుల రే సతులు!
ఇంద్రపట్టమునకు నితఁడైనసురల । సాంద్రసౌభాగ్య మెంచఁగ నెట్లువచ్చు!
సొగకన్నులతీరు శోభిల్లునురము । బాగైన యాజానుబాహునిర్ణయము
వాలికమెఱుఁగుల వజ్రదేహంబుఁ । జాలిన మందహాసముతోడి ముఖము
వెలువైన వినయంబు విక్రమకళయుఁ । బరఁగిన నవ సార్వభౌమ లక్షణుఁడు.
కలదొకో యీతనిఁ గలిసిసౌభాగ్య । కళలఁ బెంపొంది [2]సౌఖ్యమునొందనాకు.”

1. తత్క్రమణ. 2. సౌఖ్యతనుండ. (పా)

అని వితర్కింపుచు నల్లనగదిసి । వనిత యర్జునుఁ జూచి వలనొప్పఁబలికె
"ఎప్పుడు నృపచంద్ర, యేయూరుమీకు? । నిప్పుడిచ్చటఁ గార్యమేమిగల్గినది?
ఏరాజతనయుఁడ? వెపుడువచ్చితివి? । ఈరాజధానిలో నెచటనీయునికి ?
అంగజాకార, నీయభిధానమేమి? । యాంగికమునఁబల్కు." మనిన గాండీవి
"ముదిత, భారతవంశమునఁ బాండునృపతి । కుదయించినాఁడ; న న్నుర్వివారెల్ల
నర్జుననామధేయంబునఁ బిల్తు; । రూర్జితకరిపురి యునికిమాకెపుడు;
మాకుదాయాదులు మఱిధార్తరాష్ట్రు; । లాకౌరవులతోడ నాజి యానసుచుఁ
బాశుపతంబు తపంబాచరించి । యీశానుచేఁ గాంచి యేఁ బోవుచుండ
మాతలిరథమిచ్చి మఘవుఁడు దమ్ముఁ । జూతువురమ్మనన్ఁ జూడవచ్చితిని.
నాతి, తుంబురునిచే నాట్యశాస్త్రంబు । నేతునో యనుబుద్ధి నెఱినొక్కపూఁట
వత్తునిచ్చటికి నూర్వశిగఁ దా నిన్నుఁ । గ్రొత్తగా వినియుందుఁ గుంభినిఁజెప్ప.
నారాయణోరుసంభవ, నీదుగుణము । లారయ నధికంబు లందురందఱును."
అనిన నూర్వశిపల్కు "నర్జున, నిన్ను । సునిశిత శౌర్యుఁగా సురలుచెప్పుదురు;
చూడఁగంటిమి నేఁడు సుదినంబు మాకు; । పీడుపట్టున కీవు విచ్చేయవలయు.
ఇంద్రసూనుఁడవఁట యిటనిన్నుఁగొలుచు । టింద్రుఁగొల్చినకంటె నెక్కుడుగాదె!
వాలాయమింటికి వచ్చిపోవలయుఁ । బాలించి." యనుటయుఁ బాండునందనుఁడు
వారిజాననఁ బల్కు: "వచ్చుటయొకటి । యే రానిదొకటినా! యిది వచ్చినట్లు
తలపోయు; మామీది తాత్పర్యమునకుఁ । బిలిచెదింతియగదా ప్రియగృహంబునకు;
నట్టిప్రియంబు మాకప్పుడేవచ్చెఁ; । గట్టడ నిపుడింద్రుకడకుఁ బోవలయు."
అనిలేచి నిస్పృహుఁడై యర్జునుండు । చనియె నింద్రుని నిజాస్థానంబునకును.
ఆనమాటాడక హరిసూనుఁడిట్లు । వాసితోఁజనుట కూర్వశి వెచ్చనూర్చి
తనయింటికేఁగి కందర్పబాణాగ్నిఁ । గనలుచుఁ జిత్రలేఖానామఁజూచి
దానితో ధవళాక్షిఁ దాఁజూచి విరహ । మూనుటయును నతం డుసిగిపోవుటయుఁ
జెప్పి యిట్లను "నేమిసేయుదుఁ జెలియ! । తప్పనిచ్చట నేలతగిలె నామనసు !
వాఁడైనఁ దపసిభావమునఁ గొంతాస । యీఁడు; నాకెబ్భంగి హృదయంబు నిలుచు ?
నాకు నేనేపోయి నామేలుచెప్పి । వేకూడుమన్న నవ్వెదువారు నగరె!
కలనైననాతనిఁ గలసెదనన్న । లలితాంగి, యనిమిషులకు నిద్రరాదు.
ఏమార్గముననైన నింద్రజుఁగూర్చి । నామేనిలోనఁ బ్రాణమునిల్పు." మనిన

నాలేమఁజూచి యిట్లనుఁ జిత్రలేఖ । "ఏలమ్మ నీకింత హృదయంబుజాలి !
నలకూబరునికంటె ననవిల్తుకంటె । నలజయంతునికంటె నతనిచెల్వెంత!
భామిని, నినుఁజూచి పాషాణమైన । [1] నేమియుఁ గరఁగదే యెఱుఁగవుభామ!
నిమిషమాత్రంబున నృపసూనుఁదెచ్చి । కమలాక్షి, నినుగూర్తుఁగళవళింపకుము.
చిత్ర మవ్విభు నిన్నుఁ జేర్పలేకున్నఁ । జిత్రలేఖాఖ్యాతి చెల్లునె నాకు!
అలయక యొకయుపాయమున నిచ్చటికిఁ । బిలిచి తెచ్చెదఁగాని ప్రియము రెట్టింప.
ఒడఁబడఁజేసి నీవొకరీతిఁ గదిసి । తొడిఁబడ నతనిఁ గంతుని కప్పగింపు.
అంత నీచెప్పినయట్లెల్లఁజేయుఁ । జింతింపవల"దని చెప్పి యాక్షణమ
యువతి యర్జునిఁజేరి యొప్పనిట్లనియె । "ధవళాశ్వ, నావెంటఁ దడయకే తెమ్ము;
ఏకాంతగతినుండి యిపుడు తుంబురుఁడు । నీకు నాట్యరహస్య నీతినేర్పుటకుఁ
బిలిచి తెమ్మనియె; రాఁ బ్రియమైనరమ్ము । పలుకులే" లనుటయుఁ బాండునందనుఁడు
నలవోక దానిమాయాప్రబంధంబు । తెలియంగనేరక ధృతిదాని వెంట
వచ్చుచో, నటమున్న వరుసఁగైసేసి । యచ్చుగానూర్వశి హర్షంబుతోడఁ
బారిజాతాది పుష్పవ్రాతజాత । సౌరభాడంబర స్పర్ధాభివృద్ధ
కస్తూరికా గంధ కలితసద్గంధ । విస్తారితాశేష విమలాంగియగుచుఁ
దననాట్యశాలలోఁ దగుతోరణములు । గొనకొన్న మృదుల కుంకుమతల్పములును
దెరలు మేల్కట్టులు దివ్యగంధములు । సురభిమాల్యములుఁ గస్తురికలయంపి
కప్రపుముగ్గులుఁ గలుగుయత్నములు । క్షిప్రమె సేయించి శృంగార మొదవ
నింద్రనందనునకు నెదురులుచూడ, । సాంద్రవేగమున వాసవిఁ జిత్రలేఖ
వరుసఁదోడ్తెచ్చి యూర్వశిమందిరంబు । గరిమఁబ్రవేశింపఁగా నియమించి
" యిచ్చోటనేయుండు మిటకుఁ దుంబురుఁడు । వచ్చు నేఁ దోడ్కొని వచ్చెదఁగాని;
ఈవువచ్చుటవిన్న నిపుడు రాఁగలఁడు । వేవేగ." నని యిల్లువెడలునాలోన
నతులితమైన యొయ్యారఁబుదొలఁక । రతియునుబోలె నూర్వశి విలాసమున
మురువైన [2] మొగ, మట్టిమొగములో సిగ్గు, । దరిగొన్నసిగ్గులోఁ దలచూపుమమత,
మమతడగ్గఱ నీని మానంబు, దానిఁ । దమిఁగూర్చుభయ, మందుఁ దగులనితాల్మి,
తాలిమినణఁచు త త్తరముఁ (ద త్తరముఁ) । దూలించుకంపంబు దొరయనే తెంచి

1. నీరికరంగదే 2. ముఖమంటి ముఖములో.

## ఊర్వశీ ప్రేమ తిరస్కారము

నరునకిట్లను "నర్జునా, నన్ను నేల । మరున కొప్పించెదు! మర్యాదె నీకు?
రావు చూడవు; నిల్వరావు ప్రాణములు । నీవింక నను గరుణించకుండినను.
గరిమ ననేక యాగంబులు చేసి । మఱి కదా నరులకు మముఁజూడఁగలుగు ;
అదియుఁ జూచుట గాని యనుభవభోగ । విదితసౌఖ్యములు గావింపనెక్కడిది?
ఆలాగుదాన నీయాలింగనంబు । లీలఁగాంక్షింపఁ బాలించఁగవలదె!
ఇచ్చ నెవ్వరులేని యేకాంత దిశకు । వచ్చియుఁ దమిలేనివాఁడవౌటెట్లు?
మాటకారివి చూచి మాటాడవేల! । ఆఁటది పైఁబడ్డ నగునట్లు కాక."
అనినఁ గవ్వడి పల్కు "నప్సరస్స్త్రీల । మనుజుఁ డపేక్షింప మహిఁ బాత్రుఁడగునె !
అచ్చర మాత్రమే యమరేంద్రముఖ్యు । లిచ్చ నీయవసరం బెఱుఁగుచుండుదురు;
వినకున్న వారమే వీక్షింపకున్న; । వనిత, మేమెంతటి వారము తలఁప !
వినుమెల్లరాజ్యంబు విమతులకిచ్చి । మునివృత్తి విపినభూములఁ జరింపుచును
ఈలాగు దశనుండి యింతులతోడి । లీలావిహారంబు లేకున్నఁగాదె!
వెలఁది, యీమాటకు వేళగా." దనినఁ । గలకంఠి మఱియు నాగాండీవిఁ బలికె
"ఎట్టిదుఃఖంబైన నింతులఁ గన్న । యట్టప్పుడే పాసి యానంద మొదవు.
తప్పించుకొని పోవు తలఁపులుగాక । యిప్పుడు మునివృత్తి కేమయ్య నీకు!
నాభాగ్యమున వచ్చినాఁడ విచ్చటికి । సౌభాగ్యనిధివి యేఁచక కౌఁగిలిమ్ము.
ఈకున్నఁ బ్రాణంబు లివె నీకునిత్తుఁ । జేకొమ్ము; కాదేని చేకొమ్ము రమ్ము."
అనుచుఁ బయ్యెద జాఱ నాదివ్యవార । వనిత యాతని కేలు వరుసఁ బట్టుటయు,
విడిపించుకొని క్రీడి వెలఁది కిట్లనియె । "విడు నీకునాకును వెస వావిగాదు ;
రాజ వంశ్యుఁడు పురూరవునకుఁ దొల్లి । నైజంపుఁ బత్నివై నడచితి వీవు.
ధవళాక్షి, నాకునాతఁడు వంశకర్త; । అవులె మాకున్నది యటువంటి వావి.
అదియునుఁగాక మీరమరవల్లభుని । సదనంపునాటకశాల కామినులు.
ఒరిమ పాటింప రీ రొక్కొకపనులఁ; । బురుహూతు నూడిగంబులవారు గారె!
తపసినై వనములోఁ దమ్ములుఁ దాను । రమణమై నున్న ధర్మజుఁ గన్నఁదాఁక(?)
సతులఁబొందొల్ల నేసౌఖ్యంబులొల్ల; । యతివేషులము మమ్ము నంటకతొలఁగు;
భోఁకొమద నిటకుఁదుంబురుఁడేలవచ్చు! । నీయత్నములుఁ మాయ లీఫచేసినవి.

కైలాటకత్తెలు కపటమహేంద్ర । జాలస్వరూప లాశ్చర్యపుంజములు
కుటిలచిత్తలు [1]హితగుణవిఘ్నకరలు । నటమటంబులప్రోవులన సతుల్ గారె!
ఇన్ని చెప్పఁగనేల యేఁగుమీ" వనుచు । నన్నరుఁ డరుగుచో నమరవధూటి
కామాగ్ని కోపాగ్నిఁ గడలుకొల్పంగ । నామహేంద్రకుమారు నదరంటఁజూచి

## ఊర్వశీ శాపము

"యోరి కింశుకరూప, యుపకారదూర, । నీరసాత్మక, నీకు నీతియెక్కడిది!
పరఁగ నేఁ బట్టినఁ బాషాణమైనఁ । గరఁగు నీవేసుమీ కఠిన చిత్తుఁడవు.
సతిపిల్వనంపుట చనదు చేపట్టి । గతిమాలిరమ్మంటగా దటులయ్యు
మనసీక తొలఁగితి; మగవాఁడ వైనఁ । జనుదువే! సతి [2]వైనఁ జనుదిట్లు తొలఁగి.
గరిమ నీవటుగానఁ గాంతయుఁగాని । పురుషుండుఁగాని నపుంసకవృత్తి
నైకొను మిదియాదిగా." నని పలుక । నాకథ దేవేంద్రుఁ డాత్మలో నెఱిఁగి
చనుదెంచి యూర్వశీ శాప [3]వాక్యములు । తనయుచే విని దానిఁ దప్పింపఁగోరి
"కామాంధురాలైన కాంతశాపంబు । నేమించి యర్జునునికి మోవఁదగునె!
అదియును వృథపోవ; దటుగాన నొక్క । విదిత నిర్ణయము గావించెద నేను.
వనములో ద్వాదశ వత్సరప్రాప్తి । పనిఁ బూని చరియించి పాండవులింక
నామీఁద నొక్కయేఁ డజ్ఞాత చర్య । భూమిపైఁ జరియింపఁ బోవుచున్నారు.
పోనఁగ నయ్యేడను నపుంసకవృత్తి । వెసఁ దాల్పఁగలవాఁడు వెలయ నీక్రీడి.
ఆయేఁడు గడచిన నట తొంటిమూర్తి । యాయతగతిఁ దాల్చు." నని నిర్ణయించి
యతఁడును దాను నిజాస్థాన సీమ । వితత సౌభాగ్యంబు వెలయఁ గూర్చుండి
యతిభక్తి నున్నచో నచటి కేతెంచె । యతిరాజు రోమశుఁడను పుణ్యమూర్తి.
వచ్చి యచ్చట నున్న వరమునీంద్రులను । బొచ్చెంబులేని కింపురుష గంధర్వ
గరుడ కిన్నర యక్ష ఘన సిద్ధసాధ్య । పరివేష్టితుండైన పర్జన్యుఁ గాంచి
యతఁడు సన్మానింప నర్హపీఠమునఁ । జతురతఁ గూర్చుండి సమచిత్తుఁడగుచు
నర్జునుఁ జూచియిట్లను "నెవ్వరితఁడు ? । పర్జన్య, నీకంటెఁ బ్రభగలవాఁ డ
మానుషమూర్తి సామాన్యుండుగాఁడు । వీనిచందము కొంత వివరింపు." మనినఁ
బలికె నింద్రుఁ "డితండు పాండునందనుఁడు; । నలువొందు నర్జున నామధేయమున.

---
1. ఖపో. 2. యైనఁ జనదిట్లు. 3. కార్యములు. (పా)

మొన్న నీతనితపంబున కాత్మమెచ్చి । యెన్నఁ బాశుపతాస్త్రమిచ్చె శంకరుఁడు.
మరలి పోవుచునుండి మముఁ జూచిపోవ । నరుదెంచినాఁడు సంయమిసార్వభౌమ!
కాలకేయనివాత కవచులతోడ । నాలంబు గలిగి యీయన నిల్పినాఁడ.
ఈతఁడు రాఁ డయ్యె నేమొకో యనుచు । నాతల నీక్రీడియన్న ధర్మజుఁడు
వనములో నేమని వగచు చున్నాఁడో! । అనఘ, నామాఱుగా నటపోయి నీవు
నితని నేమముఁ జెప్పి యేఁడాఱునెలలు । వ్రతచర్యఁ దీర్థయాత్రల వారిఁ ద్రిప్పి
గంధమాదనశైల కాననాంతముల । సంధిల్లనుండుఁ డచ్చటి కంతలోన
వచ్చునీపార్థుఁడు వారలఁజూడ; । నచ్చటకుఁ బ్రయాసమనక పోవలయు;
నిది దేవకార్య మీవిపు డోపననక । సదయాత్మ, పో." మ్మన్న సంయమీశ్వరుఁడు
నవుఁగాక యనిలేచి యమరేంద్రుఁ డనుప । దివినుండి భూతధాత్రికి డిగ్గివచ్చి *

## రోమశుఁ డర్జును కుశలవార్త ధర్మజాదుల కెఱిఁగించుట

ద్వైతవనంబులో ధర్మనందనునిఁ । బ్రీతిఁ దమ్ములుఁ దాను ధృతి నున్నవాని,
నేమొకో రాఁడాయె! నింద్రనందనుఁడు । తామసించె నటంచుఁ దలపోయువానిఁ,
దతిగొన్న యగ్నిహోత్రముల బ్రాహ్మణులు । వితతతేజులు పదివేవురు గొలువ
నాదంబు శిలలనైనను గరఁగించు । వేదఘోషంబులు వినుచున్నవాని,
భీముఁడు రణకళాభేద్యప్రతాప । ధాముఁడు తనుఁ గొల్వఁ దగనున్నవాని,
ధైర్యంబు తోడుగా దయయు సత్యంబు । శౌర్యంబుఁ దొడవుగా జానొప్పువానిఁ
బొడగాంచి యతనిచేఁ బూజితుండగుచుఁ । దడయ కాతని శాంతతకు మెచ్చుకొనుచు
నాసీనుఁడై పల్కె 'నసఘ, నేఁ దీర్థ । వాసి రోమశుఁడనువాఁడ నామమున.
డాకొన్న బ్రహ్మపట్టములోకనూఱు । వేకడచినఁగాని వినుము నామేన
నొకరోమ మూడిపో దొగి; నట్టికతన । సుకృతాత్మ, ననురోమశుండంద్రు బుధులు.
ఏను వచ్చినరాక యెఱిఁగింతు వినుము । భూనాథ, తగుపుణ్యపురుషుండ వీవు.
నిర్జరేశ్వరసూతి నీముద్దుతమ్ముఁ । డర్జును పరిణామ మరసి వచ్చితిని.
తపమున మెచ్చి ప్రత్యక్షమై శివుఁడు । కృపతోడ నాతని కిచ్చెను శరము.
కొలఁది ముప్పదిరెండుకోటుల సురలు । నిలనిచ్చి రతని కనేకబాణములు.
మాతలి రథమిచ్చి మఘవుఁడు దన్నుఁ । జూతువు రమ్మన్న సురలోకమునకుఁ

* ఈతరువాయి నలచరిత్రాద్యుపాఖ్యానములను అనుబంధములోఁ జూచునది.

జని యందు నింద్రుచే శస్త్రసంధాన । వినుతోపసంహార విధ మెఱుంగుచును
గుశలుఁడై యున్నాఁడు; కొలువులో నిన్న । విశదంబుగాఁ జూడ వేడుక యయ్యె.
నను బురందరుఁ డంపినాఁడు నీకడకు । జననాథ, యాకార్య సరణియు వినుము.
అర్జునుం డందు నైదాఱు మాసంబు । లూర్జితకార్యార్థ మొగి నుండవలసె.
అందాఁక మిముఁ దీర్థయాత్రలఁ ద్రిప్పి । మందగతిని గంధమాదనాద్రికిని
బోయి యుండినఁ జాలుఁ బురుహూతతనయుఁ । డా యెడకే తెంచు హరితన్నుఁ బనుప.
ఆకొండమీఁద విద్యాధరయక్ష । లోకంబులున్న వాలోకింపవచ్చు.
తీర్థంబు స్వార్థంబు ధృతినన్న మాట । సార్థంబుగాదె! భూవర, వచ్చితేని.
పయనంబు గందు ఝుంపానదీప్రాంత । భయదాటవుల మీఁద భద్ర వెట్టెదను.
కలవు తీర్థము లనేకములు మార్గమునఁ; । గలరందుఁ దగఁ బెద్దకాలంపుమునులు.
చూపెద రండన్న సుముఖులై పాండు । భూపాలతనయు లప్పుడు మౌనిఁజూచి:
"తాపసోత్తమ, మహాత్మకుఁ డింద్రునిన్నుఁ; । నీపరమాయువు నీకు నవ్యయము ;
యుగసహస్రములు నీకొక నిమిషములు । తగునట్టి పెద్దల దర్శింపఁ గలిగె;
వినఁ గల్గె మీవల్ల విజయుని మేలు; । ఘనతీర్థములు నింకఁ గానఁ బోయెదము;
వత్తుము మీ వెంట వనితయు మేము । క్రొత్తగా నివ్విప్రకుంజరయుతము."

## పాండవులు రోమశుని వెంటఁ దీర్థయాత్రలు పోవుట

అని రోమశుని వెంట నఖిలపాండవులు । వనితాసమేతులై వలనొప్పఁ గదలి
యచ్చటు గడచి కామ్యకవనచ్ఛాయఁ । జొచ్చి ఝుంపానదీ శుద్ధ తీర్థంబు
దరిసించి యవలిమతంగాద్రి గడచి । సురభితీర్థంబాడి సులభమార్గమున
శివుఁ డున్న కాదంబ సింధు తీర్థమున । సవిరళమతిఁ దీర్థమాడి యందఱును
నొయ్యన గంగతో నొరసి కాళింది । సయ్యాటలాడు విశ్రమభూమిప్రాంత
చ్యవన మహామునీశ్వరుఁ గాంచి యతఁడు । తవిలి కావించు సత్కారంబు గాంచి,
యతలి(?) హేమాద్రి డాయఁగఁ బోవ ధర్మ । సుతునితో నారోమశుండిట్లు పలికె:
"శమనజ, యిచ్చోట శంభుండు తొల్లి । యుమకునై కావించె నుగ్రతపంబు ;
అనఘాత్మ, శరవణంబను తీర్థమదియు । జనియించె మొదల నచ్చట షణ్ముఖుండు ;
భృగుశృంగమిది దేవ, పేర్మి శంకరుఁడు । భృగురామునకు నేర్పెఁ బ్రియధనుర్విద్య.

హేమకూటము చూడు మిదె ధర్మతనయ! । కామసంహరుఁడిందు గజదైత్యుఁ జంపె;
హరినాభికమలంబు నందు జన్మించి । పరమేష్ఠి యిచటఁ దపంబాచరించి
నిరుపమ బ్రహ్మాండ నిర్మాణమహిమ । హరిచేత వరముగా నడుగుకొన్నాఁడు;
ఈ హేమకూట మహీధరంబునకు । నూహించిచూడఁ బూర్వోత్తరచ్ఛాయ
నింద్రకీలము చూడు మిందువంశేంద్ర! । ఇంద్రసూనుఁడు తపంబిచ్చోటఁ జేసె;
హరుఁడు కిరాతుఁడై యలుగు నాదనుచు । దురము తా గాండీవితోఁ జేసెనిచట;
అచ్చోటఁ బాశుపతాస్త్ర మాతనికి । నిచ్చె; నప్పటిదీప్తి యిప్పుడుఁ బోదు.
మాతలి తెచ్చు నమ్మహనీయ రథము । కౌతుకంబున నెక్కి కవ్వడి దివికిఁ
జనియె; నాఁటి రథోగ్ర చక్ర నిర్భేద । ఘన చిహ్నలవె చూడు కాననయ్యెడిని.
కేదార శివుని వీక్షింపుఁ డిద్దితని । పాదారవిందంబు భవరోగహరము".
అని విశేషములైనయట్టి తీర్థములఁ । దనరిన పుణ్య కథా ప్రసంగములు
మునిచెప్ప వినుచు నిమ్ముల నగ్నిహోత్ర । ధనములతో మును ల్దాము నుబోయి
కనిరి కౌంతేయులు గంధమాదనము । ననిమిషాంగనల విహారసాధనము.
అక్కడఁ దపమున్నయతులనైష్ఠికము । దక్కించ వలసి విద్యాధరాంగనలు
పాడంగ నాలించి పడగలు విచ్చి । యాడెడు నహులచే నమరెడు దాని,
మాతులుంగ లవంగ మందార వకుళ । కేతకీ పున్నాగ కేసర నింబ
చందన మందారచంపక సరళ । కుంద హింతాల తక్కోల తమాల
సాల కుద్దాల రసాల బంధూక । బాల పాటల జంబు పనస జంబీర
కరవీర ఘనసార కదలికాశ్వత్థ । కురవక హరితాల కుముదికాశోక
వట బిల్వ రోచన వంజుల క్రముక । కుటజ దాడిమఫలీ కోవిదారాది
ఘనవృక్షములకెల్ల గనియైన దాని, । వినుత నభస్థలీ విస్మయరప్రకట
కరమగు శృంగాటకంబులదాని, । హరిణ మాతంగ సింహాశన గవయ
శరభ దంష్ట్రిక ఖడ్గ శార్దూల మహిష । రురు హరి గండభేరుండాదికములు
పటుతర పాషాణ పట్టముల్ ప్రాఁకఁ । బెటపెట ధ్వనిఁ బెచ్చుప్రేలెడుదాని,
నున్నతి సెలయేర్లనుండి మానీంద్రు । లెన్నిక నర్ఘ్యంబు లిచ్చి చల్లుచును
ఉదకంబు మిన్నేటికోదవి పైయేరు । గదలించు నాకులఁ గదలించు దాని,
సురవిమానంబులు చుట్టును దిరుగ । సురకామినుల మేని సురభిగంధముల

వాసితంబగు తరువ్రజముచే దిశలు । వాసించుదానిఁ బర్వత సార్వభౌముఁ
బొడగాంచి డగ్గఱఁ బోవుచుఁ గొంతి । కొడుకులఁ గలయఁ గన్గొని రోమశుండు :

## పాండవులు గంధమాదనమునకుఁ బోవుట

'కంటిరే! నృపులార, గంధమాదనము । మింటిమార్గము మోచి మెఱసె నున్నతిని.
అలకాపురంబు నీయద్రిపై నమర । నల కామసంహారుఁ డటకు నేతెంచు.
కైలాస మిమ్మీఁదఁగల దాఁటు వేల । మేలియోజనముల; మెలఁగరాదందు.
ఏనూఱుతీర్థంబు లియ్యద్రిమీఁద । జానొప్పఁజూపెదఁ జనుదెండు గూడి.
ఇంతుండి రథముల నే తేరరాదు । ..........................
ధరణీశులార, కొండఱ నిందునునిచి । యరుదెండు కొందఱ నటఁ దోడుకొనుచు.'
అనినఁ గణ్వాశ్రమోపాంతస్థలమున । ననికిగా రథములనునిచి భూవరులు
[1]తమవెంట నగ్నిహోత్రముల బ్రాహ్మణులు । గుమిగూడిరాఁగ నక్కొండకై నడచి
కొంతదూరము వోవ ఘోరమై యొక యు । గాంతవాయువుపోలె [2]ననహమై నివిడి
కొండరాలెల్ల నుగ్గులుగఁ ద్రోచుచును, । గుండుగూడుచు వృక్షకోటిరూపణఁగ,
లివలివచేసి ధూళీపటలంబు । భువనభాండం బెల్లఁ బుక్కిలింపంగఁ,
జెదరి యాభూధర శిఖరముల్ విఱిగి । ఛిద్రుపలై పడఁగ, గర్జితమేఘమగుచు
నెడరి రువ్వునవీచె నెదురైన గాలి. । వడగండ్లు పిడుగులవహాణిఁ దాఁకఁగను
ధర రెండుగడియ లుత్పాతవర్షంబుఁ । గురిసినఁ జీకాకుగొని చాలఁదడిసి
శికవలు భూదేవసంఘము నొక్కవంక, । యువతి [4]నెచ్చెలులు ధౌమ్యుఁడు నొక్కవంక,
ధరణీశుఁడగ్నిహోత్రము లొక్కవంక । [5]సరవి భీముండు కృష్ణయు నొక్కవంక
రోమశుఁడొకవంక రూపేది చెదరి । ప్రేమనొక్కొకరిని బిల్చుకొనుచును
ప్రాఁకుల మఱుఁగున మఱిగుహోవలులఁ । గైకొని యట్టి సంకటమోర్చి నిలిచి
వెనుక నిందఱుఁగూడి వెచ్చనూర్చుచును । వనవాస భరమెల్ల వడి నాఁడె తోఁచె
నెన్నఁడు నిట్టిపాటెఱుఁగ మటంచు । నెన్న, బ్రాహ్మణులతో నిట్లను నృపుడు:
"అమరేంద్రసుతుఁ గాంతుమనియెడు కాంక్షఁ । దెమల కేమటుపోయి తిరిగివచ్చెదము."
అందాఁకఁ [6]ద్రోవల నలయక మీర । లిందునిల్వఁగరాదె హితపుణ్యులార !

---

1. తన. 2. సహానమై. 3. గమల. 4. నచ్చెలులు. 5. నోరిమె. 6. ధావతి (మూ)

తలపోయ నగ్నిహోత్రములకు మీకు । మెలఁగుట సామాన్యమే శైలగుహల!”
అనుచు వారలనిల్పి యతివనెచ్చెలుల । మునిసింహుఁడైన ధౌమ్యుని నందునిలిపి
ద్రౌపదియును దాముఁ దపసి రోమశుఁడు । చూపిన తెరువున సొరిదిమైనడచి
చనిచని యతిఘోర శైలసానువుల । కనయంబు నెక్కుచో, నందుఁ బాంచాలి
నడవనోపక పాదనఖములవెంట । వెడలు రక్తములచే వెడవెడనగుచుఁ
గజభార జఘనచక్ర నితంబభార । కుచభార సంగతిఁ గోమలి యలసి
కఠినంపుఱానేలఁ గాల్మోపనోడి । కఠినాత్ముఁడగు బ్రహ్మఁ గనలి దూఱుచును
వడదాఁకి యెండచే వాడుకందోయి । బడలి సోలుచు దప్పిఁ బరవశయగుచు
నెలుఁగెత్తి యిట్లను: ‘నేల పోయెదరు! । నిలువరక్కట! కూడి నేర్తునే నడవ!
అంతంత నిలుచుచు నరుగుట గాక । యెంతదూరంబైన నెట్లు పోయెడిది!
పగిలెనఖంబులు పాషాణ ఘాతి; । నొగిలెఁ బాదంబులు; నో రెండఁదొడఁగె;
నలసితి; నేఁజెల్ల; నాఁటది యనరు; । తెలియరేమబ్బె నీ తీర్థయాత్రలను!
ఱానేల నిబ్భంగి రానేల మనకు! । నేనైన నడవలే [1] నీరాగుఁడనిన,
నిలిచి శ్రమ్మఱివచ్చి నిట్టూర్పుపుచ్చి । బలవంతుఁడగు భీముఁబలికె ధర్మజుఁడు:
“ద్రౌపది రాలేదు దవ్వుగా నేఁడు । వేపోవవలె శైలవిపినంబు గడచి.
గాండీవి నిచ్చోటఁ గనుఁగొంద మనుచు । నొండేల తాపసి యొకయాసవెట్టె;
భానుఁడు నపరాబ్ధిఁ బడమటఁ జేరె; । నేనును నొచ్చితి నీఁక డాఁచనేల.
యూఱటయొదవ నీవొక కొంతదూర । మీ రాజబింబాస్య నెబ్భంగినైన
మోచి తెమ్మిది నిన్ను మోచినకార్య । మేచిన నీసత్త్వ మే నెఱింగినద”.
అనిన: “నేనలసితి నందఱికంటె । మనుజేశ, సామాన్యమా నేఁటినడక
చనవలె మూఁడు యోజనములిమ్మీఁద । మునిమాటలకు వచ్చి మోసపోయితిమి.
అలహిడింబానూను నాత్మలో మీరు । తలఁపుఁ డీక్షణమ యాతఁడు వచ్చునిటకు.
ధారుణీనాథ, యందఱ మోచి తెచ్చు । భూరి విక్రముఁ దలంపుము ఘటోత్కచుని.”

## ఘటోత్కచుఁడు పాండవులకు సాయపడుట.

అనుమాట లోనుగా నాదైత్యవిభుఁడు । చనుదెంచి నృపులకు సాష్టాంగమెఱఁగి:
“ప్రభులార, రప్పింపఁబనియేమి నన్ను? । రభసత నేమికార్యముపుట్టె మీకు?

---

1. సేదఁదీఱ యనిన

ఈయున్న యునికిన యింద్రాదిసురులఁ । బోయి తెత్తునో మీమ్ముఁ బొడగనిపింప !
పెకలి బ్రహ్మాండంబు బీటలువాఱఁ । బ్రకటించి వేతునే బాహుదండమున ?
పెడచేత వ్రేతునే పృథివి? నాకాశ । మడఁతునే చెదరి గ్రహంబులురాల ?
గంధమాదనమెత్తి కరమునఁ దాల్చి । సంధించివైతునే జలధిలోఁ బడఁగ ?
క్షితి మీకు నెగ్గుచేసిన కౌరవులను । గతముగావింతునే కరివురి కేఁగి ?
ఏను జేయఁగఁదగు హితకార్యమెద్ది ? । యానతి యిం."డన్న యమతనూభవుఁడు:
"అగు నంతవాఁడు కాఁడనరాదునిన్ను; । నొగి నీవుగా కెవ్వరున్నారు మాకు ?
దనుజేశ, నేఁడు మీతల్లిపాంచాలి । వనవీథిలో నడవఁగలేక యలసి-
యున్నది మోచితే నుచితంబు నీకు । సన్నుతగుణ, లెమ్ము చయ్యన." ననిన
దనుజుఁడు భీమునిఁ దరుణినిఁ దాల్చి । తన సేనఁబనిచె నందఱ మోవఁజేయ.
యమసూతి రోమశుండందఱు దైత్య । సమితిపై నెక్కి విశ్రాంతిమై వచ్చి
గంధమాదన శిఖాగ్రంబున నిలిచి । సంధిల్ల దనుజునచ్చట వీడుకొలిపి
యక్షవనంబులో నతుల సౌఖ్యములఁ । బక్షమాత్రమునిల్చి పాండునందనులు
తపసి నిత్యముఁ బురాతనపుణ్యకథలు । విపులవైఖరిఁజెప్ప వినుచుండి" రనుచు
జనమేజయునకు వైశంపాయనుండు । మును వినిపించిన ముఖ్యమార్గమున
సత్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథవినిపింప హర్షించి వారు
అనఘాత్మ, తరువాతనైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవేయని యడుగుటయు
భానుకులాంభోధి పావనచంద్ర! । భానుకోటి శతప్రభా భాసమాన!
అంజనాత్మజలోల! యతికృపాశీల! । మంజీరయుతపాద! మధురప్రసాద!
శరముఖాకర్షిత జలధి కల్లోల! । ధరణిజాలింగన తాత్పర్యశీల!
బాణాసనాంకిత పటుభుజాదండ! । బాణభీకర! శత్రుపటల సంహార!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్ర దీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచితారణ్యాఖ్య విపుల పర్వమున । నరుదుమీఱఁగ ద్వితీయాశ్వాసమయ్యె.

---

# తృతీయాశ్వాసము



శ్రీభోగ సంపన్న, శివచాప భిన్న, । సౌభాగ్యసుత్రామ, సాకేతరామ,
శరణాగతత్రాణ జయబిరుదమున । ధర నెగడిన మహాత్మా, చిత్తగింపు.
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె :

## సౌగంధికాహరణము

గంధమాదన గిరిఁ గౌంతేయులట్లు । సంధిల్ల రోమశు సహితంబు గాఁగ
నున్నచో, నొక్కనాఁ డువిదముందటను । సన్నుతద్యుతి దివ్యసౌగంధికంబు
కమనీయ సౌరభాగత చంచరీక । సముదయంబై మహాశ్చర్యమై దిశలు
వాసింపుచును వాయువశమున వచ్చి । భాసిల్లఁ బడుటయుఁ బాంచాల తనయ
గనుఁగొని వెఱఁగంది కడుమెచ్చి దాని । ఘనసౌరభమునకుఁ గాంతికిఁ జొక్కి
ధర్మజునకుఁ జూపి: "ధరణీశ, దీని । నిర్మలసౌరభాన్వితము చూచితివె!
ఎందును వీక్షించి యెఱుఁగ నేనిట్టి । సౌందర్య సౌరభ్య సౌగంధికంబు.
దివినుండి వాయువు దెచ్చి నాయెదుట । నవిరళమతి వైచె నాశ్చర్యకరము.
ఎట్టిపుణ్యలోకదా యిదివకాళిఁ దాల్చు । నట్టివార." లటన్న నతఁడింతిఁ బలికె:
"కోరకు బృందారకుల తోఁట పువ్వు । లూరక మనకెల్ల నొదవరావివియు.
ఇకొండ శృంగంబులెల్ల నొక్కొకటి । లెక్కింప వేల్పుపాళెంబులు గావె!"
అనిన నౌఁ గాకని యపుడూరకుండి । వనిత యొయ్యనపోయి వాయుజుఁగాంచి
కానుకయంచు సౌగంధికంబిచ్చి । దానిసౌరభ్యవర్తనము వర్ణించి:
"గంధవాహజ, నీవు గలుగ నాకిట్టి । గంధర్వ సౌగంధికములేమి బ్రాఁతి!
జడియక దివ్యపుష్పములు నీవల్ల । ముడుతునేనని కొంగుముడిచితి నపుడు.
నృపుఁడెఱింగిన మఱి నిన్నుబోనీఁడు । నృప, నాకు నివి దెచ్చి నిండింపు కోర్కి."
అనిన గ్రక్కునలేచి యతి సంభ్రమమునఁ । దనచేత గదదాల్చి ద్రౌపదీప్రియుఁడు
'నలినాయతాక్షి, వేనలిచిక్కువాపి । యలరింపు మింతలో నరుదెంతు' ననుచు
ననిలుండు మును వచ్చినట్టి మార్గంబె । తనకు మార్గంబుగాఁ దడయక నడచి
మెండొడ్డి నడచుచో మెట్టిన చోటఁ । గొండరాలెల్ల నుగ్గును నూచగాఁగ

నీరంపుఁ బొదలెల్ల నిడియుచుఁ బొడియు । నైరాలఁ ద్రొక్కుచు నట నొత్తి నడచి
గదగని యుగ్రమృగంబు లెల్లెడల । బెదరుచు నొదుఁగ నబ్భీమసేనుండు
నాలుగు జంగల నగశృంగమెక్కి । శైలాటవులలోనఁ జనుదెంచుచోట

## భీమసేనుఁడు హనుమఁ గాంచుట

నచ్చట నున్నాఁడు హనుమంతుఁ డధిక । సచ్చరిత్రుఁడు కపిసార్వభౌముండు
రామకార్యాతిధురంధరుఁ డసుర । ధామ లంకాపురీ దహనదీక్షితుఁడు
దవ్వుల వాయునందనుఁ జూచి తనకు । నవ్వీరుఁ డనుజన్ముఁ డగుట నెయ్యమును
వదలక యతని సత్వము చూచుకొఱకుఁ । బదిలమై వాలమ్ము పఱపి యచ్చోటి
తెరువునకడ్డంబు ధృతిఁ జేయుచున్నఁ । బఱతెంచి భీముఁ డా ప్లవగేంద్రుఁ జూచి
ముసలివానరమిది మొగి నెట్టయెదుటఁ । బసచెడి తానేల పడియున్న దకట!
ననుజూచి వెఱవక నా పథంబునకుఁ । దనవాల మడ్డంబు తగఁ జేయుటెట్లు!
బెదరించి చూచెదఁ బెకలి పాఱెడినొ! । బెదరకుండెడినొ దర్పితరేఖ! ననుచు
గదచూపి: "తెరువేల గట్టితి విట్లు? । ముదుకవానరమ, భీమునకుఁ బోవలదె?
కొండంత నిన్ను ద్రొక్కక దాఁటిపోవ । కుండుటగా దిది యుచితమే నాకు?
తొలఁగిపొ." మ్మన్నఁ బార్థునిఁ జక్కఁ జూచి । పలికె నిట్లని రామభద్రునిబంటు:
"త్రేతాయుగమునాఁటి దేహంబు పెద్ద । వాతంబువలననే వర్ధిల్లి ముదిసె;
గదచూపి వెఱపించి కాఱులాడినను । గదల నోపునె పెద్దకాలంపుఁ దనువు!
వేగిరకాఁడ, నీవేపొమ్ము తొలఁగి । జాగులేటికి?" నన్న జననాథసుతుఁడు
"దాఁటెదనన్న నీతను వద్రికంటె । గాటంపుఁ బొడవు; దీర్ఘమువాల; మైన
హనుమంతుఁ డంభోధి యలనాఁడు దాఁటి । చనినట్లు సేతు దోషమ్ములే." దనిన:
"హనుమంతుఁ డేటికి నంభోధి దాఁటె? । వినిపించవే నాకు విన వేడ్క." యనిన,
శతకోటి పద్యవిస్తరమది చెప్ప । నతిగూఢ మటు దడవగును నాపనికి.
నైన నీవడుగుట నది సూచకంబు । గా నెఱిఁగించెదఁ గపిరాజ, వినుము.
రవివంశనిధి దశరథుఁడను రాజు । భువియేలు; నతనికిఁ బుత్త్రరత్నములు
రామలక్ష్మణులన [1]రసికాత్ములుంద్రు; । భూమిజ రఘురామ భూపాలుదేవి;

1. రసికాత్మజుండు (మూ)

వారి ముప్పురఁ దండ్రి వనవాసమునకుఁ । గారణంబున నంపఁగాఁ దపోవృత్తి
దండకాటవి కేఁగి తగుపర్ణశాల । నుండ[1]గ నచ్చోట నొక దైత్యకాంత
కఠినాంగి శూర్పణఖా నామధేయ । శఠమతి నా రామచంద్రునిఁజూచి
కామించి రతికి డగ్గఱుమన్న నతఁడు । నేమించి యేకపత్నీ వ్రతుఁడగుట
దానినొల్లక యంత దండించి పనుప । నా నీచమతి పోయి యంభోధిలోనఁ
దనరులంకానాథు దశకంఠుఁగాంచి । తనపాటుఁ దనశోకదశయును జెప్పి
'ఆరాముదేవి మోహన గాత్రిదాని । మీరిన సతిలేదు మేదిని' ననుచు
నాసపుట్టింప వాఁడపుడ మాయావి । కాసుఁడై యొకరూపు గైకొనివచ్చి
పతిలేని తరవాయి భావించి పుణ్య । సతి సీత నెత్తుక స్యందనం బెక్కి-
యనమునఁ దనకడ్డమగు జటాయువును । గసిమసిసేసి లంకా రాజ్యమునకుఁ
గొనిపోయి చెఱఁబెట్టికొని యున్నచోట । మనువంశ్యుఁ డిచట లక్ష్మణుఁడును దాను
మాయామృగముఁ జంపి మరలి యేతెంచి । యాయెడఁ బర్ణశాలాంత దేశమున
సీతఁ గానక బుద్ధిఁ జిముడుచు వగపు । చేత నాతురుఁడై వసించియు మూర్ఛ
మునుఁగుచుఁ దెలిసి యాముగ్ధాక్షి నచటి । వనములోఁ గానక వడి వచ్చి వచ్చి
... ... ... ... ... ... ... । య న్నరేశ్వరునకు నతిభక్తి మ్రొక్కి-
సుగ్రీవునకు మహీశునితోడి చెలిమి । యగ్రభాతి ఘటించి యనుబంధి నడప,
జానకీపతి వాలిఁజంపి సుగ్రీవు । వానర రాజ్యాభివర్ధనుఁ జేయఁ
దారతోఁ గిష్కింధ తానేలి యతఁడు । శ్రీరామునకు సేవ సేయఁ దలంచి
వెలయ డెబ్బదిరెండు [2] వేలుగ సంఖ్య । గలుగు వానరుల నక్కడకు రప్పించి
లక్షల రెండేసి లక్షలఁ గూర్చి । దక్షులౌ కపులఁ గొందఱిమూఁక నేసి
'యుర్వీతనూభవ యుండుచో టరసి । వేర్వేఱరం' డని విభుని యానతిని
నాల్గు దిక్కులకు [3]సేనం 'బంపుచోట । [4]మెల్లని యారామ మేదినీ విభుఁడు
'జనకజఁ బొడగానఁ జాలుదువీవె' । యని హనుమంతుచే నానవాలిచ్చి
అనలుని గజుని గవాక్షుని గవయ । పనస గోముఖ శతబలి గంధమాద
నాంగద జాంబవంతాదులఁ గూర్చి । సంగతి యామ్య దిక్భాయమ్మకై యనుప,
నందఱుఁ జని యందు నతి ఘోరభంగ । సందోహ ఘుమఘుమస్వన భీమమైన

1. నచ్ఛోటికి. 2. వేల్పుల. 3. నున్నంబంపుచోట. 4. మెల్లనె. (మూ)

యంభోధి శతయోజనాయత సీమ । గంభీరమున దాఁటఁగా శక్తి లేక
వెనుకకు వీఁగుచో వెఱవక వాయు । తనయుఁ డొక్కఁడె వార్ధిదరి వారి నిలిపి
రామచంద్ర పదాబ్జ రాజితస్మరణ । తో మించి ధరణిపైఁ దోఁక యల్లార్చి
పదములొక్కటఁ గూర్చి బాహులురెండు । పదిలంబు గాఁగనె పస నప్పళించి
మొసఁగిన, వెస నుదయించినగాలిఁ । బసచెడి యద్రు లంబరవీథి కెగయఁ
జని లంకలోవ్రాలి జానకి వెదకి । కనుఁగొని విభుని యుంగర మింతి కొసఁగి
పూని విశ్వాసంబు పుట్టించి మగుడ । నానవాలు గ్రహించి యనిపించుకొనుచు
రావణు నిర్మలారామ వృక్షములు । వేవేగఁ బెఱికియు విఱిచి త్రోచియును
లంకాపురంబు వాలపువహ్నిఁ గాల్చి । కొంకక మఱియు గ్రక్కున వార్ధి దాఁటి
తనతోడి వానరోత్తములును దానుఁ । జని వేడ్క రఘురామచంద్రునిఁ గాంచి
సీత సేమముచెప్పి చెలి శిరోరత్న । మాతని కొప్పించె నంజనాసుతుఁడు.
కావున నేనట్టి కరువలి సుతుని । కేవెంట భృత్యుఁడ హితుఁడ సోదరుఁడ.
నిను దాఁటి పోలేక నిలుచుట గాదు । తనర నొక్కనిమేను దాఁటఁ గాదంద్రు
త్రోవయి." మ్మనుటయుఁ దోఁబుట్టుఁజూచి । యా వాయుసంభవుండనిమొ నవ్వుచును:
"హనుమ వారిధిదాఁటినట్టులె దాఁటి । చనుమయ్య కదలింపఁజాల దేహంబు.
వాయుజుఁడవుగాన వర్ణింప నీవు । పోయిన దేత్రోవ బుద్ధిఁగొంకేల?"
అనిన దాఁటెదనని యతఁడుత్సహింప । ఘన [1]వాల మడర నాకాశంబు మోచె;
నెత్తిచూచెదనని యెంచఁ గొంతేయుఁ । డత్తోక పాతాళమంటెఁ బాఁతునను;
వాలంబుఁ దిగువఁగా వసుధేశుఁడంటఁ । దాలీలనది దిగంతంబులఁగడచె.
అప్పుడు విన్ననై యనిల కుమారుఁ: । "డిప్పుణ్యుఁడెవ్వఁడో యెఱుఁగంగరాదు!
పరమాత్మ విశ్వరూపము చూపినట్లు । పెరుగుచున్నది వీని పృథులవాలంబు ;
కపిమాత్రుఁ డనరాదు ఖచరులలోన । నుపమింప నిదియును నొక్క తేజంబొ!
తెలిసెద." నని భక్తి దీపింపఁ బలికె: । "అలఘువిక్రమ, యెవ్వరందురు నిన్ను?
గరిమ లీలార్థమై కపిరూపమైన । హరివొ హరుండవొ యాఖండలుఁడవొ!
ఇంక బొంకక చెప్పు మిలరామభద్ర । కింకరుండను కీర్తికినిమూలమైన
హనుమంతుఁడవొ? కాక యన్యులకిట్ట । ఘన దివ్యదేహంబుఁ గాన మెచ్చోట.

---

1. మాల (మూ).

అతఁడైనఁ జెప్పు మేనపుడు సాష్టాంగ । శతము సమర్పించి సంస్తుతి చేసి
యానంద మొందింతు." ననిన నప్పవన । సూనుతో నంజనాసూనుఁ డిట్లనియె :
"నిన్నింత నిలిపితి నీతోడి భక్తి । నన్నింక నెఱుఁగుము నాఁటి వాయుజుఁడ.
బక హిడింబాదులఁ బరిమార్చె భీముఁ । డకలంక సాహసుఁడని చెప్పవిందు.
కన్నులారఁగఁ జూడఁ గలిగె నేఁడైన । నన్న, నీవును నేను నన్నదమ్ములము.
రామచంద్ర కటాక్షరక్షితంబైన । యీమేను దాల్చి యే నిచట నుండెదను.
ఇమ్మెయి నొంటిగా నెచటి కేఁగెదవొ? । తమ్ముఁడా, యివి మహాదారుణాటవులు;
రుద్రుని చెలి కుబేరుఁడు మొదలైన । భద్రగంధర్వుల పాళెంబు లివియు;
నోరసినఁ బనిదప్పు; నుగ్రులువారు; । తిరిగిపొమ్మిదియ బుద్ధికివాసి." యనినఁ
బలికెఁ బావని: "యట్టి భయములకెల్లఁ । [1] గలఁగ నీతమ్ముఁడఁగాన నెంతైన!
కామిని సౌగంధికములు దెమ్మనియె; । నీమాడ్కిఁ బోయెద నిదిమానఁజాల.
ధనదుఁడు గానిమ్ము దనుజగీర్వాణ । ఘనులైనఁ గానిమ్ము కడఁగిన ద్రేతు.

## హనుమ తన దివ్యరూపము భీమునకుఁ జూపుట

ఆమాటలటులుండె, ననఘాత్మ, నాకు । నీమూర్తిఁ జూపవే నిరతిఁ జూచెదను.
ఆరామభద్రు ముద్రాంగుళీయకము । సౌరుగఁ గనియు విశ్వాసంబులేక
నీరూపుచూడక నిజశిరోరత్న । మూరకసీత నీకొసఁగకయుండు -
నప్పు డేగతిఁజూపి తాదివ్యదేహ । మిప్పు డేఁ జూచెద నీక్షింపఁజేసి
కరుణింపు"మనిన నుత్కట మేరుశిఖర । పరిమితోన్నత భుజాప్రాబల్య మమరఁ,
గటితటీ హాటకాంజీవికాస మాణిక్య । [2] ఘటిత నక్షత్రలోకము గానుపింపఁ,
గర్ణకుండల శిఖాకమనీయరత్న । నిర్ణయద్యుతి సూర్యునికిఁ గాంతియొసఁగ,
హేలామదారి నిరీక్షణాభీల । లోలంబు వాలంబు లోకముల్ గడవ,
రామభూవరదత్త రత్నహారములు । భీమవక్షోవీథిఁ బెనఁగొనుచుండ,
డాసిన కమలజాండమువంటి మేన । వ్రేసిన యజ్ఞోప [3] వీతముల్ చెలఁగ,
గగన మేఘములెల్లఁ గౌపీనభాతిఁ । దెగికానుపింప నుత్థిత తేజమునను
ఘనుఁ డాదిహరి త్రివిక్రముఁడైనరీతిఁ । దనమూర్తిఁ జూపిన దర్శించి యలరి

---

1. గలఁగని. 2. ఘనత. (మూ.) 3. కృత్తులు.

చక్కఁజాఁగిలిఁ బ్రమ్రొక్కి శమనజుతమ్ముఁ । డక్కపిశ్రేష్ఠు నిట్లని సన్నుతించె:
"జయజయ జానకీసంతాపహరణ, । జయరామ కార్యరక్షణకళాదక్ష!
జయజయ దనుజశిక్షాతంత్ర నిపుణ! । జయ వార్ధిలంఘనోత్సాహైకసులభ!
కపిరాజ! కపిసింహ! కపిసార్వభౌమ! । కపికులప్రాణసంఘటితసంజీవ!
పక్షీంద్రసఖ! యకంపన కాలనేమి । రక్షోగణ ప్రహరణ కళాకుశల!
అక్షాది వీర దైత్యధ్వంసి! విష్ణు । పక్షసౌహృద! మహాబల భుజాటోప!
స్వామికార్య ధురీణ! సత్యకల్యాణ! । రామకథాలాప రంజితహృదయ!
నీమూర్తివీక్షింప నేనెంతవాఁడఁ! । గామితార్థవదాన్యకల్పక! శరణు.
నీసింహనాదంబు నిర్జరారాతి । భాసురహృదయ నిర్భరణశూలంబు.
ఏనెంత సుకృతినో! యెట్టిధన్యుఁడనో! । పూని నీదేహంబు పొడగానఁగంటిఁ;
దొంటిరూపంబు దాల్తువుగాక." యనిన । దంటవాయుజుఁ డట్ల తగురూపుదాల్చి
భీము డగ్గఱఁ బిల్చి ప్రియము రెట్టింప । నామహాత్ముని దనయక్కునఁ జేర్చి:
"వాయుకుమార, నీవంటి తోఁబుట్టు । పాయకకలిగె నాభాగ్యంబుకతన;
హరిసహాయులు మీరు హరిపరాయణులు । హరిదాసుఁడగు నాకునాత్మబంధువులు.
దేవేంద్రనందను తేరికేతువున । కే వచ్చి యుండుదు నిద్ధయుద్ధముల.
ఇదె నేవరంబుగా నిచ్చితి నరుని । నెదిరింపశక్యమే యింక బ్రహ్మకును !
కపికేతనుండని గాండీవి నెల్ల । నృపులును బిలుతురు నేఁ డాదిగాఁగ;
నాత్మలో మముభక్తి నరయుమీ." యనుచు । నాత్మసత్త్వముకొంత యతనికి నొసఁగి
సౌగంధికములకుఁ జను సిద్ధ మార్గ । మాగంధవాహజుఁ డతనికిఁ జూపి
పనిచిన, నుప్పొంగి పాండునందనుఁడు । హనుమంతునకు మ్రొక్కి యప్పుడె కదలి

## భీముఁడు సౌగంధికవనముఁ బ్రవేశించుట

చని చని ముందటఁ జంపకక్రముక । ఘన కదంబార్జున ఖర్జూర సాల
పాటల పున్నాగ పనస జంబీర । పాటీర మల్లికా ఫలపూర లికుచ
వట బిల్వ సహకార వంజులాశోక । కుటజ తాల తమాల కురవకాదులను
గనుపట్టియున్న సౌగంధికవనము । ఘన ముదంబునఁ గాంచి కమలారికులుఁడు
వన పక్వఫలములు వాంఛతో నమలి । పొసర సరోవరంబునకునై డిగ్గి

మొదలఁ గుత్తుకబంటి మొలబంటిగాఁగ । నుదకంబు గ్రోలి యాయువు నిల్వనమ్మి
సౌగంధి [1] కాంభోజ సౌరభాస్వాద । నాగత చంచరీకాలి ఝుంకార
నాదంబు [2] సురగీత నాదంబు నిఖిల । మోదమై తనకర్ణములకు నింపొదవఁ,
గమ్మఁ దావులతోడి ఘనపుష్ప సమితి । యమ్మహాత్ముఁడు గోయ నాయితపడఁగ
వలదని వారించి వనపాలు రతనిఁ । బలువంకఁ [3] బటు వాక్యఫణితి నిట్లనిరి:
"ఇవి దేవతలకు మీఁదెత్తిన విరులు । తవిలి కోసెదవేర! ధర్మమే నీకు!
కిన్నరేశ్వరుఁ డిందు గిరిశుండుఁ దాను । నున్నతి విహరించు నొరంత ప్రొద్దు;
పట్టకు మిట్టి పుష్పములు నీవింకఁ । బట్టినఁ బౌలస్త్య పాదంబు లాన.
బాపురే! యెందుండి పాఱుతెంచితివి ? । పోపొమ్ము డస్సితి ప్రొద్దున." ననిన
భీముఁ డిట్లను: "నేల బెట్టు వెట్టెదరు ? । భూమిఁ బుట్టని పుష్పములు మాకు వలదె ?
బెడద లేటికి మీ కుబేరుండె గాని । ముడువ నేరమె యేము మొదల నివ్విరులు?
చంద్రకళా మౌళి [4] సఖుఁడైనయన్న । రేంద్రుఁ డల్గియు మమ్ము నేమనఁ గలఁడు ?
అవ్వల దేవేంద్రుఁడైన మాన్పినను । బువ్వులు గోయక పోనేర నురక."
అనిన రోషాంధులై యడ్డంబు వచ్చి । వనపాలకులు మీఱి వాయుజుఁ బొదివి
యసివాఁడు లౌడివాఁ డాయష్టివాఁడు । ముసలంబువాఁడునై ముసురుగ్రమ్మినను
గోపించి గదగొని కుటిల [5] దుర్దాంత । రూపిత నిర్ఘాత రూఢి నార్చుచును
గరువలి తనయుఁ డాగంధర్వ భటులఁ । దఱిమిన భీతులై తల్లడింపుచును
బాఱి పౌలస్త్య సభాసీనుఁ గాంచి । వార కిట్లనిరి: "దేవా, చిత్తగింపు;
మనవనంబున కొక మను జేంద్రసుతుఁడు । చనుదెంచి సౌరభ సౌగంధికములఁ
గోయుచున్నాఁడు దిక్కుంభి కుంభస్థ । లాయతభుజుఁడు సాహసకళామూర్తి.
కోయకుమని మేము కూఁత వేయుటయు । నాయన మను నొంచె నస్త్రశస్త్రములఁ;
జతురంగబలము నచ్చటి కంపకున్నఁ । బ్రతిఘటింపఁగరాదు; బలవంతుఁ డతఁడు."
అనిన విచారించి యక్షవల్లభుఁడు । వనపాలకులఁ జూచి వరుస నిట్లనియె:
"పాండవు లనువారు పరమచారిత్రు । లొండొండ వనవాస యుక్తిమై వచ్చి
మన గంధమాదన మహితశైలమున । ననిచిన భక్తి నున్నారని వింటి.
వారిలో నరుఁ డనువానితోఁ బెనఁగి । గౌరివిభుండు శక్యముగాక మానె.

---

1. కాలాబ్ధి 2. సర - 3. బలు 4. సఖ్యుండ యున్న 5. దీర్ఘాత. (మూ)

ఆతని యగ్రజుండతి దీర్ఘదేహి । వాతూల సుతుఁడు దుర్వారసాహసుఁడు.
వాఁడు గాఁబోలు నివ్వనమున విరులు । నేఁడు గోయుచు నున్న నిబిడ విక్రముఁడు.
సౌగంధికములకై చండ తేమిటికి ? । నేగతిఁ గొనిపోవనిందు పుష్పముల."
అని పురుషాంతరంబరయంగ నేర్చు । ధనదుండు వారించి తనవారి ననిచె.

## భీమునిఁగానక ధర్మజుఁడు తల్లడిలుట

అక్కడ ధర్మజుండనిలజు వెదకి । యెక్కడఁ గానక యిచ్చలోఁ గలఁగి
ద్రౌపదికిట్లనుఁ: "దరళాక్షి, భీముఁ । డేపజ్జ నున్నవాఁ డెటుపోయె నతఁడు?
అప్పటి విరు లెందునైన సాధించి । యప్పణ్యుఁ డెమ్మని యనిచితో లేక ?
అంత చేసితివేని యతఁడు కార్యంబు । పొంత యెఱుంగఁడు పోవునెందైన.
ఎల్ల దేవతలకు నిర వీనగంబు; । చెల్లఁబో యెక్కడ సిలుగు పుట్టెడినో!
ఎఱుఁగుదే యతఁడున్న యిక్కువ?" యనిన । నఱలేని భీతి నిట్లనియె నమ్ముగ్ధ:
"పెనుపొంద మీకుఁ జూపిన పుష్ప మనిల । తనయుముందట నద్భుతముగఁ బెట్టుటయు
'నిట్టివే తెత్తు నేనింతలో' ననుచు । నెట్టన యతఁడేఁగి నృప, తడవయ్యె.
ఏల రాఁడయ్యెనో! హృదయంబు నందు । జాలిపుట్టినది విచారింప వయ్య."
నావిని పతిపల్కె: "నాతి, నీవతనిఁ । [1]బోవనిత్తువె దేవభూముల కిట్లు ?
ఏమిపుట్టెనో కదా! యితఁడు మొక్కలపు । సామంతుఁ; డచ్చోట జట్టి పుట్టినదో!
తప్పెఁగార్యం; బేను దడయక యతని । చొప్పునఁ బోకున్న నురుగదు భయము;
పోయెద." నని వాయుపుత్త్రుండు మున్ను । పోయిన మార్గంబుపొంత నవ్విభుఁడు
చనిచని యెదుట రసాలాది విటప । ఘనవనాంతమున బకక్రౌంచ హంస
కలకలారభటిచేఁ గల్లోలచలిత । జలజ సౌరభముచేఁ జాలనింపైన
యా సరోవరమున నతి సాహసమున । భాసురపుష్పముల్ పద్మాక్షికొఱకుఁ
గోసి కట్టుచునున్న గుణధాము భీము । డాసిన, నతఁడు దండము సమర్పింప
నాలింగనము సేసి: "యన్న, యీభంగిఁ । బోలునే దేవభూములకు రానిట్లు !
దురము గంధర్వులతోనైన మనలఁ । బరిహరింపఁగఁ జాలు బంధుఁడున్నాఁడె !
ఏ నేమి సేయుదు! నిట్టిసాహసము । మానవెన్నఁడు! నిట్టిమతము నీక్రమము.

1. పోనిత్తురె.

చీటికిమాటికి శివుఁడిందు వచ్చు; । నేటికి బోఁటికి నీకమ్మవిరులు?
చాలుఁ బోదము నివాసమునకు." ననుచు । గాలికుమారు నొక్కటఁ దోడుకొనుచుఁ
దమయున్న యిక్కకెంతయు నేఁగ, నచటఁ । గమలాక్షిఁ గనుఁగొని కరుపలిసుతుఁడు
కడునొప్పు సౌగంధికంబు లిచ్చుటయుఁ । బడఁతి సంతోషసంభ్రమము శోభిల్ల:
"నెవ్వఁడు గావించు నిట్టిసాహసము? । నెవ్వఁడు దేనేర్చు నింతులకోర్కి?
దివ్యులతోఁ బోరి దివ్యపుష్పములు । దివ్య లౌననఁగ సాధించి తెచ్చితివి;
నీతోడ సరిఁబోల నేర్తురే యొరులు? । వాతూలనందనా, వరశౌర్యధామ!"
అనియని కొనియాడి యందులోఁ గొన్ని । మనుజేంద్రునకు నిచ్చి మఱికొన్ని విరులు
విద్రుమాధరి తన [1] వేనలి ముడిచె." ..........................
నరి నిట్లు గొన్నివాసరము లచ్చోటఁ । బరమమానియుఁ దాముఁ బాండవులుండఁ
గాంచనవర్ణ సౌగంధికం బొకటి । పాంచాలియెదుట [2] నప్పటియట్ల వచ్చి
వాయువశంబున వరుసవ్రాలుటయు । నాయంబుజాక్షి చోద్యంబంది చూచి:
"మొన్న దెచ్చిన పుష్పములకంటె దీని । కెన్న నిట్టివిశేష మెట్లొకో గలిగె!
ఇవి దేవయోగ్యంబు లివి శిరోజముల । నివిడి ధరించకుండిన నేటిబ్రదుకు?
దళమెక్కు సౌరభతతు లుప్పతిల్లి । చెలఁగు కాంచనవర్ణసిద్ధిఁ బెంపొంది
చూడ నపూర్వ ప్రసూననిధాన । మేడనున్నదో కాని యిట వచ్చిపడియె.
ముడుతునిట్టిది వడముడి నాకుఁ గొంగు । ముడి గాఁగఁ దెచ్చి క్రుమ్మడి కీఁగలందు
అతనికిఁ జూపెద." నని భీముఁగదిసి । సతి సువర్ణచ్ఛాయ సౌగంధికంబు
కానుకగా నిచ్చి: "గాలికుమార, । దీనిఁ జూచితివె మేదిని కపూర్వంబు;
తెమలక మున్నీవు దెచ్చిన పుష్ప । సమితికంటె [3] ను నతిశయము గానొప్పు;
వన్నియఁ గడునొప్పి వాసనమించి । కన్నుల పండువై కరముశోభిల్లె.
ఇవి నీవు సాధించి యిత్తువే నేఁడు । దివిజకాంతలకంటెఁ దేఁకువ నాకు?
వెఱతుఁ గోపించునో విభుఁడెఱింగినను; । పఱతేరవలెఁ జుమీ పవమాన తనయ!
పగమోచి గంధర్వపతులతో నచట । జగడింపఁ బోకుమీ సాహసోదార!
పలుకులేటికి నెన్నిభంగులనైనఁ । దలకూర్చు మిట్టి సంతానపుష్పములు
నీలా వెలుంగుదు నిర్జరారాతి । కాలభైరవుఁడు నీఘనగదాయుధము.

---

1. వెనుకల. 2. నప్పటియును 3. నొకింత యము గానొప్పు (మూ)

కావున నీవట్టి కమ్మంబూవిరులు । వేవేగఁ దె."మ్మన్న వికసించి యతఁడు
"నెందైన సాధింతు నివి నీకుఁదెత్తు । సందేహమెడలి నిశ్చయబుద్ధి నుండు;
తే విల్లునమ్ములుఁ దివిటినా." కనుచు । నావీరుఁ డవి గదాహస్తుఁడై దాల్చి

### భీముఁడు మరల సౌగంధికముల కేఁగుట

యలకాపురప్రాంత మందుఁ బెంపొందు । నలరులతోఁటఁ జయ్యనఁ జేరఁబోయి
యొక్కెడ చూచిననింతులుఁ దారు । నొక్కట విహరించుచున్న యక్షులును,
కిన్నరాంగనల సంగీతంబు వినుచు । నున్నతి సుఖయింపుచున్న భోగులును,
లలిత విద్యాధరా లాప మాధుర్య । ఫలగోష్ఠిసుఖసుప్తిఁ బడియున్నవారుఁ
గలిగి సౌఖ్యంబైన గంధర్వ వనము । సులభంబుగా వాయుజుఁడు ప్రవేశించి
కాంచన వర్ణ సౌగంధిక పుష్ప । సంచయం బీక్షించి చాల హర్షించి
కోసెదఁ గాకని కొలనికి డిగ్గ । వాసితో నచటఁ గావలి యున్నవారు
గంధర్వవీరు లొక్కట వచ్చినిలిచి । గంధవాహజుఁ జూచి కడఁగి యిట్లనిరి:
"సారెకు వచ్చెదు సౌగంధికముల । కొర, నీకివి దాల్ప నర్హమే యకట !
పౌలస్త్యునకుఁ గాని పట్టరాదివియు; । వేల నీ వేల దర్పించి కోసెదవు ?
[1] నాఁటి కేఁగితివి కిన్నరపతి మాన్ప ; । జూట, నీవితోఁ జొరఁగ నెవ్వఁడవు?
గుణమేది నిన్నివి కోయనిచ్చినను । మణిమంతుచే వచ్చు మాకెల్లనాజ్ఞ.
గంధర్వసేనకుఁ గర్త యాఘనుఁడు; । సంధించెనేని దోసమువుట్టుఁ దొలఁగు;
తొలఁగ యున్ననొత్తువుసుమీ." యనిన । సెలవిపోనగుచు నాజిష్ణుని యన్న:
"రణము సేయఁగ రాజరాజు రానిండు; । మణిమంతు రానిండు మాకేమి భయము!
కాంచన వర్ణ సౌగంధి కావళులు । కొంచింప కెట్లునఁ గోయకమాన."
అని కోయఁ దొడఁగిన, నడరి గంధర్వు । లనివారితాస్త్ర ధారావళి నతని
ముంప వచ్చిన, గదాముష్టి నబ్భటుల । లంపుగాఁ గొట్టి నల్గడఁ బాఱఁ దఱుమఁ,
జని వారు గంధర్వసైన్యేశుఁడైన । ఘను మణిమంతునిఁ గాంచి యిట్లనిరి:
"అయ్య, మానవుఁ డొకఁ డతిదీర్ఘదేహి । చయ్యన నెందుండి చనుదెంచినాఁడో
వచ్చి సౌగంధిక వనములో విరులు । మచ్చికఁ గోయుచో, మనవారు గినిసి

1. నాఁటికియొకిన్నరపతి.

పలదన్నఁ బలుగదా వ్యాప్తినందఱను । గలహంబులోఁ దోలి గర్వంబు మెఱసి
యున్నాఁడు; మాఱులేకున్నాఁడు ; నీకుఁ । జెన్నారఁ జెప్పవచ్చితి.'' యన్న నతఁడు:

## మణిమంతుఁడు భీమునితోఁ బోరి మడియుట

"ఎట్టిట్టురా! నరుఁడే తెంచి వనము । మెట్టుటయెట్లు! నామెండైన భటులఁ
గలహంబులోఁ దోలి కారించుటెట్లు! । తలఁద్రుంతు నొంతు నాదర్పంబు వినఁడె!
రథముఁ దెమ్మనుఁడు; సారథిఁ బిల్వుమనుఁడు ; । ప్రథితసేనలఁ బిల్వఁ బనుపుఁ'' డటంచు
శరచాపకవచాది సన్నద్ధుఁడగుచు । నరుదెంచి భీముని నల్లంతఁ దాఁకి
మణిమంతుఁ డుద్దండమార్గణప్రతతి । గుణి భీముపై నేయఁ గోపించి యతఁడు
విలు గుణధ్వనిచేసి వివిధాస్త్రఘోర । విలయధారాధరవృష్టి ముంచుటయు,
మణిమంతుసేనలు మారుతిఁ బొదివి । గణనకునెక్కుడుగాఁ దూపులేసి
యార్చినఁ, గోపించి యనిలసంభవుఁడు । కార్చిచ్చువనముపైఁ గవిసినయట్లు
విల్లుచంకఁ [1] దగిల్చివెన గదాదండ । మల్లనదాల్చి సాహసము రెట్టింప
వైచెను గద వాటువాటున నుగ్గు । నూచమై భటులెల్ల నోళులుదెఱవ
మోదె నందతుకులై ప్రొగ్గి నల్గడల । రోఁదుచు భటులెల్ల రూపణంగఁగను;
చించెఱికాకులై చెదరిబెట్టువిసి । కంచుమించైపాఱి గంధర్వభటులు
పాఱిన విడువఁడు పవనజుఁడగుటఁ; । దాఁటిన విడువఁడు దైత్యారియగుట.
[2] నజ్జుగానిట్లు గంధర్వసైనికుల । [3] జజ్జుకోనేసి వేసరక వాయుజుఁడు
మణిమంతు మార్కొని మార్తాండకిరణ । గుణధనుర్లతఁ ద్రుంచి గురుశక్తితోడ
మోఁచేతఁ బొడిచిన మూర్ఛిల్లియొరగి । లేచి ఖేచరుఁడదలించి పైవెంచి
రొకమహాశక్తి బాహులధరియించి । బకహిడింబారిఁ దప్పకచూచి పలికె :
"దానవమానవ ధ్వంసినై దిశల । నేను వర్తింతు నీవెఱుఁగవుగాని;
విత్తాధిపతికైన వెఱచు నేనన్నఁ; । దుత్తుమురుగ నిన్ను దునుమకమాన.
పాఱకనిలువుమీ పడెదు నాశక్తి; । యూఱకె చంపితి యోధులనెల్ల;
అవగ నీఁగెద నటుచూడు.'' మనుచు । వేవ్రాని తనశక్తి విసరి వైచుటయు,
వది తప్పఁగ్రుంకి బాహాసీమ నతని । [4] నదిమి కాలను గేల నంటంగఁ బట్టి

---

1. గదల్చి. 2. నజానిగా. 3. జజ్జాకుసేవి. 4. నదివి. (వూ).

పలుమాఱు నాకాశపదమునఁ ద్రిప్పి । యిల పయి వ్రేసిన, నింద్రువజ్రమునఁ
గొండ గూలినయట్లు ఘోరమై సమర । మండలంబునఁ గూలి మణిమంతుఁ డిలిగె.
చిక్కిన గంధర్వసేన లొండొకరిఁ । ద్రొక్కుక పాఱెఁ బార్థుఁడు నవ్వుచుండ.
అట మున్న ధర్మజుఁ డనిలజు వెదకి । కుటిలకుంతలఁ గనుంగొని యడుగుటయు,
సతియుఁ గాంచనవర్ణ సౌగంధికముల । కతనిఁ బొమ్మనిన వృత్తాంతంబుచెప్పి
వెండియు నిట్లను వివరంబులేక: । "పాండవాగ్రజ, భీముఁ బనిచితి నుఱక
యేలరాఁడయ్యెనో యింతసేపయ్యె? । ఆలంబు గలిగెనో యమరులతోడఁ;
బనిగాక రాని దర్పమువాఁడుగాన । వినుతి నవ్వీరు లెందు వెదకుచున్నాఁడొ!
కొఁదల ముడిచి పోనాడు పువ్వులకు । మీఁదు దలంప కేమిటికిఁ బొమ్మంటి;
అప్పటి వేడ్కకై యనిచితిఁ గాని । యిప్పుడూరక నాకు హృదయంబు గలఁగె.
ఏమని విందునో! యీవైనఁ బోయి । యామహాత్ముని సేమ మరయఁగదయ్య!"
అనిన ధర్మజుఁడు మృగాక్షిఁ గోపించి: । "వనితురే! యిటువంటి పనులకు నతని;
దేవభూముల వచ్చి తిరుగుచున్నార; । మీ వేల్పువిరుల నీవేమిచేసెదవు?
కైలాసనాథుఁ డిక్కడఁగాని యుండఁ । డాలాగువైభవం బలకాపురంబు.
చెప్పిన నెఱుఁగవు; [1] సేగి పుట్టినను । ద్రిప్పవచ్చునె! భీము తెగువ చూడనిదె!
అతని చొప్పునఁ బోద మందఱురండు; । కొతికిన ట్లిచ్చోటఁ గొంద జేమిటికి?"
అనుచు మాద్రేయులు నారోమశాఖ్య । మునియుఁ బాంచాలియు ముందఱనడువఁ

### ధర్మజాదులు భీమునియొద్ద కేఁగుట

చెనుపొంద నటమున్న భీముండుచన్న । ఘన పథంబునవచ్చి కనుఁగొను నపుడు
సౌగంధికావన(?) సామీప్యభూమి । లో గదాహతిఁ ద్రెవ్వి లొల్లియై పడిన
గంధర్వ మాంసరక్తములుఁ బ్రేవులును । బంధుర చరణోరు బాహుఖండములు
మస్తకశకలముల్ మథిత [2] మోధోరు । మస్తిష్క పంకసమగ్రంబుఁ గలిగి
సమరోర్వి జమువంటశాలయైయుండ । యమసూతి వీక్షించి యాశ్చర్యమంది:
"తలవని తలఁపు గంధర్వులతోడఁ । గలిగెనో రణము బకధ్వంసి కిచట!
ఘనగదాఘాత భీకరలాంఛనములు । గనుపట్టె; నిటఁబడ్డ ఖచరదేహములఁ
జూడుఁడా." యని మాద్రిసుతులకు మునికి । నాడంబుచూపి తా ననియె వెండియును,

---

1. సిగ్గు. 2. మేదోళు. (మూ)

"ఇంత యుద్ధంబయ్యె నెఱుఁగ మెవ్వరము; । అంత కేమయ్యెనో? యనిలనందనుఁడు
నెందున్నవాఁడొకో! యేమని వార్త । విందుమో! యిటురండు వెదకుద." మనుచు
సరవిఁ గాంచనవర్ణ సౌగంధికముల । సరసి చెంగటనున్న సాహసోదారుఁ
బవనసూనునిఁగాంచి పరమసంతోష । నవకళా పూరితాననుఁడై విభుండు
తనకు మ్రొక్కిన సహోదరుఁ గౌఁగిలించి: । "వినవైతి విట్టివి విడుమన్న విడవు;
సాధింపనెంతు దుష్కరపనుల్ (?) నీవు । సాధింపఁ బాఱెదు సారెసారెకును;
దగునె! గంధర్వుల స్థలములిచ్చోట; । నొగిఁ జెప్పిచెప్పిరా దోటమి గెలుపు.
పాంచాలికిట్టి పుష్పములు లేకున్న । నెంచ నూరకయున్న నేమి యయ్యెడిని?"
అనిపల్క "వీఁడెవ్వఁడరుదెంచి యిచటఁ । దునిసిన వాఁడు యోధులుఁ దాను?" ననినఁ
బలికెఁ బావని: "యర్థపతిసైన్యనాథుఁ । డలఘుఁడు మణిమంతుఁడఁట తనపేరు.
సారిదిఁ బువ్వులతోఁట సొరరాదటంచుఁ । బరతెంచి ననుదాకి బవరంబుచేసి
సేనలుఁదాను నీక్షితిమీఁదఁ బడిరె. । నేనును బుష్పంబులిటఁ గోసి కట్టి
యెవ్వరు వత్తురో యితనికై యనుచు । నవ్వివరముచూడ నాలసించితిని."
అనుచుఁ దాఁగోసిన యాపుష్పసమితి । మనుజేశుచేతికి మారుతి యొసఁగ
సంతోషమునఁ బొంది శమన నందనుఁడు । కాంతకు నట్టి సౌగంధిక వ్రజము
ఘనతఁ జేతికినిచ్చి: "కైకొమ్ము నీవు । మనసునఁ గోరిన మహితపుష్పములు.
పరమేశ్వరునకొండెఁ జాలోమి కొండె । దొరకింపరాని వస్తువు లిట్టి విరులు
నీకుఁ గల్గెఁ బ్రతాప నిష్ఠురబాహు । భీకరోన్నతుఁడైన భీముని వలన."

## కుబేరుఁడు పాండవుల నాదరించుట

అనునంత మణిపుష్పకారూఢుఁడగుచు । నొనర విద్యాధరులోలిఁ బాడఁగను,
గిన్నరేశుఁడు యక్షకింపురుషాదు । లన్నెలవులఁ దన్ను నర్థి సేవింప,
గరుడోరగామర ఘనసిద్ధసాధ్య । వరులెల్ల నుభయ పార్శ్వంబులఁ గొలువఁ
జాల కంకణఝుణఝుణనాద మమర । నాలవట్టములచ్చరాంగనలిడఁగఁ
జనుదెంచి నిలిచిన, శమననందనుఁడు । ఘనభక్తి నతని డగ్గఱి మ్రొక్కుటయును,
ఆలింగనము సేసి యలఁతి నవ్వమరఁ । బౌలస్త్యుఁడా రాజుఁ బలికె నెయ్యమున:
"వనవాస భరమున వసుధేశ, యలసి । మునివృత్తి నీవుఁ దమ్ములుఁ జరించెదరె?
కుశలమే మఱి? నీవు గుణనిధానమవు; । విశదంబుగానిన్ను వీక్షింపఁగలిగె;

నీయొప్పు నీయోర్పు నీనీతినేర్పు । నేయెడఁ గడుఁజిత్ర మిందువంశేంద్ర !
నిజభుజాబలరూఢి నిజసహోదరులు । త్రిజగంబునైన సాధింప నోపుదురు;
రాజసూయమహాధ్వరము చేసినట్టి । రాజవు ఘనపుణ్యరాశివి నీవు;
నినుజూడఁ [1] గంటిమి నేఁడుగా సుదిన" । మనునంత వాయుజుఁ డలకేశుఁగదిసి
వినుతి మ్రొక్కిన, యక్షవిభుఁడు నవ్వుచును; । "దనచంక గుదియయుఁ దగుశరణార్థి
యును" ననియెడుమాట యొప్పు నీతనికి । సేనతో మణిమంతుఁ జెండాడె నితఁడు;
వానికి నిటువంటి వధయె గావలయు । ... ... ... ... ... ...
కారణంబును గొంత గలదు; పూర్వమున । మీఁతి పేఁడోకనాఁడు మింటి మార్గమున
నలుఁగడ ఖచరసేనలు దన్ను గొలువఁ । గలిత విమానాగ్రగతిఁ బోవుచుండి
కనక పాత్రమునఁ గంగానదీ జలము । తన దాహమునకునై తగఁ గ్రోలుచుండి
యుమిసె నయ్యుమి యగస్త్యుని మీఁదవచ్చి । ... ... ... ... ... ...
చిటిలి యొక్క మనుష్యుచేఁ [2] జచ్చుఁగాక । ... ... ... ... ... ...
యని శపించిన శాప మదియేలతప్పు । విను మణిమంతుఁ డివ్విధమునఁ గూలె;
సౌగంధికములకై జగడించినట్టి । యా గుణాధమునకు నట్టి కావలయు.
అది యటులుండె, మీరరుదెంచుకతన । సదయాత్మ, పనులెల్ల సంగతి యయ్యె.
నిర్జరేశ్వరునొద్ద నీసహజన్ముఁ । డర్జునుఁ డున్నవాఁ డతఁడాదరింప.
అచ్చట దేవకార్యము కొంత దీర్చి । వచ్చు నేఁడెల్లిట వసుధేశ, యిటకు.
అలయ నేమిటికి మీరడవులలోన? । నలకాపురమునకు నరుదెంచి నిలుఁడు.
ఇంతలో నర్జునుఁ డేతెంచెనేని । సంతోషమునఁ గూడి చనుఁడెట్లకైన."
అనుటయుఁ బులకించి యమతనూభవుఁడు । ధనదేశుఁజూచి సంతసమునఁ బలికె:
"జగదేకనిధివి నీసందర్శనమున । నగణితక్రియ నేఁ గృతార్థుండనైతిఁ;
బరమ పుణ్యులకైనఁ బ్రాపింపలేని । పురుష తేజివి నిన్ను బొడగాన వశమె!
ఏనెట్టి సుకృతినో! యెట్టి ధన్యుఁడనొ! । శ్రీనిధి, నిను భక్తి సేవింపఁ గంటి.
వనవాస నియమంబు వహియించి మాకు । నొనరఁ బట్టణములనుండుట తగదు.
ఎల్లిట రేపట నింద్ర తనూజుఁ । డెల్లగా నిచటికి నేతెంచు నంటి
వందాఁక మేమును నలకాసమీప । మందార వనముల మలయుచుండెదము."
అనిన నాతని నీతికలరి పౌలస్త్యుఁ: । 'డనఘ, నీకొక వరంబడుగు మిచ్చెదను;

1. గంటిమిదె నేఁడుగా మంచిదినము. 2. జావు. (మూ)

రమణ నేవచ్చి యూరకపోవ.' ననిన । శమనజుఁ డీశానసఖుఁజూచి పలికె
'పలు తెఱంగుల వృథాపడిన గంధర్వ । బలముల నాకుఁగా బ్రదికింపవయ్యా!
ఇది నాకువర.' మన్న నిచ్చలోఁ బొంగి । యది యట్ల చేసెదనని వారి ననిపి
పౌరుషంబున నాజిఁబడిన ఖేచరుల । భూరి సుధావర్షమున బ్రదికించి
యలకేశుఁ డేఁగిన, నంత ధర్మజుఁడు । లలి నందుఁ బర్ణశాలలు గట్టఁబనిచి
తరుణీసమేతుఁడై తమ్ములుఁదాను । మఱి ధర్మకథలు రోమశువల్ల వినుచు
విపరీతముగ యక్షవిభుఁడు వుత్తెంచు । నుపదలఁ బరితృప్తి నొందుచు నుండె.

## అర్జునుఁడు ధర్మజాదుల యొద్దకు వచ్చుట

అంత మూఁడవనాఁటి కమరేంద్ర తనయుఁ । డంతంత సురలు దన్ననుప నేతేర
మాతలి రథమెక్కి మాణిక్య ఘటిత । చాతుర్యమకుట మస్తము తేజరిల్ల,
దేవత లిచ్చిన దివ్యబాణములు । ఏవంక ఘనదీప్తు లీనుచు నుండ,
పారి జాతానూన భవ్యప్రసూన । సౌరభంబొడలఁ బిసాళింపుచుండ,
గాండివధను వింద్రకార్ముకచ్ఛాయ । నిండారి గగన సన్నిధిఁ గానుపింప,
హరుమేను సోఁకిన యాప్రభావమున । సురుచిరాంగము 1 పరిస్ఫురితమై చెలఁగ
నల్లన వచ్చుచో, నఖిలపాండవులు । నుల్లంబునందు మహోల్లాస మొదవఁ
గమల బంధునిఁ గన్నకమలముల్ వోలెఁ । దమ క్రీడిరాక కెంతయు సంతసిల్లి
యెదురేఁగఁ, బృథివిపై యితఁడునువ్రాలి । త్రిదశాధి నాథుని తేరంత డిగ్గి
వచ్చి ధర్మజునకు వాయు సూనునకు । నచ్చపు భక్తితో నడుగుల కెఱఁగి,
సురవల్లభుఁడు ధర్మజుని కుశలంబు । పరిగణించుట చెప్పి పరఁగ నందఱును
ఉచితాసనములఁ గూర్చున్న యావేళ । సుచరిత్రుఁ డాధర్మసుతుఁ డిట్లుపలికె:
"అతిఘోర తపమున హరుని మెప్పించి । యతనిచేఁ బాశుపతాస్త్రంబు గాంచి
యెల్ల దేవతలు ననేకబాణంబు । లల్లన కృపసేయ నవియు సాధించి
పురుహూతు సమ్ముఖమ్మున నుండు నీదు । పరిణామవార్తలు పలుమారు చెప్ప
నానంద మొందితి మన్న, కుమార, । పూని యిచ్చట నిన్ను బొడగానఁ గంటి.
తలపోయ నీపునర్దర్శన ఫలము । గలుగుట రాజ్యంబు గలుగుటైతోఁచె.

1. పరిష్కృతులుపై (మూ)

'అక్కడ దేవకార్యము కొంత గలిగె । నొక్కటి నీ' కంచు నొకమాట వింటి;
నదియేటికార్య? మెయ్యది నెఱిఁగింపు; । విదితంబుగా నాకు వినవేడ్క." యనిన,
రోమశ ముఖ్యు లారూఢ సంతోష । ధాముశై వినఁ గ్రీడి తాఁ జెప్పఁదొడఁగె:

## కాలకేయ నివాతకవచాది సంహార కథనము

"తారకాసురుని పౌత్రకులు బృందార । కారాతు లిరువు రాహవధురంధరులు
కాలకేయ నివాతకవచు లనంగ । నోలి జన్మించి వా రుగ్రతపంబు
కమలసూతికిఁ బెద్దకాలంబుచేసి । తమకు నవ్వేల్పు ప్రత్యక్షమైనిలువ
దేవ గంధర్వ దైతేయుల చేతఁ । జావులేకుండఁ బ్రసాదంబువేఁడి
యంభోధిలో హిరణ్యపురంబనంగ । సంభోగ సుఖనివాసము నంతరించి
దినదినం బొకమాటు దేవేంద్రపురికి । దనుజసేనలుఁ దాము దాడిగావచ్చి
పోరాటసేయుచోఁ, బురుహూతుఁడమర । వీరులుఁ దానును విభవంబు మెఱసి
యంబురాశికిఁబోయి యసురులఁదాఁకి । పంబి వజ్రాయుధ ప్రౌఢిమచూపి
వసముగాకాదైత్యవరులకువిరిగి । నసయోట్లతోవచ్చి నాకంబుచొచ్చి
యురు దీనవదనుఁడై యున్న నాకేశుఁ । బరికించి యలబృహస్పతి భక్తిఁబలికె :
"జగడించి సురలచేఁ జావులేకుండఁ । దగవారలకు బ్రహ్మ తానిచ్చె వరము.
కావున మనుజుచేఁగాని రాక్షసులు । చావరు నీవేల సంకటపడెదు !
నిర్జరాధీశ్వర, నీవద్దవచ్చి । యర్జునుఁ డున్నవాఁడతని నం దనుపు.
నిమిషమాత్రమున నన్నిచరాక్షసుల । సమరంబులోఁ గూల్చి చను దేరఁగలఁడు."
అని నన్నుఁజూపిన నతఁడు మోదించి । తన దివ్యభూషణతతులు నాకిచ్చి
కవచ శిరస్త్రాణ ఘనభూషణములు । నివిడి నామేనఁ దానే వచ్చి తొడిగి,
తవిలి దేవతల సత్త్వములలోఁ గొంత । సవరించి నాకిచ్చి జయశంఖ మొసఁగి
మాతలి రథముపై మఱి నన్ను నిలిపి । నాతోడ దేవసైన్యముఁ గొంతగూర్చి
యనిచిన నేఁబోయి యంబుధిలోన । దనుజవీరుల పురద్వారంబు గదిసి
దేవదత్తంబను దివ్యశంఖంబు । భూవివరము నిండఁ బూరించుటయును,
వెడలిరి దైతేయవీరు లాకసముఁ । బుడమియు ధూళిగప్పఁచు నలువంక
నసివాఁడు లౌడివాఁడా యష్టివాఁడు । ముసలంబువాఁడు కార్ముకధారవాఁడు
గడవాఁడు గదవాఁడు ఖడ్గంబువాఁడు । వెడగత్తివాఁడునై విక్రమస్ఫురణ

వీరహాసోల్లాస వివిధనిస్సాణ । భేరీరవంబులఁ బృథివి కంపింప
ననుడాసి ఘోరబాణములు దేహమునఁ । జొనిపి నొప్పించిరి శూరత మెఱసి.
కరులెన్ని హరులెన్ని కాంచనరథ్య । వరసమూహములెన్ని వచ్చి తాఁకినవి!
కాలకేయనివాత కవచుల బాణ । జాలంబు శరధిలో శరధియైమించె.
మాతలిభీతుఁడై: "మఘవుని రిపుల । చేతఁ జిక్కితిఁ; గాలు నేయార్పరాదు;
ఉబ్బసంబయ్యె; దైత్యుల మహోగ్రంపు । బొబ్బలార్పులుముంచె భూనభోంతములఁ
కలఁగితి వెడలిపోఁగలుగుదె!" యనినఁ । దలఁకకుమని వానిఁదగ నుస్తరించి
యక్షయబాణ విద్యారూఢినెఱపి । వీక్షించి యరసితి వీఁగరు రిపులు ;
దేవతలిచ్చిన దివ్యబాణంబు । లేవంక నేసితి [1] నిలగరు రిపులు ;
వింట నట్టిట్టుగా విసరి వేసరితిఁ । గంటకులాడుఁగరు ఘనత మూఁగుచును.
అప్పు డేనును బ్రదుకానపోవిడిచి । కప్పిన చింత నొక్కట విచారించి
పరమేశు [2] మతినుంచి పాశుపతాస్త్ర । మరుదైన మంత్ర విద్యాయుక్తిఁదిగిచి
వినుతించి మానసవిధినిఁ బూజించి । ఘనదైత్యసేనలఁ గలయ నీక్షించి
యేకలక్ష్యము సేసి [3]యిదినీకు భిక్ష । గైకొనుమని మొక్కి ఘనతనేయుటయు,
నది కాలమేఘగర్జాభీలమగుచు । నది భైరవాట్టహాసాకీర్ణమగుచు
నది కోటిశూలాయుధాకీర్ణమగుచు । నది భూత కలకలాహంకారమగుచు
నది [4]హేమగర్భగర్భాదభ్రమగుచు । నది భానుభానుప్రభానూనమగుచు
గదలుఁ గుంతములు ఖడ్గములుఁ గాలాగ్ని । వదనగహ్వరమున వర్తించి కొలువఁ
జండదర్పిత సింహ శరభ శార్దూల । గండ భేరుండాదికములు సేవింప
నత్యుగ్రదంష్ట్రా సమంచితకోటి । మృత్యుజిహ్వాకర్ణ మిత్రమై నిగిడి
కాలకేయనివాత కవచాదిదైత్య । జాలంబు నిజదైత్య సహితంబుగాఁగ
గాలికెత్తిన దీపకళికలఁబోల్చి । రూలి భస్మముచేసి యుదధిలోరాల్చి
[6]తులలేని దివ్యదుందుభులు ఘోషింపఁ । దోలఁకుచుఁ దిరిగి నాదానవచ్చి చొచ్చె.
అప్పుడు విమలంబులయ్యె నల్దెసలు; । గుప్పించి రమరులు కుసుమవర్షములు;
జలధు లుప్పొంగె; నిర్జరసేన పొగడె; । ఇల దేవరథముపై నేనంతమరలి
నాకంబుచొచ్చిన, నాకేశుఁడఖిల । నాకులుఁ దానును నాకెదుర్కొనుచు

1, నిలఁబడరు. 2. పతి. 3. యిది. 4. హోమ. 5. దర్ప 6. తుది. (మూ)

నానందమునఁ బొంది యమరభూజ ప్ర । సూనమాలికమాళిఁ జుట్టి కీర్తించి
పెద్దఱికముచేసి ప్రియములుచెప్పి । తద్దయు వేడ్కఁ మాతలి రథంబిచ్చి
పుత్తేర వచ్చితి భూపాల !" యనినఁ । జిత్తంబులోన హర్షించి పాండవులు
ద్రౌపదీసహితులై తగసన్నుతించి । రా పార్థుఁజూచి యిట్లనియె ధర్మజుఁడు :

## దివ్యాస్త్రప్రభావ ప్రదర్శనము

"నాకులు దివ్యబాణములు నీకొసఁగ । నాకేశుఁడందు సంధానసంహార
నిర్ణయం బెబ్భంగి నీకెఱిఁగించె । నర్ణవగంభీర, యదిచూడవలయుఁ
జూపుమా." యనుటయు, సురరాజసుతుఁడు । భూపాలు వేడ్కఁగప్పుడు విల్లుదాల్చి
వరుణానిలాంతక వాసవయక్ష । వరముఖ్యులిచ్చిన వరశస్త్రసమితి
తొడుగుట వేయుట తోడ్తోన శరము । విడుచుట సంహారవిధి దునుముటయు
నిదియని వేర్వేఱ నెఱుకసేయుచును । ... ... ... ... ... ...
పరగఁ బ్రత్యాలీఢపాదుఁడై నేర్పు । పరిఢవిల్లఁగఁజూపఁ బరిపాటి నటకు
నారదుఁడేతెంచి "నరనాథ, తగునె! । మీఱి లక్ష్యములేక మిన్నకయేయఁ;
దెరువులు తప్పునే దివ్యబాణములు । గుఱిలేక యేసినఁ గొలఁదులఁబడునె!
జలధులుకలఁగె ; దిక్చక్రంబు వడఁకె ; । సురలెల్ల భీతులై చూచుచున్నారు ;
నానామహాస్త్రసంధాన మీక్షణము । మానుపుమని నన్ను మఘవుండు పనిచెఁ
జాలింపు." మనుటయు శమనసనందనుఁడు । [1]తాలిమి నద్దేవతాపసికెఱిఁగి :
"అర్జున, మునియాజ్ఞ నట్ల కావింపు ; । మూర్జితంబీ బాణయోజన దెలిసె.
తొలుత లక్ష్యములేక తొడుగుట దోష । మిల నే నెఱింగియు నెఱుఁగలేనైతి".
అనిమాన్చి యర్ఘ్యపాద్యములిచ్చి హాని । ననిచిన, నతఁడేఁగె నమరేంద్రుసభకు.
యమసూనుఁడాదిగా నంతఁబాండవులు । సమత నగ్గంధర్వశైలంబు డిగ్గి
తెరువు గాచుకయున్న ద్విజుల ధౌమ్యాది । పరమసంయముల ద్రౌపదిసఖీమణుల
సారథిప్రముఖుల సరవిఁ దోడ్కొనుచుఁ । దేరులెక్కి ప్రతాపదీప్తి నేవురును
'అనుపుఁడు పోయెద' నన్న రోమశుని । వినుతిఁ బూజలుచేసి వేడ్కవీడ్కొలిపి
కానన పదములఁ గదలియేతెంచి । జానొప్ప హిమశైల సానుదేశముల

---

1. తాలిచి (మూ)

విడిసి యచ్చట దినవిభుఁడు గ్రుంకుటయు । విడువక సంధ్యాదివిధు లాచరించి
కందమూల ఫలాదికంబులఁ దృప్తి । నొంది యచ్చటనుండి రుచితమార్గమున."
అని ముని జనమేజయక్షితిపతికి । మును వినిపించిన ముఖ్యమార్గమున
నక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథ వినిపింప హర్షించి వారు;
'అనఘాత్మ, తరువాతనైన వృత్తాంత । మనువొప్పఁజెప్పవే' యని యడుగుటయు,
నని చెప్పినట్టి యీ యాశ్వాసవాక్య । వినుతి పుష్పంబుల విష్ణుమూర్తికిని
రవివంశవిధునకు రామచంద్రునకు । నవనిజా ప్రాణేశుఁడైన దేవునకు
వనరాశి గర్వ [1] నిర్వాపణప్రతికి । దనుజేశ కంఠనిర్దళనశాలికిని
గుంభసంభవ దత్త గురువజ్రకవచ । సంభావనా సముజ్జ్వలితగాత్రునకు
నత్యాత్మునకు విభీషణవరదునకు । నత్యంత శుభపూజమై యొప్పఁగాక.
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్రి । మతిమద్విధేయ తిమ్మయనామధేయ
విరచితారణ్యాఖ్య విపుల పర్వమున । నరుదు మీఱఁగఁ దృతీయాశ్వాసమయ్యె.

---

1. నిర్వాణ (మా)

# చతుర్థాశ్వాసము

శ్రీ సకుంచిత నేత్ర, శృంగారగాత్ర, । కోసలావనినాథ, గుణభాను, రామ,
ఘనసార కస్తూరికా గంధసార । ఘనసారగాత్ర, రాఘవ, చిత్తగింపు
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె.

## అజగరోపాఖ్యానము

హిమగిరి కల్లెఁగి హిమకర కులులు । తమకుఁ బోలినచోటఁ దపసులలోన
నాకు సాలలు గట్టి యా కుశా [1]క్రాంత । నాక నదీప్రాంత నవవిహారముల
నొకయేఁడు గడపుచో నొకనాఁడు భీముఁ । డకలంక మృగయా విహారార్థ మేఁగి
మృగముల వధియించి మిక్కిలి యెండ । నొగిలి యాఁకొని డప్పి నోరెండుచుండ
వనధూళి నెత్తుటనై వాడుచు మరలి । యునికిపట్టున కేఁగ నొకపాము నడుమ
రవిదీప్తి మాఁగిన రాజబింబంబు । [2]దివిఁబట్టు రాహువు తెఱఁగు దీపింప
భీమసేనుని మహాబిరుద ప్రతాప । ధాముని బట్టి తద్దయును బోనీక
కొంత దేహము మ్రింగి కొంతట దోఁక । వింతగాఁ జుట్టిన వెడలరా కతఁడు :
"ముక్కుచు నక్కటా ! మునివృత్తితోడఁ । జిక్కితిఁ జగదీర్పఁ జిక్కకపోయె.
బలమునఁ బదివేలు భద్రదంతులకుఁ । దులవత్తు నిట్లొకో తూలితి నిందు !
ఉర[3]మేది శిర[4]మేది యుత్తుంగబాహు । భరమేది యేల లోఁబడితినో గాని !
కారణసర్పంబు గాఁబోలు ! దీని । నే రూపమున [5]గెల్తు ! నేమి సేయుదును !
దుఃఖంబు దుఃఖంబు తోడనె వచ్చు । దుఃఖభోగులకుఁ జంద్రుని మనుమలకు ;
పెనఁగుటే కాని యీ బిరుదు సర్పంబు । ఘనశక్తి విడిపింపఁగా నోపలేను.
ప్రియమైనఁ జెప్పి తప్పించెదఁ జావు । దయ దోఁప" ననుచుఁ జిత్తములోనఁ దలఁచి
యెట్టకేలకు భీముఁ డెలుఁగు [6]గీల్కొలిపి । యిట్లను : "భోగీంద్ర, యీ వెవ్వరయ్య ?
యెల్లసర్పములకు నీలావు లేదు ; । చెల్లు న న్నిటు నీవు చిక్కించుకొంటి.

1. క్రాంత. (మా) 2. కవళించు రాహువుగతి వానిఁ బట్టి (పా. అం.) 3. మిదె. 4. మిదె. (మా)
5. నున్నచెటిఁగింతు ననుచు (పా. అం) 6. గా. (మా)

పరఁగ నన్నెఱుఁగుము పాండునందనుఁడ ; । ధర ధర్మరాజు సోదరుఁడ భీముఁడను.
నీ కంఠబిలములోనికి భిక్షమైతి । నేకతంబునఁ గల్గె నీ లావు నీకు ?”
నావుడు పూర్వజన్మము తలంపైనఁ । బావని నొయ్యనఁ బలికె సర్పంబు :
“నహుషుఁడు నా పేరు నలినారికులుఁడ ! । మహితాత్మ, నా కథ మఱి యెంతలేదు.
అది నీకుఁ జెప్పెద నడిగితి గానఁ । గదముట్ట వినుము వాతూలకుమార !

## ఇంద్రుఁడు వృత్రాసురునితోఁ జెలిమి యొనర్చి యాతనిని సంహరించుట

ధాత్రిఁ దారకుని సోదరుఁ డుగ్రతపము । వృత్రాసురుఁడు సేసి వేధ మెప్పించి
యాయుధంబులచేత నహితులచేత । వేయు భంగుల మృత్యువిధి లేకయుండ
వరముగాఁ గాంచి, య వ్వాసవుతోడ । సురము సత్యముసేసి తొలఁగక యతని
త్రిదివంబు చూఱాడి, దేవకామినుల । సదయుఁడై చెఱఁ[1]బెట్టి యసుర సైన్యముల
వేల సంఖ్యలు గూర్చి వివిధ దిక్పాల । కాలయంబులు చొచ్చి యందఱఁ [2]దఱిమి,
యెదు రెందు లేక యహీన గర్వమునఁ । బదిలుఁడై యున్నచోఁ, బాకశాసనుఁడు
పంతంబు చెడి దైత్యపతి [3]తోడ ననికిఁ । గొంతైన నిలలేక కొండలు ప్రాఁకి
యడవులఁ దిరిగి రహస్యత నొదిఁగి । కడ తేర లేక విక్రమ మెల్లఁ దక్కి
తనలోన నిట్లని తలపోయఁ దొణఁగె : । “దనుజు గెల్వెదనన్నఁ దరము గాదెందు;
ఆయుధంబులచేత నహితులచేత । నాయోధనంబులో హతముగాకుండ
వరము గొన్నాఁడఁట వనజజుచేత ! । నురుబుద్ధి దాని కే నొకయుక్తి [4]దలఁతు.
పగవాని భక్తి దోఁపఁగఁ జెల్మిచేసి । తగఁ ద్రుంతు [5]దీనఁ బాతకమైన నయ్యె
నంత చేసెద” నంచు నన్యుల కిట్టి । మంతనం బొసఁగక మఘవుఁ డా క్షణము
సంధిసేయఁగ బృహస్పతిఁ బెట్టి యనిచి । బంధుభావము దోఁప బాసలు నడపి
కలసి మచ్చరము లొక్కటఁ గట్టిపెట్టి । యలరఁ జూచినవార లచ్చెరువడఁగ
నమరావతికి వేడ్క నతనిఁ దోడ్తెచ్చి । విమల సుహృద్వృత్తి వేఱింతలేక
ప్రాణము [6]లేకమై పాయులేనట్లు । జాణతనంబుగా సౌధంబులందు
నారామములయందు నాటకూటములఁ । దీరైన సురనదీ తీరంబులందు
సరసులందు మహీధ్రసానువులందు । వరహేమ దీర్ఘికావాసంబులందు

1. బెట్టినసుర. 2. దఱుమ. 3. తోడియనికి (పా. అం) 4. గాంతు. (పా. అం.) 5. వీని (మూ.)
6. ప్రాణమై (పా. అం.)

బహురత్నయుత మంటపంబులయందు । విహరింపుచుండంగ, వేఱ నొక్కనాఁడు
సింధుతీరంబున శ్రీలఁ బెంపొంది । గంధర్వకాంతల గానంబు వినుచుఁ
బుష్పకం బెక్కి నేర్పునఁ బారిజాత । పుష్పముల్ దాల్చి తుంబురుఁడు గీర్తింపఁ
జామరవ్రజము నిర్జరకాంత లిడఁగ । ధీమంతుఁడై పయోధికి వచ్చి ప్రీతి
లీలావిహారియై లేఁత ప్రొద్దునను । లాలితస్ఫూర్తి జలక్రీడ సలిపి
చాలించి బడలిన శ్రాంతి దీఱుటకు । వేలాతటంబున విశ్రామనిద్ర
వివశుఁడై కనుమూసి వివరంబులేక । యాంధాన మెడలిన యసురనాయకునిఁ
దప్పక చూచి గోత్రధ్వంసి మనసు- । [1]నొప్పెల్లఁ దలపోసి నూల్కొన్న పగల
"నెన్నాళ్లు వేగింతు నితనితో నిట్లు! । సన్నమై నడపంగ శత్రుతోఁ జెలిమి!
పాముతోఁబొత్తు తప్పక సేయవచ్చుఁ । గామించి దైత్యుతోఁ గలసుండరాదు.
సురరాజ్యసుఖమెల్లఁ జూఱఁబోనిచ్చి । తిరుగఁబాలైతి నెంతే వీనివెంట.
పగవానిచెలిమి [2]నొప్పమి వచ్చు మీఁదఁ । దెగటార్తు వీని నిద్రించుసందుననె.
ఆయుధంబులఁ జావఁ డంభోధిలోని । తోయఫేనము వజ్రతులితంబు చేసి
మంత్రించి [3]వైచి దుర్మార్గు సధింతుఁ । దంత్ర మెఱింగితిఁ దవిలె నేఁ." డనుచు
ననిమిషేంద్రుఁడు లేచి యంభోధిఁ గదిసి । ఘనమైన ఫేనంబు కరములఁ దెచ్చి
యందు వజ్రం [4]బుంచి యఖిలదివ్యాస్త్ర । సందోహమును నుండ సంధించి మించి
మును వాఁడు చేసిన మున్బాములెల్లఁ । గినుక వుట్టింప వేగిరపాటుతోడ
దేహంబు మఱచి సందేహంబులేక । యూహింప సుఖసుప్తినున్న రాక్షసుని
కంఠమధ్యమునఁ దక్కక వైవ, నీల । కంఠుఁడు బెదరె ; దిగంతంబు లదరెఁ ;
దారలు చెదరె ; భూధరములు వడఁకె ; । ధారుణి గంపించె ; ధాత భీతిల్లె.
అది ఘంటికాధ్వను లడర నందంద । యది భైరవాటోప మదరంట దిశలు
పెటపెట ధ్వనులచే భీతి వుట్టింపఁ । జిటచిట [5]క్వాణంబుచే మిన్నువగుల
నది పెక్కుపిడుగుల నవలీల రాల్చి । యది దైత్యు నిర్జించె నా క్షణంబునను.

ఇంద్రుఁడు రాజ్యభ్రష్టుఁడై తపము సేయఁబోవుట

అప్పుడు హా యని యాకాశవాణి : । "తప్పుచేసెను వజ్రి ; తను నమ్మియుండ
నాయుధ వర్జితుఁడై నిద్రవోఁ । జేమూర సఖుని నిర్జించు టేలాగు!

1. నొప్పింప (పా) 2. యొప్పక (మూ) 3. చేర్చి 4. బూన్చి(పా) 5. ధ్వనులచేఁ జదలెల్లవగుల (పా)

ఇది కడు నన్యాయ మిది మహాద్రోహ । మిది యనాచారంబ మిది [1] ధర్మహాని.
ఇంక నెక్కడి వేద! మెక్కడి స్మృతులు! । శంకింప కొదవె విశ్వాస[2]ఘాతకము.
పుణ్యపాపంబుల ఫలం తెఱింగియును । బుణ్యాత్ముఁ డయ్యును బుద్ధి లేదయ్యె."
అనుచు [3]నాఘోషింప, నమ్మహాక్రాంత(?) । విసిరి దిక్పతులెల్ల ; వెఱచె సూర్యుండు;
ధర్మమార్గము దప్పెఁ ; దపములు చెడియె ; । నర్మిలి గ్రహతార [4]లట్టిట్టు పడియె ;
దిక్కులెల్లను మాసె ; దేవాలయములు । చిక్కెఁ బూజలు లేక ; శేషుండు వడఁకె ;
వాయు వెల్లెడలను వర్తింప వెఱచె ; । న్యాయాధిదేవత [5]నడఁకె నొక్కెడను ;
అనలుఁడు మొదలుగా యజ్ఞభాగములు । ఘనత సుప్రీతుఁడై గ్రహియింపనోడె ;
సంధ్యాది జపముల సామర్థ్య ముడిగె ; । వింధ్య [6]మూఁకిడినట్లు విధి చిన్నఁబోయె.
అంతఁ బురందరుఁ డా పాతకంబు । వింతగాఁ దను బ్రాఁక వికటాత్ముఁ డగుచు
నరయఁ దేజోహీనుఁడై మూర్తి దఱిఁ । దరిలేక మహిమ యంతయు దిగజాఱి
యజ్ఞాన సహితుఁడై యమరుల కడకుఁ । బ్రాజ్ఞుఁడై పోవంగఁ బ్రాప్తంబులేక
ఘనతతోఁ గల్పక కామధేనువులు । తను జూచి కదియక తలఁగిపోయినను
లజ్జించి మిగుల విలాపంబుచేసి । యొజ్జ దూఱుచు నాత్మ నుసు రసు రనుచు,
నచ్చోట లేచి యయ్యైన నేఁగుదెంచి । యచ్చుగాఁ దాఁ జేసినట్టి దోషంబు
హరియింపవలెనని యం దొక్క కొలన । సరుదైన తపము సేయుఁగ సమకట్టె.

## దేవతలు నహుషుని స్వర్గాధిపతిగాఁ జేయుట

అప్పుడు గురుఁ డాదియైన దేవతలు । తప్పక కూడి విధాత కొల్వునకు
నేతెంచి, యచ్చోట నెలమి వేల్పులును । కౌతుకంబునఁ గిన్నరా దానవరులు
నన్నదాన వినోదు లతి ధర్మపరులు । నున్నతోన్నతమును లూర్ధ్వ వీర్యులును
బరహితాచారతత్పరులు సత్యాత్ము । లరయ నద్రికులేంద్రు లంబుధుల్ నదులు
నుభయదిక్కులఁ గొల్వ, నోలి వేదములు । రభసంబుతో మ్రోయ, రాజసలీలఁ
గొలువున్న పద్మజుఁ గొమరొప్పఁ గాంచి । పలుతెఱంగుల మ్రొక్కి ప్రస్తుతి చేసి :
'విన్నపం బవధారు, విశ్వేశ! వినుము, । కన్నుగానక క్రొవ్వి క్రతుభేది నేఁడు
వృత్రాసురునితోడ వికటింపలేక । మిత్రత్వ మొనరించి మిగుల నమ్మించి

1. ధరా (మూ.) 2. పాతకము 3. నాక్రోశింప. 4. లదరిందు 5. యడఁగె 6. మాఁగిన (పా. అం.)

నిద్రింపఁగా దీర్ఘ నిద్రతోఁ గూర్చె ; । భద్రాత్మ, విశ్వాసపాతకుఁ డయ్యె ;
దైవత్వ ముడిగి వితాకుఁడై తపము । గావింపఁబోయె నెక్కడికినో గాని.
ఇంద్రపట్టమునకు నిఁక నెవ్వఁ డర్హుఁ । డింద్రవందిత, మాకు నెఱిఁగింపవయ్య.
పతిలేక స్వర్గంబు పాడయ్యె నకట! । మఱిఁ దలఁపవు భావ్యమా నీకు!' ననినఁ
బలికె నయ్యజుఁ: 'డింద్రపట్టంబునకును । గలఁడు ధరిత్రి; నొక్కరుఁ డున్నవాఁడు ;
హయమేధములు నూఱు ననువొప్పఁజేసి । నయశాలి యున్నాఁడు నహుషుఁడన్[1] రాజు.
అచటికి మీ రేఁగి యతనిఁ బ్రార్థించి । రచన వుట్టించి యేక్రమమున నైనఁ
గొని తెచ్చి యాతనిఁ గొమరొప్ప నిలుపుఁ'. । డని చెప్ప వారలు నట్ల కాకనుచు
భూలోకమునకు గొబ్బున నేఁగుదెంచి । చాలినభక్తి నచ్చట [2]నన్నుఁగాంచి
మొనసి యాశీర్వాదములు పెక్కు చేసి । కొనియాడి నాదైన గుణములు వొగడి :
"ఓ మహాత్మకుఁడ, నీ వొనరించినట్టి । యా మహాక్రతు శతావ్యాహత సుకృత
మబ్బె నీ; కింద్రసింహాసనంబునకు । గొబ్బున విచ్చేసి కూర్చుండి సురల
నందఱఁ బాలింపు మనఘ, నీ." వనుచుఁ । బొందుగాఁ బ్రార్థింపఁ, బొంగి యే నపుడు:
"ఓ మహాత్మకులార, యురు శతాధ్వరము । లోమి చేసినఁ గీర్తి యొనఁగును గాక ;
నిర్జరేంద్రపదం బనిర్దేశ్య సుఖము । పర్జన్యునకుఁ దక్కఁ బరులకుఁ దరమె ?
గరుడ విద్యాధర గంధర్వ ఖచర । వరులు మ్రొక్కెడిపాటి వలదె తేజంబు ?
నా కంత తేజంబు నా కంత మహిమ । నా కంత బలము నున్నదియె చింతింప ?
మిమ్ముఁ జూచుటె నాకు మెఱసి యింద్రత్వ । మిమ్ములఁ గల్గుట యిది యథార్థంబు.
మానుష తేజం బమర్త్య తేజంబు । తో నెన్న సరియైన ధ్రువ మదిగాదు."
అని యర్ఘ్య పాద్యాదు లర్థితో [3]నిచ్చి । మనసు రంజిలఁజేసి మక్కువతోడ
విచ్చేయుఁ డనుటయు వేల్పులందఱును । మచ్చిక ననుజూచి మఱియు నిట్లనిరి :
'మా మహిమలయందు మా తేజములను । భూమీశ, మా బలంబులయందు నీకుఁ
జేకొను పంచియిచ్చెద మీ క్షణంబు ; । నీ కేమి కొఱఁత? యన్నింటి కేము గలుగ.'
ననుచు నా కోరిన యవి యెల్ల నిచ్చి । యనిమిషేంద్రవిభూతి కభిషిక్తుఁ జేయ
ఘనత నే జేసిన క్రతు శత ఫలము । వనమాలి కృపఁ గల్గె వలనొప్ప ననుచుఁ
బరిపూర్ణ [4]భక్తిమై భాసిల్లి, సురలు । కరుణించి యిచ్చిన ఘనతర బలము

1. వాఁడు. 2. నున్న. (పా. అం.) 3. సునిచి. (మూ) 4. బుద్ధిమై. (మూ)

మహిమయుఁ దేజంబు మతివిశేషములు । సహజంబుగాఁ బూని, సామ్రాజ్యలీల
గురుఁ డాదిగా దేవకోట్లు సేవింప । మెఱసి పుష్పకమెక్కి మింటిమార్గమున
విలసిత బహుపుష్పవృష్టులు గురియఁ, । బొలుపొంద సురదుందుభులు మ్రోయుచుండఁ,
గిన్నర గంధర్వ ఖేచరాధిపులు । సన్నుతింపుచుఁ బాడి జయవెట్టుచుండ,
రంభాది సతులు నర్తనములు సలుప । సంభూతమతి బృహస్పతి లగ్నమిడఁగ
నమరావతీపురి కరుదెంచుచోట, । నమరకామినులు మహా సంభ్రమమున
ముత్తేలసేసలు ముదముతోఁ జల్లి । హత్తి [1]కన్గొనలఁ జయ్యన నివాళింప
నరుదెంచి యింద్రు సింహాసన మెక్కి, । సురలెల్ల మ్రొక్క భాసురలీల నేను
వసువు లాదిత్యు లధ్వరకర్త లెన్నఁ । బొసఁగు దిక్పాలురుఁ బుణ్య [2]తాపసులు
సంతాన సురధేను సత్సుధాకలశ । చింతామణులు వచ్చి చేరి సేవింపఁ,
పాకశాసన మహాభాగ్య సామ్రాజ్య । మేకశాసనముగా నేలుచు నుండి,
యొక్కట నైరావతోచ్చైశ్శ్రవముల । నెక్కుచు వాహ్యాళి కేటకైనఁ జనుచు,
నాటిన సుఖసక్తి నందనోద్యాన । వాటికల్ చూచుచు, వరుస నాకాశ
గంగాతరంగ రంగచ్చైత్ర పవన । సంగతస్థలులు విశ్రాంతిఁ జూచుచును

## నహుషుండు శచిని జూచి మోహించుట

విహరింపుచుండి నే వెస నొక్కనాఁడు । బహు శుభస్థితి బృహస్పతి గేహమునకు
నతనితో భాషింతు నని పోవుచోట । నతివ నొక్కతెఁ గంటి నన్నివాసమునఁ
దొంటివాసవుని వధూటీలలామ । నొంటి [3]మైఁ బతిఁ బాసి యుడికెడుదాని
శృంగారమూర్తి శచీదేవి యను ల- । తాంగి నంబురుహాక్షి నలినీలవేణిఁ
గన్నులకలికిఁ జక్కని పూవుములికిఁ । జెన్నుగాఁ బలికెడి చిత్తరుబొమ్మ
మెఱచి [4]పోవఁగ లేని మేఘంబు మెఱుపు । సరిఁ గళల్ దీయని చంద్రబింబంబుఁ
దననాథుఁ డరిగిన స్థలమెఱుంగుటకు । మనసు దుఃఖంబున మగ్నమై గురుని
నడిగెద నని వచ్చి యట నున్నదానిఁ; । బొడగాంచి మరునితూపులు మేననాటి
యలయుచు దాని వృత్తాంత నామములు । తెలియ దేవతలచేఁ దెఱఁగొప్ప నెఱిఁగి
'యింద్రపట్టం బెవ్వఁడే నేలు నట్టి । యింద్రుని దేవివై హితవైన యెడల

1. కన్గవలఁ. 2. మానసులు. (పా. అం.) 3. మై 4. పొంగఁగ (మూ).

ననుభవింపక, బేలవై పేదరాలి । యనువున నవియుఁ గార్యంబేమి?' యనుచుఁ
బిలువనంచితి రాక పెనఁగె [1]నచ్చెలువ. । పలుమాఱు మఱియును బంచితిఁ జెలుల ;
నాయింటికిరాక బృహస్పతితోడఁ । బాయక నేఁ బిల్వఁ బంచుట చెప్పి
'తనకార్య మె' ట్లన్నఁ, దలఁచి యగ్గురుఁడు । వనిత కిట్లనిచెప్పె వలనైన బుద్ధి :
'శత [2]మఖుఁడైనాఁడు ; సందేహమేటికి । నతిగాత్రి, సురలకు నాథుఁడైనాఁడు ;
(హవ్యభాగములకు సర్హుఁడైనాఁడు ;) । దివ్యసింహాసనస్థితి నున్నవాఁడు ;
ఇంద్రుఁ డాతఁడు నీవు నితనిఁ జేకొనిన । నింద్రాణి, యపవాద మించుకలేదు ;
అమృతపానముచేసె ; నఖిల దిక్పతులు । గుమురులై యతనిని గొలిచి యున్నారు
ధాతవాక్యము మాకు దాఁటంగరాదు ; । నీతి నీ కొకటి వర్ణించెద వినుము.
లోలత సప్తర్షులును వహియింపఁ । బాలకిలోన సౌభాగ్యంబు మెఱయ
నీ యింటి కాతఁ డెన్నిక వచ్చెనేనిఁ । జేయు మీవు నతండు చెప్పినట్లెల్ల.
ఇల సప్తమునులు వహింపఁగా వచ్చు । బలిమివాఁడఁట ! శచీభర్త గాఁదగఁడె !'

## మునులు నహుషు నజగరముగా శపించుట

అని చెప్ప, గురునివాక్యమున కయ్యింతి । తనుఁ బిల్వవచ్చిన తరళాక్షితోడ
'నవ్విధంబెఱిఁగించు' మనిన, నే నాత్మ । నువ్విన సంతోష మొదవ నాక్షణము
భృగు పులస్త్యాత్రి [3]మరీచి గౌతములుఁ । దగు వశిష్ఠుఁడు నగస్త్యమునీంద్రుఁ డాది
యగు సప్త [4]మునుల నెయ్యమున రావించి । మిగులఁ బ్రియంబులు మేకొని చేసి :
"పౌలోమి ! మన బృహస్పతియింట నుండ । నేల ? రమ్మని పిల్వ నేను బుచ్చుటయు,
లోలత సప్తర్షులును వహియింపఁ । బాలకిలోఁ దొంటి పాకశాసనుఁడు
తనయింటి కేతెంచుఁ ; దగ నట్లు నీవు । మునులచేఁ బల్లకి మోపించి యెక్కి
తను బిల్వవచ్చినఁ దడయక వత్తు । నని చెప్పి పుత్తెంచె ననఘాత్ములార !
పోవలెఁ బల్లకి పూన్చి తెం" డనిన । దేవమునులు నట్టి తెఱఁ గియ్యకొనుచు
బంగారుపల్లకి బహుళమాణిక్య । సంగతంబైనది సవరించి తెచ్చి
పట్టి ; రందునకు దాపట వశిష్ఠుఁడును । దొట్టినగతి నగస్త్యుఁడు వలపటను
గా నిల్వ, నూఁతగాఁ గైదండ లొసఁగి । మౌను లుండిరి తక్కుమౌన నేవురును.

1. నయ్యతివ (పా.) 2. మఖు (మూ.) 3. మరీచులు క్రతువు (మూ) 4. ఋషుల (పా.)

అట్టి వాహన మెక్కి యమర గంధర్వు । లిట్టట్టు సేవింప నే నంతఁ గదలి
తరలాక్షిఁ గూడెడి తమక మానంద । భరితమై సత్వర ప్రకృతిఁ జూపట్టఁ,
దగఁ బోవుచుండి ముందటికొమ్ము । మోచు భగవంతుఁ గుంభజుఁ బరికించి యేను
బ్రల్లదంబాడుచుఁ "బదపద, ప్రొద్దు । చెల్లెఁ, బోవలె నాకు [1]శీఘ్రముంబె యటంచుఁ,
దామసించెదుగాని దాఁటిపోఁ జాల- । కా మంచి మోపరి పందలంబునకు !
అట్టిట్టు [2]సొలయుచు నడుగుపై నడుగు । పెట్టెద, వొక్కింత బిఱుసుగాఁ జనవు.
కాళ్లులేకయుఁ బాము కడుశీఘ్ర మరుగు ; । కాళ్లు గల్గియు నీవు కదలలేవుఱక ;
వేసాల బాపఁడ, వేగఁ బొ." మ్మనుచుఁ । ద్రోసితి నమ్మహాత్ముని నే మదించి.
త్రోసినఁ గోపాగ్ని దుర్వారధూమ । ధూసరాభీల నేత్రుండై యతండు
శరధిఁ జుట్టిననాఁటి సరణియు వింధ్య । గిరి నడంచిననాఁటి క్రియయును బూని-
పల్లకి మోచిన బాధయుఁ దన్ను । బ్రల్లదంబాడిన బాధయుఁ దనదు
చిత్తంబు వేధింపఁ, జిచ్చరకన్ను । మత్తిలఁ దెఱచిన మదనారివోలెఁ
బూనిన కినుక 'సర్పోభవ' యనుచు । నేనున్న పల్లకి నేలతో వైచి
పోవుచో, నప్పుణ్య పురుష తపఃప్ర । భావశాపంబునఁ బామునై యేను
దవిలి కుంభజుని పాదద్వయంబునకు । సవినయంబున మ్రొక్కి సాధునై యప్పుడు :
"మునిరాజ, మునిసింహ, మునిసార్వభౌమ, । నను గటాక్షింపవే నాతప్పు సైఁచి!
కడు నింద్రవిభవంబుఁ గామాతురంబుఁ । బొడగాననీవయ్యెఁ బుణ్య, నీమహిమ.
భోగికంకణధారిఁ బూజించి యింద్ర- । భోగినయ్యును వృథా భోగిఁ గావలసె.
ఇంక బొక్కలు చొచ్చి యెల్లజంతువుల । సంకట పెట్టుచుఁ జరియింపవశమె !
గాలావటించుచుఁ గానన స్థలుల । శైలాటవులలోనఁ జరియింపవశమె !
శరణంటి నార్పవే! శాపాగ్ని." యనినఁ । బరమతాపసి కృపాభావుఁడై యప్పుడు
ననుజూచి యిట్లను, "నహుషేంద్ర, నీవు । పెనుబామవై యుండు పృథివిఁ గొన్నాళ్లు.
మఱి వచ్చి యొకఁడు ధర్మప్రశ్నములకు । నెఱుకమై నుత్తరం బీనోపునేని
నాఁడు మోక్షముగల్గి నాకేంద్రపురికిఁ । బోఁడిమి వచ్చెదు పొమ్ము నీ." వనుచు
శాపాగ్ని నార్చు ప్రశ్నము లెఱింగించి । యాపుణ్యనిధిపోయె నమరులు పొగడ.
అట్టి కుంభజుని మహాశాపమహిమ । నిట్టి సర్పాకృతి నిల నుండవలసె.

1. శీఘ్రుత. పా. 2. నలయుదు (పా.)

నేను బట్టినఁ జాలు నల్లజంతువులు । హీనసత్త్వములగు నిది క్రొత్తగాదు.
ఇంతకాలమును మృగేంద్ర శార్దూల । దంతి ఖడ్గాదులఁ దగిలి భక్షింతు.
మది నెప్డు గోరుదు మానవమాంస । మది నేఁడు సిద్ధించె నాహారమునకు.
తపసి నేఁడు మటన్న ధర్మసూక్ష్మముల । కుపమగా నిమ్ము మా కుత్తరంబులను.
అంతట నాకును నడఁగు శాపాగ్ని ; । చింతింప మేలుచేసినవాఁడ వగుదు ;
వధిక పుణ్యము చెడు నల్పదోషమున ; । విధియాజ్ఞ యట్లుండె విను భీమసేన !
ఈ కల్లజీవనం బెట్లు వేగింతు ? । నీకును దను జంప నీతి లేదయ్యె."
అనిన భీముఁడు పల్కు: "నక్లేల వగన ! । నిను బాసిపోవదు నీ యజ్ఞఫలము
కలుగు [1]జన్మాంతర కర్మంబు లిట్లు ; । తొలుత భోగింపక తుఁయు వెవ్వరికి.
సుకృతికిఁ గీడువచ్చుటయు, దుష్కృతికి । నొక మేలు వచ్చుటయును నిట్ల తలఁప.
నాగేంద్ర, నాచావునకు నేను వగవ ; । నాగకేతనుచేత నలఁగి ధర్మజుఁడు
అడవులనున్న వాఁ డాపదాభవము । గడపలేనైతిని గడు నిగి వగవు.
వగవు లెక్కడి కింక ! వారిపాలిటికి । నగధరుఁడున్నాఁడు ; నను మ్రింగు తొలుత.
ఏను ధర్మరహస్య మెఱిఁగి యుత్తరము । లీనేర్తు ననఁ జాల నెందుఁ దప్పెడినొ !
అనిర్ణయముల మాయన్న ధర్మజుఁడు । గాని మాచే నవి గావు భోగేంద్ర !"

## ధర్మజుఁడు భీమునొద్దకు వచ్చుట

అనునంత, ధర్మజుఁ డచట వాయుజుఁడు । వనమునఁ దడయుట వగచి యాత్మను మె,
"భీముఁడు వేఁటాడఁ బ్రేమతోఁ జనియె ; । నేమొకొ రాఁడయ్యె ! నింతసేపయ్యె !
ఇనుఁడు గ్రుంకఁగఁ జేరె ; నిది ఘోరవిపిన ; । మనుజుఁడు రాని కార్యము గాననైతి.
దనుజు లిందఱు ; పగ ధార్తరాష్ట్రులకు ; । మునుపున్న పగ నెందు మోసపోయెడినొ !
కలఁగెఁ జిత్త." మటంచుఁ గానలలోనఁ । దొలుతఁ దమ్ముఁడు చన్న త్రోవను తాను
వెదకుచు వచ్చి యవ్విషమ సర్పంబు । వదనాగ్రమున నున్న వాయుజుఁ గాంచి,
'హా భీమ ! హా భీమ ! యణఁగితే !' యనుచు । నాభీలరవముతో నటఁ బాఱుతెంచి
కొఱప్రాణముల నున్న కూరిమి తమ్ముఁ । దుఱక [2]రోఁజుట చూచి యుల్లంబు చెదరి,
భోగితో నిట్లను: "భోగీంద్ర, యీతఁ డేగురిలోనివాఁ డిటు మ్రింగఁ దగునె !

1, నరాంతర (మూ) 2. రొందుట. (మూ)

ఏఁ దెత్తు మృగమాంస మెంత దెమ్మనిన । మీఁదుగల్గిన పీని మ్రింగక విడవె!
ఇతఁడు చచ్చినఁ జత్తు మేము నల్వురము । ప్రతినతో; నిలుపవే! పాండవకులము."
అనినఁ గారణసర్ప మాతనిఁ జూచి: । "విను పాండవేయ, నే విడువ నెవ్వఁడను?
వచ్చు నాపద యెంతవాఁడైనఁ గాదె? । ఇచ్చె దైవము నాకు నిది నేఁటి భిక్ష.
పవనజు విడఁతురే పవన[1]భోజనులు? । వివరింతు నట్లయ్యు విను మొక్కమాట.
పాముగా మున్ను కుంభజుఁడు శపించె; । నా మహనీయ దైన్యముఁ జూచి వెనుక
"ఓ పాము! నీ ప్రశ్నములకు నుత్తరము । భూపాల, యీనోపు పుణ్యమానసునిఁ
గనఁగాను శాపమోక్షము నీకుఁ గలుగు." । ననియె నే నడిగెద నది చెప్పఁగలవె!
అప్పుడె సిద్ధించు ననుజుఁడు నీకుఁ । జెప్పెద మఱి కార్యశేషంబు లేదు.
ఇనుపురిలోపల నిటుఁ బ్రశ్నములకు । నెఱి నుత్తరము లీయనేర్తువు నీవు.
ఈవేళ కొదవితి వీవు పుణ్యుఁడవు; । భూవర, నా ప్రశ్నములు దెల్పఁగదవె!
ఏనును గతిగాంతు నీ యుపాయమున; । నీ నేర్పు నేర్పడు నేఁటిపట్టునను.
పెక్కుఁగాలములయ్యె బిలములోఁ గూలి । యిక్కడు గుడిచెద నిది మాన్పు" మనిన,
"నిత్తు నుత్తరము లే నెఱిఁగినపాటి । మెత్తువో మెచ్చవో! మీఁదు నేఁ దెలియ."

## సహుష ప్రశ్నలకు ధర్మజుఁడు సమాధాన మొసఁగుట

అనిన ధర్మజుఁ జూచి యమ్మహాభోగి: । "విను మేది గలవాఁడు విప్రుఁడై పరఁగు?
నతనికి వేద్య[2]మెయ్యది?" యని యడుగ, । క్షితినాథుఁ డిట్లనుఁ: "జిత్తశాంతియును
సత్యశౌచ దయా ప్రసాదముల్ దమము । నిత్యమై కలవాఁడు నిజము బ్రాహ్మణుఁడు.
సతత నానాభవ సముచిత్తవృత్తి । యతని కెప్పుడు వేద్యమని చెప్పఁబడును."
అనిన నమ్మతివుట్టి యాపాము మఱియు: । "విను మిన్ని గుణములు వెలయశూద్రునకుఁ
గలిగిన బ్రాహ్మంబు గలుగదే?" యనినఁ । బలికెఁ బార్థుఁడు: "వింటె పాములరాజ!
ఈ గుణంబులు గల్గనిమ్ము కల్గినను । [3]బాగొప్ప శూద్రుండు బ్రాహ్మణుఁడగునె!
ఒగి నివిగల శూద్రుఁ డుత్తమశూద్రుఁ । డగు; విప్రుఁ డవిలేక యట శూద్రుఁడగును."
అనిన నయ్యహి పల్కు: "నది యట్ల పోనఁగె; । వినుము దోషంబులు వేయిచేసినను

---

1. భోజులము. (మూ) 2. మెయ్యటి యనుండంగ. (మూ) 3. బాగొప్ప శూద్రుఁ డు శమశూద్రుఁ డగును – అనిన. (పా. అం.)

[1]కల్లలాడియు హింస గలుగనివాఁడై । యెల్లలోకంబుల కెక్కుడనంగ
విందు మట్టి యహింస విధ మెట్టి?" దనినఁ । బాండునందనుఁ డంతఁ బాము నీక్షించి :
"దివిజులు మనుజులుఁ దిర్యక్కులనఁగ । నివరింప నీ మూఁడు విధములలోన
మనుజుఁడు కర్మి; యమ్మనుజుఁడు హింస । యొనరించి పశు పక్షి యోనులఁ బుట్టు;
నొనరింప నొల్లఁడే నొందు దేవత్వ." । మని చెప్ప శాపాంత మప్పుడు గలిగి
పావని విడిచి సర్పముమేను విడిచి । దేవుఁడై నహుషుండు దేదీప్యమాన
నవరత్నయుత విమానమున గంధర్వ । యువతులు గానంబు నొగి వినిపింపఁ,
జామరాందోళన ఝణఝణత్కార । కామినీ కంకణ కలరవంబెసఁగ,
సిద్ధ విద్యాధరస్త్రీలు సేవింప । బద్ధానుభావుఁ డంబరమున నిలిచి :
"నృపచంద్ర, ధర్మజ, నీ ప్రసాదమునఁ । దపసి కోపాగ్ని నెంతయు నార్చుకొంటి ;
వాఁడె నీ తమ్ముఁడు వాయునందనుఁడు ; । పోఁడిగా నినుగంటిఁ బుణ్యంబుగంటి ;
నానతో నీవల్ల యజ్ఞముల్ నూఱు । చేసిన ఫల మిది సిద్ధించె." ననుచు
దీవించి పోయినఁ, దిగి ధర్మజుఁడు । పావనితో వచ్చెఁ బర్ణశాలకును.
అంత వర్షాకాల [2]మచ్చోటఁ బుచ్చి, । కాంతా[3]పథమునఁ గదలి పాండవులు
మరుభూమి [4]నొకమాసమాత్రంబు నిలిచి, । తిరిగి సరస్వతీ తీర [5]భాగమునఁ
బొలుచు కామ్యకవన[6]మునకు నేతెంచి, । నెలవు గైకొని యందు నిలిచిరి ప్రీతి.

## కృష్ణుఁడు సత్యాదులతోఁ బాండవులఁ జూడవచ్చుట

అత్తఱి నొక విప్రుఁ డర్జునసఖుఁడు । దత్తావధానుఁడై తగ నందువచ్చి,
శమననందనుతోడ శౌరిరాకయును । రమణ మార్కండేయు రాకయుఁ జెప్పి
మఱిపోవ, సత్యభామాయుక్తుఁడగుచు । మెఱుపుతో నొక నీలమేఘంబుపోలె,
ఘనపారిజాత స్రగంతగంధములు । వనవృక్షములకెల్ల వాసనయొసఁగ,
రమణీయ పీతాంబర ప్రభాసమితి । విమలమధ్యంబున వెలసి దీపింప,
శంఖచక్ర గదాది శార్ఙ్గ దీధితులు । పుంఖాను పుంఖమై భువిఁ బిక్కటిల్ల
రథనేమి ఘోషంబు రంజిల్ల వచ్చి । పృథివీశునకు శౌరి ప్రియముతో మ్రొక్క-

1. కల్లలాడని. (పా. అం.) 2. మచటు గాదనుచు. 3. పదములఁ గలగి. 4. వనమధ్యమార్గంబువట్టి.
5. మార్గముల. 6. ములకేఁగుదెంచి. పా. అం.

వలదని యమసూతి వారించి యతని । బలిమిఁ గౌఁగిటఁ జేర్చి, భయభక్తులెసఁగ
మారుతి మఱి మ్రొక్క మహినొక్కవయసు । వారల[1]మని శౌరి వడిఁ గౌఁగి[2]లించె.
కవ్వడి[3]యును మ్రొక్కఁ గవలును[4]మ్రొక్క । నవ్వధూమణి[5]మ్రొక్క నతఁడు[6]దీవించి,
యవ్వల నుచితాస నాసీనుఁడగుచుఁ । బువ్వుఁ బోఁణియుఁ దాను బూజలు [7]వడసి,
యందఱఁ గూర్చుండుఁడని నియమించి । యిందిరావిభుఁడు మహీ[8]శునిఁ జూచి :
"ఉన్నాఁడ వడవుల నొకపేదవోలె; । నిన్నుఁబోలఁగ[9]రాదు నృప, యొర్పునందు.
నలిన [10]సూత్రంబున నాగంబుపోలె । నిలిచి తేమనవచ్చు నీ [11]ధర్మమహిమ ?
కౌరవశత మృత్యుకాలంబు వోలెఁ । జేరవచ్చెను[12]గదా క్షితిప, మీపూన్కి.
ధర్మజ, నీచేయు తపము సత్త్రమున । ... ... ... ... ...
హరుఁడాదిగా నిచ్చి రఖిల[13]దేవతలు । నరునకు శరములు నవమంత్రయుక్తి.
ఇంకఁ గౌరవులెంత! యెవ్వరు నెంత! । శంకింప వలదు రాజ్యము నిన్నుఁ జేరు.
రాజసూయ మహాధ్వరము చేసినట్టి । రాజవు, ధర కీవు రాజు గాఁదగవె!"
అనిన నుబ్బుఁ బ్రియంబు నాత్మ రెట్టింప । వనమాలిఁ జూచి య వ్వసుధేశుఁ డనియె :
"నీ సహా[14]యమ్మున నెమ్మి నజ్ఞాత । వాసహాయనము నిర్వర్తించి యేము
అరుల నిర్జించెద[15]మని యున్నవార; । [16]సురయును మీవారి నావేళ మమ్ముఁ ;
బాలింపు మను మాట భక్తులమాట । నీలోనకృపమైన నిరుపాధిఁ బరఁగు."
అన నియ్యకొని కృష్ణుఁ డాకృష్ణఁ[17]జూచి : । "వనజాక్షి, నీ ప్రభావమునఁ[18]గౌంతేయు
లప్రయాసంబున నన్నంబు గలిగి । విప్రసమేతులై విహరించి [19]రిందు.
సుఖము నీ సుతులకు సౌరిది నేవురకు; । నిఖిల యాదవులు [20]మన్నించ నున్నారు.
పడసిరి శరములు ప్రద్యుమ్ను వలనఁ; । బడరు నీ భ్రాంతి సుభద్ర తమ్మరయ.
పాటింతు నే ననిఁ బతుల ప్రతిజ్ఞ; । జోటి, యూఱక మమ్ముఁ జూచుచునుండు ;
నిరతిఁ గడుగుదుగాని నీ శోకపంక । మరి రక్తధారల." నని చెప్పుచుండఁ
గాలావమాని మార్కండేయ మౌని । యా లోకహితుఁడున్న యచటికి వచ్చి

1. మఱి 2. లించి 3. మఱి 4. మ్రొక్కి – రవ్వధూ 5. మ్రొక్కి 6. దీవింప – నవ్వేళ 7. వడసె. 8. విభు. 9. నెందు నృపతులు గలరె. 10. సూత్రమున నున్మదహస్తి. 11. నీతి. 12. మిత్రి క్షణమాత్ర మనికి. 13. శస్త్రములు 14. యమునింక. 15. మనియున్నవార– 16. మర యుదు రమ్మ నీవారి నావేళ. 17. బలికె. 18. బాండవులు. 19. రడవి 20. మన్నింపు చున్నారు. పా. అం.

వేడ్క యథోచితవిధిఁ బూజగాంచి । చూడ్కి యందఱిమీఁద [1]సుముఖమై పర్వ
యుగములు గట్టిన యొక మూఁటవోలెఁ । దగిన పీఠంబెక్కి తా నున్నయంత,
యమసూతి యతనిచే నాదిమ కథలుఁ । దమ వృత్తములు యుగాంతర ధర్మములును
దగిన విప్ర పతివ్రతా మహత్త్వములు । జగదుదయ స్థితి సంహార గతులు
యుగధర్మ మజుని యాయుః ప్రమాణములు । ప్రగుణిత మన్వంతర ప్రమాణములు
వినుచుండ, నవ్వేల విష్ణుని దేవి । తనకు నెచ్చెలియైన ద్రౌపదిఁ జూచి :

## సత్యా ద్రౌపదీ సంవాదము

" అమ్మ, యేగురు కాంతు లతి ధురంధరులు । సమ్మతిఁ దమలోన జగడంబు మాని
నిను బట్టి యున్నారు నిత్య యౌవనులు ; । వనిత, నీ కేరీతి వచ్చె నీ నేర్పు ?
[2]మందులువెట్టుదో ? [3]మంత్ర తంత్రములఁ । బందిలి వెట్టుదో పతు లిట్లు వలవ ?
ప్రొద్దొక క్రొత్తగా భూషించుకొందో ? । ఎద్ది కారణమొ ? నా కెఱిఁగింపుమమ్మ.
భూమండలంబెల్ల [4]బోఁటియైనపుడుఁ । గామిని, నియతుండు గాఁడు నా మగఁడు.
ప్రకటింప [5]యువతులు పదియాఱువేలు । నొకనాటి రతికైన నొర్వ రాతనికి.
నలి నట్టి వెన్నుండు ననుబట్టి యుండఁ । గలదొకో [6]మందని కాంత, వేఁడెవను."
అనినఁ గోపమువుట్టి యద్దేవి పలికె : । "తనుగాత్రి, నను నీవు తగునె యిట్లడుగ !
ఆలి [7]గొంటవొ నన్ను ! నక్కటా హరికి । [8]నాలు గాఁదగుదువే ! యనదు నీమనసు.
మందుల మాకుల మగల కేమైనఁ । బొందు రోగంబులు బుద్ధి గంపింప ;
వార లెఱింగిన వచ్చు నాపదలు ; । వారకాంతలకైన వల దిట్టి క్రమము.
భావానువర్తన భవ్య మంత్రమున । [9]నే వరుండైన మోహింపఁడే ! సతిని.
ధవులకు నే మంచిదాన నైనట్టి । వివరంబు చెప్పెద విను సత్యభామ !
నియమింప నీతి కనీతికి [10]వెఱవఁ ; । బ్రియుల వాక్యమె నాకుఁ బెండ్లియు నోము.
పురుషుల మజ్జన భోజనాదులకు । నొరుల నియోగింప నొనరింతు నేన.
అన్యకాంతాసక్తి నధిపు లుండినను । శూన్యభావము నాకుఁ జిక్కకు నెపురు.
మఱి నన్యపురుషుని మకరాంకునైన । ధృతిఁజూడఁ, జూచినఁ దృణముగాఁ జూతు.

---

1. సుఖమయి. పా. అం. 2. పందిలి పెట్టుదో పతు లిట్లు వలవ 3. పతు లిట్లు వలవ. 4. పోలఁతు లైనపుడు. 5. కామినుల్. 6. యను వని. 7. గొంటరిదేని. 8. ఆలివి గాదగదైన నీ మనసు. 9. కేవళ్య మొనఁగూడు నిలలోన సతికి. 10. వగవ. (పా.)

ఊరక వ్యయమైన నోర్వ నా నగర; । నారసి వర్తింతు నాయంబు వ్యయము.
అతిథులఁ జుట్టాల నగ్నిహోత్రముల । సతతంబు నరయుట సాధ్వి, నా పాలు.
పరభూములకుఁ బోయి పతులు రారేని । వర వస్త్ర భూషణావళిఁ దాల్ప నొల్ల.
ఇలు వెడలుటయును హీనకామినుల । నలిఁ [1]బొందుగోరుట నా కన్యమావి (?).
మనసు వత్తురు నన్ను మనిక్షింతురనుచుఁ । జనవు గర్వముఁ జూపఁ [2]జుఁదు కాంతలకు.
దైవంబుగా నాత్మఁ దలఁచి నిత్యంబుఁ । గావింతు విను మత్తగారికి [3]సేవ.
[4]పతుల పంక్తిని నిత్యపాయసాన్నఁబు । యతు లొకలక్ష బ్రాహ్మణు లొకలక్ష
భూరి కాంచనపాత్రముల రుచుల్ వుట్ట । నారగింపఁగ నేన యరసి వడ్డింతు.
సొమ్ములు దొడిగిన సుకవాసి కొమ్మ । లిమ్ముల లక్ష నా కెనయైన [5]చెలులు;
నూఁడిగఁబుల [6]వార లొకలక్ష గలరు; । వేఁకతోఁ బ్రోతు వీరి వేర్వేఱ.
మత్తవారణములు మఱి లక్ష, నగర । నుత్తమాశ్వంబులు నొకలక్ష యుండుఁ;
గ్రమమొప్ప వానికి గడ్డి గవనములు । [7]సమకూర్చువారినిఁ జాలింతు నేన.
కనక భూషణ వస్త్ర గంధ వీటికలఁ । గనుఁగొన విభజింపఁగల నాకు నేన.
తరుణి, గోపాలాది దాసవర్గముల । నరయుదుఁ బెక్కుల యట నిద్రయేది.
సకలఁబు నామీఁద నిలిపి పాండవులు । సుఖముండుదురు రిత్తచొక్కరు నాకు.
మొదల సహస్రాంశములు దుఃఖమొదవ । కొదవునె జనులకు నొకపాలు సుఖము!”
అనిన ద్రౌపదిఁ జూచి యా సత్యభామ: । “జనని, నే నింత విచారింపనైతి;
మాట యోరుపుమమ్మ! మగని నీయట్ల । నేఁటినుండి భజింతు నేరుపుగంటి.
మగల దుఃఖార్ణవ మగ్నులఁ దొల్లి । తగ నుద్ధరించు సత్యవ్రత వీవు.
ఇల దేవకుసుమంబులే ముడిచినట్లు । తల ముడిచితివి గంధర్వపుష్పములు.
ఎనసిన మతివోలె నింద్రియంబులకుఁ । బెను [9]పైన కాంతవు ప్రియులకేవురకు.
కౌరవమేధంబు కాంత, నీ [10]మగలు । వారకచేయ, నవైరి కామినుల
యశ్రుధారలఁ గాని యవభృథమాడ । వశ్రుత పూర్వమో యమ్మ, నీ వ్రతము.”
అనియె నంతట శౌరి యమసూతిచేత । ననిపించుకొని దివ్యమగు రథంబెక్కి
తరలాక్షిఁదోడ్కొని తనపురంబునకునరిగె; మార్కండేయ యమియు వీడ్కొనియె.”

---

1. బొందఁ. 2. సవతి. 3. పనులు. 4. పతిభక్తి నిత్యంబు పాయసాన్నంబు – మతి యతుల్. 5. సతులు. 6. కాంత. 7. సమకూర్తు విసువక సతతంబు నేన. 8. లాంత. 9. పొంద. 10. విభులు. పా. అం.

అని మును జనమేజయ క్షితిపతికి । ముని వినిపించిన ముఖ్యమార్గమున
నక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథ వినిపింప, హర్షించి వారు
'అనఘాత్మ, తరువాత నైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే!' యని యడుగుటయు,
భక్తజనవ్రజ ప్రాణ సంత్రాణ! । భక్తిసాధ్య మహాప్రభావాభిరామ!
దుష్కృత పద్మవిధూతి మృగేంద్ర! । పుష్కరాయతనేత్ర! భూమిజారమణ!
రక్షోగణాంబుదప్రళయ వాతూల! । పక్షివాహన! మహాబల భుజాటోప!
పరమాత్మ! తారకబ్రహ్మ నామాంక! । ఉరగేంద్రశయన! కల్పితోదధిబంధ!
శరశరాసనహస్త! సమ్యక్ప్రశస్త! । కరుణాసముద్ర! రాఘవ! రామభద్ర!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
స్తుతిపాత్ర వల్లభ సూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచితారణ్యాఖ్య విపులపర్వమున । నరుదుగాఁ జతుర్థాశ్వాస మయ్యె.

---

# పంచమాశ్వాసము



శ్రీ జగదాధార, సింధుగంభీర, । రాజిత గుణసాంద్ర, రఘురామచంద్ర,
తగ నేకపత్నీ వ్రతంబున ధరణి । నెగడిన సత్కృపానిధి! చిత్తగింపు.
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె:
అంతఁ బాండవులు కామ్యక వన [1]వాస । మింతటఁ జాలింత మెంతయుననుచుఁ
జల్లని తరువుల ఛాయాపథముల । నల్లన గదలి ద్వైతారణ్యమునకుఁ
జనుదెంచి నన పర్ణశాలలు గట్టి । మును లాదరింప నిమ్ముల నుండు నంత,

## పాండవుల వనవాసక్లేశమునకు ధృతరాష్ట్రుఁడు విచారించుట

హాస్తినాపుర వాసుఁడైన బ్రాహ్మణుఁడు । ప్రస్తావమొప్ప వారలఁ జూచి పోయి
యాంబికేయునితోడ నా యునికి చెప్ప । నంబుధి కలఁగి నట్లతఁ డాత్మఁ గలఁగి
బెదరును దుఃఖంబుఁ బ్రియము దీపింప । విదుర భీష్మాదుల వీక్షించి పలికె:
"ఎడపక యక్కటా! యే నుపేక్షింపఁ । గొడుకు ధర్మజుఁ డేఁగె ఘోరాటవులకు.
మారుతి [2]బోధింప మది యల్క నతని । కూఱక [3]యూఱడి యుండ దిరతకును.
ఆదిగర్భేశ్వరియైన పాంచాలి । యా దశ నున్నచో నలుక గాకున్నె!
పావని కోపంబుఁ బార్థు చాపంబు । భావింప రిపులకు బ్రదుకు లెక్కడివి?
అంగద గద భీముఁ డాజిఁ గౌరవుల । భంగింపఁ గలఁగాంతు భయ మేమిచెప్ప!
పార్థు లీ ప్రతినలు పట్టియుండఁగను । బార్థివశ్రీ యెంత! ఫణికేతనునకు.
ధర జోదుకవ్వడి, ధనువు గాండివము, । శరము పాశుపతంబు, జయ మేమి చెప్ప!
విపిన వాసంబెల్ల వృథ గాదు; వారు । తపముచేసిరి శత్రుతతి గెల్వఁగోరి.
కానరు గర్వాంధకారంబు[4]వలన । సూను; లేనెక్కడ చోరఁగలవాఁడ!
కలయ నెండలనెండి గాడ్పులఁ దూలి । [5]చలికి వడంకి వర్షంబులఁ దడిసి
శూన్య వన్యాహార శోషితులైన । యా న్యాయపరులింక నలిగినఁ గాదె!"

---

1. భూమి-నింతటఁ జాలింత మేఁడయ్యె ననుచు. 2. బొందించు. 3. యుండిన నుండఁడెంతయును.
4. జాడు. 5. చలిని. (పా. అం.)

## దుర్యోధనుఁడు కర్ణ శకునులతో మంతన ముండుట

అని చాల వగచుచో, నది సుయోధనుఁడు । విని కర్ణు శకుని రావించి యేకతమ
ధీరత నిట్లను: "ధృతరాష్ట్రుఁ డేల । వైరి భయంబున [1]వనరఁగాఁ దొడఁగె ?
అడవులఁ గూరగాయలు వారు దినఁగ । నెడపక తన కేల [2]యీ దురవస్థ ?
ఇంక నెయ్యది కార్య? మిదె పాండుసుతులు । శంకనీయులు పోలె జరపిరి ప్రాన్కి.
ఎలమిఁ బండ్రెండవయేఁటిలో నొక్క । నెల కొంతయె గాని నిండించినారు.
ఇంతట మనయునికి యెఱిఁగింపకున్నఁ । బాతము వారితోఁ బనలేదు మనకు."
అనినఁ గర్ణుఁడు పల్కు: "నఖిలరాజ్యంబు । సిసుజేసి తడవయ్యె; నేఁ డెద్ది తమకు ?
మనకుఁ గింకరవృత్తి మహి మోచిమోచి । మన [3]వారలై యుండి మఱి నేఁడు నృపులు
ఆరూఢ మునివృత్తి [4]యలవడ్డ తమకుఁ । బోరు తోడ్తోనరింపఁ బోరు పిల్చినను;
వారు పాలని రారు; వచ్చిన మనము । ధీరతఁ బోరాడి తెగ[5]టార్పవలయు."
అనునంత శకునియు నారాజుఁ బలికె: । "పనివడి మనమింకఁ బయనమై పోయి
వారల[6]కడఁ జూపివత్తము లక్ష్మి; । [7]ఏ రీతి యగుదురో ? యిదియుఁ గార్యంబు.
అరులు చూడనిలక్ష్మి, యంగనాజనము । పరిణయింపనిరూపు పార్థివ, యేల ?
నెలఁత పాండవదేవి నీ దేవిఁ జూచి । నిలువునఁ గ్రాఁగుట [8]నేఁడు గాన్పించు.
ఊరక చనుటగా దొంటిపాశైన । [9]వారల నచ్చోట వధియింపవచ్చు."
అనుటయు రాజరాజాత్ముఁ జింతించి: । "మనుజాధిపతి యేల మనలఁ బోనిచ్చు ?
బెట్టిదంబుగ వారిఁ బెట్టినచోటు । బెట్టుగా నెఱుఁగక ప్రియముతోఁ బొగడు
భావింప నట్టింటి పగ విదురుండు । భూవిభునకు వారి [10]బూఁచిగాఁ జెప్పు.
కార్యాంతరంబునఁగాని పోరాదు । శౌర్యాబ్ధులార, విచారింపుఁ"డనిన,
సంగాధిపతి పల్కు: "[11]నచట మీ పసులు । జంగిలిగొన్నియుండు జననాథుఁడెఱుఁగు;
గాటంపు మృగములు గారించు వాని; । వేఁటఁ బోయెదనన్న విభుఁడు గాదనఁడు."
అనుటయు నొడఁబడి యతఁడు నాఁడుండి । జననాథునగరికిఁ జని మఱునాఁడు
అల్లన నిట్లాడుమని పొందు గొనిన । గొల్ల నొక్కనిఁ దెచ్చి కొలువులోఁ జూపి
'మన గొల్ల యేతెంచె మందలనుండి' । అని తండ్రితోఁ జెప్ప, నతఁ డాదరించి

---

1. వగవ. 2. కడుపుకట్టు. 3. వారైయై. 4. నడవుల. 5. దీర్ప. 6. కట. 7. ఏరూపమగు. 8. నేఁడింత లేదు. 9. వైరుల. 10. పూచి. 11. నధిప. (పా. అం.)

ద్వైతవనంబు మందల పొందులదుగ । నాతఁ డిట్లను : "దేవ, [1]యవి కడు నొప్పు ;
మృదువైన [2]లేఁబూరి మేసి [3]యందాలు । ప్రిదు[4]లక చన్నవిసి పిదుకుచు నవియు
గుజ్జు తఱపులువోలు [5]క్రొడెల నీని । యుజ్జగింపని వేడ్కనుండు ; నుండినను
యూథంబులై వచ్చి యుగ్రజంతువులు । [6]బాధించు మఱివానిఁ బగలును రేలు.
ఒండొకచో [7]నిట్టి యుదకంబుఁ గసవు । నెండ తెంకులు నీడయిరవులు [8]లేవు.
వాని నెవ్విధినైన వధియింపఁ బనుపు ; । మాను నవ్వనమందు మన మందభయము."
అని వాఁడు చెప్పిన, నాంబికేయుండు : । "తనయుని [9]నేఁ బుత్తుఁ దగ వేఁటలాడ ;
బలియు లున్నారందుఁ బాండు నందనులు ; । కలహించునో వారిఁ [10]గని కౌరవుండు !
తపమున దివ్యాస్త్ర తతులు వారలకు । నుపమింపఁ గ్రొత్తలై యున్నవి నేఁడు.
ఒఱసినఁ బనిదప్పు ; నుగ్రులువారు ; । వెఱతు నేమని వార్తవిందునో ! " యనిన
శకుని యిట్లను : "వారు జగడించి రారు ; । ప్రకటించి మనవారు పగ యని పోరు ;
కయ్య మేవిధమునఁ గా[11]నేర్చు ?" ననిన । నయ్యాత్రకై [12]పుత్రుననిచె భూవరుఁడు.

## ఘోషయాత్ర

అతఁ డిట్లనిచిన నా ఘోషయాత్ర । భూతిపెంపునఁ గరిపురిఁ జాటఁ బనిచి
కదలి కౌరవరాజు కర్ణసౌబలులు । మొదలైన [13]దొరలుఁ దమ్ములును సేవింపఁ
బడగలు గొడుగులుఁ బసనిటెక్కెములుఁ । బడివాగె హయములుఁ బసిఁడి పల్లకులుఁ
దనవెంటఁ గదలఁ బ్రతాపంబు మెఱసి । కనక భేరీధ్వాన కలితుఁడై నడచె ;
భార్యలుఁ దనయులుఁ బల్లకి నెక్కి । తూర్య ఘోషంబులతో వెంటఁ జనిరి ;
నిడివి వైచినకోల నేలపైఁ బడక । వెడలె నాతనివెంట వివిధసైన్యములు ;
కప్పతిల్లఁగఁబడెఁ గమఠమయ్యాఁత ; । నుప్పతిల్లిన ధూళి నుడువీధి మునిఁగె ;
పడగల తఱచునఁ బ్రబలమై గాలి । జడిగొన నద్ధూళి చదల నిండించె.
అల్లన నిక్కఁగి యాద్వైతవనము । ప్రల్లదంబునఁ జొచ్చి ఫణికేతనుండు
గోపాల [14]నేతలు గొని తెచ్చి [15]యిచ్చు । నా పాలనేతుల కాత్మఁ [16]జొక్కుచును,

1. యది యడుగ నొప్పె. 2. యెలపూరి. 3. యొండలను. 4. కెంతేనియు 5. కొమరొప్ప. 6. బాధ అచే నొంచు. 7. నున్న. 8. లేశ. 9. బుత్తెంతు. 10. గౌరవేంద్రుండు. 11. నేరదనిన. 12. పుచ్చె నాంబికేయుండు 13. బలులు 14. వనితలు. 15. నట్టి. 16. భోంగుచును. (పా. అం.)

కపిశ కద్రు కడార కర్బుర గౌర । కపిల ధూసరరక్త కాలాదికముల
వర్ణసంకరమయ్యు వరమూర్తి నొప్పు । తర్ణకంబుల వత్సతర మహోక్షముల
ధేనువత్సంబుల దీర్ఘశృంగిణుల । నా నెత్తములఁ జూచి యాదరింపుచును,
ఫలములఁ గఱకుట్లఁ బచ్చితేనియలఁ । బలు వన్యధాన్యముల్ [1]భటులు భుజింపఁ,
దాల హింతాల మద్యంబులు గ్రోలి । సోలుచు నతులు కస్తురి మీఁదఁ జల్ల,
వనపుష్ప వాసనా వాసితు లగుచు । ననుజులఁ దనుజు[2]లు నటఁజేరి కొలువ,
వనగజ మదగంధ వాతూల [3]తతులు । వనచరీ సంగీత వంశనాదములఁ
దరులతా మకరంద ధారాగృహములు । గురురత్న దీపికాగుహలు మెచ్చుచును,
దెరవేఁట వలవేఁట ధృతి నేదువేఁట । మఱి పొదివేఁటయు మచ్చువేఁటయును
గంటవేఁటయు వేడ్కగల కోలవేఁట । వింటివేఁటయు విడివేఁటయు నాడి,
యొఱపులై క్రొవ్వి మిన్నొరయు జంతువుల । నఱికియు వ్రేసియు నాటనేసియును
జించియు నొంచియు జీవనాళములఁ । దెంచియుఁ ద్రుంచియు ధృతి గలంచియును
వీరత వేఁటాడి వేదండపురికిఁ । దోరంపు మృగములఁ దోడ్తోనె యనిచి
వేఁట నెపంబుగా వెసఁ బాండవులకు । గాటంపు సంపద గానరా మెలఁగి
నిమ్మతోఁటల నీడ నెత్తమ్మి దొనలఁ । గమ్మని నునుగాడ్పు కందువ నిలిచి,
కౌంతేయు లుండెడి గంధర్వసరసి । పొంతఁ గేలీకూటములు గట్టఁ బనుపఁ,
బోయినవారలు పొన్నలఁ బొగడ । లాయెడఁ [4]బనసలు నామ్రపూగములు
ఖండింపుచోఁ జేరి కావలివారు: । "పొందు వృక్షము లేల పొడిచెద రిట్లు ?
చెలఁగి గంధర్వుఁడు చిత్రసేనుండు । జలకేళి వనకేళి సలుపు నిచ్చోట.
ఒరిమఁ జింతింప[5]రో ! యొల్ల [6]రో యుసురు ! । గరిమ వాటింపరో ! కావుగర్వములు."
అనిన [7]యోధులు పాఱి యా వార్తచెప్ప । విని నవ్వి కౌరవ [8]విభుఁ డిట్లు పలికె:
"ఎవ్వఁడైన విచారమేల ? యీ వేళఁ । ద్రెవ్వ నేయుం."డని తెగి [9]పనుపుటయు
దుర్మదాంధులు వోయి ద్రుమములు నఱక, । ధర్మంబు గాదని తవిలి ఖేచరులు
అడ్డుపెట్టిన, నల్గి యా యోధులనిరి: । "వెడ్డు వెట్టినఁ బోఁడు విభుఁడు రారాజు ;
[10]ఇచ్చోట జలకేళి [11]యిచ్చతోఁ జలుప । వచ్చె నాతని కిండ్లు వలదె నిర్మింప ?

1. భటులకిచ్చుచును. (పా. అం.) 2. లల్లన. 3. గతులు. (పా. అం.) 4. పనసంబులామ్ర. 5, 6. రా.
7. భటులును బోయి. 8. విభుఁడు కెండియును. 9. పలుకుటయు. (పా. అం.) 10. ఇచ్చల.
11. యిచ్చోట.

ఆవల వచ్చినా రవరోధసతులు; । సేవకు నొక చిత్రసేనుఁ జెప్పెదరు !
అఱవక పొం." డని యందంద [1]దఱుమ । వెఱచి వారలు దమ విభుఁ గానఁబోయి
చెప్పిన, నా చిత్రసేనుండు [2]గినిసి । యప్పుడ సకల [3]సైన్యముల రప్పించి :

## దుర్యోధనుఁడు చిత్రసేనునితోఁ బోరి బంధింపఁ బడుట

"ఎక్కడి నృపకీట ! మెక్కడి కూట ! । మెక్కడిపోరాట మితనికి మనకు !
తనకుఁ బార్థులతోన తగుఁగాక, యిచటఁ । జెనకిన నోర్చునే చిత్రసేనుండు !
ఒకనాఁటి విడిదికై యుద్యానవనము । పెకలించి నఱకుట పెద్దఱికంబొ !
పాత్రతలేని పాపపు సుయోధనునిఁ । బుత్ర మిత్ర కళత్రములతోడఁ గూడ
మొనసి యొక్కట నూఁచముట్టుగఁ బట్టి । కొని [4]తెండు మీ." రని కూర్చి [5]పంపుటయుఁ
జిత్రసేనుని సేన చిత్రవేగమున । ధాత్రికి డిగ్గి నిర్దయలీల నార్చి
రారాజు సుభటుల రణవీథిఁ ద్రుంప, । నా రాజు విని దుర్మదాంధుఁడై కదలి
చయ్యనఁ జతురంగ సైన్యంబుతోడ । నయ్యెడ కేతెంచి యరులఁ దాఁకుటయు,
భూచర ఖేచర భూరి యుద్ధమున । నా నోటి మృగకోటి యటు నిటు చెదరె;
శరవహ్నిఁ గొన్ని వృక్షములు నీఱయ్యె; । సరసీజలంబులు సలసల గ్రాఁగె.
పదిలంపు [6]జోళ్ళల్లఁ బఱియలువాఱఁ । బొదివి వైరుల [7]నుచ్చిపోయి బాణములు
పర [8]మర్మ భేదన పాపంబు నీఁగు । పరుసున భూశయ్యఁ బడియె నయ్యాజి.
ఊఱు నత్త్రళము లన్యోన్యఘాతములు । దూఱినఁ బడిరందుఁ దోరణాకృతిగ.
వాలులఁ దునిసియు వాలకనూటి । సాలమించుకచేసిరం దుగ్రభటులు.
పొడిచియెత్తిన కుంతములవెంట నెగసి । పడిరి కొందఱు వైరిపై [9] నవి నఱికి.
గదలచే నవిసియు గగనమార్గమునఁ । ద్రిదశులై డిగ్గి మొత్తిరికొంద ఱరుల.
రాజితజ్యాఘోష రథనేమిఘోష । వాజిహేషిత హస్తిసరబృంహితములఁ
బగిలె [10]బ్రహ్మాండంబు; పంకించె బ్రహ్మ; । నొగిలె నాశాపంక్తి; నొచ్చె దిక్కరులు
పొదలె నెత్తుట నుర్వి పుష్పిణిపోలెఁ; । బదనయ్యె సమరసంపదల నయ్యెడలు ;
అలుగు తునకలు పర్వ నాజిమండలము । తళుకులు వెదచల్లు ధరమోముఁబోలె.

---

1. కేయ. 2. గజిచె. 3. దేవాళి 4. రండు. 5. పుచ్చుటయు. 6. జోళ్ళపట్టెలు వాఱ (మూ)
7. గ్రుచ్చి. 8. ధర్మ భేదనోపాయ మార్గంబు – లెఱిఁగించు గతి నాజి నెల్లెడఁబర్వె. 9. బడి.
10. పాతాళము. (పా. అం)

అట్టి [1]సంకులములో నం గాధిరాజు । దట్టపు రిపుసేనఁ [2]దరియంగఁ జొచ్చి
శరముల రవిరశ్మిజాలంబువోలె । ఖరకాంతి నాశాముఖంబు దీపింపఁ
గర[3]మూల కరమధ్య కంఠకరాగ్ర । చరణమధ్యాంగుళీ జానులు నఱికి
కదళీవనంబులోఁ గరివోలె [4]మెలఁగఁ, । జెదరుసేనలఁ జిత్రసేనుఁడు చూచి
ధరకు రథంబుతోఁ దావచ్చి నిలిచి । కురుసేన నేలకుఁ గోలకుఁ దెచ్చి
మాయాబలంబుచే [5]మఱి సూర్యశతము । నాయెడఁ[6]బుట్టించి యాదీప్తివలన
శకుని వికర్ణ దుశ్శాసనప్రముఖ । సకల శాత్రవ [7]యోధసంఘంబు విప్పి
యంగాధిరాజు నేయంగ, నంగములఁ । బొంగురక్తముల నంబుధివోలె నతఁడు
పటు[8]కోపబడబాగ్నిఁ బర్వి గంధర్వ । ఘటితభానుల బాణఘనవృష్టి ముంచి
కనకపుంఖపుఁదూపు గంధర్వునొడలఁ । [9]జొనిపి మూర్ఛితుఁజేయఁ, జూచి యాదొరలు
కర్ణుని నాల్గువంకల నడ్డ[10]గించి । దుర్నివారణఁ దేరు తునుకలుచేసి
స్రుక్క[11]నేసిన, నిల్వఁ జొప్పడ కతఁడు । గ్రక్కునఁబాఱె వికర్ణుతేరెక్కె.
అంత దుర్యోధనుండదిచూచి కినుక । నంతకాకారుఁడై యరిసేనఁ జొచ్చి
తమ్ములు శకునియుఁ దనకుఁదోడీయ । నమ్మహాయోధుల నస్త్ర[12]శస్త్రములఁ
జెనకఁజొచ్చినఁ, జిత్రసేనుఁ డాదొరల । కనువిచ్చి [13]యనువిచ్చి యలుక విల్లంది
వాలిక మెఱుఁగుల వాలంపసోన । నాలోన దుశ్శాసనాదులఁబఱపి
[14]వెలయ దుర్యోధను విరథునిఁజేసి । తలపడి యొగినీడ్చి తన తేరిమీఁదఁ
గట్టివైచిన, నేచి గంధర్వసేన । 'పట్టుఁడు పట్టుఁడు పగచిక్కె' ననుచుఁ
దరుణులతో వాని తమ్ముల సుతుల । దొరల నశేషయోధుల నాక్రమించి
అడ (?) దోలుకొనిపోవ, నార్తనాదముల । జడియుఁ దప్పినవారు సాధులై వచ్చి
యొకయాగ మావేళ హోతలుఁదానుఁ । బ్రకటింపుచున్న ధర్మజుఁగాంచి మ్రొక్కి :
" దేవ, నీ తమ్ముఁడు ధృతరాష్ట్రసుతుఁడు । చేవ యేర్పడఁ జిత్రసేనుతోఁ బెనఁగి
సుత సతీ సోదర సుభటయుక్తముగ । నతనికిఁ జెఱఁజిక్కి యరుగుచున్నాఁడు.
ఇచ్చ నాతని తప్పు లిన్నియు మఱచి । విచ్చేసి యా చెఱ విడిపించవయ్య !

---

1. సంపదలతో. 2. దరియఁదాఁజూచి. 3. ముల. 4. ద్రుంప. 5. మహి. 6. బుట్టించె నాభీతి. 7. కోటి. 8. తర. 9. జొనిపినమూర్ఛితు 10. గట్టి. 11. జేసిన. 12. జాల. 13. యప్పుడుగనలి విల్లంది. 14. నృపువిరథునిఁజేసి నిర్దయనతని-రపణంపు జడి నీడ్చి రథముపై వైచి. (పా. అం.)

ధర్మజు[1]తమ్ముఁడు ధార్తరాష్ట్రుండు । ధర్మపత్నులుఁ దానుఁ దగిలె నెట్లనఁగ
నడిమాట [2]మీకు విచారింపఁబాడి; । కడువేగమునఁ[3]బోయి కావవే !" యనినఁ
దమ్ములఁజూచి హోతలఁజూచు నతని । యమ్మహాకృప భీముఁ డాత్మలో నెఱిఁగి :
“తత్తఱింపకు దేవ, తమ్ముఁడె వాఁడు ? । చిత్త[4]గింపుము తొల్లిచేసిన[5]పనులు.
పగనీఁగె గంధర్వపతి మనవాఁడు ; । తగులఁ గారణమేమి దాయలపనికి ?
పలుకులేటికి పాఁతపగయందుఁ బొడిచె; । వలసి యాతనికి దైవమె శాస్తి వెట్టె.
ప్రాప్తమై తే లగ్నిఁ బడఁగఁ ఒట్టుదురె! । ఆప్తవల్లభ, కాన వాతనిరాక.
[6]సిలుగేది చీఁదక చీమిడిపోయె ; । నిల యేలుదువుగాక యిఁకనైన." ననిన
జానొప్పఁజలికె నజాతశత్రుండు : । “హీనవృత్తి ధరిత్రియేల నాకేల ?
ఆవలఁ బగవాని [7]కనుజు నొప్పించి । పోవుట నయశాస్త్రముల మెచ్చఁగాదు.
మన మానహానిగా మనుజులెన్నుదురు ; । విను వానికీడు వివేకింపరపుడు ;
ఇతని దోషములెన్న నిది వేళగాదు ; । కృతమతి విడిపిం[8]పఁ గీర్తియయ్యెడిని ;
ఎలమి నేమిటికైన నిచ్చోటమనము । గలమని మఱికదా ! గంధర్వుఁ జెనకె ;
తవిలి వత్తురు నిన్ను దమ్ములుఁగూడి । సవనంబు విడిచి రాఁజనదు నా." కనిన,

## అర్జునుఁడు గంధర్వుల నెదిర్చి దుర్యోధను విడిపించుట

అన్నయానతికి సహాయుఁడై క్రీడి । క్రన్నన రథమెక్కి కవచంబుపూని
గాండీవమెక్కిడి కవదొనల్[9] దాల్చి । రండని కవల నగ్రజుఁ దోడుకొనుచు
సమరంబుగలిగిన సంతోషమొప్ప । యమసూనునకు మ్రొక్కి యప్పుడుగదలి
యెల్లహోతలు 'విజయీభవ' యనుచుఁ । దెల్లమిగాఁ దన్ను దీవింప వినుచు
[10]సీశాన్యదిశచాయ నేఁగు గంధర్వుఁ । గ్రోశమాత్రంబునఁ గూడి యిట్లనియె :
“ఎక్కడపోయెద ? విడె పోకుపోకు ; । గ్రక్కునఁ గౌరవాగ్రజు విడువిడుము ;
శూరుఁడవైన నర్జునుఁ దాఁకుతాఁకు; । పోరాడనొల్లవేఁ బోనీను నిన్ను.
హరలోక మజలోక మావిష్ణులోక । మరయ నడ్డమెనాకు ?[11] నరుగక నిలుము.
బకహిడింబాదులఁ బరిమార్చినట్టి । సుకృతచిత్తుఁడు వాయుజుఁడు వచ్చినాఁడు
నిన్ను భోనిచ్చునే ! నెలఁతుల దొరల । నన్నెలవున డించి [12]యరిగెదుగాక."

1. తనయుండు. 2. నీకు. 3. వారి. 4. గించవు. 5. చేఁత. 6. సిలుగెడి. (మూ.) 7. కతని 8. పు.
9. దిగిచి. 10. సీతానదస. 11. నాఁగక. 12. యరుగుట. (పా. అం.)

నావిని యవ్వియన్నాథ కింకరుఁడు : । "మానవా ! నా తోడ మానవా బిగువు !
ఏసీకు నీ ద్రోహి నేఁటికి విడుతు ? । పోనేల నినుజంపి పోయెదఁ గాక."
అని నిల్చి సేనా సహాయుఁడై యతఁడు । జన [1]పాలకుల మీఁద శరములు గురియ,
సహితులతోడ భీమార్జున నకుల । సహదేవులకుఁ [2]గల్గె సమర మచ్చోట.
భీమ గదా [3]ఘాత పృథుల నిర్ఘాత । వామనీకృత దంతివర పర్వతములు,
నర్జున చండశరాలి మార్తాండ । మార్జిత విమత హిమ ప్రవాహములు,
నకులోగ్ర కరవాల నవ లయకాల । శకలిత సామంత జంతు సంతతియు,
సహదేవ కరశక్తి శాంకరీ శక్తి । నిహత శాత్రవ డాకినీ సహస్రములుఁ
దఱచైన, వెఱవక ధరయు నాకసము । గిరికొన శరవృష్టి ఖేచరుల్ [4]గురిసి
చెఱతోనె యంబరసీమకు నెగయు । తెఱఁ గాత్మఁ దలపోసి దేవేంద్రసుతుఁడు
నాకాశపథమున నస్త్ర పంజరము । భీకరంబుగఁ బన్ని పృథివి నందఱను
మృత్యు [5]జిహ్వాలవంటి మెఱుఁగు బాణముల । నత్యుగ్ర [6]గతినేయ, నరదముల్ విఱిగి
ధనువులు చిద్రుపలై తనువులు చిరిగి । దొనలుఁ గేతనములుఁ [7]దుమురులై పోయి
శిరములు వ్రయ్యలై జీవంబు లెడలి । హరుల డొక్కలు దుల్లి [8]యస్థులు ద్రెళ్ళి
బీభత్సముగ సేన బెదరి పాఱుటయు, । బీభత్సుమీఁదఁ గోపించి ఖేచరుఁడు
మాయాబలంబున [9]మహిఁ గానరాక । యాయత తీవ్రబాణావళి నేయ,
శబ్దభేదులు క్రీడి సంధించి వాని । యబ్దభీషణఘోష మగువిల్లు దునిమి
పావక శరమేయ, భయమునఁ [10]బ్రిదిలి । పోవక గదనది పొడిచేసి వాఁడు
గంధర్వ ఘనసాయకము కార్ముకమున । సంధింప, నది సవ్యసాచి ఖండించి
బాణాగ్ని విశ్వరూపము చూప, నతఁడు । ప్రాణభీతి [11]ని నిల్చి పలికె నెంతేని :
"నిలుపు కయ్యముచాలు నృప, నీకు నాకుఁ । జెలిమి మున్నైనది చింతించి కంటి.
అంగారపర్ణుండ నైయుండి వెనుక । శృంగార [12]నిధి చిత్ర [13]సేనుండ నైతి.
మఱవు లెవ్వరికైన మనుజేంద్ర, [14]కలవు ; । ఎఱుఁగక చేసితి నీ తప్పు [15]సైఁపు.
కొనిపోవుచున్నాఁడఁ గురురాజుఁ బట్టి ; । నను నింకఁ బోనిమ్ము నాకేంద్రుకడకు;
ఆతఁడు మీకుఁ బ్రియుంబుగా నితని । వే తెమ్మనా నిట్లు వెడలి వచ్చితిని.

---

1. నాథసుతు. 2. నయ్యె. 3. హతి. 4. గురియ. 5. జిహ్వయుఁబోలె మెఱయు బాణంబు.
6. ముగ. 7. దునుకలై. 8. హస్తముల్. 9. మతి. (పా. అం.) 10. బ్రతివి. (మూ.) 11. గిరీటిఁ
బలికె నేతెంచి. 12. నిథ. 13. సేనుండుగాని. 14, కలుగు. 15. నోర్వు. (పా. అం.)

వెలితెవు లేటికి? వెలిఁ బోవనిమ్ము; । కలహ మీతఁడు లేక కలుగదు మీకు."
అనినఁ బార్థుఁడుపల్కు: "యమసూతిగాక । ఘనుఁడ, యేనెవ్వాఁడఁ గౌరవుపనికి?
విడిపించఁ గలవాఁడ వీరి నొండెఱుఁగ; । నడుగుము మాయన్న నఖిలంబు నీవ.
ఆరాజు రారాజు నట నీఁడు; నీవు । వేరమ్ము [1]నావెంట వేరమ్ము లిడక.
కని యనుపఁగఁ బొమ్ము కౌరవునిచ్చి." । అని [2]తెచ్చి యర్జునుఁ డతనిఁ గౌరవుల
ధరణీశునకుఁ [3]జూపఁ, దమ్ముని మెచ్చి । పోఁబోరి గంధర్వుఁ బూజించి యతఁడు:
"నడవు మర్త్యులమేము నాకులు మీరు । గాడవలె?" లని వీడుకొలుపుచో, వాఁడు
నచ్చటఁ జెచ్చెర నతనిని విడిచి । యచ్చరల్ వీక్షింప హరి [4]పురి కేఁగి
యెంతయు నిఁద్రుస కెఱిఁగింప, నతఁడు । కౌంతేయు విక్రమ క్రమములు వొగడి,
ధారుణిఁ బడిన గంధర్వ సైన్యముల । భూరి సుధా వర్షమున బ్రదికించి,
'[5]రక్షామ్ము నీ వూరకపోయితి' వనుచు । నమ్మహాగంధర్వు ననుప వాఁడరిగె.

## ధర్మజుఁడు దుర్యోధనుని మందలించి పంపుట

ధాత్రీశుఁడిట సుయోధనుఁజూచి పగచి । "పుత్రమిత్రకళత్రములతోడఁ [6]గూడ
వత్తురె యడవికి వరుసభూపతులు? । ఇత్తెఱంగున వచ్చిరే మున్నయెవ్వ?
వచ్చి గంధర్వుతో వైరంబులెంచి । యచ్చుగాఁ బోరాడి యనిఁ బట్టువడితి;
విట్టివి పలదింక నెన్నఁడు; మగిడి । నెట్టనఁబొ"మ్మని నియతి మన్నించి
యనిచిన, నాత్మలో నఱచావుచచ్చి । తన బలంబులుఁ దాను ధార్తరాష్ట్రుండు
'వాసవాత్మజ, పోయివత్తునా?' యనక, । 'భూసురోత్తములార, పోదునా?' యనక
కట్టిన బిగువునగాత్రంబు నొవ్వఁ । బట్టివీడిన పెద్దపామునుబోలె
నుడుకుచు నటపోయి యొకయేటిచెంత । విడిసి సాయంతన విధులన్నిఁదీర్చి

## దుర్యోధను విషాదము

'నలువ, నన్నిటుసేయ నాయమా!' యనుచుఁ । బలవించి పలవించి పాన్పుపైఁ బొరలి

---

1. నామీఁద వేఱమ్ములిడక. 2. పల్కి గంధర్వునపుడు దోడ్తెచ్చి. 3. జెప్ప. 4. వీథి సెగసి. (పా.)
5. పొమ్మని యూరక పుచ్చితివనుచు. 6. విడిచి – యకట సుయోధన, యాజికినిట్టి – వికృతి వాటిల్లానే విడు మిట్టిపనులు. చెనకఁగ గంధర్వసేనలతోడ మనకుఁబోలునె వట్టి మాత్సర్యమేల–యిట్టివి. ...(ఆదిగ్రా. పా.)

వేఁగినఁ గుశశయ్య [1]విరచించి యందుఁ । జాఁగిలఁబడియున్న సమయంబునందు,
హితులెల్లఁ గొలువున కేతెంచుచోట । నతని దైన్యముఁజూచి యనియెఁ గర్ణుండు :
“ పవ్వళించితివేల ? పయనమ్ముగమ్ము ; । గవ్వంపుఁబోవలయుట తలఁపవా [2]నేఁడు ?
[3]ఆయితమై వచ్చె నఖిలసైన్యములు ; । నేయత్నములకయ్య యాదర్భశయ్య ? ”
అనినఁ గర్ణునిఁ[4]జూచి యాసుయోధనుఁడు : । “నను బిలువకుఁ డింక నడువుఁడుమీరు;
మానహీనంబైన మనికి నాకేల ? । పూనుడు మారాజ్యంబు భూనుతులార !
జగతికి రాజు దుశ్శాసనుఁ జేసి । పగతుల [5]కెడమీక పాలించుకొనుఁడు;
క్రమమొప్ప విదురుతో గాంధారితోడఁ । దమబుద్ధి వినక యీదశ[6]గంటి ననుఁడు;
మ్రొక్కితిననుఁడు భీష్ముఁడు మొదలైన । యక్కడి పెద్దల కాంబికేయునకు ;
ఆవలఁ బులివోలె యమసూతిచూడ । లావేది గంధర్వులకుఁ [7]జెఱదగిలి
పోక కష్టం, [8]బట్టిపోక మెగాదు । నాకేంద్రసుతుఁడఁట ననువిడిపించె !
అపుడ[9]చచ్చితిఁ జాలునంగాధిరాజ ! । విపరీత మీ [10]బుద్ధి విడువదునన్ను. ”
అన నందఱును నేడ్చి ; రంతఁ గర్ణుండు । జననాథునకు మ్రొక్కి శకునియుఁదాను :
“ అయ్య, మీరిట్లేల యానతిచ్చెదరు ? । ఇయ్యర్జునుఁడు భీముఁ డెవ్వరిసొమ్ము ?
మీరాజ్యముననుండి మీ సొమ్ముగుడిచి । పోరామి యొకటిదీర్పుట యేమిపెద్ద !
దాసులుగారె జూదమునఁ బాండవులు ! । నీ సత్త్వమక్కటా నేరవు దెలియ !
లలి నీవు చచ్చిన లావు వైరులకు ; । నిల మేము నిల్చెదమే వెఱ్ఱిరాజ !
వడి నుపాయంబున వచ్చిన రాజ్య । మెడపక [11]నెమ్మది నేలఁగరాదె !
ఇమ్ములఁ [12]బాటింపు మిదియాత్మహత్య ; । తమ్ములు నెత్తుము ధరఁబొరలెదరు.”
అనినఁ గన్నీరొల్క [13]నాతఁ డిట్లనియె : । “ నను నేలబోధింప ? నాకేలబ్రదుకు ?
ఉండుఁడు గొందుఁ బ్రాయోపవేశమ్ము ; । పొండు మీచెప్పినబుద్ధి యేనొల్ల ;
మేదిని నాసిగ్గు మీకేలదెలియు ? । మొదలఁ గావటిఁ బ్రేఁగు మోచువాఁడెఱుఁగు.”
అని కంచుకులచేత నందఱవెడల । ననిపించి, పంచేంద్రియముల నవ్విభుఁడు
ఉసిఁగి [14]పోవఁగనీక యుల్లంబుఁజేర్చి, । [15]పసనగ నుల్లము మేరుపథమునఁజేర్చి,

---

1. వీక్షించి 2. నీవు 3. ఆయత 4. తోడ 5. కెడయీక 6. నుంటి (పా. అం.) 7. బెద్ద 8. బది 9. వచ్చితి 10. బొంది (పా. అం.) 11. యీరీతి 12. బాలింపు 13. నాసుయోధనుఁడు–వనజాప్త సుతుఁజూచి వలనొప్పఁబలికె. మొదలఁ గావడిబర్వమోచువాఁ డెఱుఁగు–వదలక పొండు, ఈవల నుండరాదు. అని కంచుకులచేత. 14. పొఱఁగ 15. పసనియుల్లము. (పా. అం.)

పద్మాసనుఁడు తోడుపడని కాలమునఁ । బద్మాసనంబునఁ బదిలుఁడై నిలిచి,
వాయుజుఁ [1]గట్టినవాఁడు తాఁగాన । వాయువు నాత్మలో వలనొప్పఁగట్టి,
కుండలిఘనపతాకుం డనుపగిదిఁ । గుండలినీశక్తిఁ గొమరొప్పఁదెలిపి,
ఘనచంద్రవంశంబుఁ గఱచినకరణిఁ । దనదైన బ్రహ్మరంధ్రపుఁ జంద్రుఁగఱచి,
డా[2]కొని నిఖిలకంటకుఁ డనుపగిది । భూకాంతుఁ డవయంబులు కంటగించి,
పారవశ్యముఁబొంది పగలెల్లఁబుచ్చి । యారాత్రి యోగనిద్రాసక్తినుండ,

## దైత్యులు దుర్యోధనుని నాగలోకమునకుఁ గొంపోవుట

నాకేంద్రునకుఁ గాక నాగలోకమునఁ । దూకొనియున్న దైత్యులుగూడి యపుడు
'ఇక్కౌరవుఁడు చావ నెవ్వరు దమకు । దిక్కు లే' దని యెల్లదిక్కులయందుఁ
దమ మాయితముచేసి తమమాయచేత । రమణ నొయ్యన ధార్తరాష్ట్రు రప్పించి
తెలిపి పూజించి సుస్థితినాదరించి । పలికిరి : "నీ కిట్లు పాడియే తెగువ ?
హరునకుఁ దపముండి యధిపుఁగా మాకు । వరమున నినుఁ గన్న వారము తొల్లి.
అవ్యయమైన నీయాదిమతనువు । దివ్యదృష్టిఁ గ్రమంబ దృష్టించికొనుము.
తేజో[3]ఘనుండవు ధీరచిత్తుఁడవు । రాజరాజవు భాగ్యరసికుఁడ వీవు."
అనిచెప్పి యతనికి నాపూర్వతనువు । కనుఁగొనఁజేసి రాక్షసులు వెండియును :
"విను మర్త్యవేషులై విహరించు సురలఁ । దునుమఁగదే ! వారు దోలిరి మమ్ము.
చావఁగా నెయ్యది సమకూరు జయము ? । దేవ, నీ జయము సాధింప [4]మాపూఁట.
కౌంతేయు బలమెల్లఁ గనుఁగొన సురలు ; । చింతింప [5]మేమె నీ సేనలన్నియును.
ధర నర్జునుకుఁగదా తలఁకెదవీవు ? । పరఁగఁ గర్ణుఁడు చాలుఁ బార్థు[6]రూపణఁప.
మనుజుఁగాఁడలఁతు రే ! మనకు రాధేయుఁ । డనివార్యజయమిచ్చు నహితులఁ ద్రుంచి.
[7]కృష్ణునితోఁ గూడఁ గీడ్వడ నణకు । నుష్ణాంశు నిభుఁడిందు నున్నాఁడు హెచ్చి.
కవచకుండలములు గల కర్ణుచేత । బవరంబులోపలఁ బార్థు చావెఱిఁగి
వాసవుఁడవి యడుగవచ్చు నక్కర్ణు ; । మోస పోనీకుము మును మున్నె యతని.

1. గట్టెడువాఁడ నేననుచు 2. కొన్నయతుల 3. ధనుండవు 4. నా 5. నేము మీ సేనల మనఘ 6. నాలమున 7. కృష్ణార్జునుల తోడఁ గీడుగాదనుచు – నుష్ణాంశుని భయమందున్నాఁడు చొచ్చి (?) (పా. అం.)

అసురులు సంశప్తకాఖ్యులు నరుని । చేత వేయి కోటులు విఱుపఁ బొల్పడిరి.
దేవవ్రతాదులు దేవతలయ్యు । దేవ, నిన్గూడి సాధింతురు వారి.
ప్రత్యక్ష శిఖి యలంబసుఁడను ఘోర । దైత్యుఁడు నీ కాజిఁ దాఁ దోడువచ్చి
కౌంతేయులను దానె ఖండింతు ననుచుఁ । జింతింపుచున్నాఁడు సిద్ధ మీ పలుకు.
చిత్రసేనునిచేతఁ జిక్కుటంగ నీకు । ధాత్రీశ, కలదొక తపసిశాపంబు.
దానికై చింతింప ధర్మమె ! దైత్య । సేనలు నిను భక్తిఁజేరుట దలఁపు.
కర్ణ దుశ్శాసన గాంధారులుండ । నిర్ణయింప ననేక నృప కృప ద్రోణ
గురుపుత్రు లాదిగా గురుభుజాధికులు । సరి నీ సహాయులై చరియింపుచుండఁ
దనువిట్లు విడుతురే ? దాయలఁ బట్టి । తునుమాడ నొల్లవే ? దుర్వార తేజ !
ధీయుక్తిఁ బో." యని తెలివి పుట్టించి । మాయచేఁ బూర్వ [1]సీమనె వాని నునుపఁ,
గౌరవుండు చెలంగి కన్నులు విచ్చి । వారక రిపుల గెల్వఁగ నాసపుట్టి
'కలవిశేషమొ ! లేక కలి విశేషంబొ ! । తెలియరా' దనునంతఁ దెల్లవాఱుటయు
వచ్చిన దొరలతో వాక్యంబు లేక । యచ్చలంబునఁ దొంటి యట్లనె యుండ,
నంగాంధిపతి పల్కెఁ : "నరుదెమ్మొ దేవ ! । భంగ మొందినవారు పడుదురె యిట్లు !
జూదంబులోఁ బాండుసుతులకు నైన । యా దశ [2]నీకైన నప్పుడేమగుదొ ?
వినుమింక మాటలు వేయు నేమిటికి ! । ఘనుఁడ, నీ ఋణము నీఁగఁగ నాకు వేళ
పాండవు [3]లెన్నఁ డీ పటువనచర్య । నిండించి వత్తురు నిన్ను బొలడుగఁ
[4]బోరెట్లు నగు ; గాని పొంద దేనాఁడు ; । వారక నరుఁ జంపువాఁడ, [5]ప్రతిజ్ఞ."
అనుచు లేనెత్తిన, నతని వాక్యములు । [6]దనుజ వాక్యములకుఁ దార్కాణమైనఁ
గురు [7]రాజు గొబ్బునఁ గుశశయ్యడిగ్గి, । కరమర్థిఁ గర్ణునిఁ గౌఁగిటఁ జేర్చి,
బలములఁ బన్నించి పయనమై వచ్చి । కలువడంబులతో[9]డి కరిపురిఁ జొచ్చె.
[8]ఎడపక భీష్మాదు లిత్తెఱఁ గెల్ల । నడుగుచు నుండుదు రలుగఁ గౌరవుని.

## దుర్యోధనుఁడు వైష్ణవయాగము సేయుట

అంతఁ గౌరవనాథుఁ డాసిగ్గువాయుఁ । గౌంతేయు పగిది యాగము సేయఁగోరి
కర్ణాదులకుఁ జెప్పఁ గర్ణుఁ డిట్లనియె : । "వర్ణింప నీకు నధ్వరమేమి [10]పెద్ద ?

1. సీమకు వాని ననుప 2. యైనను 3. లెన్నఁడే 4. పోరాటమగు 5. నా ప్రతిన. 6. తనకు నెంతయునవి 7. రాజముఖ్యుండు 8. యెడనెడ 9. రలుక 10. దొడ్డు (పా. అం.)

తోడఁగుము రాజపుత్రులఁ బిలిపింపు; । తడయనేటికి విప్రతతిఁ బిలిపింపు;
లాగైన యాగశాలలు గట్టఁ బనుపు; । వేగఁ బాత్రంబులు విరచింపఁ బనుపు.
నేల నాల్గంచుల నీ యాజ్ఞ [1]చెల్ల । రాలు నిచ్చోటికి రమణఁ గప్పములు.
[2]అలయక రాజసూయము గాని సేయ । వలదు నీ." యనుటయు వసుమతీవిభుఁడు
తన పురోహితుతోడఁ దలపోసి చూడ, । విన నిచ్చలాడక విప్రుఁడిట్లనియె :
"అరుల సాధింపక యది సేయరాదు ; । ధరణీశ, పాండునందనులు నీ కరులు.
వారిచేఁ గప్పంబు వలయు నొండేని । ... ... ... ... ... ...
ఇతరుల సాధింప నీవ యోపుదువు । హితవు సెప్పెద నీకు నిదియేల ? వినుము
వైష్ణవ యాగంబు వసుధేశ, గలదు । కృష్ణుఁడు నిది [3]తొల్లి గెలుపుగాఁ జేసె.
మేదినీశులతోడి మెరమెర యిందు । లే దీవు సేయఁ గల్గినఁ జేయు." మనినఁ
గడుయత్నమున జంబుకము దుప్పిఁజూచి । యొడలు గాలిచి కొన్న యోజదీపింప
నాజినోడియు సోమయాజియై ధర్మ । రాజుఁ బోలఁగ రాజరాజాత్మఁ దలఁచి
దిక్కుల రాజుల ద్విజుల రప్పించి । తక్కక సకల యత్నములుఁ జేయించి
'యేతెండు మీ' రని యిటఁ బాండవులకు । దూతఁ బుచ్చిన, వానిఁ గూడ ధర్మజుఁడు :
"ఘనుఁడు కౌరవభర్త క్రతుకర్త [4]యగుట । వినఁగల్గె నిదినాకు వేడ్క యొంగెయును.
ఈ పని కొఱకు నిన్నిట్లేల యనిచె? । మాపూన్కి దీర్పక మాకు రాఁ [5]బగునె?
తా మమ్ము వలసిక దా [6]పిల్వననిపె ; । మా మాఱుగాదె భీష్మ ద్రోణ కృపులు!"
అని వానిననుపుచో ననిలజుండనియె: । "విను దూత, మమ్ము మీవిభుఁడురమ్మనియె;
వనవాస మీడేర్చివచ్చి ధర్మజుఁడు । పనివడి తమునెల్లఁ బశుపిధిఁ జంపి
కరమొప్పఁ జేయు సంగ్రామ యాగమున । కరుదెంతుఁ గాని నేఁ డందురా సనుము."
అని చెప్పి యనుప వాఁడన్నియుఁ బోయి । వినిపించెఁ గౌరవ విభునకుఁ దెలియ.
అంత దీక్షాపూర్వ మగుచున్న క్రతువు । కౌంతేయ రిపుఁడును గడు సంభ్రమమున,
నేక శాసనముగా నిల యేలుచున్న । శ్రీకి యోగ్యంబైన చిహ్నంబుతోడ
రాజసూయ మహాధ్వ [7]రంబె కావలయు । నీ [8]జన్నమనియెడు హృదయంబు దోఁప
నవబృథాంతము [9]సేసె ; నదియు నట్లైన । నవనిపాలకుల బ్రాహ్మణులఁ బూజించి

1. చెల్లి – రాలేని చోటేది 2. నలవడ 3. దొడ్డ 4. యట్టె. 5. రాదు 6. పిలిపించె 7. రము సేయ వలయు 8. జన్నమేరున...తోడ 9. సేయునది యెట్టులనిన. (పా. అం.)

ము త్తేల గొడుగులు [1]మదితలు దాల్ప । మత్తేభములనెక్కి మంత్రులు గొలువఁ
దమ్ములు మెలఁగి సందడి విస్తరిల్వేయ । నమ్మహీవిభుఁడు భార్యాసమేతముగ
రథమెక్కి బహుతూర్య [2]నాదంబు లెసఁగఁ । బృథు పతాకాభి శోభిత పురిఁ జొచ్చి
దిక్కుల రాజుల [3]ద్విజుల వీడ్కొలిపి । యొక్కమనంబుతో నుండె ; నుండియును
రాజసూయము సేయరాదయ్యె ననుచుఁ । దేజంబు పసలేక తెగువయు లేక
యున్నచో, రాధేయుఁ డొకనాఁడు గదిసి : । "జన్నంబు చేసితి జయసిద్ధి [4]కధిప !
రాజసూయంబును రచియింతు గాక । రాజుల ధనములు [5]రా నేను బూఁట ;
పాలాయమునఁ గ్రీడి వధియించి గాని । గోళ్లు దోమింతు కొనఁ జరణముల.
నను నమ్ము మింకనైనను, నమ్ముమోని । ఘనచింత విడు."మన్నఁ గౌరవుండలరె.

## ఇంద్రుఁడు కర్ణుని కవచ కుండలముల నడుగుట

అట్లు వాఁడాడిన యా [6]మాట ధరణిఁ । బుట్టెఁ ; బుట్టిన ధర్మపుత్రుండు వెఱచి
నిద్ర కన్నెఱుఁగక నిత్యంబు వగవ, । నద్రిభేదగు నింద్రుఁ డది తాను నెఱిఁగి
"కవచకుండలములు గల దృష్టిఁగాదె ! । ధవళాశ్వుఁ గర్ణుఁడు తాఁ జంపఁబూనె ;
నవి యేను హరియింతు."నని విచారింప, । రవి యింద్రుతలఁపు సర్వము మున్నె యెఱిఁగి
వర్ణింప విప్రుఁడై వసుధకు డిగ్గి । కర్ణునిఁ గదిసి యేకతమ యిట్లనియె :
"పుత్రక, నీ కొక బుద్ధి యేఁ జెప్ప । నీ త్రోవ వచ్చితి నించుక వినుము.
కవచకుండలములు గలిగిననిన్ను । బవరంబులో గెల్వ బ్రహ్మయు లేఁడు.
అమృత సంభవములౌ యవి గల్గఁగాదె । యమసూతి భీతిల్లు నాత్మలో నీకు.
ఎవ్వేళ నెవ్వఁగి కేస్తును నిత్తు । నెవ్వరి కిచ్చెదో యీ దాఁపురంబు !
ఇచ్చినఁ బతికార్య మిటఁ దప్పు, నిన్ను । మెచ్చరు ప్రజలు స్వామిద్రోహి యనుచు.
తెలియఁ గ్రీడికి నీకుఁ దెంపని పగలు । గలుగుట నింద్రుఁడు కనుభక్తితోడ
సుతరక్షణార్థమై చూఁడుము, నిన్ను । ధృతి నవి యడుగ నేతెంచుచున్నాఁడు.
అడిగిన నేమైన నన్యవస్తువులు । పుడికి పొమ్మనవయ్య పుయిలోట దక్క.
పడిఁ జక్రి చక్రంబు వజ్రి వజ్రంబుఁ । గడు శూలి శూలంబుఁ గాడదు దీన."
అనినఁ గర్ణుఁడు నవ్వి యావిప్రుఁ జూచి : । " విను నన్ను నలఁపక విప్ర, యాడితివి.

---

1. ముదమొప్పఁ బట్ట 2. రవములతోడ 3. దివిజాల ననిచి 4. కీవు 5. రాలెనా 6. వార్త. (పా. అం.)

నాకి యిమ్మనుచుంట! నాకీని దేది ? । ఈ కవచమునసా యేగెల్తు రిపుల ?
ప్రాణమున్నది చాలుఁ బతికార్యమునకు ; । జాణ, యేవిడుతునే జన్మవ్రతంబు !
ఆ శచీదేవి మోహానకుచద్వంద్వ । దేశభాగమున వర్తించు హస్తంబు
క్రిందుగా నన్నడిగినఁ జాలుఁగాక । యిందు నే నస్తువు నీరాని దేది ?
నెఱి నింద్రుతలఁపు నీ వెఱ్ఱిఱిఁగితివి ? । మఱి నిన్ను జెప్పుమా మఱుఁగులు మాని.”
అనిన “సూర్యుండనే నాప్తంబు చెప్పఁ । దనయ, యేతెంచితిఁ దలఁకొనవైతి.
పాండవులకు నీవు పరమబంధుఁడవు ; । ఒండేల ! ధర యేల యోగ్యుండ వీవు.
దేవరహస్యంబు దెలిపెద నొకటి । యేవెంట వలదని యేఁ జెప్పఁ గాని”
అని తండ్రివలుక నిట్లనియెఁ గర్ణుండు : । “వినిపించె నిది మున్ను వేడ్క వ్యాసుండు ;
ఇంక నెక్కడిగొంతి ! యెక్కడినీవు ! । శంకించుఁ బ్రజ లిట్టి జననంబు విన్న.
నాకుఁ గౌరవుని మన్నన యప్పుదీర్పఁ । గాక యీ జన్మంబుగలదె యొక్కటికి !
నన్నేల ధర్మజునకు నెఱిఁగింతు ? । మిన్నక పో.”మ్మన్న మిహిరుండు మఱియు :
“ అట్లైన విను, ప్రాణమని డాఁచికొనిన । యట్టిది యొకశక్తి హరిచేతఁ గలదు ;
నలిఁ బిన్నపనిగాదు నరుతోడి రణము ; । వలయు నీకిట్టి దుర్వారసాధనము.
దివిజేంద్రుఁ డర్థియై దీనతఁ గదిసి । కవచకుండలములు కర్ణ, నిన్నడుగ
నాశక్తి మున్ను నీవడిగి హరించి । థీశక్తి మఱికాని తివియకు వీని.”
అని చెప్పి కొడుకుచే నర్చితుండగుచు । నినుఁడేఁగె. మఱి యింద్రుఁ డిట నొక్కనాఁడు
‘ధనవంతులకునైన దాతలఁ గనిన । మనసు యాచకవృత్తి మరగు’ నన్నట్లు
వర్ణింప విప్రుఁడై వసుధకు డిగ్గి । కర్ణునిఁ గదిసి ‘ భిక్షాం దేహి ’ యనుచుఁ,
“ బంతంబుతోడఁ గల్పక కామధేను । చింతామణులను గెల్చినదాత, రాయ,
కర్ణ, విద్యాకలా[1]కలిత దృక్కర్ణ । వర్ణితశౌర్య, నా[2]వాంఛితంబిమ్ము.
శిబిదధీచులతోడఁ [3]జెప్పనీడైన । ప్రబలితోదార, సౌభాగ్యంబు నీకు.
అడుగవచ్చితిమి మా యడిగిన కోర్కి । పుడికి పోమ్మనవయ్య పురుషార్థధుర్య !
ఇమ్మహిలోన ‘దేహీ’ యన్న ‘నాస్తి । పో’మ్మన నేరని ఘనుండ.” వనిన,
నప్పటి జపవేళ నంగాధిరాజు । తప్ప కింద్రునిఁ జూచి తాత్పర్యమొప్ప :
“ ఏమిగావలెనీకు ? హేమమో ? స్త్రీలో ? । గ్రామంబులో ? పశుగణమో ? రత్నములో ?

1. కర్ణ 2. వాంచ్ఛితజమ్ము 3. జివ్వనిడైన (మూ.)

యిచ్చెద." నన నింద్రుఁడు: "ఇవి యేల నాకు ! । వచ్చితి నీరాని వస్తువుల్ గోరి.
అడిగిన వారుకే రట్టిని మున్న ; । పుడికిన వారును బుట్టరెచ్చటను;
నెలకొని రణములో నిలవచ్చుఁగాక, । నిలుపవచ్చునె యర్థి నిలిచి వేఁడినను!
అడుగ నేటికి ! నిను యడుగువారైన । నడుగువారలఁ గన్న నవశుఁడా దాత.
అర్థులయెడఁ బ్రత్యర్థులయెడల । నర్థి భయంబులేదంద్రు నిచ్చోట.
అనవరతత్యాగి వటుగాన నిన్నుఁ । బనివడి యడుగఁగఁ బ్రభువ, వచ్చితిని.
ఇవి నీవు ఫలియింప నే వేడ్క పడితిఁ । గవచకుండలములు కర్ణ, యీవయ్య !"
అనిన నింద్రుండని యాత్మఁ గర్ణుఁ డెఱిఁగి । ఘనతర త్రిజగదేక త్యాగిగాన
'నితని నారాధింప నేఁగంటి' ననుచు । మతి నుబ్బియును దంద్రిమాటకు డగ్గి,
యావేళఁ దనువునప్పి యర్జునాస్త్రములు । త్రోవయిమ్మనులాగు దోఁపఁ జింతించి,
నిక్కృతి కానఁగనీక నెనఁటల్కె నతని: । "అకట! యేమడిగితి వడుగఁగఁబోయి!
విఱిచియుఁ జించియు విరియఁ గోసియును । నఱికియుఁగాని మిన్నకపుచ్చరాదు.
ఇచ్చియుఁ గొఱగాని యివి నీకు నేల? । అచ్చుగాఁ గొను మిత్తు నంగరాజ్యంబు."
అన విని దేవేంద్రుఁ: "అది మాకు నేల? । నిను నడిగినసొమ్ము నీవిత్తుగాక.
ఈకఁ బ్రోవఁగఁ జెప్ప మేఁగెద." ననినఁ । బాకశాసను నొడఁ బలుచఁగ రాక
యీ నిడుబడి కర్ణుఁ డింద్రుఁ నర్పించి: । "యే నిన్ను నెఱిఁగితి నింద్రుఁగా మున్నె
భువన పూజ్యుని నిన్నుఁ బూజింపఁగంటి. । కవచకుండలములు గణుతింపఁగాని
నిన్నొండు వేడెద, నీచేతిశక్తి । మన్నించి నాకిమ్ము మఱి పనిగలదు."
అనిన నట్టయు నింద్రుఁడాత్మలో నెఱిఁగి । "నను నీకుఁ జెప్పెనే నలినబాంధవుఁడు!
తా నేలనీ గెల్చెఁ దనపని విడిచి । యే నిన్ను నడుగుట యెవ్వరికీర్తి!
శక్తియు నడిగించె ; సాధ్యుఁడా నింక । నక్తంచరారాతి నరుఁ డెన్ని విధుల.
ఈ వడిగితి గాన నీకపోఁ నేర ; । నేవెంట నొచ్చునో యిటఁ గ్రీడి యకట !
కో." మ్మని మోఱుఁగులు కుతలంబు [1]మిన్నుఁ । గ్రమ్మిన తనశక్తి కర్ణునకిచ్చి
కాంతియు నశనికి ఘనముగా నొసఁగ, । సంతోషమునలేచి సర్వాంకునఖుఁడు
గరిమ మాయాకంచుకము తొఁగి యూడ్చు । కరణిఁ జర్మము నిర్వికారుఁడై యొలిచి,
యొలువ శక్యముగాని యొక్కొక్క చోటఁ । గులిశధారలఁ గోసి కొండొక పుచ్చి,

---

1. నిన్ను (మూ.)

ఇతర వధూటిగా నిల్లాల [1]నేను ; । మతి నింత దలఁపరో ! [2]మత్తులైనారొ !
మేదినీశులు వచ్చి మిమ్ముఁ బూజింపఁ । బోదురుగాని నిల్వఁడు సేనలెల్ల.”
అనుడు వాఁడే తెంచి యన్నియుఁ జెప్ప । మనసిజాక్రాంతుఁడై మఱియు సైంధవుఁడు
“ఏనుండఁ దన [3]కెవ్వఁ డేనన్నైన మగఁడు ? । కానదు తన కేల కానల నలయు ?
హితముగా [4]నన్నియు నెఱిఁగింత.” మనుచుఁ । [5]గతిపయ సుభట సంకలితుఁడై వచ్చి
వెఱవున నిల్లు ప్రవేశించియున్న । తెఱవ డగ్గఱి చూచి దృష్టి గంపింప :
“మదిరాక్షి, కుశలమే మగలకు నీకు ? । నిదియేమి ననుజూడ వించుకనైన !
సౌవీరపతిని వంశముఁ జేరుఁ బెద్ద । దేవదానవులతోఁ దెమలఁ గయ్యమున.
కొనిపోవ వచ్చితిఁ [6]గోమలి, నిన్ను ; । ననుఁ గృతార్థునిఁ జేయ న్యాయంబు నీకు.
కౌరవదాసులు కౌంతేయు [7]లేల ? । యే రమణుఁడ నీకు నే తెమ్ము కూడి.
అబల, నీ హస్తపాదాధరచ్ఛాయ । ప్రబల కామాగ్నియై పర్వె నాలోన.”
నా విని యొక్కింత నలినాక్షి [8]తొలఁగి । వావిరి వాని నేవపుఁ జూపు చూచి :
“దుశ్శల పతివి నాతోఁబుట్టు వీవు ; । దుశ్శీలముల కేల దొడఁగెదు తండ్రి !
నవసియుఁ బొలిసియు నా ప్రాణవిభులు । [9]దివిజేంద్రునైన సాధింప నోపుదురు.
నృపులు భూమికి వారు నీ కల్మియెంత ! । చపలోక్తులాడి దోషము గట్టుకొనకు ;
పో వన్న వేడెద ! పోయిరి విభులు ; । త్రోవ నిన్నిపుడ యెదుర్తురో యెఱుఁగఁ
గ్రమముగా.” దనుటయు గర్వించి వాఁడు : । “రమణి, వావులు లేవు రాచవారికిని ;
భామినీరత్నంబు బలియుని సొమ్ము ; । కామాగ్ని సాక్షిగాఁ గైకొందు నిన్ను.
నెలఁత, నీ విభు లేమి నిటలలోచనులె ! । వలసి సైంధవు నోర్వ వా రేమి గలరు ?
నలినాక్షి, నీకుఁగా నా ప్రాణమైనఁ । గలఁగక వెచ్చింతుఁ [10]గాని నివ్విడువ.
పడఁతుక, నీతోడి పరిచర్యలేక । జడిగొన్న మదనాగ్ని శమియింపలేను (?)
నాతి, నీ యాలింగనము లేకయున్న । బ్రాఁతి నా ప్రాణంబుఁ బట్టంగరాదు ;
ఇంతి, నీసంగమం బిపుడు లేకున్నఁ । జింత లేకుండునే సింధువల్లభుఁడు !
రారాజు చెలియలు రాజబింబాస్య । వారిజనేత్ర యౌవనవతియైన
దుశ్శలవచ్చి నీతోఁ బొందు నేయ । నిశ్శంకనుండుట నీ యొప్పుగాదె !

1. గాని 2. మత్తులో మీరు 3. కెవ్వరిడైన విభుఁడు 4. నెంతయు 5. నతివేగమునఁబోయి యా జయద్రథుఁడు 6. గోరితి 7. లెల్ల 8. తలఁకి 9. దివిజులనైన సాధింతురు కడిమి 10. గానిన్ను విడువ. పా. అం.

మెలపున నీవేల మెత్తగానేర్తు ? । పలుకుల నీవేల పరుసఁగైకొందు ?”
వని కొంగుపట్టిన, నతివ వాపోయి । వినయదూరుని వానిఁద్రోసినఁ ద్రెళ్ళె.
... ... ... అంతలో ధౌమ్యుఁ । డెనయ డగ్గఱివచ్చి యెలుఁగెత్తిపలికె :
“వలదు సైంధవ, నీవు పట్టి గర్వమునఁ । జెలియలిఁ[1]జేనంట శీలంబువదలి.
పాండవుల్ వనవాసబాధచే నలసి । యుండుచున్నారు నెమ్మనముల నిప్పుడు.
నిన్ను నీ సేనల నీఱుగావింప । నున్నవారిక నెందు నుసిఁగి పోయెదవు ?
రమణిఁ బతివ్రతారత్నంబు నివుడు । నమలిన నిప్పు ముట్టంగక యంటవశమె !
సొలసి రాముఁడు లేనిచో సీతఁబట్టి । పొలిసిన దశకంఠుఁబోల నీకేల ?
మిన్నక పొ.” మ్మన్న మీసంబులదర । నన్నీచు బ్రాహ్మణునటఁద్రోయఁబనిచి
పరమ పతివ్రతఁ బాంచాలిఁదెచ్చి । కరము వేగంబున గర్వాంధుఁడగుచు
హాహారవంబు సేయఁగఁ దేరిమీఁద । సాహసంబునఁబెట్టి సరగున నరుగ
సుదతి యేడ్చుచుఁబల్కె : “శుద్ధ దురాత్మ ! । యిదినీకు సంహార, మేల క్రొవ్వితివి ?
వత్తురింతకుఁ బాండువసుధేశసుతులు ; । కొత్తగా నినుఁ గాలఁ గ్రుమ్మనున్నారు.”
అని కాంత యెలుఁగెత్తి : “హా నాథులార ! । నను నొంటినిడిపోవ నాయమామీకు !
కడువేగ నేతెంచి కష్టాత్ముఁద్రుంచి । విడిపించరే ! చెఱ విమలాత్ములార !
కర్మసాక్షివి సూర్య, కడఁగి నీవైన । ధర్మసూనునకు నాదశ చెప్పవయ్య !
కుంభినీపతు లనేకులు వచ్చినారు । సంభవమయ్యెఁ గష్టము మాన్పరయ్య !
ఆడుతోఁబుట్టరే యకట ! మీరెందు ; । వీఁడిట్లు కొనిపోవ వీక్షింపకున్నఁ
బలువురు పలువంకఁబాఱి బ్రాహ్మణులు । తెలుపరొకో ! నాదుదీనత పతికి ;
వనపక్షులార ! యో వరమానులార ! । చనిమీరు నాపాటు చాటరె ! పతికి.
వాయువ ! నాప్రాణవాయువ ! నీవు । వాయునందనుతోడ వడిఁజెప్పవయ్య !
సురలార ! మీరైన సురిఁగి యీ వార్త । సురరాజ సుతునకు సూచించరయ్య !
మృగహత్య మాన్పింతు మృగకోటులార ! । జగతీశులకుఁ బోయి సరిఁజెప్పఁదగదె !
యతులెందుఁబోయిరో ! యగ్నిహోత్రముల । వ్రతులెందుఁబోయిరో ! వనవిహారములఁ
జెలులేమిచేసిరో ! చింతచేనిట్టి । బలుతరంబగు నశుభ ప్రాప్తియయ్యె.
అని పెక్కుభంగుల నార్తనాదముల । వనితసేయుచుఁబోవ వగచిరి సురలు ;
కామ్యకవనమెల్లఁ గడుఁబెల్లగిల్ల । ధౌమ్యుఁడు వెనువెంటఁదగిలెఁ గుయ్యిడుచు.

---

1. జెనట్టి. (మూ)

అటఁ బాండవులు వేఁటలాడి చాలించి । కుటిలాటవులఁ బ్రొద్దుగ్రుంకకమున్న
తడయకవచ్చుచో ధర్మరా జనియె : । "ఎడమకన్నదరెడు నేమొకో [1]కాని !
ఊటాడఁబనియేమి యుల్లంబు ధృతియు ! । [2]వేఁటాడ సతి నొంటి విడిచివచ్చితిమి.
సైన్యరేణువులేల చదలఁ[3]బెల్లగసె ! । శూన్యభావంబేల సోఁకె నీయడవి !
దైత్యులందఱుఁబగ, తలఁపఁ గౌరవులు । నిత్యంబు మనయునికి వెదకుచుండుదురు.
ఇదె చేరితిమి కాంత యెదురుగారాదు ; । చదురైన వేదఘోషము వినరాదు ;
మన పర్ణశాలలో మదిరాక్షి లేమి । గనుపట్టె ; నేమివాక్యము పుట్టఁగలదో !"
అని తలఁకుచుఁబోవ నారథధ్వనులు । విని యెదురుగఁబాఱి [4]వేసలివీడ
ద్రౌపది నెచ్చెలి [5]ధాత్రేయి పలికె : । "ఈపాటఁ బోదురే ! [6]యేగురు విడిచి ;
అతివ జయద్రథుండను సింధురాజు । ధృతిఁగొనిపోయెఁ దేరిపై వాఁడె.
వే చన ధౌమ్యుండు వెంటఁ గూయిడుచు । నీచుని బలమైన నేలకు ద్రేఁగు.
అలయక తడయక యాట వానిఁజంపి । యెలమి సఖీభిక్ష యిడరయ్యనాకు."

## పాండవులు ద్రౌపది విడిపించి సైంధవుఁ బరిభవించుట

అనుటయు నలిగి [7]పంచాగ్నులై మండి । యనిల వేగంబున నధిపులేవురును
అరుణిని గ్రుంకున కఱజాముగలుగ । నరిరాజసైన్యంబు నాదటఁగూడి
సింహనాదంబులు సేయ [8]సౌవీర । సింహుఁడు తనసేన చెదరిపోనీక
తిరిగి కౌంతేయుల దృష్టించి నిలిచి । "తరుణి, వీరెవ్వరు తగిలివచ్చెదరు ?
శింజినీ[9]టంకృతి క్షితిప్రక్కలింప । రంజిల్లుచున్నారు రథములమీఁద ;
పడగలు గొడుగులు భావింపఁ గొంతి । కొడుకుల [10]కరణి నేగురుఁ గాననైరి.
ఏనని యెఱుఁగ; రిక్లెట్టిఁగిన నాదు । సేనపై వత్తురే ? సేనపెంపెఱిఁగి.
ఇందు ధర్మజుఁ డెవ్వఁ ? డెవ్వఁడు భీముఁ ? । డిందువదన, క్రీడి యెటువంటివాఁ డొ ?
కవలెవ్వ ? రెఱిఁగింపు క్రమముతో." ననిన । యువతి కాంతులఁ[11]గన్న యుబ్బునఁబలికె :
"వదియాఱువన్నియ బంగారుచాయ । వదలని తగుపాటి వట్రువ తనువుఁ,
గరుణతో విరులనుగన్న కందోయి, । దరహాసవదనంబు, ధైర్యలక్షణము,

---

1. నాకు 2. వేఁటకై 3. బిట్టెగసె 4. వేగంబెకదిసి 5. ధాత్రీశుకనియె 6. యెవ్వరు 7. పంచాగ్నులువోలె 8. నా 9. ధ్వనితోడ 10. గతిని 11. జూచి. పా. అం.

నున్నతవక్షంబు, నురు [1]బాహుయుగముఁ । జెన్నొందు [2]వానిఁ జూచితె! ధర్మ[3]తనయు.
అతనికి [4]వలపట నతిదీర్ఘదేహు । సితపీతలోహితు జితవజ్రవక్షు
సాలమహాబాహు శైలేంద్ర [5]కఠిను । గాలికుమారునిఁ గంటివే భీము !
నృపతి [6]దాపటిచాయ నీలమేఘమున । కుపమయై గాండీవ మొప్పఁధరించి
శిరసున నింద్రుఁడిచ్చిన కిరీటంబు । ఖరకర కాంతిచేఁ గరముశోభిల్ల
నీమీఁది కినుక శోణితనేత్రుఁడైన । యీ మహేంద్రతనూజు నర్జునుఁజూడు.
ఆ మువ్వురకు వెన్క [7]నత్యంత రక్త । కోమలతనువు[8] లోకుల చూడ్కులాఁగ
నాజాను భుజవిశాలాక్ష సౌభాగ్య । మీ జగంబునఁ దనకేక [9]భోగముగ
సకలదిక్కుల గెల్వఁజాలిన [10]యోధు । నకులునిఁ జూడుము నయనంబులలర.
లీల నాతనివెంట లేఁతప్రాయమున । [11]నీలాంబువాహ వర్ణితదేహమమర,
గ్రైవేయకముఁదాల్చి కందర్పకోటి । లావణ్యమున [12]వనలతలైన వలవ,
ఘనత రాక్షసలంకఁ గప్పంబు గొన్న । యనఘుని సహదేవు నదె చూచుకొనుము.
వీరితోఁ బగగొంటి విపినమధ్యమున । [13]వీరులు విడుతురే! వెజ్జి [14]నీకింకఁ
దలఁప దిక్కెవ్వరు? 'ధరనాలపోతుఁ । బులిగఱచిన యట్టిపోల్కి' యయ్యెడినో !
శరణని యట పొమ్ము శమననందనుఁడు । కరుణాబ్ధి నినుజూచి కాచి పోవిడుచు."
[15]అనిన 'నిప్పన కీఁగలంటునే!' యనుచుఁ । దననేన నతఁడు యుద్ధమునకుఁ బన్ని,
నదుల ప్రవాహంబునకుఁ బూఁటిమోపు । లెదురఁ బన్నినవాని నెంతయుఁబోలి
యున్నచోఁ, ద్రోవధౌమ్యునిఁగాంచి[16]మ్రొక్కి । యన్నరేంద్రులు వచ్చియరిసేనఁదాఁకి
పరబాణ నిజబాణ పటుఘట్టనాగ్ని । [17]శిరములుదూఱ నంచితశక్తి నేసి,
సింధు త్రిగర్తలసేన చెండాడి, । బంధుర సౌవీరబలము [18]నుక్కణఁచి
రథనేమి వివిధ మార్గములకుఁగాక । పృథివి జర్ఝరితమై పెల్లలైనెగయ,
శిబిసేన నిక్ష్వాకుసేనఁ జక్కాడి । ప్రబల సృంజయ సాల్వబలము భంగించి,
శరలూన ఖేచర శాత్రవచ్ఛత్ర । సురుచిర మణిపంక్తి సురలుచూరాడ,
రూపింప గజహయారూఢులై తాఁకు । భూపాలతనయుల భూమిపై వ్రాల్చి,

---

1. భుజా 2. నతఁడు 3. సుతుఁడు, 4. నీవల 5. కలితు 6. దాపలివంక 7. హరినీల 8. తో గుణ రవంబొప్ప 9. రూప 10. వాని 11. నీలమేఘైకనిర్మిత 12. మృగీలతలైనవగవ 13. వీరుపోనిత్తురే 14. నిన్నింక 15. ననుటయు నను భీతియంటునే 16. నిలిచి 17. కిరవగుధూమలక్షితశక్తినేసి 18. నుగ్గడఁచి. (పా.అం.)

ఘోర భైరవ పానగోష్ఠీ ప్రదేశ । సారూప్య రక్తమాంసస్థలం బమరఁ,
దఱచైన గుజ్జుపుదళముఁ గాల్బలము । [1]మెఱయు వహ్నికి వ్రాలు మిడుతలఁజేసి,
యుగపదార్భట గర్భ యోధసందర్భ । విగళిత బ్రహ్మాండ విధముఁ గైకొనక,
ఎదురు చింతింపక యెక్కు కాల్బలము । నదలించి శరవహ్ని కాహుతిచేసి,
'దొరకెఁగదా కొంత దురములో మనకు । నరిమృగంబుల వేఁట' యని సంతసిలిరి.
అత్తఱిఁ గరిఘట లఱువదివేలు । క్రొత్తగాఁ దనుగొల్వఁ గోటికాస్యుండు
భీకరగతి వచ్చి భీమునిఁ దాఁక, । నా కరువలిపట్టి యరదంబు డిగ్గి
కదిసి తా బంగారుకట్టుల యుక్కు । గదగొని లయకాలకాలుఁడై పేర్చి
చఱచెఁ గొన్నిటి, నేలఁజమిరెఁగొన్నింటి,। మెఱిమెఁగొన్నిటిఁ, ద్రెవ్వమెదిపెఁగొన్నింటిఁ,
దఱిమెఁ గొన్నిటిఁగాలఁదాఁచెఁ గొన్నింటి।నుఱిమెఁ గొన్నిటిఁ, జావనొక్కెఁగొన్నింటి.
అంత ఘీంకారంబు [2]లడర నాఘోర । దంతియూథమువివ్వఁ, దనయెట్టయెదురఁ
గోటికాస్యుండున్నఁ గోపించి యతని । కోటీరమూర్ధంబు గునికిలఁ వ్రేసి
పాఱ వైచుటయు, నపార వైచిత్రి । మీఱఁ గీర్తించిరి మింటివా రతని.
మారుతి కావేళ మఱి గొనిపోయి । సారథి రథమీయ నమ్మతి నెక్కె.
పరసఁ బన్నిరువురు [3]సౌవీరులంతఁ । గరులతోఁ బాండవాగ్రజు వచ్చి తాఁకి
శూలాయుధంబులు సోనగాఁ గురియ, । వాలంప జడి వడి వారి వారించి
హీర చక్రమున [4]సౌవీరుల తలలు । కౌరవాగ్రణి ద్రుంచెఁ గవ్వడి యార్వ.
సింధురాజ కుమార సింహుల రుధిర । సింధుపానము సేసె జిష్ణు బాణాగ్ని.
ఇట నార్చి శిబిపతు లిక్ష్వాకుపతులుఁ । బటులీల నకులునిపైఁ దూపులేసి
యతని నారాచ మహావృష్టివలన । జతనంబు లెడలుచోఁ జయ్యన నందు
క్షేమంకరుఁడు ద్రెళ్ళె ; సృంజయుఁ డీల్గె ; । భూమి వ్రాలిరి సుప్రబుద్ధ సుప్తకులు ;
కూలి రంగారక కుంజర భ్రమరు ; । లాలోనఁ బాఱిరి హతశేషు లులికి.
ధృతి సంగరము సహదేవుతోఁ జేసి । మృతుఁడయ్యె సురథుఁడు మిహిరప్రతాపి.
ఈ భంగిఁ దనపెండ్లి కేతెంచు బలము । భూభుజులును పీటిఁ బోవ సైంధవుఁడు
పగిలి [5]యుర్వరమీఁదఁ బాంచాలి డించి । తగిలి రథ్యంబులఁ దాఁ దోలికొనుచుఁ

---

1. నరిలేక శరవహ్ని కాహుతిచేసి 2. లద్రుబు నింప 3. సద్వీరు 4. పన్నిరువుర
౫. యంతట వేగ. (పా. అం.)

బఱచుచోఁ, గని నవ్వి పావనిసరులు । తెఱవ [1]నంతకనూతి తేరిపైఁ బెట్టి
నృపున కాతనిఁ జూపి : "నీచుఁడు వీఁడె । చపలుఁడై పాఱెడిఁ [2]జంపి రావలయు ;
ఇప్పు డిర్వురుఁ బోదు మిటనుండుఁ డీరు ; । తప్పఁగార్యము వాఁడు [3]తప్పిన మనకు."
అని చెప్పి కదల నయ్యమతనూభవుఁడు । "చనదు వధింప దుస్సలపతి వాఁడు
పట్టితెం." డనుటయుఁ [4]బవనజపార్థు । లట్టిరయాజ్ఞ వహించి యటఁ గూడ ముట్టి
యిరుసులు దెగనేయు, సిలఁ దేరు విఱిగె, । ధరణికి నా జయద్రథుఁ డొప్ప దాఁటి
పౌద దూఱఁబోయినఁ, బోనీక భీముఁ । డదయుఁడై రథము చయ్యన డిగ్గ నుఱికి
మొగసి ముందలపట్టి యీడ్చి యా ద్రోహిఁ । దగఁ గాలఁగేల నెంతయు సత్కరించి
చాలు నింతట నని చంపక యంప । కోల కేవులు వాఱ గొఱిగెఁ దచ్ఛిరము.
గొఱిగి వెండియు నాల్కగోయఁబో నాజ్ఞ । నెఱిఁగించి వారించె నింద్ర నందనుఁడు.
'ధరలోనఁ బాండవ దాసనామమునఁ । జరియింపు సైంధవ, చంప ని.' న్నవిన
వాఁ డొడఁబడె ; నంత వాని బంధించి । పోఁడిగా నని లేంద్ర పుత్త్రులు దెచ్చి
ద్రోవది పాద పద్మములపై వైచి । యా వేళ గేలిచేసంత నవ్వుచును
'పాండవదాసునిఁ బరికింపు' డనుచుఁ । బాండవాగ్రజునకు భక్తిఁ జూపుటయుఁ,
'దడయక పాండవ దాసుండ నేను । విడుఁ.' డను సైంధవు విడిపించి నృపుఁడు
పోనఁగఁ గట్టఁగనిచ్చి బుద్ధులు చెప్పి । ముసిముసి నవ్వులు మొలవ వీడ్కొలిపి,
తరలాక్షి గొనికూడ ధౌమ్యుఁడుఁ దాము । మరలి యావాససీమకు వచ్చి యందు
ఘన పుణ్యకథలు మార్కండేయ మౌని । వినిపింప నుండిరి విశ్రాంతి మెఱసి.

## పాండవులు విప్రునరణిఁ దేఁబోవుట

ఆ దినంబులలోన నట వారికడకు । భూదేవుఁ డొక్క తపోనిధి వచ్చి
యార్తనాదంబుతో నప్పు డిట్లనియె : । "కీర్తి లక్షణులార ! కృతపుణ్యులార !
యుపకార మొకటి నా కొనరింపరయ్య ! । జపవేళ నొక్క మోసము సంభవించెఁ ;
గిమలాకరము పొంతఁ గాంతారభూమి । సమకొన్న యొక చెట్టు (శాఖ) పైని పుడు
అగ్నిహోత్రముతోడి యరణిఁ దగిల్చి । మగ్నమైన తపస్సమాధి నుండఁగను
హరిణపోతక మొక టచటికి వచ్చి । దుర దుర నా చెట్టుతోడఁ గోరాడి

1. నంతటఁ జూచి 2. జడిపి 3. తప్పిపోయినను 4. పరగనప్పార్థు. పా. అం.

యనువేది కొమ్ముల నరణిఁ గదల్చి । కొని పాఱుచున్నది కుటిలవేగమున.
కూడఁ బాఱఁగఁ బోయి గుండెలు గలఁగి । జాడమైఁ బోలేక చనుదెంచి తిటకు.
అడరు నిదాఘ మధ్యాహ్న తాపమున । వెడలరా దనక యీ వేళనె పోయి
క్రమమున నాల్గువంకల నడ్డగించి । రమణఁ బరోపకారము సేయరయ్య !"
అనిన నేవురు లేచి యస్త్రకోదండ । సునిహితోత్సాహులై సారిదిఁ బాండవులు
అరణి వోయినమార్గ మవనీసురేంద్రుఁ । డరసి చూప నెఱింగి యతని నందునిచి
మృగము వెంటనె పోవ, మేటియై యదియుఁ । దగులక ఘోరకాంతార మధ్యమున
వీరుల నలయించి వెనువెంటఁ ద్రిప్పి । చేరినట్లనె యుండి చిక్కక సురిఁగి
యలసినట్లనె యుండి యవనికి దాఁటి, । చెలువేది గిరిగుహాసీమముల్ గడచి,
తనకల్గి యస్త్రసంధానంబు సేయఁ । గని యదృశ్యంబయ్యెఁ గను బ్రామినట్లు.
అరణిఁ గైకొని పోవు హరిణపోతంబుఁ । బరికింపలేక భూపాలరత్నములు
కప్పినయెండచేఁ గమలి దేహములు । దప్పిచే నలసి కొండలవెంటఁ దిరిగి
యుదకంబు గానక యొక చెట్టునీడ । ముదమొప్ప నిలిచి తమ్ములఁ జూచి విభుఁడు
కటకటపడి: "యెందుఁ గలవొకో జలము? । లిటవచ్చి బడలి మే మేమిసేయుదుము !
వాడి పండ్రెండేండ్ల వనవాస భరము । నేఁడ తోఁచె నిదాఘనిబిడ తాపమున,
సారిది నీ మ్రానెక్కి చూడుమా భీమ ! । సరసైన జలమైన సంధిల్లఁ గలదొ !
యేనైన డస్సితి నింకేలవాంఛ ! । యూని ప్రాణమునిల్వ దుదకంబు లేక."
అనుచుఁ గూర్చుండిన, ననిలసంభవుఁడు । మనసులో వగచుచు మ్రానెక్కి చూచి
క్రోశమాత్రంబునఁ గొలను వీక్షించి । యాశతో సహదేవు నపు డిట్లు పలికె :

## సహదేవాదులు మూర్ఛితు లగుట

"తమ్ముఁడ, నీ వేగి తగ డప్పిదీఱఁ । గమ్మని జలమాని కమలపత్రముల
నుదకంబు దెచ్చి మమ్ములను రక్షింపు । కదలలే." నని నా ఘనుఁడు వేఁ బోయి
సరసిలోనికి డిగ్గి జలము చేఁబట్టి । యరుదారఁ గ్రోలెదునంతమాత్రమున
వినవచ్చె నొకమాట : "విభుఁడ, నీవేల । మునుమున్నె నిర్మలాంబువులు గ్రోలెదవు!
మమత నేఁజేయు ధర్మప్రశ్నములకు । నమర నుత్తరమిచ్చి యవి గ్రోలరాదె !"
అనిన : "నెక్కడి మాట ? యటువంటి ధర్మ । జనిత సూక్ష్మవిచార సరణి మాకెల్లఁ

దెలియునే ?" యని తీవ్రతృష్ణ నజ్జలము । నలువొందఁ గ్రోలి యన్నకులానుజుండు
వసుమతి వివశుఁడై వ్రాలుచో, నిచట । వసుధేశుఁ డడలుచు వాతెఱ యెండ
నకులుఁ గన్గొని : "పోయి నా తమ్ముఁడేమి । టికి రాక యందునుండెనో ! విచారింపు.
జలము నీవును గ్రోలి జలములు మాకుఁ । గలిగింపు." మనవుడు గడువేగ మతఁడు
సరసి చెంగటికేఁగి సహదేవుఁడున్న । సరణి గన్గొని బుద్ధి సంతసింపకను
దూలుచు దప్పిఁ గుత్తుకయెండి జలము । గ్రోలి ప్రాణము నిల్పుకొన విచారించి
నీటికిఁ గదియ, మున్నిటియట్ల వాణి : । "ఏటికిఁ గ్రోలెద వీ పుణ్యజలము ?
సరవి నా ప్రశ్నకు జాత్యుత్తరంబు । లెఱిఁగించి గ్రోలరాదే బుద్ధిగలిగి !"
నా విని నలుదిక్కు నకులుండు చూచి । యేవంక నెవ్వని నీక్షింప లేక :
'గిరిగుహారావ మీక్రియఁ బల్కునోవు । మఱి చూచుకొందుఁ గ్రమ్మఱఁ బల్కెనేని.'
అని జలంబులుగ్రోలి యనుజుని యట్ల । ఘనమూర్ఛనొంది యక్కడ వ్రాలె నతఁడు.
అతని రాకయు నిట్లరుదైనచో ధర్మ । సుతుఁడు కుందుచు నింద్రజుని దిక్కుచూచి :
"జలము దెచ్చెదనంచు సహదేవుఁడరిగె ; । నలినాకరమునకు నకులుండు నరిగె ;
తడవయ్యె రారైరి తమ్ములు నట్టి । మడుఁగులో గ్రాహంబు మడుఁచుచున్నదియో !
పోవయ్య యమ్మహాభుజుల పొందరసి । తేవయ్య జలములు తృష్ణ హెచ్చినది."
అనుటయు నతఁడేఁగి యా సరోవరము । ఘన తటంబున మూర్ఛగదిసి యట్లున్న
తమ్ములఁ జూచి చిత్తమ్మునఁ గలఁగి । 'యిమ్మెయిఁబడిరి వీరేలకో !' యనుచు
మొగములు వీక్షించి మూర్ఛగా నెఱిఁగి । 'నిగిడినదప్పి మాన్చెదఁగాక మొదల
వెనుక వీరలపాటు వివరింతు' ననుచు । వనజాకరముచొచ్చి వాసవాత్మజుఁడు
సరవిమై నుదక మంజలిఁ గ్రోలఁబోవ । మొఱవెట్టె నశరీరి మునువల్కినట్ల.
దానికి వివరింపఁ దడవేది యతఁడు । నా నీళ్లు వెసఁగ్రోలి యవనిపై నొరగె.
గాండీవియును రానికథ చూచి యచటఁ । బాండవాగ్రణి స్రుక్కి పావనిఁజూచి :
"ఇటఁ జెర్వు చూడఁబోయినను దూండ్లైరి । కటకట ! తమ్ములు క్రమ్మఱరైరి.
జలములఁ గలపిరో శత్రులు విషము !। మెలఁగి దైత్యుఁ డొకండు మ్రింగుచున్నాఁడో !
తెలిసి, నీళ్ళును నీవు తృష్ణవోఁ ద్రావి । కలిగింపు నాకును గమలంబు లిపుడు."
అనిన నాతఁడువోయి యట్లున్నయట్టి । యనుజరత్నముల నొయ్యనఁ జూచి వగచి
యిట్లైన కారణంబేమొకో ! యనుచు । చిట్లినమతిఁ గొంతసేపు చింతించి
'నీరుగ్రోలక దప్పి నిలుపంగరాదు । నీరుగ్రోలెద' నంచు నీటికి డిగ్గి

చేతుల నుదకంబు చేర్చుచో, వాణి । వాతూలజుని: "నీరు వలదు గ్రోలకుము ;
కమలాకరమున కేఁ గావలుండుదును ; । నమునా ప్రశ్నల కుత్తరము లిచ్చికాని
జలముఁ గ్రోలఁగరాదు సైరింపు." మనినఁ । బలుకనోపనిడప్పిఁ బవనసుతుండు :
'అఱవకుఱోరి ! యీయంబువుల్ గ్రోలి । సుఖికదా ! నినుబట్టి [1]మర్దింతు నవల.'
అనుచుఁ గుత్తుకబంటి యానీరు గ్రోలి । తనవారిలో వచ్చి తాను నట్లోరగె.
ధర్మనందనుఁ డంతఁ దమ్ములరాక । కన్మలిఁ దడవైన నలికి తా వచ్చి
నగసి చెంగటఁబడి చైతన్యముడిగి । పరఁగఁ గీలూడిన ప్రతిమలువోలె
నున్న తమ్ములఁజూచి యుఱక మూర్ఛిల్లి । మిన్నక యటలేచి మేదినీవిభుఁడు
ధైర్యంబె యూఁతగాఁ దనలోన తాను । "శౌర్యాత్ములార, యీ చందమైనార!
నాకుఁగా నిచటఁ బ్రాణము లర్పించి । యీ కష్టదశఁ బొందుటెఱుఁగలేనైతి.
సమరంబులో నుగ్రసాహసులైన । మిముఁ జేరనోపునే మృత్యుదేవతయు!
నామాటతోనె నే నడచి సామ్రాజ్య । సౌమనస్యతలెల్లఁ జాలించివచ్చి
వనవాసభరమెల్ల వరుస నీడేర్చి । పనిలేని పని నిందుఁ బడనేమికతము!
ధార్తరాష్ట్రునకిఁకఁ దక్కెఁగా ధరణి! । యార్తరక్షణులార! యెడలఁబాసైతి.
ప్రభువని నన్నేల పట్టియుండితిరి! । యభినవంబైన యీయడలెట్లు సైతు!
వరుస మీ వెంటనే వచ్చెద నేను । ధరియింపఁ జాల సంతాపభారంబు."
అనుచు దేహములెల్ల నంటిచూచుచును । మనసున దందహ్యమానుఁడై నృపుఁడు
'మడుఁగులో జలమాని మఱి వచ్చికాని । తడవి పీనలపొందు తలఁపలే.' ననుచు
నీటి కందువకు నన్నృపుఁ డంత డిగ్గి । పాటించి దోసిటఁబట్టి జలంబు
గ్రోలఁబోవఁగ, వింటఁగొని యేసినట్లు । తా లీల నశరీరి ధరణీశుఁ బలికె :
"చాలుఁ గ్రోలక నిల్వు జలము ; నీవైన । నోలి నా మాటల కుత్తరంబిమ్ము ;
నిరతి నీలేకున్న నీబుద్ధికోలఁది । సరవిఁజెప్పు." మటన్న శమననందనుఁడు
ఉఱక [2]దోయిలిలోని యుదకంబు విడిచి । కరిసించి గగనమార్గము చక్కఁజూచి
నీవెవ్వ రెఱిఁగింపు ; నీప్రశ్నలేవి ? । ఈ వంక నీయునికి కేమి కారణము ?
కలిగితి (వీ) వేళఁ గలసి మాట్లాడఁ । బలు తెఱంగుల నీవ ప్రాణబంధుఁడవు."
నా విని యశరీరి నరనాథుఁ బలికె: । "భావింప నశరీరి భవ్య, నాపేరు ;
బిసరుహసూతి కల్పించె నిమ్మడుఁగు ; । కసమున నన్ను నిక్కడఁ గావ లునిచె.

1. మర్దించు పనులు (మా.) 2. దోసిలి. పా. అం.

కొన్ని ప్రశ్నలు చెప్పి "గుణముగా వీని । కెన్న నుత్తరమీక యెవ్వఁడేనిందు
నుదకంబు గ్రోలువాఁ డుర్విపైఁ గూలు । నిది శాప." 'మనిచెప్పి యేఁగె నవ్వేల్పు.
నరనాథ, మీవారు నామాట వినక । దురదురవచ్చి యీ తోయముల్ గ్రోలి
పడిరి దానికి నీవు ప్రభువ, చింతిలకు ; । తడవి నీవంతకుఁ దప్పించుకొంటి ;
నీరువట్టుడిగింప నృప, యిష్టమేని । యీరొక ప్రశ్నల కుత్తరంబిమ్ము."
అనిన ధర్మతనూజుఁ డశరీరిఁ బలికె. । "వినిపింపవయ్య నీ వివిధోత్తరములు
చెప్పెద నేను నేర్చినపాటి యునుము; । తప్పునో తాఁకునో తగ నోర్వవయ్య."

### అశరీరి ధర్మప్రశ్నలకు ధర్మజుఁ డుత్తరము లొసఁగుట

అనునంత నశరీరి యమసూతిఁ బలికె: । "విను మేదిగలవాఁడు విజ్ఞానపరుఁడు?
భూమి నేమిటికంటెఁ బొడవైనదేది? । తామసంబున మ్రొక్కఁదగుమూర్తి యేది?
ఇంక జీవన్మృతుం డెటువంటివాఁడు? । కొంకక యెఱిఁగింపు గుణధామ!" యనినఁ
బలికెఁ బార్థుఁడు: "దయాపరుఁడె సుజ్ఞాని; । పొలియ సేమిటికంటెఁ బొడవు సత్యంబు;
తనకెందు మ్రొక్కంగఁ దగు జనకుండె; । చెనక కొంకనివాఁడె జీవన్మృతుండు." (?)
నా విని యశరీరి నరనాథుఁ బలికె: । "దేవత్వమునఁ బొందిన మూర్తి యేది?
ఘటియింప ముక్తిసంగతి కేది సులభ? । మిటఁ దపంబునకంటె నెక్కుడే వ్రతము?
వివరింపు." మనిన భూవిభుఁ డట్టి ధర్మ । వివిధ సూక్ష్మములు వివేచించి పలికె:
"పూజించి యశన మెప్పుడుఁ బెట్టు నధిక । తేజుఁ డుర్విని యుండి దేవత్వ మొందు;
వస్తు భాగ్య విరక్తి నర్తించు ప్రతికిఁ । బ్రస్తుత ముక్తిమార్గము సులభంబు;
పరులకు నైన యాపద మాన్పఁజాలు । పురుషార్థమే తపంబునకంటె ఘనము."
[1]నా నశరీరి యానందంబు నొంది: । "భూనాథ, చెప్పవే! పురుషోత్తమునిని;
ఇది యొక్కటియుఁ జెప్పు మింతియ చాలు । వదలని తృష నున్నవాని నిన్నడుగ."
అనిన భూపతి చెప్పె: "హరిగాఁడు; విష్ణు । తనయుఁడుగాఁడు; చంద్రధరుండుగాఁడు;
పలికి బొంకక యెల్లప్రాణులమీఁదఁ । దలఁ పొక్కటై శాంతి దాంతియుఁ గలిగి
కలిగి లేదనక, భోగములఁ దన్మయతఁ । బొలయక, సుఖ దుఃఖములు సమంబుగను
బుద్ధి నెంచినవాఁడె పురుషోత్తముండు; । బుద్ధిలో నా కిది పొడమెఁ బుణ్యాత్మ!"

---

1. అని పల్క నశరీరి యానందమంది. పా. అం.

అనిన సంతోషించి యశరీరి పలికె : । " మనుజేశ, నీ ధైర్యమతికి మెచ్చితిని.
నీరు గ్రోలకమున్న నిలిచిన యోర్పు, । దీరైన ప్రశ్నలు తెలిసిన నేర్పు
వినుతింపఁ దగు; నింక వీరిలో నొక్క । యనుజు బ్రాణంబిత్తు నడిగి కొ." మ్మనిన
ముదమంది దప్పియు మునుమున్న పాసి । కదిసి యవ్వాణితోఁ గౌంతేయుఁ డనియె :
" సురగరుడోరగాసురసిద్ధ సాధ్య । వరులలోఁ బొడవైనవాఁడవు నీవు;
నను నుద్ధరించు యత్నంబునఁ గాదె! । చనుదెంచి నాభీతి సకలంబు మాన్చి
వరమిత్తు నంటివి; వరమిత్తువేని । నరనుతోజ్జ్వలమూర్తి నకులు నీవయ్య! "
నావుడుఁ గోపించి నాకేంద్రవాణి : । "ఈ వేళ మోసపోయితివి భూపాల!
బక హిడింబాది దోర్బల కళాధుర్య । వికటారి దళన ప్రవీణుఁ డై నట్టి
భీముఁ డుండఁగ, రణాభీల కోదండ । రామ సన్నిభుఁడు సుత్రామజుఁ డుండ
నకులు వేడెదు; నీకు నకులుఁడా భీష్మ । శకుని రాధేయాది సమరంబు గెలుచు!
మోసపోయితి." వన్న ముదముతో నృపుఁడు: । "మోసగాదిది భవ్యముగ వేడినాఁడ.
పాండుని యిరువురు భార్యలలోన । నిండార గొంతికి నేఁ బెద్దకొడుక;
తిర మొప్ప వలదె మాద్రికిఁ బెద్దకొడుకు! । వెరవునఁ గని కదా వీని నిమ్మంటి!
విమతజయం బొల్ల, విజయ వాయుజులు । క్రమమున నిట్లైన గతి విచారింప."

## అశరీరి ధర్మమూర్తియై తనూజు నగ్గించుట

అనిన సంతోషించి యభినవ దివ్య । తనువుతో ఘన కాలదండంబుతోడ
శాంతి విశేష తేజస్ఫూర్తి మూర్తి । వంతంబు గల ముఖవనజంబుతోడ (?)
మండిత కోటీర మాణిక్య కనక । కుండల హారాది గురుకాంతితోడ
భాసుర కల్పకప్రసవ సౌరభ వి । కాసానుషంగ భృంగంబులతోడ
యముఁడు ప్రత్యక్షమై యా యుధిష్ఠిరుని । సముకత్యే నిలిచి మస్తకము దువ్వుచును
దనకు మ్రొక్కిన పుత్త్రుఁ దగఁ గౌఁగిలించి । వినుతించి : "మెచ్చితి విభుఁడ, నీతాల్మి.
వారె నీ తమ్ములు వాయుజ ప్రముఖు । లీరీతి మూర్ఛిల్ల నేన చేసితిని.
వనవాస మీఁడేర్చి వరుస నజ్ఞాత । ఘనచర్యకై పోవఁగా నున్న నిన్ను
జూచి పోయెద నని సుముఖు, డేతెంచి । యాచోట మృగమనై యరణి గ్రహించి,
విప్రకార్యార్థమై వెడలిన మిమ్ము । నీ ప్రదేశమునకు నెలయించి తెచ్చి,
వరమిచ్చి పోవఁగ వలసి నామూర్తి । పరికింపఁజేసితి భవ్యాత్మ, నీకు.

అడుగుము వాంఛితంబైన వరంబు । లుడుగక యొసఁగెద నొప్పుగా." ననుచు
సురవువ్వవృష్టితోఁ జూపట్టు దండ । ధరుఁ జూచి, బ్రదికిన తమ్ములఁ జూచి
యానంద వివశుఁడై యా ధర్మరాజు । భాను తేజునిఁ దండ్రిఁ బలికె నిట్లనుచు :
" నాకేటి వరములు ! నాథ, నీమూర్తి । యేకాంత సేవగా నీక్షింపఁగలిగె.
ఇంతకంటెను వరంబెయ్యది నాకు ! । శాంతిలక్షణ, జన్మ సఫలత నందె.
అరణి యిప్పింపు మయ్యరణి విప్రునకు । వరుసఁ గ్రమ్మఱ నిచ్చి వగ దీర్పవలయు ;
నది నాకు వర." మన్న నాత్మజుమాట । కుదితానురాగుఁడై యుప్పొంగి జముఁడు
అరణి చేతికి నిచ్చి : "యజ్ఞాతవాస । భరము పూనెడు వేళ ప్రభులార, మీర
లేవేషములు దాల్ప నెలమిఁ గోరితిరి । యా వేషములకు నీడైన వస్తువులు
సిద్ధించుకొఱకు నిచ్చెద నొక్కవరము ; । ఇద్దర మిమ్ము మీ రెఱిఁగించుకొనక
పరు లెఱుఁగకయుండఁ బాలించు వరము ; । చిరతరశ్రీ మీకు సిద్ధింపఁగలదు. "
అని చెప్పి జముఁ డేఁగె ; నంతఁ బార్థులును । జనుదెంచి రిటఁ బర్ణశాల చక్కటికి.
అరణి విప్రున కిచ్చి యనిచిన నతఁడు । మరలె దీవించుచు మనుజవల్లభుల.
వరుస నారణ్య పర్వం బిది సరసు । లరుదార వినిపింప నర్థితో జనులు
విననేర్చి రేని సర్వేశ్వరుం డార్త । జన వత్సలుఁడు జలజాత నేత్రుండు
వారికి నిహపర వైభవంబులును । సారూప్య ఘన సప్త సంతానములును
నిత్యాయురారోగ్య నిజమనోరథము । లత్యాశుగతి నిచ్చునది యథార్థంబు.
అని ముని జనమేజయ క్షితీంద్రునకు । మును వినిపించిన ముఖ్యమార్గమున
శౌనకాది మునీంద్రసమితికి సూత । మౌని చెప్పిన పుణ్య మహనీయచరిత
భారతం బిది సమర్పణము చేసితిని । వారిజ హిత వంశ వర్ధను పేర,
లవణాసురుని గెల్వ లక్ష్మణానుజుని । దివిరి పంపిన యాదిదేవుని పేర,
శంబుకాఖ్యుని యనాచారతపంబు । పంబి మాన్చిన పుణ్యభావుని పేర,
ఘను విభీషణుని లంకారాజ్యపదవి । నునిచి రక్షించిన యుర్వీశు పేరఁ,
గామితార్థము లెల్లఁ గలిగింపనోపు । రామనామముతోడి రఘురాము పేర,
సేచిన రసయుక్తి నిట్టి ప్రబంధ । మాచంద్ర తారార్కమై యొప్పఁగాత.
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యప గోత్ర దీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచితారణ్యాఖ్య విపుల పర్వమున । నరుదుమీఱఁగఁ బంచమాశ్వాస మయ్యె.

# అనుబంధము

(*ఇది దేవకార్య మీ విపు డోపనసక । సదయాత్మ, పొమ్మన్న సంయమీశ్వరుఁడు
నవుఁగాక యని లేచి యమరేంద్రుఁ డనుప । దివినుండి భూతధాత్రికి డిగ్గి వచ్చె.)
అంత నక్కడ మున్న యర్జునువార్త । నెంతయు నావ్యాసుఁ డిభపురపతికిఁ
జెప్పిపోయిన భీతిఁ జిత్తంబు చెదర । నప్పుడు దొరలతో నాంబికేయుండు

... ... ... ... ... ... । ... ... ... ... ...

“పఱఁగ సింహమునకుఁ బక్కెరయిడిన । కరణిఁ గ్రీడికి దేవగణము లాశుగము
లీశానుఁ డాదిగా నిచ్చిరి చాల ; । నీ శక్తి నాతని కెదురేది యింక !
శంకరు గెలిచిన సాహసి యట్టె ! । యింక నాతనితోడ నెవ్వ రోపుదురు ?
అదిగాక దేవేంద్రు నర్ధాసనమునఁ । ద్రిదశులు గొలువ నద్ధీరుఁ డున్నాఁడు.
మనుజుల కిట్టి సామర్థ్య మెక్కడిది ? । మనుజులె పాండుకుమారు లేవురును !
ఈరస వుట్టించె నీ బిడ్డ వారి । వైరంబు వుట్టక వార లుండుదురె !
పాశుపతాస్త్ర మప్పార్థుండు దొడుగ । నే శస్త్రపాణు లిం దెదిరించువారు !
సమరంబులో వీరి చావు తెల్లంబు ; । తెమలునే పాంచాలిఁ దిగిచిన ఫలము !”
అనవిని విదుర భీష్మాచార్య కృపులు । కను వ్రాల్చి మెచ్చిరి గాండీవి జయము.
ఇటఁ బాండుసుతులు మహేంద్రనందనుఁడు । పటుగతి రాకున్న భావంబులందు
శోకమగ్నలముగా ; “సుకృతాత్ముఁడైన । నాకలోకాధీశ నందనుఁ డింక
సురలచే శరములు సొంపారఁగాంచి । నరవిమై నెన్నఁడు చనుదెంచునొక్కొ !
కన్నులు చల్లఁగాఁ గడువేడ్కతోడ । నెన్నఁడు చూతుమో ! యేమి సేయుదము !
ఒనరంగ దిన మొక్కయుగమునై తోఁచె” । ననునంత ధర్మజు కనియె భీముండు :
“ధర్మతనూభవ, తపనప్రతాప, । ధర్మస్వరూప, భూధవవర్య వినుత,

---

* తిమ్మయ విడిచిన నలచరిత్రాద్యుపాఖ్యానములఁజేర్చి సోమన యతని పేరనే మరల నారణ్య పర్వమంతయు వ్రాసినాఁడు ; ఇది యా సోమన రచన. కర్ణపర్వము మొదలు తుదిదాఁక నీ ద్విపద భారతరచనమును నిర్వహించినవాఁ డీ సోమనయే. విశేషముల నుపోద్ఘాతములఁ జూచునది.

ఈయనుబంధము, తిమ్మయ అరణ్యపర్వము – ద్వితీయాశ్వాసము 32వ పుటలోని “దివినుండి భూతధాత్రికి డిగ్గివచ్చె” అను ద్విపదతరువాతఁ జేర్చి చదువుకొనఁ దగును.

నీయాజ్ఞఁ దలమోచి నిష్ఠతోఁ దపము । పాయక సేయుచుఁ బార్థుఁడేమిటనో
రాకయున్నాఁడు, వారక వానిఁ బాసి । యీకడ వర్తింప నేరీతివచ్చు.
పరువడి పాంచాల పాండవయోధ । వరుల జీవంబులు వానిపై నిలిచె.
వెనఁ దద్భుజాబల విక్రమ స్ఫురణ । వసుధఁ గైకొంద మవశ్యంబుననుచు
నున్నవారము గాన నోగిఁ దామసింపఁ । గ్రన్ననఁ బని లేదు ; కడు శీఘ్రవృత్తి
నర్జునుఁ దోడ్తేర హరి దైత్యదమను । నిర్జరాధిప వంద్యు నిఖిల లోకేశు
వసుదేవతనయు నవశ్యంబు పనుపు । వసుమతీ నాయక, వనజారివంశ !
విజయుండు నేనును విదిత శౌర్యమున । నిజముగాఁ జని కురునృపతిఁ దద్బలముఁ
గాలుని పురికంపి ఘనతర లీలఁ । జాలఁ గైకొందుము సకల రాజ్యంబు.
తుది సత్యభంగ భీతుండవు నీవు । వదలక పదుమూఁడు వర్షముల్ నిండ
నలిపి క్రమ్మఱ వచ్చి సకల రాజ్యంబు । నలవడఁ గైకొను మతి విభవమున ;
రమణతో సర్వధర్మ ప్రకారముల । విమతులఁ జంపుట విధిచోదితంబు."
అనవుడు హరుసించి యట ధర్మరాజు । తన నిండుఁ గౌఁగిటఁ దమ్మునిఁజేర్చి
కొనకొని శిరము మూర్కొని యిట్లుపలికె : । "అనలున కనిల సహాయ మైనట్లు
నెలకొని క్రీడికి నీవు తోడైన । బలమేది శత్రులు బ్రదుకంగఁ గలరె!
ఎనయంగ నైనను ఇది వేళగాదు ; । చన వొప్పఁ బదుమూఁడు సమములుఁ జనినఁ
బదపడి నీవును బార్థుతోఁ గూడి । వదలక నిర్జింపు వైరి వర్గముల."
అని కడు శాంత వాక్యముల వాయుజుని । ననునయింపుచు నున్న యవసరంబునను
బృహదశ్వుఁడను ముని పేర్మి దీపింప । బహు శిష్య గణములు బలసి తన్ గొలువఁ
వరమిడి యమసూతి దర్శింపఁగోరి । యరుగుదెంచినఁ జూచి యా ధర్మరాజు
తమ్ములుఁ దాను నంతట నెదురేఁగి । య మ్మునీంద్రునకు మ్రొక్కి యర్ఘ్యాది విధులఁ
బూజించి : "యో మునిపుంగవ, వినుము । ఓజతోఁ దొల్లిటి యుర్వరాధిపులు
మావలె నీ రీతి మహి యెల్లవిడిచి । వావిరి నుండిరే వనములలోన !"
అనవుడు బృహదశ్వుఁ డా ధర్మరాజుఁ । గనుఁగొని పల్కె నుత్కంఠ దీపింప :
"వినవయ్య ధర్మజ, వివరింతుఁ దెలియ ; । మనవార దైవసమాను లైనట్టి
యనుజుల తోడఁ బుణ్యాంగన తోడ । ఘన రథాశ్వములతో గజములతోడ
విప్రవర్యులతోడ విపినంబులోన । నప్రయాసముతోడ నందఱుఁ బొగడ

నలోపాఖ్యానము :—

నెలమితోఁ దిరిగెద విపియు దుర్ఘటమె! । నలువొప్పఁగాఁ దొల్లి నలుఁడను నృపతి
దొరకొని పుష్కరుతో జూదమాడి । ధరణి రాజ్యంబెల్లఁ దగనోడి యంత
నడవికి నొక్కఁడె యరిగి దుఃఖంబు । కడుమీఱి యొప్పఁడె కంజారివంశ!"
అనవుడు పిస్మితుఁడై ధర్మరాజు । మునిశిఖామణికిఁ గేల్మోడ్చి యిట్లనియె :
"మునికులాంబుధిచంద్ర, మునిసార్వభౌమ, । మునిలోకపూజిత, మునిగణసాంద్ర,
సరవితో నలుని సచ్చరిత మంతయును । గరితలామలకంబుగా వివరింపు."
అనవుడు యమసూతి కా మునీంద్రుండు । వినిపింపఁ దొడఁగె నా వృత్తాంతమెల్ల :
వినవయ్య యెలమితో విధుకులతిలక, । ... ... ... ... ...
అవనిలో నిషధదేశాధీశుఁడైన । వివిధ పుణ్యాత్ముండు వివిధ సన్నుతుఁడు
[1]వీరసేన సుతుండు విఖ్యాతమూర్తి । కారుణ్యవారాశి గాంభీర్యధనుఁడు
నెఱి ననేకాక్షౌహిణీశుండు ఘనుఁడు । [2]అరయంగ గంధర్వ యక్షప్రియుండు
పౌరుషవంతుండు ప్రథనజయుండు । నారీమనోజుండు నలుఁ డను రాజు
రసికత దిక్కుల రాజుల గెల్చి । వసుధలోపలఁ జక్రవర్తియై పరఁగె.
అట విదర్భాధిపుఁడైన భీముండు । పటుగతి సంతతిఁ బడయుదు ననుచుఁ
దన పత్నియును దాను దమనుఁ డనంగ । ఘనుఁడైన మునిఁజేరి కడఁగి నిత్యంబు
సేవఁ జేయుచునుండఁ జెలఁగి యమ్మౌని । వావిరి వరదుఁడై వరమిచ్చుటయును,
దమయంతి యనుపేరఁ దనరిన కూఁతు । దమ దాంత దమనులన్ తనయులఁ బడసె.
అందుఁ గన్యారత్నమగు దమయంతి । పొందుగా సౌందర్య భూరి తేజముల
వెలుఁగుచు గంధర్వ విబుధ కన్యకల । నెలమిమై మించి మహీస్థలిలోన
వెలసిన వేపురు విమలేందుముఖులు । చెలులు గొల్వఁగనుండెఁ జెలువు దీపింప.
అంతట నలుని గుణావలి చాల । సంతోషమున జనుల్ సన్నుతి సేయ
దమయంతి వినియె; నా దమయంతి గుణము । లమిత వైఖరిఁ జెప్ప నవనీశుఁడైన
నలుఁడును వినియె; నానాఁట నిర్వురకు । వెలయఁగ మోహంబు వినుకలి గలిగె.
ఈ రీతి ననురాగ మేపు దీపింప । వీరసేన సుతుండు విదిత విక్రముఁడు
మరుని బాణంబుల మర్మముల్గాఁడి । సరవితో విరహాగ్ని సైరింప లేక

1. వీరసేనాత్మజు 2. అరయ గంధర్వ రాక్షసయక్షప్రియుండు. ఛా.

యుపవన సీమకు నొప్పారఁ బోయి । చపలత నం దుండుసమయంబునందు
నారూఢి నాకసం బనియెడు కాంత । హారావళియుఁ బోలె హంసాలిధరకు
నవతరించినఁ జూచి య మ్మహీవిభుఁడు । నవభంగి నంచలనడ చక్కఁదనము
గనుఁగొని నవ్వుచుఁ గడఁక దీపించి । పనువడి యొకదానిఁ బట్టినఁ, జూచి
హావిరి నెంతయు వడిదాని విడిచి । పోఁగఁజాల కప్పుడు గగనమున
నరుగుచు మూఁకలై యంచలన్నియును । సరస వాతోద్ధూత శరదభ్ర శకల
ములు వోలెఁ బొలిచిన, మును రాజుచేత । నలవడఁ జిక్కినయట్టి రాయంచ
నలునిఁ గనుంగొని నరవాక్య ఫణితి । సలలిత మంజు భాషణముల ననియె :
"రాజశేఖర, రిపురాజ సంహార, । రాజీవ హిత తేజ, రామామనోజ,
అవనిపై నీకుఁ బ్రియంబు చేసెదను. । నవభంగి నీ ప్రాణనాయకి యైన
దమయంతి పాలికిఁ దద్దయుఁ బోయి । క్రమమున నీ గుణకథనంబు చెప్పి
వసుమతి నెవ్వని వరియింపకుండఁ । బసగల్గి నీ మీఁద బద్ధానురాగ
యగునట్లు చేసెద నది నిక్కువముగ । జగతీశ !" యనవుడు సంతోషమంది
యా వాక్యములు దన యంతరంగమున । హావిరి నా సుధావర్షంబుఁ బోల
ననురక్తుఁడై దాని నప్పుడు విడువఁ । దన తోడియంచలఁ దగఁ గూడి యదియు
నా విదర్భకుఁ బోయి యందు సంప్రీతి । భూవల్లభుని పుత్రిఁ బుణ్యాంగి వికచ-
తామర సాక్షినిఁ దమయంతిఁ జెలులుఁ । ... ... ... ... ...
దానును వేడ్క నుద్యానవనంబు । లోనున్నఁ గనుఁగొని లోలాక్షి చెంత
విహరించుటయుఁ జూచి విమలేందువదన । బహుసంతసంబునఁ బడఁతులుఁ దాను
గలకటి నొండొరుఁ గడవంగ మిగులఁ । బఱచి యొక్కొక్కటిఁ బట్టు కొనంగ,
వెలయఁగ నలునిచే విడువంగఁ బడిన । కలహంస దమయంతికరములఁ జిక్కి
మనుజవాక్యముల నమ్మానినితోడ । ఘనతరస్నేహంబు గానరాఁ బలికె :
" వినవమ్మ దమయంతి, విమలేందువదన, । యెనయఁగ నీ హృదయేశ్వరుఁడైన
నిమ ధేశకడనుండి నెమ్మివచ్చితిని । ఝష నేత్ర, యీ మహీచక్రంబునందు
రమణి, నేఁ జూడనిరాజులు లేరు ; । క్రమమొప్ప వారిలో ఘన రూపమహిమ
వెలసినవాఁడు [1]సద్వృత్త శౌర్యుండు । నలమహీనాథుఁ డున్నత కీర్తిధనుఁడు.
నెలకొని యతనికి నీవును సతిఁడు । వలనుగా నీకు [2]నివ్వసుధఁ దగుదురు.

---

1. తద్వృత్త. మూ. 2, నివ్వసుధలోఁ దగును. (మూ)

పురుడింప నాతఁడు పురుషరత్నంబు ; । తరుణులలోన రత్నంబవు నీవు.
కాన నిద్దఱకును గల సమాగమము । ... ... ... ... ...
అనవుడు దమయంతి హారుసంబునొంది : । " యొసరంగ వినవయ్య యో పక్షిరాజ !
ఆరాజు గుణ కథనావలి నాకు । నేరీతిఁ జెప్పితి వేపు దీపించి
యారీతినే నన్ను నా నృపాలునకు । వారక యెఱిఁగించి వలను మీఱంగఁ
గరుణ నా మీఁదను గలుగంగఁ జేయ । సరగున నిషధ దేశమునకుఁ బొమ్ము. "
అనవుడు నాయంచ యట్లకాకనుచుఁ । జనవొప్పఁ దోడియంచలుఁ దానుఁబోయి
వీరసేన కుమారు విశ్రుతాచారు । వైరి సంహారు భావజమూర్తిఁ గాంచి
వైదర్భి పలికిన వాక్యంబులెల్ల । నాదట నెఱిఁగించె ; నంతటిలోన
విరహవేదనచేత వేఁగి విభ్రాంతిఁ । బరితాపమందిన పద్మాక్షిఁ జూచి
ఘన మతిభ్రాంతలై కల సఖీజనులు । నెనయంగ భీముని కెఱిఁగింపఁదలఁచి
వేగంబె చని మహీవిభుఁ బొడఁగాంచి । చాఁగిలఁబడి మ్రొక్కి సరసవాక్యముల :
" అవధారు ఓ దేవ, యమితప్రభావ, । ప్రవిమల గుణ[1]ధుర్య, ధర్మాద్రిధైర్య !
నలుఁ డను రాజుపై నలినదళాక్షి । తలఁపెల్ల నిలిపి కందర్పునిబారి
నలసి తన్నెఱుఁగక యనుదివసంబుఁ । గలహంస పలికిన కలితవాక్యంబు
మాటికి గుణియించి మమతదీపించు ; । బోఁటి యెంతయు నది పోయిన దిక్కు
చూచుచు నాత్మలో శోకంబునొందు ; । నేచందమున నిద్ర యెఱుఁగ దాయబల ;
పలుకదు సఖులతోఁ బరిపాటి గాఁగఁ ; । గలితభూషణములు గ్రక్కున విడిచె ;
భూరిశయ్యాసన భోగంబు మానె ; । కీరపంక్తులతోడి కెరలాట లుడిగె ;
... ... ... ... ... । ధరణిలోఁ దక్కిన ధరణీశ్వరులకుఁ
జాటింపుటయు విని జగతిలోఁ గలుగు । మేటిరాజులు కడు మేలిమితోడ
సరదంబులెక్కి సైన్యావళి గొలువ । నరుగుదెంచిరి విదర్భాధీశు పురికి.
పరువడి నారద పర్వతు లనెడి । వర తపోధనులు భూవలయ మంతయును
దిరిగి యంతటిలోన దివికిఁ బోవుటయు । సురపతి వారలఁ జూచి పూజించి
గొనకొని భూలోక కుశలంబు లడిగి : । "మునులార, వినరయ్య మున్నిటివలెనె
లాలిత ధర్మపాలన పరులైన । భూలోకమునఁ గల్గు భూపాలవరులు

---

1. ధైర్య. (మూ)

పొలుపొంద నక్షయ పుణ్యలోకముల । వలనొప్ప భోగింపవలెనని యిటకు
నేలకొ చనుదేర రిది కడుచిత్ర ! । మీలోన నిత్తెఱంగెఱిఁగింపుఁ." డనిన
నారదుఁ డిట్లను నాకేశుఁ జూచి : । "ధారుణీతలమున దమయంతి యనఁగఁ
బరఁగ సౌందర్య సౌభాగ్య రూపముల । నర సిద్ధ సాధ్య కన్యల ధిక్కరించి
భువనమోహిని యనఁ బొగడొందు ; నట్టి । యువిదకు యౌవనం బొదవిన యంతఁ
జనవొప్ప నయ్యింతి జనకుఁడు భీముఁ । డనువాఁడు మిక్కిలి హర్షంబునొంది
వసుధలోపల స్వయంవర మని చాట । వసుధేశులెల్ల నిర్వైరులై యటకుఁ
జని." రని చెప్పిన జంభవైరియును । గనుఁగొనఁ గోరి దిక్పతులును దాను
ఘన విమానస్థులై కదలి శీఘ్రమునఁ । జనుదెంచి ముందటఁ జనియెడువాని
వెలయ భానులలోని విష్ణుండుపోలె । నలరి తేజోధికుఁడై యున్నవాని
గరిమతో రెండవ కందర్పుఁ డనఁగఁ । బరఁగినవాని భూపాలశేఖరుని
వీరసేనకుమారు విబుధమందారు । భూరికృపాకారుఁ బుణ్యాత్ముఁ గాంచి
యంతరిక్షమ్మున నవ్విమానముల । నెంతయు డించి తా రిల కేఁగుదెంచి
నలున కిట్లనిరి : "భూపాలాగ్రగణ్య, । కలిత సత్యప్రతాప, కారుణ్యనిలయ,
నినుఁగోరి యిచటికి నెమ్మి వచ్చితిమి ; । మనమార దూతవై మా యభిమతము
సేయుము." నావుడు : "చెచ్చెర నట్ల । సేయుదు మఱి నాకుఁ జెప్పుడు మీర
లెవ్వరు ? మీ కిష్టమెద్ది ? నేఁ జేయు । నవ్విధి నాకు నిష్ఠానతి యుండు."
అనిన సంతోషించి యమరవల్లభుఁడు । మనుజేశుతోడఁ గ్రమ్మఱ నప్పుడనియె :
"నేను దేవేంద్రుఁడ నెలమితో వీరు । పూని దిక్పతులు సత్పుణ్యస్వరూప !
అమరంగ నా దమయంతీ స్వయంవ । రముఁ జూచువేడుక రమణ నిచ్చటికి
వచ్చియున్నార ; మ వ్వనితకు నీవు । నచ్చుగా మా తెఱఁ గంతయుఁ దెలియ
నెఱిఁగింపు ; మత్తైన నిభరాజయాన । మఱువక వరియించు మాలోన నొకని."
అనినఁ గృతాంజలియై మహీవిభుఁడు । ఘనుఁడైన యింద్రుతోఁ గరమర్థిఁ బలికె :
"ఎఱిఁగి యెఱింగియు నిటువంటిపనికి । నఱలేక పంపఁగ నర్హమే మీకు !"
ననవుడు దేవేంద్రుఁ డర్థి నిట్లనియె : । "మనుజేశ, యిప్పుడు మా ప్రయోజనము
చేసెద నని పల్కి చేయలే ననిన । వాసియుఁ జెడిపోవు వన్నెయుఁ దఱుఁగు.
సత్యవ్రతుండవు జగతీశ, నీవు ; । నిత్య ధర్మస్థితి నెగడు నీచేత ;
దేవహితార్థమై తేకువతోడ । వావిరి దూతవై వర్తింపు కడఁక.

అంతఃపురంబున కరుగుట యెట్లు । సంతోషమున నని శంకింపవలదు.
అలవడఁగా దమయంతీ నివేశ । మెలమిఁ జొచ్చెడువేళ నెవ్వరు నిన్ను
వారింపకుండంగ వరమిత్తుఁ జనుము । వారక." యనవుడు వసుమతీశ్వరుఁడు
'కలఁగక దేవతాకార్యంబు సేయఁ । గలిగెఁ బుణ్యుఁడ నైతిఁ గలుషంబు లుడిగె'
ననుచు సంతోషించి యప్పుడె కదలి । చని విదర్భాధీశు సదనంబు చొచ్చి
యంచచేఁ దా వినిసంతటికంటె । నంచితరూపాన నలరినదాని,
శత దాన సఖులతో సౌందర్య విభవ । వతియు నై మిక్కిలి వలనొప్పు దాని,
హృదయేశుఁడైన తన్నెప్పుడు వినుచు । మదిలోన సంతోషమగ్నయౌదానిఁ,
బొలుపొంద నలుఁడె మత్పురుషుండు గాఁగ । వలెనని సురలను వడి వేఁడుదాని
దమయంతిఁజూచి కందర్పబాణములు । కొమరొప్ప హృదయంబుగొని కాఁడుటయును
నివ్వెఱఁగందుచు నిలిచినఁ, జూచి । యవ్వనితామణి యంతరంగమున
'నితఁడు మీనాంకుడో! యింద్ర నందనుఁడో! । ప్రతిలేని యలకాధిపతితనూభవుఁడో!'
అను సంశయమ్ముతో హర్షంబునొంది । తన సఖీజనములుఁ దానుఁ బల్కొని
... ... ... ... ... । ... ... ... ... ...
పెనుపొంద మన్మథ ప్రేరిత యగుచు: । "మనమార ఘనుఁడైన మా తండ్రిచేత
రక్షితంబగు మందిరం బితరులకు । నీ క్షోణిఁ జొరఁగరా దెవ్విధినైన.
ఇది కడు నద్భుతం బెట్లు వచ్చితివి ? । వదలక యెఱిఁగింపవలయు నా." కనిన
దమయంతిఁ గనుఁగొని ధరణీశ్వరుండు । విమల వాచాప్రౌఢి వెలయ నిట్లనియె :
"ఎలనాగ, నేను బర్హిర్ముఖు దూత ; । నలవడఁగా నలుఁడంద్రు నా పేరు.
అమరేంద్రుఁడును నగ్ని యమ వరుణులును । సమిత వైఖరి నీ స్వయంవరం బర్థిఁ
గనుఁగొను వేడుకఁ గనలి యేతెంచి । ... ... ... ... ...
నీ కెఱిఁగింపంగ నెమ్మితో నన్ను । బ్రాకట విస్ఫూర్తిఁ బంపిన నేను
నుతగతి వారి యనుగ్రహస్ఫురణ । నితరులెంతేనియు నెఱుఁగక యుండ
వచ్చితి ; నెంతయు వారల కోర్కి । యచ్చుగాఁ జెల్లింపు మంబుజగంధి !
ఎలమి నల్వురిలోన [1]నెవనిపైఁ బ్రియము । గలదొ వాని వరింపు కంజదళాక్షి !"
అనవుడు తలవాంచి యా దమయంతి । మనుజేశుతోడఁ గ్రమ్మఱ నిట్టులనియె :

1. నెవ్వఁడు ప్రియము – గలవాని వరియింపు. (మూ)

"కలహంసచేఁ దొల్లి ఘనుఁడైన నీదు । విలసిత రూపంబు విని నాఁటఁగోలె
ననురక్తినుండు నా యంతరంగంబు । గొనకొని యితరులఁ గోరనే చెపుమ !
ఏనేడ ! యింద్రాదులేడ ! వారలకు । మానుగా మ్రొక్కెదు; మహిలోన నిన్నె
వరియింతు ; నిందుకు వసుమతీనాథ ! । యురుతరంబుగ నీవు నొడఁబడకున్న
జల రజ్జు వహ్ని విషంబుల వలన । బలువిడి నిక్కంబు ప్రాణముల్ విడుతు. "
అనవుడు నిషధేశుఁ డాయింతిఁ జూచి : । " వనితాలలామ, పావనమూర్తు లగుచు
దివిమెల్ల నేలుచు ధీరులై మిగుల । దివిని మృతంబును దెవులును లేక
యమృత మాహారమై యలరిన సురలఁ । గామరొప్పఁ గోరక కుంభినిలోన
క్షణ భంగురంబైన సంసారి నన్ను । దృణమని చూడక ధృతిఁ గోరఁదగునె !
పెనుపొంద సురల కప్రియములు సేయు । మనుజులు కడుఁబాపమతులు గావునను
సురల కోరికఁదీర్చి సొంపుగా నన్నుఁ । గరుణించి పంపుమా కాచి రక్షింపు. "
అనిన నా దమయంతి యధికశోకమునఁ । బొనరంగ నొక కొంతప్రొద్దు చింతించి :
" నీ తలంపున కేను నిరపాయమైన । యాతతోపాయంబు ననఘాత్మ, కంటి.
వలనొప్ప నా స్వయంవరమున కర్థిఁ । జలమొప్ప దేవతల్ చనుదెంచిరేని
నరవి తోడుత వారి సన్నిధి నిన్ను । వరియింతు ; నట్లైన వసుమతీనాథ,
నెలకొని యంతయు నిర్దోష మగును । బలుకు లేటికి. " నని పల్కిన నలుఁడు
సురల పాలికిఁ బోయి సుదతి వాక్యముల । నరుదుగా వినిపించె ; నంతటిలోన
శుభముహూర్తంబున సొంపు దీపింప । నభినవోత్సాహుఁడై యా భీమనృపతి
సకల భూపాలుర సంప్రీతి మెఱయఁ । బ్రకటించి మంచలపై నుండఁ జేసి
తన తనూభవయైన దమయంతి నర్థి । ఘనతర శృంగార కలితఁ జేయించి
పొలుపొందు చున్నట్టి పూవులదండ । వలచేతి కిచ్చి : " యోహామాక్షి, నీదు
మనసువచ్చినయట్టి మనుజవల్లభుని । ఘనముగా వరియించుఁ గరమర్థి. " ననుచుఁ
బనిచిన, దేవతల్ భావంబునందు । వనజదళాక్షి యేవసువున నలుని
నుతగతి వరియించునో చూత మనుచుఁ । దతభంగి నలరూపధారులైరంత.
దమయంతి సితపుష్పదామకం బర్థిఁ । గ్రమమొప్పఁ గరమునఁ గానుపింపంగఁ
జనుదెంచి నిఖిలరాజన్యులఁ జూచి । ఘనమైన నలపంచకంబును జూచి
యేర్పరింపఁగరాక యింద్రాదు లెవరో ! । నేర్పుతో నైషధనృపతి యే ఘనుఁడో !
యనుచు సందేహించి ; " యమరేంద్రులార ! । యనఘాత్ములార, కృపాపరులార,

నయమొప్ప నా మనోనాథుఁడై మిగుల । జయమూర్తియైన నైషధ మహీవిభునిఁ
గనుఁగొనఁగాఁ జేసి కరుణింపరయ్య!" । అని యని దుఃఖింప నంతటిలోన
దయఁజూపి దేవతల్ తత్క్షణంబునను । రయమున స్వేదగాత్రంబులు లేక
యనిమిష దృష్టిచే నవని ముట్టకయు । నఘులై యాసన్నులై నిల్చి; రంత
లోకపాలురు రాజలోకంబుఁ జూడ । నా కంజదళనేత్ర హర్షంబుతోడఁ
జెలువొందు తనచేతి సితపుష్పమాల । నలవడ నిషధేశు నళుతను వ్రేయ,
సకలజనంబులు సంతోషమొసఁగఁ । బ్రకటించి చూచి రప్పార్థివోత్తముని.
అంత వివాహమై హర్షంబుతోడ । నెంతయు మించిన యిలఱేనిఁ జూచి
వలనొప్ప నింద్రుండు వాని యజ్ఞములఁ । బొలుపొందఁ దనమూర్తి పొడసూపఁగాను,
వరుణుఁ డగ్నియు వాని వలసినచోట్ల । సరవితో నగ్నియు జలములుఁ గలుగ,
వదలక ధర్ముండు వానికిఁ జాల । నొదవు ధర్మము గల్గ నొగి వరంబిచ్చి
దివమున కరుగంగఁ దెరువున నంతఁ । దవిలి ద్వాపరమును దనవెంట రాఁగఁ
గలిరాజు వేగంబె కానవచ్చుటయు, । బలభేది ముఖ్య దిక్పతులెల్లఁ జూచి :
'యెందుఁ బోయెదవు నీ వెఱిఁగింపు మాకు । నందంద' యనవు డా యమరులఁ జూచి
కలిరాజు నిట్లను : "ఘనులార, వినుఁడు ; । ఇలలోన దమయంతి యిభరాజయాన
కలకంఠి మిగులఁ జక్కనిదని జనులు । మెలమితోఁ గొనియాడ నే విని చాల
ననురాగ మొదవ స్వయంవరంబునకుఁ । బూనుపడి యిప్పుడు పోవుచున్నాఁడ.
దమయంతి నా చక్కఁదనము చూచినను । బ్రమసి వరించు శోభనము గాఁగలదు."
అనిన నందఱు నవ్వి : "యందులకేమి । పనివడి పోయెదు భానుతనూజ !
వామాక్షి యొరుల నెవ్వరిని మెచ్చకయుఁ । బ్రేమ నలుండను పృథివినాయకుని
వరియించె." ననవుడు వాఁడు కోపించి : ।... ... ... ...
"యరుదుగా దమయంతి [1]కట నా నలునకుఁ । బరికింప రాజ్యవైభవమెల్లఁ బాపి
భాసిల్లఁగాఁ బరస్పరవియోగంబు । చేసెద." నని పల్కి చెలువుఁడై యపుడు
సురలను వీడ్కొల్పి క్షోణీతలమున । గరిమతోఁ గలియు శీఘ్రముతోడ వచ్చి
రమణమై నలు నతురతునిఁగా నెఱిఁగి । క్రమము దీపింప నక్షుంబులు చొచ్చి
యుండ [2]ద్వాపరమును నొప్పుగాఁ బంచి । దండిగా నంతటఁ దాను వేగ

---

1. యట కానలకును 2. ద్వారంబును. (మూ.)

ధరణిలో నలమహీధవుఁ డొనరించు । సరసాశ్వమేధాది సకలయాగముల
నెపముఁ గనఁ జొరరాక నీరజమిత్రుఁ । డుపకారి గానినాఁ డొనరంగ నతని
తనయుండు నెరసు లెంతయు వెదకుచును । ఘనతతో డుతఁ బెద్దకాల మందుండె.
అంతలో నొక్కనాఁ డమ్మహీధవుఁడు । నంతంతఁ గృపమూర్తియై మతి భ్రమసి
యట జలస్పర్శనానంతరమునను । జటులత బాదశౌచము సేయ మఱచి
యనఘాత్మ, సంధ్యా జపోపాసనంబు । లొనరించుటయుఁ, గలి యొనరెను వేళ
యని నలునందుఁ బాయక ప్రవేశించి । పలివడి పుష్కరుపాలికిఁ బోయి
మఱి తన్ను నెఱిఁగించి: "మనలక నీవు । కఱకఱి నా నలక్ష్మాపాలుతోడఁ
దగ జూదమాడి యెంతయు వానిరాజ్య । ముగపడఁ గొను." మని యట వానివెంటఁ
దాను బ్రాహ్మణుఁడునై తత్క్షణంబునను । మానుగాఁ జనుదెంచి మహిపతిఁ గాంచి
తపణించి జూదమాడంగఁ బిల్చుటయు, । నవిరళస్ఫూర్తి నలావనీశ్వరుఁడు
ప్రకటించి తను గలిరాజు ప్రేరేప । నకలంక గతి జూదమాడక యున్న
ధర్మంబు గాదని తగ నిశ్చయించి । యర్మిలితో జూద మాడంగఁ దొడఁగె.
గొనకొని యారీతిఁ గొన్నిమాసములు । ననిచిన దుర్వ్యసనం బగ్గలముగ
జూద మాడుచు నుండఁ జూచి వైదర్భి । యాదటఁ బౌర జనావళి మంత్రి
వరులును దానును వచ్చి వారింప, । విరివిగా నాడుచు వినకున్నఁ జూచి
తరుణి యెంతేనియుఁ దనలోనఁ దాను । బరిదేవనము చేసి భావించి చూచి
"అక్షముల్ పుష్కరునంద వశ్యములు ; । ఈ క్షోణి నలునకు నిది యపజయము
తప్పదింతట." నని ధవుని యనుజ్ఞ । నప్పుడు వార్ష్ణేయుఁడను వానిఁ బిలిచి
"సారథి వినుము, ఈ స్యందనంబునను । ఆరూఢ విస్ఫూర్తి హయములఁ బూన్చి
యింద్ర సేనుండను నిక్కుమారకుని । నింద్ర సేనాఖ్యయౌ నిక్కుమారితను
గొనిపోయి మజ్జనకుని యింట విడువు." । మనవుడు వార్ష్ణేయుఁ డట్లకాకనుచు
నా యిరువురఁ గొని యా ప్రొద్దె కదలి । పోయె విదర్భకై భూనాథ, వినుము.
నలమహీనాథుఁ డెంతయు జూదమాడి । కలిత భూషణములఁ గనకాంబరములఁ
బ్రకట రాజ్యంబుఁ బుష్కరునకు నోడి । యొకరుండె తన సతియును దానుఁగూడి
పురము వెల్వడి పోవఁ, బుష్కరు నాజ్ఞ । నిరవుగా నలువెంట నెవ్వరుఁబోవ

వెఱచి ; రంతట మహీవిభుఁ డా నలుండు । తెఱలక నిఖిల సత్కారార్హుఁడయ్యు
నిల విధికృతమున నెవ్వరిచలనఁ । గలిత సత్కారంబు గానకపోయి
సహజంబులగు బుభుక్షా పిపాసముల । సహియింపఁగాలేక చంచలంబంది
కనక పక్షంబులుగల పక్షివితతి । తన వెంటఁ దిరుగంగఁ దద్దయుఁ జూచి
భక్షింప నగునని పట్టంగఁ బూని । సూక్ష్మంబునఁ జొచ్చి యటఁ బోయిపోయి
కట్టినపుట్టంబు కడఁకతో విసరి । పట్టెదనని వానిపై వైచుటయును
బుట్టంబుతోడ నద్భుతముగా నెగసి । నెట్టనఁ బక్షులు నృపున కిట్లనియె :
" నీదు ధనంబును నీదు రాజ్యంబు । నాదటఁ గొన్నట్టి యక్షముల్ మేము ;
అనువొంద నీ వస్త్ర మపహరించుటకుఁ । జనుదెంచితిమి. " యని చయ్యన నరిగె.
అంతట నలుఁడును నద్భుతంబంది । కాంతాశిరోమణి గట్టిన యట్టి
పుట్టంబు చెఱఁగు నప్పుడు కటిసీమఁ । గట్టి యొండొరుల మొగంబులు చూచి
శోకమగ్నుల మైనచో దమయంతి । ప్రాకటంబునఁ జూచి పతికి నిట్లనియె :
" ఇది దక్షిణాపథ మిది విదర్భకును । ఇది కోసలకు మఱి యిదియుఁ జేదికిని
మార్గంబు లిందులో మన కరుగంగ । మార్గమెయ్యది? " యన మది చాల నలఁగి :
"లోలాక్షి, యడవులలోన నాతోడఁ । జాల దుఃఖముఁ బొందఁ జాలవు నీవు ;
నరవితో నీ బంధు జనముల కడకు । నరుగుము నీ." వన్న నతివ యిట్లనియె :
"అరయంగ దుఃఖ రోగార్తులకెల్ల । ధరణి లోపల నౌషధము నతిసుమ్మీ.
భామాసమేతుఁడై పరఁగిన వాని । కేమియు నాపద లెఱుఁగఁగరావు.
అలసిన వేళల నాఁకొన్న వేళ । నలవోక డస్సినయట్టి వేళలను
బురుషవర్యునకును బొలఁతియె ప్రాపు ; । కరుణతోఁ జిత్తవైకల్యంబు లేల ?
కావున నన్ను నో కలితాత్మ, విడువ । కేవిధంబుననైన నే వచ్చుటకును
సమ్మతి సేయు నిశ్చలవృత్తి." ననిన । నమ్మగువను జూచి : "యట్లు సేయుదును ;
ప్రాణసమానమై పరఁగిన నిన్ను । [1]నేణాక్షి, వెఱ్ఱినై యేల నే విడుతు !
నోడకు. " మని పల్కి యువిద నూరార్చి । పోఁడిగా నొకచోటఁ బొలఁతియుఁ దాను
రమణ ధూళీ ధూసర స్థలమునను । శ్రమము దీఱఁగ మఱి శయనించుటయును,
అమ్మధ్యరాత్రి నలావనీశ్వరుఁడు । సమ్మతిఁ దన పాదజలజసమీప -
మున నిద్రవోయెడి ముదిత నీక్షించి । ధనములు రత్నముల్ ధరణి రాజ్యంబుఁ

---

1. నేణాంకి. మూ.

బోవుటయును మిత్ర బుధులను బాసి । యీ విపినంబులో సతివయుఁ దాను
దిరుగుటయును మదిఁ దెఱఁగొప్పఁ దలఁచి । దొరఁకొని దుఃఖించి: "తొల్లి యీభామ
మృదుశయ్యలందును మెలఁతలు ప్రీతిఁ । బదము లొత్తఁగ మహా భాగ్యభోగముల
నిద్దురవోయెడి నిప్పు డీ నేలఁ (1) । దద్దయు నిద్రింపఁ దగిలియున్నదియు.
ఆదిగర్భేశ్వరి యనఁగఁ బెంపొంది । యాదట నాకును సతివయై యిట్టి
యిడుమలఁ బొందంగ నెంతయు వలసె ; । కడఁకతో నిట్టి దుఃఖము చూడనోప ;
నెక్కడికైన నేఁగెద నిపుడు ; । ఇక్కడ నను గాన కీపద్మనేత్ర
పుట్టినింటికిఁ బోయి భోగభాగ్యముల । నెట్టన వర్తించు నిజముగా." ననుచుఁ
బోవంగ సమకట్టి భూమీశ్వరుండు । వావిరి నం దర్ధవస్త్రంబు చించి
తనకటిపైఁ బరిధానంబు చేసి । కొని వెలువడి యంతఁ గొండొక నేల
యరిగి భామను బాయ నటఁ గాళ్లురాక । తిరిగి క్రమ్మఱవచ్చి ధృతిఁబోవు మగుడు.
అవనీశుఁ డిట్టు లుయ్యలయును బోలె । నువిదఁ బాయఁగలేక యొకకొంత ప్రొద్దు
నిలిచి చింతింపుచు నివ్వెఱఁగంది । కలిరాజు ప్రేరేపఁ గలఁగి చిత్తంబు
బాలామణిని గానపాలుఁగాఁ జేసి । యీలీలఁ బోయిన నేమానో యనక
విడిచిపోయిన, నంత విమలేందువదన । తడయక మేల్కాంచి ధవుఁ గానలేక
తనవస్త్రమును జూచి తలఁకుచు భయము । ఘనముగా నంత నల్గడలును జూచి:
"ఏమిసేయుదునింక ! నెవ్వరు దిక్కు ! । భూమీశ, యెచటికిఁ బోయితే యకట !
వీతదయుండవై విడువంగఁదగునె ! । బ్రాఁతిగా సద్ధర్మపరుఁడవు నీవు.
ఓడకుమని నన్ను నూఱడఁబల్కి । యోడకు సరిగితి ! వేమందు నిన్ను !
సత్యవ్రతుండవు జగన్నాథతిలక, । యత్యుత్తమోత్తమ, యబ్ధిగాంభీర్య,
హానాథ ! హానాథ !" యను నార్తరవము । మానుగా వనమెల్ల మల్లడి గొనఁగ
వగచుచు వేఁగుచు వరునిఁజీరుచును । ఒగి నెండకోర్వక యుసురసురనుచుఁ
గలఁగుచు నంత వృక్షంబులనీడ । నిలుచుచు నలయుచు నృపుఁ దలంచుచును
బులుఁగులు వాపోవఁ బోరి భయంబంది । తలఁకుచుఁ బులులను దంతులఁ జూచి
వడవడ వణఁకుచు వఱలుపూఁబోదలు । వడి రోయుచును దిశల్వారుసఁ [2]జూచుచును
తొడిఁబడి ముండ్లకుఁ దొలఁగుచు నేలఁ । బడుచు లేచుచు నిట్లు భామాలలామ
యరుగ నాహారార్థి యం దొక్కపాము । ఉరవడిఁ బట్టిన, నువిద భీతిల్లి

1. వితత 2. దూరు (మూ)

కదలంగనేరక కడునార్తరవము । వదలకసేయుచు వరుని జీరుచును,
"ఇఁకనైన రక్షింపు మేలతామసము । ప్రకటింతు నలమహీపాలక!" యనుచు
మొఱపెట్టుచుండ, నమ్మొఱయు నాలించి । యెఱుకువాఁడొక్కరుఁ డేతెంచి యంతఁ
దనచేతి సురియ నా దందశూకంబుఁ । గొని చంపుటయును, నక్కోమలి యపుడు
భూమిలోపల రాహుముఖముక్త యగుచు । శ్రీమించు నా చంద్రరేఖయుఁ బోలె
వెలువడియుండ, నా విపినచరుండు । నొలసిన ప్రేమతో నూఱడఁ బలికి
పరఁగంగఁ దత్సమీపంబున నున్న । సరసిలోపలను సుస్నానంబుసేయ
... ... .. ... ... ... । వనమూలఫలములు వడిఁ దెచ్చి యిచ్చి
అలయిక దీర్చి: "యో యంబుజగంధి, । నెలకొని యడవిలోనికి నేకతమున
వచ్చితి? వెవ్వరి వసితవు నీవు? । అచ్చుగా నెఱిఁగింపు." మని పల్క వాఁడు
నా యింతివృత్తాంతమంతయు నెఱిఁగి । కాయజుశరములఁ గడుఁ జాల నొచ్చి
యొనరంగఁ దనకు నాయువు నల్పమైనఁ । దనమనోరథము నంతయు నెఱిఁగింప,
దమయంతి కోపించి తత్క్షణంబునను । "రమణతో నేఁ బతివ్రతనైతినేని
యీ కిల్బిషాత్మకుఁ డిటఁ జచ్చుఁగాక । ప్రాకటంబుగ." నని పల్కనంతటను
దగ వాఁడు నగ్నిదగ్ధంబైనయట్టి । జగతీరుహమురీతి జగతిపైఁ బడియె.
అంత వైదర్భియు నంతరంగమున । నెంతయుఁ బ్రాణేశు నేర్పుతో నిలిపి (?)
తలకొని దుష్ట సత్వంబులవలనఁ । గల భయంబుడిగి యొక్కటఁ బోయిపోయి,
మునిపల్లెయొక్కటి ముదముతోఁగాంచి । వనిత డగ్గఱిపోయి వామదేవాది
సదయులైయున్నట్టి సంయమీంద్రులకు । వదలక మ్రొక్కిన వారు దీవించి:
"ఎవ్వరిదానవే యెలనాగ, నీవు? । అవ్వనలక్ష్మివో! యమరభామినివో!
ఈ దివ్యతనువుతో నీ యరణ్యముల । నేది కతంబుగా నిటఁ దిరిగెదవు?"
అనవుడు దమయంతి యమ్మునివరులఁ । గనుఁగొని పలికె: "నోఘనులార, వినుఁడు;
అవనిఁ బుణ్యశ్లోకుఁడనఁగఁ బెంపొంది । వివిధ యజ్ఞంబులు వెసఁజేసినట్టి
నలునిభార్యను; గుణోన్నతులార, వినుఁడు । అలవడ దమయంతి యండ్రు నాపేరు.
మునుమిడి విధికృతంబున విభుఁబాసి । వెనుకొని యడవిలో వెదకుచు నిట్లు
తిరుగుచునున్నాను; ధీరాత్ములార, । కరమొప్ప భూవిభుఁ గానరే మీరు?
తెలివితో నిఁకఁ గొన్నిదినములు వెదకి । కలగొన నాతనిఁ గానరాకున్న
విడుతు దేహం."బని వెస నేడ్చుచున్న । పడఁతిఁ గనుంగొని భక్తి నిట్లనిరి:

"వనజాక్షి, వినుము నీ వరుఁ డింకఁ గొన్ని । దినములకును గడుఁ దేజంబుమీఱి
కరమర్థితో నీకుఁ గానంగఁబడును ; । ఇరవొప్ప రాజ్యంబు నేలంగఁ గలఁడు ;
ఏముఁ దపోదృష్టి నిట్లు చూచితిమి ; । భామ, దుఃఖింపకీ పట్టున." ననుచుఁ
దమ యగ్నిహోత్రముల్ దాముఁ నాక్షణమ । క్రమమొప్ప నంతటఁ గానరాకున్న,
ఒనరంగ నిది కల్లయో నిక్కవంబో । యని విస్మయమునొంది యాదమయంతి
చనిచని ముందఱఁ జనుప నీక్షించి । యనయంబు వోవంగ, నందలి జనులు
కెరలుచు ధూళి ప్రాఁకిన రూక్షమగుచుఁ । గరమొప్పు నీలాలకంబులదాని,
నతి మలినంబైన యర్ధవస్త్రమున । ధృతి నావృతంబగు దేహంబుదాని,
నాఁకలి నీర్వట్టు నటనిద్ర యనక । వీఁకతోనున్న మువ్వీధి గలదాని
దమయంతిఁ గనుఁగొని తత్క్షణంబునను । గొమరేది భయమంది కొందఱు వాఱ
వెనఁబిశాచంబని వెఱఁగంది కొంద । ఱసదృశగతిఁ జూడ, నందులోఁ గొంద
ఱలవడఁగా వేలుపని మ్రొక్కుచుండ । ... ... ... ... ...
వనితయు నాసార్థవాహులఁ జూచి, । "ఘనమైన యి మ్మహాగహనంబులోన
నరవి తోడుత నిట్టి జనసంకులంబు । కరమర్థితో నేఁడు గానంగఁబడియె
నెట్టిపుణ్యమొ" యని యిభరాజగమన । గట్టిగా వారలకడఁ జేరి యనియె :
"ఓ పుణ్యనిధులార, యుర్విలో నిషధ । భూపాలుభార్యఁ బెంపొందఁగా నేను ;
దమయంతి యనుపేరఁ దనరిన దాన; । క్రమము దీపింపంగఁ గానరె నలుని ?
ఆతనిఁ బాసి యీ యడవులలోన । నీతఱి దుఃఖాబ్ధి నీఁదుచున్నాను."
అనవుడు నందులో నలవొప్పు నలుని । వనితతో శుచి యనువాఁ డిట్టులనియె :
"నలుఁగాన మి వ్విపినంబున మేము । పొలఁతి, గాంతుము క్రూరభూరి సత్వముల.
అని పల్క, దమయంతి యట వానిఁ జూచి : । 'చనుప యెంజరిగెదు నరవితో నాకు
నెఱిఁగింపు' మనవుడు 'నిటఁ జేదిపురికి । నఱలేక పోయెదు,' నని చెప్పుటయును,
వారితోడనె గూడి వడిఁ బోవఁబోవ । వారక చనుపయు వలనైన యొక్క
చెఱువుండ నలసి చెచ్చెఱ విడియుటయు, । నరుదార నంతట నర్ధరాత్రమున
గజయూథములు జలకాంక్ష నేతెంచి । నిజముగా నచ్చోట నిద్రింపుచున్న
వారినందఱ మట్టి వధియింపుచుండ । వాఱక గొందఱు వడిఁ దరులెక్కి
యుండఁ, జావుకుఁదప్పి యుత్పలనేత్ర । "యండగానున్న వీ రణఁగిరే యకట !

తన్ను జంపక పోయెం దగవారణమ్ము । లెన్నంగ నింక నేనేమి సేయుదును !
తొలిమేనం జేసిన దుష్కృతం బిదియొ ! । వలనొప్ప నా స్వయంవరమున సురల
వరియింపకుండిన వారె యీ రీతి । దురవస్థ చేసిరో తొడంబడ!" ననుచు
అలవడ హత శేషమైన [1]యాచనుప । ... ... ... ... ...
తోడం గూడుక చని తోయజవదన । పోడిగా నటం జేదిపుర మటు చొచ్చి
రమణీయమైనట్టి రాజమార్గమున । దమయంతి యే తెరం దగ రాజమాత
ప్రాసాదముననుండి పరికించి కాంచి । [2]యాసతోం దనదాది కర్థి నిట్లనియె :
"జీర్ణమై కుఱుమాపు చీరధరించి । తూర్ణవైఖరి ధూళి ధూసరాలకము
లలవడం దూలుచు నంబుజవదన । చెలంగి యున్మత్తవేషిణియైన లచ్చి
కిరణి వచ్చెడిదానిం గంటివే నీవు ? । గుఱుతు మీఅంగ నక్కోమలి మీంద
నతి వేడుకయ్యెడు నటం దోడితెమ్ము । జతనంబుగా." నన్నం జని దమయంతిం
దోడ్కొని వచ్చినం దొయ్యలి చూచి । వేడ్కతో నిట్లను : "విను మంబుజాక్షి !
యెవ్వరి దాన ? వి ట్లీరీతి నొంటి । జవ్వని, దుఃఖంబుచేం బరవశత
నున్నదానవు చెప్పు మొగి నాకు." ననినం । గ్రన్నన నప్పుడా కాంత యిట్లనియె :
"పడంతిరో, వినుము మత్పతి జూదమాడి । యడవికిం జనిన నే నాతనివెంటం
దోడునీడయుం బోలెం దొడరి పోవుటయు । జాడగా నతి బుభుక్షాతురుండైన
ధవునిచే నెంతయు దైవానుగతిని । వివిధభంగుల నేను విడువంగం బడితి.
అంత నుండియుం బతి నట వెదకుచును । అంత కంతకు వియోగాగ్నిచేం గంది
నరవి సైరంధ్రి వేషంబు గైకొనుచు, । నరయుంగం గందమూలాదు లాహార
గతి నాచరింపుచుం, గాననంబునను । గృతమతిం, బ్రొద్దు గ్రుంకినచోట నిల్చి
మృగములే తోడుగా మెలంగితి." ననుచు । నెగడు శోకమునం గన్నీరొల్కుచుండం
ద జ్జలంబులం బయోధర పరాగంబు । న జ్జలజాతాక్షి యడుసు చేయుచును
మిన్నక యున్న, నిమ్మెయి రాజమాత । మన్నించి మఱియు నమ్మగువ కిట్లనియె :
"నా యొద్ద నుండు మో నలినాయతాక్షి ! । పాయక పనుతు నీ పతి నరయుటకు
ఘనమైన విప్రులం గడంకతో." ననినం । దనరంగ భీమనందన యిట్టులనియె :
"ఒనర సైరంధ్రినై యుండియు నేను । ఎనయు నెంగిలి ముట్ట, హీనంపుంబనులు

1. బ్రాహ్మణుల 2. యాసట (మా)

సేయ, నన్యులతోడఁ జెలఁగి మాటాడ; । పాయక నావిభుఁ బరికింపఁ జనెడి
ధరణిదేవతలతోఁ దగ్గ పల్కుదును । విరివిగా; నశ్లైన వినుము నీ యొద్ద
నుండెద." నని పల్క నొడఁబడి యపుడు । దండిగా మన్నించి తగ రాజమాత
తన కూఁతురగు సునందకు నప్పగించి । తనరినఁ, బుణ్యవ్రతములు సేయుచును
బరువడి మదిలోనఁ బతిఁ దలంపుచును । విరహతాపంబున వేఁగుచు నుండె.
అట నిషధేశ్వరుఁ డా దమయంతిఁ । దటుకునఁ బాసి యొంతయుఁ బోయి పోయి
విస్ఫులింగంబులు వెస నభ్రపథము । విస్ఫారగతి నంటి విపులంబుగాఁగ
మండుచు వనవహ్ని మహి యెల్లఁ గప్పి । యుండంగ నందులో నొకపాము చిక్కి
"ఓ నిషధేశ్వర, యురు కీర్తిహార, । మానుగా నను గాచి మన్నింపవయ్య!"
అని యని పల్కెడు నార్తరావంబు । విని శంక లేక [1]యుర్వీశ్వరుఁ డంత
మఱియు దావానలమధ్యంబు కరిగి । యఱలేని ప్రేమతో నంతటిలోన
నొక్క నాగకుమారు నొప్పుగాఁ జూచి । తక్కక యిట్లను దయ పెంపుమీఱ:
"నీ వెవ్వ? రీరీతి నెఱిచెడి చిక్కి । తేవిధిఁ? గారణం బెఱిఁగింపు." మనిన
నతఁడు కృతాంజలి యగుచు నిట్లనియె: । "క్షితినాథ, వినవయ్య చెలఁగి నా తెఱఁగు
గొనకొని కర్కోటకుం డనువాఁడ । నెనయంగ నొకముని కెగ్గొనరించి
యతని శాపమున [2]నిశ్చలతి నిచ్చోట. । కతలేల యేమియుఁ గదలంగ లేక
చిక్కితి రక్షింపు చెలిమితో; । నీకు గ్రక్కున [3]నొక యుపకార మొనర్తు."
నని పల్కుటయు నలుం డాతని నెత్తి । కొని చావుదప్పించి కొంతద వ్వరిగి
విడువంగఁబోవుచో, వెస నాతఁ డప్పు । డడుగులెన్నుచుఁ బోవ నంతటిలోన
ధరణీశుఁ గఱచి యంతట నిజరూపు । ధరియించి నలమహీధవునితో ననియె:
"వికృతపురూపయ్యె వెలయంగ నీకు । నకలంకమతి, యిందుకై భయపడకు;
ఎవరు నిన్నెఱిఁగిన నెగ్గగుఁ గానఁ । దివిఱి నేఁ జేసితి ధృతి నిట్టివిధము.
తెలియు నావిషము నీ దేహంబునందు । నెలమి తోఁడుత నుండు నెంతకాలంబు
నంతకాలంబు విషానలశత్రు । నంతతిభయము నిశ్చయముగాలేదు.
కదన జయంబును ఘనరాజ్యవిభవ । మదనుగా దమయంతి యతులసంగమముఁ
గలుగును నిక్కము కరుణావిధేయ! । చెలఁగి నీ నిజరూపు చేకొన నెపుడు
తలఁచితి వప్పుడే తలఁపుము నన్ను । నొలసి యీవస్త్రంబు నొద్దికి వచ్చు.

1. ధరా యుర్వీశ్వరుండు 2. నిట్లయ్యునిచ్చటికి 3. నుపకారక్రమ్మొనర్తు (మూ.)

అపుడది ధరియింపు మగుచు నీరూపు । విపులంబుగాసని వెస నరమిచ్చి
... ... ... ... ... ।వెలయ నయోధ్యకు విభుఁడైనవాఁడు
ప్రతిమతి యిక్ష్వాకు వంశవర్ధనుఁడు । ఋతుపర్ణుఁ డనురాజుఁ బ్రేమతోఁ గొలిచి
నూపవర్తననుండి సొలవక నీవు । నేపుతోడుత నశ్వహృదయ మాతనికి
నిచ్చి యక్షహృదయ మెలమిఁ జేకొనుము । చెచ్చెర." ననిబుద్ధి చెప్పి యాపాము
కానరా కరిగినఁ, గడఁగి యానలుఁడు । తానయోధ్యకుఁజని ధరణీశుఁ గాంచి:
"బాహుకుండనుపేరఁ బరఁగినవాఁడ; । నూహించి దిద్దుదు నుత్తమాశ్వముల;
వంటలు బాగుగావండంగనేర్తు; । నంటున నినుఁ గొల్తునని వచ్చితిని."
అనవుడు ఋతుపర్ణుఁ డతని కిట్లనియె: । "అనఘాత్మ, నీవు నాయశ్వరత్నముల
నొనరంగ దిద్దుచు నుండుమిచ్చటనె । ఘనులైన యశ్వశిక్షకులు నీవంపు
సేయంగ," ననిన నాక్షితినాథుఁ గొలిచి । పాయక జీవల వార్ష్ణేయులనెడు
వారు సహాయులై వర్తిల్లనుండె. । ఆరయ నొక్కనాఁ డంతరంగమున:
"నెలనాగ, [1]యరిగితి వెందుల కకట! । కలఁగక యివ్వు డేగతి [2]నున్నదాన!
పతివ, యెవ్వరిచేత నడవులలోనఁ । బ్రతిలేక యట నెందుఁ బడితివి నీవు!
మృగములు బ్రింగెనో మృగనేత్ర, నిన్ను! । తగ నగ్నిలోపల దగ్ధమైతివొకో!
పుట్టినింటికిఁ బోయి పొక్కుచుండితివో! । యిట్టులుండవలసె నేమి నేయుదును!
హా ప్రాణనాయకి! హా కంబుకంఠి! । హా ప్రియవచన! నీ యంగసంస్పర్శ
చాలదె! నీయట్టి సతి యుర్విఁ గలదె! । యీలీల విధిచేసె నేమనఁ గలదు!"
అని రాత్రులెల్లఁ బాయక నిద్రలేక । పొనర నిట్టూర్పులు పుచ్చుచునుండ,
నతని ప్రలాపంబు లా జీవలుండు । వితతమై యొకనాఁడు విని మది నవ్వి
"కక్కువచ్చెడిఁ దన్నుఁ గనుఁగొన్న యపుడె; । తక్కక వీఁ డిట్లు తలఁచెడి భామ;
లీల నీతనికంటె లెస్సగాకున్నె! । వాలాయముగ." నని వద్దకువచ్చి
"నీతలంచుచు నున్న నెలఁతకు నీకు । నేతెఱంగున నయ్యె నిట వియోగంబు?"
అని యడుగుటయు బాహుకుఁ డిట్టులనియె (?) । "ననుజూచి రోయ రే! నలినాక్షులేడ
నేనేడ, విరహంబు నిలలోననేడ, । పూనిక లేడ, నీపాలుపె నేనెఱుఁగ.
అలసి మందప్రజ్ఞుఁ డను భటోత్తముఁడు । లలితాంగిఁ బాసి యీలాగు దుఃఖింప

---

1. యరిగెనో యెందుల కకట 2. నున్నయదియొ (పా)

విని నేను నేర్చి యవ్విధిఁ బ్రలాపింతుఁ । బూనుపడి యెంతయుఁ బ్రొద్దుపోకకును."
అని చెప్పి య ట్లయోధ్యాపురంబునను । గొనకొనియుండె నా కువలయేశ్వరుఁడు.
అంత విదర్భేశుఁడైన భీముఁడు । ఎంతయు నిషధేశుఁ డిలయెల్ల నోడి
పోవుటయును జాలఁబొక్కి చిత్తమున । భావించి దుఃఖించి పరితాపమంది
వెదకొని వారల వెదకింపఁదలఁచి । ఘనులైన విప్రులఁ గడఁకరప్పించి
"నలదమయంతు లున్నతి నున్నచోట్లు । తెలివితో నెవ్వరు తెలిసివచ్చినను
వారికి నిత్తు నే వలసినధనము । నాహర్షికోడ నూళ్ళగ్రహారములు."
అని పల్కి వారల కర్థి ధనంబు । పెనుపొందఁ నిచ్చియంపిన, వారు వోయి
పనివడి పల్లెలుఁ బట్టణంబులును । వనములుఁ జొచ్చి యావసుధేశు వెదుక,
నందులోన సుదేవుఁడను విప్రవరుఁడు । పొందుగా నటఁ జేదిపురమున కరిగి
భూపసుతులు .. ... ... । ఆ సుబాహునియింటి కరుగంగఁజూచి
వారితోడనె గూడి వడి నంపుఁబోయి । యారాజు సంపద కాత్మలోనలరి
యంతఃపురంబున నా సునందయును । గాంతలు కొందఱు కరమర్థి నుండఁ
దనరంగ ధూమావృతంబయియున్న । యనలమో యనియెడు నలరారుదాని,
సాంద్రనీలాంబుద సంవృతంబైన । చంద్రరేఖయుఁబోలె సరినొప్పుదానిఁ
గనుఁగొని దమయంతిగా నిశ్చయించి । యనఘుఁ డా [1]వసుదేవుఁ డయ్యింతికనియె:
"దమయంతి, నీతల్లిదండ్రు లాత్మజులుఁ । గ్రమమొప్పఁ గుశలులై కడఁకనున్నారు;
ఎనయుంగ మీ నేను మెఱుఁగునంతకును । వనటఁగుందుచు నున్నవారు నిక్కమము.
వనగల యే భవద్భ్రాతృసఖుండ । వసుదేవుఁడను విప్రవర్యుండ వినుము.
ఆ విదర్భేశ్వరుఁడైన భీముండు । వేవేగమున మిమ్ము వెదకఁగఁ బెక్కు
ధరణీసురులఁ బంపెఁ దథ్యంబుగాఁగ; । పురుడింప నేఁడు నాపుణ్యావశమునఁ
గనుఁగొనఁ గంటి నో కల్యాణి, నిన్ను." । అనవుడు దమయంతి యశ్రువులొలుకఁ
దనవార్త చేర్చి దప్పక యడిగి । యెనయ నగ్గలముగా నేడ్వ సునంద
"యేలకో సైరంధ్రి యేడ్చుచున్నదియు । నీలోన!" యని తనహృదయంబు కలఁగ
తనతల్లికెఱిఁగింపఁ, దగ రాజమాత । చనుదెంచి విప్రుతోఁ జయ్యనఁబలికె:
"ఎవ్వరికూఁతురు, ఎవ్వరికోడ, । లెవ్వరిభార్య యీ యిభరాజగమన?
ఏ నిమిత్తంబున నిందఱఁబాసి । జానొప్ప వ్రతములు సలుపుచున్నదియు?

---

1. సుదేవుఁడని కవిత్రయ వ్యాసభారతములు.

ఎనయంగ దీని నీవెట్లెఱింగితివి? । పెనుపొంద నీయింతి చేరేమి?" యనిన
నారాజమాత కిట్లనియె బ్రాహ్మణుఁడు : । "ఈరామ విను విదర్భేశుని తనయ;
అనవిఁ బుణ్యశ్లోకుఁడనఁగఁ బెంపొందె । వివిధ యజ్ఞంబులు వెలయంగఁజేసి
మించిన నలుదేవి మీనాక్షి వినుము. । అంచితగతి దమయంతి యనంగఁ
బరఁగినపేరు ఈభామకు వినుము. । పరమతితో దైవవశమున నిటకుఁ
జనుదెంచి విప్రులు సరవినివెనుక । జననాథుఁడంపిన జని రెండ్రైన.
ఏ నిందులకువచ్చి యెఱిమి నీచేత । శ్రీ నిత్యముగ సురక్షితముగా నున్న
యీయింతిఁ జూచి యే నెఱుఁగంగలేక । ఏయాయక భ్రూయుగ మధ్యంబునందుఁ
బనివడి పద్మప్రభాసమై ధాత్రి । ఘనవిర్మలంబైన గలుగులక్ష్యంబు
ధూళిచేఁ గప్పినఁ దోడిఁబడఁజూచి । యీలోన వైదర్భి యని యెఱింగితిని."
అనిన విస్మయమంది యారాజమాత । ఘనముగా శుద్ధోదకంబుల దాని
మానిత భ్రూయుగమధ్యంబు గడుగఁ । గా నేరుపడియె లక్ష్యం బంతలోన
నందఱు నాశ్చర్యమంది సంతోష । మందంద మిక్కిలి [1]యగ్గలంబుగను
ఉండి; రంతటిలోన నోగి రాజమాత । దండిగా నక్కున దమయంతిఁజేర్చి,
"నాకూఁతురవు నీవు నలినాయతాక్షి! । సాకల్యముగ నీదు జననియు నేనుఁ
దోఁబుట్టులము సుమీ తోయజనేత్ర! । ... ... ... ... ...
... ... ... ... ... । ఇరువురమును [2]బుట్టితిమి సొంపుమీఱ (?)
రమణతోడ దశార్ణరాజుగర్భమున; । నమధికంబుగ భీమసతి యయ్యెనదియు;
నే వీరబాహున కింతియు నైతి । భావింప." నని చెప్పఁ బరితోషమంది
యా రాజమాతకు నందంద మ్రొక్కి । తా రమ్యగతి సునందను గౌఁగిలించి
తేఁకువతోఁ గొన్ని దినము లందుండి । దీకొని యొకనాఁడు దేవి కిట్లనియె:
"ఎలమి దీపింపంగ నివియును నదియుఁ । బొలుపొందఁగా నాకుఁ బుట్టినిం డ్లరయ,
నైనఁ దల్లినిఁ దండ్రి ననుజుల సుతుల । జానొప్పఁ జూడఁగ సంతోషమయ్యెఁ;
బనివడి యే విదర్భకును బోవలయు." । ననుచుఁ గృతాంజలియైన నయ్యింతి
కనుఁగొని యాందోళికము నెక్కఁబనిచి । వనితలఁ గొందఱ వరుసతోఁ గూర్చి
నెలమితోడుతఁ బుట్టినింటికిఁ బోయి । పొలుపేది యందుండి పురుషుని రాక

---

1. అన్యుతంబగుమ. 2. పుట్టి తింపు సొంపలర. (మూ)

గోరుచుఁ బ్రాణముల్ కుత్తుకనిలిపి । యారూఢిఁ జరియించి యట నొక్కనాఁడు
ఏకాంతమునఁ దల్లికి ట్లని పలికె : । "శోకాపహరణుని సూనృత వ్రతుని
ననఘుఁ బుణ్యశ్లోకు నబ్ధిగాంభీర్యుఁ । గనకాద్రి సమధైర్య కలితు నా నలుని
నరయంగఁ బుచ్చుఁడీ యవనిలో సతఁడు । పరువడి లేకున్నఁ బ్రాణముల్ విడుతుఁ
[1]ననఁ దల్లి దమయంతి యంతరంగంబు । తనరఁ దండ్రికిఁ దెల్పఁ, దగ భీముఁడంత
వీరసేనాత్మజు వెదకఁ బొండనుచు । ధారుణీ దేవతాతతిఁ బంపుటయును
వారిఁ గనుంగొని వైదర్భి యనియె : । "ఆరయ నిషధేశుఁ డసమర్థుఁ డగుట
నెవ్వారలును దన్ను నెఱుఁగకుండంగ । నవ్విధిఁ జరియించు, నదిగాన వేగ
ధరణీనాయక సభాంతరముల కరిగి । యరిగి మీరల్ల నిట్లనుఁడు పెంపెసఁగ :
"సత్యనిత్యుండవు సతి నిట్లు మొఱఁగి । యత్యంత గతి దాని యర్ధవస్త్రంబు
దఱిగి నీకటిఁ బరిధానంబుచేసి । మఱి కాన విడిచిపోమనుజేశ, తగునె !
కృతమతి నగ్నిసాక్షిగఁ బెండ్లియైతి; । చతురత సతికిఁ బ్రసన్నుఁడ వగుము."
అనియాడి ప్రతివచనావళి యెఱిఁగి । చనుదెందు మీ రన్నఁ జయ్యన వారు
సతివను వీడ్కొని యాప్రొద్దె యరిగి । చతురతతో సర్వసభల నారీతిఁ
బలికి కానకవచ్చి భామినీమణికిఁ । జెలువేది ప్రతివార్త చెప్పిరందఱును.
అంతటఁ బర్ణాదుఁ డను విప్రవరుఁడు । ఎంతయు దమయంతి కిట్లనిపలికె :
"తరలాక్షి, యే నయోధ్యా పురికరిగి । పరఁగ నీ కఱపిన పలుకు లన్నియును
ఋతుపర్ణుసభఁ బల్కఁ బ్రేమతోడుతను । దతభంగి నూఱుగద్యాణంబులైన
జీవితంబు గలాఁపు శీఘ్రప్రయాణ । తా వివేకుఁడు వికృతపు రూపువాఁడు
కుఱుచచేతులవాఁడు ఘోటచోదకుఁడు । (నొఱవ దేహంబువాఁ డొగి నఱపాడవు
బాహుకుం డనువాఁడు పరికించి [3] నన్ను । ... ... ... ... ...
దొలఁగించి యేకాంతమునఁ గొనిపోయి । వెలవెల్ల నగుచు నిర్విణ్ణుఁడై పలికె:
'సతి భర్తయందు దోషంబు గల్గినను । వ్రతమతి సహియింపవలయు ; ధర్మంబు.'
అని మాటలాడక యశ్వవానముకుఁ । జనియె." నంచును జెప్పఁ జంద్రబింబాస్య
పొలుపొంద నెంతయుఁబ్రొద్దు చింతించి, । "నలుఁడు గాకుండిన నయము దీపించి
రమణతోఁ బ్రత్యుత్తరంబేల యిచ్చు ! । క్రమముతోడుత నేర్పుగలవానిఁ బనిచి
యెలమి దీపింపంగ నెఱుఁగంగవలయు । నలరంగ." నని తండ్రి యనుమతంబునను

---

1. ననయంగ దమయంతి యంతరంగంబు 2. జీవితంబవేలేదు. మూ. 3. నిన్ను-మోహించి పా.

వసుదేవు రావించి వనితాలలామ । యసదృశ వార్ష్ణేయ్ని నతని కిట్లనియె :
"క్షితి నన్ను నెఱిఁగి తెచ్చినయట్లు నలునిఁ । జతురతఁ గొని తెమ్ము సర్వజ్ఞ, నీవు.
వెలయ దేశాంతరవిప్రుండ వగుచు । నలపడఁగా నయోధ్యాపురికరిగి
ఋతుపర్ణుఁ గనుఁగొని ప్రేమతోడుతను । వ్రతమతిపై కొన్ని వార్తలు చెప్పి
వెనుక ని ట్లనుము 'భూవరుఁడు భీముండు । వెనుకొని నిషధేశు వెదకించియెందుఁ
గానక వెండియుఁ గంబుకంఠికిని । మీనాక్షికిని మహామృగరాజమధ్య
కొనర స్వయంవర మొప్పఁ జాటింప । ఘనముగా భూమిలోఁ గలరాజులెల్లఁ
బోయెదరనిచెప్ప' పొందుగానీవు । పోయక." యనవు డా బ్రాహ్మణోత్తముఁడు
తగు శీఘ్రగతి నయోధ్యాపురి కరిగి । జగతీశుఁ బొడగని సరసవాక్యముల
నా దమయంతీస్వయంవర మనుచు । మోదంబుతోఁ జెప్ప, మొగి విప్రుఁజూచి
ఋతుపర్ణుఁ డిట్లనుఁ బ్రీతి " నోవిప్ర, । యతులితంబుగ నెన్నఁ డా స్వయంవరము ?
ఎల్లియా ?" యనవుడు, " నెల్లియోకాక । యెల్లుండియో !" యన నేపుదీపించి
యావిదర్భకుఁబోవ నంగీకరించి । వేవేగ బాహుకు వీక్షించి పలికె :
"బాహుక, నీనేర్పుపనియెల్ల నేఁడు । ఊహించి చూచి నీ కొనరింతుఁబ్రీతి."
అని రథంబెక్కుచు హర్షంబు తోడఁ । జనివడి బాహుకవార్ష్ణేయయుక్తుఁ
డై పోవఁబోవ, నయ్యరదంబు వేగ । మేపారఁబోవఁగ నిక్ష్వాకుకులుఁడు
" ఇది సూర్యు నరద మో ! యితఁడనూరుండో ! । వదలక యిటువంటివాని నేఁగాన."
అని హరుసింపుచు నరుగ, వార్ష్ణేయుఁ । డనువాఁడు మిక్కిలి యాశ్చర్యమంది
" శాలిహోత్రుఁడో ! కాక శక్రసారథియొ ! । శ్రీలీలగల వీరసేనాత్మజుండో !
కాక తక్కొరులు ఈగతియెఱుంగుదురె । ప్రాకటంబై నట్టి రథహాయ నీతి !
క్షితి వయోవిద్యావిశేషసంపదల । నతులిత స్ఫూర్తి నలావనీనాథుఁ
బోలి యీ వికృతరూపున నున్నవాఁడు ; । ఈ లీల నుండుట కేమికారణమొ !"
అనుచు సంశయమంది యటఁబోవుచుండ । నొనరఁగ ఋతుపర్ణు నుత్తరీయంబు
భూమిపైఁ బడిన నప్పుడు బాహుకునికి । నా మహీవల్లభుఁడర్థి నిట్లనియె :
'అగపడ నుత్తరీయంబు వార్ష్ణేయుఁ । డొగిఁదెచ్చుదాఁక బాహుక, నిల్పురథము.'
అనవుడు బాహుకుఁ డారాజుఁ జూచి, । "యనఘాత్మ, యుత్తరీయము పడ్డచోటు

నరవిభో నొక్కయోజన మిచ్చుటకిని; । ఇరవొప్ప వార్ష్ణేయుఁడేరీతిఁ దెచ్చు?"
నని రథవేగ మాహాత్మ్యంబు చెప్పి । చనఁగ, ననేక దేశంబులు గడచి
పోవుచు, నొక్కెడఁ బుష్పఫలములఁ । ...   ...   ...   ...
...   ...   ...   ... । బాయక జొంపమై పరఁగినయట్టి
ఘన విభీతకమునుగని కోసలేంద్రుఁ । డొనరంగ నంత బాహుకున కిట్లనియె:
...   ...   ...   ...   ...   ... । ...   ...   ...   ...   ...
"ఇది యక్షహృదయంబు, ఎవఁడెఱిఁగెడినో । యదనుగా నతఁడు సంఖ్యావిదుండగును;
కలుషంబు విషమును గ్రక్కునఁ బాయు; । నలలిత గుణముల సర్వజ్ఞుఁడగును."
అనుచు బాహుకునకు నయ్యక్షహృదయ । మనురాగముననిచ్చి యావిదర్భకును
'క్షితిపశ్వహృదయ మిచ్చెదఁ గొనుమీవు । ఋతుపర్ణ!' యనవుడు ప్రీతితోనతఁడు
"నట్లసేయుదు నేను నదియునీయందె । నెట్టన నుంచనీ; నెఱి నాకువలయు
నప్పుడు గైకొందు." ననవుడు నంతఁ । దప్పక నలమహీధవుఁ డక్షహృదయ
సామర్థ్యమునఁ గడు సంతుష్టుఁడైన । భూమీశ్వరుని మున్న పొందినకలియు
వెలయఁ గర్కోటకవిషము గ్రక్కుచును । వెలువడి చేతులు వెసమోడ్చి తన్ను
నెఱిఁగించి వణఁకుచు నెదుటనుండుటయు । నతిముఱిఁ గోపించి యట శపియింపఁ
దలఁచిన, నెఱిఁగి యంతట శనైశ్చరుఁడు । ...   ...   ...   ...   ...   ...
"అవనీశ, నినుబొంది యహిగరళమున । నవిరళ దగ్ధుఁడనై యున్నవాఁడ.
చనవొప్ప నన్నింక సహియింపవలయు." । నని కడుఁబ్రార్థించి "యవనీశ, నిన్ను
దలఁచినవార లెంతయును నావలనఁ । గల భీతిలేక వేట్కలనుందు రధిప!"
అని విభీతక వృక్ష మాశ్రయించినను । బని వడి యది మొదల్ ప్రఖ్యాతమయ్యె.
మఱి వికృతపురూపుమాత్రముదక్క । నఱలేక తక్కినయట్టి దుఃఖముల
వలన విముక్తుఁడై వడి రథంబెక్కి । యలవడ నపరాహ్ణమైన వేళకును
నావిదర్భకుఁ బోవ, నంత భీముండు । వావిరి నెదురుగావచ్చి తోడ్కొనుచుఁ
బోవ రథధ్వని పొందుగాఁజెవుల । నావేళసోఁకిన నాదమయంతి
నలుని రథధ్వని నలి నిదె యనుచు । నలవడఁగాఁ గడు హర్షంబుకొంది
"నలు నిషధేశుఁ బుణ్యశ్లోకు ఘనునిఁ । గలితాత్మ నేఁ జూడఁ గంటిఁబో నేఁడు;
ఘనభుజుఁ జూడంగఁ గాననినాఁడు । వెనుకొని ప్రాణముల్ విడిచెద." ననుచు
నరదంబుపైనెక్కి యట వచ్చుచున్న । ధరణీశు ఋతుపర్ణుఁ దప్పకచూచి

యప్పటి సంతోషమంతయు నుడిగి । తప్పక దుఃఖించెఁ; ద దనంతరంబ
భీమ భూపతి వానిఁ బ్రేమఁ బూజించి । హేమహార్మ్యము చూప నెలమి నందుండి
అవని స్వయంవరంబనెడి శబ్దంబు । తవిలి లేకున్నను దనలోనఁ బలికె
"ధరణిలోఁగల రాజతతి నెవ్వరైన । వరమతి వచ్చినవారును లేరు ;
ఉరవడి వైదర్భి యొరుల వరింప । సరవి సధర్మైక చరితయె!" యనుచు
నుండెఁ దద్దయు లజ్జయొదవి యెంతయును. । కండిగా రథశాలఁ దవరు నశ్వముల
బంధించి రథసమీపమున బాహుకుఁడు । సింధుర భీమఁ దూర్జితశక్తి నుండె.
అట దమయంతియు నంతరంగమునఁ । జటులదుఃఖమునొంది చాలఁజింతించి
"పరఁగ నయోధ్యాధిపతి ఋతుపర్ణుఁ ; । డరయఁగ వార్ష్ణేయుఁడట సూతజుండు ;
బాహుకుండెవ్వఁడో ! పనివడ నాకు । నూహించి తెలియంగనొప్పనివేళ ;
వెనుకొని వానిపై వేడుకయొదవె." । నని కేశినియనుదాసి నప్పుడ పిలిచి
"పనివడి యాతఁడు పర్ణాదునకును । ననిచిన ప్రతివచనంబిచ్చె నాఁడు.
కావున నాతనికడ కేఁగి నీవు । నావిధ మెఱిఁగిర." మ్మని పంపుటయును
అది పోయి బాహుకు నంతటఁ గాంచి । "అదనుగా [1]నీ సేమమడుగఁ బుత్తెంచె
దమయంతి; [2]యేమికతమున నిచ్చటికి । నమరంగ వచ్చితి?" వనఁగ బాహుకుఁడు
"నలి దమయంతీ పునస్స్వయంవరము । నలరఁగఁ జేయఁ బాయక భూమిపతుల
రావింపఁ బంచిన, రాజశేఖరుఁడు । వావిరి ఋతుపర్ణ వసుమతీశ్వరుఁడు
విని వేడ్కఁ బుట్టిన వెసనొక్కనాఁటఁ । జనవొప్ప నతనికి సారథినగుచు
శతయోజనములు వేసరక వచ్చితిమి । అతులితంబుగ." నన్న నాయింతి పలికె
"నెలకొని ఋతుపర్ణు నిను నెఱిఁగితిమి ; । వలనొప్ప మూఁడవవాఁ డెవ్వఁ?" డనినఁ
దొలఁగక కేశినితోడ బాహుకుఁడు । నలవడఁగా నిట్టులని చెప్పఁదొడఁగె:
"నలుని సారథి వాఁడు నయమూర్తి ఘనుఁడు । చెలువుఁడనఘుఁడు వార్ష్ణేయనామకుఁడు."
అనినఁ గేశినిపల్కు "నాతఁడు నలుఁడు । చనినచోటెఱుఁగునే? చెయ్యన." ననినఁ
బనివడి దానితోఁ బలికె బాహుకుఁడు । "అనువుగా వార్ష్ణేయుఁ డానిషధేశు
తనయుల భీమునొద్దన డించిపోయి । చనవేది నలుఁడు రాజ్యభ్రష్టుఁడయ్యె
నని నడుమనవిని యాఋతుపర్ణు । గొనకొని భక్తితోఁగొల్చి వర్తించె;

---

1. నిశ్మమయరిగి 2. యీవేళఁదడయ కిచ్చటికి. (మూ)

నలునెఱుఁగఁడువాఁడు ; నలునితోఁగూడ । జలజాక్షి వైదర్భి చనియెఁ గానలకు.
ఆ కాంతయొండెఁ బాయక నలుఁడొండెఁ । గా కొరులకు నెఱుఁగఁగవచ్చునట్టి
కారణంబేమియుఁ గలదెయ్యేరికిని । ఆయూథితో." నన్న ననియెఁ గేశినియు
"అడవిలో వస్త్రార్థ మాతండుచించి । కడు దయలేక యొక్కెడ డించిచనిన,
నాఁటివస్త్రంబె యానలినాక్షియిపుడు । మాటికి ధరియించి మలినాంగియగుచు
జడగొన్న నెఱులతో జగతీతలంబు । తడయక శయ్యగా దమయంతి యెపుడు
వ్రతము సల్పుచు నుపవాసంబులుండుఁ । బతిరాకఁ గోరుచుఁ బ్రతిదివసంబు."
అని పల్క నలుఁడును నవిరళ బాష్ప । కణలోచనంబులు గాన్పింపకుండ
వలనొప్ప వదనంబు వాంచి తానొండు । వలను చూచుచునుండ, వడిఁగేశినియును
బాహుకు పలుకులు పడఁతికిఁ జెప్ప । నూహించి నలుఁడెకా నొగిఁ దలంచుచును
"అతని వృత్తాంతంబు లన్నియు సరసి । యతివేగ నీవు ర." మ్మని మఱిపనుప,
నదిపోయి బాహుకు నద్భుతక్రమము । వదలక మఱియు సర్వంబును నెఱిఁగి
వచ్చి యద్భుతముగా వైదర్భితోడఁ । జెచ్చెఱ నిట్లని చెప్పంగఁ దొడఁగె :
"అతని చరిత్రంబు లంబుజగంధి, । యతిమానుషంబులు నత్యద్భుతములు.
మనుజమాత్రుఁడు గాఁడు, మఱి దేవసముఁడు. । గొనకొని తృణ ముష్టిఁగొనివాఁడువీవ
నం దగ్ని జనియించు ; నందె వంటకము । నందంద నగు; నింధనాపేక్ష వలదు.
కలవడి నంజాళ్ళు కడుగఁగఁ బూని । జల మపేక్షింపుడు సరవి తోడుతను
గడవలలో నిండి కమలంబు లుండుఁ । గడువేడ్క." నని చెప్పఁగా, దమయంతి
యతఁడు వండిన కూర లర్థిఁ దెప్పించి । ప్రతిఁజూచి, నిషధేశు భావంబులైన
కూఁతునిఁ గొడుకును గోరి పంపుటయు, । నాతతగతిఁ జూచి యశ్రువు లొలుకఁ
గూర్మి నిద్దఱి నెత్తుకొని నిజాంకమున । నర్మిలి నునిచి, యిట్లనియెఁ గేశినికి :
"తడయక వీరలిద్దఱును నా సుతనుఁ । గొడుకునుఁబోలఁగఁ గూర్మిఁ జూచితిని.
భావింప నీవిట్లుపలుమాఱు వచ్చి । పోవుచు నుండినఁ బురములో జనులు
తలఁపులో నొండుగాఁ దలతురు ; గాన । వలదింకఁ బలుమాఱు వారిజనయన !
పొసఁగ దేశాంతరంబులనుండి యేము । అసమున వచ్చిన యతిథుల ; మిట్లు
మాతోడ మీకును మాట లేమిటికి । నోతల్లి !" యన్న, బాహుకు మార్గమెల్ల
దమయంతి కెఱిఁగింపఁ, దద్దయు నెల్ల । దమయంతి మదిఁ గొంత తడవు చింతించి,
తమతల్లికిట్లనుఁ: "దప్పదింతయును । గ్రమమొప్ప నైషధక్ష్మాపాలకుండు

బాహుకుండేయగుఁ; బరికింప నట్టి । బాహుకశౌర్యునిఁ బిల్వఁబంపు మిచ్చటికి."
ననవుడు భీముని యనుమతి వడసి । తారంగ నాతని దమయంతికడకు
రప్పించుటయు నంత రాజీవనేత్ర । నప్పుడు నలుఁ జూచి దమయంతి పలికె:
"కడు విజనంబైన గహనాంతరమున । బాసి నిద్రించు కులసతి నాథ!
సురలను వరియింపఁ జూడక తన్ను । వరియించి మత్ప్రాణపతివైతి దాస"
... ... ... ... ... । దమితోడఁ గష్టవర్తన నట్టి యిడుమ
నలవడఁ బొందితి; నదియు మదీయ । కలిత తపంబునఁ గరఁగి నీదుఃఖ
దాహంబుననుజెడి తద్దయుఁ బోయె । నూహించి ననుఁ జూడి యుత్పలనేత్ర!
నీ తదర్థంబున నెమ్మి నిచ్చటికి । నాతతంబున వచ్చి తదియు నటుండె.
అనురక్త సువ్రతు నట్టి యా నన్ను । మనమునఁ దలఁపక మఱి యన్యుఁదలఁచి
వలనొప్పఁగా స్వయంవరము రచింప । వలనుగా వినికాదె వచ్చె నీరాజు."
అన విని వెఱచి కృతాంజలి యగుచు । వనిత యిట్లని వల్కె వల్లభుఁ జూచి:
"నిన్నరయుటకునై నెమ్మి బ్రాహ్మణుల । మన్నించి యనిపిన, మహియెల్ల వెదకి
యందు పర్ణాదుండు నా యయోధ్యకును । బొందుగా వచ్చి యింపొంద నీమాట
తెలిసి వచ్చిన, నేను ధృతిమీఱ నెఱిఁగి । వెలయఁగ నిన్ను రావించు నుపాయ
మనువొందఁ దలఁచి స్వయంవరంబనుచు । ననఘుఁడౌ ఋతుపర్ణు నందు రప్పింపఁ
బనివడి వసుదేవుఁ బంపితి నేను । చనవొప్ప నొకనాఁట శతయోజనములు
వరమతి వచ్చెడు వారలు గలరె । యిరవొప్ప నిన్ను నే నెఱిఁగెడికొఱకు
నీరీతి నంపితి; నితర మే నెఱుఁగ; । నారయ నేను మీ యడుగులంటెదను;
తరణియుఁ జంద్రుండుఁ దారకాగణము । సురలు వాయువు సాక్షి సుకృతంబు సాక్షి."
అనవుడు నంతలో నాకాశవాణి । మనుజేశుఁడును నెల్ల మనుజులు వినఁగ
నిట్టని పలికె: "ఓ నృపకులోత్తంస! । నెట్టన దమయంతి నీరజనేత్ర
పరమ పాతివ్రత్య భవ్యాత్మ దీనిఁ । దరణియుఁ జంద్రుండుఁ దగ గంధవహుఁడు
మునుమిడి కాచిరి మూఁడు వర్షములు; । ఘనతతో నీయింతిఁ గైకొనుమింక."
అనునంతలోపల నమరదుందుభులు । ఘనముగా మ్రోసెఁ; జక్కఁగఁ బుష్పవృష్టి
గురిసెఁ; దత్క్షణమ గర్కోటకుఁ దలఁచి । ధరణీతలేశుండు దద్ద హర్షించి
పొనర వాఁడిచ్చిన పుట్టంబు దాల్చి । తనరంగ నిజరూపు ధరియించె; నంత
నలినాక్షియును మలినత్వంబువాసి । ఘనతరభూషణకలితయై మించె.

అంత విదర్భేశుఁ డంతరంగమున । సంతోష మేపారఁ జని నలుఁ గాంచి
పురము శృంగారింపఁ బెచ్చి దేవతలఁ । బరువడిఁ బూజించి భవ్యుఁడై యుండె.
అట్టి మహోత్సవంబంతయు నెఱిఁగి । నెట్టన ఋతుపర్ణ నృపతి యేతెంచి
వీరసేనజుఁ గాంచి "విభుఁడవు నీవు । ఈరీతి నిన్ను నే నెఱుఁగక యశ్వ
శిక్షకై నిలిపితిఁ జేకొని తప్పు । రక్షింపు." మనుచు సత్ప్రేమము దీపింప
నెలమితోడుత నశ్వహృదయమ్ము నెఱిఁగి । యలవడఁగా నయోధ్యాపురి కరిగె.
అట నలుండును మహాహర్షంబుతోడఁ । బటుగతి నా విదర్భను బాయఁగోరి
దమయంతి నచ్చోటఁ దడయక నిలిపి । ప్రమదంబుతోడుత రథమెక్కి యంత
నెనుబది గుఱ్ఱంబు లిరువది కరులు । ఘనముగా నాఱునూఱు కాల్బలంబులును
దనకుఁ దోడుగఁ గొల్వఁ దనపురి కరిగి । ఘనమతి నప్పుష్కరుని కిట్లనియె:
"దమయంతి పణముగా ధరణి నీతోడ । నమితోత్సుకత మరి జూదమాడ వచ్చితిని.
నీవును రాజ్యంబు నెఱినొడ్డి యాడు । భావించి కాకున్న బవరంబు సేయు.
మీరెంటిలోన నీకెద్ది యిష్టంబొ । యారయ నది సేయు" మనినఁ బుష్కరుఁడు
వెలయఁగ యుద్ధకోవిదుఁడు గాకునికి । నలుని మీఱఁగఁ దొంటివలె జూదమాడి
దమయంతిఁ గైకొందుఁ దప్పక యనుచు । నమరంగ నట జూదమాడి యోడుటయు,
రాజ్యంబు గైకొని రమణితో నిఖిల । పూజ్యుఁడై నలుఁడు నా పుష్కరు కనియె:
"కలి ప్రవేశించినకతన నేఁ దొల్లి । బలమఱి యోడితిఁ; బరికింప నదియు
నరి నీదు బల మని చనదు గర్వింప; । ధరణి నా పినతండ్రి తనయుండ వీవు;
నెలకొని వెఱవకు నిన్నేమి సేయ । నలవడ." నని పల్కి యంతలో నలుఁడు
దమయంతిఁ గొనివచ్చి తరుణియుఁ దాను । నమితసౌభాగ్యంబులందుచు నుండె.
అదిగాన ధర్మజ, యటువలె నీవు । పదపడి రాజ్యవైభవము నొందెదవు.
నాగంబు దమయంతి నలు ఋతుపర్ణు । వేగఁ దలంచిన విను కలిహరము.
అని యిట్లు బృహదశ్వుఁ డాకథఁ జెప్పి । చనియె నెంతయు నిజేచ్ఛా విహారమున.
పాండవు లంతట భావంబులోన । గాండీవి రాక వేడ్కను గోరుచుండఁ
దన తేజ మఖిల దిక్తటములు నిండ । ననిమిషాధిపుఁ డంప నా రోమశుండు
చనుదేరఁ గనుఁగొని శమనసందనుఁడు । అనుజన్ములును దాను నట నేఁగుదెంచి
యతనిపాదంబుల కర్థితో మ్రొక్కి । ప్రతిలేని యర్ఘ్యంబు పాద్యంబు నిచ్చి
" దేవ, యెచ్చటినుండి ధృతిఁ దోఁచి తిచట ? । నీ విశేషపుకాంతి నిఖిలంబు నిండె.

నెందుఁబోవుచు రాక ? యేము మీపాద । సందర్శనంబుచేఁ జాలఁ బుణ్యులము.
నరు నెందుఁ గానరే నాసహోదరుని ? । హరుఁగొల్వఁ బొమ్మంటి నస్త్రంబులకుగ ;
నేను వర్షములయ్యె నిటఁబాసి యతనిఁ । గానక వగచెదఁ గానకు వగవ ;
రాజులోపరు మాకు రాక్షసులోప । రీ జాడ యెఱిఁగియు నేను బొమ్మంటి.
నీ వెఱుంగని యట్టి నెలవులు లేవు । దేవ, చూడవె యోగదృష్టిచేనైన."
అనిన రోమశమౌని యా రాజు కనియె : । "వినుము సేమంబున విజయుఁడున్నాఁడు ;
హరుఁడిచ్చెఁ బాశుపతాస్త్ర మాతనికి ; । సురలునిచ్చిరి దమనునిశితాస్త్రములు.
కలనిలోన నివాతకవచదానవులఁ । గలహాభీకరులైన కాలకేయులను
గెలిచి సాధింపుము క్రీడి, నా కనుచు । బలభేది పిలువ నా పార్థుండు దివికి
మాతలి దెచ్చిన మణిరథ మెక్కి । మాతతగతిఁ బోయి యమరేంద్రపురికి
నింద్రు పీఠంబెక్కి యెలమి నున్నాఁడు; । చంద్రవంశాధీశ, చనుదెంచు నింక.
ఏను నింద్రునియాజ్ఞ నిది మీకుఁ జెప్పఁ । బూని వచ్చితి నీవు బుద్ధిఁ జింతిలకు.
నిన్ను నీ తమ్ముల నెట్టఁ దీర్థయాత్ర । చెన్నార జయకాంక్షఁ జేయ నేమించి
పుత్తెంచె నన్నును బోదమా! యేను । నెత్తు మీవెంటనే వజ్రి పొమ్మనియె."
ననినఁ దమ్ములు దాను హర్షాశ్రువృష్టిఁ । దనువులు పులకించు తమకమ్ముతోడఁ
దాపసికెఱఁగి యెంతయుభక్తిఁ బలికె : "నా పాలి వేల్పవై నా మేలు గోరి
వచ్చితి విటకు మా పరమభాగ్యమున ; నిచ్చితి మఱి నాకు నింద్రనందనుని ;
... ... ... ... ... ... । ... ... ... ... ...
పోద మెయ్యవి తీర్థములు మన" కనుచు । మేదినీసురులును మెలఁత ద్రౌపదియు
ననుజులుఁ దోడరా నాప్రొద్దె కదలి । మునులున్న పెక్కుభూముల నిలుచుచును,
బొనుపున గంగాది పుణ్యతీర్థముల । మునుఁగుచుఁ, దర్పణంబులు దానములును
జేయుచుఁ, దొంటి విశేషంపుఁగథలు । వేయిభంగుల మౌని వినిపింప వినుచు,
నుతగతి భీమసేనుఁడు త్రోవఁబెట్ట । ధృతమతి నీశానదిశకునై నడువ,
నై మిశమునకుఁ గన్యాతీర్థమునకు । గామిత ఫలద గంగాతీర్థమునకు
మఱి యశ్వతీర్థ గోమతితీర్థములకుఁ । దఱచు వీచుల బాహుదకుఁ బ్రయాగకును
నడచి, గంగాయమునా సంగమునకుఁ । గడఁగి యక్షయ వట కౌశికంబులకు
గయపర్వతములకుఁ గడువేడ్కఁ బోవ । రయమొప్ప నిట్లనె రాజుకమ్మౌని
"క్రతువు లిచ్చటఁ దొల్లి గయుఁడనురాజు । వ్రతనిష్ఠ బ్రహ్మార్పితంబుగఁ జేసె;

పితరులకై యిందుఁ బిండప్రదాన । మతులితంబుగఁ జేయ నగు నిష్టసిద్ధి."
యని గయామాహాత్మ్యమంతయుఁ జెప్పె । మనుజేశుఁడైన ధర్మజునకు ననుచు
జనమేజయునకు వైశంపాయనుఁడు । వినిపింప నెంతయు విని ముదంబంది,
యనఘాత్మ, తరువాతనైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు,
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయ స్వరూప కాశ్యపగోత్రదీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
విరచితారణ్యాఖ్య విపుల పర్వమున । నరుదు మీఱఁగ ద్వితీయాశ్వాసమయ్యె॥

---

# అ ను బం ధ ము



శ్రీ వెంకటేశ, యాశ్రితకల్పభూజ, । భావనాతీతవైభవ, భోగనిలయ,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె:
ఆరీతి గయ మహిమ మంతయుఁ జెప్పి । యారూఢగతి నగస్త్యాశ్రమంబునకుఁ
జని రోమశునిఁ జూచి జననాయకుండు । 'అనఘాత్మ, వాతాపి యనువాని నెట్లు
ముని యగస్త్యుఁడు సంపె మును సంయమీంద్ర!' । అనవుడు నిట్లనె: "ననఘాత్మ వినుము
పొలుపొంద మణిమతీపురవరంబునను । నెలమి వాతాపియు, నిల్వలుండనఁగఁ
బరఁగు దైత్యులు జగత్ప్రఖ్యాత యశులు । అరయంగ నుందు; రం దగ్రజుండైన
యిల్వలుఁ డొక్కమునీంద్రుఁ బూజించి । 'కలితార్థ, నాకును గామ్యార్థసిద్ధి
కరమగు మంత్రంబు గరుణింపు' మనినఁ । దరమిడి యీకున్నఁ, దనదగు శక్తి
వాతాపి నప్పుడు వడి మేషరూప । మాతతగతిఁ జేసి యట వధియించి
దానిమాంసము వండి తడయ కమ్మునికి । మానుగాఁ బెట్టి వేమఱు నంతలోన
'వాతాపి! ర' మ్మని వడిఁ జీరుటయును, । నాతఁడు ముని కడుపప్పుడు సించి
యలవడఁ జనుదెంచె; నంతనుండియును । నిల్వలుఁడును దనయింటికి వచ్చు
నతిథుల నారీతి యమపురంబునకు । నతులితగతిఁ బంప, నటఁ గుంభజుండు

## అగస్త్య చరిత్రము

సమరంగ బ్రహ్మచర్యాశ్రమంబునను । గ్రమముతోడుతఁ బెద్దకాలంబు దపము
సేయుచునుండి, చెచ్చెర నొక్కనాఁడు । పాయక సల్లకీ పల్లవంబునను
వెస నధోముఖులునై వ్రేలుచునున్న । పసగల్గు పితరులఁ బరికించి చూచి
'ఘనులార, మీ రున్న కారణంబేమి?' । యనవుడు పితరు లిట్లని రగస్త్యునకు:
"అనఘాత్మ, బ్రహ్మచర్యాశ్రమంబునను । దనయుల నొల్లక తప మర్థి నీవు
సేయంగ మా కిట్టి చేటువాటిల్లెఁ; । బాయక యిఁకనైనఁ బరిణయంబగుచుఁ
దనయులఁ బడసినఁ దగఁ గల్గు మాకు । ఘనమైన పుణ్యలోకంబులు ప్రీతి."
నని పల్క వారితో "నట్ల సేసెదను । పనివడి" యని విదర్భకు నేఁగుదెంచి,

యటఁ బుత్రకాముఁడై నట్టి రాజునకుఁ । బటుగతి నొకకూఁతుఁ బరఁగఁబుట్టించి
యువని లోపాముద్ర యనెడి నామంబు । వివిధభంగులను గావింప, నక్కన్య
యలవడ జలములయందు నొప్పారు । జలజాతమును బోలె సరవితోఁ బెరిగి
యౌవనంబటఁ దాల్చి యటు రూపరేఖ । నివ్వటిల్లుచునుండ, నెఱి విదర్భుండు
ధరణిలోపలఁ దన తనయకుఁ దగిన । వరు నరయుచునున్న వచ్చి కుంభజుఁడు
"నాకు లోపాముద్ర నరనాథచంద్ర, । ప్రాకటంబుగ నిమ్ము భార్యగా నిపుడు."
అనిన విదర్భుండు నాత్మలో వగచి । తన భార్యయుచు దాను దగ నేకతమున
"కటకటా! యిమ్మౌని గహనాంతరమున । జటలు వల్కలములు సరవితోఁ దాల్చి
యటఁ గందమూలాదు లశనంబుగాఁగఁ । బటుతర ఘనజటా భారకుండగును;
ఆది గర్భేశ్వరి యైన నా పుత్రి । నాదట నెట్లిత్తు! నట నీయకున్నఁ
జనవేది కోపించి శపియించు నితఁడు." । అనుచు విచారింప నక్కన్య యెఱిఁగి
తన తల్లిదండ్రులఁ దగఁ జేరి యనియె: । "చెనసి యీపని కీరు చింతింప నేల?
అతఁడు నా ప్రాణేశుఁ డాతనికిందు । వితతంబుగా నన్ను వేడుకతోడ."
ననిన నమ్మాటకు హర్షంబు నొంది । తనరంగ శుభముహూర్తమ్మున మునికిఁ
దగ వివాహముసేయఁ, దాపసోత్తముఁడు । నగణిత దివ్యాంబరాభరణములు
తనసతి వెల్లను దద్దయు నూడ్చి । మునుకొని వల్కలంబులు గట్ట నిచ్చి,
గరిమతోఁడుతను గంగాద్వారమునకుఁ । గరమర్థిఁ గొనిపోయి కడువేడ్కతోడ
రతికి డగ్గఱుటయు, రమణి లజ్జించి । యతనికి మ్రొక్కి యిట్లని విన్నవించె:
"మునిరాజశేఖర, మునుకొని నన్నుఁ । గనక భూషణ వస్త్ర కలితఁగాఁ జేసి,
పొలుపొంద నీవును భూషణాంబరము । లలవడ ధరియించి యటఁ బొందు వేడ్క."
ననిన తపోధనం బదిగాక యొండు । ధనము లేకున్నను దరుణికై పోయి
శ్రుతపర్వుఁ డనఁగ విశ్రుతకీర్తి నెగడు । క్షితిపతిఁ గాంచినఁ జెచ్చెర నతఁడు
నెదురుగాఁ జనుదెంచి యిలఁ జాఁగి మ్రొక్కి । పదపడి యర్ఘ్యంబు పాద్యంబు నొసఁగి
'యేమయ్య, విచ్చేసి తెఱిఁగింపుఁ?' డనిన । నా మనుజేశుతో ననియెఁ గుంభజుఁడు:
"వినవయ్య రాజేంద్ర, విభవదేవేంద్ర! । ధన మపేక్షించి యేఁ దగ వచ్చినాఁడ;
సరవితో నీ పోష్యజన పోషణంబు । గరిమ విఘాతంబు గాకుండఁ జూచి
మిగిలిన నా కిమ్ము మేదినీనాథ! । తగవు మీఱఁగ." నన్నధారుణీవిభుఁడు
ఆయవ్యయంబుల నరసి చూచినను । బోయక సమమైనఁ బాటించి మౌని

యతనిలేమి యెఱింగి యతనిఁ దోడ్కొనుచుఁ । దతమతితోడఁ బ్రధ్నశ్వుపాలికిని
బోయిన, నాతఁడు పూజించి యంత । నాయెడ శ్రుతపర్వు నల్ల పల్కుటయుఁ,
దరమిడి యటఁబోయి త్రసదస్యు నడుగ । గరిమ నా నృపులు పల్కినయట్ల పల్కి
యా యగస్త్యునిఁ జూచి: "యనఘాత్మ, వినుము । పాయక మణిమతీ పట్టణంబునను
దమ్ముఁడుఁ దాను ముదమ్మున నుండు । నెమ్మిదీపింపంగ నిల్వలుఁ డనఁగ.
వానికి ధనము లెవ్వరికంటెఁ గలవు । మానుగా," ననిన నమ్మౌని మువ్వురను
దోడుకొని పోయినఁ, దోడరి యిల్వలుఁడు । నుడుగక యాతిథ్య మొనరించి ప్రీతి
ననువున వాతాపి నా గతిఁ జంపి । ఘనముగా వండి యగస్త్యుని కంత
విందుసేయఁ దలంప, విభులు మువ్వురును । బొందుగా మ్రొక్కి యప్పుడు మునికనిరి:
"వీని తమ్ముఁడు ధాత్రి విప్రవర్యులకు । మానుగా భోజ్యమై మఱియు నంతటను
కడుపులు వ్రచ్చి తక్కక చంపు నిజము ; । కుడువఁగ వలదు మక్కువ వీనియింట ;
ధనమిచ్చెనేని పోదము వేగ మరలి." । యనవుడు భయపడ కయ్యగస్త్యుండు
వానింట భుజియింప, వడి నిల్వలుండు । పూనికతోడఁ దమ్మునిఁ బిల్చుటయును,
అది చూచి మునిపతి హస్తతలమున । నుదరంబు దడవుచు నొగిఁ ద్రేఁచుటయును
నసుర భస్మంబయ్యె నా క్షణంబునను. । వసుధ నిల్వలుఁడును వాని శక్తికిని
భయపడి యది కానఁబడకుండ మ్రొక్కి । నయమున నెంతధనంబు గావలయు
... ... ... ... ... । తలకొని కనకరథం బొక్కటియును
నాకు నిమ్మనుటయు, నలి నిల్వలుండు । ప్రాకటంబున నిచ్చి భక్తితో ననుప,
నిట నగస్త్యుండును నృపుల వీడ్కొలిపి । దటుకున నపుడు రథంబెక్కి కదలి
తన తపోవనభూమి దడయక సొచ్చి । కనకరథము డిగ్గి కాంతకోరికలు
కడువేడ్కఁ జెల్లించి కంజాక్షిఁ జూచి: । "పుడమిలోఁ బదుగుండ్రఁ బోలెడుసుతులు
వదలక నూర్వురు వలయునో, కాక । పొదలంగ నూర్వురఁ బోలెడువారు
పదుగురు వలయునో, పన నదిగాక । వదలక వేవురు వలయునో, వీరి
కన్నఁ బుణ్యాత్ముఁ డొక్కరుఁడు గావలెనో । మన్నించి చెప్పుమా మదగజయాన!"
అనిన లోపాముద్ర యాత్మేశుఁ జూచి । "అనఘ, వేవురఁ బోలునట్టి గుణాఢ్యు
ఘనుని నొక్కని నిమ్ము కరుణాసముద్ర!" । అనవు డగస్త్యుండు నా వరమిచ్చి
పడఁతిఁ బొందుటయు గర్భం బది దాల్చి । యెడపని కడఁకతో నేడేండ్ల కొక్క
తనయునిఁ గాంచె దృఢస్యు నామకుని; । పొనుపడి వానికిఁ బుట్టెఁ దేజస్వి

యను ముని; యుద్ధంబు లధిక భారమును । ఘనముగా వహియించుకతన నమ్మౌని
వసుధలోపల నిర్ధనవహుఁ డనఁ బరఁగె. । నసదృశగతి నిటు లయ్యగస్త్యుండు
తుదిఁ బుత్త్రపౌత్ర సంతతంబునై వేడ్క । నదనుగాఁ బితరుల ననిపె నద్దివికి.
అని రోమశుఁడు సెప్ప నయ్యమసూతి । 'అనఘాత్మ, యెండియు నాతని మహిమ
వినఁగోరెదను నాకు వినిపింపు దెలియ' । ననవు డిట్లనియె : "నోయనఘాత్మ," వినుము
కృతయుగంబునఁ గాలకేయులఁ గూడి । నతిగర్వియై వృత్రుఁ డను రక్కసుండు
అమరాధిపతి మొదలైన దేవతలఁ । బ్రమదంబు తోడుత బాధింపుచుండ,
నతని బాధకుఁ జాల నలసి దేవతలు । చతురాస్యుకడ కేఁగి సద్భక్తిఁ మ్రొక్కి
'వృత్రుఁ జంపగ మాకు వెరవేది?' యనిన । వృత్రారిఁ జూచి వాగ్విభుఁడిట్టులనియెఁ :
"తెలియ సరస్వతీ తీరంబునందుఁ । గలిత తపోనిష్ఠఁ గదలకున్నాఁడు
ఘనుఁడు దధీచి వేగమె మీరుపోయి । తనరఁగ వేడినఁ దనయస్థు లిచ్చు ;
నవియు వజ్రాది దివ్యాయుధస్ఫూర్తిఁ । దవిలిన నింద్రుఁడు దైత్యులఁ జంపు."
నని బ్రహ్మ చెప్పిన, నా ప్రొద్దె కదలి । యెనయ దధీచున్న యెడకునై పోయి
యతని పాదములకు నందంద మ్రొక్కి, । "యతినాథ, మాకు నీ యస్థు లీవయ్య!
ప్రతిలేని దైత్యుని భంజింపవలయు; । వితరణమందు నీ విశ్వంబులోన
నీవె కా కెవ్వరు నిను మించువారు । వేవిధంబుల." నని విన్నవించుటయు
నా దధీచియును "కృతార్థుండనైతి । నీ దేవతల కేను హితవుచేసెదను."
అని పల్కి శ్రీహరి నంతరంగమునఁ । బనివడఁ దలఁచుచుఁ బ్రాణముల్విడిచె.
అమరులు సంతోషమంది యాయస్థు । లమితవైఖరిఁ గొన్న యవసరంబునను,
వెస విశ్వకర్మయు వేగనే తెంచి । యసదృశస్ఫూర్తి నూఱంచులై వాఁడి
గలిగిన దంభోళిఁ గావించి ప్రీతి । బలభేది కిచ్చినఁ, బరువడి నతఁడు
నందువృత్రునిఁ జంప నాహవంబందు । నందంద గాలకేయాదులు పాఱి
జలనిధిలోఁ జొచ్చి చలము రెట్టింప । నలవడ దివమెల్ల నందె యడంగి
పొలుపుగా నెంతయుఁ బ్రొద్దుగ్రుంకినను । వెలువడి భూజన వితతిఁ జంపుచును,
మలసి వశిష్ఠాశ్రమంబున కరిగి । యిల నూటఁదొంబది యేడ్వురఁ జంపి,
చ్యవను నాశ్రమమున శతసంఖ్యఁ జంపి । దవిలి యెంతయు భరద్వాజాశ్రమమున
నిరువదిఁ జంపి పెంపెసఁగ నీరీతిఁ । దరమిడి బ్రాహ్మణోత్తములఁ బెక్కండ్ర
వధియించి బాధింప, వసుధలోపలను । అధిక పుణ్యంబులు యాగాదికములు

పనువడి లేకున్న, భయపడి సురలు । సనిమిషేంద్రుఁడుఁ దారు నతిశీఘ్రవృత్తి
వైకుంఠమున కేఁగి, వారిజనాభు । లోకనాయకుఁ బద్మలోచను సజునిఁ
గనుఁగొని, ప్రణమిల్లి కరములు మొగిచి । "మహాత్మ, కాలకేయాది రాక్షసులు
పగలెల్ల జలధిలోపల వసియించి । తగ రాత్రివైన నెంతయుఁ బోయి సకల
మునిపుంగవులఁ జంపి పుడమికిఁ బెక్కు । ఘనబాధ లొనరించి కదలకున్నారు.
పరఁగఁగ బ్రాహ్మణోపద్రవంబెల్ల । హరియించి రక్షింపు మంబుజనాభ!"
అని విన్నవించిన నమరులఁ । జూచి వనజదళాక్షుండు వలనొప్పఁ బలికె:
"విసుగక సురలార, వినరయ్య మీరు । వసుధ సముద్రంబు వట్టినఁగాని
యసురులఁ జంపఁగ నలవడ దెందు ; । వసమున నదిగాన నయ్యగస్త్యుండు
ధర సముద్రమునీరు ద్రావఁగఁగలఁడు ; । తిరముగా నతనిఁ బ్రార్థింపుఁడు పొండు."
అన విని సురలెల్ల హర్షంబునొంది । పనివడి కుంభజుపాలికిఁ బోయి,
"యతిసార్వభౌమ! మహాపుణ్యచరిత, । యతులగుణోన్నత, హరిభక్తినిరత,
తొల్లియు మాకుఁగా దుర్దాంతమహిమ । వెల్లివై పెరిగిన వింధ్యపర్వతము
మదమణంచితివని మఱి వేవిధముల । నదనొప్పఁ గొనియాడి" రనిన ధర్మజుఁడు
రోమశుఁ గనుఁగొని యూఢిగాఁ బలికె: । "నోమహాత్మక, వింధ్య మొగినెట్లు పెరిగె?
పీనుపొందగా దానిఁ బెరుగకయుండ । ఘనుఁడు కుంభజుఁ డెట్టికతన వారించె?
నీ కథావృత్తాంత మెంతయుఁ దెలియ । నాకుఁ జెప్పుము కరుణాదృష్టితోడ."
ననవుడు రోమశుం డటఁ జెప్పఁదొణఁగె: । "మనుజేశ, వినవయ్య మహిమదీపింప

## వింధ్య గర్వాపహరణము

వసుధ వింధ్యాద్రి గర్వస్ఫూర్తితోడఁ । బనగల్గి యొకనాఁడు భానునితోడ
"నిలలోన గిరిరాజ నే నుండ నన్నుఁ । గొలువక మేరువుఁ గొలువనేమిటికి?
మతిదప్పెనో నీకు? మఱియింకనైనఁ । జతురత ననుఁ గొల్వు చాలు నీ జాలి."
యనుచు గర్వించిన యచలాధిపతినిఁ । గనుఁగొని భానుఁడు గరమర్థిఁ బలికె
"విధినియోగంబున వెనుకొని యేను । నధికత మేరువు నట్లు గ్రుమ్మరుదుఁ;
దెలియఁగ నా యిచ్చఁ దిరుగుటలేదు । వెలయఁగ." ననిన నవ్వింధ్యాద్రియలిగి
తనరఁగ దినశశి తారకాదులకుఁ । జనరాక యుండను నవడిమైఁ బెరుగ,
నిది పగ లిది రాత్రి యిది సంధ్యయనుచుఁ । బదపడి కానంగఁబడకుండె జగము ;

అంధకారములయ్యె నఖిల లోకములు ; । బంధురగతి సురప్రతతి భీతిల్లె.
నా కీతి భీతిల్లి యమరులంతటను । వారక వింధ్యంబు వరుసఁ బ్రార్థింప
వినకున్న, నంత నిర్విణ్ణులై వారు । పనివడి కుంభజుపాలికిఁ బోయి
"మమ్ము రక్షింపుము మౌనీంద్రతిలక, । యెమ్మెతో వింధ్యాద్రి యెక్కుడై పెరిగె ;
దినకరచంద్రులు తిరుగక నిలిచి; । రయంబు మాన్పవే యీ యుపద్రవము !"
నని తన్నుఁ బ్రార్థింప నమరులమాట । విని యగస్త్యుఁడు దనవెలఁదియుఁ దానుఁ
గర మొప్ప వింధ్యాద్రికడకు నేతేర, । వరుస నగ్గిరి మునివరునకు మ్రొక్కి-
యలవడ నర్ఘ్యపాద్యాది సత్క్రియలఁ । బొలుపొంద నెంతయుఁ బూజించుటయును,
నతనితో ననియె నయ్యతిపరేణ్యుండు : । "ధృతిమీఱ దక్షిణదిశకు నే నరుగఁ
బనియటఁ గలిగెను బర్వతాధీశ ! । గొనకొని తెరు విమ్ము కూర్మితో" ననినఁ
జిరమతి నే నట్లు సేయుదుననుచుఁ । బెరుగుట యుడిగి గాంభీర్యంబు విడిచి
భూనమానుండైనఁ, బుణ్యుఁ డమ్మౌని । వాసిగా మఱి గిరివల్లభు ననియెఁ :
"చెలిమి నాతోడుతఁ జేయుము నీవు ; । వలనొప్ప మరలి నా వచ్చు నందాఁకఁ
బెరుగక యుండుమీ ప్రియముతో." యనుచుఁ । దిరముగా దక్షిణదిశకునై పోయి
యెనయ లోకములకు హితవాచరించె । నని చెప్పి మఱియు నిట్లనియె రోమశుఁడు :
"అమరులెల్లను బ్రీతి నట్లు కీర్తింపఁ । గొమరొప్ప నమ్మౌనికులకుంజరుండు
మీరు వచ్చుటకు నర్మిలితోడ నేమి । కారణం బనిన నక్కాలకేయాది
భయము చెప్పుచును "దత్ప్రతివిధానంబు । రయము తోడుతఁ జేసి రక్షింపుమమ్ము
జలరాశి గ్రోలుము సంయమిచంద్ర ! । యలవడ" ననుటయు నట్ల కాకనుచు
వారితోడనగూడి వారిధి కరిగి । యారయఁ దజ్జలంబంతఁ ద్రావుటయు,
మకర కర్కట కూర్మమత్స్య భుజంగ । నికరంబు దామును నెఱి వెలువడినఁ
గాలకేయులతోడఁ గదనంబు సేసి । యాలోన దేవేంద్రుఁడందఱఁ జంపె.
హతశేషులైన దైత్యావలి పాఱి । యతులితగతిఁ జొచ్చె నా రసాతలము.
అంత దేవతలెల్ల నక్కుంభజన్ము । నెంతయుఁ గీర్తించి యిట్లని రర్థి :
"మునినాథ, నీకతంబున బాధలణఁగె ; నెనయ మాకోర్కె లీడేరె నిపుడు ;
జలనిధి లేకున్న జగము లేరీతి । మెలఁగు? సత్కృపతోడ మీరు మన్నించి
సంపూర్ణజలముగా సాఁగింపుఁ" డనిన, । నింపుతోడుత నమ్మునీంద్రుఁ డిట్లనియె :
"మున్న జీర్ణంబయ్యె మున్నీటి నీరు । క్రన్నన నిపుడు నా కడుపున లేదు,"

అని చెప్పుటయు మును లమరులుఁ గూడి । కనకగర్భునిఁ గాంచి కరములుమోగిచి
'యేరీతి నింపు నీయిల సముద్రంబు । వారక యానతీవలయు మా' కనినఁ
దనలోన నొక్కింత తడవు చింతించి । వనజాసనుఁడు మఱి వారికిట్లనియె
"నలిఁ బెద్దకాలంబునకు భగీరథుఁడు । నెలకొని వారిధి నిండింపఁగలఁడు.
ఒరులు నిండింపఁగ నోపరు చనుఁడు । సురలార!" యనవుడు సురలును నంత
నలవడఁ జనిరి నిజాలయంబులకు; । పొలుపొంద మునులును బోయిరి ప్రీతి.
అని చెప్పుటయుఁ గడు నద్భుతంబంది । మునినాథునకు ధర్మపుత్రుఁ డిట్లనియె
"నేమికారణమున నిట భగీరథుఁడు । భూమి సంభోరాశి పొసఁగ నిండించె?
నెలమి దీపింపంగ నీకథ నాకుఁ । దెలుపవే!" యనుటయు ధీరాత్ముఁ డనియె:
మనుజేశ, విను తొల్లి మనువంశజుండు । పొనుపడ సాకేతపుర మేలువాఁడు
సగరుండు హైహయ సమితి నిర్జించి । జగతీతలంబెల్ల నరి నాక్రమించి
వలనొప్పఁగాఁ జక్రవర్తియై పరఁగి । చెలఁగి వైదర్భియు శైబ్యయు ననఁగ (?)
నిరువుర వనితల నెలమిఁ బెండ్లాడి । యురుగతి సంతాన మొగి లేకయున్నఁ
దనభార్యలును దానుఁ దపమునఁ గరఁగి । మనసిజ హరుఁగూర్చి మహిఁజేసెఁదపము.
అంతలోఁ బ్రత్యక్షమై వృషధ్వజుఁడు । 'ఎంతయు నడుగు మే నిచ్చెద వరము'.
అనవుడు ప్రార్థించి యా సగరుండు । 'తనయుల నీయవే దయతోడ నాకు'
నని వేడుటయుఁ బురహరుఁడు సంప్రీతి । ... ... ... ... ...
వైదర్భియం దఱువదివేలసుతులు । నాదరంబుగ శైబ్యయం దొక్కసుతుఁడు
గలుగఁగ వరమిచ్చి కఱకంఠుఁడనియె: । "వెలయఁగ నఱువది వేవుర సుతులు
కడు గర్వులై కొంతకాలంబునకును । అడర నధ్రువ జీవులగుదు; రాయొక్క-
కొడుకును మిగిలి నీ కులకర్త యగును । బుడమిలో." నని చెప్పి పొందుగా నరుగ,
సగరుండు చింతించి సతులును దాను । నగిడి యింటికి వచ్చె మహనీయ మహిమ.
నెలమి దీపింపంగ నిద్దఱు సతులు । నలవడ గర్భిణులై; రందులోన
వైదర్భికిని నొక్క-వదరు, శైబ్యకును । నాదటఁ బుత్రుండు నసమంజసుండు
పుట్టిన, "నిదియేమి పురహరు వరము! । గట్టిగా నిదిపుట్టెఁ గటకటా!" యనుచు
దానిఁ బాఱఁగవైవఁ దలఁచినంతటనె । జానొప్ప నశరీరి చయ్యనఁ బలికె:
"నెనయఁగ సాహసం బీరీతిఁ జేయఁ । జనునె! తద్బీజముల్ సరగునఁ బుచ్చి
కడువేడ్కతో ఘృత కలశములోన । నెడపక పెట్టుఁడీ యేపుతో నంత

నఱువది వేవురు నాత్మసంభవులు । అఱలేక కలుగుదు రభవుని కరుణ."
నని పల్కుటయు విని యట్లకావింప । మనుజేశ, విను రెండుమానంబులకును
నఱువది వేవురు నట నుద్భవించి । యురుగతి జగముల కుపహతిసేయ,
నసురులు భయమంది, యబ్జజుఁ గాంచి । వినుతులై తద్బాధ విన్నవించుటయుఁ
గరుణామృతముచల్లు కడకంటిచూపు । పరువడి వారిపైఁ బరఁగించి ధాత
"వెలవఁగ నేటికి వినుఁడు నామాట । తెఱలక యోదురు దగ్ధులై వారు
గపిలునిచేత; వేడ్కలనుండుఁ" డనుచు । నపుడు పల్కినఁ బోయి రావాసమునకు.

## సగరసుతులు కపిలు కోపాగ్నిచే భస్మమగుట

అట సగరుండును నశ్వమేధంబు । చటులతఁ జేయఁగ సమకట్టి యంత
దీక్షితుఁడై మహిద్విజులును దాను । నక్షయకీర్తి మహావైభవమున
హయమును విడిచె; నా హయముపిఱుంద । రయమునఁ దనయులు రక్షకులై నడవ
నదియును దేశంబులన్నియుఁ దిరిగి । యదనుగా జలహీనమైన యా జలధిఁ
గానరా కరిగినఁ, గడువిస్మయమున । మానుగా సగరభూమండలాధిపున
కెఱిఁగించి యంతలో నేపుదీపించి । యఱువది వేవురు నర్థిమైఁ బోయి
దివియు భూతలమెల్లఁ దిరముగా వెదకి । యవిరళగతిఁ గాన కంతటఁ బోక
వెలయఁ బాతాళంబు వెదకంగఁ గోరి । హలముల గుద్దండ్ల నట గడ్డపాఱ
లను భూతధాత్రీతలంబెల్లఁ ద్రవ్వి । జననాథ, వినుము యీశాన్యదేశమునఁ
గపిలమహాముని కలితాశ్రమమున । నపుడు గుఱ్ఱముఁగని హర్షంబునొంది,
"యశ్వమేధమునకు నర్పింపఁబడిన । యశ్వము నెంతయు హరియించి వచ్చి
మునిముచ్చు వెఱవ కిమ్ములనున్నవాఁడు । దనరఁగ నీక వీనిదండింపవలయు."
ననుటయుఁ, గోపించి యా మునీశ్వరుఁడు । దన రోషదృష్టిచేఁ దప్పకచూడ,
నఱువది వేవురు నట భస్మమైరి. । అఱలేక కడఁకతో నంత నారదుఁడు
ఈవార్త సగరున కెఱిఁగించుటయును, । భూవిభుండును శోకమున నేడ్చియేడ్చి
యసమంజసుని పుత్రునంశుమంతునిని । మసలక రప్పించి మనుమని కనియె:
"అయ్య, మీతండ్రు' లయ్యఱువది వేవు । రయ్యెడ భస్మమై రమ్మునిచేత.
వెస భవజ్జనకుండు విను మకారణము । పసగల పౌరులఁ బాలురఁ జంప
నది కారణంబుగా నాతని నేను । వదలక విడిచితి; వరబుద్ధి నీవు;

నెలకొని కొడుకుల నిధనంబునకును । గలయుఁగ యజ్ఞంబు కడసుకుఁ జాల
దుఃఖింపుచున్నాఁడ ; దుర్దాంతమైన । దుఃఖంబు మాన్పుము తోడ్తోడ నాకు. ”
నన నంశుమంతుండు నాక్షణంబునను । ... ... ... ... ...
చని కపిలునిఁ గాంచి సాష్టాంగమెఱఁగి । యనువొంద ముకుళితహస్తుఁడై నిలిచి
రమణఁ దా వచ్చిన రాక చెప్పుటయుఁ, । గ్రమమొప్పఁ గపిలుండు కరుణించి చూచి
యశ్వరత్నము నిచ్చి యంత నిట్లనియె । “ శాశ్వతసత్కీర్తి, రాజనాథ, వినుము.
నీకారణంబున నీతండ్రులెల్లఁ । బ్రాకటంబుగఁ బుణ్యఫలము గాంచెదరు ;
సగరభూపతియును సద్గతికరుగు । నగణితంబుగ యాగ మర్థితోఁ జేసి ;
యారూఢి నీపౌత్రుఁడగు భగీరథుఁడు । ధారుణికై తెచ్చుఁ దనర నా గంగ ;
నది నిమిత్తమున సగరాత్మజులెల్లఁ । బదపడి యుత్తమపదవిఁ జెందుదురు ;
వసరాశియును నిండువసుధలో ననుచు । ననిపిన, వేడుక నంశుమంతుండు
ఘోటకంబును దాను గొబ్బున వచ్చి । పాటించి తాత కేర్పడ నవ్విధము.
అంతట దుఃఖ మయ్యవనీశుఁ డుడిగి । సంతోషమెసఁగ నా సవనంబు చేసె.
ఘనవార్ధి సగరులు గల్పించుటయును । అనఘాత్మ, ధర్మజ, యది మొదల్గాఁగ
జలధి సాగర మన జగతిలోఁ బరఁగె. । అలవడ సగరుండు నటఁ గొంతకాల
మవని పాలించి యాయంశుమంతాఖ్యుఁ । బ్రవిమల సత్కీర్తితోఁ బట్టంబుగట్టి
తపమున కరిగినఁ, దమతాతయట్లు । లపరిమితంబుగా నవనిఁ బాలించి
పొనఁగ దిలీపునిఁ బుత్రుఁగాఁగాంచి । వసుధ యెల్లను వాని వశముగాఁజేసి
ఘనతపోవిభవంబు గైకొని చనియె. । ఎనయదిలీపుండు నిటఁ బితామహులు
గరమొప్పఁగా నధోగతులు గాకుండఁ । జిరమతి గంగఁ దెచ్చెదనని తపము
దెలియంగ నొనరించి తెవులుచేఁజచ్చె. । తలకొని యాతని తనయుఁడైనట్టి

## గంగావతరణము

యలభగీరథుఁడు పాయక గంగఁదేరఁ । దలఁచి ప్రాలేయ భూధరమున కరిగి
యలవడ దివ్యసహస్ర వర్షములు । కలితతపోనిష్ఠఁ గదలక యుండె.
అందుకుమెచ్చి ప్రత్యక్షమై గంగ । యందంద నీయిష్టమది చెప్పుమనిన,
నతులితభక్తి సాష్టాంగంబు నెఱఁగి । యతఁడు కృతాంజలియై గంగకనియె :

"తపన తేజుఁడు మహాతపసి సజ్జనుఁడు । కపిలుకోపంబున గతజీవులైన
సగరసూనులకును సద్గతిగలుగఁ । దగనీజలంబులఁ దడుపుము వారి,"
నసవుడు గంగయు నంగీకరించి । "వినవయ్య నేవచ్చు వేగంబునకును
ధరియింప హరుఁడోపుఁ దత్కృపఁబడయు । మరుదుగా." నని చెప్ప, నట్లకాకనుచుఁ
బొలుపొందఁ గైలాస భూధరంబునకు । నలవడఁగాఁబోయి యందుగ్రతపము
పెక్కుకాలంబులు పేర్మితోఁజేయ, । నక్కఱకంఠుండు నాతపంబునకు
మెచ్చి ప్రత్యక్షమై "మేదినీనాథ! । యచ్చుగాఁ దలఁదాల్తు నాగంగ" ననిన
రమణతోడుత భగీరథుఁడు వెండియును । గ్రమము దీపింపనాగంగఁ బ్రార్థింప,
ధరణి బ్రహ్మాండంబుఁ దానయైగంగ । యరుదెంచి హరుజూటమందు వసించి
భూమికై గదలి యద్భుతముగాఁ బాఱి । వేమఱు సాగర వితతికిఁ బుణ్య
గతిగూర్చి వారిధి కలయంగ నించి । యతులితంబుగనుండె. నని చెప్పుటయును,
అనుజనమేతుఁడై యాధర్మరాజు । దనరంగనలరి నందాపరనంద
లనగఁ బెంపొందిన యమ్మహానదుల । ఘనకృతస్నానుఁడై కదలి యంతటను
జనుచోట, వాని యజ్జననాథుఁజూచి । యొనయంగఁ బ్రీతితో నిట్లనిపలికె :
" అదెచూడు కౌశికు నాశ్రమభూమి ; । యదనుగాఁ గౌశికి యను తరంగిణియు ;
నదె ఋశ్యశృంగాఖ్య మనియెడు హ్రదము । వదలక చూడుమా వసుధేశ!" యనిన

## ఋశ్యశృంగు చరిత్రము

ఆరోమశునిఁ జూచి యనుసూతియనియె । "ఆరయ ఋశ్యశృంగాఖ్యు జన్మంబు
నాతని చరితంబు లట వినవలయు । నేతెఱంగున నది యెఱిఁగింపు" మనిన
ముని ధర్మసూనుని మోముపీక్షించి: । "యనఘాత్మ, చెప్పెద నాకథయెల్ల
మున్ను కశ్యపుఁడను మునివరేణ్యునకు । చెన్ను విభాండకుఁ డేపుతోఁ బుట్టి
యనుదిన బ్రహ్మచర్య వ్రతంబునను । దనరఁగ నత్యుగ్రతపము సేయుచును
నంతటఁ గడఁకతో నతఁడొక్కనాఁడు । శాంతుఁడై గంగలో స్నానంబుసేయ
నయ్యవసరమున నచ్చరలేమః । జయ్యన నూర్వశీ చపలాక్షిఁ జూచి
వీర్యంబు నీటిలో విడిచిన, నంత । వీర్యమిశ్రంబైన విమలోదకముల
నొకపెంటిమృగము ద్రావుచునె గర్భంబు(?) । ప్రకటితగతిఁ దాల్చి ప్రాభవమొసఁగఁ

జిరపుణ్యమతి ఋశ్యశృంగునిఁ గనిన, । సరవినాతఁడు తదాశ్రమ మింతె కాని
యొనయంగ నొండు చోటెఱుఁగక ప్రీతి । ఘనతపోవిభవంబు గైకొనియుండె.
అంతట నంగదేశాధీశ్వరుండు । పంతంబుతో రోమపాదుఁడన్ రాజు
ఇరవొందఁ దనపురోహితుఁ డొక్కనాఁడు । ఉరవడి యపరాధ మొనరించుటయును
విప్రులెల్లరిచేత విడువంగఁబడిన । క్షిప్రంబుగా వాన క్షితిలేకపోయె ;
వానలేకుండిన వాడె సస్యములు ; । పూనిక చెడిపోయె భూజనంబులకు.
దానికి వెఱచి బాధవుఁడు బ్రాహ్మణుల । మానుగా రప్పించి మఱియుఁ బూజించి
"తుది నీయనావృష్టిదోష మేలయ్యె ? । వదలక యెందునివర్తించు ?" ననిన
బ్రాహ్మణు లారోమపాదునిఁ జూచి । "బ్రాహ్మలు నిన్నుఁ జేపట్టకచనిన
నమరులు విడిచిరి యవనీశ, నిన్నుఁ ; । గొమరొప్ప నదిగానఁ గురియదు వాన.
కావున నిచటికి ఘనుఋశ్యశృంగు । రావింపు వాన లుర్వరఁజాలఁ గురియుఁ ;
దిరముగా నాతఁడు దేవేంద్రుచేత । వరము గాంచినవాఁడు వసుమతీనాథ !"
అని విన్నవించిన నంగాధిపతియు । మనమూర విప్రావమానంబునకును
వెలయఁ బ్రాయశ్చిత్తవిధి యొనరించి । నలిమీఱ వేశ్యాజనంబులఁ బిలిచి
'వెనుకొని మీనేర్పు విధమునఁ బోయి । ఘనుఋశ్యశృంగు నిక్కడకుఁ దోడ్తెండు.'
అని పల్కుటయు వారలట్లకాకనుచు । ననుపమంబైన భక్ష్యంబులు గొనుచు
ననులేపనములు దివ్యాంబరావళులు । ఘనతరలీలలఁ గనుపట్టియుండఁ
జెలఁగు వేడుక ఋశ్యశృంగు నాశ్రమము । వలనుగా నెఱిఁగి యవ్వనభూమి కరిగి
మెల్లన నడచుచు మెలఁత లందఱును । నల్లనల్లనఁ బోవ, నంతకుమున్న
వెస విభాండకుఁడును విహితాగ్నిహోత్ర । మసదృశగతి వేల్వనటఁ బుత్రునునిచి
కందమూలాదులకై వేడ్కతోడ । నడవికి నేఁగిన, నంతయు నెఱిఁగి
యొకసతి తనకూఁతు నుజ్జ్వలరూపఁ । బ్రకటించి మునిపుత్రు పాలికి ననుపఁ
జెనసి వేడుక ఋశ్యశృంగుండు దానిఁ । గనుఁగొని మునిపుత్రుఁగా నిశ్చయించి
యెన్నండు నాతిని నెఱుఁగఁడు గాన । మన్నించి 'యిందురా మాని కుమార!'
యని యెదురేఁగి యర్ఘ్యాదులర్పించి । ననిచిన కృష్ణాజినంబుపై నునిచి
"భాగ్యంబు చేసితి భవ్యులలోన ; । సౌభాగ్యుండ నైతి నీయుర్విలోపలను ;
మీరు వచ్చితిరి యర్మిలి నన్నుఁజూడ । నీరీతి మునులు నే నెన్నఁడు గాన.
నిరత నిష్ఠుర తపోనిధులైన మీరు । చరియించుచున్న యాశ్రమభూమియెద్ది ?

యేపుణ్యనది మీకు నెల్లకాలంబు । ప్రాపు మజ్జనము తర్పణములుసేయ!
కందమూలాదు లక్కడఁ జాలఁగలవె? । అందు సమిత్కుశలవి పెక్కుగలవె?
మృగబాధ లేమియు మీయాశ్రమమునఁ । దగిలి యుండవుగదా తప్పకెప్పుడును?
ఏచెట్లనారల నివి చేయఁబడెనో । మీచీర లత్యంత మృదువులు సూడ;
తులసి పూసలపేర్లు దోరమై మిగులఁ । గలిత ధావళ్యమై కానఁగఁబడియె."
అని ముగ్ధభాషల నాఋశ్యశృంగుఁ । డనురాగమునఁ బల్క యంతటిలోనఁ
గందమూలాదులు గ్రక్కునఁదెచ్చి । పొందుగాఁబెట్టినఁ, బొలఁతి వీక్షించి
పరికించి మెచ్చక "ఫలములివేల! । కరమొప్పఁగా రుచికరములు గావు;
మా యాశ్రమంబున మధురంబు లగుచుఁ । బాయక యే ప్రొద్దు ఫలములు గలవు;
యివి గాని చవి చూడు మెలమితో" ననుచు । నవిరళగతి నీయ నప్పదార్థములు
మునిసార్వభౌముండు మునిచక్రవర్తి । యనురక్తి భక్షించి యాహ్లాదమంది
యనుపమంబగు రుచి కాత్మలోఁజొక్కి । మనమార వేడుక మఱియు నిట్లనియె:
"నీ కందమూలంబు లీ ఫలంబులును । జేకొన రుచిచూపె జిహ్వకుఁ జాల;
మీ యాశ్రమంబున మీ కందువలను । బాయక యిటువంటి ఫలములు గలవె?"
అనవుడు వనిత యిట్లని పల్కె మునికి । "విను ఋశ్యశృంగ, భావించి మానెలవు
ఫలములు గల విటువంటివి పెక్కు. । ... ... ... ... ...
ఈ గతి తులసిపేర్లీ వల్కలములు । ఆగమంబులు వింత లచ్చోటఁ గలవు (?)
మునుకొని యిచటికి మూఁడు యోజనము । లనుపమమైన మా యాశ్రమభూమి;
అచ్చటి కెలమి రావయ్య పోవుదము । మచ్చిక నీవు సమ్మతి పడియుండు."
మని బుజ్జగించి యా యంబుజగంధి । యనురాగ ముప్పొంగ నప్పుడు ప్రీతి
నాలాపములుసేసి యతి రమ్యమైన । సూళాదిగీతము లొప్పారిదిఁ బాడుటయును,
నా గానరసమున కమ్మునీశ్వరుఁడు । లాగుగాఁజొక్కి యా లలన కిట్లనియె:
"మునికుమారక, యిట్టి మోహనంబైన । యనుపమ వేదవాక్యంబులు వినము;
సామగానము యజుస్స్వరమును గాదు, । ప్రేమ నథర్వణ ఋక్కులు గావు;
ధరణి ననంత వేదము లన్న మాట । లరసి వింటిమి గాన మవియె కాఁబోలు!
ఈ వేదవాక్యంబు లిన్నియు మాకు । భావించి చెప్పుము భవ్యాత్మ, నీవు."
అని ఋశ్యశృంగ మహా మునీశ్వరుఁడు । వినయ మొప్పఁగఁ బల్క విని వారకాంత
యతని మచ్చికచేసి యంగంబులెల్లఁ । జతురతఁ బుణికి చంచలచిత్తుఁజేసి,

చన్నులు చూపిన సంతోషమంది । పన్నుగాఁ జేపట్టి పలికె నిట్లనుచు :
"మునిచంద్ర, మీ దేశమున మునీంద్రులకుఁ । గొనకొని ఱొమ్మునఁ గొమ్ములు గలవె!
మాకుఁగొమ్మున్నది మస్తకంబునను; । మీకుఁ గొమ్ములుఁ రెండుమెఱసె ఱొమ్మునను."
అని పట్టియూఁపుచు నలివేణిఁజూచి । పనివడి యనియెఁ దాత్పర్యంబుతోడ :
"జడలును సన్నమై చక్కనై మీకు । ముడిచిన ముడివడి మోహనంబయ్యె;
నివి చోద్యములు మీకు నిట్టి చిహ్నములు । ఇవి మాకు లే." వని యెంతయుఁ బలుక
నిల విభాండకు రాక యిచ్చలోనెంచి । యెలమితోడుత నేఁగె నాకోమలాంగి. (?)
అరయ వేశ్యాపుత్రి యరిగిన నతఁడు । పరమతితో దానివలన చూచుచును
దలకొని యగ్నిహోత్రము వ్రేల్వ మఱచి । యలసియుండఁగ, నంత నడవిలోనుండి
యా విభాండకుఁడు వన్యఫలముల్ గొనుచు । నావిధి నేతెంచి యాత్మజుఁజూచి,
"తనయుఁడ, యగ్నిహోత్రము వ్రేల్వ కిట్టు । లనయంబు మిగులఁ గాలాతిక్రమంబు
చేసి నిర్విణ్ణతఁ జింతింపనేల? । యీ సుద్ది నాకిప్పు డెఱిగింపు." మనుచుఁ
దమ తండ్రిఁజూచి యత్తపసి కుమారుఁ । డమరిన బుద్ధి వాక్యముల నిట్లనియెఁ:
"గాంచన వర్ణంబు గల రూపయుతుఁడు । సంచిత వేదశాస్త్ర పరాయణుండు
దన మేను సకల దిక్తటములు నిండఁ । గనకమయంబుగాఁ గావించుచుండు
నొక బ్రహ్మచారి నా యున్న చోటికిని । నకలంకవృత్తిమై నరుదెంచి మించి
నన్నుఁగౌఁగిటఁ జేర్చి నాముఖంబునకుఁ । బన్నుగాఁ దన ముఖపద్మంబుఁ జేర్చి,
సరసరీతుల మృదు శబ్దంబుసేసె; । హరిహరి! యేమందు నట్టి శబ్దంబు
వెనుకొని యెన్నఁడు విని యెఱుంగఁ; । బనివడి మాధుర్యఫలము లిచ్చితిని;
యవి మది మెచ్చక యమృతోపమాన । వివిధఫలంబులు వేడుక నిచ్చె.
అటువంటి ఫలము లీ యడవులలోనఁ । బటు బుద్ధిగాన నీ పాదంబులాన.
అమ్మని పుత్రుతోనటఁగూడి తపము । సమ్మతి సేయంగ సంతోషమయ్యె."
అనవుడు విస్మితుఁడై విభాండకుఁడు । దన తనూభవుతోడఁ దద్దయుననియె :
" వెలయఁ దపంబులు విఘ్నంబుసేయ । నలవడ బహురూపులై దైత్యవరులు
తెమలక వనములఁ దిరుగుచుండుదురు ; । క్రమమొప్ప నమ్మంగరాదు వారలను. "
అని సుతు బోధించి యట మఱునాఁడు । వనముల కరిగెను వన్యాదులకును.
అంతట నెప్పటియట్ల యత్తరుణి । సంతోష చిత్తయై చనుదెంచి నిలిచి
బహువిలాసంబుల బహుళగీతముల । బహునృత్యములఁజేసి " భవ్యాత్మ, నీవు

హా యాశ్రమమునకు మమత దీపింపఁ । బాయక చనుదెమ్ము పరికింప కిపుడు."
అనవుడు వచ్చెదనని ఋశ్యశృంగుఁ । డనురాగ మొదవఁగ నాయింతి వెంటఁ
జనుదెంచుటయుఁ దోడి సతులనుగూడి । ... ... ... ... ...
ఎలయించు కొనుచు మునీంద్రుఁ దోడ్తేర, । నలరంగ నతఁడు నయ్యంగదేశమున
సురుచిర స్ఫూర్తితోఁ జొచ్చినంతటనె । పరికింప నా రోమపాదుండు ప్రీతి
... ... ... ... ... । పురము శృంగారింపఁబుచ్చి మునీంద్రు
కెదురేగి పదముల కెఱఁగి తోడ్కొనుచు । ముద మొప్పఁ దన గృహమునకునుబోయె.
అంగదేశమ్మున నాక్షణంబునను । భోంగుచు వానలు పూర్ణమై కురియ
నరవి దుర్భిక్ష దోషములెల్ల నుడిగెఁ । బరమ సంతోషసంపద చెన్నుమీఱె.
అంత నా నృపతియు నాత్మజమైన । శాంత సమ్మునికి నిశ్చయముగా నిచ్చి
ధనములు రత్నముల్ దాసులు నూళ్లు । కనకభూషణములు ఘనముగా నొసఁగి
యవని ననేక సహస్ర గోవులను । నవిరళమతి నీయ నతులితంబుగను,
ఏదేశమునఁ జూడ ఋశ్యశృంగాఖ్యు । నాదర ఘోషంబులనఁ బర్వె నంత.
ఇట విభాండకుఁడును నెలమిదీపింపఁ । బటుతరంబుగ వన్యఫలములు గొనుచు
నా యాశ్రమమున కున్నతి వచ్చి వచ్చి (?) । భావించి తన తనూభవుఁగాన కలసి,
'యెక్కడి కేఁగెనో ! యెందున్నవాఁడో ! । యక్కజంబుగ నేమి యయ్యెనో యకట !'
యని చాల వగచుచు నశ్రువులొలుక । ననిశంబుఁ గొడుకును నఖిలదేశముల
వెదకుచుఁ జనిచని వెస నొక్కనాఁడు । మొదవులమంద నిమ్మ్లఁ బ్రొద్దుగ్రుంక
వదలక యచ్చోట వసియించుటయును, । గొదలేక యచ్చటి గోపకులెల్ల
నాదరంబున ముని నర్చించుటయును । నాదరంబున వారి నవ్విభాండకుఁడు
గనుఁగొని "యెవరిదీ కలితఘోషంబు ? । వినఁగఁ జెప్పుఁడు మాకు వేడుకతోడ."
ననవుడు గొల్ల లయ్యతిఁ జూచి యనిరి । "వినవయ్య మునినాథ, విజ్ఞానమూర్తి,
గొనకొని ఋశ్యశృంగుండను మాని । ఘనఘోష మిది" యనఁ గడు వేడ్కనొంది
"యెవ్వరిచ్చిరి వీని కిప్పు డిచ్చోటు ? । నవ్విమలాత్మకుఁ డెట నిల్చినాఁడో (?)
చెప్పుఁడా మాకును జెవుల కింపుగను । తప్పక ;" యనవుడు తపసి కిట్లనిరి:
"అంగదేశాధీశుఁ డా రోమపాదుఁ । డంగనఁ దనకూఁతు నా శాంత నిచ్చి
గోసహస్రాదులు గొనకొని యొసఁగ । నా సంయమీంద్రుండు నాతని యింట
వసియించి యున్నాఁడు వలనుగా." ననిన । ననదృశ సంతోషితాత్ముఁడై మౌని

యారాత్రి యందుండి యట మఱునాఁడు । ఆహ్లాది రోమపాదావనీశ్వరుని
పురముఁ బ్రవేశించి పుత్త్రుఁ గోడలినిఁ । బరికించి కనుఁగొని పరమ హర్షమునఁ
గొడుకునుఁ గోడలిఁ గూర్మిఁదోడ్కొనుచు । నడరంగఁ బోయె నాయాశ్రమమ్మునకు."
నని ఋశ్యశృంగు మాహాత్మ్యమంతయును । గొనకొని చెప్పినఁ గువలయేశ్వరుఁడు
రయమొప్పఁ గౌశికహ్రాద తీర్థమాడి । నయమొప్ప నేనూఱు నదులతోఁగూడి
కలితమైనట్టి గంగాసంగమంబు । వలనొప్పఁ జూచుచు వచ్చిన, వాస
మనుజేశు కిట్లను : "మహితాత్మ, వినుము । అనిమిషుల్ మునులును నభవుని కిచట
ఘనయాగభాగంబు కల్పించి రెలమి ; । తనరంగ ధాత్రి వైతరణి యీ యేఱు ;
కొలఁదిగా నిందులఁ గ్రుంకినవార । లెలమి దేవవిమాన మెక్కుదు రనఘ!"
అనినఁ దమ్ములు దాను నతివయు నంతు । మునిఁగి సంతోషించి మునిచంద్రు కనియె
"నీకతంబున మాకు నిఖిలలోకములు । ప్రాకటంబుగఁ గానఁ బడియె నో యనఘ!
నేనుఁ బుణ్యుఁడ నైతి నెల్లలోకముల ; । కేను మాన్యుఁడ నైతి నెల్లరకంటె."
నని మహేంద్రనగంబు కర్థితోఁ బోయి । తనర నందుల తపోధనులకు మ్రొక్కి
తగ వారిచేత సత్కారంబు వడసి । యగణితస్ఫూర్తి నిట్లనియె ధర్మజుఁడు :
"మునులార, పరశురామునిఁ జూడవలయు । సునిశిత మతితోడఁ జూపరె నాకు."
ననిన నమ్మునులలో నకృతవ్రణుండు । చనవొప్ప రామానుచరుఁ డిట్లు పలికె :
"యనఘాత్మ, ధర్మజ, యాభార్గవుండు । దన దివ్యదృష్టిచేఁ దప్పక మీర
లిట వత్తురని మున్నె యెఱుఁగు నిక్కువము ; । పటుగతి మిముఁజూచు భక్తి నున్నాఁడు.
రేపు చతుర్దశి ఋషులును మీర । లేపుతోఁగనుఁగొనుఁ డిచటికి వచ్చు."
ననిన, మహేంద్రాద్రి నారాత్రి నిలిచి, । జనపతి రామానుచరున కిట్లనియె:
"సంయమీశ్వర, రాముచరితంబు నాకు । నియ్యెడ వినఁ గడు నిచ్చపుట్టెడిని;
అది సవిస్తరముగా నానతీవయ్య । వదపడి." యనిన నా భవ్యాత్ముఁ డనియె:

... ... ... ... ... ... | ... ... ... ... ...

## పరశురామ చరిత్రము

"పొసఁగఁ గన్యాకుబ్జమునకు భృగుండు । వసుధఁ గ్రుమ్మరివచ్చి వలను దీపించి
పొనుపడ వారిచేఁ బూజలు వడసి । తనయునిఁ గోడలిఁ దద్ద మన్నించి
తెలివితో నొకకొన్నిదినము లందుండి । యలరి కోడలి కిటులను నొక్కనాఁడు

"నీకుఁ గోరిక యేమి నీరజవదన? । చేకొని యడుగు మిచ్చెదఁ దప్ప" ననుడుఁ
బలుదెఱంగులఁ జాల భక్తితో మ్రొక్కి । వలనొప్ప నాసత్యవతియు నిట్లనియె :
"మాయమ్మకొక్కని మఱినాకు నొకనిఁ । బాయక పుత్రులఁ బడయంగ నీవె!"
అనవుడు "నీకోరి నట్ల సిద్ధించు । జననియు నీవు సుస్నాతలై వచ్చి
నీవు మేడియు మఱి నీతల్లిరావి । భావించి కౌఁగిటఁ బట్టుఁడు చాలు
సుతులు గల్గెద." రన్న సుదతి హర్షమున । మతిచెడి వృక్షము ల్మార్పడినంత
నెఱిఁగి భృగుండును నిట సత్యవతికి । నఱలేని భక్తితో నప్పు డిట్లనియె :
"సతివరో! తరువిపర్యాసంబు వలన । సుతుఁడును విప్రపూజ్యుఁడు నీకుఁ బుట్టి
క్షత్రచరిత్రుఁడై జగతిలోఁ బరఁగు ; । ధాత్రి మీతల్లికి ధరణీశుఁ డుట్టి (?)
యును దపోమహిమ సత్కుర్వీసురేంద్ర । ఘనభావ తేజః ప్రకాశుఁడౌ నిజము."
అనినఁ గృతాంజలియై సత్యవతియు । "ననఘాత్మ, నాపుత్రునందు రాజత్వ
మలవడ లేకుండ నటఁ బౌత్రునందుఁ । గలుగఁగఁ గృపసేయు కలితాత్మ!" యనిన
మన్నించి యారీతి మగువకు నీయఁ, । గ్రన్నన వేడ్కతో గర్భంబు దాల్చి
ప్రముదితంబుగ వేదపారగు ఘనుని । జమదగ్ని యనియెడు సత్పుత్రుఁ గనియె.
అవిరళంబుగ నంత నా జమదగ్ని । యువనిఁ బ్రసేనజిత్తను రాజుకూఁతు
రేణుక యనుదానిఁ బ్రేమ రెట్టింప । క్షోణిలోఁ బెండ్లియై సొబగు దీపించి
యనఘు రుమణ్వు సుషేణు విశ్వావ । సుని రాము నలువురుసుతులను గాంచి
తపము సేయుచు నుండుతఱి, నొక్కనాఁడు । అపరిమితోత్సాహులై తనూభవులు
ఆరూఢి వన్యఫలాదులు దేరఁ । గోరి పోవుచునుండఁ గొడుకులవెంట
జననియుఁ జని యొక్కసరసిలోపలను । జననాథు జలకేళిసలిపెడువాని
వలనొప్ప మార్తికావత పతి యగుచు । నలరారు చిత్రరథాఖ్యునిఁ జూచి
కామమోహితయునై గారవంబునను । ఆ మనుజేశ్వరు నటఁ బొందుటయును,
అత్తెఱంగెల్లను నా జమదగ్ని । చిత్తంబునందె వీక్షించి కోపించి
తనయులఁజూచి "మీతల్లిని జంపి । ఘనముగాఁ జనుదెండు కడఁకతో." ననిన
నందు ముగ్వురు సుతు "లధికపాతకము । పొందుగాఁ దల్లిఁ జంపుట" యని పలికి
యూరకయుండిన, నుగ్రుఁడై మౌని । "ఘోరాటవులలోనఁ గుందుచు మీర
లనయంబు మృగపక్షులట్టు లజ్ఞాన । మున నుండు." రనుచు నిమ్ముల శపియించి
రామునిఁ జూచి "యోరామ, మీతల్లి । నీ మెయిఁ జంపు మెుండేమియు ననక."

యని చెప్పుటయు సతం డంగీకరించి । జనని వధించిన, జమదగ్ని ప్రీతిఁ
దనయుఁ గౌఁగిటఁ జేర్చి తగ గారవించి । "యనఘాత్మ, నేఁ జెప్పినట్లు చేసితివి
నీకుఁ గోరికయేది నేనిత్తు నడుగు । ప్రాకటంబుగ." నన్న భక్తితోఁ మ్రొక్కి
" తల్లి ప్రాణంబును, దద్దోషహరము, । నెల్ల సహోదరు లెప్పటియట్లు
శాపవిముక్తులై చరియింప, నాకుఁ । బ్రాపుమీఱఁగ రణరంగ జయంబుఁ,
జావును లేకుండ నరవితో వరము । లీవేళ ని" మ్మన్న నిచ్చె సమ్మౌని.
అంతఁ గొండొకకాల మరిగిన పిదప । సంతత జయశాలి జగతి హైహయుఁడు
వేఁట సన్నాహుఁడై విపినాంతరమున । వేఁట లాడుచు సైన్యవితతియుఁ దాను
నలసి యా జమదగ్ని యాశ్రమంబునకుఁ । బొలుపుగాఁ జనుదెంచి పూజితుండగుచుఁ
దన రాజ్యమదమునఁ దాపసోత్తముల । మనమున మెచ్చక మఱి బాధచేసి
వృక్షంబు లెల్లను విఱిచి ధేనువును । నాక్షణంబునఁ గొని యరుగుచునుండె.
అట భృగురాముండు నడవిలోనుండి । పటు సమిత్కుశములు ఫలములు గొనుచుఁ
జనుదెంచుటయుఁ జూచి తద్విధమెల్ల (?)। జనకుఁ డెఱింగింపఁ జాలఁ గోపించి
వాని వెంటనె పోయి వడి శరవృష్టి । వాని సేనలఁ జంపి వసుధపైఁ గూల్చి
సకల బలంబులఁ జక్కాడివైచి । వికటమౌ నా కార్తవీర్యుని వేయి
కరములు దునుమాడి ఖండించె శిరము. । అరయఁగ నంతలో నాతని సుతుఁడు
మహిమీఁద నాపగ మనమునఁబెట్టి । యహితుఁ డయ్యెడు రాముఁ డటలేకయుండఁ
జూచి యవ్వనభూమి చొచ్చియెంతయును । ఏచి యా జమదగ్ని నిటఁ జంపివైవ,
నంతట భృగురాముఁ డరుదెంచి యెఱిఁగి । యంతరంగంబు దావాగ్నియై మండ
క్షత్రవర్గమునెల్లఁ జంపెదననుచుఁ । జిత్రప్రతిజ్ఞుఁడై చెండాడివైచి,
పొలుపొంద నధ్వరంబులు పెక్కుచేసి, । తలకొని యార్త్విజ్య దక్షిణగాఁగ
నిలయెల్లనిచ్చి, మహేంద్రాద్రియందుఁ । దలకొని నిష్ఠతోఁ దపమున్నవాఁడు."
అని రాముచరిత మాద్యంతంబు చెప్ప । విని సంతసిల్లె నవ్విభుఁడు; వేగుటయు
నా చతుర్దశినాఁడు హర్షంబుతోడఁ । జూచి భార్గవరాము సొరిదిఁ బూజించి,
యతనిచేఁ బూజితుఁడై దక్షిణమున । కతులితమతిఁ బోయి యంతటిలోన
గోదావరీనది గ్రుంకి యారామ । వేదిఁ గనుంగొని, వెసఁ బ్రభాసమునఁ
బదిరెండు దినములు పవనాశనమున । మది నిల్పి పంచాగ్నిమధ్యంబునందుఁ
దపము సేయఁగ, నంత దాని నెఱింగి । యపుడు శ్రీకృష్ణుండు హలధరుఁ గూడి

యాదవుల్వెంట రా నరుదెంచి కాంచి, । యాదరంబున దుఃఖమారఁ బల్కు_టయు
యమసూతి యిట్లను నబ్జాక్షుఁ జూచి : । "కమలాధినాయక, గతి నీవె మాకు ;
నడవుల నీరీతి నలమటించెదము ; । కడఁకతోఁ బార్థుఁ డాఖండలు నొద్దఁ
దెలివితో నున్నాఁడు దివ్యాస్త్రతతులు । వలసినన్నియుఁ గాంచి వలనుగా." ననిన
నప్పుడు బలరాముఁ డా యాదవులకుఁ । దప్పకిట్లనియె భూతలనాథుఁ జూపి :
"తనయాత్మజునిమాట తడయకచేసి । యొసరఁ బాపమునకు నొడిగట్టి యంత
నృపతి వీరల నంపె నెఱి నడవులకు ; । అపు డూఱకుండిరి యా భీష్మకృపులు ;
కావున సమరముఖంబున వారి । వేవేగఁ జంపి యీ విధువంశతిలకు
రాజుగాఁ జేయక రమణదీపించి । యోజతో మన మూఱకుండుట దగునె!"
అనవుడు సాత్యకి యనియె నీరీకిని । " అనఘాత్మ, నీలాంగలాభిఘాతముల,
మొగి జనార్దనుశార్ఙ్గముక్త బాణములఁ, । దగ శంబరారి యుద్ధత శరంబులను,
అనిరుద్ధు తీవ్ర మహాశుగంబులను । దనరంగ భూమి నిర్ధారక్తరాప్లముగ
నొనరించి కర్ణాది యోధులఁజంపి । యొనయంగ సౌభద్రు నిలకు నిల్పెదము.
తమ్ములుఁ దానును ధర్మనందనుఁడు । సమ్మతి మీఱఁగ సమయవర్షములు
సలిపి రాజ్యస్థుఁడై జగతియేలెడిని । వలనుగా." ననిన నవ్వనజాక్షుఁ డనియె:
"పార్థివ, యీతండు పలికిన యట్ల । యర్థితోఁ జేసెద" ననుడు ధర్మజుఁడు
"మీదయగల్ల నమిత్రుల నోర్వ । నాదట విస్ఫూర్తి నది యెంతపెద్ద !
యలవడ బంధు భీష్మాదుల యెదుటఁ । బలికిన పలుకుల పద్ధతిఁ దప్ప."
ననవుడు సంతోషమంది కృష్ణుండు । తనరంగఁ బోయెను దాను ద్వారకకు.
ఇట నర్మదాస్నాన మెలమితోఁజేసి । పటుమతి వైడూర్య పర్వతంబర్థిఁ
గనిన రోమశుఁడు భూకాంతునిఁ జూచి : । "వినవయ్య ధర్మజ, విదితప్రతాప!
యదె చూడు సంయాతి యజ్ఞప్రదేశ. । మదనుగా భృగుపుత్రుఁడగు చ్యవనుండు
గొనకొని సంయాతి కూఁతుసుకన్య । యను దానిఁ బెండ్లియై యతని యాగమున
మది నింద్రు నాదరింపక యశ్వినులను । దుది ముట్ట సోమపీథులఁజేసె." ననినఁ,
గడు విస్మయమునొంది కంజారికులుఁడు । 'ఎడపక యీకథ యొఱిఁగింపు' మనిన
యమతనూజునిఁ జూచి యా రోమశుండు । గొమరొప్ప ననియె: "నోక్షోణీశ, వినుము

## సౌకన్యాఖ్యానము

మెఱసి యిక్కొలని సమీపంబు నందు । నఱలేక భార్గవ చ్యవనుండు దొల్లి
యొనయఁగఁ బెక్కువేలేఁడులు దపము । ఘనముగాఁ జేయఁ దత్కాలంబునందు
వల్మీక మొక్కటి వలనుగాఁ బెరిగి । గుల్మముల్నిండి మిక్కుటముగాఁ బర్వె.
అంతట సంయాతి యను మహీవిభుఁడు । ఎంతయుఁ గడఁకతో సేన దీపించి
వెస నాల్గు వేవురు వెలఁదులుఁ దాను । బొనఁగఁగఁ గొలనిలోఁ బొలుపు దీపించి
... ... ... ... ... ... । జలకేళి సలుపఁగఁ జనిన, నంతటను
సౌకన్య యనుకన్య జననాథు పుత్రి । సాకల్యముగఁ దన సఖులును దాను ..
వనకేళి సల్పి యా వల్మీకమందు । ఘనమైన చ్యవనుని గన్నుల మెఱపుఁ
గని పుట్ట త్రవ్వినఁ, గన్నులు మూసి । కనలి యా సంయాతి ఘనసైన్యములకుఁ
గరమొప్ప నిరువాయికట్టుఁ జేసినను, । ధరణీతలేశుఁ డంతటఁ జాలవగచి
'జననాథ, విను తనసైన్యాపరాధ । మునసైన కీడుగా మొగి నిశ్చయించి,
యమ్మెయి నందఱ నడిగి తత్కార । ణమ్ము నెఱుంగక నలి విచారింపఁ
దన తండ్రికడకు సత్తరుణి సుకన్య । కొమరొప్ప వచ్చి మక్కువతోడ ననియె
"మిడుఁగుఱు లట్లుగా మెఱసె నీపుట్టఁ । దడయక మెఱసినఁ ద్రవ్వితి నేను ;
త్రవ్వియుఁ గానక తద్ద వచ్చితిని ; । ఇవ్విధి వాటిల్లె నీసైన్యములకు."
అనవుడు సంయాతి యప్పుడు గదలి । చని పుట్టఁజేరి నిశ్చలవృత్తితోడఁ
దపమున్న యొక వృద్ధతాపసుఁ గాంచి । యపుడు చాఁగిలిమ్రొక్కి యర్థినిట్లనియె :
"మౌనీంద్ర ! నీతపోమహిమ పెంపెఱుఁగ । కీ నిసు గబ్జాక్షి యొగ్గొనరించె;
శరణు నీవే దిక్కు సంయమిచంద్ర ! । కరుణ దైవాఱఁగఁ గాచి రక్షింపు ;
రూఢి మత్సైన్య నిరోధంబు వాపు । వేడుదు." ననిన నవ్విప్ర పుంగవుఁడు
మన్నించి యంత నమ్మనుజేంద్రుఁ జూచి । "సన్నుత యౌవన సౌందర్యగర్వ
మున నీ కుమారిత మొగి నింతచేసెఁ ; । బెనుపొంద దానినిఁ బెండ్లాడి కాని
క్షమియింప." ననవుడు సంయాతి మ్రొక్కి । కమనీయ రూపరేఖా విలాసముల
వినుతికి నెక్కిన విమలేందువదనఁ । దనకూఁతు సౌకన్యఁ దపసికి నిచ్చి
రూపింప సైన్యనిరోధంబుఁ బాచి । ప్రాపుగాఁ జనెఁ దన పట్టణంబునకు.
ఇట సుకన్యయుఁ దన హృదయేశ్వరునకుఁ । బటుతర భక్తిమైఁ బరిచర్యసేయ

నంతలో నొక్కనాఁ డబ్జాక్షిఁ జూచి । యెంతయు నాశ్వీను లేతెంచి యనిరి
"ఎవ్వరి కూఁతుర విందీవరాక్షి ! । యెవ్వరి భార్యవో యెఱిఁగింపు." మనిన
ఆ సుకన్యయు వారి నప్పుడు సూచి । భాసురకలిత వాక్ప్రౌఢి నిట్లనియె :
"సదమల తేజుండు సత్యసంధుండు । విదిత ప్రతాపుండు విశ్వ రక్షకుఁడు
అనఘుఁడు సంయాతి యను మహీనాథు । తనయను, చ్యవనుండు తనపతి." యనిన
విని వారు "కటకటా ! విదిత సౌందర్య । ఘన యౌవనప్రౌఢి గలిగిన నీకు
విరతి బాహ్యునిఁ గడు వృద్ధు భార్గవుని । వరియించి యిట్లుండ వలయునె యకట !
నీ జవ్వనంబెల్ల నెఱి వృథయయ్యె ; । నోజతో నీదు వయోరూపములకుఁ
దగినవాని వరింపు తప్పక యేము । నగణితంబుగఁ దెత్తు." మనిన నయ్యింతి
వెన వారి మాటలు వీనులు సొరక । యసదృశగతి వచ్చి యవ్విధంబెల్లఁ
దన పతి కెఱిఁగింపఁ, దపసి యెంతయును । వనజాక్షి ఘనపతివ్రత గుణంబునకు
మనమున నలరి యమ్మగువ నీక్షించి । యొనరంగ నందుల కొడఁబడు మనుచుఁ
బనిచిన, నటు పోయి పద్మాయతాక్షి । ఘనయౌవనప్రౌఢి గలిగిన వరునిఁ
గావింపుఁ డనినఁ, దక్కక యింతిపలుకు । భావించి యశ్వినుల్ పరఁగ నక్కొలను
చ్యవనునితోఁ గూడఁ జయ్యన చొచ్చి । నవ యౌవనోన్నత నవ్య రూపముల
నెసఁగి, సుకన్యక యెడ వచ్చి నిలిచి । 'వసుధ మాలో నీవు వలసినవారి
వరియింపు' మనవుడు వనితాలలామ । యరయఁగఁ దనపతియైన భార్గవుని
వరియించె మిక్కిలి వైభవంబెసఁగ. । వరుస నంతట భార్గవ చ్యవనుండు
అశ్వినులను జూచి హర్షంబు నొంది । శాశ్వత వాక్ప్రౌఢి చతురుఁడై పలికె :
"తలకొని మీ నిమిత్తమున యౌవనము । గలిగె ధన్యుఁడనైతిఁ గరుణాఢ్యులార !
సోమంబు మీకిత్తు సురరాజు చూడ । ... ... ... ... ... ...
... ... ... ... ... । అమరంగ సంయాతి యల్లున కెలమి
నంతతోత్సాహ విస్తర యౌవనంబుఁ । జింతించు నంతలో సిద్ధంపు రూపుఁ
గలుగుట విని, వేడుకలు దళుకొత్త । నలవడఁ దనకూఁతు నల్లునిఁ జూడఁ
జనుదెంచి, పొడగని సాష్టాంగ మెఱఁగి । యనువొంద ముకుళిత హస్తుఁడై యున్న
మామఁ గనుంగొని మౌని యిట్లనియె : । 'మామ, సేయించెద మఖమర్థిఁ జేయు'
మనవుడు సంయాతి హర్షంబు నొంది । పనివడి యాగ సంభారముల్గూర్చి
... ... ... ... ... । యాగంబు సేయంగ నందశ్వినులను

ఘన సోమపీథులగాఁ జేయుటయును, । దాన సహింపక తనర నింద్రుండు
మానుగాఁ గోపించి మఱి శతకోటి । ... ... ... ... ...
యెత్తిన, స్తంభింప నిటఁజేసి మాని । యత్తఱి నాహుతు లగ్నిలోఁ ద్రేల్చ,
నందుద్భవించె మహా దేహయుతుఁడు । నందంద శతయోజనాయత దంష్ట్ర
ములునాల్గు మెఱయంగ, మునుకొని బాహు । వులు వేయి యోజనంబుల నిడుపగుచు,
దశయోజనాయామ దశనముల్గలిగి, । శశి రవి మండల సదృశంబులైన
నేత్రము ల్గాన్పింప, నెఱి నొక్కహనువు । ధాత్రియందొక్కటి దగఁ ద్రిదివమునఁ
గా నోరు దెఱచి దీర్ఘంబైన నాల్క । మానుగాఁ గనుపట్ట మదనాముకుండు ;
రాక్షసుఁడుండిన, రమణ నింద్రుండు । నాక్షణంబునఁ జూచి యాత్మలో వెఱచి
భార్గవస్తంభిత బాహుండు గాన । దుర్గమం బగుచు నెద్దియుఁ జేయలేక
ముకుళితహస్తుఁడై "మునిసార్వభౌమ ! । యకలంక గతిఁ గావు మర్థితో మమ్ము ;
నెలకొని యశ్వినుల్ నేఁటినుండియును । అలవడ సోమార్హులౌదురు నిజము."
అనువుడు భార్గవుఁ డలుక వోవిడిచి । యనిమిషాధిపుని బాహాస్తంభసంబు
నుడిపిన దివమున కొనరఁగఁజనియె. । నడరంగ మదుఁడును నాక్షణంబునను
మెఱసి మద్యాంగనా మృగయాక్షములను । దఱలక వసియించి ధరమీఁద నిలిచె.
సోమార్హులై యిట్లు సొరిది నశ్వినులు । నామెయిఁ ద్రిదివంబు కరిగిరి వేడ్క."
నని రోమశుఁడు సెప్ప నానరోవరము । నను గృతస్నానుఁడై నరనాయకుండు
రమణతో సైంధవారణ్యంబు చూచి । యమునానదికిఁ బోవ ననియె నమ్మౌని :

## మాంధాతృ చరిత్రము

"యిది యమునానది యీ పుణ్యభూమిఁ । గదిసి మాంధాతృండు గ్రతువులు సేసె
పనుగొనఁగాఁ దొల్లి బహువత్సరములు." । అనిన విస్మయమంది యమతనూభవుఁడు
"నంయమీశ్వర, వానిచరితంబు నాకు । నెయ్యంబుతోఁ జెప్పు నిఖిలంబు దెలియ."
ననవుడు రోమశుఁ డా రాజుఁ జూచి । "జననాథ, వినవయ్య చతురుఁడై తొల్లి
యశ్వమేధములు సహస్రముల్ జేసి । విశ్వమెల్లను నేలి విశదశౌర్యమునఁ
దనరిన ఘనుఁడు ప్రతాప భాస్కరుఁడు । ననఁదగు యువనాశ్వుఁడను మహీవిభుఁడు
తనకు సంతతిలేమిఁ దలపోసి చూచి । తన రాజ్యమందుఁ బ్రధానుల నిలిపి
భృగు నాశ్రమమునకుఁ బేర్మితోఁ బోయి । తగు భక్తితోడ నత్తపసి సేవింపఁ,

గరుణించి ముని పుత్రకామేష్టి చేసి । పొరి మంత్రపూతాంబుపూరితంబైన
కలశంబు వడసి రక్షణచేయుచుండఁ । గలిత ఋత్విక్కులఁ గట్టడచేయు,
నలి రాత్రి జాగరణంబు చేయుచును । దలకొని వారలందఱు నిద్రవోవ,
నీరు వట్టున నంత నృపతి యొంతయును । గారవంబున మంత్రకలశోదకములు
ద్రావిన, భృగుఁడును దద్విధంబెల్ల । వావిరి నెఱిఁగి భూవల్లభు కనియె:
“వినవయ్య యువనాశ్వ, విశ్వంభరేంద్ర, । పౌనర మదీయ తపోబలంబునను
దనయుఁడు గలుగు మంత్రజలంబు నీదు । వనిత కీనున్నచో వదలక నీవు
దనరిన తృష్ణచేఁ ద్రావితి విభుడు; । చేసి యక్రమ మిట్లు సేయఁగఁ దగునె!
దైవకృతం బిది తప్పింపరాదు; । నీవు గర్భము దాల్చి నిర్జరనాథ
సదృశుఁడౌ పుత్రుని సరిఁ గనఁగలవు । ...దను...” ననవు ...పాలకుఁడు
తనపురంబున కేఁగి తద్గర్భ మర్థిఁ । దనరంగ నూత్రేండ్లు దాల్చి యంతటను
వామభాగమున వెల్వడఁ బుత్రుఁ గనిన, । నా మహేంద్రుఁడు వచ్చి మక్కువ నారునకు
నమృతంబు వెట్టిన, నమరు... ప్రీతి । నమరంగ మాంధాతృఁ డను పేరువెట్టి
చనిన; మాంధాతృండు చయ్యనఁ బెరిగి । చదువొప్పఁ దగ యంత సకల విద్యలును
నెఱిఁగి శౌర్యమునఁ బెంపెక్కి భూచక్ర । మఱలేని కడఁకతో నంతయు నేలెఁ.
గ్రమ మొప్ప సకలలోకంబులు గెలిచి । యమరఁగ దేవేంద్రు నర్ధాసనంబు
నెక్కి దివ్యాస్త్రంబు లెలమితోఁ బడసి । యక్కజంబుగఁ బెక్కుయాగముల్ చేసి
యేకాసనంబుగా నిల యేలుచుండఁ, । బ్రాకటస్ఫూర్తి వర్షంబులు లేక
యవని ననావృష్టియైనఁ గోపించి । దివిజేంద్రుతోడుత ధీరుఁడై తాఁకి
ఘనయుద్ధ మొనరించి ఘనసాయకముల । ఘనములనేసి సంక్రందను గెలిచి
గొనకొని వర్షముల్గురియించె నతఁడు; । అనఘుఁడా మాంధాత యాగంబు లిచటఁ
జేసినాఁ.” డనుచు నాక్షేత్రంబు మహిమ । నాశశివంశజు కంతయుఁ జెప్పి

## సోమకుఁ డను రాజర్షి చరిత్రము

మఱియు నిట్లనియె నమ్మౌనిశేఖరుఁడు : । “నెఱఁగురుక్షేత్రంబు నృపవర, చూడు
తిరమైన సారస్వతీ తీరభూమి । నరయఁగ సోమకుఁ డను మహీవిభుఁడు
... ... ... ... ... । సంతోషచిత్తుఁడై సకలరాజ్యంబు
నంతయు నేలుచు నతిశయిల్లుచును । ... ... ... ... ...

నరవిత్తో నూర్వురు సతులును గొడుకు । నరుదారఁ బెంచుచు నంతరంగమునఁ
బరికింపఁగాఁ బృథగ్భావంబు లేక । వరమతి నుండ భూవర! యొక్కనాఁడు
అక్కుమారుని కుటువటఁ జీమకుట్టె । తక్కక నొచ్చినఁ దనయుఁడేడ్చుటయు,
విని తల్లులందఱు వేగంబె వచ్చి । గొనకొని యేడ్చినఁ గుంభినీవిభుఁడు
అంతఃపురంబున కటుపోయి కొడుకు । నంకట నూరార్చి యటఁ జనుదెంచి
కొలువుండి మంత్రులఁ గోరి ఋత్విజులఁ । గలయంగ వీక్షించి కడఁగి యిట్లనియె :
" తనయు నొక్కని నెట్లు తనయునిఁగాఁగ । ననిచిన ప్రేమతో నమ్మఁగవచ్చు?
సతులు నూర్వురుగల్గి సంతానమల్ప । మతులితంబుగనైన నది హర్షమగునె! "
యన విని ఋత్విజు లనఘునిఁ జూచి : । " యనఘాత్మ, నీచెప్పినట్ల చేసెదము ;
సతులు నూర్వురకును సంతాన మిపుడు । వ్రతమతిఁ గలిగింప వలసితివేని
క్షితిమేము చేయఁబంచినయట్టి క్రతువు । నతిశయంబుగఁజేయు. " మని యాయకొలిపి
పరఁగఁగ జంతువుఁ బశువుగా నర్థి । వరియించి యంతఁ దద్వప హవ్యమునను
ననలుని వ్రేల్చిన, నంతటిలోన । ననిచిన తద్వపనాఘ్రాణమునను
సతులు గర్భము దాల్చి జంతుకప్రముఖ । సుతుల నూర్వురఁ గని సుదతులు ప్రీతి
యొనయఁగ జంతుపై నెప్పటియట్ల । ఘనమైన మోహంబు గలిగి వర్తింపఁ
గరమొప్ప నటఁ గొంతకాలంబునకును । బరలోకగతుఁడునై పరఁగ ఋత్విజుఁడు
... ... ... ... ... । నిరయంబులోపల నెలకొనియుండె.
అట సోమకుండు దేహత్యాగ మెలమిఁ । దటుకునఁజేసి యత్తఱి సురలోక
మునకుఁ బోవుచుఁ దన ముందట నరక । మునను్న ఋత్విజు మునుకొని చూచి
' యిందెట్లు వసియించి తిది యేమి?' యనిన । నందంద భూవిభు కనియె ఋత్విజుఁడు :
" నృపవర, నీకు నార్త్విజ్యంబు చేసి । కపటవర్తన నిట్లు కందంగ వలసెఁ ;
బొలుపొంద నీకును బుణ్యలోకములు । గలవు నన్నును గావు కరుణావిధేయ! "
యనవుడు సోమకుఁ డది యూలకించి । పనివడి శమనునిపాలికిఁ బోయి :
" వినవయ్య, యమరాజ, విమలార్కతేజ! । ననిచిన భక్తితో నాకారణమున
నిరయవాసుండయ్యె నే వానిఁ గొనుచు । నరిగెద ;" నని చెప్పి యరిగె నద్దివికి.
ఇచటఁ బ్రజాపతి యొనఁగి వెయ్యేఁడు । లచలిత బుద్ధిమై యాగంబుచేసె ;
నెలకొని భరతుఁ డనేక యాగములు । తలకొని యిచ్చటఁ దగుభక్తిఁ జేసి
సర్వలోకంబులు నరసతఁ జూచె । నుర్వీశ, యిచట నీవును దీర్ఘమాడు (?)

సకలలోకంబులు సవడిఁ జూచెదవు । అకలంకమతి." యన్న యమతనూభవుఁడు
అందుఁ దీర్థంబాడి యఖిలలోకములు । పొలుపొందఁ జూచుచుఁ బురుహూతపుత్రుఁ
జూచి సంతోషించి సొంపు దీపింప । వాచంయమీంద్రుఁ డా వశుధేశు కనియె :
"నిది దక్షుమఖభూమి; యిది విష్ణుపాద; । మిది మానసద్వార మిలలోనఁ జూడు."
మని రోమశుఁడు చెప్పెనర్థితో ననుచు । జనమేజయునకు వైశంపాయనుండు
వినిపించెఁ; దరువాతి వృత్తాంతమెల్ల । ననఘాత్మ, చెప్పవే యని యడుగుటయు
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమ ద్విధేయ తిమ్మయ నామధేయ
రచితమైనట్టి యారణ్య పర్వమున । నుచితార్థ యుతముగానొప్పె మూఁడవది.

---

# అనుబంధము



శ్రీ పన్నగాద్రి వర్ధిత సదనస్థ, । పాపభంజన, కృష్ణ, భావనాతీత !
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొణఁగె:
" ఆరీతి రోమశుఁ డవనీశ్వరునకు । నారూఢిఁ బుణ్యతీర్థావలి నిట్లు
చెప్పుచుఁ జనిచని చెలువుదీపింప । నప్పుడు భృగుతుంగ మను గిరిఁ గాంచి
మునిచంద్రుఁ డిట్లను : "మొదట నిచ్చోట । ననఘుఁడౌ శిబి యిందు యాగంబుసేయ

## శిబియను రాజర్షి చరిత్రము

వాని గుణంబు భావంబులోపలను । గానంగఁ దలఁచి యాఖండలుఁ డంత
శ్యేనంబుగా, నగ్ని చెచ్చెర గువ్వ । మానుగానై వచ్చి మఱి శిబిమాటు
చొచ్చిన, నప్పు డాక్షోణీశుఁ జూచి । యచ్చుగా డేగ యిట్లను : " మహీపాల !
నిన్ను సత్యవ్రతనిర్మలుం డనుచు । నన్నుతింతురు మహీజనులు నిత్యమును ;
ఆఁకలిఁగొంటి నాయాహార మిట్లు । చేకొనఁ దగునయ్య చెల్లఁబో యకట !
తలకొని సర్వభూతములు నాహార । ములను బ్రాణములు నిల్పుదురు నిక్కముగ ;
నట పోయి నాకు భక్ష్యము గానివాఁడు । తటుకునఁ బ్రాణము ల్ధరియింపరాదు ;
ఒనరఁగఁ బ్రాణవియోగ మయ్యెనఁ । దనయులు ధరణిపైఁ దనరఁగ బ్రతుక ;
రది గాన నొక గువ్వనట రక్షచేసి । వదలక పెక్కుజీవములకు హింస
సేయుట ధర్మమే ? చెచ్చెర నీకు !' । నాయత వేదవాక్యంబులఁ దెలియు. "
మనవుడు డేగ కిట్లనియె భూవిభుఁడు : । " పనివడి యిది తన ప్రాణభయమున
నరుదెంచి నన్నిటు లాశ్రయించినను । వెఱపుఁబోకార్పక విడుచుట దగునె !
శరణు చొచ్చినవారిఁ జంపంగరాదు ; । అరయఁగ నీకును నాహారవాంఛ
గలదేని మృగపక్షిగణముల మాంస । మలవడ నిచ్చెద నట దీని విడువు. "
మనిన, నా డేగ యిట్లనియె నాశిబికి : । " నేనయఁగ మఱి నాకు నీగువ్వయుండఁ
దక్కిన మాంసమెంతయు నొల్ల ; దీనిఁ । దక్కక రక్షింపఁ దలఁచితివేని
యతిశయంబుగ దీనియంత నీమాంస । మతులితంబుగఁ దూఁచి యటఁబెట్టు మాకు. "

ననవుడు సంతస మంది భూవిభుఁడు : । " అనఘాత్మ, నీచెప్పినట్ల చేసెదను
నిజదేహ మిదె కోసి నీకుఁ దూఁచెదను । భజనతోఁ జూడుమేర్పడ. " నని కోసి
తనదేహ మాంసమంతయును బెట్టినను, । ఎనయఁ గపోతమే యెక్కువ దూఁగఁ
గనుఁగొని యాశ్చర్యకలితుఁడై నృపతి । తనువు నెత్తుటఁ దోఁగఁ దానెక్కుటయును,
నతని గుణోన్నతి కర్థిమై మెచ్చి । శతముఖాగ్నులు నిల్చి జననాథుఁజూచి,
" నీకీర్తి జగములు నిండి నిత్యముగఁ । బ్రాకటంబై యొప్పుఁ బార్థివ, " యనుచుఁ
గరము మెచ్చుచు దివౌకసులేఁగి రనుచు । ధరణీశునకుఁ జెప్పి తద్దయు ననిమె :
క్షితినాథ, యిదె శ్వేతకేతు నాశ్రమము ; । అతని సరస్వతి యతివనై కొలిచె ;
నెనయ నష్టావక్రుఁ డిం దుగ్రతపము । ఘనతరంబుగఁ జేసెఁ గడఁకతో వినుము ;

## అష్టావక్రు చరిత్రము

ఏకపాదుం డన నెనఁగిన మౌని । ప్రాకట విద్యాప్రభావంబు పేర్మి
వెస సుజాత యనంగ విమలేందుముఖిని । బొసఁగ వివాహమై భూరితేజమున
... ... .. ... ... । తనర శిష్యులకు వేదంబు సెప్పుచును
బెద్దకాలంబున్నఁ, బేర్మి సుజాత । తద్దయు గర్భంబు ధరియించి యున్న
గర్భంబులోనుండి కడఁక దీపించు । నర్భకుఁ డొక్కనాఁ డాతండ్రి కనిమె :
" సర్వరాత్రుల నిట్లు చదివింపనేల ! । యుర్విలో నీశిష్యులొాగి నిద్రలేమి
జడమతులై తప్పఁ జదువుచుండుదురు । ఎడపక." యని పల్క, నేకపాదుండు
" అసదృశస్ఫూర్తి నధ్యయనంబునకును । బసగ వక్రంబుగాఁ బలికితి గాన
నవని నష్టావక్రుఁ డనఁగ జన్మించి । యవిరళమతి నుండు." మని శపించుటయు,
ననల కల్పుండునై యటఁ దల్లికడుపు । నను బెరుఁగుచు నుండె ; నాతియు నంతఁ
బ్రసవకాలంబైనఁ బతిఁజూచి పలికె : । " వసుధ లోకులు పేదవారును నిట్టి
పురిటికి ఘృతతైలములు ధాన్యములును । ఇరవొప్పఁగా సంగ్రహింతురు కడిమి ;
మనకు దుర్లభమని మౌనీంద్రతిలక ! । యొనయఁగ నింక నే నేమి సేయుదును !
ఈ ప్రసవక్లేశ మెట్టులు పాయు ! । నప్రయాసంబుగా. " ననిన నమ్మౌని
చాల ధనార్థియై జనక భూపాలు । పాలికిఁ జని యాని ప్రథితాధ్వరమున
వరుణ పుత్రుండైన వందితోఁడుతను । వరమతిమీఱి వివాదంబునేసి,
యోడి నీటను గ్రుంకియున్న యత్తఱిని, । యాఢి సుజాతయు రూపింప నిచ్ఛట

సరసంబుగాఁగ నష్టావక్రుఁ గనియె. । తరమిడి మఱియుఁ దత్సమయంబునందు
నుద్దాలకుని భార్య యొగి శ్వేతకేతుఁ । దద్దయుఁ గనియె; నంతట నవ్విధమున
నెగడి మాతులభాగినేయు లిద్దఱును । దగు సమ వయసునఁ దప్పక పెరిఁగి
యుద్దాలకుని యొద్ద నొగి విద్యలెల్ల । నుద్దీప్త మతులునై యొప్పుగా నేర్చి
యున్న, నుద్దాలకుఁడొగిఁ దం(డియనుచుఁ । జెన్నుమీఱఁగ నన్న శ్వేతకేతుండు
ననుచు నష్టావక్రుఁ డనుదివసంబు । మనమున హర్షించి మఱి యుండునంత,
వరుసఁ బం(డెండేండ్లు వారలై మించి; । ఉరవడి నొక్కనాఁ డుద్దాలకాఖ్యు
కుఱువెక్కి మదివేట్కఁ గూర్చున్నవాని । సొరిది నష్టావక్రుఁ జూచి కోపించి
యా శ్వేతకేతుఁ డిట్లనియె : "నీవేల । శాశ్వతస్ఫూర్తి నుజ్జ్వకుని కుఱువు
... ... ... ... ... । ఈవేల యెక్కితి విట గిగుమనుచు
నీడ్చిన నంతలో నెనఁగు శోకమున । నేడ్చుచుఁ దఁ దల్లి కెఱఁగించి యనియె:
"మాయయ్య యెవ్వరు? మఱియెందునరిగె? । నోయమ్మ, చెప్పవే యొప్పుగా." ననిన
నాసుజాతయుఁ దన యాత్మజునకును । నా సమయంబున నర్థినిట్లనియె.
"జనక మహారాజు జన్నంబునకును । ఎనయంగ మీతం(డి యేకపాదుండు
పోయినాఁ." డనవుడుఁ బొసఁగఁగ మామఁ । బాయకతోడ్కొని, పార్థివుండైన
జనకమహారాజు జన్నంబు కరిగి । దనరఁగ నెంతయుఁ ద ద్వారభూమిఁ
దగఁబోవఁజూచిన, దౌవారికుండు । పొగడొంద మీకును బోవరాదనుచు
తేవతో నడ్డపెట్టిన, వాని కనియె: । "భావింప మూఢాంధ బధిర పంగులకు
సొలవక నెప్పుడు చొరనగుచున్న । యెలమి రాజద్వార మిటఁ జొరనీక
వదలక మమ్మును వారింపఁ దగునె!" । కొదలేక దౌవారికుం డిట్టులనియె :
"వలనొప్ప వృద్ధ విద్వాంసులు యాజ్ఞి । కులుఁ జొర నర్హంబు గొనకొని మీరు
పిన్నవారలు, మీకుఁ బెంపుతోఁ జొరఁగ । నిన్నెలవున రాద యిటనుండుఁ." డనిన
వారలిట్లనిరి దౌవారికుతోడఁ । "జేరికఁ దలనరిసిన యంతలోన
ఘనమైన వృద్ధలక్షణమె చర్చింప? । జననుతంబైన సుజ్ఞానంబుఁ జదువుఁ
గలిగిన వాఁడెపో కడువృద్ధు మహిని; ! చనవొప్ప నేమును జనకభూపాలు
నెదుట దర్పితులునై యెసఁగిన వేద । విదులతో వాదంబు వేడుకఁజేయ
వచ్చినార." మటన్న వాఁడును బోయి । యచ్చట నృపతిచే ననుమతి వడసి
చనుదెంచి పొండన్నఁ జయ్యన నేఁగి । జనకభూపాలుని సం(ప్రీతిఁ గాంచి,

తరమిడి విప్రమధ్యంబున నుండి । వరుణపుత్రుండైన వందితో మున్ను
వాదించి యట గెల్చి వానికిమున్ను । ఆదట నోడిన యట్టి విప్రులను
జనకునితోఁగూడ జల విముక్తముగ । నొనరించి, జనకుచే నొగిఁ బూజనడసి,
యనఘుఁ డష్టావక్రుఁ డటఁ దండ్రిఁగొనుచుఁ । బొనర నిజాశ్రమభూమి కేతెంచె."
ననిచెప్పి చనిచని యసమంజతీర్థ । మునఁ గృతస్నానులై పుణ్యతీర్థములు
గనుఁగొని యరుగఁగ ఘనుఁడు రోమశుఁడు । ఎనయంగ ధర్మజు కిట్లని పలికె:

## యవక్రీతు చరిత్రము

"రాజేంద్ర, విను భరద్వాజ రైభ్యులును । నోజతోడుత మైత్రి నొక్కటఁ దపము
సేయుచు నుండంగఁ, జెలఁగి రైభ్యుండు । పాయ కర్వావసు పారావసు లను
నిద్దఱఁ బుత్రుల నెలమితోఁగాంచి । తద్దయునున్న, న త్తనయులు సకల
వేదశాస్త్రంబులు వేడుకఁ జదివి । యాదట మెఱయంగ, నదియోర్వలేక
సొలసి భరద్వాజ సుతుఁ డవకృతుఁడు (?) । పొలుపొందఁగాఁ దపంబున వేదశాస్త్ర
ములు వడయుదునని మునుకొని తపము । నలయక సేయఁగ నా ఖండలుండు
చనుదెంచి, "నీవేల జరిపెదు దపము?" । ననఁగ యవక్రీతుఁ డయ్యింద్రుఁ జూచి:
"చదువకే వేదశాస్త్రంబులు నాకు । వదలక ప్రాపింపవలెనని యుగ్ర
తపముఁజేసెద." నన్న దైవతాధిపుఁడు । దపసినందనున కెంతయు నిట్టులనియె:
"పొలుపొంద గురుముఖంబున నేర్వకిట్లు । బలిమిఁ దపంబునఁ బడసిన విద్య
జగతిలోపల నెట్టి సాధులకైనఁ । దగ ఘనమదము మత్సరముఁ గావించు;
నిది బుద్ధిగా." దని యింద్రుఁడు పోవఁ । బదపడి యతఁడు నెప్పటియట్ల దపము
నొనరింప, వేదనకోర్వ కింద్రుండు । చనుదెంచి వృద్ధుఁడై చాలశోషించి
గడగడ వడఁకుచుఁ గరముష్టి నిసుక । కడఁకతోఁదెచ్చి గంగాప్రవాహంబు
కట్టగట్టఁగ యవక్రీతుఁ డంతటను (?) । నెట్టననది చూచి యెలమితోడుతను (?)
హసియించి యిట్లను: "నకట యోవృద్ధ! । నసమె కట్టఁగనీకు వల దానయుడుగు."
మనిన యవక్రీతు కనియె నావృద్ధు: । "ఎనయంగ వినవయ్య యేను నీయట్ల
యువని దుర్ఘటమైన యర్థంబునందుఁ । దవిలితి." ననునంతఁ దనరూపు దాల్చి
"వట్టిప్రయాసంబు వలవదు నీకు; । నెట్టన నీఁకమాను నెఱి నిట్టితపము."

అనవుడు వినకున్న, నాఖండలుండు । గొనకొని యమ్మౌని కోరికయిచ్చి
పోయిన, వేడుకఁబొంది యవ్విధము । నాయెడఁ దగుతండ్రి కట నెఱిఁగింప
నాభరద్వాజుండు నాత్మసంభవునిఁ । బ్రాభవస్ఫూర్తితోఁ బలికె నిట్లనుచు :
"కృతమతితో వేదగీతి కోక్తంబు । నతులితార్థంబు నీ వాత్మజ, వినుము.
బాలధి యను మునిప్రవరుండు దొల్లి । నాలీల పుత్రశోకాపన్నుఁడగుచు
ఘోరతపంబు మక్కువతోడఁ జేసి । యారూఢ విస్ఫూర్తి నమరుల కృపను
గరమొప్పఁ జిరజీవిగాఁ దనూభవునిఁ । బరికింప మేధావిఁ బడసిన, వాఁడు
వసుధ నాయుష్యగర్వంబునఁజేసి । యెసఁగ నా కెవ్వ రీయెడ సరి యనుచు
నెలమి మునీంద్రుల నెవ్వరి మెచ్చ । కలవడ ధనుషాక్షుఁడను మునియొద్ద
గర్వించి పలికినఁ, గనలి యమ్మౌని । "యుర్విలో నిటు పల్క యుక్తమే నీకు !
నంతకాంతికమున కరుగు నీ." వనుచు । నెంతయు శపియించె; నిల నదిగాన
వెలయఁగ గర్వమ్ము విడిచినవాఁడె । యలవడ నుత్తముఁ డని చెప్పఁబడును.
కావున నీవును గర్వంబు విడిచి । కోవిదులగు రైభ్యు కొడుకులతోడ
వైరంబుమాని పావనవృత్తి నుండు । మారూఢితో." నన్న "నట్లచేసెదను
నరనుత, వినవయ్య నాకు రైభ్యుండు । వరమతిఁజూడ భవత్సమానుండు."
అని పల్కి యంతట నాయవక్రీతుఁ । డనువొందఁ దనదు విద్యావిభవంబు
వివిధాశ్రమంబుల విస్తరించుచును । నవిరళ విస్ఫూర్తి నట నొక్కనాఁడు,
మనలక రైభ్యాశ్రమంబున కరిగి । పసఁగఁ బరావసు భార్య నారైభ్యు
కోడలిఁ గృష్ణయన్ కోకిలవాణి । వేడుకఁ గనుఁగొని విస్మయంబంది
మదన మోహితుఁడునై మక్కువతోడఁ । బదపడి తన యభిప్రాయంబు సతికి
నెఱిఁగించుటయుఁ, గృష్ణ యెద శాపభీతిఁ । దఱలక యొడఁబడి తద్విధంబెల్లఁ
దమ మామ కెఱిఁగించి తద్దయునేద్వ, । రమణి నంతటిలోన రైభ్యుఁడూరార్చి
సరఁగ జటావలుంచనకరుఁ డగుచు । నరయ హుతాశను నందు వ్రేల్చుటయుఁ
గూరిమితోఁ దనకోడలికంటె । నారూఢరూప మహాతిశయంబు
గలకాంత పుట్టినఁ, గడఁకతోడుతను । విలసితంబుగఁ జూచి వెండియు నొక్క
జడ యవలుంచించి నరవి వ్రేల్చినను, । అడరంగ ఘనశూల హస్తుఁడై యొక్క
దైత్యుండు పుట్టినఁ దగ రైభ్యుఁడసియె : । "నత్యంత శౌర్య సమగ్రత మెఱసి
యాయవక్రీతుఁ జంపరుదెండు మీరు । పాయక." యని యంపఁ బణఁతి మున్నరిగి

మదనాతురుండునై మది చాలఁ బ్రమసి । "నుడి రాత్రి రాక తాపన మేలచేసె ?
నా చక్కఁదనమును నా ప్రభావంబు । నా చదువును జూచి నలినాయతాక్షి
యొడఁబడిపోయె; నిట్లున్నది మనసు ; । తడసితి వేమియో తరుణిరో!" యనుచు
... ... ... ... ... । విరహ వేదనచేత వివశుఁడై తూలి
మనసిజ జ్వరమున మానంబు వదలి । ... ... ... ... ... ...
దిక్కులు సూచుచు ధృతిలేక యున్న, । నక్కమలాక్షి యా నటఁ జేరఁబోయి
కర ముప్పొంగఁ బ్రేమగలయుఁగి పోతెఁ । గరమున నున్నట్టి ఘనకమండలువు
హరియించుటయు, వాని యధికకోపంబు । నరయఁ బరీక్షయుంబగుడు, రాక్షసుఁడు
దాఁకిన, వెఱచి యంతట యవక్రతుఁడు (?) । వీఁక మహానదు ల్వేసఁ గొలంకులును
జొచ్చిన, నవియును శుష్కంబులైన । నచ్చుగాఁ దమతండ్రి యగ్నిహోత్రంబు
వెసఁ బ్రవేశించిన, వెదకి రాక్షసుఁడు । ససదృశంబుగఁ గని యంతటిలోన
శూలాయుధంబున సుక్కుగఁ బొడిచి । యాలోనఁ జంపి యయ్యతివయుఁ దాను
మునిపతియగు రైభ్యు ముందఱ కరిగి । చను దెంచి నిలిచిన, సంతోషమంది
వానికి భార్యగా వనజాక్షి నిచ్చె. । మానుగా వినవయ్య మఱి ధర్మతనయ,
అట భరద్వాజుండు నడవికిఁ బోయి । పటుతర దర్భలు ఫలములుఁ గొనుచు
నరుదెంచి యణఁగిన యగ్నులఁ జూచి, । యరుదంది గృహపాలుఁడై యున్న శూద్రు
వలన నత్తెఱఁగెల్ల నరమఱి నెఱిఁగి । యిలమీఁద నటఁబడి యెనఁగుశోకమున
"నక్కటా! నందన, యణఁగితే యిట్లు ! । దిక్కెవ్వరున్నారు ధృతిమీఱ నాకు !
రమణ రైభ్యుఁడు కోపరతుఁ డంటి; నతని । సుమనకారణ్యంబు సొరకుమీ యంటి (?)
నా మాట వినవైతి నా కులోద్ధార ! । యేమిసేయుదు !" నని యెంతయు వగచి
మొగి వాని దహియించి పుత్రశోకమునఁ । దెగువమై నగ్నిలో దేహంబు విడిచె.
అంత బృహద్ద్యుమ్నుఁడను మహీవిభుఁడు । ... ... ... ... ...
... ... ... ... ... ... । వారల యాగ ముర్వర మెచ్చఁజేయ
నంతలో నొక్కనాఁ డా పరావసుఁడు । సంతోషమున నిజాశ్రమమున కరుగఁ
దలఁచి తమిస్రంబు దట్టమై పర్వ । నలవడ నొంటిమై నట వచ్చివచ్చి
వఱలంగ నెదురుగా వచ్చెడు రైభ్యు । నెఱుఁగక మృగమని యిచ్చలోఁ దలఁచి
పదపడి తనప్రాణభయమునఁ దండ్రి । వదలక చంపి సర్వంబు నెఱింగి
యతులదుఃఖముఁబొంది "యక్కటా! యిట్టి । వితత పాపము సంభవించెనే నాకు!"

నని చాలవగచుచు నగ్ని కార్యముల । ననయంబుచేసి బృహద్ద్యుమ్ను సత్ర
మునకు నేతెంచి యుప్పుడు తద్విధంబు । తన యగ్రజునకును దద్దయుఁజెప్పి
యున్నతో నను: "నీని నట నొక్కరుఁడవె । పన్నుగా నిర్వహింపఁగనోప; వేను
నొగి నొక్కరుండ నయ్యును నిర్వహింప । జగతిలోపలఁ గడుఁ జాలుదుఁ; గాన
నలవడఁగా బ్రహ్మహత్యావ్రతంబు । నలుపుము నీ." వన్న నమ్మతించుటయు
వలనొప్పఁగాఁ బరావసుఁ డొక్కరుండె । నలి సత్రయాగంబు నడుపుచు నుండె.
అర్వావసుండును నా బ్రహ్మహత్య । కుర్విఁ బ్రాయశ్చిత్త మొగిఁజేసి ప్రీతి
సత్రయాగమునకుఁ జనుదెంచుటయును । బాత్రుఁడై యున్నను బరికించి చూచి
యా పరావసుఁడు బృహద్ద్యుమ్ను కనియె: । "నో పార్థివేశ్వర, యొప్పుగా వినుము
జనసుతంబైన యజ్ఞాయతనంబు । చెనసి యీముని ప్రవేశింపంగఁ దగఁడు;
మునుమిడి శుభకార్యములకును బాసి । యనఘ, సల్పెడు బ్రహ్మహత్యావ్రతములు."
అనిన బృహద్ద్యుమ్నుఁ "డక్లైన వీని । ననయంబు రానీకుఁ" డనుచుఁ ద్రోయింప,
నెనయ నర్వావసుఁ డిట్లనె: "నేను । ఘన పాతకుఁడగాను; గలిత వ్రతములు
మునుసల్పి యటఁ బాపముక్తుఁజేసితిని; । పనివడి యాతఁడె బ్రహ్మఘాతకుఁడు."
అనుచు నర్వావసుఁ డట యథార్థంబె । యనయంబు పలికిన నఖిల దేవతలు
సొరిది నర్వావసుఁ జూచి యిట్లనిరి: । "చిరమతిఁ దమ్ముఁడు చేసినయట్టి
పాపమంతయుఁ బాయ పరమవ్రతములు । ... ... ... ... ...
... ... ... ... ... । "నాపట్ల యెటుఁగి రైభ్యునిచేత నేను
జావఁగ వలసెను జగతి నాకంటె । నేవిధి నీరైభ్యుఁ డెక్కుడైమించె?"
ననవుడు దేవత లాతని కనిరి: । "గొనకొని రైభ్యుండు గురుముఖంబునను .
సకలంబునేర్చె నిశ్చలవృత్తి; నీవు । ప్రకటించి తపమునఁ బడసితి వింతె;
కాన నిత్తెఱఁగున ఘనుఁడయ్యె." ననుచుఁ । బూని దేవతలెల్లఁ బోయిరి దివికి.
అదియె యవక్రీతు నాశ్రమభూమి । వదలక యిందును వసియించువారు
పనివడి సకలపాపములు వాయుదురు. । ... ... ... ... ...
(ఆతలి హేమాద్రి నట డాయ ధర్మ । సూతితో నారోమశుం డిట్లు పలికె)*
(కాలావమాని మార్కండేయమాని । యా లోకహితులున్న యచటికివచ్చి
వేడ్క యథోచితవిధిఁ బూజఁగాంచి । చూడ్కి యందఱిమీఁద సుముఖమైపర్వ,

---

* ఈ తరువాయి కథాభాగము తిమ్మయరచన. అర.ప. ౩౩ వ పుట చూచునది.

యుగములుగట్టిన యొకమూటవోలెఁ । దగినపీఠంబెక్కి తా నున్నయంత)
మునిశిఖామణికిఁ గేల్మోగిచి ధర్మజుఁడు : । "ననిచి ధర్మముతోడ నడచుచు మేము
కడుదుఃఖములఁబొందఁ, గలుషముల్ చేసి । తడయక[1]యున్నట్టి రాధార్తరాష్ట్రులను
బనివడిఁ గని యీవిపర్యయంబునకు । ననిశంబు నూహింతు నవనిలో నరుఁడు
చెలరేఁగి యిప్పుడు చేయుకర్మంబు । ఫల మిందఁ బొందునో ? పరలోకమునను
అందునో ? యిందును నందును గనునొ ? । అందఁద యిదినాకు నానతి." మ్మనిన

## మార్కండేయుఁడు ధర్మజునకు వివిధధర్మములఁ జెప్పుట

మునిచంద్రుఁడనియె నిమ్ముల : "విను మనుష ! । పనుగొనఁ బరమేష్ఠి ప్రథమకల్పమున
ధర్మ తంత్రంబులఁ దనరు నత్యంత । నిర్మల తనువులు నెగడ సృజించి
వెలసిన మనుజుల వేగఁ బుట్టింప, । బలిమిని సత్యసంపదఁ జెన్ను మీఱి
చెలరేఁగి స్వచ్ఛందజీవులై దేవ । కలిత యానంబులఁ గడుఁ జరింపుచును
మహిలోన సర్వధర్మజ్ఞులై పరఁగి । బహుసుతులను గాంచి బహువత్సరములు
ఆయువు మిక్కిలై యులరు చుండుదురు. । ఆయెడఁ గ్రోధాదులగు దుర్గుణములు
పొలు పొందఁగాఁ దమ్ముఁ బొదివిన, మాయ । వలనఁ దమ్మపుడు దేవతలు వీడినను,
అల్పాయువులును దా మల్పసత్త్వులను । అల్పశరీరులై యట వెడఁగులయి
బహురోగ పీడచేఁ బాపముల్ సేసి । బహుయోనులందు నుద్భవమంది నరక
మను నగ్నిఁ గ్రాఁగుచు నలయుచు నిట్లు । చనుచున్న సంసార చక్రంబునందుఁ
బనుగొనఁ బుణ్యపాపంబులు మనుజు । లొనరించి తుది దేహ మొనరంగ విడువఁ,
బొలుపొంద నీడయుపోలి వెన్వెంటఁ । దలకొని యవి రాఁగఁ, దత్ఫలంబర్థి
ననుభవించుచు నంత నవి దెగినపుడు । పొనర జన్మంబులు పొందుదు రధిప !"
అన విని ధర్మజుఁ డమ్మౌనిఁ జూచి : । "పనుగొన విప్రప్రభావంబు నాకు
విన వేడుకయ్యెడు వినిపింపు." మనిన । ఘనతరస్ఫూర్తి మార్కండేయుఁ డనియె :
"వసుధేశ, హైహయ వంశోద్భవుండు । వెస ధుంధుమారుఁడన్ విభుఁడు వేడుకను
వేఁటకై యడవికి వేగంబె పోయి, । గాటంపుఁ దృణ లతా గహన మధ్యమునఁ
గృష్ణాజినముఁ గప్పి కృతమతినున్న । విష్ణుభక్తుని నొక్క విప్రునిఁ గాంచి,

---

1. 'సుఖముతో' అను పద మధ్యాహార్యము

మృగముని యేసి యిమ్ముల డాయఁబోయి । యొగి గతజీవుఁడై యున్న దుఃఖించి,
తనపురంబున కేఁగి, తత్ క్షణంబునను । వెనుకొని నిజవంశవృద్ధులైనట్టి
హైహయులకు వేగ నంతయుఁ జెప్పి, । బాహుళ్య శోకసంభవుఁడునై వారి
వెంటనె గొనివచ్చి విప్రుదేహంబు । నంటునఁ జూపిన, నలి వారువగచి
యచటిచేరువఁ దార్క్ష్యుఁడను మునిప్రవరుఁ । బ్రచలితమతిఁ గాంచి భక్తిఁ బ్రొక్కుటయు
వారల దీవించి వరుసతోఁ బూజ । లారూఢి నిమ్మని యట శిష్యవరులఁ
బనిచిన, హైహయుల్ భవ్యాత్ము దార్క్ష్యుఁ । గనుఁగొని పలికి: "రో కరుణాత్మ, యేము
చనవొప్ప నీసేయు సత్కారములకు । నెనయ నర్హులముగా ; మి కుమారుండు
నంచితంబుగ మృగయాసక్తుఁ డగుచుఁ । బొంచి మెల్లనె వచ్చి పొసఁగ నీ యడవిఁ
బరఁగఁ గృష్ణాజిన పరిధాను నొక్క । వర తపోధను నేసె వరమృగంబనుచు ;
ఇందుకు నిష్కృతి యెయ్యది ? చెప్పి । యందంద రక్షింపు." మనినఁ దార్క్ష్యుండు
నగి హైహయులఁ జూచి : "నరనాథులార ! । యగణితస్ఫూర్తి మా యాశ్రమభూమి
నట రోగ మృత్యు భయాదులు లేవు । తటుకున" నని పల్కి తనపుత్త్రుఁ జూపి,
"ఈతఁడె మీచేత నీల్గినవాఁడు ? । ఖ్యాతిగా." ననిపల్క, ఘనుఁడు హైహయుఁడు
... ... ... ... ... । వర తపోనిధిఁ జూచి వలనొప్పఁ బలికె :
"మెరవడి నీతఁడు మృతుఁడునై బ్రతికె । కరమొప్పె నిందుకుఁ గతమేమి ? మాకు
నానతి యి." మ్మన్న నమ్మునీంద్రుండు । భూనాయకులఁ జూచి పొందుగాఁ బలికె :
"వలనొప్ప నా ప్రభావంబునఁ బ్రాణ । కలితుఁడయ్యెను ; మీకుఁ గలుషంబు లేదు
చనుఁ."డన్న హైహయుల్ సంయమీంద్రునకు । ఘనభక్తితోఁ బ్రొక్కి కడువేడ్కతోడఁ
బురమున కరిగిరి ; భూమిదేవతల । వర ప్రభావంబిది వసుమతీనాథ !
చన వొప్ప భూసుర క్షత్త్రిస్వరూప । ఘన నిదర్శనమైన కలితేతిహాస
మొక్కటి చెప్పెద నొప్పుగా వినుము । అక్కజంబున నత్రియను విప్రవరుఁడు
అడవికిఁ దపము సేయంగఁ బోవుచును । దడయక భీతిమైఁ దనభార్యఁ జూచి,
"తపమున కరిగెదఁ దరలాయతాక్షి ! । విపులత నీవు నా వెంట వచ్చెదవా ?
ఘనముగాఁ బుత్త్రులకడనె నిల్చెదవా ?" । అనవుడు భర్తతో నంగన యనియె :
"వఱలి కుటుంబభావన యగు వృత్తి । యటిముటి ధ్రువము సేయక పోవఁదగునె !
ధరణి నీ వెఱుఁగని ధర్మముల్ గలవె ! । పరఁగఁగ వైన్యభూపతి యిచ్చు ధనము
నడుగుము నీ." వన్న నతివమాటలకుఁ । గడుఁ బ్రీతచిత్తుఁడై కదలి యా ప్రొద్దె

క్షితి హయమేధ దీక్షితుఁడునై విప్ర । తతికి ధనంబు లెంతయు భక్తినిచ్చి
వైన్యపాలికిఁ బోయి వరమతిఁగాంచి । మాన్యుఁడై దీవించి మఱియు నిట్లనియె :
"నీవ విధాతవు నీవ యీశుఁడవు । నీవ యింద్రుండవు నృపకులోత్తంస !"
అనవుడు గౌతముఁ డచ్చోటనుండి । విని కలుషించి యా విప్రున కనియె :

## అత్రి గౌతముల పరస్పర సంవాదము

"వారక నోటికి వచ్చినట్లెల్ల । నీరీతి దబ్బర లేల ప్రేలెదవు ?
ధారుణీభర్త విధాతయు నీశుఁ । డారయ నింద్రుండో ? యర్థంబుకొఱకు
వెనుకొని మానవు వినుతింపఁ దగునె ?" । అనవుడు వెండియు ననియె నయ్యత్రి :
"మేదిని నూఱక మీఱ నాడకుము ; । సాదరంబున మదిఁ జర్చించి చూడు.
నీతిమార్గంబున నిఖిల భూతలము । నాతతంబుగ నేలి యఖిల ధర్మములుఁ
దనయందు వెలుఁగఁగఁ దనరిన వాని । వినుతింపఁ జెల్లదే ! వెఱ్ఱిపిగాక."
అని యివ్విధంబున నతఁడును నితఁడు । ఘనముగా వాదింపఁ గాశ్యపుఁ డనియె :
"మా చేత మీ వాదు మానదు ; ధర్మ । సూచితజ్ఞాని విశుద్ధచిత్తుఁడును
నవ్యతేజుండు సనత్కుమారుండు । భవ్యుఁ డున్నాఁ డందుఁ బరువడి మనము
పోయిన సందేహములు మాన్పు." ననుచు । నాయతమతి వారి నటఁ దోడుకొనుచుఁ
జని కాశ్యపుఁడు వారి జగడ మెంతయును । వినిపింప, నతఁడు భావించి యిట్లనియె :
"అత్రి యెంతయును యథార్థంబె పలికె ; । ధాత్రి భుజంబునఁ దాల్చి క్షత్త్రియుఁడు
కావను బ్రోవను గర్త గావునను । దేవేంద్రుఁ డీశుండు ద్రుహిణుండు నగును;
ఇల నృపుసామర్థ్య మేమనవచ్చు ! । అల వేదములుఁ గొనియాడు భూవిభుని.
... ... ... ... ... ... । ... ... ... ... ...
తలఁకొని తొల్లి యాధర్మంబునకును । జెలఁగి బ్రాహ్మణ సేవచేసె భూవిభుఁడు
... ... ... ... ... । బలిమితోఁ జీఁకటిఁ బాపెడు సూర్యు
కరణిఁ బాపంబులు ఖండించి వైచు । సరసత నదిగాన సర్వాధికుండు."
అని పల్కుటయు మునులందఱుఁగూడి । చని వైన్యు కెఱఁగింప జననాయకుండు
సంతోష చిత్తుఁడై సంయమి ప్రవరు । నంతటఁ గనుఁగొని యా (తనియా) స
తనియఁగ నటఁ 'గోటిధనమిత్తుఁ గొనుము' । అని యిచ్చుటయుఁ బ్రీతి నయ్యత్రివాని
చనుదెంచి సుతులకు సరిఁ బంచియిచ్చి । వనమునకరిగె భార్యాయుక్తు." డనుచు (?)

మఱియు నిట్లని పల్కె మనుజేశుఁ జూచి : । "గిరిశొన్న భారతీగీత చెప్పెదను
అందు విశిష్ట ధర్మావలి దెలియ. । పౌంసుగాఁ దార్క్ష్యుఁడన్ పుణ్యతాపసుఁడు
తగ సరస్వతిని బ్రత్యక్షంబుచేసి । 'జగతి మానవుకెందు సద్గతి గలుగు?'
ననవుడు భారతి యతని కిట్లనియె : । 'అనఘుఁడై వేదంబులన్నియుఁ జదివి
వసుస నానాధ్వర వ్రతములు సేయు । నరుఁడు బృందారకనారీ సహస్ర
పరిరంభణోజ్జ్వల భవ్య భోగముల । నిరవొందుఁ బెక్కువేలేఁడులు దివిని ;
పలు తెఱంగులఁ గ్రేపుఁ బాలును గలుగు । తొలుచూలు నావును దుదిఁ బాత్రభూతుఁ
డైన విప్రున కిచ్చునట్టి పుణ్యుండు । మానుగా దానిరోమములెన్ని యన్ని
వేలేండ్లు సురసౌఖ్య విభవంబు నొందు ; । చాల భారంబోర్చు సత్త్వాఢ్యమైన
యెద్దును భూమీసురేంద్రున కిచ్చి । తద్దయు నందు గోదశ దానఫలము ;
వలువ లిచ్చినఁ జెందు వారిజారాతి । కలిత లోకంబులు కారుణ్యమూర్తి !
కనక మిచ్చినను నాకమునకు నరుగుఁ; । దనర నేడేండ్లు ఘృతంబున వహ్ని
సంతర్పణము సేయు సత్యసంధుండు । దాంతిమై నీరేడు తరములవారిఁ
గొని దివికేఁగును గోరికతోడ !" । నని చెప్పె ననుటయు యమసూతి పలికె :
'మహిని వైవస్వతమను వెవ్విధమున । బహుళ ప్రతాప సంపన్నుఁడై మించె ?
వినిపింపు మా కథ వేడుకతోడ.' । ననిన మార్కండేయుఁ డతని కిట్లనియె :

## వైవస్వతమను చరిత్రము

"మనుజేశ, చాక్షుష మన్వంతరమున । ఘన తపోవిభవంబు గైకొని యంత
వైవస్వతుఁడు పెక్కువర్షంబులుండె । భావింపఁగా నూర్ధ్వబాహుఁడై నిలిచి.
సవిత్రో బదరికాశ్రమమున మఱియు । ... ... ... ... ...
... ... ... ... ... । నరవరుఁ డొకనాఁడు నదికేఁగి యర్ఘ్య
మొలమితో నర్కున కీయఁదలంచి । జలముల దోసిట జానొప్పఁ గొనుచు
నందొక్క మీనంబు నాదటఁ జూచి । క్రందున విడువసాగఁగ నది పలికె :
"కరుణాఢ్య, విడువక కరుణించి నన్ను । నిరవొంద వేఱొక్కయెడఁ బెట్టు; నీకు
ఘనముగాఁ బ్రత్యుపకారం బొనర్తు." । ననిన వైవస్వతుఁ డాశ్చర్యమంది
తనర నెత్తుకపోయి దాని నాక్షణమ । ... ... ... ... ... ...
యొకనూత విడిచిన నొయ్యనఁ బొదలి । ప్రకటించి మఱియును బలికె నవ్మీను :

"అనఘాత్మ, నీనిమిత్తంబున మేను । వినుతి నానాఁటికి వృద్ధియై పొదలె;
ఎడము చాలదు నాకు నీనీటిలోన । నెడపక యింకొక్కయెడ విడు." మనిన
నతఁడును నట్లుకాకని బావిలోనఁ । జతురత విడిచినఁ జాలఁ బెంపొంది
'యిదిచాల' దనవుడు, నేపుతో గంగఁ । బదపడి విడిచిన, కలిసి యెంతయును
అది పట్టు చాలక యతనికిఁ జెప్ప, । సదయుఁడై గొనిపోయి జలధిలో విడిచె.
విడిచినఁ బ్రియమంది: "వినవయ్య నీకుఁ । గడువేడ్కఁ బ్రత్యుపకార మొనర్తు;
తడవులే దఖిల భూతంబులు నింకఁ । జెడు; సముద్రములెల్లఁ జెలిమితోఁ గలియు.
కావున దృఢరజ్జు కలితమైనట్టి । నావ యొక్కటిచేసి నయముగా సప్త
మునులును నీవును మొగి నెక్కి నన్ను । మనమునఁ దలఁపు మిమ్మపుడు రక్షింతు."
అని చెప్పుటయు మను వట్లు గావించి । మును కొని యట సప్తమునులును దానుఁ
బొందుగాఁ జనుదేరఁ, బొలుపున మీను । ... ... ... ... ...
చెలిమి శిరోగత శృంగాగ్రమునను । సొలవక యయ్యోడ సూత్రంబు దిగిచె
నరయఁ బయోధిమధ్యమునకు ; నంత । నురవడి సప్తవాయువులు వీవంగఁ
బోరిఁబోరి సప్తసముద్రముల్ వెల్లి । విరిసి యేకార్ణవ విస్తారమైనఁ,
బెనుపొంద నయ్యోడఁ బెక్కు వేలేండ్లు । మునుఁగకుండఁగఁ బట్టె మొదలిమత్స్యంబు
తెలివినొప్పను ; వెల్లి దిగఁబాఱినంతఁ । గలిత హిమాద్రిశృంగము గానఁబడిన
నచ్చోట నయ్యోడ ననువుగా నిలిపి । మచ్చికతోడుత మఱియు నిట్లనియె :
'ఈ యోడఁ గట్టుఁడు ఈశిఖరమునఁ । బాయక' యనవుడు పరువడి వారు
నారీతిఁ జేసిన, నయ్యద్రి శృంగ । మారయ నౌ బంధనాభిధానత్వ
మునఁ బ్రసిద్ధికి నెక్కె మూఁడులోకముల. । మనువుని నటనున్న మానులఁ జూచి
మఱియుఁబ్రేమ నమ్మత్స్య మిట్లనియె : । "అఱలేని కడఁకతో ననఘాత్ములార !
నలి మీఱ విశ్వంబునకుఁ గర్తయైన । కలిత ప్రభుఁడ నేను ; గారవంబునను
మీనరూపంబున మీమీఁదిప్రేమ । నేను జరించితి నిన్నివిధముల ;
తలకొని మత్ప్రసాదమ్మున మనువు । ఎలమి సృజించును ఈ జగంబెల్ల."
అని చెప్పి కానరా కరిగిన, మనువు । ఘనతపం బచ్చోటఁ గావించి సకల
జగముల సృజియించె జననాథతిలక ! । జగతిలో నీకథ చదివిన విన్న
దురితంబు లణఁగు నుద్ధురపుణ్య మొదవు । ధరణీశ !" యనిన నత్తపసి కిట్లనియె:
"అఘటిత కడఁకతో నఖిలలోకములు । చెడునప్పుడును నీవు చెడక యుండుదువు ;

తగ నా చరాచరోత్పత్తియు స్థితియు । నగణితంబుగ విలయప్రకారమును
బెక్కుమారులు నీకుఁ బెరసి కాన్పించు । నక్కజంబుగఁ జెప్ప మవ్విధం." బనిన
నెనయ మార్కండేయుఁ డిట్లని పలికె : । "అనఘాత్మ, శాశ్వతు నంబుజోదరుని
యాద్యంత రహితుని యభవుని వేద । వేద్యుని కృప నీకు వినిపింతు వినుము.

## ప్రళయకాల ప్రకారము

నాలుగు యుగము లున్నతిని బండ్రెండు । వేల దివ్యాబ్దాల వెసఁ బర్యవసిత
ములగు; నీ యుగములు మొగి నాల్గుఁగూడ । నలవడ నొక్క మహాయుగంబగును;
అట్టి యుగసహస్ర మబ్జజానకును । నెట్టన దివసంబు నృపవర్య, వినుము.
అరయంగఁ దద్దివ సావసానమునఁ । గర మొప్ప శతవార్షికంబైన యట్టి
కఱవు మహీస్థలిఁ గానఁగఁ బడును ; । అతిముతి సూర్యుండు సప్తుడు మూర్తి
సప్తకంబు ధరించి జగములనెల్ల । దీప్తవైఖరి మించి తేజంబు చూపు.
... ... ... ... ... ... । ... ... ... ...
అంతట ధారా ధరావళి పర్వి । యంతకంతకు ఘోరమైన వర్షంబు
కురిసిన నయ్యగ్ని కుంభిని నాఱు ; । పొరిఁబొరి జలధులు పూర్ణంబులగుచు
లోకముల్ ముంచును ; లోలతఁ దమము । చేకొని యుండుఁ జెచ్చెఱ ; నంతలోన
సొలవక పరమేష్ఠి చోదితంబైన । కలిత వాయువు వీవ ఘనములు విరియు ;
ఆ మారుతముఁ గ్రోలి యబ్జసంభవుఁడు । తామరలో నిద్ర తద్దయుఁ బోవుఁ.
కర మొప్పఁగా నిట్టి కల్పాంతరములు । సరవి ననేకముల్ చనియె భూనాథ !
ఒనరంగ నింకఁ గానున్నవి పెక్కు; । ఘనముగా నే గతకల్పాంతమునను
గలయు చీఁకటి నేమిఁ గానఁగరాక । యలసి యొక్కరుఁడ భయాతురత్వమున
లలి మీఱఁ బెక్కుఁగాలంబులు దిరిగి । యొలసి యెంతయు నట్టి యుదకమధ్యమున
నున్నతంబగుచున్న యొక మఱ్ఱిఁ గాంచి । పన్నుగా నా పర్ణ పర్యంకమునను
బరఁగ నున్నట్టి యా బాలునిఁ గాంచి, । 'యిరవొంద నెవ్వఁడో యిందున్నవాఁడు !'
అని చేరఁ బోయిన, నాతఁ డిట్లనియె : "ఘనతరశ్రాంతునిఁ గా నెఱింగితిని ;
ఎలమితో నవకాశ మిచ్చితి నీకు । వెలయ నించుక సేపు విహరించి పొమ్ము."
అని వికృతంబుగా నాస్యంబు తెఱచి । పొనర బలాత్కారమున మ్రింగఁ, జాలఁ
బరవశత్వము పొంది బాలుని యుదర । మరయఁ బ్రవేశించి యందు లోపలను

ఘన భూధరంబులు గంగాది నదులు । వనధులు ద్వీపముల్ వనములుఁ బ్రజలు
పక్షి మృగ వ్యాళ పశుసంఘములును । అక్షయ సూర్యచంద్రాగులు సురలు
యక్ష రాక్షసులు విద్యాధరశ్రేణి । యీ క్షోణియును జూచి యే విస్మయమున
సరవితో నూఱు వత్సరములదాఁక । తిరిగి యా దేవదేవు బాలకుని
పదములు దలఁచియు భక్తిఁ బ్రార్థింప । వదనాననము నన్ను వెల్వడఁ జేసె నన్ను.
పటుతర లీల నెప్పటియట్ల యున్న । వటపత్రశయను నవ్వనజాక్షుఁ జూచి
భావింపుచుండ నబ్బాలుఁ డిట్లనియె : । "ఓ విప్రవర్య, నా యుదరంబులోన
వెలయ నించుక నీవు విశ్రమించితివి ; । అలయిక తీఱెనే?" యనిన నుచ్చరణ
ములు శిరంబునఁ దాల్చి మోదించి యేను : । "నెఱుఁగొని కేశవ, నీప్రసాదమున
సకల చరాచర జంతు సంఘములఁ । బ్రకటించి చూచితిఁ బద్మపత్రాక్ష !"
అనుచు నుతించితి; నాతని నాభి । వనజంబునను బుట్టె వారిజాసనుఁడు.
అట్టి శ్రీకృష్ణుఁడే యనఘాత్మ, నీకుఁ । జుట్టమై సచివుఁడై సొంపుదీపించె.
ఈతని సేవింపు మిహమును బరముఁ । బ్రీతితోఁ గలిగెడిఁ బృథివీశతిలక !"
అనిన వేడుకఁ బొంది యా ధర్మరాజు । ఘనమైన ప్రేమ మార్కండేయుఁ బలికె :
"మునిచంద్ర, నీ కతంబునఁ బుణ్యకథలు । వినఁగంటి మిక్కిలి విమలచిత్తమున.
కలియుగంబున ధర్మకర్మంబులెల్లఁ । దెలఁగి యెంతేనియుఁ జెడునని వింటి ;
నా ప్రకారము నాకు నానతి యీవె ! । సుప్రసన్నత." నన్న సుకృతాత్ముఁడనియె :

## కలియుగ ధర్మములు

"వినవయ్య ధర్మజ, వివరంబుగాను, । మునుకొని కృతయుగంబునను ధర్మంబు
చతురంశముల మీఱు ; సరవితోఁ ద్రేతఁ । ద్రితయమై వర్తిల్లు ; ధృతి ద్వాపరమున
ద్వితయంబు, కలివేళ నెన నొక్కటగును ; । తత భంగిఁ దత్ప్రవర్తనమెల్ల వినుము.
సత్యంబు నరులకు సంక్షిప్తమగును ; । సత్యహీనైన నాయుష్యంబు దఱుఁగు (?)
నాయువు దఱఁగిన నల్పమౌ విద్య ; । పాయక నందుచేఁ బ్రబలు మోహంబు.
... ... ... ... ... । అందులోఁ గ్రోధంబు లగ్గలంబౌను
... ... ... ... ... ... । ... ... ... ... ...
పెనుపొంద నన్యోన్య పీడ సేయుచును । జనులు వర్తింతురు జలజారివంశ !
నలలిత జప తప స్స్వాధ్యాయ నియమ । కలితముల్ విడువంగఁ గలరు బ్రాహ్మణులు ;

ఘనతరాచార సంకలితులై శూద్రు । లనిశంబు నెగడుదు రవనీశతిలక !
పన్నగంబులు మృగ ప్రకరముల్ గలిగి । యెన్నఁ గారడవు లనేకముల్ గలుగు ;
తులువలు నరవలుఁ దురకలు బోయ । లలవడ నధికమై యవని పాడగును ;
క్షత్రియుల్ శూద్రుల సరవి నుండెదరు ; । పాత్రమై పాఁడియుఁ బంటయుఁ దఱుఁగు ;
కడఁగి విప్రులు వర్తకంబుఁ గర్షనము । జడబుద్ధి తోఁ జూతఁ జేయుఁగఁ గలరు ;
సరవిఁ బాషండ దర్శన మధికంబు ; । దొరఁగొని కాలంబుతో వానలేదు ;
క్రయ విక్రయంబులఁ గపటంబు తెఱచు ; । దయలేమ పాపమే దలఁతురు బుద్ధి ;
ఆరికపంట లత్యధికంబు లగును ; । కూరిమితోఁ గల్లు గొఱియలపాఁడి ;
ఘాతకుల్ దఱచగు ; (?) ఘనతతో వారి । చేత ధనంబంది చెడు విప్రసమితి ;
పితృ దేవకార్యముల్ పెంపువో నడఁగు ; । పతి నవమానించుఁ బణఁతి నిక్కముగ;
కదలక మఱియు నక్కలి యుగాంతమునఁ । బదియాఱు వర్షముల్ పరమాయు వగును;
ఏడును నెనిమిది యేండ్ల ప్రాయమునఁ । బోఁడిగాఁ గందురు పొలఁతులు సుతుల ;
దాత యొక్కఁడు లేక ధనహీనులగుచు । జాతి నన్యోన్య తస్కరులు గాఁగలరు ;
క్రన్నన వేద విక్రయులు భూసురులు । నన్న విక్రయులును నగుదురు మఱియు ;
ఈ రీతి మఱియు ననేక భంగులను । ధారుణి ధర్మంబు తఱఁగి పోయినను
గలయంగ శంబల గ్రామంబునందు । సొలవక విష్ణుయశుండను పేర
నొక్క భూసురుఁడుట్టి యొప్పు మీఱంగఁ । దక్కక సకల శాస్త్రములును నస్త్ర
ములు స్మరించిన మాత్ర మునుమిడి యెఱిఁగి । నలలితంబుగ విప్రసహితుఁడై కడఁగి
వసుమతిలోఁ బాపవర్తులఁ జంపి । మసలక సర్వధర్మంబులు నిలిపి
వాజిమేధము చేసి వసుధ బ్రాహ్మణుల । కోజ విభాగించి యొప్పుగా నిచ్చి
తపమున కరుగును ధర్మంబు పెరుఁగు । నపరిమితంబుగా నందునఁ జేసి
కృతయుగం జేతెంచుఁ గృతమతి నిట్టు । లతిశయంబుగఁ జూతు నన్నియు నేను.
ఎలమితో నింకొక్క హితవు చెప్పెదను । దొలఁగక విప్రులఁ దుష్టిఁ బొందింప
నందుల సకల పుణ్యంబులుఁ గలుగు । నందంబుగా.'' నన్న నతఁడు మోదించి,
'పరువడి విప్ర ప్రభావంబు నాకు । నరయంగఁ జెప్పవే' యనిన నిట్లనియె :

## బ్రాహ్మణ ప్రభావము

''భానుతేజుఁడు లోకపావనమూర్తి । భానువంశుం డయోధ్యా పాలకుండు
అవనిఁ బరీక్షిత్తుఁ డనఁగఁ బెంపొందు । వివిధ పుణ్యాత్ముండు విశ్రుత కీర్తి.

మృగయాభిరతుఁడునై మెఱసి కానలను । దగ వేటలాడుచుఁ దరళాక్షి నొకతెఁ
బువ్వులు గోయంగఁ బొడగని యంత : । "ఎవ్వరిదానవే యెలనాగ, నీవు ?
ఇట్టి సౌందర్యంబు నే యింతులందు । నెట్టనఁ గాన నో నీరజవదన !"
అనవుడు నృపుఁజూచి యంగన పలికె : । "పనిగొనఁ గశ్యపపతిఁ గోరి యిచట
విహరింపు చుండుదు వేడుకతోడ । బహుతర లీలలఁ బార్థివోత్తంస !"
అనినఁ బరీక్షితుఁ డతివపైఁ బ్రేమ । పెనఁగొన నిట్లను : "బింబోష్ఠి, వినుము
భానువంశ్యుఁడ, జగత్ ప్రఖ్యాత యశుఁడఁ, । బూనిక సాకేతపుర మేలువాఁడ,
నన్ను బెండ్లాడి యో నలినదళాక్షి ! । మన్నింపు." మనిన నమ్మానిని పలికె :
"అవనీశ, నీ చెప్పినట్ల చేసెదను ; । నవడిమై నెన్నఁడు జల విహారముకు
నన్ను బిల్వకయుండు, నయము దీపింప । నిన్ను వరించెద నిక్క మీపలుకు."
అనినఁ బరీక్షిత్తుఁ డంగీకరించి । వనితఁ బెండ్లాడి సద్వైభవం బెనఁగఁ
బురమున కేతెంచి భూరి భోగములఁ । దిరమైన వేడ్క వర్తిల్లుచు నుండె.
అంత శరత్కాల మరుగుదెంచుటయు । నంతోష చిత్తుఁడై సతియును దాను
... ... ... ... ... । ... ... ... ... ...
సహజంబుగా ఘర్మ జలకణదేహ । విహిత విశ్రమముల వినమితామోదుఁ
డై తత్సమీపంబు నందు నెంతయును । ఆతతస్ఫూర్తి నొప్పారిన కొలను
గని దాని దరిఁ దన కాంతను నిలిపి । పని గొన నందు లోపలఁ దీర్థమాడి
వనితఁ గనుంగొని : "వనజదళాక్షి ! । యనయంబుఁ జెమట వాయఁగ నీరుచొచ్చి
యవగాహనము సేయు." మనిన నవ్వుచును । ధవళాక్షి నీటిలోఁ దద్దయుఁజొచ్చి
మునిఁగి మాయంబైన, మొగి నరేశ్వరుఁడు । ఘనవిస్మయము నొంది కన్నీరు నించి
కడువడి మడుఁగెల్లఁ గలయంగ వెదకి । కడఁకతో నెంతయుఁ గానంగలేక
వెలయఁ దజ్జలమెల్ల వెడలంగఁ జల్లి । కలయఁగ నందున్న కప్పలఁ జూచి,
'ఇవి మత్ప్రియాంగన నిట మ్రింగఁబోలు । నవిరళంబుగ.' నని యధిక కోపమునఁ
దన యనుచరుల నంతటిలోనఁ బిలిచి, । "పెను పొంద నాకును బ్రియము సేయంగ
వరమతి వలసినవారు కల్గినను । గర మొప్ప ధరఁ గల కప్పలనెల్లఁ
బొలియింపుఁ" డనవు డుప్పొంగి సేవకులు । కొలఁకుల వాఁగులఁ గూప దీర్ఘికల
సెలయేటులను రోసి చెలఁగి కప్పలను । ... ... ... ... ...
జంపంగఁ దొడఁగినఁ, జంచలంబంది । యింపేది మొఱవెట్టి యిట భేకవిభుఁడు

ముని వేషమున నృపు ముందఱ నిలిచి : । 'మనుజేశ, జనులెల్ల మహి నిన్ను నవ్వఁ
జలమునఁ గప్పలఁ జంపింప నగునె ! । మలయక యిది యధర్మము మాను.' మనిన
నిలపతి యిట్లను : "నెక్కడిమాట ! । పొలియింతుఁ గప్పల భూమిలోపలను ;
మగువ మ్రింగిన యట్టి మాయదారులను । జగతిలోపల నెట్లు చంపక విడుతు ?"
అనవుడుఁ జింతించి యా భేకవిభుఁడు । మనుజేశు కిట్లను : "మహితాత్మ, వినుము
మండూకవిభుఁడను మహిలోన నాయు । వందురు నాదు పే రవనీశతిలక !
ఆయింతి నా కూఁతురగు శోభనాఖ్య ; । పాయక దానిచే బ్రమపడ్డ వార
లిల ననేకులు గల రీవెంతపెద్ద ! । వలనొప్ప." ననవుడా వసుధేశుఁడనియె:
"ఈ మాట నిజమైన నెలనాగఁ దెచ్చి । ప్రేమతో నాకిమ్ము పెంపగ్గలించి."
అనుచుఁ బ్రార్థించిన నతఁడు నవ్వుచును । దన పుత్రి నంతలోఁ దలఁచి రప్పించి
సొలవ కెంతయు దానిఁ జూచి కోపించి : । "*కులము వారలఁ జంపఁగోరి యీరాజు
అరయఁ బ్రసిద్ధులైనట్టి భూపతుల । వరుస దిక్కులకంపి వడి వంశమడఁచె ;
పెనుపొంద నీ చిక్కుఁ బెట్టితివీవ । పొనుపడ నీకును బుట్టెడి సుతులు
కపటవర్తనులగుఁ గా!" కని (?) కూఁతు । శపియించి మండూక జనపతి యనియె.
ఇట సుశోభనఁ గూడి యిలఁ జక్రవర్తి । పటుతరభోగ సంపద లందుచుండె.
అంతఁ గ్రమంబున నంబుజగంధి । నంతోషమునఁ దల శల వలు లనఁగ
ముప్వురఁ గొడుకుల ముదముతోఁ గనిన । నవ్వసుధేశుఁ డం దగ్రజుఁడైన
శలునిఁ బట్టముగట్టి చని వనభూమిఁ । దలకొని యత్యుగ్రతపము గావించె.
ఇట శలుఁడొక్కనాఁ డేఫు దీపించి । పటుతర రథమెక్కి బలములుఁ దాను
వేఁట లాడఁగఁ బోయి విపినాంతరముల । గాటపు మృగముల ఖండించి వైవ,
నందొక్క మృగము శరావిద్ధమగుచుఁ । బొందుగాఁ బఱవ, నప్పుడు దాని వెంటఁ
జని చని యంతలో సారథిఁ జూచి, । 'పనివడ వేగంబు పఱపుము తేరు ;'
అనవుడు సారథి యవనీశు కనియె : । "మన మెంత దఱిమిన మనకు లోఁబడదు ;
ఘనతర వేగంబు గల దా మృగంబు; । అనఘాత్మ, హరులు వామ్యంబులై యున్న
నగపడు మృగ" మన్న 'నట్టి వామ్యములు । వగవక చెప్పు మెవ్వని యింటఁ గలవు ?'
అనవుడు సూతుఁడిట్లను శలుఁ జూచి : । "యనఘాత్మ, వామ్యంబులైన గుఱ్ఱములు
వామదేవుండను వరముని యింటఁ । బ్రేమతోఁ గల." వన్నఁ బృథివీశ్వరుండు

---

* చూ. కవిత్రయభా. అర. ప. 4. ౩౩౫.

అతని యాశ్రమమున కరదంబు దోలు । మతులితగతి నన్న నట్లకాకనుచు
రథము దోలిన, మునిరాజశేఖరుని । ప్రథితాశ్రమముఁ జొచ్చి పరఁగు వేడుకను
వామదేవుని పాద వనజంబులకును । బ్రేమ తోడుత మ్రొక్కి పృథివీశుఁడైన
శలుఁడిటు లనియె : "నో సంయమిప్రవర! । వలయు నాచే నేటువడి యొక్క మృగము
అనమునఁ బఱచె, నిష్డద్దాని నెయిది । వసుధలో నెటనైన వధియింపవలయు ;
ననువుగా భవదీయ హయముల నీవె !" । యనవుడు "నీ కార్యమైన పిమ్మటను
రాజితంబైన గుఱ్ఱంబుల మగుడ । నోడతో నిత్తువే నొప్పుగాఁ గొనుము."
అని పల్క నొడఁబడి యంతలో శలుఁడు । దనరు వామ్యంబులఁ దన రథంబునను
గట్టి వేగమునకుఁ గడఁక మెచ్చుచును । నెట్టనఁ దాఁబోయి నిమిషమాత్రమున
మృగమును సమయించి, మెఱసి వేడుకను । మగిడి యయోధ్యకు మహిమతోఁ బోయి
"రాజయోగ్యంబునై రమణ దీపించు । రాజితంబగు హయరత్న యుగ్మంబు
పటు జవాధిక్యంబు పాఱుని కేల । తటుకున!" నని దురిత స్వాంతుఁడగుచు
నంతఃపురంబున నటఁ గట్టఁ బనిచి । యెంతయు సంతోష మేపాఱ నుండె.
అట వామదేవుండు నశ్వరత్నములఁ । గుటిలుఁడై యెంతయుఁ గొనిపోయి శలుఁడు
మగుడ నీయకయున్న మది విచారించి, । "తగురాజు బలియుండు దర్పాధికుండు
ననయంబు వేడుక నశ్వరత్నములఁ । గొనిపోయెఁ; గొనిపోయి కూర్మితో మగుడఁ
దెచ్చి యిచ్చెద నను దృఢబుద్ధి లేక । కుచ్చితంబుగ నిట్లు క్రూరుఁడై మించె."
అని యని చింతించి యాత్రేయ శిష్యుఁ । గనుఁగొని యిట్లనుఁ గడఁక దీపింప :
"అనఘాత్మ, నీ వయోధ్యాపురి కేఁగి । చనవొప్ప నెంతయు శలుఁజూచి 'వామ్య
హయములు గొని నెల యయ్యె నింతటను । రయమొప్ప ని.' మ్మని రమణమై నడిగి
కొనిరమ్ము పొ." మ్మన్న గురువుకు మ్రొక్కి । యనుపమ గతి నయోధ్యాపురి కరిగి
శలుఁగాంచి పలికె: "నో జననాథతిలక ! । వల నొప్ప వినవయ్య వామదేవుండు
అనిపిన వచ్చితి ననఘ, నీ కడకు ; । మునుకొని ఘోటకమ్ముల నిమ్ము వేగ."
అనవుడు శలుఁడంత నాత్రేయుఁ జూచి: । "ముని వామదేవుండు మొగి నిన్ను నంపె;
నీవును వచ్చితి నెఱిఁ జాలుఁ జాలు । నీ విధి దుర్భావ లీక మాని పొమ్ము."
అనిన నాత్రేయుండు నప్పుడు కదలి । తన గురునకుఁ జెప్పఁ దద్విధం బెల్ల,
విన్నాణమునఁ గ్రోధ వివశుఁడై వాసి । పన్నుగా నా శలుపాలికిఁ బోయి :
"నరనాథ, యీవయ్య నా తురంగముల । నరయంగ నీ పని యయ్యె నింకేల ?

ఒనర లోభంబున నొరుల సొమ్ములను । దోఁచి కావలె నన్నఁ జేరునే యకట!
యెరువులు సతమౌనె? యేల దురాశ? । పరధన హరుల పాపంబులు దెలియు;
వరుణ పాశంబుల వడిఁ గట్టువడుచు । నరకాగ్నిలోఁ బడు నయ మెంచఁ గలదె?"
అనుటయు శలుఁడిట్టులనియె కోపించి : । "మునుమునే నేల యిన్నులఁ దురంగములు?
పరఁగఁగ సత్య సంపన్నత మిగుల । నిరవగు నెడ్ల రెండిచ్చెదఁ గొనుము;
అదియును గాకున్న, నట వేసడములఁ । గొదలేక యిచ్చెదఁ గొనుము నిక్కముగ;
నడిమాన కేటికి హయముల నీకు; । అడరఁగ దబ్బర లాడితి వేని
నీకు నీ వెఱిఁగెదు; నృపయోగ్య హయుల । నీకు నిచ్చెడికంటె నేరముల్గలవె?"
యనుచుఁ బోనాడిన నతఁడు గోపించి । సునిశిత మతితోడఁ జూచినంతటనె,
దైత్యు లనేకులు తద్దయుఁ బుట్టి । యత్యంత రోషాత్ములై చాల రేఁగి
శూలము ల్గొని వాని స్రుక్కఁగఁ బొడిచి । కాలగోచరుఁ జేసి కదలి పోవుటయు,
వామదేవుఁడు తన వనమున కరిగి । యామోయి నున్నచో, నంతటిలోన
శలుని తమ్ముఁడు మహాసాహస వృత్తిఁ । దలుఁ డనువాఁడు భూతలమున కెల్ల
రాజునై యేలుచు రమణ దీపించి । తేజంబుతో నుండ ధృతి నొక్కనాఁడు
వామదేవుఁడు వచ్చి వాని దర్శించి : । "భూమీశ, వేటకై మున్ను మీ యన్న
హయుల వామ్యంబుల నటఁ గొని యాశ । తఱలకుండక నింట దాఁచినవాఁడు;
పొలవక విప్రుల సొమ్ము నీ కేల? । సలిమీఱ నా సొమ్ము నా కిచ్చి యనుపు."
మనుటయుఁ దలుఁడు రోషాయత్తుఁ డగుచుఁ । బనివడి తన సమీపంబున నున్న
సారథిఁ గనుఁగొని : "చతురాత్మ, నీవు । నారయ నా విల్లు నమ్ములుఁ దెమ్ము;
బాపఁడు కడుఁగ్రొవ్వి పలికెడు నిపుడు । పాపుదు వీనిని బ్రాణంబులకును."
అనవుడు నవ్వుచు నా వామదేవుఁ । డనియె : "నే తల నీకు నట నన్ను వేయఁ?
దెమ్మన్న యమ్ములఁ దివిఱి నీ సుతుఁడె । యెమ్మె నాడెడువాఁడు మృతుఁడు నాఁ గాత
మిప్పుడె." యని పల్క నంతటిలోనఁ । దప్ప కా యమ్ముచే ధరఁ గూలియున్న
బాలకుఁ గొనివచ్చి పార్థివేంద్రునకు । నాలోనఁ జూప, నాహాకార మొసఁగఁ
బలురోదనము సేసి బంధుగ కోప । కలితుఁడై తన దురాగ్రహము రెట్టింప
విల్లు నమ్ములుగొని వ్రేసెద ననుచు । విల్లెక్కు వెట్టి యుర్వీతలం బగల
వెస గుణ ధ్వనిచేసి విశిఖంబు దొడిగి । పొసఁగ నా కర్ణాంతముగఁ దివుచుటయుఁ,
బరఁగఁగ బాణ చాపఁబులతోడ । నరవితో హస్తముల్ స్తంభింపఁ జేయ

వరుసఁ జిత్తరువున వ్రాసిన ప్రతిమ । కరణి నట్లుండి భూకాంతుండు దలఁచు
వెలవెలనై కడు విస్మయం బంది । తలఁకుచు నంతంతఁ దపసి కిట్లనియె :
"మునిరాజశేఖర, ముని సార్వభౌమ, । మునిలోకపూజిత, పుణ్యస్వరూప,
వలనేది నోరికి వచ్చిన దెల్లఁ । బలికితి దుష్కృతభావంబు వలన ;
నెఱుఁగకఁ జేసితి నెల్ల తప్పులను । మఱచి లోఁగొని నన్ను మన్నింపు." మనుచు
జెగడొంది యేటు దప్పి జోహారులనిన । వగచి మిత్రజనంబు బంధువర్గమును
సతులును నమ్ముని చరణపద్మముల । కతిశయంబుగ మ్రొక్కి "యనఘాత్మ, నీవ
దిక్కు మాకనుచుఁ బ్రార్థింపఁ బ్రార్థింప, । నక్కజంబుగఁ గోపమణఁచి యమ్మౌని
తడయక కృపతోడఁ దత్కరస్తంభ (?) । ముడిపినఁ దలఁడును నుర్వి సాష్టాంగ
మొనరుచుటయు వాని నొగి గారవించి । తనయుని ప్రాణంబు దగ నిచ్చుటయును,
సంతోష చిత్తుఁడై సంయమీంద్రునకు । సంతటఁ గొని వచ్చి హయముల నిచ్చి
యనిపినఁ బోయె నిజాశ్రమంబునకు । మనుజేశ, విప్రసామర్థ్య మి విధము."
అనిన మార్కండేయు కనియె ధర్మజుఁడు: । "అనఘాత్మ, నీ కంటె నధిక వార్ధక్య
తనుఁడగు పురుషుండు ధరణిలోఁ గలఁడె ?" । యనిన మార్కండేయుఁ డతని కిట్లనియె:

## ఇంద్రద్యుమ్న చరిత్రము

"ధరణీతలేశ, యింద్రద్యుమ్నుఁ డనఁగఁ । బరఁగిన నృపతి యా పాకశాసనుని
సదనంబునందు నిచ్చలుఁ దపోనియతి । వదలక నిష్ఠమై వర్తింపుచుండ
నఖిల లోకంబుల నాతని కీర్తి । శిఖితేజు మాసినఁ, జెచ్చెర సురలు
"ఒనర నీ విచ్చోట నుండంగ వలదు । చను" మని త్రోచిన, జగతి కేతెంచి
ననుఁ జూచి యిట్లనె,: "నవమూర్తి, నన్ను । గొనకొని యెఱుఁగుదే కుంభినిలోన ?"
ననిన నే నిట్లంటి : "నయ్య, నిన్నెఱుఁగ ; । ఘనతఁ బ్రాలేయనగంబున నెపుడుఁ
గరుణతోఁ బ్రావారకర్ణుం డనంగఁ । బరఁగు నులూకంబు ప్రతిదినంబుండు
నా కంటె నిన్ను నిర్ణయముగా నెఱుఁగు । జోకతోఁ బొ."మ్మన్నఁ జూచి మోదించి
యట్లైన నీవు రమ్మనుటయు నేను । నట్టిగా నతనితోఁ గరుణ నిట్లంటి
"ఘనరసాయన ఘుటికా ప్రయోగమునఁ । దను తాపమయ్యె నేఁ దనరి రానోప."
ననుటయు, నశ్వమై యాతండు నన్నుఁ । గొనిపోయి హిమగిరిఁ గొమరొప్ప డించి
యయ్యులూకము కడ కరిగి 'యో యనఘ ! । యిమ్మెడ నన్ను నీ వెఱుఁగుదే?' యనిన

నదియు నింపుక దన యంతరంగమునఁ । గదలక తలపోసి: "కడఁకతో నిన్ను
నిజముగా నెఱుఁగంగ నేరఁ జెప్పెదను । విజయంబుగా వయోవృద్ధు ధన్యుండు
నరయ నింద్రద్యుమ్న మను ప్రౌఢబంధు । [illegible] వసియించు నీ డో[illegible]భవుండు
అవని నాళీజంఘుఁ డను బకాధిపుఁడు ; । అరిగి యా మాటఁ జని యచ్చోటి." యనిన
నరనాయకుండును నా తోడఁ గూడ । [illegible]తో నయ్యులూకంబును మోచి
కొనిపోయి, బకపతిఁ గోరి దర్శించి । తన పేరుఁ జెప్ప "ఏమంట నెఱుఁగుదువె?"
అనిన నాళీజంఘుఁ "డట నిన్నెఱుంగ ; । [illegible] నా కంటెఁ బెద్దయైనట్టి
ఘనుఁ డకూపారుఁ డన్ కచ్ఛపేంద్రుండు । ఘనముగా నుండు నీ కంజాకరమున ;
నాతఁ డెఱుంగునో యడుగంగవలయు । [illegible]." యని పిల్వ నేతెంచి యప్పుడు
కమఠాధిపతి నిల్వఁ గని యడుగుటయుఁ । గ్రమమున నశ్రుధారలు వెలువడంగ
"నక్కటా! గుణధామ, యధికపుణ్యాత్మ, । దిక్కులు నిండెఁ గా దివ్య సత్కీర్తి.
ఎలమి నింద్రద్యుమ్ను నెఱుఁగని వారు । గలరె? ధన్యుఁడ వీవు కరుణాసముద్ర!
అర సనేక భయంబు లయ్యెడి యెడలఁ । గరుణ తోడుత నన్నుఁ గాచితి వీవ ;
మఱువఁగఁ దగునె యీ మహిలోన నిన్ను । నెఱిఁగి చేసిన మేలు ఈ ధరలోన ?
నరయంగ బహువిధ యజ్ఞముల్ చేసి । తరమిడి దక్షిణార్థంబుగా విప్ర
వరులకు నిచ్చు గోవర్గంబు తొల్లి । గొరిజల నేఁతయు గ్రొస్సినఁ గాదె
యీ సరోవరమయ్యె నిటఁ బ్రసిద్ధిగను । భాసురంబుగ." నని పలుకంగ నంత,
దివ్యవిమానంబు దేవతల్ గొనుచు । భవ్యులై చనుదెంచి పరమపుణ్యాత్ము
ననఘు నింద్రద్యుమ్ను నప్పుడు చూచి । "చనుదెమ్ము నీ కీర్తి శాశ్వతమయ్యె
నెంతకాలము కీర్తి యిలలోన వెలయు । నంతకాలము గల్గు నమరలోకంబు."
అనిన నింద్రద్యుమ్నుఁ డనియె: "వీరలను । నెనసి మత్కార్యార్థ మిట సహాయముగ
దెచ్చితి నిజభూమి ధృతి నిల్పి వత్తు । నచ్చుగా." నని చెప్పి యంతలో మమ్ము
వహియించుకొని వచ్చి వరుసతో నిలిపి । బహుదివ్యలోకంబుఁ బడసె నా ఘనుఁడు.'
అనవుడు ముదమంది యమతనూభవుఁడు : । "అనఘాత్మ, నీ కంటె నధిక వృద్ధులను
ఎఱిఁగితిఁ, బుణ్యంబు లెంతెంత గలిగె ! । వఱలు నయ్యిక్ష్వాకు వంశజుఁడైన
కువలాశ్వనకుమాఱి కుంభినిలోన । నవిరళ ధుంధుమారాభిధానంబు
ఏరీతిఁ గలిగె ? నా కెఱిఁగింపు." మనిన । గౌరవస్ఫూర్తి మార్కండేయుఁ డనియె :

## కువలాశ్వు చరిత్రము

"ఘనుఁ డుదంకుండనఁగా నొక్కమౌని । మనమున హరి నిల్పి మరుభూములందు
నతి ఘోరతపము సేయంగ, సంతటను । నతని భక్తికిఁ బ్రియంబంది యచ్యుతుఁడు
ఆదిదేవుఁడు సతతానందమూర్తి । వేదవేద్యుఁడు చక్రి విశ్వరక్షకుఁడు
ప్రత్యక్షమగుటయు భయభక్తితోడ । నత్యంత వేడ్క సాష్టాంగంబు మ్రొక్కి :
"శ్రీరమాధీశాయ చిద్వ్యాపకాయ । వారిజనాభాయ వాసుదేవాయ
పీతాంబరాయ కల్పిత జగత్ప్రంచ । భూతరూపాయ సద్భుతవిక్రమాయ
కౌస్తుభాభరణాయ ఘనవిగ్రహాయ । హస్తీంద్రవరదాయ అఘహరణాయ
తుభ్యంనమో నమో ధూర్జటి వినుత ! । తుభ్యంనమో నమో తోయజ నయన !"
అని బహువిధముల నభినుతి సేయ । వనజోదరుఁడు 'నీకు వరమిత్తు నడుగు'
మనిన నుదంకుఁ "డోహరి, వాసుదేవ, । వనజాక్ష, నినుగంటి; వర మింతకంటె
నధికమెయ్యది చూడ ! నైన నా మనసు । నధినాథ, సత్యదమాదుల యందుఁ
దిరమునై యుండను, దృఢమైన భక్తి । కరమొప్ప నీ యందుఁ గలుగంగ నీవె !"
అనవుడు నట్లిచ్చి యంబుజోదరుఁడు । "మన మలరఁగఁ : 'బరమజ్ఞానయోగ
మును గల్గుఁ ; త్రైలోక్యమునకు హితంబు । ననయంబు నైన కార్యంబు నీ చేత
సాధితంబయ్యెడు నత్య మీ పలుకు ; । గాథలు పెక్కేల ? కడముట్ట వినుము ;
అవనిలోపల ధుంధుఁడను దానవుండు । తివిరి లోకముల బాధింపంగఁ గలఁడు ;
చలమొప్పఁగా వానిఁ జంపెడికొఱకు । నలవడఁగా బృహదశ్వుని సూనుఁ
డయ్యొప్పు కువలాశ్వుఁ డబ్ధి గంభీరుఁ । గయ్యంబునకు నంపఁగలవు నీ వనఘ !
అతఁడు నద్దైత్యుని ననిలోనఁ జంపు । నతులిత విస్ఫూర్తి." నని చెప్పి చనఁగ,
నిట నుదంకుండును నేపు దీపించి । పటు తపంబున నుండెఁ బరఁగ వెండియును.
అనఘుఁ డిక్ష్వాకుఁడీ యవనిచక్రంబు । ననుపమంబుగ నేలి యరిగిన వెనుక
నతని నందనుఁడు శశాదుండు మించి । క్షితియెల్ల నేలి చెచ్చెరఁ గకుత్స్థాఖ్యఁ
బడసె ; ననేనసుఁ బడసె నాతండు ; । కడఁకతో నతనికిఁ గలిగెఁ బృథుండు ;
పృథుఁడు విశ్వకుఁగనెఁ బెంపుతో ; నతని । కధికత్వమునఁ గల్గె నార్ద్రనామకుఁడు ;
అతనికి యువనాశ్వుఁ డాత్మజుఁ డయ్యె ; । నతనికి శ్రావస్తి యనువాఁడు పుట్టె ;
నతనికి బృహదశ్వుఁ డాత్మసంభవుఁడు ; । అతనికిఁ గువలాశ్వుఁ డనువాఁడు పుట్టి

సకలాస్త్ర శస్త్ర విశారదు లధిక । వికట సత్త్వ ప్రభా విఖ్యాతులైన
చతురు లనేక వింశతి సహస్రముల । సుతులను గాంచిన, సొంపు దీపించి
పరఁగంగఁ గువలాశ్వుఁ బట్టంబు గట్టి । ధర బృహదశ్వుండు తపమున కరుగ,
నయ్యవసరమున నయ్యుదంకుండు । చయ్యనఁ జనుదెంచి చతురతఁ బలికెఁ :
"బృహదశ్వ, వినవయ్య పృథివిలో జనుల । విహితఁబుగాఁ బ్రోవు ; విను మింతకంటె
ధర్మంబు గలుగునే ! ధరఁ దొల్లి నృపులు । పేర్మిఁ బ్రజారక్షఁ బెంపు దీపించి
పుణ్యలోకంబులు పొందిరి నిజము. । పుణ్యాత్మ, యొక్క యద్భుతమిది వినుము
గరిమ తోడుత మధుకైటభు లనఁగఁ । బరఁగిన యసురులపట్టి ధుంధుండు
ఘన తపోబలమునఁ గంజజువలన । ననిమిషులను గెల్చునట్టి వరంబు
వడసి లోకంబులు బాధింపుచుండి । మడవక యిప్పుడు మా యాశ్రమంబు
చేరువ మిగుల విస్తీర్ణమై సింధు । పూరిత వాలుకాపులినంబునందు
వివరంబు గావించి వెసనందుఁ జొచ్చి । నివిడిన కడఁకతో నిద్రించు ; వాని
వదనంపు నిశ్వాస వాయుప్రవాహ । ముదిత ధూమాస లాత్యుగ్రమై పరఁగి
యొనరంగ నేఁటేఁట నొకమాటు వెడలి । తనరంగ భూనభోంతరమున నెల్ల
నతతంబు సికతారజః పటలంబు । వితతంబుగాఁ జేసి వెస బాధపఱచు.
మనుజేశ, మాకును మా యాశ్రమమున । ఘనముగా నిలుచుట గడు సంకటంబు.
అది గాన వేగంబె యద్దురాత్మకునిఁ । గదనంబులోపల ఖండించివైచి
గరిమతోడుతను లోకములకు మాకు । ధరఁ బ్రీతి యొనరించి తపమున కరుగు.
'తలఁకొని యెవ్వఁడు దైత్యునిఁ జంపఁ । దలఁచు వానికి నిత్తుఁ దనశక్తి' యనుచు
హరి యానతిచ్చినాఁ డదిగాన నీవు । కరుణ నీ లోకముల్ గాచి రక్షింపు."
అనినఁ గృతాంజలియై బృహదశ్వుఁ: । "ఘనఘాత్మ, యస్త్రసన్న్యాసన మే నిపుడు
చేసినవాఁడ ; నీ క్షితిలోన మిగుల । వాసికెక్కిన యట్టివాఁడు నా సుతుఁడు
కువలాశ్వుఁ డీతండు గుణ గణాధికుఁడు । అవని వింశతి సహస్రాత్మజుల్ తాను
దైత్యులఁ జంపును తథ్యంబుగాను । అత్యంత శూరత." నని యప్పగించి
యా యుదంకుని చేత ననుమతి వడసి । యాయుతమతితోడ నడవికిఁ జనియె."
అనిన మార్కండేయు కనియె ధర్మజుఁడు : । "ముని నాథ, ధుంధుండు ముదముదీపింప
భువి మధుకైటభ పుత్త్రకుఁ డనుచు । వివరించితివి నాకు విశదంబుగాఁగ ;

వఱలి యేకాలంబువార లాదైత్యు? । లఱిముఱి నేమైరి? అది చెప్పు." మనినఁ
బనివడి యమతనూభవు మోముచూచి । ఘనమైన భక్తి మార్కండేయుఁ డనియె:

## మధుకైటభుల చరితము

"ధరణీశ, యీ జగత్త్రయమును దొల్లి । యరయ నేకార్ణవమై యుండునపుడు
భాసుర భోగీంద్ర పర్యంకమునను । వాసుదేవుఁడు నిద్ర వడిఁ బోవుచుండ
నతిదీర్ఘమగు కాల మరిగె; నవ్వెనుక । నతి ఘోరమూర్తు లాహవ ధురంధరులు
మధుకైటభులనంగ మథితశాత్రవులు । అధిక వేగంబున నటు చనుదెంచి
హరినాభి కమలంబునందు నెంతయును । విరివి తేజంబున వెలుఁగొందు ధాతఁ
గని రోషమున వ్రేయఁ, గడుభీతిఁ బొంది । 'ఘనదేహ, శ్రీహరి, కావవే!' యనుచు
మొఱ వెట్టుటయును, అమ్మురమర్దనుండు । నరగున మేల్కని సాహసోన్నతుల
మధుకైటభులఁ జూచి: "మహాత్ములార! । యధికులు మీర లీ యబ్జజు నేల
రాయిడిఁ బెట్ట? శౌర్యముగల మిమ్ము । నీ యెడ మెచ్చితి నిచ్చెద వరము
నడుగుఁడు మీ." రన్న నసురులు నవ్వి: । "ఎడపక నీవు మా కిచ్చెదు వరము!
ఈ రీతి సామర్థ్య మేడది నీకు? । ఆయె వలసిన నడుగుము మమ్ము
నీ కిత్తు" మనుటయు, నీరజోదరుఁడు: । "ప్రాకటంబుగ మీరు పలుకు సత్యంబు;
బొంకాడ నెఱుఁగరు పుణ్యులు మీరు । లంకెలేక మిమ్మడిగెద వరము
నా చేతఁ జావుఁడు నలి మీర." లనిన । నా చక్రధరున కిట్లనిరి రాక్షసులు:
"జలములు లేనిచోఁ జంపుము మమ్ము । జలజదళాక్ష, నిశ్చయముగా." ననినఁ
బొలుపొందఁ ద్రైలోక్యమును నట్టి వేళ । జలమయంబగుటయుఁ జాలఁ జింతించి,
తన యూరువులు సాఁచి దైత్యులనందు । ఘన సుదర్శనముచే ఖండించి వైచె.
పొసఁగ నమ్మధుకైటభుల తనూభవుఁడు । వసుధలో ధుంధుండు వనజారివంశ!
అట్టి ధుంధుఁడు దేవతావళినెల్ల । నెట్టన బాధించు నెఱి విను మనఘ!
ఆ రీతిఁ దండ్రిచే ననుమతి వడసి । కూరిమి దీపింపఁ గువలాశ్వుఁడంత
శుభ దివసంబున శుభముహూర్తమున । నభినవోత్సాహుఁడై యాత్మజుల్ దానుఁ
జతురంగబలము లసంఖ్యలు గొలువ, । మితవాక్యములు గడు మిన్నంది మ్రోయ,
వంది బృందములు కైవారముల్ సేయఁ, । జెంది పుణ్యస్త్రీలు సేసలు చల్ల,
నయ్యుదంకుఁడు వెంట నరుదేరఁ గదలి । చయ్యనఁ బోవంగ, జలజోదరుండు
నత శక్తి యతనిలోఁ దద్దయుఁ బెట్టె; । మునులు దీవించిరి; మొరసె దుందుభులు.

ఆరీతి నా కువలాశ్వుండు వోయి । వారిధి తటమున వలనొప్ప విడిసి
తన తనూభవుల నాతతబలాధికులఁ । బొనుపఁగ వాలుకాపులినంబుఁ ద్రవ్వ
... ... ... ... ... । ఉరవడి నిద్రవోవుచు నున్నవాని (?)
వడిమీఱు నిశ్శ్వాస వాతాగ్ని శిఖల । నడరెడు వాని దైత్యాధముఁ గాంచి,
పరశు ముద్గర శూల పట్టిస ప్రాస । కరవాల ముసల భీకర భిండివాల
వివిధాయుధంబుల వ్రేసిన, నంతఁ । దలఁగక ధుంధుఁ డుద్ధతిఁ బెద్దప్రొద్దు
కొయ్యన ఘన విస్మృతోగ్రాననంబు । నయ్యెడఁ గలిగి పాయక యావులించి
విస్ఫులింగంబులు వెడల నంతటను । విస్ఫారగతి లేచి వీక్షించుటయును,
దలకొని నిశ్శ్వాస దారుణవహ్నిఁ । బొలిసిరి కువలాశ్వపుత్త్రులందఱును.
ఆ రీతి భద్రాశ్వుఁడా దృఢాశ్వుండు । నారయఁ గపిలాశ్వుఁడను వారు దక్కఁ
దక్కిన కొడుకు లందఱు మడియుటయు, । నక్కజంబగు కోపమధికంబు గాఁగ
ధరణీతలేశుఁ డెంతయు నెదుర్కొనినఁ, । జరఁగ నద్దైత్యుఁ డద్భుతభుజాటోప
మెసఁగ నిశ్శ్వాసాగ్ని నిటఁ జగ్గఁజేసి । కొసరక శూలంబుగొని కవియుటయు,
నతులిత యోగప్రభావంబు పూనిముల । హితతాగ్ని నార్చి భూవివరంబు వగుల
దిగ్గజంబులు గ్రుంగ దిక్కులు బెదర । బెగ్గిలి తారకాబృందంబు లురలఁ
ధరణియుఁ జిట్టిపడఁ బటపట నడఁగ । సురగాధిపతి భీతి నొదుఁగుచు వడఁక
ననుపమ బ్రహ్మాస్త్ర మంతలో నేయఁ । బనిగొన భస్మమై పడియె నయ్యసుర.
అంత నుదంకుండు నఖిల దేవతలు । నెంతయు హర్షించి 'యెయ్యది నీకుఁ
గోరిక ? వేఁడుము గొబ్బున.' ననిన । నారయ నతఁడు దైత్యారి సఖ్యంబు
విప్రభక్తియు నిత్య వితరణశీల । మప్రయాసంబును నడిగిన నిచ్చి
సురలు వోవుటయు, నా క్షోణీశ్వరుండు । పురమున కేతెంచి పొగడొందె ; నిట్లు
ఆరయ నా కువలాశ్వుండు ధుంధు । మారుఁడైన విధంబు మనుజాధినాథ!"
అని చెప్పెననుటయు, 'నావలికథలు । ననఘాత్మ, చెప్పవే !' యని యడుగుటయు
*ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయ స్వరూప కాశ్యప గోత్రదీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్త్రి । మతి మద్విధేయ తిమ్మయ నామధేయ
రచితమైనట్టి యరణ్య పర్వమున । నుచితమై యాశ్వాస మొప్పె నేనవది.

---

* సోమన, తిమ్మయ పేరనే అతని గ్రంథమును పెంచి వ్రాసినాఁడు. ఈ విషయమును పర్వాంతమునఁ దెలిపినాఁడు.

# ఆఱవ యాశ్వాసము



శ్రీధారుణీశ, రాజిత కృపావేశ, । సాధిత దానవసంఘ, గోవింద,
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతర భారతకథ చెప్పఁ దొడఁగె.
ముని ధుంధుమారుని పుణ్యచారిత్ర । మనువొందఁ జెప్పిన, నా ధర్మరాజు
“తిరముగాఁ బుణ్యసతీ ప్రభావంబు । లరయంగఁ జెప్పవే!” యనిన నిట్లనియె:

## పుణ్యసతీ ప్రభావము

“కౌశికుం డనువాఁడు ఘనుఁ డొక్కమౌని । వాసికెక్కిన తపోవైభవాఢ్యుండు
ఒక యూరిచేరువ నొక వృక్షమూల । మకలంకగతిఁ జేరి యందున్న వేళఁ,
గడఁగి తదీయ శాఖాగ్రతంబగుచు । నుడుగకయుండిన యొక్క బకంబు
రెట్ట పైఁ బెట్టినఁ, బ్రియమేది యలిగి । నెట్టనఁ జూచిన నేలపైఁ బడియె.
పడి భస్మమైనను, భావంబులోనఁ । “దడయక నిర్నిమిత్తంబ యీ బకము
నీఱు చేసితి ; శాంతినెఱి నాఱిపోయె । నీరీతిఁ గటకటా! యేమి సేయుదును!”
అని చాల వగచి మధ్యాహ్నమౌటయును । జని పుణ్యనదిలోన స్నానంబు చేసి
వలనొప్ప నాహ్నిక వర్తనంబెల్ల । నలవడఁ గావించి యా గ్రామమందు
వెలయఁగ శుచులైన విప్రసద్మముల । నెలమితోడుత భిక్షమెత్తుచు నొక్క
సదనంబు వాకిటఁ జయ్యన నిలిచి । సదమలస్ఫూర్తి ‘భిక్షాందేహి’ యనిన,
నా యింటి వనిత పాయక పాత్రశోధ । నా యెడఁ జేసెడి యంతటిలోనఁ,
దనభర్త యాఁకటఁ దద్దయుఁ దూలి । చనుదెంచుటయుఁ, జూచి సంభ్రమం బొప్ప
నెదురేగి పాద్యంబునిచ్చి మజ్జనము । వదలక సేయించి వరుస నిష్టాన్న
ములు పెట్టి శయ్య నిమ్ముగఁ బన్నపఱచి । యలవడ నంత వీడ్యము సమర్పించి
చరణంబు లొత్తుచు సద్భక్తితోడ । నరయుచు నట భిక్షకై వచ్చియున్న
మునివర్యుఁ దలపోసి ముదముతో భిక్ష । గొని వచ్చుటయు, మౌని కోపమలిఁజూచి :
“అక్కటా! భిక్షకై యరుగుదెంచితిని ; । పొక్కుచు లేదన్నఁ బోవనె యేను!
అతివ, విచారింప కావల భర్త । కతిశయంబగు భక్తి నన్నపానములు

వలనుగాఁ బెట్టి యవజ్ఞ చేసితివి ; । మలసి చూడఁగ నిట్టి మదమేల నీకు."
అనుడుఁ బతివ్రత యమ్మౌనిఁ జూచి : । "అనఘాత్మ, నా భర్త యాఁకట నలసి
వచ్చినఁ దడవయ్యె, వలదు కోపంబు ; । క్రచ్చఱ యతుల కాగ్రహంబులు దగునె ?
నెలకొని కొక్కెర నీ చేత బ్రాగ్గె ! । నెలమితో నుతత మన నెఱుఁగనే నేను !
జగతిలోఁ గేవల స్వాధ్యాయపరుఁడ । వగు నీవు ధర్మంబు లంట నెఱుఁగవు గావె !
ఇల (లోన ధర్మంబు లెఱుఁగ) గంగ నీవు । వల తేని మిథిలలోపల [illegible]
పితృమాతృ భక్తుఁడు ప్రథుగుణోన్నతుఁడు । మతిమంతుఁ డనఘుఁ [illegible]ఁ డనఁగ
నొక కిరాతుఁడు గలఁ డోగి వానివల్ల । సకల ధర్మంబులు స[illegible] తెలియుఁగు."

### కౌశికుఁడను బ్రాహ్మణుఁడు ధర్మవ్యాధుని యొద్దకుఁ బోవుట

అనుచుఁ జెప్పిన విని యాశ్చర్యమంది । యనఘుఁ డా కౌశికుఁ డా పొత్తు వదలి
గ్రామముల్ నగరముల్ కాననంబులును । భూమి ననేకముల్ పొందుగాఁ గడచి,
మిథిలాపురముఁ జొచ్చి మెఱసి యా పుణ్యుఁ । డధికత నున్నట్టి యెడ విచారించి (?)
పురజనంబులచేతఁ బొందుగా నెఱిఁగి । సరవి ధర్మవ్యాధుఁ జయ్యనఁ గాంచి
యంగడి మాంసంబు లమ్ముచు నుండ । సంగతి నచటికిఁ జన రోసి తొలఁగి
యుండు నంతటిలోన, నుల్లంబునందు । మెండుగా విప్రుఁడమ్మెయి వచ్చుటెఱిఁగి
యతఁడున్నచోటికి నర్థితో వచ్చి । కుతలంబుపై మ్రొక్కి కుశలంబు లడిగి :
'అనఘ, పతివ్రత యట నా తెఱంగు । చనవొప్పఁ జెప్పినఁ జనుదెంచితీవు ;
నీ కోరి కెఱుఁగుదు నెమ్మితోడుతను । ఈ కడ నేల ? మా యింటికి రమ్ము.'
అని తోడుకొనిపోయి యతనిఁ బూజించి । తనరఁగ నిష్టకథాగోష్ఠి నుండ
నంతలోఁ గౌశికుఁ డట్టి పుణ్యాత్ము । నెంతయుఁ గనుఁగొని యిట్లని పలికె :
'వినవయ్య కడుధర్మ విదుఁడవు నీవు । నెనసిన మతితోడ నీ జీవహింస -
జీవనంబున నుంట శిష్టమార్గంబె ? । కావున నీ ఘోరకర్మంబు చూచి
మనసు దుఃఖితమయ్యె మహితపుణ్యాత్మ !' । అనుటయు లుబ్ధకుఁ డతని కిట్లనియె :
"జగతి విప్రులకును సత్కర్మములును, । దగ భూమిపతులకు దండనీతియును,
వాణిజులకుఁ గృషి వాణిజ్యములును, । క్షోణి శుశ్రూషయు శూద్రవర్యులకుఁ
బరమ ధర్మంబులై పరఁగిన యట్లు । చిరమతి మృగయోపజీవనం బెపుడు

మాకును ధర్మంబు ; మఱి యదిగాక । యేక శాసనముగా నిలయేలు రాజు
జనకుఁడన్ వాఁడు వంశ ప్రవర్తనము । చెనసి ధర్మంబుగాఁ జేయుక యున్నఁ
దన పుత్రునైనను దండించు నిజము ; । ఎనయంగ నదిగాన నిట్లుండవలసె.
ఎలమితోడుత జీవహింస యెన్నఁడును । దలఁపనే ; నొరులు తక్కయుఁ జంపి తెచ్చి
యిచ్చిన మాంసంబు లిట వెలకమ్మి । చెచ్చెఱ బ్రదుకుదు సిద్ధ మీ పలుకు.
గురువుల వృద్ధులఁ గోరి పూజింతు ; । సరవితో సత్యశౌచంబు లేమఱను ;
పరనింద సేయను ; బంధువర్గముల । నరయుదు ; నిందయు నభిసంస్తుతియును
జగతిలోపల విను సమము నా కనఘ ! । ... ... ... ... ...
ఉరవడిఁ బుణ్యవ్రతోపవాసములఁ । జరియింతు ; నీ రస చెందదు నన్ను ; (?)
పరికింపఁగా నేక పత్నీ వ్రతుఁడను ; । గరిమతోడుత ఋతుకాల రతుండ
సరవిఁ బ్రసంగవశంబున నింత । చిరమతి నీకును జెప్పంగ వలసె.
పొలుపొంద ధర్మ ప్రబోధనార్థంబు । అలవడ నా యొద్ద కరుగుదెంచితివి.
కావున ధర్మంబు కడముట్ట నీకు । వావిరి నెఱిఁగింతు వరబుద్ధి వినుము.
తన కుల ధర్మంబు తప్పక నడచి । ఘనమైన సైరణ గలుగంగవలయు ;
సత్యహితాలాప సరణి యర్థ్వంబు ; । నిత్యంబునందు ననిత్యంబునందుఁ
బ్రియముల యందు నప్రియముల యందు । జయబుద్ధి*; దైన్య హర్షంబులు వలదు ;
పాతకంబులకెల్లఁ బరఁగంగ నధిక । పాతకంబులు లోభభరిత మోహములు
కృతమతి రెంటిని గెలిచినవాఁడు । ప్రతిమీఱ నెంతయుఁ బరమధార్మికుఁడు.
సావధానత శిష్టచరితముల్ గాని । త్రోవలు కొన్ని బంధురలీలఁగలవు ;
తనరంగఁ దృణ సంవృతములైన యట్టి । ఘనకూపములఁ బోలుఁ గపట ధర్మములు;
వాని దూరంబున వర్జింపవలయుఁ; । బూని శిష్టాచారమునఁ బోవవలయు.

## ధర్మవ్యాధుఁడు కౌశికునకు నహింసా స్వరూపము చెప్పుట

ననిచిన నావర్తనము చూచి నీవు । ఘనహింస యిది యని కడఁగి పల్కితివి ;
ఎలమి హింసాహింస లిట విభజింప । వలనొప్ప నెవ్వరి వశమయ్యె చెపుమ ?
మున్ను చేసిన కర్మమునఁ దా నశించు । మిన్నక వాఁడు నిమిత్తమాత్రంబు ;

* 'ఉండవలయు' అను క్రియ అధ్యాహార్యము.

ఫల (మూల కంద) ముల్ బహుమృగావళులు । వెలయ భక్ష్యములుగావించెనా(బహ్మ-
ఘానరంగ రంతిదేవుండను రాజు । అనయంబు రెండు వేలావుల దినముఁ
జంపుచు నట వేయిసంవత్సరములు । పెంపుతో డ మఖంబుఁ బృథివిలోఁ జేసి
(ఖ్యాతి మీఱఁగ దివిక) రిగెనో లేదో ? । భూతలంబున నిట్టి భూరికర్మములు
చేసిన దోషంబు చెందదు వినుము । వేసార." కని పెక్కు విధములఁ జెప్పి
"పరఁగఁ బతివ్రత పనుపునఁ జేసి । చిరమతి నన్నియుఁ జెప్పితిఁ గాని
పెనుపొంద నీ మీఁదఁ (బేమ లేశంబు । మనమున లేదు నాకును వినవయ్య!
అది యెట్టులంటేని నతివృద్ధులగుచు । విదితంబుగాఁగ నీవే దిక్కుధాత్రి
ననియున్న తల్లిని నల జనకునిని । ననయంబు విడిచి వారి యనుజ్ఞలేక ( ? )
యిటు చరించెదవు ; వా రిల నీకుఁగాఁగఁ । గటకటా ! దుఃఖించి కన్నులువోయి
యున్నవా ; రింకనైన నొప్పుగా వారి । మన్నించి శోకంబు మానుపవయ్య !"
అనవుడు విస్మయమంది కౌశికుఁడు : । "అనఘాత్మ, నీకు దివ్యజ్ఞాన మెట్లు
కలిగె ? నివ్విధము తక్కక చెప్పు" మనిన । నలవడ నాతఁ డభ్యంతరమునకుఁ
గౌశికుఁ గొనిపోయి కనక పర్యంక । భాసుర భూషణాంబర గంధ మాల్య

## ధర్మవ్యాధుని పూర్వజన్మ వృత్తాంతము

ధరులైన తన తల్లిదండ్రులఁజూపి : । "విరివిగా వీరి సేవించిన కతనఁ
బరమ దివ్యజ్ఞాన భరితుండనైతి. । సరవితోడుతఁ బూర్వజన్మంబునందు
విప్రుండనై పుట్టి వేదంబు లెఱిఁగి । యప్రయాసంబున నవనిలో మించి
పొలుపొంద నొకరాజపుత్రునితోడఁ । జెలిమిసేయుచుఁ గడు శ్రీవిలసిల్ల
విరివిగా నటు ధనుర్వేదంబు నెఱిఁగి । గరిమతో వేట మార్గంబున నతని
వెంటనె చనిచని విపినంబు చొచ్చి । గెంటక మృగముల గీ టడంపుచును
వెనుకొని తృణలతావృతుఁడైన యొక్క । మునివరు నేసి యమ్మౌని యాలకించి
యతని డగ్గఱఁ బోయి : "యనఘాత్మ,నిన్ను । మతినెఱుంగక యిట్లు మార్గణావిద్ధుఁ
జేసితి క్షమియింపు చేపట్టు నన్ను । వాసిగా శపియింపవల." దన్న నతఁడు
"బ్రాహ్మణకులమునఁ బరఁగంగఁ బుట్టి । బ్రహ్మవేత్తవుగాక బాణంబులెఱిఁగి
చరియింపనగునె నిషాదకర్మమున ? । అరయ నిషాదుండవై పుట్టు." మనుచు
శపియించె నన్ను నో సంయమిప్రవర ! । ... ... ... ...

అపరజన్మంబున నగుదు విప్రుఁడను । ...     ...     ...     ...
తనరంగ బాణంబు దాఁకినయట్టి । ముని నొయ్యఁ గొనివచ్చి మునుకొని యతని
కలితాశ్రమంబునఁ గడఁకతో నిలిపి । నలి నొవ్వకుండ బాణంబును బెఱికి
యరయుచు నుండంగ, నంత నమ్మౌని । వరమతి నాపుణ్యవశమున బ్రతికె. ”
అనవుడుఁ గౌశికుఁ డన్నియుఁ దెలిసి । యనిపించుకొనిపోయె నావాసమునకు.”
అనుచు మార్కండేయుఁ డాధర్మజునకుఁ । బెనుపొందఁ జెప్పినఁ బ్రియమంది యతఁడు:
“ అనఘాత్మ, యగ్ని తానర్థిమైఁ దొల్లి । ఘన తపంబొనరింపఁ గడఁగినవిధము
నంగిరసుం డగ్ని యైనట్టి విధము । సంగతి నెఱిఁగింపు సంయమిప్రవర !”
అనిన మార్కండేయుఁ డాధర్మరాజుఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప :

## అంగిరసుఁడగ్నియైన తెఱఁగు

“ అనఘాత్మ, వినవయ్య యగ్ని దేవుండు । అనిమిషపతితోడ నలిగి హవ్యములు
వహియింప నొల్లక వనమున కరిగి । బహుకాల మతులతపంబు చేయుచును
దనలోన నిట్లని తలఁచె “ నేనేల । వనమున కీరీతి వచ్చితి ! నింక
నొనర నాపదమందు నొక్కని నిలిపి । వనజగర్భుఁడు సేయవలయుఁ గార్యములు ;
పరఁగఁ దపముచాలుఁ బదివేలు వచ్చె । మరలెద.” నని వచ్చి మఱి దనపదవి
నంగిరసుండుండ, నతని నీక్షించి । యంగద నధిక భయంబునఁ బొంది
మగిడిపోయినఁ జూచి మఱి యంగిరసుఁడు । నగణితంబుగఁ బిల్చి యగ్ని కిట్లనియె :
“ వినుము వైశ్వానర, విధి నన్ను నిచట । నెనయ నియోగించె ; నిప్పుడు నీవు
చనుదెంచితివిగాన సంతోషమయ్యె ; । తనర నీ కాణాచి దక్కెనె నాకు ?
పనిగొని నీవు నీపదముఁ గైకొనుము.” । అనుడు నంగిరసున కనియె నా యగ్ని :
“ విను నాదుకీర్తి యీ విశ్వంబులోనఁ । బొనుగు వడియెను ; నిప్పుడు ప్రథమాగ్ని
వై యుండు నే ద్వితీయాగ్ని నయ్యెదను । ఈ యెడ.” ననవుడు “నిట్లనఁ దగునె !
ధరణిలో నీ కగ్ర తనయుండనగుచు । నురవడి మెఱయుదు నున్నతస్ఫూర్తి.”
అని పల్క నగ్నియు నంగిరసాఖ్యుఁ । దనరంగఁ దన కగ్రతనయుఁ గావించె.
అంతటిలోన నయ్యంగిరసునకు । నెంతయు శివయను నింతికిఁ బ్రేమ
మొనర బృహత్కీర్తియును బృహజ్జ్యోతి । యును బృహన్మంత్రుఁడు నును బృహన్మనసుఁ

డును బృహద్బ్రహ్మయును బృహద్భాసు । ... ... ... ... ...
డును బృహస్పతియు నేడ్గురు తనూభవులు । ఘన మహామతియు రాకయు సినీవాలి
యును గుహువును మతియును మహిష్మతియు । నును నర్చియన నేడ్గురుదయించిరంత.
సరి బృహస్పతికిని శంయుఁడు పుట్టి । యరయంగ మును హవిష్యాజ్యముల్ గొనియె.
ఆ శంయునకు సత్యకట భరద్వాజుఁ । డానతో భరతుండు నటు పుట్టె; మఱియు
... ... ... ... ... । ... ... ... ... ...
వరుస నాపుండను వహ్ని యంతటను । అరయ నద్భుత నాముఁడను వానిఁ గాంచె;
అతఁ డధర్వునిఁ గని "యమరులకెల్ల । ధృతి హవ్యములు మోచి తెలివితో నిమ్మ
పనివడి యేను దుర్బలుఁడ నీ లేను." । అని చెప్పి జలధిలో నణఁగి యుండుటయు
ననిమిషు ల్గానక యరయుచు నున్నఁ, । జెనసి మీనంబులు చెప్పెఁ; జెప్పుటయు
ననలుఁడు కోపించి యట మీలఁ జూచి । "జనములు దయలేక చంపంగఁ గలరు."
అనుచు శాపంబిచ్చె; నమరులు దన్ను । వినుతించి యెంతయు వేఁడినఁ గొనక
తన మేను విడిచియు ధారుణీతలము । ఘనతఁ బ్రవేశించెఁ; గాయంబువలన
... ... ... అస్థుల వలన । దేవదారువు, మఱి తెలియ శ్లేష్మమునఁ
బటికంబు, మఱియు నబ్బంగి నభ్రకముఁ । బటు మరకతముఁ బ్రవాళంబుఁ గృష్ణ-
శిలయుఁగా నీ రీతిఁ జెచ్చెలఁ బుట్టె; । తలకొని యతఁడును దపము గావించె.
... ... ... ... ... । ... ... ... ... ...
అంత నధర్వాగ్ని యఖిలదేవతలు । నంతకంతకుఁ దృప్తులై యుండఁ జేసి
వర్తింప, నయ్యగ్ని వారిధి వెడలి । మూర్తితోఁ జనుదెంచి మొదలిరీతుండె."
అనుచు నగ్నుల విధమంతయుఁ జెప్ప । విని సంతసిల్లి భూవిభుఁ డిట్టులనియె:
"మునినాథ, సేనాని మొగిఁ గృత్తికలకు । ననలునకును బురహరునకు నేమి
కతమున సుతుఁడయ్యెఁ? గడఁగి యీ విధము । నతులితంబుగఁ జెప్పు." మనిననిట్లనియె:
"తొల్లి యింద్రుండు దైత్యులతోడ రణము । బల్లిదుఁడై చేసి పరఁగంగ నోడి
యమరులతో మానసాద్రికిఁ బోయి । యమరసేనాపతి నరయుచు నుండ
నంతలో నొకయింతి 'యనఘాత్ములార ! । మంతనంబున నన్ను మన్నింపరయ్య !
ఎనయంగ రాక్షసుఁ డెత్తుక నన్ను । గొనిపోవుచున్నాఁడు కుటిలుఁడై యిపుడు.'
అనుటయు నా మాట లాలించి యింద్రుఁ । డనయంబు దంభోళిహస్తుఁడై పోయి
ఘన గదాహస్తుఁడై గగనంబునందుఁ । జనియెడు వాని నుజ్జ్వల సత్త్వవంతుఁ

గేళిదానవుఁ జూచి కెరలి 'పాపాత్మ! । యీ సతి విడుమింక నెందుఁ బోవచ్చు?
పోయినఁ బోనీను బొరిగొందు నిన్ను । నేయెడ.' ననుటయు నేచి కోపించి
గదగొని వైవ, సంక్రందనుఁ డసుర । వదలక ఖండింప, వాఁడు వెండియును
వడిగొని గిరివైవ, వజ్రంబు చేతఁ । గడికండలుగఁ జేసి కడఁగిన, నసుర
తలఁకి యత్తరుణి నంతట దిగవైచి । యెలమితోఁ బాఱిపోయిన, నింద్రుఁడంత
వనితఁ జేరఁగఁబోయి వలనొప్పఁ బలికె: । 'వనజదళాక్షి, యెవ్వరిదాన వీవు?
ఈ రాక్షసునిచేత నెట్లు చిక్కితివి? । ఏ రీతి నీ తెఱం గెఱిఁగింపు.' మనిన
'నెలవుతోడ నరిష్టనేమి యనఁ బరఁగు । నిలఁ బ్రజాపతిసుత నే దేవసేనఁ;
దలకొన్న చెలియల దైత్యసేనకును; । నెలకొని మాయప్ప నేనును గూడి
యి మ్మానసాద్రిపై నెలమి నుండంగ । నమ్మతిఁజేసి రాక్షసుఁడేఁగుదెంచి
వేడుక చేతల వివిధరీతులను । గూడియాడుచు నుండి కూరిమి వెలయ
నలవడ నా యక్క నా దైత్యసేన । నెలయించుకొని పోయి యేపుతో మఱియు
నను నింతచేసె; నున్నతి భవత్కరుణ । ననయంబుఁ గాచితి.' వనిన నింద్రుండు
'మీ తల్లి మాతల్లి మెఱసి యాదక్షు । కూఁతులు గావునఁ గుసుమసుగంధి!
యనుజవైతివి గాన నడుగుము వరము.' । అనిన సంతోషించి యా దేవసేన
'వినవయ్య, మాతండ్రి వెన నొక్కనాఁడు । నను నుపలాలించి 'నాతి, నీ విభుఁడు
పౌరుష ధనుఁ' డని పలికె మోదించి; । యా రీతి వానిని నరయంగ వలయు.'
అనవుడు దేవేంద్రుఁ డామెఁ గైకొనుచు । వనజజు కడ కేఁగి 'వనితకు వరుని
దయచేయు' మనవుడు ధాతయిట్లనియె: । 'జయశాలి లోకరక్షణ ధురీణుండు
వెలయుంగ దీనికి విభుఁడు కాఁగలఁడు; । తలకొని నీ యాపదలు పాపునతఁడు.'
అనిన సంతోషించి యాఖండలుండు । చనియె నంతట నిజ సదనంబునకును.
రమణతోఁ దదనంతరంబ సప్తర్షు । లమర నమావాస్యనాఁడు హోమంబు (?)
చేయ నాహుతులుచెచ్చెఱఁ గొని యగ్ని । యాయెడ సురలకు నందిచ్చె; నంత
మునితతిభార్య లిమ్ములఁ దీర్థమాడి । ఘన భూషణాదులు కరమర్థిఁ బూని
పతులకుఁ బరిచర్య పరువడిఁ జేయ । వితతంబుగా వారి వీక్షించి యగ్ని
కడుమోదమున వారిఁ గవియంగలేక । యడవికిఁ బోయి దేహత్యాగ మతఁడు
చేసెదనని తన చిత్తంబులోన । ... ... జూచు నంతటిలోన,
నావిధంబెల్ల స్వాహాదేవి యెఱిఁగి । భావించి యా మునిభార్యలలోన

నంగిరసుని భార్యయై చనుదెంచి । యంగనఁ జింతించు నయ్యగ్నిఁ గాంచి :
'ఏనును నాతోడియింతులు నిన్నుఁ । బూని కామించి యెప్పుడు నుందు మనఘ !
వారలంపిన నేను వచ్చితి నిటకు । మారుని రతికేళి మన్నింపు నన్ను.'

## కుమారస్వామి యవతారము

అనవుడు శివయని యాత్మలోఁ దలఁచి । గొనకొన్న కూరిమి కొనలు సాగంగఁ
గలసిన, వీర్యంబు కడఁక ధరించి । కలిత వేషంబున గ్రక్కునఁ బోయి
శ్వేతాద్రియందుఁ జెచ్చెఱ నొక్కయెడను । జాతురి శరవణ సంవృతంబైన
కనక కుండమున శుక్లము సంగ్రహించి । మునుకొని మఱియును మునిసతిరూప
ములు ధరియించి యిమ్ముల వచ్చి యటకు । నలవడ విభుని వీర్యముఁ గొనిపోయి
యాకుండమునఁ బెట్టి యరుదెంచె ; నిట్లు । ఘాకతో నార్వురదాఁక నీ రీతిఁ
దిరిగి యరుంధతీదేవి రూపంబు । నిరతియై ధరియింప నేరకపోయె.
అలవడ నంత నయ్యగ్ని తేజమున । నెల (కొనియా) దిత్యనిభుఁడు షణ్ముఖుఁడు
ద్వాదశ బాహుఁ డుద్ధతుఁడునై యపుడు । నాదట జనియించి యా గిరియందు
హరునిచాపముఁ జూచి హరురూప మనెడి । పరుసున నుండినఁ బటుగతిఁ దాల్చి
యట్టహాసముచేసి యార్వ, లోకములు । నెట్టనఁ గంపించె నృపవర్య, వినుము.

... ... ... । ... ... ...

అంతటఁ జైత్రరథావాసులగుచు । సంతోషమున నున్న జనులందుఁ గూడి
'పొనర నంగిరసాది మునుల భార్యలకు । ననలంబునకుఁ బుట్టినతఁ డింతచేసె.'
నని యిట్లు వలుకంగ నందు వశిష్ఠ । ముని తక్కఁ దక్కినముని పతులెల్లఁ
దమతమ సతుల నంతట విడుచుటయుఁ, । గొమరొప్ప మఱియును గొందఱు జనులు
'ఇన్నిపోకలఁ బోయె నీవహ్ని భార్య । చెన్నుగా వీరేమి సేయుదురకట !'
అనుచుండ నంతలో నాయగ్ని భార్య । చనుదెంచి : 'వినుఁడు నిజంబు వల్కెదను;
అనలంబునకు నాకు నటఁ బుట్టినాఁడు ; । ... కులస్త్రీల విడువంగఁ దగునె !'
అని యెంతచెప్పిన నమ్మునీశ్వరులు । ననయంబు నొడఁబడరై ; రంతలోనఁ
బుడమి విశ్వామిత్రముని కుమారకుని । కడకు నేతెంచి వేడ్కలఁ బ్రస్తుతించి
సరవితో నాతని సమ్మతి వలన । నరయఁ (గ జాత క) ర్మాదు లొనర్చె.
అంత దేవతలెల్ల నమరేంద్రుఁ గాంచి । యెంతయు భక్తితో నిట్లని రపుడు :

" అనలాత్మజుఁడు గర్వియై నీ పదంబు । గొన నున్నవాఁ డతిక్రూరత మెఱసి ;
యట వానిఁ జంపి రమ్మాశ్లిన నీకుఁ । దటుకున నింద్రపదంబు చేకూరు ;
బ్రతుకుదు మేము నిప్పాట. " నావుడును । శతమఖుఁడును సంత సప్తమాతృకలఁ
బిలిచి : 'యీవహ్నిజుఁ బృథివిపైఁ గూల్చి । యలవడ రం' డని యనిచిన, వారు
చనుదెంచి యతని విస్తారతేజమున । కనయంబు వెఱచి చయ్యన శరణంబు
సొచ్చి యిట్లనిరి : "యో సుకుమార, వినుము । మచ్చికతో లోకమాతల మేము ;
మాయందు నీవును మాతృభావమున । ... ... ... ... ...
... ... ... ... ... । ఎసకంబుగా నగ్ని లెంతయు వెడలి
సురల మూఁకలఁగాల్ప, స్రుక్కి దేవతలు : । " కరమొప్పనీదు కింకరులము మేము ;
సరవితో రక్షింపు శరణుచొచ్చితిమి । యరయంగ. " నని పల్క నంతలో వజ్ర
కులిశంబుగొనివైవఁ గొనకొని యతని । వెలయు దక్షిణపార్శ్వ వీథిఁ దాఁకినను,
అందొక్కపురుషుఁ డాయతశక్తిధరుఁడు । పొందుగా నట మేషముఖుఁడు విశాఖుఁ
డనువాఁడు ప్రభవించె ; నదిగాక మఱియు । మనమొప్పఁ గన్యాకుమార గణంబు
లధికంబుగాఁ బుట్ట నవియెల్లఁజూచి । యధికభయంబున నమరవల్లభుఁడు
శర ణని కొలిచిన, సకల సన్మునులు । శరవణభవుఁ జూచి సరవిఁబూజింప
... ... ... ... । ... ... ...
'సేనాధిపతి నాదుఁ జెలువొంద మీకుఁ । బూనిక' నవవు డుపొంగి దేవతలు
దుందుభి పటహాది తూర్యముల్ మ్రోయఁ । బొందుగా జయశబ్దములు మీఱఁ గల్ప
తరుపుష్పవృష్టి యెంతయుఁ గురియంగఁ । గరమొప్పఁ బట్టంబు గట్టిరి ప్రీతి.
అంత మహాదేవుఁ డమరవందితుఁడు । కంతుసంహారుండు కాలకంధరుఁడు
మును తన తేజంబు మొగి వహ్నియందు । నునిచిన కతన మహోల్లాసి యగుచు
నరుదెంచి గుహునిఁ జయ్యనఁ గౌఁగిలించి । పరమ సంప్రీతితోఁ బరికింపుచుండె.
పరఁగ నింద్రుఁడు నబ్జభవ నియోగమునఁ । బరువడి రక్షింపఁబడునట్టి దేవ
సేన నంబుజగంధిఁ జెలువ నా ప్రొద్దె । పూని శృంగారింపఁబుచ్చి వేడుకను
బాహులేయునకును బాణిపీడనము । బాహుళ్యముగఁ జేసె భయభక్తులెసఁగ.
ఆ దేవసేనఁ బెండ్లాడిన దినము । ఆదరంబున షష్ఠియై యున్నకతనఁ
భ్రాజనీయంబయి భువనాంతరముల । నోజతోఁ బెంపొందె నుర్వీశ తిలక !

నెసఁ దమపతులచే విడువంగఁ బడిన । కుసుమ కోమలు లారుగురు నరుదెంచి
యాకుమారునిఁజూచి :" యతులపుణ్యాత్మ, । మాకొక్క-నిందయిమ్ము లవచ్చెవినుము;
అంటిన హవ్యవాహానునకు నిన్ను । గంటి మేమని పతుల్ గడువడి విడిచి ;
రదిగాన మాకు నీవనఘ, పుత్త్రుఁడవు ; । పొదలంగ మమ్మును బ్రోవ నర్హుఁడవు. "
అనవుడుఁ గరుణించి యమరేంద్రుఁజూచి । " యొనరంగ వీరికి నొక్క-పథంబు
నరసి నిల్పఁగవలె. " ననిన నింద్రుండు । " నిరవొందఁ జంద్రుని యింతులలోన
రోహిణి పొరుగున రుచినభిజిత్తు । దేహసౌందర్య సుస్థితి పెంపుమీఱ
నందఱికంటె నత్యధికతఁ బరఁగి । చందురునకు నాదు జగమెల్ల మెచ్చ "
నని తపంబునకేఁగె ; నాపదంబిప్పు । డొనరంగ రిత్తయై యున్నది ; గాన
వీరి నిల్పెద. " నని పేకుకొల్పుటయు । వారు నప్పదమున వసియించి. రంత
నీశుండు దేవతలెల్లను గొలువ । నాశయ్యు గుహుఁ గొని యటభద్రవటముఁ
జేరి కుమారునిఁ జెచ్చెఱఁ జూచి : । "చారుతరస్ఫూర్తి సప్తమంబగుచు
ఘనమైన మారుత స్కంధంబునకును । గొనకొన్న పతివియై కూర్మి దేవతల
యాపదల్ (తొలఁగింపు). " మని కౌఁగిలించి । యాపజ్జ వీట్కొల్ప నంతటిలోన
మహిషాసురుండు శుంభచ్ఛౌర్యమెసఁగ । బహుదైత్య రాక్షస బలములు గొలువఁ
జనుదెంచి సురలపై సకలాస్త్రవృష్టి । ఘనముగాఁ గురిసినఁ, గనలి దేవతలు
ప్రతి సాయకములేసి భంజించి యార్వ । నతిఘోర రణమయ్యె ; నంతటిలోన
నమరులకోడి యయ్యసురులు వాఱఁ । గొమరొప్పఁ గనుఁగొని కోపించి యార్చి
మహిషాసురుండొక మహితశైలంబు । బహుభీతిఁ బెఱికి చేపట్టి చెచ్చెఱను ( ? )
సురలపై వైచిన, స్రుక్కి- దేవతలు । ధరణిపై జదిసిరి దళసహస్రములు.
అంతట భయమంది యమర వల్లభుఁడు । నెంతయు వడఁకంగ, నిటదైత్యవిభుఁడు
శివుని రథంబుఁ జెచ్చెఱఁ జేతఁ బట్టి । తివిచిన నదిచిక్కె- దితిజునిచేత.
' తెగుహారం ' దని చూచి తెలిసి రాక్షసులు । తగనార్చి కవియంగ, దర్పసంహారుఁడు
తనపుత్త్రు గుహుఁజూచి " దైత్యుండుమించెఁ ; । దునుమాడు వీనినుద్ధురవృత్తి. " ననిన

## కుమారస్వామి మహిషాసురుఁజంపుట

నాతఁడు రథమెక్కి- యార్చి శీఘ్రమున । నాతతంబగు శక్తి నసురపై వైవ,
నది ధగధగ యను నంతరిక్షమునఁ । ద్రిదశులుహర్షింప దితిజులు వెఱవఁ

ప్రళయవేళాదిత్య పరివేష ఘోర । వలయాగ్ని శిఖలు వెల్వడ వేగ వచ్చి
యసుర భస్మముచేసె ; నంత దేవతలు । కుసుమ వర్షంబులు గురిసిరి ప్రీతి.
హరుఁడు కౌఁగిటఁ జేర్చి యాత్మసంభవునిఁ । బరి పరి విధములఁ బ్రస్తుతిచేసి
సురలఁ గనుంగొని : "సురలార, మీ । శిరోవాద నాకూడ నెటువంటి భక్తి
యారీతి భక్తి నీయనఘు సేవించి । కామార్థి వెలయుఁడీ." యని యొప్పగించి
వరుస నెప్పటి భద్రవటమున కరిగె ; । సురలును బోయిరి సొరిది నిండ్లకును.
ఈ పుణ్యచారిత్ర మెవ్వరు వినినఁ । బాపంబు లణఁగు వైభవములు కలుగు."
అనుచు మార్కండేయుఁ డా ధర్మజునకుఁ । దనరంగఁ బుణ్యకథలు చెప్పుచోట
మునుమిడి యేకాంతమున సత్యభామ । తనకు నెచ్చెలియైన ద్రౌపదిఁ జూచి :
" అమ్మ, యేగురు కాంతు లతిధురంధరులు । సమ్మతిఁ దమలోన జగడంబు మాని
నినుబట్టి యున్నారు నిత్య యౌవనులు.* ।

*ఈ తరువాయి కథాభాగమునకు తిమ్మయరచన చూచునది.

# సప్తమాశ్వాసము

## అనుబంధము



శ్రీనాథ, కేశవ, సృష్టిసంరక్ష, । సూనాస్త్రజనక, భాసుర పద్మనాభ !
జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁ దొడఁగె :
" ఈరీతిఁ బాండవు లేపు దీపించి । యారూఢి సింధు దేశాధీశుఁడైన
సైంధవుఁ జంపక సరవితోఁ గాచి । బంధుత్వ మేర్పడఁ బరువడి ననుప,
నట నూరి కరుగక యా జయద్రథుఁడు । నిటలలోచనుఁ గూర్చి నిష్ఠతోఁ దపము
బహుకాలములుచేసి ప్రత్యక్షమైన । తుహినాంశుశేఖరుతో నిట్టులనియె:
" దురములోఁ బాండుపుత్రులఁ జంపులావు । వరముగా నీవె యీశ్వర! నాకు"ననిన,
" ఈరాదు వారిలో నిద్రనందనుని । ఘోరాజిగెల్వ నాకును గాకపోయె ;
భీముఁ డాతనికంటె బిరుదు యుద్ధమున ; । ఆ మాద్రితనయులు నంతటివారు.
అట్టేల వరము నీవడిగితిఁగాన । నెట్టన నిచ్చెద నీవు గాదనకు ;
వాసవిఁ బాసినవారిలో నీకు । నోసరింపక యిత్తు నొకనాఁటి జయము."
అని శూలి వరమిచ్చి యనిచిన వెనుక । తనయూరి కేతెంచి దైన్యంబు మానె.
అంత మార్కండేయుఁ డాధర్మరాజు । నెంతయుఁ జూడఁగ నేపుతోడుతను
జనుదెంచుటయు, సతీసహితంబుగాఁగ । నెనయంగ భక్తితో నెదురేఁగి మ్రొక్కి-
పూజావిధానమి *(మ్ములఁజేసి యంత । రాజచంద్రుఁడు) మునిరాజు కిట్లనియె :
" మునినాథ, యీ దుఃఖమునఁ గానలోనఁ । దన సతీయుక్తుఁడై ధర నెవ్వఁడైనఁ
జరియించెనే ? పుణ్యచరిత ! " నావుడును । బరమపుణ్యుఁడు ముని పలికె నెంతయును:
" ధైర్య ( ంబె యెల్లయర్థముల సాధించు । ధైర్యం ) బు లేక యెంతయు వగచెదవు.
తొల్లి కాఱడవిలో దొరఁకొన్న వగల । బల్లిదుఁడగు రఘుపతి యింతితోడ
నెంతదుఃఖమునొందె! నె (టు తపియించెఁ ! । గాంతారములలోన గణుతి) ంపఁగలవె!"
అనవుడు విస్మితుఁడై ధర్మరాజు : । " అనఘాత్మ, రఘురాము నతులవర్తనము
విన వేడుకయ్యెడు వినిపింపు." మనిన । ఘనమైన ప్రీ (తి మార్కండేయుఁడనియె:)

* ఇటనుండి కొంతభాగము క్రిమిదష్టము. కుండలీకృతభాగములు క్రొత్తగా కూర్పఁబడినవి.

## శ్రీరామ చరిత్రము

“ వసుధేశ, యిక్ష్వాకు వంశంబునందుఁ । బొసఁగ నజుండను పుణ్యమానసుఁడు
జనియించి దశరథ జనపాలుఁ గనియె : । తనరఁ బుణ్యుండైన దశరథేశ్వరుఁడు
నరవితో మువ్వుర సతులఁ బెండ్లాడి । యర( యఁ గౌసల్యకు నలరామ ) భద్రు
వీరుఁ గైకకు భరతువేడ్క సుమిత్రకును ( ? ) । సారస్యు లక్ష్మణు శత్రుఘ్నుఁ గనియె ( ? )
జనకపుత్రిక సీత సారసనేత్ర । యనఘాత్మ, రఘురాము నంగనయయ్యె.
ఇంక రావణుజన్మ మెఱిఁగింతు వినుము ; । పంకజాసనునకుఁ బరఁగఁ బులస్త్యుఁ
డుదయించె ; నతనికి నొప్పు మీఱంగ । సదమలస్ఫూర్తి వైశ్రవణుండు పుట్టి
యుడరంగఁ దమతండ్రి యైన పులస్త్యు । విడిచి తానైన యా విధిఁగూర్చి తపము
చేసి మెప్పించి సుస్థిరవైభవమున । వాసిగా దిక్పతిత్వము ధనేశత్వ
మలవడఁగా లంక యనెడు పట్టణముఁ । గలయ నీశ్వరునిసఖ్యము వెండి పసిఁడి
ఘనమైన సంపద గలిగివర్తింపఁ, । గనలి పులస్త్యుండు కడువడి నంతఁ
దనశరీరమున నర్ధంబన ధాత్రి । ఘను విశ్రవసుఁ డనఁగా నొక్కమానిఁ
గలిగించి యిట్లనుఁ గడఁకదీపింప : । “ వలనొప్ప నా వైశ్రవణు కహితంబు
సేయుము నీ.” వని చెచ్చెఱ ననుప । నాయెడ నాతఁడు నంతయు నెఱిఁగి
తూ విశ్రవసుపాలి కరుదెంచి మ్రొక్కి : । “ యో విమలాత్మక, యో పుణ్యమూర్తి!
సుతుఁడనయ్యెద నీకు సొరిది రక్షింపు । చతురత.” నని ముని సంప్రీతుఁ జేసి
తగ నృత్తగీత విద్యా విశారదల । మొగి రాక్షసస్త్రీల మువ్వుర నంత
వరుసఁ బుష్పోత్కట పాకమాలినులఁ । గరమర్థిఁ బరిచారికలఁగాఁగ నిచ్చె.
ఇచ్చిన సతులు మునీంద్రు నిత్యంబు । మచ్చిక సేవింప మానీంద్రు కృపను
అనఘు, పుష్పోత్కట యనుసింతి రావ । ణుని మఱి కుంభకర్ణునిఁ గాంచె వినుము ;
మాలిని యనియెడి మదిరాయతాక్షి । పోల విభీషణుఁ బుత్త్రుఁగాఁ గనియె ;
పాక ఖరుండనువాని శూర్పణఖఁ । బ్రాకటంబుగఁ గనెఁ బార్థివోత్తంస !
క్రూరులై రావణ కుంభ కర్ణులును । వారక ఖరుఁడును వనితశూర్పణఖ
వర్తిల్లి ; రంత నుర్వర విభీషణుఁడు । వార్త కెక్కుచుఁ బుణ్యవర్తన మెలఁగె.
అంత విశ్రవసుని యాత్మ సంభవులు । నెంతయుఁ బెంపొంది, యిట నొక్కనాఁడు

విశ్రవసున కుర్వి వేడ్క మ్రొక్కంగ । వైశ్రవణుఁడు కడు వైభవంబెసఁగఁ
జనుదెంచుటయు వానిఁ జయ్యనఁ జూచి । మనమార నోర్వక మాత్సర్యమునను

## రావణ కుంభకర్ణులు తపము సేయుట

"ఘనమైన తపమునఁ గాదె ! వీఁడిట్టి । ఘనతరైశ్వర్య సంకలితుఁడై మించె ;
పొలుపొంద మనమునుఁ బోయి (తపమ్ము । వలనొప్పఁ) జేయఁగ వలె;" నని తలఁచి.
రరయ వేసవినిఁ బంచాగ్ని మధ్యమున, । వరబుద్ధితోడుత వాన కాలమునఁ
జలమున, బైటను జలికాలమందుఁ । జలము తోడుత, నిట్టి చందంబుగాఁగ
... ... ... తపము । నలవడఁగా వాయు వాహారముగను
జేయుచు నంతఁ జెచ్చెర రావణుండు । వేయి వర్షములకు వెలయ నొక్కొకటి
గాఁగ శిరంబులు ఖండించి వేల్చి । లోఁగక మఱి యంతలో శీఘ్రవృత్తిఁ
బదియవతల (యును వహ్నిలో వ్రేల్పఁ । బదపడి యంతలో) వారిజాసనుఁడు
గరిమతోఁ బదితలల్ గలుగంగఁ జేసి । "వరమిత్తుఁ గొను" మన్న వాఁ డిట్టులనియె:
"సుర గరుడోరగాసుర సిద్ధ సాధ్య । వరుల గెల్వఁగ నాకు వరమీవె దేవ !
మన మొప్ప." ననుడు (బ్రహ్మయుసమ్మతించి, । "యసయమ్మసురగరుడాదుల) వలన
మరణంబు లేకుండు మహి." నని యిచ్చి । కర మొప్ప నాకుంభ కర్ణునిఁ జూచి*
'కోరుము వర' మన్న గురుతర నిద్ర । వారక యడిగిన వానికి నిచ్చి
యా విభీషణుఁ జీరి యడిగిన నతఁడు : । "పావనాత్మకుఁడై (న పరమేశునందు
నలవుననా) పరంబందు నామనసు । నెలకొనియుండంగ, నిరతి బ్రహ్మాస్త్ర
మును గృప సేయుము మొగి నాకు." ననినఁ । బనివడియిచ్చి యప్పద్మజుఁ డనియె:
"దైత్యుండవయ్యును ధర్మవర్తనల । నిత్యమయ్యెడి నీతి నీమది మేలు ;
(అమరత్వమును గల్గు న) నఘాత్మ, నీకుఁ । బ్రమదంబుతో" నని పద్మజుఁడరిగె.
అంత గర్వోద్రేకియై దశాననుఁడు । సంతోషమెసఁగ వైశ్రవణుపై యుద్ధ
సన్నద్ధుఁడై పోవ, జయ్యన నతఁడు । నెన్నఁ జిత్తమున నూహించి యాలోన
యక్షులు తోడురా నాలంక విడిచి । యాక్షణంబునఁ బుష్పకారూఢుఁడగుచు
గంధమాదనముకై కరమర్థిఁ బోవ, । బంధుర వేగుఁడై పంక్తికంధరుఁడు

---

*కుంభకర్ణాదులొనర్చిన తపోవిఘ్నము వ్రాయమఱచెనో, గ్రంథపాతమో తెలియరాదు.

వాని వెంటనె పోయి వడిఁ బుష్పకంబు । పూనికఁ గొనిన, నప్పుడు కుబేరుండు :
" అన్ననై యున్న న న్నవమానపెట్టి । తెన్నఁగ నదిగాన నీ విమానంబు
పరఁగంగఁ బగతుల పాలగు " ననుచుఁ । పరఁగ శపించె ; రావణుఁడు నంతటను
దైత్యవల్లభుఁడునై తగ లంక చేరి । యత్యుగ్ర మోత్తములైన సన్మునుల
తపములు చెఱిచి దిక్తటములు గెలిచి । చపలత దేవ శాసమితి నోడించి
వారి పదంబులు వడి నాక్రమించి । యాహూఢి వర్తింప, నంత దేవతలు
కమలజుపాలికి గ్రక్కునఁ బోయి । యమిత వైఖరి మ్రొక్కి యావార్త చెప్పి
' రావణుఁ జంపు కార్యం బెటులైన । । భావింపు ' మనవుడు పద్మజుండనియె :
" ఘనులార, వినుఁడు ఇక్కార్యంబు నేను । నెనయంగ మును నిశ్చయించినవాఁడ ;
నారాయణుఁడు ' భూమి నరుఁడునై పుట్టి । వారక రాఁణు వధియింతు ' ననియె ;
మీరును వేగమే మీ యంశలందు । నారూఢిఁ బుట్టింపుఁ డగచరోత్తముల. "
అని పల్కి, దుందుభి యను పేరుగల్గి । ఘనతరంబైనట్టి గంధర్వ కాంతఁ
బిలిచి యిట్లనియె : "నోబింబోష్ఠి, నీవు । మలయుచుఁ గుబ్జవై మంధర యనఁగ
భూలోకమునఁ బుట్టి పొలుపు దీపించి । యాలోన దేవ కార్యము నివర్తింపు(?) "
అని పంపుటయు సురలందఱుఁ బోయి । యనయంబు దమతమ యంశలయందు
ఋక్ష వానరుల సంప్రీతిఁ బుట్టింప । నీక్షోణిపై మించి రెంతయు. " ననిన
ధర్మతనూజుఁ డాతపసికిట్లనియె : । " ధర్మాత్మ, వినవయ్య దశరథుం డెట్టు
లారణ్యమున కంపె నా రాఘవేంద్రు ? । నారయఁ జెప్పవే !" యనిన నిట్లనియె :
" అనఘాత్మ, దశరథుం డారీతి సుతుల । ఘనత నల్వురఁ గాంచి (కడునంత) సించి
యున్నంతఁ, గౌశికుఁ డొకనాఁడు వచ్చి । యన్నెలవున రాఘవాధీశుఁ గొనుచుఁ
దాటకఁ జంపించి తన వనంబునకు । మేటియై కొనిపోయి మెఱసి యాగంబు
సేయంగ, నంకలోఁ జె (లఁగి రక్కసులు । పాయక యేతెంచి బహుళ విఘ్నముల
నొనరింప [1]*మారీచు నొకటఁ దెమల్చి । యనఘ, సుబాహు నొక్కమ్మునఁ గూల్చె.
అంత యాగంబు సమాప్తంబునైన । సంతోషచిత్తుఁడై నవడిఁ గౌశికుఁడు
(ఆ మిథిలకు నంత నారాఘవులను) । క్షేమతోఁ గొనిపోవఁ, జేర్మి నాత్రోవ
దొరకని [2]తన పాదధూళి సోఁకినను । విరివిగా తాఁరూపువిడిచి యహల్య
సంతోషమునఁ బొందె ; జనక భూవిభుని । నంతటఁ బొడఁగని యాతని యింట

1. *రాముఁడు కర్తఅధ్యాహార్యము. 2. తన = రాముని.

హరువిల్లు ( నెక్కిడి యతివై భవమున । ధరణిజతో సయోధ్యకు ) వచ్చుత్రోవఁ
బరశురాముం డడ్డపడిన భంగించి । పురమున కేతేరఁ, బొదలి భూవిభుఁడు
పట్టాభిషేకంబు పరువడిఁజేయ । నెట్టన సమకట్ట, నెఱి నంతలోన
మంధర యనునది మహిఁ గైక కట్టి । చందమ ( ంతయుఁ దెల్పఁ జని " నాథ! సమర
మందు మున్నీవిచ్చి ) నట్టి యావరము । దవిలి యీయఁగవలె ; ధరణి కొక్కంట
భరతుఁ బట్టముగట్టు ; పరువడి నొకట । నురుదుర్గముల రాము నుండంగఁబనుపు."

## సీతారాముల వనవాసము

అనవుడు దుఃఖితుండై దశరథుఁడు । తనలోనఁగుంది యంతటఁ (దనయాజ్ఞఁ
బురివీడి సతియు రాముఁ) డు లక్ష్మణుండు । నరయంగ నడవికి నరిగిన పిదప
'హారామ ! హారామ ! ' యనుచు దుఃఖించి । యారయస్వర్గస్థుఁడయ్యె ; నొటయును
దనపుత్త్రురావించి తగఁగైక యనియె ; । " ఎనయ రాజ్యంబేల నీవయర్హుఁడవు ;
(వడిఁ బట్ట భద్రత వడసి) వేడుకను । బుడమి పాలింపుము పొలుపొంద." ననినఁ
దల్లినిఁ గోపించి తండ్రికి నంత । నల్లలితాగ్ని సంస్కారంబు చేసి
చిత్రకూటాద్రికిఁ జెచ్చెరఁబోయి । పాత్రుఁడౌ రామభూపాలుఁ బ్రార్థింపఁ,
బాదు (క లాతండు) భరతున కిచ్చి । యాదట నా దండకాటవి కరిగి
శరభంగుచేఁ బూజ చయ్యనఁ బడసి । నరవితోడుతఁ గుంభ సంభవుచేత
వైష్ణవచాపంబు వలనొప్పఁ గాంచి । యుష్ణాంశు కులుఁడంత నొగిఁ బంచవటిని
వసియించి యుండంగ, వడిఁ జుప్పనాతి । విశదరీతుల వచ్చి వెన ముక్కుసెవులు
పోనాడుకొనిపోయి పొగులుచు ఖరుని । కా నిమిత్తము చెప్ప, నతఁడు గోపించి,
తనవెంట నటఁ జతుర్దశ సహస్రములు । దనుజులు చనుదేరఁ దద్దయుఁ బోయి
పరువడి రఘురాము బాణాగ్నిచేతఁ । బరఁగంగ భస్మమై పడిన, శూర్పణఖ.

## సీతాపహరణము

రావణాసురునకు రమణఁ దద్విధము । వే విధంబులఁ జెప్ప విని సంతసిల్లి
మారీచుకడ కేఁగి 'మాయామృగంబ । వై రాము నెలయింపు' మని పంచి తాను
సీతామహాదేవిఁ జెఱవట్టుకొనుచు । నాతత గతి లంక కరిగె; నంతటను

మాయామృగముఁ జంపి మనుజ వల్లభుఁడు । పాయక చనుదెంచి పద్మాక్షి సీతఁ
గానక చింతించి కదలి యాక్షణమ । పూని కబంధునిఁ బుడమిపైఁ గూల్చి,
పడిన జటాయువుఁ బరఁగ దహించి, । యడలుచుఁ దమ్ముని నంతటఁ గూడి
పొలుపొంద శబరిచేఁ బూజితుఁడగుచు । నలవడ ఋష్యమూకాద్రికి నరిగి,
యినసుతు మన్నించి యిట వాలిఁ జంపి, । పనివడి కిష్కింధ పట్టంబుగట్టి
వానకాలము మాల్యవంతంబు నందు । జానొప్ప నంత నా జనపతి నిలిచి,
తపియించి, మఱి శరత్కాలంబునందుఁ । గపుల దిక్కులకంపి కడువడి నంత

## సీతాన్వేషణము

హనుమంతుచే సీత కంగుళీయకము । నెనయంగ నిచ్చిన, నేపుమై నతఁడు
నంగదాదులఁ గూడి యట దక్షిణమున । కంగదఁ జని వార్ధియంతట దాఁటి
సంపాతి చెప్పిన సరణి నాలంకఁ । బెంపుతోఁ జొచ్చి యా బింబోష్ఠి సీతఁ
బొడగని మ్రొక్కి యమ్ముద్రి (క యిచ్చి । పడఁతి) శిరోమణి బాగొప్పఁ గాంచి
వనపాలకులఁ జంపి వనమెల్లఁ బెఱికి, । దనుజులఁ బెక్కండ్ర ధరణిపైఁ గూల్చి
యక్షునిఁ దెగటార్చి యా లంకఁ గాల్చి । యా క్షణంబున వచ్చి యారాఘవేంద్రు
ప (దముల కెఱఁగి పావన) శిరోరత్న । మదనుగా నిచ్చిన, నా రాఘవుండు
కపిసేనతోఁ గూడి కంధి బంధించి । చపల రాక్షసులను జంపి రావణుని
మొగి సంహరించి యిమ్ముల వాని తమ్ముఁ । డగు విభీ (షణు లంక కధిపతిఁ జేసి,
పరిశు) ద్ధ యైన యా పడఁతిఁ దోడ్కొనుచు । సరయు నయోధ్యకు నరుదెంచి రాజ్య
మెలమితో నెంతయు నేలుచు నుండె. । అలవడ రాముని యట్లనె నీవు
నిరవొప్ప భూచక్ర మేలంగఁ గలవు; । తెరుణి ద్రౌపది (యును ధరణిజవోలెఁ
గరము పొగడ్తలఁ గనుఁ) బుణ్యచరిత । ధరణీశ!" యనవు డ త్తపసి వీక్షించి :
"తిరముగాఁ బుణ్యసతీచరిత్రంబు । విరివిగా వినిపింపవే వినవలయు."
అనిన మార్కండేయుఁ డా రాజుఁ జూచి : । "అనఘాత్మ, సావిత్రియ (నిమొదు సాధ్వి
చరిత మీా వడిగిన సతి చరి) తలకు । నరుదైన యుత్తరం." బనుచు నిట్లనియె :

## సావిత్ర్యుపాఖ్యానము

కలఁడు మద్రదేశుండు గంభీర మూర్తి । బలవైరి విభవుండు భవ్య విక్రముఁడు
పరికింపఁగా నశ్వపతి యనుపేరఁ । బరఁగిన వాఁడు భూప (తి యాతఁడంత

సంతానమును గోరి సావిత్రిఁ) గొలిచి । యెంతయు వర్తింప, నిట నొక్కనాఁడు
ఆదేవి ప్రత్యక్షమై : 'వరంబడుగు । మాదట' ననుడు సాష్టాంగంబు లెఱఁగి
తనయునిఁ గోరిన, ధరణి నద్దేవి : । "తనయ నిచ్చెద నీకు ధరణీతలేశ !
యను (వొప్పఁగా" నన : "నఖిలైకవం) ద్య ! । ఘనమైన నీకృపకలిమి వాంఛితము
కరమొప్ప సఫలంబు గాదలెఁ గాక, । యిర వొందఁగాఁ గూఁతు రేమి ఫలంబు ?"
అనిన సావిత్రి యయ్యవనీశుఁ జూచి : । "అనఘాత్మ, కైతెఱం గ (ంతయు విధికి)
వినిపింప నతఁడు భావించి కన్యకనె । యొనయ నిర్దేశించె నిది యమోఘంబు ;
ఘనదుహితృ స్నేహ కారణంబునను । దనయులు నూర్గురు దగ్ధతిఁ బుట్టఁ గలరు."
అనుచు నంతర్ధానమైన, నా నృపతి । మనమారఁ దన పత్ని మాళవియందు
సావిత్రి యను కూఁతు జలజాతనేత్రి । సావధానతఁ గని సరసిఁ బెంపఁగను
ఆయింతి యౌవనంబై రూపరేఖఁ । బాయక యొప్పి సౌభాగ్య వర్తనల
విలసిల్లుచుండ, భూవిభుఁ డంతలోనఁ । దలకొన్న వేడుకఁ దన తనూభవకు
ననుకూలుఁ డగు భర్త నరయుచు నుండఁ, । గొనకొని సావిత్రి కూర్మితో సాల్వ
పతి ద్యుమత్సేనుని పట్టియై మిగుల । నుతికెక్కు సత్యవంతుఁడు భర్త గాఁగఁ
దలఁచుచు నుండె ; నత్తరి నారదుండు । మలయుచు నొకనాఁడు మద్రేశుఁ జూడఁ
జనుదెంచి యతనిచే సత్కార మంది । చెనసి సుఖాసనాసీనుఁడై యున్న,
నలవడ సావిత్రి యంతటిలోనఁ । దలకొన్న* ... ... ...
... ... ... । ... ... ... నచ్చితి రనిన,

## సావిత్రీ సత్యవంతుల పరిణయము

నా సాల్వపతికి నిట్లనియె మద్రేశుఁ : । "ఓ సుకృతాత్మక ! యుర్వి నీకన్యఁ
గోడలిఁగాఁగఁ గైకొనుము ; నీసుతున । కోడక తగునిది యుర్విలోపలను."
అనిన ద్యుమత్సేనుఁ డారాజుతోడ : । "అనఘ, రాజ్యము (పోయియడవులయందుఁ
దపియించువా)ర మీ తరలాక్షి బాల ; । విపిన భూముల నెట్లు విహరింప నేర్చు ?"
అనిన మద్రేశుండు నర్థి నిట్లనియె : । "మునుకొని కలిమి లేములు రెండు సమము –

* నారదాగమనము మొదలు మద్రేశుఁడు సకుటుంబముగా నడవికేఁగి సాల్వపతిని సందర్శించు వఱకుఁ గల కథాభాగము జాఱిపోయినది.

గా వచ్చుఁ బోవును గారుణ్యమూర్తి! । వావిరి నీతోడ వడి ( వియ్యమంద
నెలమిఁ జిత్తముపుట్టి యీ చంద్రవ)దన । నలవడఁ దెచ్చితి. " నని పల్కుటయును,
ఆయెడ నృపతియు నంగీకరించి । పాయక తనతనూభవుఁ డైనయట్టి
సత్యవంతునకును సావిత్రిఁ బెండ్లి । యత్యుత్తమంబుగా నప్పుడు చేసె.
అంత మ (ద్రేశుఁ డాయబలకు సత్య । వంతునకున్ నత) బహుభూషణాది
వివిధ పదార్థముల్ వేడుక నిచ్చి । సవినయుం డైనంగ సంప్రీతితోడ ( ? )
నంధ భూపతితోడ ననిపించుకొనుచు । బంధుతో మేర్పడఁ బట్టణంబు ( నకుఁ
జనునంత నచ్చోట సావిత్రి తనదు । కనకభూ ) షణములు కడువడిఁ బుచ్చి
స్థిరమతి వల్కలాజినములఁ బూని । పరుషడి నెంతయుఁ బతి భక్తి మెఱయ
నత్తకు మామకు నతి వినయమునఁ । జిత్త సమ్మోదంబుఁ జేయుచునుండెఁ,
( బతి జీవితమ్మొక్క వర్ష మేయనుచు । నతివ నారదునిచే ) నటువినెఁ గాన
నతఁడు చెప్పిన దినమంతనుండియును । ప్రతిదినమును లెక్క పరువడి నెన్న
నాలుగు దినము లెంతయుఁ గొఱఁతగను । ఆలోన నొకవర్ష మరిగిన, నతివ
* తనపతియా ... ... ... । ... ... ...
వరుసఁ ద్రిరాత్రోప వాసంబు చేసి । గురునిష్ఠ నుండ నక్కోమలిఁ బిలిచి
మామ యిట్లని పల్కె మమ ... । ... ... ... ...
... ... ... చితి వకట ! మూన్నాళ్ళు । ప్రాకట నిర్జలోపాసంబు సేయఁ ( ? )
జనునమ్మ ! " యనిన నాచపలాక్షి పలికెః । "మనములో మీకు నుమ్మలికంబువలదు ;
పరికిం ... ... ... । ... ... ...లు గలుగు. "
అనిన ద్యుమత్సేనుఁ " డక్లైన మనకు । ఘనమైన శుభములు గలుగు నిక్కముగ
తల్లిరో ! " యనుచు నెంతయు వేడ్కనున్నఁ, । దెల్లమి నాలుగో దివసంబునందుఁ
గడు రేవకడ (లేచి కాంత యానాఁడు । గడువైన దివసం ) బు గాఁగ నెఱింగి
పతికి సంభ్రమమునఁ బరిచర్య చేసి, । మతి మీఱ నత్తకు మామకు మ్రొక్కి
పొలుపొంద నప్పుడు ప్రొద్దు జామెక్క । నలవడ మామ యిట్లనియె ... ...
... ... ... మి । ఈతఱిఁ దొడరితి వికనైన నేఁడు
పారణ సేయుము భక్తితో. " ననిన । నారాధి సావిత్రి యతని కిట్లనియె :

*ఇటనుండి క్రిమిదష్టమగుటచే నక్కడక్కడ ద్విపదలో నొకటిన్నర భాగము లుప్తమైనది.

"పుణ్యాత్మ, వినరయ్య ప్రొద్దు గ్రుంకినను । బుణ్యవ్రత... ... ...
... ... మించిన నదిగాన నిపుడు । మునుకొని నాకును భుజియింపరాదు."

## సావిత్రి సత్యవంతునితో నడవి కేఁగుట

అని పల్కునంతలో నాసత్యవంతుఁ । డనఘుఁడు కందమూలాదులు తేర
వనమున కరుగఁబో ( వనిత యే తెంచి । తన పతిపాద ప )ద్మములకు మ్రొక్కి :
"చనుదెంతు నీ వెంట నత్కృప తోడఁ । గొనిపొమ్ము." నావుడుఁ గోమలి కనియె:
"వరుసఁ ద్రిరాత్రోపవాసంబుచేసి । తరుణిరో, డస్సినదానవు నీవు ;
నడువంగ నోపవెంతయు నిల్వు." మనిన । పడ... ... ...
"వసుధ లోపల నుపవాస శ్రమంబు । మసలక యిపుడు నా మనసున లేదు ;
బహుపుష్ప పల్లవ ఫలశోభితంబు । విహిత నానాలతా విఖ్యాత పదవి
వనమని విందుఁ బావనవృత్తి దానిఁ । గనుఁగొను వేడుక గదిరెడుఁ ( దీర్పు
మేభంగినైనఁ ) బ్రాణేశ్వర !" యనిన । ఆభామపలుకుల కంగీకరించి
యతఁడట్ల గైకొన్న, నత్తమామలకు । నతిభక్తితో మ్రొక్కి యంత సావిత్రి :
"మీ తనూభవుఁడు పేర్మిని వనంబునకు । నాతత కందమూలాదులు దేరఁ
బోవుచున్నాఁడు పో ... ... । ... ... ... యు నవ్వనము
అదిగాన మీరు నాయభిమతార్థంబు । వదలక యివ్వు డీ వరమిందు చాలు."
అనిన ద్యుమత్సేనుఁ డాతని పత్ని । యును దమలోపల నొగివిచారించి,
"మెలనాగ యెన్నఁడు నెయ్యది యడుగ । ... ... ...
అరయ వారింపనే" లని నమ్మతింప । నరుదుగాఁ బతివెంట నాలేమ కదలి
వనమున కరిగి పావన వృత్తితోడఁ । గనక చూత పలాశ ఖదిర కపిత్థ
భల్లాతకీ నింబ పాటలీ ... ... । ... ... ... ...
పాటల కర్ణికి ప్రముఖ వృక్షములు । గాటమై యడవిని గలిసిరాఁ బ్రబలి
యినుము చల్లిన రాలకిట దట్టమగుచు । వసుమతిఁ జెలువొందు వనములోఁ జొచ్చి
కమనీయ... ... ... । ... ... ... గతుల
బహుపుష్ప పల్లవ ప్రకరసంతతుల । సహజమై వెలయు వృక్షముల యొప్పిదము
సుకరంధ్ర రక్షమాని ఘనము పెంపెనఁగఁ । బ్రకటించియున్న షట్పద గీతిరవము

...   ...   ...   ... । ...   ...   బుగఁ బల్కు శుకకులరవళి
పతి చెప్ప వేర్వేఱఁ బద్మదళాక్షి । యతి మనోహరముగా నప్పుడు చూచుచును
సావిత్రి వెనువెంట నవడిమైఁ దిరుగ । సావధానత నంత సత్యవంతుండు
అధికత మీా ...   ...   ... । ...   ...   ...   ..
(పరశువు చేఁ) బట్టి పరఁగఁ గాష్ఠంబు । కరమొప్ప నఱికి తక్కక డిల్లవోయి
అలసి యా పరశువు నవనిపై వైచి । జలజదళాక్షి నా సావిత్రిఁ జూచి:
"భ్రమపొంది నట్లయ్యెఁ బద్మాయతాక్షి ! । శ్రమ   ...   ...   ...
...   ...   ...   చి । యాలోన మెఱమినట్లయ్యెడు శిరము."
అనవుడు సావిత్రి యాత్మనాయకునిఁ । దనయూరు లెంతయుఁ దలగడగాఁగ
శయనింపఁ జేసిన నవడిమై నంత । శయనించెఁ బ్రి...   ...   ...
...   ...   ...   రు । తెఱలక 'నీలభూధర మొకో' యనఁగ
వాఁడి కోఱలు హావ్యవాహ ముఖంబు । పోఁడిగాఁ గాన్పింప భూరి తేజమునఁ
బాశ హస్తుండునై పార్థివ సుతుని । నా శయ్య గదిసిన న...   ...   ...
...   ...   ...   ... । ...   గఁ జేర్చి యంతయుఁ బ్రణమిల్లి :
"ఓయయ్య ! నీ వెవ్వ ? రొయ్యన నేమి । సేయంగఁ దలఁచి వేంచేసితి రిటకు ?"
అని ప్రియోక్తులు పల్కు నా యింతిఁ జూచి । మునుకొని ని   ...   ...
...   ...   ...   యో కమలదళాక్షి ! । వాలాయమునఁ బతివ్రత వౌటఁ జేసి
కానఁగఁజాలితిఁ గాని యన్యులకుఁ । గానఁగ వశమె నా ఘనశరీరంబు ?
గరిమ నీ భర్తకుఁ గాలవశంబు । ...   ...   ...   ...
చెందెడు వేళ   ...   ...   ... । ...   ...   డు పటుకృపామూర్తి
తల్లిదండ్రుల సేవ తగఁజేసినట్టి । బల్లిదుం డమలుండు భవ్యవిగ్రహుఁడు ;
అదిగాన నితరుల నంపక యేను । నిదె కొనిపోవఁగ నేఁగుదెంచితిని.
...   ...   ...   ...   మున । వెనుకొన్న జీవంబు వెడలంగఁ దివిచి
పరఁగంగ నతి దీర్ఘ భయదపాశమునఁ । గర మొప్ప బద్ధునిగాఁ జేసికొనుచు
దక్షిణాభిముఖుఁడై తగ నంతకుండు । నా క్షణంబునఁ బోవ నంత సావిత్రి
(తెలివిమైఁ దన పతి దేహ) మొక్కెడను । కొలఁది మీాఱంగ సుగుప్తంబు చేసి
పదములు తొట్రిల్లఁ బద్మదళాక్షి । విదితమై కాలుని వెనువెంటఁ జనిన,
దానిఁ గనుంగొని దండధరుండు : । "మానిని, యిట్లేల మసలి వచ్చెదవు ?

ఎలమితోడ నగమ్మి మి (ది మానవులకు । నిలువు)ము నీ" వన్న నెలఁత యిట్లనియె :
"పొలుపొందఁ బతులెందుఁ బోయినఁదుఁ । బొలఁతుల కెంతయుఁ బోవంగ వలదె ?
పరఁగంగ నీకృపఁ బతి భక్తివలన । నరుడుగా నట నాకు నరుగంగరాని
చోటులు గలవె ? యెచ్చో నైన (నఁ గాని) । ... ... భాగంబులందు
నలి మీఱఁగాఁ బ్రధానంబు ధర్మంబు ; । అలవడ నందుల కాధార మరయ
వెలయ సజ్జను లని వినఁబడు శ్రుతుల ; । సలలితంబైన సజ్జన దర్శనంబు
ప్రీతినై నెప్పుడు వృథగాదు గానఁ । జాతుర్య ... ... ...
... ... ... భిమతార్థంబు । లియ్యెడఁ గల్గుట యిది యద్భుతంబె ?
రిత్తజనంబుల రీతినే యుఱక । యిత్తఱి మగుడంగ నే నెటులొప్పఁగు ? "

## సావిత్రి యమునివలన వరములు వడయుట

అనవుడు దాని వాక్యములకు మెచ్చి : । " వనితరో ! వేడుము వరము నొక్కటిని
ఎద్దియైనను వేడు మిచ్చెద నీకుఁ । దద్దయు. " ననిన నత్తరుణి యిట్లనియె :
" అవనిలో రిపులచే నపజయంబంది । నవడిమై నడవిలో సాల్వ భూవిభుఁడు
గొనకొని యున్నాఁడు కూ ... । ... ... ... ...
' ఇచ్చితి నింక నీ విట రాక పొమ్ము । అచ్చుగా. ' నని పల్కి యరుగ, వెన్వెంట
సావిత్రి యరుగంగ శమనుఁడీక్షించి, । ' యీవిధి నింకేల యేతెంచె ? ' దనిన
' నత్యాత్మ, యాశ్రితజన ... ... । ... ... ... ...
... ... ... త యనుపేర । పరఁగ వర్తించిన పరమపుణ్యాత్మ !
పక్షపాతము లేక పాపపుణ్యములు । వీక్షించి శిక్షించి వెలసినకతన
నమవర్తి యనుపేరు జలజాప్తతనయ ! । నమధికంబుగ నీకు ( నమకూరు నెపుడు )
... ... ... ... । ... ... లిన నంతలో మెచ్చి,
పడఁతిరో ! నీ పతిప్రాణంబు దక్క । నెడపక వేఁడుము ఇంకొక్కవరము. "
అనవుడు సావిత్రి : "యరులచేఁబడిన । ఘన రాజ్యమంతయుఁ గడఁగి మామామ
... ... ... ... । ... ... ... ...
... ను నిల్వు మిందీవరాక్షి ! । కొంకక యాత్రోవ ఘోర దుర్గమము. "
అనవుడు : " ధర్మాత్మ, యఖలధర్మములు । ఘనముగా నీవెఱుంగని విటఁగలవె ?

పతివెంటఁ బోవని పడఁతి యే వి ... । ... ... ... ...
... ... ... నీవలన । క్రమముగాఁ గాన్పించెఁ గాన నీ భర్త —
బ్రతుకొక్కటియుఁ దక్కఁ బరఁగంగ నిత్తుఁ । జతురత." ననిన నాచపలాక్షి మ్రొక్కి:
"మా తండ్రి యైనట్టి మద్రేశ్వరుండు । ప్రీతిఁ బుత్రులు లేక పృధ ...
... ... ... ... । ... గృపసేయు." మనిన నట్లిచ్చి:
"దవ్వు వచ్చితి వీవు తరళాయతాక్షి ! । మవ్వంపు వేడ్కతో మగుడుట లెస్స."
అనిన సావిత్రి యాయమురాజుఁ జూచి : । "అనఘాత్మ, పతిసేవ ... ...
... ... ... ... । ధర్మాత్ము లైనట్టి ధన్యు లుత్తములు
నిర్మలచరితులు నిత్యులు ఘనులు । పేర్మితో వారి సంభృత ధర్మమహిమ
వలన సూర్యుండును వారిజవైరి । గల వడి సంచార ... ...
... ... ... లాడినను । వలనుగా నటువంటి వారు చుట్టములు ;
లలిమీఱఁ జిరసమాలాప సంసిద్ధి । నలవడఁ జుట్టమ నాదు నే నీకు
నుతగతి మిత్రమనోరథం బర్థి । నతుల కర్తయె ... ... ... ...
... ... ... ంకొక్క వరము । వెలయఁగఁ బ్రీతితో వేఁడు మిచ్చెదను."
అనవుడు సావిత్రి : "యనఘ, యిందాఁకఁ । బనిగొనఁ బ్రాణేశు ప్రాణంబు దక్క
నన్యంబులడుగు మీవనుచుఁ బల్కితివి ; । ధన్యత నదిలేదు తద్దయు ని ...
... ... ... నీవె । యీవేళ." ననిపల్క, నిచ్చి యంతకుఁడు:
"తొయ్యలి, వీఁడు చతుశ్శతాబ్దములు । చయ్యన బ్రదికి భూచక్ర మేలుచును
బుత్ర శతంబును బొందఁగఁ గలఁడు ; । ధాత్రిలో సంతతాధ్వరముల వలన
సురల ... ... ... । గరిమతో." నని చెప్పి కాలుఁడేఁగినను,
సావిత్రి ప్రీతితోఁ జనుదెంచి యంత । నా విధిఁ బ్రాణేశు నప్పటి యట్ల
తొడలపై నిడుకొని తోరంపుభక్తి । నెడపక యుండంగ నిట లేచి విభుఁడు
వల్లభఁ గనుఁగొని వలనొప్ప ... ... । ... ... ... డవు
తెలుపంగ వలవదే ! ధృతి మీఱ నన్ను । నలవడ బలిమిచే నటు బట్టి తిగిచె
నతఁడెవ్వఁ ?" డనుటయు నంత సావిత్రి । పతిఁజూచి యిట్లని పలికె : "నో పురుష !
యెల్లి చెప్పెదఁగాని యిదె పొద్దుగ్రుంకె ; । గొల్లగాఁ బక్షులు ... ...
... ... ... ... న । నీ తామసమునకు నెంత వేగెదరో !"

## సత్యవంతుఁడు సావిత్రితో నాశ్రమమునకు వచ్చుట

అని పల్కి ఫలభార మధికమైయున్న । దనరంగ నొకకొమ్మ దగిలించి విడిచి
పరశువు తాఁగొని పతికిఁ జేయిచ్చి । యరుగుదెంచెను దమ యాశ్రమంబునకు.
... ... ... ... ... । ... ... భరితుఁడై రాజు
తనయుని రాక యెంతయుఁ గోరుచుండ । వనితతో నా సాల్వపతి తనూజుండు
చనుదెంచి తండ్రికి సాష్టాంగ మెఱఁగి । కనుదృష్టి ... ... ...
... ... ... లును దాను । ఘనతర సంతోష కలితాత్ముఁడయ్యె.
అంత ద్యుమత్సేనుఁ డాత్మజుఁ జూచి, । యెంతయుఁ బ్రీతితో నిట్లనిపలికె:
"మహాత్మ, తడవేల ? మలసి ... । ... ... ... ...
... ... పండ్లు గోయుటయుఁ । దరుశాఖ నఱకుట తలయేరు వట్టి
వెన నిల్వనోర్వక విశ్రమించుటయు । ననమునఁ గలలోన యటఁ దన్ను నొక్క
పురుషుండు తివుచుట పొసఁగ జం .. । ... ... ... ...
... ... ... ... । ... ... ... ...
... బా దినం బనుచు । క్షితిలోన మును నాకుఁ జెప్పె నారదుఁడు;
మునినాథు వచన మమోఘంబు గాఁగఁ । జనితి నేమఱక యీ నత్యాత్ము వెంట;
అడవిలో నీ ధన్యుఁడ... ... । ... ... ... ...
... ... గ వెన్వెంట । నతులితంబుగ నేను నరిగిన మెచ్చి
నాలుగువరము లున్నతి నిచ్చుటయును । బోలఁగ నొక్కటఁ బురుషుప్రాణంబు
నొకట మీ నయనంబు లొ ... । ... ... ... ...
... ...ముండు వోవుటయు । నెడపక వచ్చితి నీ చోటి." కనిన
ఆ సాల్వభూపతి యానందవార్ధి । భాసురంబుగఁ దేలి ప్రణుతింపుచుండె.
అచ్చోటి మునులెల్ల నంత సావిత్రి । ... ... ... ...
... ...ముల కాప్తులు హితులు । పటుతర చతురంగ బలములు వచ్చి,
"ఆదట మీ శత్రుఁ డాత్మీయ భృత్య । భేదంబునను జేసి పృథివిపైఁ గూలె;
ధరణీశ, మాకు... ... । ... ... ... లు."
మని విన్నవించిన నట్ల కాకనుచు । మునుల సమ్మతిఁజేసి మొగి రాజ్యమెల్లఁ
బాలింపుచుండెను భాగ్యభోగములఁ । బోలింపఁగా సాల్వభూపతి ...

... ... ... ... । చతుర ... సావిత్రి జనపాలవర్య
ఆ పతివ్రతయట్ల యాజ్ఞ సేనియును । జేపట్టి మిము నిల్పు సిద్ధమీపలుకు."
అనుచు మార్కండేయుఁ డంతయుఁ జెప్పి । చనియె ... ... ...
... ... ... ... । దేవతాధీశుండు ధృతిఁ దనలోన
భావించి భావించి పటు బుద్ధి మెఱసి । కవచకుండలములు గల శక్తిఁగాదె *
... ... ... ... । ... ... ... ...
నిత్యర ... గతి ... గునిది యథార్థంబు । ... ... రణ్య పర్వంబునందు
... తిమ్మనార్యుండు విడిచిన కథలు । కువలయంబున నాతుకూరి ...
... ... ... ... । ... ... ... ...
ఇది వేంకటాచలా ధీశ్వర దివ్య । పద పద్మ మకరంద పానద్విరేఫ
మగు నాతుకూరి తిమ్మార్యతనూజ । సుగుణాఢ్య సోమన సుకవీంద్రవర్య
విరచితారణ్యాఖ్య విపుల పర్వమున । నరుదు మీఱఁగ సప్తమాశ్వాసమయ్యె.

---

* అదిగా, మూలము చూచునది.

# ప్రథమాశ్వాసము



*శ్రీ రమ్యగుణహార, శ్రితజనాధార, । కారుణ్యపూర, జంగల ముమ్మధీర,
చండతేజుఁడు మున్ను జనమేజయుండు । పాండవకథ లెల్లఁ బరిపాటి వినుచు
వదలక మూఁడు పర్వము లైన వెనుకఁ । [1]జనురొప్ప ననియె వైశంపాయనునకు :
"చనుదెంచి పండ్రెండు సంవత్సరములు । వనవాసమున నుండి వరుసఁ బాండవులు
ప్రజ లెఱుంగకయుండఁ [2]బదమూఁడో యేఁడు । విజయులై యెచ్చోటవిహరించిరొక్కొ?
వరఁగంగ నాలవ పర్వంబు కథయు । నిరవొప్ప నాకు నీ వెఱిఁగింపు." మనిన
జనమేజయునకు వైశంపాయనుండు । వినిపింపఁ దొడఁగెఁ దద్వృత్తాంతమెల్ల :
ఆరీతిఁ బాండవుల [3]తివఁశోఁ గూడి । ఘోరాటవులలోనఁ గుశలులై తిరిగి
బహుమునీంద్రులచేత బహుపురాణములు । బహుతీర్థముల[4]యందుఁ బరిపాటి వినుచు
నెలమిఁ బండ్రెండవయేఁడు నిండుటయు । [5]వలనొప్ప యమునిచే వాంఛితంబుగను
వరము గైకొని వేడ్క వసుధపైఁ దమ్ము । నొరు లెఱుంగకయుండ నొకయేఁడు గడప
నారాధనముచేసి యముని వీడ్కొలిపి । తా రొక్కచో [6]డాఁగఁ దలపోసి యపుడు
[7]విమలమనస్కులౌ విప్రపుంగవులు । తనువెంట నగ్నిహోత్రములతో రాఁగ

### వెన్నంటివచ్చు హితులను ధర్మజుఁడు వెనుకకుఁ బంపుట

నా మహాపుణ్యుల కప్పు డిట్లనిరి : । "ఓ మహాత్మకులార, యో పుణ్యులార,
యో మహీసురులార, యుగ్రాటవులకు । మామీఁదఁ గృపగల్గి మముఁగూడి వచ్చి

---

* "శ్రీ సింధుగంభీర, చిత్తజాకార, భాసురాకార, ముమ్మాయ ప్రభుధీర!" (తిరుపతి ప్రతి).
1. జనవుర ననియె, వైశంపాయనునకుఁ – జనుదెంచి పండ్రెండు సంవత్సరములు – వనితతో నుత్తల పాటులం బడలి – వనవాసముననుండి వరుసఁ బాండవులు – ప్రజ లెఱుంగక. 2. ఒయి వత్సరమున. 3. బల. 4 గ్రుంకి. 5. నలువొప్ప యమునిఁ బ్రత్యక్షంబు సేసి – వరముగా నతనిచే వసుధపైఁ దమ్ము 6. డాఁగఁ దలఁకిపోవుచును. 7. తమవెంట నగ్నిహోత్రములతో వచ్చు – విమలవిప్రులఁ జూచి వేడ్క నిట్లనిరి – మామీఁద.

యలవి సేయఁగ[1]రాని యలజళ్లఁ గోర్చి । కలసి యుండితి రింతకాలంబు [2]దనుక ;
[3]నింక బాహిరపోక యేఁడాదిదాఁక । శంకింప కొకచోటఁ జరియింపవలయు.
రాయిడి [4]పుట్టించి రారాజు [5]మనకు । నీ యవస్థలు [6]దెచ్చు టెఱుఁగరే మీరు ?
వాఁ డింక నజ్ఞాత[7]వాస కాలమునఁ । బోఁడిగా మము [8]రోయఁ బుత్తెంచు [9]జనుల.
[10]అపుడు మీకును మాకు నర్హంబుగాదు । విపుల కార్యార్థమై వేంచేయుఁ డింక.
ఏకాలమును మిమ్ము నెడసి పోనీక । [11] చేకూరఁ బరిచర్య సేయలేదయ్యె.
ఎడపక ధాత్రిలో నెట్టివారలును । బడని యాపద మాకుఁ బ్రాప్తమై వచ్చె.
ఎన్నఁడొకో మాకు నింక మీలోనఁ । బన్నుగా [12]విహరించు భాగ్యంబు గలుగు !
అని దైన్యపాటుతో [13]నందఱఁ బల్క । [14]జనవల్లభులఁ జూచి సకలబ్రాహ్మణులు :
“మీకేల శోకింప ? మీరు సాహసులు ; । చేకొని రాజ్యంబు సేయ నున్నారు.
ఆపద పడువార లకట మీరేల । యేపార వేల్పులు [15]నెందఱేఁ గలరు.
పాయక నిషధాద్రిఁ బ్రచ్ఛన్నవృత్తి । వేయికన్నులవేల్పు విహరించె మున్ను.
[16]పురుషులలోపలఁ బొడవైన హరియు । మనువున నొకచోట మరుగుజ్జుగాఁడె !
[17]దుర్వారుఁడై తల్లితొడసొచ్చి [18]మున్ను । నౌర్వానంతటివాని [19]కణఁగంగ వలసె.
అదియు నేటికి సూర్యుఁ డాదికాలమున । మొదవుగర్భముఁ జొచ్చి [20]ముద మొప్ప డాఁగె.
వీరెల్ల నటమీఁద వెలయు శాత్రవుల । శూరులై మర్దించి సుఖమున్నవారు.
ఆరీతి [21]మీరలు నాయాస కోర్చి । వైరులఁ బరిమార్చి వసుధ నేలెదరు.”
అని మహీదేవత లా పాండవులకు । మనసు[22]లో నున్న యుమ్మలికంబుఁ బాపి
‘క్రమ్మఱ [23]సంపదల్గలుగు మీ’ కనుచు । నెమ్మితో నేఁగిరి నిజపురంబులకు.
అప్పు డన్నర[24]నాథు లఖిలసేవకులఁ । దప్పక పిలిపించి తగ గుస్తరించి
[25]దొరలను హితుల బంధులఁ బ్రధానులను । వెరవుతోఁ బేర్కొని వేర్వేర ననిచి

---

1. లేని. 2. దాఁక. 3. నింక గోప్యముగాఁగ నేఁడాది మనకు-శంకించి యొకచోటఁ జరియింపవలయు-రాయిడి పుట్టించి ... 4. బలియించి. 5. మరల - కీ. 6. దెచ్చె నెఱుఁగరా. 7. వాసంబువలన. 8. నరయ. 9. ప్రజల. 10. మీరు మే మొకచోట మెలఁగంగరాదు - మీరింక మముఁ బాసి మిత్రోవఁ జనుఁడు - ఏకాలమును.... 11. చేకూడ. 12. విహరింప భాగ్యంబు గలదు. 13. నర్థి పీడ్కొలుప. 14. జననాయకుని. 15. నెందఱుగారు. 16. పాండవుల. 17. దుర్వహుండై. 18. తొల్లి. 19. కలయంగ. 20. ముమ్మాఱు. 21. మీర లాయాసంబు లోర్చి; ఆరీతి నిట మీరు నాయాస కోర్చి. 22. లోపలనున్న మలినంబు. 23. దర్శింపఁ గలుగుఁ గాకనుచు. 24. నాథుఁ డఖిలసైన్యముల. 25. దొరల సామంతుల దుర్గాధిపతుల - వెరవొప్ప నందఱ వేగంబె పిలిచి.

హరిణాక్షియును దాము నరదంబులెక్కి । ధరణినుత్తముఁడైన ధౌమ్యుఁ దోడ్కొనుచుఁ
గొంతదూరంబేఁగి కువలయాధిపు[1]లు । వింతగా నొకచోట విడిసి నాఁ డుండి
మఱునాఁడు రేపాడి మజ్జనంబాడి । మఱవక సాంధ్యసమాధులు దీర్చి
సుఖమున్నచోట నగ్రజునిఁ జూచి విభుఁడు । నిఖిలంబుఁ దలపోసి నెమ్మి నిట్లనియె:

## పాండవు లజ్ఞాతవాసము విరటునగరమునఁ గడపఁబూనుట

ఈ [2]చంద్రవదనతో నెలమి నార్వురము । [3]నే చందమున నున్న నెఱుఁగరే మనల?
[4]పొదివిచ్చుటయుఁ గాదు భువిలోన మనకు; । [5]వదలక యియ్యేఁడు వర్తించు టరుదు.
[6]ఎఱిఁగింపు దీనికి నేది కార్యంబు? । ఎఱుఁగఁ దీఱదు నాకు హృదయంబు [7]చెదరె.
అనవుడు విభుఁ జూచి యా సవ్యసాచి । [8]తనభక్తి దీపింపఁ [9]దా విన్నవించె:
“ రాజేంద్ర, యమధర్మరాజు నీ [10]కర్థిఁ । దేజంబుతో నిచ్చె ధృతి నొక్కవరము.
ఆ వరంబునఁ జేసి యనఘాత్మ, [11]మనము । నేవిధంబున నున్న [12]నేటికి వెఱవ,
[13]మనమునఁ బ్రీతి [14]యా మగధ పాంచాల । ఘనమత్స్య కాంభోజ కటకంబు [15]లొప్పు.
ఏ [16]యచ్చికము లేక యీ పట్టణములఁ । బాయక ధర్మంబు [17]ప్రబలమై యుండు.
హరులును బసులు ధాన్యముఁ [18]దీయ నీరుఁ । [19]గరులుఁ దోఁటలు నెల్లకాలంబుఁగలవు.
కౌరవాధిపుఁడేలు గజపురంబునకుఁ । జేరువయని [20]మీరు [21]చింతింపనేల?
ఈ పట్టణములలో [22]నొండైన మనము । భూపాల, [23]నిలుచుట బుద్ధిమార్గంబు. ”
అనవుడు మనుజేంద్రుఁ డమరేంద్ర [24]సుతునిఁ । గనుఁగొని తనకోర్కి కానరాఁ బలికె:
“ నాకుఁ జూడఁగ మత్స్యనగరంబు మేలు । ప్రాకట బహుభోగ భాగ్య [25]సంపదల;
వినయ భూషణుఁడైన విరటుఁ డున్నాఁడు । మనుజుల తారతమ్యము [26]లాతఁడెఱుఁగు.
ప్రణుతికెక్కినభూమిపతులలోఁ గొంత । గుణవంతుఁ [27]డగువానిఁ గొలిచి యుండుదము.

---

1. ఁడు. 2. యుండు. 3. నీయందము; నేయందము. 4. పొడచూపఁగారాదు; పొడపించుటయుఁ గాదు. 5. బడలక. 6. ఎఱిఁగింపుఁడీ పనికేది. 7. లోన. 8. ఘన. 9. గా. 10. నీకిపుడు. 11. మనకు. 12. నిఁక నేల. 13. మనము నుండితి మైన మగుడఁ బాంచాల. 14. మై. 15. లందు. 16. యొచ్చెమును. 17. ప్రబలంబు గాఁగ 18. నేయి. 19. కరులను దోఁటలుఁ గలుగు నెప్పుడును. 20. దీనిఁ జిత్తగింపకుము. 21. శంకింప (?). 22. నెట్లైన 23. యుండుట బుద్ధికార్యంబు. 24. పుత్త్రు). 25. ంబులకును. 26. లు వాఁడెఱుఁగు. 27. ఁడును వీని.

ఉండుచో నే[1]రూపు లుచితంబొ మనకు । నొండొండ వర్తింపు డొరుఁగూడి మీరు
[2]వెలయ నా రూపులు వీక్షించు నపుడు । పలుమారు మనకైన భ్రమ పుట్టఁగలయు.'

## పాండవులు తాము విరటుని గొల్చియుండు తెఱఁ గొండొరులతోఁ జెప్పికొనుట

అనవుడు విభుఁజూచి యమరేంద్రసుతుఁడు । మనసులోపల శోకమగ్నుఁడై పలికె:
"అక్కట ధరణి నీయంతరాజునకు । నొక్క భూ[3]పతిఁ గొల్చి యుండఁగవలసె!
[4]కపటంబుదెసఁ బోవు గజవీధి గాసి; । కృపయు నీతియు వేఱె కీర్తింపనేల?
మన్నింపనేర్తువు మంచి వారలను; । సన్నుతించుట గాదు సహజంబు నీకు.
ద్రోహిఁ బట్టి శాత్రవు లీడ్చునపుడుఁ । గోపింప [5]నేరని గురుశాంతి [6]యతివి.
ఇట్టి పుణ్యుఁడ వింక నేరూపు దాల్చి । నెట్టన [7]నృపులలో నిర్వహించెద [8]వో"?
అనవుడు [9]నరుమాట లాలించి వినక । ననసుస ధీరుఁడై మనుజేంద్రుఁ డనియె:
"సన్యాసి వేషంబు సమకూర్చుకొనుచు । మాన్యుఁడనై [10]యేను మత్స్యేశుఁ [11]గదిసి
[12]పలుకుదుఁ బ్రియముగా, బహుపురాణము[13]లఁ । [14]గొలువుపైన సుఖగోష్ఠిఁ బొద్దుపుచ్చెదను
జూదంబు తలపెట్టి చూపి యాతనికి । మోదంబు పుట్టింతు; [15]మున్నె నా చేత
భాసిల్లి నవరత్నపంక్తి కీలించి । చేసిన పసిఁడి పాచికలు [16]చూపుదును.
ఎచ్చోట విహరింతు రేది మీ నామ । మచ్చుగా నెఱిఁగింపుఁడని పల్కెనేని
కంకుండు నా పేరు కౌంతేయునొద్దఁ । గొంతకాల వర్తింతుఁ గూర్మి[17]తో నందు.
మఱియు భూపాలుని [18]మనసుకీ లెఱిఁగి । నెఱవాదినై [19]యుండ నేర్తు నన్నిటను.
[20]అని చెప్పి నరనాథుఁ డనిలనందనునిఁ । గనుఁగొని ధైర్యంబు గలుగ నిట్లనియె:
"ఓ భీమసేన, నీ వుగ్రసాహసుఁడ । వే భంగి విహరించెదు మత్స్యపురిని?
బకునిఁ గిమ్మీరునిఁ బట్టి సాధించి । ప్రకటకీర్తులఁ గన్న బాహువిక్రమసుధపు.
సౌగంధికములకై [21]శంకలే కరిగి । బాగొప్ప యక్షులఁ బాఱఁ దోలితివి.

---

1. రూపముచితంబు. 2. వెలయ నాకిప్పుడు వీక్షించిచూడ. 3. విభు. 4. కపటంబెఱుంగవు కలనైన నెపుడు. 5. నేరవు. 6. నిధివి. 7. రిపులతో. 8. వు. 9. నామాట. 10. యుందు. 11. కడను. 12. పలుకులు మృదువుగా. 13. లు. 14. పొంపుగా నతనికి బుద్ధిచెప్పెదను. 15. మొగి నొక్కమాటు. 16. చూపెదను. 17. మై. 18. మనసు లెఱిఁగి. 19. యుందు నేర్పు దీపింప. 20. అని భీముదెసఁ జూచి యప్పు డిట్లనియె – సౌగంధకములకై (అదిగా), 21. సరి నొక్కరుఁడవు,

ఆ హిడింబుసిఁ జంపి తఖిలంబు నెఱుఁగ; । ఊహింప నీ పాటి యున్నారె [1]మగలు?
బిరుదుమాటలె కాని ప్రియమాడనేర । వారుల చిత్తముఁ బట్ట నోపుదే నీవు?"
[2]అనవుడు విని భీముఁ డా ధర్మజునకుఁ । దనవర్తనము లెల్లఁ దగఁ జెప్పఁదొడఁగె:
"వంటలవాఁడనై వసుధేశునగర । వంటలు రుచులుగా వండి [3]పెట్టుదును;
ఎట్టి వృక్షము [4]నైన నిరుగేల విఱుతుఁ । [5]గట్టెలకై వేడఁ గత్తి గొడ్డండ్లు;
వెలయ [6]వంటలవాఁడు వేఱొక్కఁడున్నఁ । జెలు వొప్ప వానితోఁ జెలిమిచేసెదను;
మఱియు భూపతి [7]యొద్ద మల్లవర్గముల । [8]విఱిచి యొడ్డుదు బాహువీర్యంబు మెఱసి.
హరితోడఁ బులితోడ హస్తీంద్రుతోడ । ధరణీ[9]శ్వరుఁడు తెచ్చి తలపెట్టనేని
పట్టి [10]పల్లార్చక బలిమి నుక్కణఁగఁ । బట్టుదు వాని నేఁ బ్రాణంబు గాచి.
వలలుండ నని చెప్పి వసుమతీ నాథు । తలుపులోపల వత్తు [11]ధరణీతలేశ!
జనపతి నన్ను నెచ్చటివాఁడ వనిన । వినుతిఁ బాండవు [12]లొద్ద విహరింతు నందు.
ఇది వర్తనంబుగా నేనుండు చోటు । వెదకి కానఁగలేరు [13]వెలయ శాత్రవులు.
అనవుడు [14]నిది పోలునని ధర్మరాజు । [15]పాసర నర్జునుఁజూచి [16]బుద్ధిలో వగచి:
"అర్జున, నీదులా [17]వదిది చెప్పంగ । నిర్జరాధిపుఁడైన నిను గెల్వలేఁడు.
కాలకేయులఁ జంపి ఖాండవం బేర్చి । శూలి [18]నెక్కటిగెల్వ శూరులున్నారె!
అదిగాక దేవేంద్రుఁ డర్ధాసనమునఁ । బదిలంబుగా నుండఁ బనుపఁడె నిన్ను!
ఇంతవాఁడవు నీ వదెట్లొకో యింత । వింతలాగునఁ బోయి విరటుఁ గొల్చెదవు!"
అనిన ధర్మజుతోడ నమరేంద్రసుతుఁడు । తనకుఁ బొందగురీతిఁ దాఁ జెప్పఁదొడఁగె:
"అసురంగ నేను గార్యా[19]ర్థినై తొల్లి । యమరావతికిఁ బోవ నందొక్కనాఁడు
నళినాక్షి యూర్వశి నన్నుఁగామించి । పిలిచినఁ బోనైతిఁ బ్రియము [20]చేకొనక.
అప్పుడు కోపించి హరి[21]ణాక్షి నన్నుఁ । దప్పక పేడివై తగ నుండుమనుచు
శాపించి పోయిన జనపాథ, వినుము । నాపాలఁ గృపగల్గి నాకేశుఁ [22]డనియె:

---

1. ఘనులు. 2. అనవుడు భీముఁ డయ్యన్నను జూచి. 3. పెట్టుచును. 4. లైన. 5. కట్టెకై వె (త) దకను గత్తికై వెదక. 6. వండెడువాఁడు. 7. వద్ది. 8. బిరుదులు పెట్టిఁతు భీతి పుట్టింతు. 9. శుఁడును. 10. చల్లార్పఁగ. 11. దమకంబుతోడ (గాని) 12. లతో. 13. విపుల. 14. నది. 15. ఒనర. 16. యుత్తలంబునను; యుల్లంబు వగచి 17. వదియేమిచెప్ప. 18. నొక్కటఁదాఁకు. 19. ర్థనై. 20. గై. 21. మధ్య. 22. డెఱింగి.

[1]ఏవు తూలఁగనీకు మీ పేడితనము । ప్రాపించి యొకయేఁడు [2]బఱసిపోఁగలదు. (?)
ఆయేఁడు మీకింక నజ్ఞాతవాస । [3]మైయుండు వేళకు నర్థితో వచ్చుఁ
బొమ్మన్న వచ్చితి; భూ[4]నాథ, నాకు । నిమ్ముగా నట్లుండ నిది వేళయయ్యె.
ధర బృహన్నలపేరు ధరియించి మించి । వెరవొప్పఁ బేడినై విహరిం[5]చువాఁడ.
ఏయునప్పుడు నారి యిరుగేలఁ దాఁకి । కాయకాచినపట్లు కానరాకుండ
[6]సంకులుదాల్చి, యాజానుబాహువుల । నంకించి అపికచే సందంబుమాన్చి,
ధృతి నాట యొజ్జనై [7]తెల్లంబుగాఁగ । నతని కన్నియలకు నాట [8]నేర్పుదును.
జనపతి నన్ను 'నెచ్చటివాఁడ' వనిన । విను[9]తి 'ద్రౌపదివద్ద విహరింతు' నందు."
[10]అనవుడు నిదియొప్పునని ధర్మరాజు। ననిచిన వగ దోఁప నకులు నీక్షించి :
"వీని [11]సౌభాగ్యంబు విశ్వమోహనము; । [12]వీని మించఁగరాదు వినయసంపదను;
రసికుండు నయశాలి రాజపూజితుఁడు; । వసుధలో భారత వంశవర్ధనుఁడు;
సకలవిద్యలయందు సార్వభౌముండు; । ప్రకటిం[13]చి వీఁ డెట్లు పరుల సేవించు?"
నన విని నకులుఁ డయ్యవనీశుతోఁడఁ । [14]దన నేర్పు పచరించి తగ నిట్టులనియె :
"ధరణీశ, నాకునై [15]తలఁకనేమిటికి? । వెరవొప్ప నొకయేఁడు విహరించుటెంత?
సాహిణినై మత్స్యజనపాలు[16]నొద్ద । నూహించి దిద్దు[17]దు నుత్తమాశ్వముల;
కుఱుచ [18]కళ్లెంబులఁ గొదమగుఱ్ఱముల । [19]నొఱపుగా మరిగించి యోర్పు పాటింతు;
బిరుదువారువముల [20]బిరుసుపోఁ దఱిమి । వరుస నోజకు[21]రా దువాళింపనేర్తు;
నొనర గోడిగజాతి నుత్తమం బెఱిఁగి । [22]యనువైన మావుతో హత్తింపనేర్తు;
[23]తేజి సాంబ్రాణుల తెఱఁగెల్ల నెఱిఁగి । నైజంబు చెడకుండ [24]నడపింపనేర్తు;
మఱియులాయములోని[25]మందడీలకును । మఱవక [26]హితుఁడనై మనుజేంద్రుఁ [27]గొలుతు.

---

1. ఏపాట నీకును నీ. 2. యొకయేఁడు పఱచి. 3. మైనను నాశాప మర్థితో వచ్చు. 4. పాల. 5. చి మింతు. 6. అంకులు (?) ధరియింతు నాజానుబాహు – లంకించి అవిక యందంబుగాఁ దొడిగి. 7. తేజంబు దాఁచి. 8. గరపుదు. 9. కృష్ణయింటను; ద్రౌపదింటను. 10. అనినను నిది యొప్పు; అనవుడు నిదిపోలు. 11. సౌందర్యంబు. 12. వీని చారిత్రంబు విశ్వ సంస్తుతము – వినుతింపఁగారాదు వినయసంపదలు; వినుతింపఁగారాదు వీర్యాతిశయము – రసికుండు; వినుతింపఁగారాదు విశ్వమోహనము; వినుతింపఁగారాదు వినయసంపదల – రసికుండు. 13. ప. 14. దనకుఁ దోఁచినరీతి. 15. తలఁకంగనేల. 16. నగర. 17. చు. 18. కళ్లెములందు. 19. నెఱపుగా బలియించి నేర్పు పాటింతు. 20. బీరవో. 21. దెచ్చి పఱపి(వారి)ంప. 22. యనువున. 23. తేజీల త్రాణల. 24. నడపంగ. 25. మావటీలకును; మందురకులను. 26. మేటినై. 27. గొలిచి,

అపుడు దామగ్రంథి యనుపేరు చెప్పి । [1]రిపు లెఱుంగఁగరానికీతి నుండెదను.
అరసి నా[2]చోటు రాజడిగెనేనియును । వరుసఁ బాండవు[3]లొద్ద వర్తింతునంచు."
[4]అనవుడు కౌంతేయుఁ డటు సమ్మతించి । వెనుకొని సహదేవు వీక్షించి పలికె:
"మనసు[5]కుందెడు నీనిమార్గంబుఁ జూడఁ; । బెనఁగొన్న వగల కొప్పెడువాఁడు గాఁడు.
తద్దయు మన్నిం[6]చి తగఁ గుంతిదేవి । ముద్దుసేయఁగ [7]నుండు [8]ముదమార నెపుడు;
కుటిలంబు లెఱుఁగఁ[9]డు గుణగణాధికుఁడు, । పటు[10]భుజాబలమునఁ బ్రౌఢుఁడెంతయును;
[11]తనువెంతయును లేఁత; దైవంబుకతనఁ । జెనసి [12]వీఁ డొరునెట్లు సేవింపనేర్చు."
అనవుడు సహదేవుఁ [13]డధిపు నీక్షించి । తనకుఁ దోఁచిన [14]రీతిఁ దాఁ జెప్పఁ దొడఁగె:
"కీలారితనము నేఁ [15]గ్రీడతోఁ దాల్చి । యాలకుఁ గర్తనై [16]యతనిఁ గొల్చెదను.
అందుకు వలయు కార్యములెల్లఁ గొంత । పొందుగా నెఱుఁగుదు భూనాథ, వినుము.
బడలి [17]నొచ్చినయట్టి పసరంబునైన । నడరి మేపఁగవచ్చు నడ్డంబు బలియు ;
వాలారుఁగొమ్ముల [18]వంజకుఱ్ఱలను । [19]జేలుపెట్టుచుఁ బాలు పితుకంగవచ్చు;
కదిసి చూచిన వజ్రకాయంబుగాఁగ । మొదవుల [20]తెవులెల్ల మొగి మాన్పవచ్చు.
పోఁడిగాఁ దఱిపి [21]క్రేవులు పొసఁగంగఁ । బాఁడి గైకొనవచ్చుఁ [22]బక్వంబెఱింగి;
కదలి మందలు మేపుగలనేల కరుగఁ । బదిలంబుగా వానిఁ బరికింపవచ్చు;
నరయఁ దంత్రీపాలుఁ డను [23]పేరు గలిగి । తిరుగుదు [24]నీకేల దీనికై నగవ?
జననాథుఁ [25]డెందుండి చనుదెంచి తనిన । [26]విను ధర్మజునివద్ద విహరింతు నందు."
అనవుడు [27]నిదియు మేలని ధర్మరాజు । తనర ద్రౌపదిఁ జూచి తా నంత వగచి:
"ఇది కడు మృదు[28]పాణి యిది పుణ్యసాధ్వి । హృదయంబు మెత్తన యీతలోదరికి.
అడ[29]వుల మనవెంట నరు[30]దెంచుచోట । నిడుమలఁ బడుఁగాని యెపుడు వేసరదు.
పతి [31]హితంబున కెన్నిపనులైనఁ జేయు; । నితరకార్యము లోప దెంతమాత్రంబు.

1. రిపుల కగ్గలమైన. 2. చోటతఁ డడిగె. 3. లతో. 4. అనిచెప్ప. 5. కందఁడు. 6. ప. 7. నున్న. 8. ముగ్ధ వీఁడెపుడు; ముదమున నెపుడు. 9. ని. 10. బాహు. 11. నకులునికన్న నున్నతి రూపవంతుఁ – డకలంక నిజతేజుఁ డధికసాహసుఁడు – తనువెంతయును. (తం. ప్ర.) 12. రాజుల. 13. దన్న వీ. 14. జాడ. 15. క్రియతోడ. 16. యవనీశునొద్ద – నందంబుగానుంద నందు కొక్కింత – పొందుగా నెఱుఁగుదు. 17. యెచ్చరలేని. 18. వంజ. 19. త్రేలు. 20. తెగులెల్ల. 21. క్రేవులు వేసరింప. 22. బరిపక్వ మెఱిఁగి. 23. పేరఁ బరగి. 24. నా. 25. డెటనుండి. 26. వినుతిగా మీవద్ద. 27. నదియె. 28. వాణి. 29. అడవికి. 30. దెంచెఁ జాల. 31. మోదమున.

రాజపత్నులనెల్ల రాజీవగంధి । రాజసంబున నేలు రమణతో మున్ను ;
నేఁడొక్కసతిఁ గొల్వనేర్చునే ?" యనినఁ । బోఁడిగాఁ బతికిఁ బూఁబోఁడి యిట్లనియె :
"[1]సైరంధ్రినై మత్స్యజననాథుదేవిఁ । జేరి నేఁ బరిచర్య సేయ నోపుదును.
జననాథ, యీరీతిఁ జరియించునపుడు । పనివడ నేఁజేయు పనులెల్ల వినుము.
వేసవి తడియార్చి విరటుభామినికి । జానొప్పఁ దుఱుముదు [2]జాతిక్రొవ్విరులు ;
కలపంబు లనువుగాఁ గస్తూరితోడఁ । [3]గలిపి నున్ననిపూఁతఁ గావింతు మేన ;
ఉత్తమ మణులేరి యురునితంబినికి । ముత్తెంబు లెడవెట్టి మొలనూళ్లు గ్రుత్తు ;
[4]చెక్కుల వ్రాయుదుఁ జెలువైన రేఖ ; । లొక్కొక్క [5]వింతగా నువిద భూషింతు ;
నలువొప్ప మాలినీనామంబుఁ [6]దాల్చి । మెలఁగుదు సద్దేవి మిగుల మన్నింప.
ఎచ్చోటనుండి నీ వేతెంచి తనినఁ । గ్రచ్చఱఁ బాంచాలికడనుండి యందు."
అనుటయు శంకించి యమతనూ[7]భవుఁడు । వనితఁ దప్పకచూచి వలనొప్పఁ బలికె :
"వనజాక్షి, నీ విట్లు వర్తించునపుడు । జననాథనగర దుర్జను లుండిరేని
విపుల భారతవంశ [8]విభులైన మాకు । నపకీర్తి రాకుండ [9]నడఁకువ నుండు.
నీ కంటె నెఱిఁగెడి నెలఁతలున్నారె ? । చేకొని [10]యొకమాట చెప్పి చూచితిని."
అనుటయు నమ్మాట [11]లాదరింపమియు । [12]వినుతహాసముఁ దోఁప విభున కిట్లనియె :
[13]సైరంధ్రులగువారు సాధుమార్గమున । వారక ధరఁ బతివ్రతలునై పరఁగి
పలుమాట లాడక పలువిచ్చి నగక । తలఁపు గానఁగనీక తాల్మితో నెపుడు
వర్తింతు రటుగాన వర్తింతు నేను । వర్తించుగతి మీకు వగవనేమిటికి ?"
అనిన సంతోషించి యా ధర్మరాజు । మునుకొన్న వేడ్కఁ దమ్ములనెల్లఁ జూచి :
"ఇట్లున్న మనలను నింక శాత్రవు[14]ల । కెట్లు కానఁగవచ్చు నీ యేఁటిలోన ?
వేయు మాటలునేల వేడ్క నిందఱముఁ । బోయి కొల్తము మత్స్యభూమిపాలకుని.
అమరంగ [15]మనవైన యగ్నిహోత్రముల । రమణ [16]నీ ధౌమ్యు[17]లు రక్షింపఁగల[18]రు;
ఈ రథంబులు గొంచు నెలమి సారథులు । ద్వారకానగరి కందఱుఁ బోవువారు ;
పరఁగ ద్రౌపది [19]యొద్ది పరి[20]చారికలును । దొరసి వండెడువారు ద్రుపదుఁ జేరుదురు ;

---

1. సైరంధ్రి యనుపేర జననాథు దేవి. 2. జాజి. 3. కలపి. 4. చెక్కున. 5. చెలువున. 6. పేర. 7. జుండు. 8. విధులైన. 9. నరయుమీ యనియె. 10. యట్లైన. 11. లాలించి యతివ. 12. వినుతి నాస్యము వంచి తెలఁది యిట్లనియె. 13. వర్తింతు నెట్లైన వసుధేశ, యేను – వర్తించు పనికినై వగవంగనేల—యనిన సంతోషించి. (ము. ప్ర.) 14. లు – ఎట్లు కాంచెదరు తా రియ్యేఁటిలోన. 15. వనముల, 16. నీ. 17. ఁడు. 18. ఁడు. 19. వద్ది. 20. చారకులును.

ఎచ్చోటికట వీర లేఁగుచోఁ దమ్ము । నచ్చోట మనవార్త లఱిగి కేనియును
వరుసతో నట ద్వైతవనములో విడిచి । యఱిగి రేమును గాన మనఁగలవారు."
అని బుద్ధిగాఁ జెప్పి యఖిల [1]సేవకుల । [2]ననిపె భూతలనాథుఁ డనుజులుఁ దాను.
[3]నప్పుడు ధౌమ్యుఁ డయ్యవనిపాలురకుఁ । జెప్పె నిట్లని రాజసేవించు తెఱఁగు :

## రాజసేవావిధానము ధౌమ్యుఁడు పాండవుల కెఱిఁగించుట

" పాండునందనులార, బలియు[4]రా మీర । లొండొక [5]విభుఁ గొల్చియుండుటచ్చెరువు;
[6]మదమేది మానావమానంబులకును । [7]మదినోర్చి కాని నెమ్మదిఁ గొల్వరాదు;
[8]ఓర్వక యొకరొక రుగ్రింతురేని, । గీర్వాణపతినైన [9]గెలువనోపుదురు.
కావున మీకు నేఁ గడఁగి భూపతుల । సేవించుగతి కొంత [10]చెప్పెద వినుఁడు.
[11] ఎఱుఁగువారికినైన నిటు పెద్దవార । మెఱిఁగించు బుద్ధిపై నిష్టంబు గలుగు.
[12]వినుఁడు భూవిభుఁ జేరి వినతుఁడై యచటఁ । దనకుఁ [13]బోలినచోటఁ దా నుండవలయు;
విభునిముందరఁ [14]బోక వెనుకకు[15]రాక । [16]సభలోన నుభయపార్శ్వముల నిల్వవలయు;
నిలిచి యవ్విభుమీఁద నిజదృష్టి సలిపి । మెలపుమైఁ బనులకు మేకొనవలయు ;
నరపతి మన్నించు నాకేమి యనుఁను । మరియాదమీఱుట మఱి కార్యహాని ;
నీచతఁ గొంత పూనిన మేలుగాని । రాచకట్టడ నుండరాద యెవ్వరికి ;
ప్రాజ్ఞుఁడు హితుఁడు తీర్పరి యతఁడనక । యాజ్ఞమీఱినవారి నణఁచు భూవిభుఁడు ;
చనవరి రాజుతోఁ జర్చించునపుడు । తనకు నడ్డమువచ్చి తగవాడరాదు ;
పలువురితోఁ గీడుపడసి రాజొద్ద । నొలఁగువారికి నేల మేలు సిద్ధించు?
ఒలసి భూపతివద్ద నూరకుండుటలుఁ । బలుమాటలును గావు పరిపాటిగాని.
విభుని యేకాంతంబు వెలిఁ[17]బుచ్చరాదు; । విభు[18]నకు నొరుమాట వివరింప[19]వచ్చు.
[20]అంతఃపురంబులో నతిమైత్రి [21]తగదు; । కాంతలు సభ[22]నున్నఁ గాన్పింపరాదు.

---

1. సైన్యముల. 2. ననిచి. 3. నొప్పుగా నరుగుచో నొనర ధౌమ్యుండు. 4. రై. 5. నృపు. 6. మత. 7. మతి...నుండరాదు. 8. ఓర్వ కొక్కొ-కవేళను. 9. గెల్వఁజాలుదురు. 10. చెప్పంగవలయు. 11. ఎఱిఁగెడువారైన నిలఁ బెద్దవార – లెఱిఁగించుభంగిపై నిష్టంబు గలదు. 12. మనుజేంద్రుఁ గొలుచు నమ్మనుజుండు తెలిసి. 13. బొందగు. 14. గాక. 15. పోక. 16. సభలోన నిల్వఁ బార్శ్వంబుల నొప్ప – నిలుచుచు విభునిపై. 17. సేయ. 18. నితో నొక. 19. రాదు. 20. అంతఃపురంబులో నతిమైత్రి సాధు – కాంతలు సభనున్నఁ గామింపరాదు. 21. వలదు. 22. నెందు.

ఒప్పువాహనములు నుత్తమాశ్వములు । నెప్పుడు [1]నృపుఁడీక యెక్కంగరాదు.
మన్నించుచో నుబ్బు, మనుజేంద్రుకినుక । తన్నుఁ జెందినచోట దైన్యంబుఁ దగదు;
ఓజతోఁ గరుణించె నుగ్రించె ననుచు । రాజుచిత్తము చెప్పరాదు మున్నాఁడి.
ఎండైన వానైన [2]నెంతయు నోర్చి । మండలేశ్వరుపంపు మఱిఁ జేయవలయు.
భూమీశుసొమ్ము [3]లెప్పుడు నాసపడక । పాముసొమ్ములుగాఁగ భావింపవలయు.
ఆవులింతయుఁ దుమ్ము హాసంబు నుమియు । వేవేగ విభునొద్ద వెలిఁ[4]బుచ్చరాదు.
వైరిదూతలతోడ వడి నల్పుతోడఁ । జేరి భాషించినఁ జెడు నెంతవాఁడు.
తోడరి భూపతి[5]యొద్ద దోమతోనైన । విడువ[6]ని పగమోచి [7]విహరింపరాదు.
కుడిచి కట్టితి నేమికొఱంత నాకనుచుఁ । బుడమిలో మెఱయుచుఁ [8]బొంగంగరాదు;
ఇది [9]బుద్ధిగా మీర లీమత్స్యవిభునిఁ । గదిసి [10]సేవింపుఁడు కార్యసిద్ధికిని."
అని లోకహితముగా నప్పురోహితుఁడు । వినిపించుటయు నీతి విని పాండుసుతులు:
"అతికృతార్థుల మైతిమయ్య, మీవలనఁ । జతుర సేవాధర్మ[11]చరితంబు దెలిసె.
తల్లిదండ్రులరీతిఁ దగ బుద్ధిచెప్పి । యుల్లంబు చల్లఁగా నుపచరించితిరి.
పోయివచ్చెద మింకఁ బోలుపైన లగ్న । మాయితంబుగఁ జేసి యనుపుఁడీ.' [12]యనిన,

## పాండవులు విరాటనగరాభిముఖులై వెడలుట

ధౌమ్యుండు నగ్నిహోత్రములు దెప్పించి । కామ్యపూజలు చేసి గమనమంత్రము[13]లు
జపము సేయుచునున్న సమయంబునందు । నృపతులేవురు లేచి నెలఁతయుఁ [14]దాము
[15]నసమున నతనికి నగ్ని దేవునకు । వెసఁ బ్రదక్షిణముగా వేడ్కతో వచ్చి
సుముహూర్తమని[16]చెప్ప శుభనిమిత్తములు । క్రమముతోఁ జూచుచుఁ గదలిరందఱును.
అప్పుడు ధౌమ్యుండు నరుదేర నృపులు । తప్పక కాళింది[17]తటమున వెడలి
[18]మిగులు పాంచాలభూమికి దక్షిణముగ । మొగి శూరసేనభూములలోనఁ జొచ్చి
పడమటి ముఖముగాఁ బ్రతివాసరంబు । నడచిపోవుచు నెట్టినగరంబుఁ జొరక,
అడవిలోఁ గూర లాహారంబుచేసి । తడయక బహువినోదములు చూచుచును,

---

1. విభు. 2. సెల్లయు. 3. దెంపున. 4. సేయ. 5. వద్ది. 6. క. 7. పెసనుండ. 8. భోగింపరాదు. 9. యంతఁ దలపోసి యీ. 10. వర్తింపుఁడు. 11. సహజంబు. 12. ర. 13. ల. 14. దారు. 15. నసలార. 16. పించు. 17. దరిజాడవచ్చి. 18. మిగుల.

[1]పొలుపారఁ బూచిన పొదరిండ్లజాడఁ । జెలఁగు చల్లనిగాలిచేఁ జేరుచును,
[2]వలయు పద్మములచే [3]వాసింపఁబడిన । కొలఁకుల జలకేళి కోర్కెఁ జేయుచును,
[4]బహువన్యమృగముల బహువృక్షలతల । బహునదీనదముల బక్కిఁ జూచుచును,
జెలఁగుచు వనవీథిఁ జిత్తముత్తాడు । పులుఁగులయెలుఁగు లాలింపఁగ వినుచుఁ,
బలువమాఱు నెడనెడఁ బర్ణశాలలకుఁ । దొలఁగ నొయ్యనఁ [illegible]గుచును
జనిచని మత్స్య[5]రాజ్యము చేరఁబోయి । తనవారి సంతతి ధౌమ్యు [6]వీడ్కొలుప,
నతఁడుఁ బుణ్యాశ్ర[7]మోపాంతభూములకుఁ । జతురుఁడై యేతెంచె [illegible].
[8]అటఁ బాండవులుఁ [9]బోవ నలసి పాంచాలి । పలుశోకవివశయై పతుల కిట్లనియె:
"[10]ఆసాన వచ్చితి నతిదూరమేను । గాసిల్లు నెఱుఁగ[11]క గడవ నేఁగెదరు.
కొలఁకులు [12]నదులు ప్రమోఁకులుఁ జూపిచూపి । నిలిచెదమని మోసపిలువ కేఁగెదరు;
మిడుకు మధ్యాహ్న[13]మై మెఱసెఁ గాల్నడను । విడువక చనుదేర వెంచములోవుదురె!
కాళ్లనఖములందుఁ గ్రమ్మె [14]నెత్తురులు; । వ్రేళ్లపుటంబుల విరిసె [15]బొబ్బలును;
[16]పొందుగాఁ దఱచుటూర్పులు సందడించె; । నిందుండి రాలేను; ఎక్కడలసితిని."
అనుటయుఁ గరుణించి యా ధర్మరాజు । పనివడ నకులుఁ దప్పకచూచి పలికె:
"ఏదో ప్రొద్దున[17]కైన నీమత్స్య[18]పురికిఁ । బోదము [19]నేఁడింకఁ బొదిగూడి; మనము
దూరించి యేతేరఁ దూలి పాంచాలి । వారక పడఁదాఁకి నడిఁ గూడలేదు.
ఏచందముననైన నీచంద్రవదన । మోచితేవలె [20]నీవు మొగిఁ గొంతదవ్వు".
అనవుడు నకులుఁ డయ్యవనీశుమాట । విననివాఁడును బోలె వెస నూరకున్న
[21]జనపతి దానికి సహదేవుఁ బలికె; । గొనకొని యతఁడుఁ గైకొనలేమి యెఱిఁగి
మఱి ధనంజయుఁజూచి మనుజవల్లభుఁడు । తఱచైన కన్నీరు దలఁక నిట్లనియె:

---

1. పొలుపారు చల్లని పొదరిండ్లజాడఁ – జెలఁగి యంతంతటఁ జేరి నిల్చుచును. 2. వెలయు. 3. వినుతింప. 4. బహువర్ణమృగముల బహుపక్షితతుల – 5. దేశము. 6. వీడ్కొలిపి – రతఁడు. 7. మప్రాంత. 8. అటు. 9. బోవునపుడు. 10. ఆసన్నమని వచ్చి. 11. రు. 12. నదులును గోర్కెఁ జూపుచును. 13. ము మెఱయ. 14. రక్తములు. 15. బొక్కులును. 16. పొందుగా నూర్పులు సందడింపంగ – నిందుండి నొచ్చితి నేను రాలేను. 17. నైన. 18. పురము. 19. మన మంచుఁ బొదిగూడి యిట్లు – వడి వచ్చు మనవెంటఁ బాంచాలి యకట! వడదాఁకి రాలేక బడలుఁ జూచితిరె? ఏచందమున. 20. నీవు. 21. మనుజేంద్రుఁ డప్పుడు మఱిఏమిని యనక – యనువొంద సహదేవునట్ల పల్కుటయు – గొనకొని యతఁడుఁ గైకొనలేమి యెఱిఁగి – తనయానతినిఁ గ్రీడి తలఁ దాల్చునంచు – మఱి ధనంజయు.

"ఎంతెంత నడచిన నీ మత్స్య[1]నగర । మంతంత దూరమై యరుగుచున్నది[2]యు;
ఈ మధ్యముననుండ నిమ్మలే దెందు; । నీ ముగ్ధ రానోప దిఁక నింద్రతనయ!
ప్రాకటంబుగ నేఁటి పయనంబున[3]కును । నీకు బొంకఁగనేల నేను [4]డస్సితిని.
[5]ఓపి యీతనుమధ్య నొకయింతదవ్వు । ఏపుమీఱంగను నెంతయుఁ బ్రీతి
మూఁపుపై నిడుకొని మోచి తెచ్చినను । నీపేరుగా నేఁడు నెలవు [6]సేరుదుము."
అనవుడు నౌఁగాక యని సవ్యసాచి । తన భుజంబులమీఁదఁ దరళాక్షి నునిచి
తామరఁ గొని[7] తెచ్చు దంతిచందమునఁ । బ్రేమతో [8]నే తేరఁ బృథివీశుఁ డపుడు
పురముఁ [9]జేరితిమంచుఁ బురగోపురములు । సొరిదిఁ దమ్ములకెల్లఁ జూపి యిట్లనియె:

## పాండవులు తమ యస్త్రములను జమ్మిచెట్టుపై దాఁచఁబెట్టుట

'ఈ దేహకాంతులు నీ యాయుధములు । నాదట ధరియించి యటఁ బోవరాదు;
తగిన రూపంబులు దాల్చి కైదు[10]వుల । నొగి [11]దాఁచవలె నింక నొక్క[12]తావునను.
ఈ గాండివముఁ గన్న నెఱుఁగరే మనల । బాగైన పెనుపాముభంగి నొప్పెడిని.
[13]మన కార్ముకము లొక్కమరియాదఁగాని । జనులకు నివి యవశ్యముఁ జూపరాదు.
అమరేంద్రతనయుఁ డీ యస్త్రంబుఁ బాసి । నిమిషమాత్రం బేని నిలువంగ లేఁడు.
ఎట్లైన నివి దాఁచు టిదియె కార్యంబు । చోట్లు గుఱుతుగాఁగఁ జూచి [14]రం" డనిన,
నేఁ బోదుమని పూని యెలమి నర్జునుఁడు । పూఁబోణి [15]నొకచోటఁ బొలుపార నునిచి
యలయక [16]వీక్షింప నటఁ బోయిపోయి । పొలుపుమీఱిన [17]రుద్రభూమి చక్కటిని
గనియె నానాభూత కలితాట్టహాస । ఘన కాక ఘూక భీకరమైనదానిఁ,
జటుల [18]శాఖాబాహుచక్ర విక్రాంతిఁ । బటు దిశాపటల సంపద [19]గప్పుదానిఁ,
బొడవైన కొమ్మ లిమ్ములఁ జాచి మిన్ను । గడవ రోయుచు నున్నగతి నొప్పుదానిఁ,
గవట లొంటొంటితోఁ గదిసి చీఁకట్లు । ప్రవిగూఢమైన జొంపము లొప్పుదానిఁ,
గ్రమముతో నందంద కారాకు రాల్చి । రమణఁ [20]బ్రేతాగ్నుల రాఁజిల్లుదాని

1. పురము. 2. య. 3. నంట. 4. నొచ్చితిని. 5. ద్రౌపది నొకకొంతదవ్వు తేవలయు—నీపేరుగా. 6. సేరెదము. 7. వచ్చు. 8 చనుదేర. 9. జేరఁగ మత్స్య. 10. వల. 11. దాఁప. 12. దాపు. 13. మన విండ్లెఱుంగరే మహి నెల్లజనులు. 14. రమ్మ. 15. నొకవంకఁ బొందుగా నునిచి. 16. యలవోయి యనతిదూరమున. 17. ప్రేతభూమి చెంగటను. 18. బాహాశాఖ. 19. గొప్పు. 20. ద్రేతా.

మిన్నేరు [1]శిరమున మేనఁ బాములను । జెన్నారఁ [2]దాల్చుచు శివుఁ బోలుదాని,
గాండీవమిచ్చిన కర్త నా యందు । నుండు [3]నిచ్చటఁ జాప మునుప రమ్మనుచు
మొగిఁ గ్రీడిఁ బిలుచు [4]చొప్పున గాలిఁ గదలు । చిగురాకు [5]వ్రేళ్ళచేఁ జెలువైనదాని,
భావింప నిష్టంబుఁ బాండు పుత్త్రులకుఁ । గావింప నొకవేళఁ గలిగె నా కనుచుఁ
[6]బొనర సంతోషించి పులకించె ననఁగ । ఘన కంటకములచేఁ గర మొప్పుదాని,
[7]విస్తీర్ణమగు జమ్మి [8]వీక్షించి నరుఁడు । [9]ప్రస్తుత మొనఁగూర్చ బాగయ్యె ననుచుఁ
దప్పక చనుదెంచి ధర్మరాజునకుఁ । జెప్పంగఁ దొడఁగెఁ దోఁచిన యుపాయంబు :
"అల్లదె జమ్మి మీ రవధరించితిరె? । ఎల్ల [10]శస్త్రాస్త్రంబు లిందు దాఁపుదము.
జనులకు రాఁ బ్రయోజనము లేదిందు; । [11]జననాథ, వచ్చియు సాధింపలేరు.
[12]శరముకైవడిఁ దోఁపఁ జర్మంబు పొదివి । భువిమీఁద నేరికిఁ బొడసూపకుండ
శరచాపములఁ గట్టి జమ్మిపైఁ బెట్టి । వెరవొప్ప నొందైన విహరించి మనము
క్రమ్మఱఁ జనుదెంచి [13]కైకొన నొప్పు; । [14]నిమ్మగా నీవేళ కిది నాకుఁ దోఁచె."
అనవుడు నౌఁగాక యని ధర్మసూనుఁ । డనుజులుఁ దాను నొయ్యన జమ్మిఁ జేరి :
"వెలయ మీమీ విండ్లు వెస నెక్కుడించి । యలవొప్ప నా చేతి కందియిం." డనినఁ,
బన్నుగాఁ దనవిల్లు పార్థుండు చూచి । కన్నుల [15]వెడనీరు గ్రమ్మ నిట్లనియె :
"ఇది సాధనంబుగా [16]నెల్ల రాక్షసులఁ । [17]త్రిదశ గంధర్వులఁ దివిరి సాధించి
యని మొన గర్వాంధులైన శాత్రవుల । జనులెల్లఁ గొనియాడ సంహరించితిని.
కడపట [18]నొకద్రుమానఁ గట్టి యీ విల్లు । విడువంగవలసె [19]దైవికము కతమున."
అని యెక్కుడించుచు నా ధర్మసుతుని । ధనువు తప్పక చూచి తలఁకి వెండియును :
"ధర్మజ, యీ విల్లు ధరియించి నీవు । [20]దుర్మదాంధుల నెల్లఁ దునిమివైచితివి;
[21]భరతరాజ్యంబున భయము లేకుండ । [22]నరసి యీ వింట నీ వాజ్ఞపెట్టితివి;
దనుజు [23]లెయ్యదిగన్నఁ దల్లడిల్లుదురో । ధను విట్టిదియు నీకు దాఁచంగవలసె."

---

1. శిరసున. 2. నచ్చోట. 3. నీవిట. 4. నిమ్మల. 5. చేతుల. 6. పొసఁగ సర్వాంగంబుఁ బులకించి నట్లు – ఎసఁగు కంటకముల నెసఁగిన దాని. 7. విస్తార. 8. వీక్షించె నరుఁడు. 9. ప్రస్తుతు లొనరించి. 10. శస్త్రంబుల నిందు. 11. జననాథు లెంతయు. 12. శరము కైవడిఁ దోఁపుచుండంగ మనము(?) – నిబిడంబుగాఁ గేశనిచయంబు చుట్టి – శరచాపముల. 13, కైకొనందగును. 14. నిమ్మల నీవేళ నిదిగాని కాదు. 15. కన్నీరు; బాష్పంబు. 16. నేను. 17. త్రిదశేంద్రవైరుల. 18. నీ. 19. దైవికంబుకతన (?). 20. దుర్మార్గులను. 21. భారతరాజ్యంబు. 22. అరసి – యీవింట నాజ్ఞ. 23. లీ విలుగన్నఁ దల్లడింపుదురు.

అనుచోట ధర్మజుం డది యెక్కుడించి । [1]వెనుక తమ్ములనెల్ల వీక్షించి పలికె:
"సైంధవ యుక్త పాంచాల సైన్యముల । సంధించి బకవైరి చంపె నీ వింట;
ప్రకట బాహాశక్తిఁ [2]బరఁగి యీ వింట । నకులుండు సౌరాష్ట్రనాథు [3]మర్దించె;
కాళింగ పాండ్య మాగధుల నీ వింటఁ । జాల భీతిలునట్లు సహదేవుఁ [4]డేసె;
ఇట్టి కైదువులెల్ల నిదె నేఁడు మోఁపు । గట్టి ప్రమానున [5]వ్రేలఁ గట్టంగవలసె."
అని యెక్కు [6]డించిన యన్ని కైదువులు । ఘన గదా ఖడ్గ చక్రములతోఁ గూడఁ
బెట్టెలోఁ బాములఁ బెట్టు చందమునఁ । బట్టి నెట్టనఁగట్టి పైఁ దోలు [7]పొదివి
యా మీఁద నెంద్రుక [8]లమరంగఁ జుట్టి । భూమీశుఁ డవిగొంచు భూజంబు ప్రాఁకి
పదిలంబు చోటుగాఁ బరికించి చూచి । ముదముతో ముదురుఁ గొమ్మున వ్రేలఁగట్టి*
[9]యప్పుడు ధీరుఁడై యస్త్రదేవతల । నొప్పుగాఁ బ్రార్థించి యోలి నిట్లనియె:
"ఏనును విజయుండు నే తెంచునపుడు । కాని మీ రూపులు గానరా[10]కుండ
వర్తింపుఁడయ్య యెవ్వరు నచ్చి[11]రేని; । కీర్తింపుచున్నాఁడఁ గృతపుణ్యులార!
అరులపై మనభీమః డాగ్రహం[12]బెత్తి । యరుదెంచుఁ బలుమాఱు [13]నాయుధంబులకు;
ఇయ్యేఁటిలో మీర లితని [14]నే మరక । చయ్యన నొకమాయ నవరిం[15]పరయ్య."
[16]అని చెప్పి ధర్మజుఁ [17]డా ప్రమాను డిగ్గి । పౌనరఁ బ్రదక్షిణంబులు చేసి ప్రమొక్కి
భీముఁ[18]డు దీనఁ గోపించునో యనుచు । భీముని [19]దెస కొంత ప్రియముగాఁ [20]జెప్పి
యతనిఁ గౌఁగిటఁ జేర్చి యచ్చోటఁ గొంద । ఱితరులు వర్తింప నిచ్చలో బెదరి
[21]తా రొండొరులతోడఁ దగఁ బల్కురీతి । వారికి నమ్మఁబెట్టవలసి యిట్లనియె:
[22]మొదల నూఱేడుల ముసలి [23]యీ తల్లి । యిది [24]నేఁడు దీక్షిప నిట్లు చేసితిమి;
పూని వీనుఁగుఁ గాల్చి పోదురు [25]గాక । ప్రమానఁ గట్టెడువారు మహిలోనఁ గలరె!
తడయక మనకుఁ బెద్దలునేయు జాడఁ । గడఁగి చేయకపోదు గానఁ జేసితిమి."
అని యిట్లు పలుమాఱు నచటి గోపాల । జనములు వినఁనా[26]డి సహదేవుఁ [27]బిలిచి

---

1. వెనుకొని భీముని. 2. పరగ. 3. నొప్పించె. 4. డేలె. 5. నార; నేల. 6. డించుచు. 7. పొదిగి. 8. లనువుగా – * యక్కడ ధీరుఁడై యా ధర్మరాజు – తక్కఁ గొనియాడి తనరఁ బ్రార్థించి – పదిలంబు. 9. యప్పుడు నరనాథుఁ డస్త్రదేవతల – నెప్పుగాఁ బ్రార్థించి యొనర నిట్లనియె – నేనును. 10. నీక. 11. రైన. 12. వృత్తి. 13. నాగ్రహంబునను. 14. కే. 15. పుఁడయ్య. 16. అనుచు. 17. డంతనా. 18. డీపనికి. 19. కొక్కింత. 20. బలికి. 21. వారికి నమ్మఁబెట్టవలసి పాండవులు – వారక తలయెత్తి వరుస నిట్లనిరి – మొదల. 22. మొదలను నూఱేండ్ల. 23. యై; మా. 24. యీడు. 25. గాని. 26. డ. 27. డంత.

బలిసి యచ్చట నొక్క పసరంబు చచ్చి । [1]యెలమి నుండుట చూచి యీడ్చి తెప్పించి
దాని తో లొలిపించి [2]తమ కై దువులకు । నాకకు సూటుగా వరుసఁ జుట్టించి
మఱియు నచ్చట నొక్క మనుజుని బొంది । [3]యురక నిస్సారమై యున్న నీక్షించి
యిది [4]యుంఛ వృత్తిచే నిట్లయ్యె ననుచుఁ । గొని కై దువులతోఁ గట్టిం[5]చె నదియు.
ఇత్తెఱంగున జమ్మి నెల్ల కై దువులు । ముత్తంపు[6]గాఁ బెట్టి మోపించి నృపులు
[7]దూరించి లోకు లీ దుర్గంధమునకుఁ । జేరగా వెఱతు[8]రంచుఁ జిఱునవ్వు [9]నగుచు
నచ్చోటు పాసి తా రా మత్స్యపురికి । [10]వచ్చుచో నప్పుడ వసుధేశుఁ డనియె:
"ఒరులెఱుంగక యుండ నొక్కొక్క పేరు । ధరియింతు మది మీకు[11]నెప్పుగా వినుఁడు.
అరుదార జయుఁడు జయంతుండు విజయుఁ । డలయు జయత్సేనుఁ డలు జయోద్బలుఁడు
మఱవక మనలోన మనము [12]పిల్చుటకుఁ । దెఱఁగొప్ప[13]నివి నామధేయ[14]ంబులిపుడు."
అని చెప్పికొని [15]వేడ్క నటఁ బోయిపోయి । తనరారఁ [16]బుణ్యతీర్థముఁ గని నృపులు
అందుఁ దీర్థములాడి [17]యట సేద దేఱి । యుండక సుఖమున్న యపసరంబునను
పదిలంపు నిష్ఠతోఁ బాండవాగ్రజుఁడు । ముద[18]మొప్పఁ దూరుపు[19] ముగముగా నిలిచి
కరములు మొగిచి యాకాశంబుఁ జూచి । పరగ నంతకు నిట్లు ప్రార్థించి పలికె:

## సన్న్యాసి వేషధారియై ధర్మజుఁడు విరటుఁ గొల్వఁబోవుట

"ధర్మదేవత, నాకు దయ నొక్కవరము । నిర్మించి [20]తది నేఁడు నెమ్మి నీవలయు ;
అది నమ్మి దుర్యోధనాది వైరులకు । నొదుఁగక వర్తింతు నుర్వి [21]నీ యేఁడు.
నాఁడు నాతమ్ముల [22]నలినాకరమునఁ । బోఁడిగా బ్రదికించి పొడచూపి నీవు
మాకు బుద్ధులు చెప్పి మము నూఱడించి । మాకు నిచ్చిన యీవి మఱవంగ[23]లేము."
అని తారు విప్రుని యరణిఁ దేఁబోయి । ఘనత నొంపినమేలు గానరా [24]వాడి
యేపార మోడ్చిన యిరుగేలు నొసల । దాఁపించునంతలో ధర్మరాజునకు

---

1. యిలమీఁదఁ బడియుంట నీక్షించి యీడ్చి. 2. తనరఁ గైదువులు. 3. యరసి నిస్సారమై యదియున్నఁ జూచి. 4. యుపాయము సేయ. 5. చి రదియు. 6. తోఁ గట్టి. 7. తోరమై పర్వ నీ ... ... మెవరు. 8. ని. 9. నవ్వి. 10. నచ్చుగాఁ బోవుచు ననియె ధర్మజుఁడు. 11. తరువాత. 12. పిల్చుచును. 13. నీ. 14. ముల్ మనకు. 15. పోయి యట వేడ్కతోడ. 16. గాళిందితటిఁ జేరి నృపులు. 17. యాదరి తేలి. 18. ముతో. 19. ముఖము. 20. తగనాకు, 21. నెల్లెడల. 22. నడుకానఁబడిన. 23. లేదు. 24. బలికి.

కాషాయవస్త్రంబు ఘనకమండలువు । [1]బాషండగతిగాని పట్టెవర్ధనము
[2]దండంపుఁగోలయుఁ దగిన పాదుకలు । మెండైన జపమాల మెఱయ నాక్షణము
యలవడి[3] యతివేష మాయితంబైన । నెలమి సంతోషించి రెల్లపాండవులు.
అప్పుడు మఱియుఁ బ్రత్యక్షమైనట్లు । తప్పక నృపుల [4]నంతకుఁడు మన్నింప,
నేరూప మెవ్వారి కిష్టమై యుండె । నారూపములు చాల నందమై యుండఁ
జీరలుఁ దొడవులు శృంగారములును । వారకంబులు పోలె వరుసతోఁ గలిగె.
పరితోషమున నంతఁ బ్రథమపాండవుఁడు । పరఁగఁ దమ్ములఁజూచి పాంచాలిఁ జూచి
క్రమమొప్ప నొక్కరొక్కరు వచ్చునట్ల । రమణఁ గట్టడచేసి రాజసంబఱచి
యొగిఁ బెక్కు తెఱఁగులై యున్న పాచికలు । తగవొప్ప [5]నెంతయుఁ దా సంగ్రహించి
పోవుచో, విరటుండు [6]పుణ్యంబుపోలె । నావేళ [7]బయటఁ గొల్వమరంగ నుండి
యతివేషధారియై యరుదెంచు ధర్మ । సుతునిఁ దప్పక చూచి చోద్యంబు నొంది
తన ప్రధానులకు నాతనివంక చూపి । మనసులో హర్షించి [8]మఱియు నిట్లనియె :
"ఉన్నతి యతినాథు నొనరఁ జూచితిరె? । కన్నుల పండువై [9]కానవచ్చెడిని;
భువనత్రయము నేలు పుణ్యుఁడో యితఁడు! । అవనిలో భిక్షుకుండని చెప్పరాదు;
ఓలి నీతనిఁగొల్చి యుభయపార్శ్వముల । [10]నేలకో చనుదేర విభతురంగములు!
చెలువైన మూర్ధాభిషిక్తు నీపురుషుఁ । గొలిచి రా[11]రేలకో కోటిసద్భటులు!
వెలిగొడుగులనీడ వింజామర[12]లకు । [13]నలవడఁ దోఁచె నీ యతిభాగ్యరేఖ;
యతిరూపధరుఁడైన నగుఁగాక యితని । జతనమై పాయదు సౌభాగ్యలక్ష్మి.
[14]ఈ వంకఁ [15]దనకు రా నేమికారణమొ? । భావింప మనమేమి ప్రాఁతి యాతనికి?
[16]అడుగుట నాభాగ్య మతఁడు నన్నర్థి । నడిగిన నా రాజ్యమైన నిచ్చెదను;
ఇచ్చునంతియకా దిఁకేను నా ప్రజలు । నిచ్చలుఁ బరిచర్య నెమ్మిఁ జేయుదుము."
అని లేచి నృప[17]తీంద్రుఁ డా యతీంద్రునకు । నెనసిన భక్తితో నెదురుగాఁ[18] బోయి

1. పాషాణగతిగాని. 2. దండంబుఁ గుశపవిత్రంబు మౌంజియును - నొండొండఁ జూపట్టి యుండె నావేళ - దలవడి. 3. డ. 4. నాతఁడును మన్నించి - యేరూప. 5. ముడిగొని తాను. 6. పున్నెంబు. 7. లీల నొప్పారెఁ గొల్వుండి. 8. మనుజేంద్రుఁ డనియె. 9. కానంగఁబడియె. 10. నేలో. 11. రావేలకో కోటిసంఘములు; రావేమొకో కోటిసైన్యములు. 12. ములు. 13. నలవడెఁ దోఁచ. 14. ఈ శంకఁ దనకింక నేమికారణమొ - భాషింప. 15. దనకింక నేమి కార్యంబు. 16. అడుగుల సౌభాగ్య మలరగా నితని - కడిగిన నీ. 17. చంద్రు. 18. వచ్చి.

కన్నంతటనె మ్రొక్కి ఘనతఁ దోడ్తెచ్చి । [1]సన్నుతి నున్నతాసనమున నునిచి
[2]పనివడి పన్నీటఁ బాదము ల్గడిగి । తనమేని [3]పుట్టంబుఁ దడియొత్తఁ జేసి
[4]చలువగాఁ దనువునఁ జందనం బలఁది । [5]చెలువార నంజలిచేసి యిట్లనియె :
" ఎచ్చోట విహరింతు ? రేది మీ నామ ? । మెచ్చోటి కేఁగెద ? రేమి కారణము ?
[6]చెప్పఁడు నిజముగాఁ [7]జెలఁగి మీతోడ । నిప్పుడు భాషింప నిచ్చె నీశ్వరుఁడు."
అనవుడు విని మందహాసంబుచేసి । తనర నయ్యతివేషధారి యిట్లనియె :
"మన్ను మిన్నును నీరు మారుతం బగ్ని । యున్నియుఁ గూడఁగా నీ శరీరంబు
ప్రజల కొదవుఁ దొట్రుపాటు గావింప ; । నిజమాడ నెవ్వఁడు నేర్చు లోకమున ?
అదియు నట్లుండె ; మత్స్యాధీశ, నాకుఁ । జనురొప్పు కురుభూమి జన్మదేశంబు ;
చెలువార ధర్మజు చెలికాఁడ నేను ; । పలుకులేటికిఁ గంకుభట్టు నాపేరు ;
నెఱవుగా జూదంబు నృపతి లక్షణము । నెఱుఁగుదుఁ ; [8]గథలందు నేఁ బ్రవీణుఁడను.
నాకు [9]నోర్వనివారు నాధనంబెల్లఁ । జేకొని వెడలఁద్రోచిన వచ్చి యేను
నీ గుణంబులు విని నిన్నొక్కయేఁడు । బాగొప్ప సేవింతుఁ బ్రతినతో ననుచు
రయమొప్ప వచ్చినరాక యీ రాక ; । [10]నియమమేర్పడ నిట్లు నేర్పుతో నుందు ;
నుపకారమునకుఁ బ్రత్యుపకార మేను । నృప, చేయనోపుదు [11]నెఱి నొక్కయెడను.
ఇది వర్తనముగాఁగ నేఁడు నిండించి । పదిలమై [12]పోవుదుఁ బగవారి గెలువ."
[13]అన విని మనుజేంద్రుఁ డతని కిట్లనియె । [14]వినయహర్షంబులు వెన జోడుపడఁగ :
"[15]అట్ల చేయుఁడు ; పొందుఁ డఖిలభోగముల । నెట్లు కావలసిన ; నే నున్నవాఁడ.
ఎవ్వఁడు మీకును నెగ్గు [16]గావించెఁ । ద్రెవ్వనేయుదు వానిఁ దివిరి సన్నంపు.
ఇదియేల మీరు మమ్మేలి సామ్రాజ్య । పదవిఁ జేకొనరాదె పరిణమించెదను.
ఏలినఁ ద్రిజగంబు లేలనోపుదురు ; । పోలింప మా మత్స్యభూమి మీకెంత ! "
అన విని దరహాస మాననాబ్జమునఁ । దనరార నతనితో ధర్మజుం డనియె :

---

1. యున్నతాసనమున నొనరంగ నునిచి. 2. తనరఁ బన్నీటఁ బాదపద్మముల్ గడిగి(?). 3. వలువచేఁ దడియొత్తి భక్తి. 4. చెలువార...శ్రీగంధ మలఁది. 5. పొలుపొప్పఁ జేతులుమోడ్చి. 6. అచ్చుగాఁ జెప్పఁడ యలమి మీతోడ. 7. జెలిమి. 8. గథలలో. 9. ను బగవారు. 10. నియమమై నేనోప నీ పంపు పనులు. 11. నే నొక్కతఱిని. 12. మఱి పోదుఁ బగఱ సాధింప. 13. అనుటయు. 14. వినయంబు హర్షంబు విజ్జోడు. 15. అటువలెఁ జేయుదు నఖిలభోగములు – నెటువలెఁ గావలె నెల్ల మీకిత్తు. 16. గావించు.

"వడి నేలఁబడియుండి వట్టివంటలను । గుడిచి నెయ్యది నుండుకొలఁది మాకొలఁది;
భూము లేలఁగనేల? భోగంబులేల? । భూమీశ, [1]నీకింత బోధింపవలదు."
అనవుడు భూపాలుఁ డటు సమ్మతించి । తనకు జూదముమీఁది తమకంబు చెప్పి
మీతోడి [2]సద్గోష్ఠి మేలయ్యెననుచుఁ । [3]బ్రీతుఁడై కౌంతేయుఁ బెద్ద మన్నించె.

## భీముఁడు వలలనామంబున వంటలవాఁడై విరటునొద్ద కేఁగుట

అతఁ డిట్లు [4]భూనాథు నర్థితోఁ గొలిచి । యతి మాన్యుఁడై [5]యుండు నవసరంబునను,
వంటలవానికై వడి దోఁప భీముఁ । డొంటిమైఁ జట్టువం బొకచేతఁ బట్టి,
చంక నుగ్రపుఁ బేంతి సవరించి, దిండు । [6]వంకితోఁ గూడంగ వడిఁబట్టి బిగిచి,
కోలలు డాకేలఁ గొన్ని సంధించి, । లీలఁ జిత్రించిన లేఁదోలు [7]గప్పి,
చతురుఁడై [8]తమయన్న చన్నమార్గమున । గతి[9]గూడి మత్తేభగమనంబు[10]తోడ
విరటు [11]చూపఱులకును బ్రేఁకమై తోఁప । వెరవుతో నాస్థాన[12]వేది డగ్గఱిన,
నల్లంత [13]భూపాలుఁ డతనియుద్ధతికిఁ । దల్లడంబంది యొంతయుఁ [14]జోద్యమంది
జనులు వారికివారు సంభ్రమింపఁగను । దనలోన నిట్లని [15]తలపోయఁ దొణఁగె:
భీమ బాహాశక్తి పేర్మి [16]వీక్షింప । మే మెన్నఁడును [17]జూడ మిట్టి మానవుని.
మానవమాత్రుఁడే మహిలోన నితఁడు! । భానుఁడో మఱి చిత్రభానుఁడో [18]కాక!
ఇతని వంశముఁ బేరు నెట్టిదో ధాత్రి? । [19]నితని మున్నెఱుఁగువా రెవ్వ రిచ్చోట?
వచ్చుకార్యము చెప్ప[20]వలయుఁ గా కితని । కిచ్చెద నీరాజ్య మేను గైకొనక."
అనుచోట విభుఁ జేరనరిగి వాయుజుఁడు । మునుకొని[21]జయపూర్వముగ మ్రొక్కిపలికె:
"కులమున శూద్రుండఁ గువలయాధీశ! । సొలయక మును ధర్మజుని [22]బానసీఁడ;
[23]వలలుండు నాపేరు; వసుధ నెవ్వారుఁ । దలఁప నాసరి[24]గారు తగిన వంటలకు;
నినుఁ గొల్వవచ్చితి; నీ వింక నాకు । నొసఁగ గూడును జీరయును బెట్టు చాలు.

---

1. యతులకు భోగ మేయూరు. 2. సుఖగోష్ఠి. 3. బ్రీతితో. 4. విరటుని; బ్రార్థింప. 5. యున్న య. 6. వంకిణితోఁగూడ వడివట్టి. 7. దాల్చి. 8. తన. 9. గూడ. 10. నొప్ప. 11. సభ్యులకును. 12. వీథి. 13. బొడగాంచి...యుద్ధృతికి. 14. దత్తరించి. 15. తలపోసె నృపుఁడు. 16. నూహింప. 17. గాన, 18. యితఁడు. 19. శ్రుతమతిఁ దెలియువా రెవ్వ రిచ్చోట. 20. వలెఁగాక యితని. 21. వినయసంపూర్ణుఁడై మ్రొక్కి. 22. బాని. 23. వలలుండ ననువాఁడ. 24. లేరు.

పురణించి [1]యుబ్బెసపోక నీ [2]యెదురఁ । బెరసి యేనుఁగుతోడఁ బెనఁగులాడుమను;
కా తెనుపోతైన ఘన సింహమైన । మీఁకి పట్టఁగ నేర్తు మొసలి పోకఁడ;
అంచితశక్తి నేనన్న [3]మల్లుగాను । బంచ బంగాళమై పాఱిపోవురురా;
ఏలిన నేలు నన్నేలు భూపులకు । మేలుబంతియు పోలె మె[illegible]నుండెదను."
అనవుడు విరటుఁ డ య్యనిలసంభవునిఁ । గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప:
"ఎక్కడిమాట నీ వెట్లు శూద్రుఁడవు? । చిక్కసి నీ మేని చెలువంబు [4]చూడఁ
బ్రాకట సామ్రాజ్య పద[5]వికాఁ గాదె! । నీకు నేటికి నింత నీచవర్తనము?
వివిధ వాహనములు వివిధ సంపదలు । నవరించి [6]యిచ్చెదఁ జనవుతో నుండు."
అనుటయు భీముఁ డొయ్యన మోము [7]గదల । మనుజేంద్రు మాట సమ్మతిగాక పలికె:
"అవి యెల్ల నా కిష్టమైన మార్గముసఁ । గువలయాధిప, నన్నుఁగొలిపించు కొనుము;
ఓపవేనియుఁ [8]దెల్పు ముత్తమోత్తనుము; । వే పోయి వేఱొక్క విభునిఁ గొల్చెదను;
[9]ఏమియో నీ చిత్త మెఱిఁగింపు." మనిన । భూమిపాలుఁడు వాయుపుత్త్రుఁ బ్రార్థించి:
"నీ కాంతి కనువైన రీతిఁ జెప్పితిని; । కాకున్న మాని నాగ్రహమేల నీకు?
వలల, నా [10]యొద్ద నీ [11]వలచిన యట్లు । కలకాలమును [12]నుండు కడు వేడ్కతోడ.
వండెడు వారెల్ల వరుస నీ యాజ్ఞ । నుండెడు వారుగా నొగిమితో నుండు."
మని [13]చెప్పి బకవైరి [14]నత్యాదరమున । మనుజేంద్రుఁ [15]డేలి నెమ్మది [16]నుండు నంత,

## బృహన్నల నామధారియై పేడిరూపున నర్జునుఁడు విరటుకడకు వచ్చుట

ధీరతఁ బేడియై [17]దేవేంద్రుపట్టి । వారక పురుషభావము [18]లెల్ల నణఁచి,
యాడుకట్టులఁ గాళ్ళ యందంబు చెదరఁ । బోఁడిగా నెంతయుఁ బొసఁగంగఁ గట్టి,
[19]సంకుల ఘనబాహు సౌందర్య మెడల । నంకించి అవిక దేహము కాంతి మూ[20]న్పఁ,
(బదిలంబు మెడయొప్పు పరిసి పోఁజేయుఁ । గదిసి పాటలమాళి కట్టు పెంపణఁపఁ (?)
జెలువైన పవడంబు చెవుల సొంపణఁప, । నలకలు నుదిటి [21]సారణఁగించి యలమ,

1. యుబ్బస. 2. నగర. 3. మల్లులను. 4. క్రొత్త. 5. మైన. 6. యిచ్చుట. 7. గలఁగ. 8. నాకును. 9. ఏమిట. 10. వద్ద. 11. వలసినట్లుండు. 12. నాకుఁ గలవాఁడవేని. 13. చెప్ప. 14. య. 15. జేరి. 16. నుండె. 17. దివిజేంద్రు. 18. లేకయ. 19. సం (యం?) కులదీర్ఘబాహాలీల మెఱయ; సం (అం?) కులదీర్ఘబాహాలీల నడప. 20. వ. 21. పైనాతీరు మాన్ప.

మంచు పైఁ [1]బొదివిన మార్తాండు పగిది । [2]నించిన నివురులో నిప్పున్న యట్లు
వేషంబు ధరియించు విష్ణుచందమున । రోషంబు [3]మానిన రుద్రు కైవడిని
[4]భేడితనంబు గప్పిన యర్జునుండు । వేడుకతో వచ్చె [5]విరటు గొల్వునకు.
వచ్చి యచ్చట నున్నవారి చూడ్కులకు । [6]మెచ్చుగాఁ దనరూపు మేల్మిఁ గాన్పించి
[7]ఓయారమున జంగ లొఱపుగా నిడుచుఁ । [8]బాయక కరిరాజు బాగుఁ గైకొనినఁ,
గొలువు వారలకెల్లఁ గువలయాధిపుఁడు । సొలయక నరువంకఁ జూపి యిట్లనియె :
" పొలఁతి [9]సింగారంబుఁ బురుషభావంబుఁ । గలిగియున్నది దీనిఁ గంటిరే మీరు ?
[10]తేజంబుఁ బొడవును దృష్టింప నరుఁడు । రాజసంబునఁ జూడ రమణి కానోపు ;
ఈడు జోడును లేక [11]యెవ్వఁడో యొకఁడు । వేడుకఁ గైకొన్న [12]వేషంబొ కాక !
ఇంతవానికి నేల యీ వికారంబు । పంతమాడిన యట్లు [13]ప్రాపించె నకట !
చెప్పఁడు మీకుఁ దోఁచిన జాడ. " యనినఁ । జెప్ప నేరక వారు చింతించు నెడను,
భూపాలు డగ్గఱఁబోయి జిష్ణుండు । తీపారు మాటలఁ దెలియ నిట్లనియె :
" నిన్ను వేడుకఁ గొల్చి నృపచంద్ర, యేను । గన్నియలకు నాట గఱప వచ్చితిని ;
ఇల బృహన్నల [14]నామ మింపారు నాకు ; । మొలిచె దైవాధీనమునఁ బేడితనము.
[15]దండలాసకమును [16]దగు ప్రెక్కణంబుఁ । గుండలినియు నెఱుంగుదుఁ [17]బ్రేరణియును ;
నటన[18]తో నఱువదినాల్గు హస్తములఁ । బటువు చూపఁగ నేర్తుఁ బ్రతితాళమునకు ;
కేల [19]గీతార్థంబు గీలించి యొడల । నాలోల [20]గతి గీత మభినయించెదను ;
తనరఁ బాదంబు[21]లఁ దాళ నిర్ణయముఁ । గనుఁ[22]గవ భావంబుఁ గాన్పింప నేర్తు ;
భావాశ్రయంబులు పరికింప నేర్తు ; । భావించి నన్నేలు భరత విద్యలకు. "
అనవుడు నృపచంద్రుఁ డమరేంద్ర సుతునిఁ । గనుఁగొని తన[23] పెంపు గానరాఁ బలికె :
" నిన్నిట్లు పేడిగా నిర్మించె బ్రహ్మ ; । నన్నుతింపఁగ నీవు సౌభాగ్య నిధివి.
ఘన[24]ములౌ భుజములఁ గఠినకాయంబు । దిననాథు తేజంబు దీర్ఘ [25]నేత్రములు

---

1. గవిసిన; గప్పిన. 2. నించు నివురుగప్పు ; నించు పైఁ గప్పిన. 3. దెసవోని. 4. వాడుదేఱిన మోము ప్రాభవంబణఁప. 5. విభుఁ డున్నయెడకు. 6. మెచ్చులై నెఱిరూపు మెఱసి కాన్పింప. 7. ఒయ్యారమున. 8. నెయ్యము కరిరాజు నేర్పుఁ గైకొన్న. 9. శృ. 10. తేజంబు పొడవైన దృష్టింప నరుడు – రాజసం బొలికెడు రమణ వీనికిని. 11. యెవ్వఁడే నొకఁడు. 12. వికృతంబు. 13. ప్రాపించి వచ్చె. 14. పేర నింపైనవాఁడ. 15. దండతాళంబును దగిన ప్రేంఖణము. 16. దగిన జక్కిణియు. 17. పేరణంబు. 18. నా యిరువది.. 19. తాళంబులఁ గీలింప కొడల. 20. మగు. 21. లు. 22. గనుపట్ట. 23. కోర్కె. 24. మైన. 25. దేహంబు.

నీకు [1]నొప్పిన యవి; నీవు నా యొద్దఁ । జేకొని వర్తింపఁ [2]జింతింతు వేని
నొనర నా విండ్లలో నొక మంచివిల్లు । ఘన వజ్రకవచంబు ఖడ్గాయుధ[3]ములు
వలయు భూషణములు వారువంబులును । వెలయ నిచ్చెదనుండు విభవంబు మెఱసి.
నిన్ను నా భూమికి నృపునిఁగాఁ జేయు । నున్నచో నిట్లాడ నుచితమే నీకు ?"
అనవుడు విభున కిట్లనియె నర్జునుఁడు । తనరూపరేఖకుఁ దగు సిగ్గుదోఁప:
"ఆఁడుచందము [4]తిరమై యుండు నాకుఁ । బోఁడిమిగా లేదు పురుషభావంబు.
ఈ నపుంసకవృత్తి యేమి శాపమునఁ । బూని యేతెంచెనో ! [5]పొందుగా మిగుల
నడఁకువతో నుండుటది యొప్పుఁ [6]గాని । [7]తొడి పూసి మెఱవడితో నుండరాదు.
పాంచాలియింట నేఁ బరఁగ నున్నపుడు । మించిన [9]యూరూపు [10]మెఱయ నీ చాలు
అచ్చోటఁ బాత్రల ననువుగా దిద్ది । [11]మెచ్చులు పడయుదు మెఱవడితోను.
విను [12]నట్టువొజ్జనై విహరింతు నిచట । ఘనలీలఁ బిలిపింపు కన్యకా [13]జనుల."
అనవుడు మనుజేంద్రుఁ డాదరంబొప్పఁ । దన పుత్రియైన యుత్తరఁ బిల్వఁ బనిచె.
అదియును గైసేసి యరు[14]దెంచు నపుడు । పదను పెట్టిన పువ్వు [15]బాణంబుపోలి,
ఘనలోక లోచనకైర [16]వావళికి । నిలిచిన నిండువెన్నెల సోఁగఁ [17]బోలి,
కెరలిన [18]గండుఁగోయిల చంచుధారఁ । జిరుగక [19]యున్న కెంజిగురాకుఁ [20]బోలి,
తుదలేని తళ్కులు దొలకాడుచుండు । మొదల గ్రువ్వని యాణిముత్తెంబుఁ బోలి,
కన్నులుఁ గురులుఁ [21]జొక్కంబైన పిఱుఁదుఁ । [22]జిన్నిచన్నులు వింత చెలువమై నెగడి
కన్నియ [23]వయసుచేఁ గడునొప్పి చూడఁ । గన్నుల పండువై [24]కల్యాణి యపుడు
తనవెంట నేతెంచు ధవళలోచనల । ననయంబుఁ బ్రీతిమై నందంద [25]నిలిపి
వచ్చి మ్రొక్కిన, ముద్దువచ్చి భూవిభుఁడు । గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కూర్మి దైవాఱ

---

1. నొప్పైనవి. 2. జింతించె దేని. 3. ంబు. 4. నిక్కమైనది లేదు. 5. పోఁడిగా నాకు. 6. గాక. 7. తొడుగుచు. 8. వసియించి నపుడు. 9. యా. 10. మెఱసినఁజాలు; మెఱయంగఁ జాల. 11. యిచ్చితి నా రీతి నింక నీ నగర – విను నాట్య యొజ్జనై శెలయనుండెదను – ఘనముగాఁ బిలిపింపు. 12. మాట యొజ్జనై. 13. జనము. 14. దెంచె. 15. బాణంబె పోలె. 16. శ్రేణి. 17. పోలె. 18. మత్త. 19. యుండిన. 20. ఁబోలె – తుదలేని తళ్కులఁ. 21. జొక్కట. 22. జెన్నార సరిలేని చెలువంబు నొంది – ప్రన్నని వయసుచేఁ బటువొప్పి చూడఁ – గన్నుల. 23. వయసునఁ గరమొప్ప. 24. కల్యాణి నపుడు – అచ్చుగా విరటుండు నపుడు మోదమున – గ్రుచ్చి. 25. పిలిచి.

మునిత్రేళ్ళఁజెక్కులుముదముతోఁబుణికి, । తన మోము గదియించి తనయ మోము [1]నను,
నలినాక్షి [2]మూళ్ళఁ దా నఖరేఖ వ్రాసి । పలుమాఱు క్రొత్తగా భావించి [3]చూచి,
కువలయాధిపుఁ [4]డిట్లు కూఁతు ముద్దాడి । దివిజేంద్రసుతుఁ [5]జూచి తేటగా [6]నగుచు:
"[7]నిచ్చేడియకు నాట నెలమి [8]నైఁ గఱప । వచ్చునే!" [9]యనుటయు, వాసవాత్మజుఁడు:
"పరిమళంబునఁ బొల్చు పసిఁడి చందమునఁ । గర మొప్పు రుచినొప్పు కస్తూరి పగిది
ననఘ, యీ ముగ్ధ నాట్యము నేర్చెనేని । చెనసి పండినచుట్టి చెఱకు గాకున్నె!"
అని వేడ్కపుట్టించి యా కార్యమునకు । [10]వినతి సేకొనుటయు, విభుఁడు మోదించి,
యసమున మన్నించి యా బృహన్నలకు । వెనఁ గర్పూరముతోడి [11]వీడె మిప్పించి
చెలువైన తొడవులుఁ జీనాంబరములుఁ । గొలఁది కగ్గఁ మిచ్చి కొమరొప్పఁ బలికె:
" ఇచ్చెద నీ చేతి కీ పువ్వుఁబోఁడిఁ । జెచ్చెర మృదువుగాఁ జెప్పుమీ విద్య.
చెలులతో నాటలఁ [12]జిక్కి యీ బోఁటి । తలఁపక యొకవేళఁ [13]దప్పు చేసినను
[14]గన్నుల బెదరింతుగాని నీ వలిగి । చిన్నారి నెన్నఁడు శిక్షింపవలదు.
నీకుఁ జెప్పఁగనేల నీ వెఱుంగుదువు । నాకు నీ చెలువ [15]ప్రాణముగాన నంటి.
కొమ[16]రొప్ప గురుఁడవన్ కొలఁదియే నీవు । కమలనేత్రకు నేడుగడయు[17]ను గాదె!"
అని యొప్పగించుచు [18]నబ్బోఁటి కేలు । చెనసి వాసవపుత్త్రు చేతిలోఁ బెట్టి:
'[19]మరగ నీ కన్నియ మాన్య నీ' కనుచు । విరటుఁ [20]డుత్తరతోడ వేడ్క నిట్లనియె:
"గురుఁ డేమిచెప్పిన[21]గుఱుతుగా వినుము; । గురు[22]వె దైవము నీకు గురు[23]వె చుట్టంబు;
చందన పుష్ప భోజన భూషణములఁ । [24]బొందొంద వేడుక పుట్టింపుమమ్మ;
చనవుతో నన్యవాసము రాణివాస । మును లేక మనయింట మొగి నుండు నితఁడు."

నకులుఁ డశ్వపాలకుని లీల దామగ్రంథియై విరటుని కొల్వులోఁ గుదురుకొనుట

అనిచెప్పి [25]యుత్తర నపుడు వీడ్కొలిపి । జననాథుఁ డుత్తమాశ్వముల వీక్షించు
నాలోన నకులుండు [26]నశ్వశిక్షకుని । లీల నెంతయుఁ దాల్చి లేనవ్వుతోడ

---

1. నను. 2. మోముపై నఖరేఖ వ్రాయు. 3. చూచు. 4. డంతఁ గూఁతుఁ జూపించి. 5. తోడ. 6. ననును. 7. నిచ్చెలి. 8. తో. 9. యనవుడు. 10. వినసీయ కొనుటయు. 11. వీడ్య. 12. జిక్కిన వేళ. 13. దడవు. 14. కన్నుల వెఱపింతుగాక యీ బిడ్డఁ – జెన్నారఁగా నంత శిక్షింపవలదు. 15. ప్రాణ ప్రాణముగుట. 16. రొందగురుఁడవా. 17. నిక్కవము. 18. నబ్జాక్షి. 19. నరునిఁ దప్పక చూచి నయ, మేర్పరించి. 20. డత్తరుణితో. 21. గుణముగా నెఱుఁగు. 22, 23. డు; 24. విందుగా నితనికిఁ బెట్టింపవమ్మ. 25. యిద్దఱ. 26. నట సంభవించి – కాలోచితం బీడ (బిటు) గర్గినాశనుచు – నొనరంగఁ జనుదెంచె నుదయార్క పగిది – జనుల.

నొనరఁ బద్మములకు నుదయార్కు పగిది । జనుల నేత్రములకు సంతసంబొదవఁ,
[1]దనచూపు లశ్వరత్నములపైఁ బొలయ । వినతుఁడై చనుదేర, వీక్షించి విభుఁడు
ప్రజలకు నతని సౌభాగ్యంబు చూపి । నిజమైన [2]ప్రేమంబు నెఱయ నిట్లనియె :
ఈ వచ్చుచున్నవాఁ డెవ్వఁడో [3]కాని । భావజుఁ డని యేను భావించినాఁడ ;
అరుదైన యశ్వ[4]విద్యల నెఱయోధ । సొరిది గుఱ్ఱముఁ జూచు చూపు చెప్పెడిని ;
అతిఘోర సమర సాహసుఁడు గానోపు । నితని [5]చందమును నాయితముఁ [6]దెల్పెడిని ;
ఎఱుఁగుదు రేని నా కెఱిఁగింపుఁ డితని । నెఱుఁగకుండిన మీ[7]ర లెఱిఁగి రావలయు."
అనుచుండ నృపుఁ జేరనరిగి పాండవుఁడు । మును[8]కొని కేలెత్తి మ్రొక్కి యిట్లనియె :
"దేవ, నన్నిపుడేలు ; తెఱఁగొప్ప నిన్ను । సేవింతు హయముల శిక్షించు పనికి.
అనఘ, దామగ్రంథి యను పేరు గలిగి । నిను ధర్మజునియింట విహరింతు నేను.
బలయు తమ్ములలోనివానిఁగా నన్ను । నిల వేఱుసేయక యేలె నా విభుఁడు.
ధర్మజు మాఱుగాఁ దలఁచి నీవద్ద । నిర్మలమతి నుండ నియతి వచ్చితిని.
వేయునేటికి నశ్వవిద్య[9]యం దేను । బోయినదే [10]వీధి పోలుపార విను[11]ము ;
అవయవలక్షణం, [12]బాయుఃప్రమాణ, । మవిరళగర్భంబు, లా యింగితములు,
వయసుకట్టడలును, వడి దేశకాల । నియతి నాహారంబు, [13]నిద్రవచ్చుటలు,
జాతికిఁ దగిన శిక్షలు, [14]దప్పి యణఁచు । రీతులు, భయమదోద్రేకచిహ్నములు,
మాత్రాంతరంబులు మఱియుఁ బెక్కైన । [15]చిత్రంబులెల్ల నేర్చితి గుఱ్ఱములకు.
అంచిత[16]గతి నీకు నవసరంబైనఁ । జించి చెండాడుదుఁ జెలఁగి శాత్రవుల."
అనవుడు భూపాలుఁ : "డదియేల ? [17]నిన్నుఁ । జనవరిగాఁ జేసి సవదరించెదను ;
కడఁగి మా చావడికర్తవై నీవు । సడుతువుగా." కన్న నకులుఁ డిట్లనియె :
"నీవు మన్నించుట నీవు రమ్మనుట । నీవాదరించుట నే నెఱుంగుదును.
[18]నెఱపైన విద్యను నేర్తు నేననియుఁ । దెఱఁగు చెప్పితిఁ దేట తెల్లంబు[19]గాఁగ.

---

1. నలజడిఁ జనుదెంచు నతనిరూపంబు–తెలయంగ దవ్వున విభుఁడు వీక్షించి–ప్రజలకు. 2. మోహంబు. 3. వీని – భావంబు నిపుడేను. 4. విద్యాభిజ్ఞుఁడౌట. 5. వంశము. 6. చెప్పెడిని. 7. కనె. 8. మిడి. 9. ల కెల్ల. 10. విధి. 11. ఁడు. 12. బాయుష్యవిధులుఁ. 13. నిర్మితంబులును. 14. చెప్పి. 15. చిత్రంబులను నేర్తు సేవింతు నిన్ను – 16. ంబుగ. 17. నీకు – ననువైన కొలువిచ్చి యాదరించెదను–కడువేడ్కఁ జావడికర్తవై యుండు – మెచపకయన్న మహీపతి యనియె – నీవు మన్నించుట. 18. ఎఱుఁగుదుఁ గాకేమి యే నేర్చినట్టి. 19. నీకు.

నేరని[1]పనులకు నేనెంతవాఁడ ; । నూరక [2]మేకొన్న నొచ్చెంబుగాదె?
అశ్వవిద్యలుగాని [3]యామీఁదిపనులు । శాశ్వతంబులుగావు జగతీశ, [4]మాకు.
[5]కొలుతు వేడుక[6]నైనఁ గొలిపించుకొనుము ; । [7]వలపకుండినఁజెప్పి వరుస నన్నుపు."
అనవుడు నరనాథుఁ : "డట్లేల నీకు । ననువైనగతి నుండుమయ్య నా[8]యొద్ద.
మున్ను లాయములోన [9]ముఖ్యులై మెలఁగు । చున్నవారలనెల్ల నొప్ప మన్నించి
నామాఱుగా నీవు నయము[10]తో నుండు ; । [11]నీమాటలను మీఱ నిక్కంబు నేను."
అనిచెప్పి మాద్రేయు నర్థితో [12]నిలిపి । జననాథుఁ డానందసహితుఁడై [13]యుండె.

## తంత్రీపాలుఁ డనుపేర గోపాలుఁడై సహదేవుఁడు విరటుఁ గొల్వ నేతెంచుట

అత్తఱి సహదేవుఁ డా[14]స్థానిఁ జేరఁ । [15]జొత్తెంచె నెంతయు సుభగ[16]వేషమున.
[17]తగవొప్ప నుర్రితాళ్లఁ దగిసదామెనలు । [18]మొగిఁగట్టి యొక్రతాట మోపుగాఁజుట్టి,
కురువిందపూసలు గ్రుచ్చి హారములు । ధరియించి, తిరుమణి తఱచుగాఁ [19]బెట్టి,
నున్నని సెలగోల నునుపైన జడయుఁ । జెన్నారఁ, జెవిఁ గొన్ని చిగురుటాకులును
వెలయ, గోవులఁ గాచు వెన్నుండుపోలెఁ । గొలువువారలచూడ్కి కొల్లవెట్టుచును
వెడవెడ వెఱపుతో విరటు సన్నిధికి । నడతెంచి [20]వినతుఁడై నయమొప్పఁ బలికె :
"వసుధేశ, విను గొల్లవాఁడ [21]మీనగరిఁ । బసులఁ గాచుటకునై పనివిందు[22]నయ్య.
అరయఁ దంత్రీపాలుఁ డనుపేరు నాకు ; । ధరణీశ, మొదవుల తర మెఱుంగుదును ;
తొఱఁగి పోవకయుండ, దుష్టజంతువులు । తఱుమకయుండ, నిత్యముఁ బాడిగొనఁగఁ,
గ్రేపులు వెలయ, నంకిలి [23]లేకయుండ, । నాపాటి గొల్లలు ననుమెచ్చి పొగడ
నుండెద నన్నేలనొప్పుదే?" యన్నఁ । [24]బాండవానుజుఁ జూచి పలికె నవ్విభుఁడు :
"ఎక్కడిమాట! నీ వెట్లు గొల్లఁడవు! । మిక్కిలి చెలువమై మెఱసె నీమూర్తి ;
సునిశితం[25]బగు సూర్య సోమ వంశముల । జనియించినాఁడవు; సహజమై [26]యొకటఁ
గులము సత్కీర్తియు గుణముఁ దేజంబు । నల[27]వోకఁ దాఁచిన నణఁగ వెవ్వరికి.

---

1. పనులందు నెఱి నెంతవాఁడు. 2. మేకొన నుచితంబుగాదు. 3. యామీఁద నెవియు. 4. వినుము. 5. కొలువు. 6. నన్ను. 7. వలవదు పొమ్మన్న వరుసఁ బోయెదను. 8. వద్ద. 9. ముఖ్యమైమెలఁగి - యున్న. 10. న. 11. నీమాట చెల్లుబడి నిక్కవంబులకు. 12. నేలి. 13. యపుడు. 14. స్థానవీథి. 15. సొత్తెంచునప్పుడు. 16. దేహమున. 17. తలుగులు. 18. మొలను బద్దియ. 19. జాది. 20. విభునకు నలువొప్ప. 21. నీ నగర. 22. నేను. 23. వట్టకుండ. 24. బాండునందను. 25. బుగ. 26. యకట. 27. వొప్ప.

తగిన సంపదలిత్తుఁ దగు[1]రీతి నుండు । జగతి నా రాజ్యంబు చక్కఁబెట్టుచును.
వచ్చిన నీయంతవాని గోవులకుఁ । బుచ్చిన నపకీర్తి పుట్టదే [2]మాకు !"
అనవుడు సహదేవుఁ డా మత్స్యపతికి । వినతుఁడై మఱియును వేడ్క నిట్లనియె :
"అరయుట పని [3]మాకు నధిప, గోవులను ; బరఁగఁ [4]బాండవులకుఁ బ్రాఁతలమేము ;
ధరణి నిప్పుడు వారు దలచూపకున్న । గురుతరస్థితి నిన్నుఁ గొలువ వచ్చితిని.
ప్రకటించి యేఁ[5]జొచ్చి పాలించుదొడ్డి । నొకట [6]నక్షయముగా నొసఁగూడుఁ బసులు.
చెలువొప్పఁ బోతుపంచితము మూర్కొన్న । కొలఁ[7]దినె చూలౌను గొడ్డుటావులును
[8]పదరుచు నేఁజన్నఁ బాఱు నుంగిడియు । నదుగఁ ద్రిక్కయు [9]మొదలైనరోగములు.
[10]పసి నిన్ని తెఱఁగులఁ బరికింతుఁ గాని । విసువక నేనొప వేఱొక్క పనికి.
ఇన్నియు నేల ? నన్నేలనోపినను । గ్రన్నన పశుకోటిఁ గావ [11]నన్ననుపు."
అనుటయుఁ దనచిత్త మాందోళపడఁగ । జననాథుఁ డర్థితో సహదేవుఁ [12]జూచి :
"నీచిత్త[13]మటమీఁద ; నీవు నా పసులఁ । గాచు[14]చు గోపవర్గమునెల్ల నేలి
యన్ని కార్యంబుల నరసి మాచేత । మన్నన వడసి నెమ్మదినుండు" [15]మనియె.

## పాంచాలి సైరంధ్రి వేషముతో మాలిని పేర సుధేష్ణకడ నుండుట

ఏవురు నీరీతి నిల మత్స్యవిభుని । సేవించి యున్నచోఁ జెలువ పాంచాలి
సైరంధ్రివేషంబు [16]సమకూర నపుడు । తోరంపు జడనూడ్చి తుఱుముగాఁ బెట్టి,
వలపలికై కొంత వ్రాలి [17]యాతుఱుము । పలుమాఱు [18]చెవియాకుపై నొత్తగిల్ల,
నరుదుగాఁ గురుమైలయగు చీరఁగట్టి, । [19]సరస వల్కలములఁ జనుదోయిఁ బొదివి,
[20]కప్పారి వల్చన[21]గల చిన్ని[22]మొయిలు । గప్పిన శీతాంశుకళ[23]యునుబోలెఁ,
[24]బూని ధారాపాతమున మంచునీట । నాని సొంపఱియున్న నలినియుఁబోలె,
వింతలాగున ధూమవితతి క్రిక్కిఱియఁ । గాంతి[25]మాసిన దీప[26]కళికయుఁబోలె,

---

1. లీల. 2. నాకు. 3. నాకు. 4. బాండుసుతులఁ బటుభక్తిఁ గొలుతు. 5. జొచ్చు పాటించు దొట్టి. 6. సహస్రమై యొప్పారు. 7. దినిచూలొప్పు. 8. పదరులేకయు సెరపారలు గిటులు(?). 9. ముఖ్యమైన. 10. పసులిన్ని. 11. బోననుపు. 12. బలికె. 13. మలరంగ. 14. చో. 15. మనిన. 16. సమకూర్చుకొనుచు. 17. న. 18. చెవిమీఁదఁ బరిఢవిల్లంగ. 19. సరసతరవికచేఁ ; పరుషవల్కలములు పైఁటగాఁదాల్చి. 20. కప్పారు. 21. గా. 22. మొగిలు. 23. వోలెఁజూడ. 24. బూని ఘారావారమున మించునీట – నాని చొప్పడియున్న నలినంబుపోలె. 25. మాలిన. 26. కళయును.

ధూళి పెల్లునఁ జిక్కి తొంగలింప[1]కయు । లీల [2]నొప్పఱియున్న లేఁదీఁగె పోలెఁ,
బరిచారికావృత్తిఁ బాంచాలియొసఁగి । పురవీథి నేతేరఁ, బురకాంత లపుడు
"ఇది రోహిణియొ! కాక యిది యరుంధతియొ ! । [3] వెదకిన మహినిట్టివెలఁదులున్నారె ?
[4]చనుదోయి కనుదోయి జఘనంబు ముఖముఁ । దనువల్లి[5]కురులుఁ బాదంబులొప్పారె.
హరుమేను నజుమోము హరి యురస్థ్సలము । నిరవైనఁ [6]దగుఁగాక యీతలోదరికి."
అనుచు గుంపులుగట్టి యందందచూడ । వనజాక్షి [7]మత్స్యభూవరు నిల్లు గదిసె.
అప్పుడు నృపకాంత[8]యా సుదేష్ణయును । [9]విప్పైన మేడలో వేడ్కతోనుండి
[10]పురవీధి నేతెంచు పూవారుఁబోఁడి । సరసరీతులఁ జూచి సఖుల కిట్లనియె :
"[11]ఇదె యొక్కతరలాక్షి యీసమీపమున । మదను పట్టపు[12]దంతిమాడ్కిఁ బోయెడిని.
పౌరులు తనువేడ్కపడి చూచుచుండ । ధీరత్వమెడలదు తెఱవ [13]యెంతయును ;
తనుఁజూచి యెక్కుడిదాన పీ వనిన । మనుజులఁ [14]దలవంచి మాటలాడెడిని ;
నీచత్వమున నేల నెగడునో కాని । రాచ[15]దేవేరియా రమణి నియ్యంతి.
చూతము తోడ్తెండు సుదతి నిచ్చటికిఁ । బ్రీతిపుట్టెడి దీనిఁ [16]బెద్ద మన్నింప."
అనవుడు చెలులేగి యర్థిఁ దోడ్తేర । వనజాక్షి సౌధంబు[17]పై నెక్కునపుడు
పటికంపు నెలకట్లపైఁ బాదరుచులు । [18]చటులత లత్తుక చల్లినట్లుండె ;
నలరారు మైచాయ నచటి గోడలును । జెలువమై మణికోటిఁ జేసినట్లుండె ;
మేడపై కీభంగి మెలఁత యేతేర । వేడుకతో [19]నంత విరటుభామినియు
'నాముగ్ధ నిందు ర' మ్మని చేరఁ బిలిచి । ప్రేమ[20]నెంతయుఁజూచి ప్రియము[21]నఁబలికె :
" నీ వంశ మెట్టిది ? నీకుఁ బేరేమి ? । నీ వీపురంబులోనికి వచ్చు[22]టేల ?
గరుడ కిన్నర యక్ష గంధర్వసతులు । నిరుపమస్థితి [23]నొప్ప నినుఁ బోలలేరు.
దీనవృత్తికి [24]నోర్చు తెఱఁగు నీయందుఁ । గానము ; నీకేల కాంత, యిట్లుండ ?
చెప్పుము నీ." వన్నఁ జిగురాకుఁబోఁడి । యొప్పైన మృదుభాష నువిద కిట్లనియె :

---

1. పమియు. 2. సేపటి. 3. ఇది పార్వతియొ కాక యిది మరుజననో – యిది దమయంతియో యిది చంద్రమతియొ – వెదకిన. 4. కనుదోయి క్రేల్గవ కమనీయముఖము. 5. కురులును దరులునో. 6. యది గాన. 7. తూలుచు వడి నేఁగుదేరె. 8. యగు ; యా. 9. ఒప్పైన మేడపై నొనరంగ. 10. సరస. ... – వరరూపయాన సౌభాగ్యంబు దనర – నిది. 11. ఇదియొక ధవళాక్షి. 12. రాణి. 13. యొంటిఁ జను. 14. వలపించు. 15. దేవులుగాదె. 16. బ్రేమ. 17. వడి నెక్కుచుండ. 18. చటులకుంకుమవోలిఁ జ. 19. ఁజూచి, 20. యెంతయు నిండ. 21. తో. 22. టేమి. 23. ఁబోల్ప. 24. నేర్పు తెఱవ.

"జలజాక్షి, సైరంధ్రిజాతిఁ బుట్టితిని ; । వెలయ మాలినియండ్రు వేడ్కతో నన్ను.
మగలు నాకేగురు ; మఱి వారియెదు[1]టఁ । బగవారు సుందలఁబట్టి యీడ్చినను
ఎగ్గు గా[2]వించిన నేను నామగలు । [3]సెగ్గించి వ్రతులమై చిరకాల మేము
అడవిలోనుండితి ; మా వ్రతంబునకుఁ । గడచుగా నొకయేఁడు గలదు మా కింక.
నీ[4]యొద్ద నీయేఁడు నెమ్మితోనుండి । పోయెదననుబుద్ధి పుట్టి వచ్చితిని.
కలపంబు [5]గలప [6]సింగారంబుసేయఁ । దలదువ్వఁ బువ్వులు [7]తలఁ[8]గట్టనేర్తు,
[9]నిత్యమున్మును వెన్నునికి దేవియైన । సత్యభామకుఁ బరిచర్య[10]సేయుదును ;
[11]తరువాతఁ బాంచాలి తన్నుగా నన్ను । [12]నరసి [13]నిల్పిన నుంటి నయ్యింతిఁ గొలిచి ;
ఇప్పుడు నీవద్ద నిట్టులుండెదను । దప్పక నీచవర్తనలకుఁ జాల."
అనిన భూవిభుదేవి యద్దేవితోడఁ । దన[14]భీతి వివరింపఁదలఁచి యిట్లనియె :
" అతివ, నీ వేతెంచునపుడు మారాజు । చతురుఁడై చూచె ; [15]నీ చెలువంబుఁ గన్న
నాతఁడు నీమీఁద నభిలాష [16]నిలుపు; । నే తెఱంగున నిన్ను నేను నిల్పుదును ?
కర్కటి యొకవేళ గర్భమైనట్లు । తర్కింప నాకు మీఁదట నేమి యగునొ ? "
అనిన ద్రౌపది మందహాసంబు చేసి । తనరఁ గేకయరాజతనయ కిట్లనియె :
" [17]చింతింప నీ తలంచినయట్లు కాదు ; । కాంతు లేవురు నాకు గంధర్వు లతివ !
నత శాత్రవులు [18]వారు నన్ను నేమఱరు ; । జతనమై కెలఁకులఁ జరియింతురెపుడు ;
అతివ, యెవ్వఁడు నన్ను నభిలాషఁజూచు । నతని రూపఱఁజూతు రా రాత్రిలోన.
కావున నావంకఁ గడకంటనైన । భావించి చూడరు బ్రహ్మాదులైన.
కాదుపో, నాయిచ్చ గన నెంతవాఁడు ! । నీదువల్లభుఁ డంత నీచవర్తనుఁడె !
సైరంధ్రియగు కాంత జగతిలో ధర్మ । చారిణియై కాదె చరియించు నబల ?
అనుమతించిన మేలు ; అతివ, నీవెపుడు । మనసురా మెలఁగెద మగువ, నీయొద్ద.
పనుపకు నన్ను నల్పములైన పనుల । వనజాక్షి, యిది నాకు వరముగా నిమ్ము."
అనిన సంతోషించి యవనీశుదేవి । తనయొద్దఁ బాంచాలిఁ దగవొప్ప నునిచె.

---

1. ర. 2. సెంచక. 3. నెగ్గించి...యెల్లను విడిచి. 4. యింట నొక. 5. గలపి. 6. శృ.
7. తగ. 8. దురుమ. 9. నిత్యమై మున్ను వెన్ననికి దేవైన. 10. చేసితిని. 11. తరమిడి.
12. సెరవుసేయక; చూచు నెప్పుడు మదిని ; నేర్పుసేయఁగ నిల్పె నింతకాలంబు. 13. పిల్చిన.
14. రీతి. 15. భూజనులుఁ గన్నారు. 16. నిలుప. 17. చింతించి నీవు తల్చినయట్లు. 18. వార
లనిలోన నెపుడు.

*అనఘాత్మ, యటమీఁద నైన వృత్తాంత । మొనసినవేడ్కతో నెఱిఁగింతు వినుము.
అర్థిమందార, సాహసవిక్రమార్క, । పార్థివ నుతశౌర్య, పంటవంశేంద్ర !
పరమేశ్వరాఖ్యానపర వర్ణ్యమాన । పురవరాధీశ్వర, భూరిప్రతాప !
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయ స్వరూప కాశ్యపగోత్ర దీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
రచిత విరాటపర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొక్కటి యయ్యె.

---

* ఈ క్రింది ద్విపదలు తంజావూరు ప్రతిలో మాత్రము గలవు:
“ అన విని తరువాత నైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవేయని యడుగుటయు
నారదమునివంద్య ! నరకాసురారి ! । వారిధి గర్వనిర్వాపణ కృత్య !
కుంభజ వరదత్త గురుచారుచాప ! । కుంభకర్ణవిదార ! గురుకీర్తిధార !
సాకేతపురవాస ! జయతరోల్లాస ! । నీకేను మ్రొక్కెద నిఖిలైకనాథ !
ఇది సదాశివభక్త (అదిగా)

# ద్వితీయాశ్వాసము



*శ్రీ రాజితాకార, శివభక్తిపూర, । గౌరవాకార, జంగలముమ్మడిధీర!
వినుము వెండియు నిట్లు వివరింపఁ దొడఁగె । జనమేజయునకు వైశంపాయనుండు:

పాండవులు విరటునిఁ గొల్చియుండు విధము

[1]ఆ రీతిఁ బాండవు[2]లబలతోఁ గూడి । వారక విరట భూవరుని సేవించి
తమతమ నడచు వర్తనము లేమఱక । సముచితులై దుష్టజనుల సోఁకోర్చి,
యడఁకువ ప్రియము నెయ్యమును మోమోట । మెడపక పనులందు [3]నే వగ్గలించి,
తమరాక జనులకుఁ దలపోఁత [4]లేక । బ్రమయించి చొప్పు [5]మార్పడ మాటలాడి,
తగు కార్యములఁ [6]గాని తమలోనఁ [7]దాము । తగిలి భాషించుట తెలియుగా [8]మాని,
యుండుచో ధర్మజుఁ డొక్కొక్కమాటు । నిండారు [9]వేడ్కతో నృపుని కొల్వున[10]ను
నవరసంబుల[11]తోడ నలువొప్పఁ గథలు । వివిధ శాస్త్రంబులు వేడ్కఁ జెప్పుచును,
రాజు దిద్దఁగరాని రాచకార్యముల । నోజతో దిద్దుచు నొక్కొక్కమాఱు,
పరితోషమగు వేళఁ బసిఁడి పాచికల । దొరఁకొని భూపాలుతో జూదమాడి,
[12]తనరారు వేడుక ధనము లార్జించి । మునుకొన్న వేడ్కఁ దమ్ములకెల్ల నిచ్చు.
వలలుండు [13]రుచులుగా వసుధేశు [14]నగర । వలయు మాంసంబులు వండియిచ్చుచును,
మిగి[15]లిన మాంస [16]మమ్మెడువాఁడు పోలె । మొగినిచ్చు నన్నదమ్ములకు నిత్యంబు.
నరుఁడు నాట్యముచూపి నరనాథుచేత । వర[17]వస్త్ర భూషణావళి మెచ్చు వడసి
మహితుఁడై [18]తెచ్చి ధర్మజభీమనకుల । సహదేవులకు నిచ్చు సారె సారెకును.
నకులుండు నరనాథునకు నొక్కవేళఁ । బ్రకటించి ఘోటకప్రకరంబుఁ జూపి

*(శ్రీ) రఘునాథ, యాశ్రితనాథ, నాథ — వారిజనాభ, శ్రీవనితా సమేత, వాలి (మాటున నుండి) వధియించి జగము — పాలించు (శ్రీ)రామ భద్రావధారు. అక్కథకుఁడు శౌనకాది సన్మునుల — కక్కథా సూత్రమిట్లని చెప్పఁదొడఁగె — ఆ రీతిఁ బాండవులు. (తంజా. (ప్ర.) 1. ఈ. 2. లింతి. 3. నేర్ప (?) 4. లైన. 5. తప్పెడు (?). 6. గాఁగ. 7. దారు. 8. లేక. 9. వేడుక. 10. కు. 11. చేత. 12. కనక భూషణ రత్నకణము. 13. తెలుచు. 14. నకును. 15. లెడు. 16. వానిఁబోలె. 17. రత్న. 18. చేర్చి.

వెలలేని తొడవులు విభునిచేఁ బడసి । నలువొప్ప నిచ్చు నన్నలకుఁ దమ్మునికి.
ఆ సహదేవుండు నవనీశు [1]నెదుట । గోసహస్రంబులు కొమరొప్పఁజూపి
కూడఁబెట్టిన వస్త్రకుండలాదికముఁ । దోడఁబుట్టువులకుఁ దోడ్తోన నిచ్చు.
పన్నగాఁ బాంచాలి ప్రాణవల్లభులఁ । గన్నారఁ జూచి శోకము[2]పుట్ట మరలి
మాట పుట్టకయుండ మనుజేంద్రు నగర । మాటిమాటికి వారిమనసు రామెలఁగు.
ఈ చందమునఁ ప్రేమ [3]లినుమడింపంగ । రాచ[4]కార్యంబుల రచన లేమఱక
[5]పనుల వెంబడి డాసి పరులెఱుంగనటు । పొనరఁ గైకొన్న రూపుల నటింపుచురు.
చెలఁగి తేజంబు దాఁచినవారు [6]గాన । సులభులై జనులకుఁ జూడంగ వచ్చి
మొదలఁ జిచ్చుఱ కన్ను[7]మోడ్చినయట్టి । మదనారిముఖములమాడ్కి [8]నుండుదురు.

## భీముఁడు జెట్టితో మల్లయుద్ధము సేయుట

అత్తఱి నొకజెట్టి యసమానబలుఁడు । మత్తేభగమనంబు మానైనయురము
జేవురించినమేను చిఱుతకూఁకటియుఁ । [9]గావిపచ్చడముఁ జెంగావిదట్టియును
ఉరుభుజంబులు రాయుచున్న పెందొడలుఁ । బోరిపోరిఁ జెవినొక్క పుష్పమాలికయు
ధరియించి యొక మహా దైత్యుఁడో యనఁగ । నరిది తెక్కలులేని[10]యద్రియుఁబోలెఁ
జనుదెంచి నృపుని యాస్థానమధ్యమున । జనులెల్ల విన మల్లచఱచి యిట్లనియె :
"పరిపాటి [11]నెన్నఁ జప్పన్నదేశములఁ । గరమర్థి నేనెఱుంగని రాజు లేఁడు ;
[12]ఏరాజునొద్ద నాకెదురైన జెట్టి । నేరీతిఁ గాన భూమీశ, నీయాన.
చిరకాలముననుండి జెట్టి [13]పోరునకు । బిరుదు గట్టినవాఁడఁ బేర్చి డాకాల.
చెనసి యేనుఁగు చేతి చెఱకు కోలలకు । నెనగారె నాతోడ నెదిరి మల్లరులు."
[14]అన విని వాని బాహాటోపవిధముఁ । గనుఁ[15]గవ నెలకొన్న గర్వంబుఁజూచి,
ప్రీతితో సభనున్న బిరుదు మల్లరులు । భీతులై [16]తలవాంచి పెంపేది యపుడు

---

1. నెదుర. 2. చోటు మఱచి. 3. లిచ్చఁ బాటించి. 4. కజ్జంబుల. 5. తనరార నిట్టి చందములఁ బాండవులు – నొనరఁగాఁ దమరూపు లొకరీతిఁ దాఁచి – చెలఁగి. 6. ని. 7. మొగిడాఁచియున్న. 8. భాసిలిరి ; నుండఁగను. 9. గావిదిండును బెద్దకటముల మోము – నురుభుజంబుల రాయుచున్న బాహువులుఁ । బోరిపొరి. 10. యచలంబుఁబోలి. 11. నున్న. 12. ఏ రూపముననైన నెదురైన జెట్టి. 13. మల్లులకు. 14. అనునెడ. 15. గొని. 16. యొంతయు.

[1]ఉత్తరంబీలేక యొదుఁగుల్లువాఱి । చిత్తరువ్రాసిన చెలువుప నుండ,
నరపతి వేడ్క మిన్నకపోవుటెఱిఁగి । దరహాసవదనుఁడై ధర్మరా జనియె :
"[2]మనుజేశ, పిలిపింపు మన బాసనీని । [3]వినుతి మూర్కొని ఏపి విఱుగఁదోలెడిని.
వలలున కిదియెంత ! వసుధేశ, వాఁడు । తలఁచిన గెలుచు గంధర్వరాక్షసుల.
పొలుపార ధర్మజుపురములో [4]నితఁడు । బలు[5]మల్లులను పాఱఁబట్టుచునుండు ;
వరుస నే నెఱుఁగుదు వానిసత్త్వంబు ; । ధరణీశ, [6]వానితోఁ దలపెట్టి చూడు."
అనిన భూపతి [7]భీము నటకు రప్పించి । యనయంబు గర్వాంధుఁడగు జెట్టిఁ జూపి :
"[8]యనఘ, సన్నద్ధుఁడవై వీనితోడఁ । జెనసిమార్కొను." మన్నఁ జెలఁగి వాయుజుఁడు
కరమర్థిఁ దనయన్న కనుసన్న యెఱిఁగి । పరితోషమున మత్స్యపతిఁ జూచి పలికె :
"[9] ధరణీశ, ధర్మనందను పట్టణమునఁ । [10]జరుపుదుఁ దొల్లి నిచ్చలు జెట్టిపోరు.
నేఁడు నీ[11]యెదుర నానేర్చిన [12]యంత । వాఁడిమి పచరింతు వడిఁ జిత్తగింపు.
ఆ హిడింబుని[13]కంటె నధికుఁ డీజెట్టి । సాహసంబున వీని సాధింప [14]నరుదు.
అగుఁగాక యేను నీయాజ్ఞ వాటించి । జగజెట్టినై పోరి చలము సాధింతు."
అని యంకణముచొచ్చి యధిపు కట్టెదు[15]ర । జనులు భీతిల మల్లచఱచి [16]కేల్మొగిచి
యావలి మొగమైన, నప్పు డాజెట్టి । భూవిభు ననుమతంబున మున్ను కడఁగి
యెదుట[17]నుండుటఁ జేసి యితఁడు నాతండు । ముదముతో నొండొరు మోము వీక్షించి
[18]నేల నించుక మన్ను నెఱిఁబుచ్చుకొనుచు । ఫాలసీమలఁదాల్చి పైఁ జల్లుకొనుచు
మొగి రెండుచేతుల మునువ్రేళ్లఁ గొంత । దిగిచి యొండొరులున్న దెసలకై చల్లి
పదనేది బ్రహ్మాండభాండముల్ పగులఁ । దుదముట్ట నార్చుచుఁ దొడరి యంతటను
నలిరేఁగి వింతతానకముల నిలిచి । పొలుపొందఁ గవియునప్పుడు చూడనొప్పెఁ
గ్రీడ నొండొంటితోఁ గినిసి పోరాడఁ । గూడిన సింగంపుఁ గొదమలో యనఁగఁ,
[19]బొలుపార దీపించు పూర్వవైరమునఁ । దలపడు మేరు [20]వింధ్యంబులో యనఁగ,

1. ఉత్తరమీలేక . యొదిఁగిరి చూడఁ – జిత్తరువందు వ్రాసిన బొమ్మలట్లు. 2. మానవేశ్వర, పంపు. 3. వీనితో మార్కొన్న. 4. నెపుడు. 5. మల్లరులఁదార. 6. వీ. 7. వలలు. 8. యనియె. 9. పురణించి ధర్మజుపురములోపలను. 10. సలుపుదు 11. యొద్ద. 12. యట్ల. 13. ఁబోలు. 14. ఁడోరుఁడు. 15. ట. 16. యిట్లనియె – లావుఁ జేవయు మీఱలాగింతు నిపుడు – భూవిభు. 17. నిల్వమటన్న. 18. (పొలసి ?) పొదిగి మన్నులురాల్చి పొడి చల్లుకొనుచు – నుదధులు కలఁగ బాహువు లప్పళించి– నలిరేఁగి. 19. అలమును జలమును నందంద మెఱసి. 20. మందరములఁబోలి,

నెమకైన [1]సమదృష్టి నిల నోర్వలేక । కదిసి డీకొన్న దిగ్గజము[2]లో యనఁగ.
గాలికి కొండ గ్రక్కదల[3]ని యట్లు । [4]గాలిపుట్టువు నిల్వఁగా, జెట్టి భీము
ఘోరరూపముఁ గాంచి కొండగాఁ దలఁచి । చేరి కూల్పంగ వచ్చిన [5]యింద్రుఁబోలె.
తలఁప [6]నారీతి నిద్దఱు మేటి[7]మగలుఁ । దలపడి మల్లయుద్ధము సేయునపుడు
పరువడిఁ [8]గూడు దంపతులచందమునఁ । గరమర్థి బిగియారఁ గౌఁగిలింపుదురు;
చెలికాఁడుఁ జెలికాఁడుఁ జేరి[9]న యట్లు । పెలుచఁ గేలునుగేలుఁ బెనఁచి యాడుదురు;
మెండుగా [10]మించఁ గ్రమ్మిన సిద్ధులనఁగ । నొండొరుఁ బడవైవ నుత్సహింపుదురు;
వెలఁ[11]దికై జగడించు విటులచందమునఁ । గల[12]యిక వ్రేయ నంగముఁ జూతు[13]రెలమి.
అప్పుడు భీముఁ డయ్యవనిపాలునకుఁ । దప్పక [14]తగు వినోదముఁ జూపఁ[15]దలఁచి,
యుపతాయి[16]లో జెట్టి నుఱక [17]జిక్కించి । నిపుణుఁడై [18]వ్రేయక నెఱిఁ గాచివిడుచు;
అరుదెంచి వాఁడు పైనవఘుళిం[19]చుటయు । [20]గురుతరస్థితిఁ దప్పికొని వేగ నిలుచు;
కుప్పించి [21]వాఁడు కాల్గొని రాకమున్నె । [22]తప్పిన యట్లుగా ధరఁ [23]గ్రుంగు; మఱియు
[24]వెలయంగ సన్నంపు విన్నాణములకుఁ । దలపడుఁగాని యెంతయు [25]ముట్టఁగొనఁడు.
కాలినేర్పున వాని [26]కాలూఁనీక । [27]బాళిచేఁ జేపోకఁబట్టి పోవిడుచు.
ఇత్తెఱంగున భీముఁ డెలమితో నృపుని । చిత్తంబునకు వేడ్కచేసి చాలించి
తూకొని కాళ్ళఁజేతులు వ్రేలునట్లు । భీకరాకృతి వాని పెడకచ్చఁబట్టి
ముక్కున వాతఁ గ్రమ్మఁచు నెత్తుకొనుక । [28]త్రెక్కక వాని నుద్ధతి నెత్తివైచె;
పరఁగ నంతటఁబోక ప్రజలెల్ల నార్వఁ । బోఁ[29]బోరి వాని [30]వీపున నుంకి వెట్టి
[31]తాలిమినోపక ధరణిపై [32]వాఁడు । కేఁగఁ [33]జూపినఁ జూచి [34]కినిసి పోవిడిచె.
తనకు భూపతి మెచ్చి తగనిచ్చినట్టి । కనకాంగ[35]రాగు లక్కడివారి కిచ్చి
కొండ గోరాడిన కుంజరంబనఁగ । [36]గండియై చేతెంచి తన[37]చోట నుండె.

---

1. యద్రిస్పష్టికి నోర్వలేక. 2. లు వోలె. 3. పెట్టుచును. 4. గాలినూనఁడు గానఁగడఁగ కోపించి; గాలిపుత్రుఁడు మిగులఁ గాను గోపించి-కోరి భీముఁడు జెట్టిఁ గొండఁగాఁదలఁచి — చేరి కూల్పంగ. 5. రాకఁబోలె. 6. నీ. 7. ఘనులు. 8. నపుడు. 9. యున్నట్లు. 10. నెమకు: మించు. 11. గల హించు. 12. ఁగక. 13. రెపుడు. 14. మఱి. 15. వలసి. 16. తోఁ బెట్టి యుఱక. 17. చిక్కించి. 18. ధమే. 19. పు. 20. గురుబుద్ధిఁ దప్పించుకొని వానిఁగూల్చు. 21 లేచి. 22. తప్పకఁబట్టి తాధరఁ గూల్చు. 23. గూల్చు. 24. విడిపించి. 25. ముష్టి. 26. కారించి యుడుగు. 27. పాలించి చేసన్న. 28. గ్రక్కునవాని నుగ్రత నెత్తివైచి. 29. వోవ. 30. వీపును మెడవట్టి. 31. తాళంగ. 32. నున్న. 33. [illegible] 34. కినుకఁ బో విడిచి. 35. రంబు. 36. దండితో పీడ్కొని. 37. చోటికరిగె.

మఱియు లావున [1]మారుమలయు నల్లురు । బడిచి కొప్పించె [2]భూవిభు సమ్ముఖమున.
తన ఘాతకోర్చి భూతలనాథు నొద్దఁ । జెనకి [3]పోరాటకు జెట్టి లేకున్న
నరపతి [4]దెప్పింప నగరిలో నెపుడుఁ । గరి హరి శార్దూలగణముతోఁ [5]బెనఁగు.

## సింహబలుఁడు ద్రౌపదిని గాంచి మోహించుట

[6]వెలయఁ బాండవు లిట్లు విరటునగరమున । సొంపార నైజరూపములు కన్ను మొఱఁగి
కొండొక కాలంబు గొలుచుండ [7]నేఁడు । సడలించు నక్కను నెఱి నొక్కనాఁడు
ధరణీశు మఱఁది[8]యు దండనాయకుఁడు । నరయు గర్వాంధుండు నగు సింహబలుఁడు
తన [9]యక్కగారు భూపాలునాథుసతికి । [10]వినతి సేయఁగవచ్చి వెస నిల్లు సొచ్చి
యద్దేవి గద్దియ కనతి దూరమునఁ । దద్దయు ద్రుపదనందనయున్నఁ [11]గాంచి
కలలోనఁ బెన్నిధిఁ గని పేదవాఁడు । పలుమాఱు [12]నూహించు పగిది నాసించి
మనసిజువలఁ జిక్కి మానంబు దక్కి । తనలోన నిట్లని తలపోయఁ దొడఁగె:
"అచ్చెరు [13]వీ పంకజాక్షి రూపంబు! । [14]మెచ్చొందెఁ దొలుకారు మెఱుఁగును బోలి;
అడుగుల కెంజాయ [15]లానఖద్యుతులుఁ । దొడల క్రొమ్మెఱుఁగులుఁ దోరంపుఁ బిఱుఁదు.
[16]సన్నవ నడుము నొప్పైయున్న వళులుఁ । [17]జన్నుల బిగువు నచ్చపు బాహులతలు
మెఱుఁగారు మోమును మీననేత్రములు । నెఱి [18]వెంద్రుకల కప్పు నెగడె [19]నింతికిని.
[20]కరువునఁ బోసెనో కంజజుం డతను । శరములైదును గూడ [21]జలజాక్షిగాఁగ?
హరుఁడేమి సేయు నియ్యబల నీక్షించి(?) । విరహాగ్నిఁ గాముఁడే విరిసెఁ గాఁ [22]బోలు(?)
ముదిత నెమ్మోము సోముని [23]గెల్వనేర్చి । నది [24]గాన నలరారు నధరామృతంబు;
జగతి నింద్రుని కిట్టినతి లేదు[25]గాక । తగవేది [26]పరకాంక్షఁ దగులునే యతఁడు?
తొమ్మండ్రు బ్రహ్మలు తొడరిరో కాక । యిమ్ముగ్ధ నొకబ్రహ్మ యెట్లు [27]సృజించు!

1. నూరుమల్లులఁ బట్టి. 2. నా విభు సమ్ముఖమున. 3. పోరాడఁగ. 4. పాలింప. 5. నెపుడు — పెనఁగులాడుచు నుండుఁ బెంపుతోఁ దన్ను — గొనియాడఁ బ్రజలెల్లఁ గోర్కి రంజిల్ల. 6. వెలయు. 7. కుండ — నిండునంతటిలోన. 8. యుద్దండ సాహసుఁడు. 9. యప్పయైన. 10. వినతుఁడై పోవచ్చి విభునిల్లుగదిసి. 11. జూచి. 12 మోదించు పగిది మోదించు. 13. వంచె నబ్జాక్షి. 14. మెచ్చులై. 15. యానన. 16. సన్నంపు నడుమును సొరొందువళులు. 17. జెన్నారులతలు నాఁ జెలఁగు బాహువులు. 18. వెంట్రుకల కొప్పు. 19. నీ సతికి. 20. కరువు (గు) నఁ బోరి కాఁబోలు (గా నోపు) మరుని. 21. ఁజపలాక్షి. 22. నోపు. 23. ఁబోలనేర్చు. 24. నిక్కమగులోన; నిక్కమును గొనె. 25. గాని. 26. ముని. 27. నిర్మించె.

ఈ యింతిఁ జూచిన నీశానుతపము । పాయదే! మరుఁడు తప్పఁగఁ జేసెఁగాక ;
హనుమంతుఁ డీయింతి [1]నలవోకఁ గన్నఁ । దనబ్రహ్మచర్యంబు తడఁ[2]బెట్టుకున్నె !
కమ్మపువ్వులు క్రింగు గండుతుమ్మెదలు । కొమ్మ[3]కొప్పునుబోలి కొమరొప్పుకున్నె !
[4]ధీమంతుఁ డజుఁడు మంత్రించెనో కాక । కామిని నడుము చన్గవ మోయఁగలదె!
మొదలఁ బద్మినిగాన ముదిత కింపారెఁ । బదపద్మ ముఖపద్మ పాణిపద్మములు ;
సీమంతరేఖయుఁ జెక్కుటద్దములు । రోమరాజియు [5]దంతరుచులు నెన్నడుము
బోఁటికినొప్పఁ [6]జూపుల విలాసములు । మాటలనేర్పులు మందహాసములు ;
ఎల్లమాటలు నేల యీకాంతఁ గన్న । తల్లిదండ్రులు సేయు తప మొప్పెఁగాక ;[7]
[8]ఓయారమునఁజేరె యుడురాజవదనఁ । [9]బాయక సురతసంపద [10]సిగ్గువఱచి
త్రైలోక్య[11]మును నేలఁదలఁచుచున్నాఁడ । నేలాగు సేయునో యీశ్వరేశ్వరుఁడు !
జలజలోచనఁ దెచ్చి సంధించుపనికిఁ । గల [12]దొకో నాకు నిక్కడ నొక్కతోడు!"
అని పెక్కుభంగుల నా సింహబలుఁడు । మనసిజునకు లోఁగి మదిరాక్షిఁ బొగడు ;
మగువఁ[13]బైకొనఁ జూచుమానంబు[14]దలఁచుఁ;।దగిలి[15] వెండియుఁజూచుధైర్యంబువిడుచుఁ;
గనుఁ బ్రాల్చుఁ, దలయూఁచుఁ, గలఁగు, సచ్చోట । జనులచప్పుడుచూచి చాలశంకించు.
[16]తలఁప నట్టిదకాదె! తరుణి యట్లున్నఁ । గలయఁ గోరుచునుండుఁ గామాతురుండు.
తలయుఁ జీరయు మాసి తనుదాన రోసి । మెలఁగు పాంచాలిఁ గామించి కీచకుఁడు
ఆకాంత [17]భీతియు నా కాంత [18]వణఁకుఁ । జేకొని [19]మదిఁ గామచేష్టగాఁ దలఁచి
[20]తనచేష్టలన్నియు ధైర్యంబుతోన । మనసులో [21]మఱచి తామరసాక్షిఁ జూచు ;
అప్పుడప్పయుఁ గొంద అబ్జలోచనలుఁ । దప్పక తనుజూడఁ దగవేది వాఁడు
మెఱుఁగుఁ[22]దీఁగయుఁబోలు మెలఁతమైఁదీఁగ । తఱచైన[23]రుచులకెంతయు సంత[24]సిల్లు;
పవడంపులతఁబోని భామకెంగేలు । తిపుటమై [25]వెడలు దీప్తికి మెచ్చి పొగడు ;
గండుమీలనుబోలు కాంత నేత్రముల । మెండైన మించు గ్రమ్మిన మిన్నుఁబ్రాఁకు;

---

1. నలవొప్ప. 2. కట్ట. 3. క్రమ్ముడిజారి. 4. భామిని నడు మురోభారంబు దాల్ప — ధీమంతుఁ డజుఁడు మంత్రించెఁ గాఁబోలు. 5. దంతరు (చిర ?) చులు నేత్రములు. 6. జూపులు. 7. ఓయార మునఁజేరి యుగ్మలి మారు - సాయకంబులఁ జిక్కు-సరణి గీల్కొలిపి - యాలోల సౌఖ్యాబ్ధి నల్లాడఁ దలఁతు—నేలాగు సేయునో యించువిల్తుండు. 8. ఒయ్యారమున. 9. పయ్యెద. 10. చిక్కు. 11. మేలఁ దలంచుచున్నాఁడ. 12. డొకో. 13. గైకొన. 14. నిలుపు. 15. వెంటను. 16. అలవిమాలిన కోర్కు-లతిశయిల్లఁగను. 17. వగపును. 18. భయము. 19. మరి. 20. తనలోపలనె దాను ధైర్యంబు గలిగి. 21. పదిలమై మరగుచునుండె. 22. దీటను. 23. కాంతి. 24. నించు. 25. నున్న కాంతికి.

పున్నమచంద్రుఁడై[1] స్ఫురణించుచున్న । యన్నాతిమోముచాయకు మోము వ్రేల్చ;
ఈ చందమునఁ జూచి యింతిపైఁ జూపుఁ । గీచకా[2]గ్రణి యెట్టకేలకుఁ [3]డగిచి
నలినాక్షి యన్వయ నామధేయములు । వెలయ సుదేష్ణచే విందుఁగా కనుచు
నేతెంచి మ్రొక్కిన, నిభరాజగమన । [4]ప్రీతితో బంగారు[5]పీటఁ బెట్టించి
ఘనరత్నఖచిత కంకణ[6]పాణి మెరయ । నొసర సంభా[7]వించుచున్న దో, వాఁడు
తమకంబు రెట్టింపఁ [8]దనసహోదరికి । సుముఖుఁడై పాంచాలిఁ జూపి యిట్లనియె:
"ఈ కాంత కులమేమి? యెట్టినామంబు? । చేకొని యిట కేమిసేయ నేతెంచె?
ఏవెంట విహరించు? నెవ్వాఁడు మగఁడు? । నీవెంత మన్నింతు [9]నెమ్మితో దీని?"
[10]అనవుడు నతఁడు కామాతురుండగుట । మనసులోఁ[11]దెలిసి యామదిరాక్షి యపుడు:
"పరకాంతపై వీని భావంబు తగిలె । వరుసతోఁ దప్పింపవలయు నా." కనుచు
[12]మాటల మఱువెట్ట, మత్తుఁడై వాఁడు । [13]గాటంపు మరుసాయకంబుల కులికి
సంపంగికై పోవు చంచరీకంబు । సొంపునఁ బాంచాలసుతఁ జేరఁబోయి
విటలక్షణములెల్ల వేడ్కతోఁ జూపి, । కుటిలకుంతలఁజూచి కొమరొప్పఁ బలికె:

## సింహబలుఁడు తన మనోరథము ద్రౌపది కెఱిఁగించుట

"తరలాక్షి, నినుబోలు తరుణి నేఁగాన । నరలోక [14]ఫణిలోక [15]నాకలోకముల;
బంగారుప్రతిమతోఁ బ్రతియైన [16]నీకు । అంగన, పేరేమి? యధిపు[17]పేరేమి?
నీతండ్రి యెవ్వాఁడు? నీకు[18]లంబెద్ది? । ఏతఱివచ్చితి వెఱిఁగింపు." మనిన,
ఆ సరోరుహగంధి యతని మాటలకు । [19]మూసిన ముత్తైమై మొగి నూరకున్న,
కినిసి యంతటఁబోక కీచకాగ్రజుఁడు । [20]మనసు కోర్కులురేఁప మగువ కిట్లనియె:
"కనువిచ్చి నావంకఁ గడకంటనైనఁ । గనుఁగొన్నఁ దప్పౌనె కర్పూరగంధి!

---

1. తో. 2. గ్రజుఁ డెట్టకేలకు. 3. నుడిగి. 4. ఖ్యాతిగా. 5. గద్దె. 6. నూపురములు. 7. షించు. 8. దాల్మి కీలెడలఁ – గమలాక్షిఁ జూచి యెక్కడిదాన వనిన – ననుటయు వాఁడు కామాతురుం డగుట – మనసులోపల నెంచి మదిరాక్షి చూచి – పరకాంతపై. 9. నెలమితో. 10. అనుటయు వాఁడు కామాసక్తుఁ డగుట. 11. పలనెంచి మదిరాక్షి చూచి. 12. మాటలుపచరింప. 13. పాటల గంధినిఁ బరికించిచూచి. 14. సుర. 15. నాగ. 16. నీదు. 17. డెవ్వాఁడు. 18. నిచ్చటికి – నేతేరఁ బనియేమి యెఱిఁగింపుమనిన – ఆ సరోరుహ. 19. కోసి నెమ్మదిఁబాసి రుష నూరకున్న. 20. వనితఁ దప్పకచూచి వలవొప్పఁ బలికె.

మెఱుఁగారు మోమున [1]మెలపు రెట్టింపఁ । జిఱునవ్వు నగరాదె చిగురాకుబోఁడి!
అల[2]రార వీనుల కమృతంబు లొలుకఁ । [3]బలుకంగరాదొకో పంకేరుహాక్షి?
[4]ఈలీలఁ గరుణించి యెలమి నామాట । లాలింపఁ దగదొకో యలినీలవేణి!”
అనుచుఁ జేరఁగఁబోవ, నమ్ముగ్ధమాట । వినఁగోరుఁ, [5]దనకోర్కి వివరింపఁదలఁచు.
తనరార [6]నిన్నిచందములఁ బాంచాలి । మనసు గానక వాఁడు మఱియు నిట్లనియె:
“పడఁతి, నీయొడలు దప్పక చూడ నెఱతుఁ । దొడిఁ[7]బడి కనుఁబాటు [8]దొడరునోయనుచు;
పనివడి నీ కేలు పట్టఁ జూచిసను । వనజాక్షి, నా కేలు నణఁకంగఁ దొడఁగె;
కలకంఠి, నీ యున్న గన్నంబుఁ జూచి । పలుకఁ జూచిన [9]మాట పలుక[10]నోడుదును;
నలినాక్షి, యిటమీఁద నన్ను [11]పేక్షించి । కలయకుండితివేనిఁ గందర్పుఁడేచి
మోహనాస్త్రము [12]నేసి మోహరించుటయు । దేహంబు నాకు సందేహంబు గాదె?
అప్పుడు బ్రతికింప నలవియే నన్ను? । ఇప్పుడే [13]కరుణింపు మిభరాజగమన!”
అనవుడుఁ [14]గలుషించి హరిణాయతాక్షి । [15]తనుదానె కోపమంతయు డిందుపఱిచి
‘వేగంబు [16]గొఱగాదు వీని [17]వేఱొక్క । లాగున విఱుతునేలా మాట’ లనుచు
నొప్పార నిట్లనె: “నోయన్న, నీకు । నిప్పుడు నా రూప [18]మెట్లుండె నేని
[19]నే నీకుఁ జెల్లెల నీ మనంబునను । బూనిన మోహంబు పోవిడుమయ్య.
ఆఁడుబిడ్డలతోడ [20]నర్థితోఁ బుట్టి । నేఁడు నన్నిట్లాడ నీకు న్యాయంబె?
హీనవంశము దాన నేఁ బతివ్రతను । గానక నీ విట్లు [21]కడవనాడుదువె?”
అని [22]దూఱఁబల్కిన నా సింహబలుఁడు । మనసిజుఁ డలయింప మఱియు నిట్లనియె:
“హీనవంశమునందు నీ చక్కఁదనము । లే నెఱుంగక యుండ [23]నెక్కడవచ్చె?
కలువరేకులయందుఁ గల మెత్తఁదనము । [24]చెలువ, నీ యడుగులఁ జేరి యున్నదియ;
[25]కమలాక్షి, జక్కవకవలచందమునఁ । గొమరొందె నీ కుచకుంభ యుగ్మంబు;

---

1. మేలు. 2. రారు. 3. పలికిన బ్రదుకనే. 4. నీలీల లిట్లు వర్ణించు నామాట- 5. మఱియును వినఁగోరు నచట. 6. నెన్ని. 7. బడ. 8. దొరయునో. 9. నోరు. 10. నోడెడిని. 11. పేక్షింపఁ-దలఁచితివేనియు దర్పకుండేది. 12. దాను. 13. బ్రదికింపు మిందీవరాక్షి. 14. గోపించి. 15. తనికిన. 16. గొన. 17. బొంకైన. 18. మేపయ్యె.

19. ఈ చీర లీ యొడ లీ యున్నయునికి । కీచకాగ్రజ నీకుఁ గింకిరి గాదె?
ఇరవొప్పఁ గన్నుల కింపు గాదేని । పురుషున కా కాంతఁ బొందనేమిటికి?

20. నర్థిఁ బుట్టితివి. 21. కాఱులా. 22. వీడ. 23. నెచ్చోటఁ గలదు. 24. చెలియ నీ కరములఁ. 25. చెలువారు నంబిక శ్రీలు చెల్వొందు-చెవి మారు నంబక శ్రీలు నా దనరి - తొలకరి మెఱుపుల దొలకాడు రుచులు - నెలఁత యొక్కట నేలె నీ దేహకాంతి - గండు తుమ్మెద.

తొలుకారు మెఱుఁగుల దుము కాడు రుచులు । నెలఁత, కుందనమును నీ దేహకాంతి.
గండుతుమ్మెద [1]చాయఁ గనుగందకుండ । నిండారి [2]యున్నవి నీదు పెన్నెఱులు;
పదియాఱు కళలఁ దప్పని చందమామ । సుదతి, నీ వదనంబు చూచి లజ్జించు;
ఇట్టి [3]నీ సౌభాగ్య మెల్లభాగ్యములు । పుట్టింపకుండునే! [4]బొంక నేమిటికి."
అన విని కోపించి [5]యంభోజనేత్ర । కనుఁగవఁ గెంజాయ [6]కడలుకొనంగ
భయము చూపక మెత్తఁబడఁడు వీఁడనుచుఁ । బ్రియమేది నీచుతో బింబోష్ఠి పలికె:
"వలదురా కీచక, [7]వైరంబు ద్రోవ । [8]తలఁచి మీఁదెఱుఁగక తప్పనాడెదవు;
గంధర్వు లేవురుగలరు నా మగలు । సంధులు విదళించి చంపివైచెదరు;
భీమబాహాటోప [9]బిరుద ప్రతాప । [10]ధాములు నిరుపమోద్దండ సాహసులు;
వదలని భుజశక్తి వారికి నీకు । నదిఁ దలంపఁగ హస్తి మశకాంతరంబు."
[11]అన వాఁడు కోపించి హరిణాక్షి కనియె: । "వనిత, ముగ్ధవుగాన వర్ణించె [12]దిట్లు;
ఈ లోకమున నాకు నెదురు [13]దెచ్చెదవు; । చాలు [14]నీ మాటలు సంతసించితిని;
[15]బలుఁడు భీముఁడు సింహబల జరాసంధు । లల శల్యుఁడును సరియను బెల్ల కల్ల;
కుటిలకుంతల, యేను కోపింపఁ గాని । బొటవ్రేలఁ జిమ్ముదు భూరిశైలముల."
అనవుడు వాని గర్వాలాపములకు । మనసులోఁ [16]గోపించి మదిరాక్షి యనియె:
"మదిమది నుండి దుర్మదము వాటించి । కదియఁ జూచెదవేల కాలమృత్యువును?
రావణాదులు మున్న రమణికై పోరి । వేవేగఁ [17]దీఱుట వినరాదె [18]కథల?
[19]కోర్కి నందని పండ్లు కోయఁ[20]బోనేల? । తక్కుం[21]డు మిదినీకు ధర్మంబు గాదు."
అని యిట్లు పాంచాలి యసహ్యోక్తి పలుక । విని కీచకుఁడు [22]శోకవివశుఁడై యపుడు
క్రమ్మఱఁ దన యప్పకడకు నేతెంచి । [23]యుమ్మల నిట్టూర్పు లినుమడింపంగ

1. కాంతి గలిగిన యొప్పు. 2. యుండు నీ నెఱివెంట్రుకలకు. 3. శృంగారంబు లెల్ల. 4. బొంకంగ నేల. 5. యంబుజగంధి. 6. కలయంగఁ బర్వ. 7. వలరాజు బారి. 8. గలఁగి యీ తీరునఁ గాఱు లాడఁగను. 9. భీగుర. 10. ధాము లుద్ధతిమైన తగు సాహసులును. 11. అనవుడు విని కీచకా గ్రజుఁ డనియె. 12. చి తిట్లు. 13. చెప్పెదవు. 14. నూరకయుండు సంతసిల్లితిమి. 15. బలుఁడు భీముఁడు భూరిబలుఁడు శల్యుఁడు–బలులయ్యు ననుబోలవలఁతులే వారు. 16. నోర్వక మఱియు ని ట్లనియె. 17. విఱుగుట. 18. చెవుల. 19. కోర్కి కందని. 20. నెట్లగును. 21. ప నిది. 22. కోపవివశుఁడై యపుడు; శోకవివశాత్ముఁడగుచు. 23. ఇమ్మడి నిట్టూర్పులెసఁగ నిట్లనియె–ఓయింతి; ఇమ్మడి నిట్టూర్పు లినుమడింపంగ – నెంతయుఁ జిన్నవోయిన మోముతోడఁ – గాంత యూరకయుండఁ గలఁగి యిట్లనియె – నేయింతులైన నీయింతిఁ బోలుదురె! కాయజుదంతియై కలకంఠి పొలుచు – నాయబ్జముఖి.

నెంతయుఁ జిన్నవోయిన మోముతోడఁ । గాంతయూరకయుండఁ గలఁగి యిట్లనియె:

## సింహబలుఁడు తనకోరిక యక్కకుఁ దెలిపి కీచకుఁడు చెప్పుట

" ఓయింతి, యిట నిప్పు డొక భామఁ జూచి । పోయితి నది యెందుఁబోయె నీయెడను?
ఆ యబ్జముఖి రూప మాత్మలో నిలిపి । పాయక మదనుఁ డేఁపఁగఁ జొచ్చినాఁడు;
అతివ, [1]నీ వెఱుఁగుదు వటుమీఁదిపనులు; । హిత[2]వు చేసితివేని యే నిన్ను [3]మఱవ."
అనిన భూ[4]విభుదేవి యతని వేగిరము । కనుఁగొని తలయూఁచి [5]కలుషించి పలికె:
" ఈ చంద్రముఖియందు నేచక్కఁదనముఁ । జూచి మోహించితి చోద్యంబుగాఁగ?
[6]ఏచూపు [7]లేతీపు [8]లేవిలాసంబు । [9]లేచంద [10]మేయంద మేమందు నిన్ను!
వాలారుఁజూపుల [11]వాలుఁగన్నులను । మేలైన నడకల మెలపుమాటలను
సంగీతసాహిత్య సరసభావముల । శృంగారచేష్టలఁ జెలువైన [12]గతుల
నగవులఁ దగవుల నాగ[13]రికముల । సొగయించి [14]వలపులు సోనగాఁ గు[15]రిసి
సంభోగసుఖము లీఁజాలి నీనగర । రంభ మెచ్చనియట్టి రమణులున్నారు;
చేత వెన్ననుబట్టి [16]చిత్తంబు చెదర । నేతికిన్నై యేడ్చు నీవంటివాఁడు."
[17]అనుటయు నమ్మాట లాత్మలోఁ జొరక । ఘనమైన నిట్టూర్పు గదియ నిట్లనియె:
" నానగరన నేల నాకలోకమునఁ । బూని యిమ్మదిరాక్షిఁ బోలరెవ్వారును;
[18]ఈ లతాంగికిఁ గన్నులిలఁ గండుమీలఁ । బోలి యేలుచునుండుఁ బుష్పబాణముల;
[19]ఎలతీఁగలనుబోలు నీ యింతికరము । లలవోక నగుచుండు నబ్జనాళముల;
చెందొవలను [20]మీఱి చిగురాకుచాయ । [21]నందమై యీయింతి యడుగు లొప్పారె;
ఈ రామ పలికిన నింపు[22]సొంపారి । కీర కోకిల వల్లకీనాద మొసఁగు;
అట్టి యీసైరంధ్రి [23]నన్యకామినులు । నెట్టన సరి[24]పోల నేర రెవ్వారును;

1. నీవెకందు. 2. హితము. 3. మఱువ. 4. వరు. 5. కంపించి. 6. ఈ. 7. 8. 9. లీ. 10. మీ. 11. వలయు మగ్రముల – మేలిమి నడపుల మెచ్చు మాటలను. 12. రతుల. 13. రికముల. 14. నగవుల. 15. గురియు – సురకన్యకలనైన స్రుక్కించునట్టి – తరుణు లున్నారు నీ ధామంబునందుఁ – జేత వెన్నను. 16. సృష్టిలో నొకఁడు; చెనఁటి చేఁతలకు. 17. అనవుడుఁ గీచకుం డతివమాటలను – విన కిట్లుపలికె నీ వెడమాటలేల – అనవుడుఁ జింతించి యతివమాటలకుఁ – బనిగొన దూఁటుచుఁ బలికె నిట్లనుచు – నా నగరన. 18. గండుమీలకుఁ బుట్టి కాముబాణముల – దండ నాడుచునుండుఁ దరుణి నేత్రములు. 19. ఏలతీఁగలఁబోలె(?). 20. బోలి. 21. లంది యీశోభలి. 22. సొంపగుచు. 23. లగన్యకామణులు(?). 24. పోల్ప.

ఒగి సామ భేద దండోపాయములను । మగువఁ బుత్తెమ్ము; ధర్మము [1]పల్కనేల."
అనినఁ దమ్ముని [2]జూచి యబల యిట్లనియె: । "వినుమింక నీజాలివిడిచి నామాట;
పరధన పరదార పరనింద లెపుడు । నరసి [3]చూచిన దోష మాయుష్యహాని;
అందులోఁ బరకాంత యధిక[4]పాతకము । పొందించు [5]మదిఁ గోరి పొందువారలకు;
పతిగన్నఁ దెగఁజూచుఁ; బ్రజగన్న దూఱు; । సతిగన్నఁ గోపించు; సభ్యులాడుదురు.
అవి [6]యెన్న నేల? నే నబలచే వింటి । నువిదకు గంధర్వులున్నారు మగలు;
పులియున్న పొదరిల్లు పూఁబోణి యుఁగ । వలదు నీ కాత్మలోఁ వలదు నాయన్న!"
అనినఁ గీచకముఖ్యుఁ డలుకఁదీపించి । తను దైన్యము నాడింపఁ దరుణి కిట్లనియె:
"వెలఁది, వెఱ్ఱివిగాక [7]బొంకుమాటలకుఁ । గలఁకెదువాఁడనే? తలఁపఁ గాసితివి;
ఈ చరాచరమున నెట్టిసాహసులుఁ । గీచకుఁ డనిన [8]శంకించి పాఱుదురు;
కదన మబ్బదుగాక గంధర్వులేల । త్రిదశవీరులనైనఁ దివిరి సాధింతు.[9]
అదిచెప్పఁ బనిలేదు హరిణాక్షి, చేటు । పదరకు నామేలు వలసి తేఁపయును.
అని లేచి రమణి పాదాబ్జపీఠమున । వినతుఁడై కీచక[10]విభుఁ డప్డు పడెను,
'పరసతిఁ గామించు పాపాత్ముఁ డిట్లు । ధరఁగూలు' నని చెప్పి తగఁ [11]జూపినట్లు.
అనుజన్ముఁ డిట్లు పాదాక్రాంతుఁడైనఁ । గనికరంబొంతయుఁ గల్గి యద్దేవి[12]

---

1. గాదు నీకు. 2. తోడ నబల. 3. చూడఁగ. 4. పాపంబు. 5. మది. 6. యొల్ల నేనును. 7. వెలఁది; వేఁడి. 8. కంపించి (?). 9. ఇటు బుద్ధులను జెప్పవెల్లఁ బోవిడిచి – కుటిలకుంతల నన్నుఁ గూర్పుమా కరుణ – నది చేయఁదగు కార్య మబల, యియ్యెడను – వదరక నామేలు వలసి తేనియును. 10. విభుఁ డొప్పెఁ జూడ. 11. జూపె ననఁగ.

12. కనుదమ్ములను నీరు గ్రమ్మంగఁ గాంచి । తనలోనె దలపోసెఁ దత్తరిల్లుచును;
ఇపు డేమిసేయుదు నితఁ డిట్లు మరుని । విపులమాయకు లోఁగి వికలాత్ముఁ డయ్యె;
పరకాంత వలచు నప్పాపాత్ముఁ డెపుడు । వరధర్మపథ మేల భావించు నెదను?
పరమసాధ్వియుఁ బతివ్రతయు నౌ దీని । నరుదారఁ గామించె; నబ్జసంభవుని
శాసనం బెటు దాఁటఁజాలు నెవ్వరికి? । ఈ సతి వలచి తా నెంతెంత యిడుమ
లందంగవలయునో యకట! యీతనికి । నందంద ప్రకట శౌర్యాటోపమునను
అరివారమునుబట్టి యలవోక విఱిచి । వరకీర్తిఁ గాంచిన బలసమన్వితుఁడు
సుమబాణనికరంబు సోఁకఁ దూలెడిని । తమఁ దామెఱుంగరు తమికొన్నవారు,

“ ఏమి సేయుదును [1]నేఁ డెన్ని చందములఁ । గామినిఁ దేకున్నఁ గాదు కార్యంబు ;
తెచ్చిన నపకీర్తి తెచ్చుఁగాఁ కిపుడు । వచ్చునె సైరంధ్రి వరపుణ్యసాధ్వి ?
ఎక్కడి కీచకుం డింక నా!'' యనుచు । మ్రొక్కిన ముద్దుతమ్ముని లేవనెత్తి
కాటుకకన్నీరు [2]కంటిరెప్పలకు । మాటుగా [3]నిల్పుచు మగున యిట్లనియె :
“ వెఱవకు [4]నీకు నవ్వేలఁది నెవ్వారు । నెఱుఁగకుండఁగఁ [5]బుత్తు నెలమితో నీవు
పొమ్ము నీయింటికిఁ బొలఁతి మద్యంబు । దెమ్మని [6]పుత్తు నీదినములోపలను ;
అప్పు డెంతయు నీవు నసమాస్త్రకేళిఁ । దెప్పలఁదేలి మోదింతు గా.'' యనినఁ

## ద్రౌపదిరాకకై సింహబలుఁడు పరితపించుట

తెలిసిన మొగముతోఁ దివిరి కీచకుఁడు । వెలయంగ నింటికి [7]వేవేగఁ బోయి
యిందుకాంతపువేది నేకాంత [8]సీమ । ముందట మధుమాంసములు పెట్టఁబనిచి
పలు తెఱంగుల మంచి భక్ష్యభోజ్యములఁ । దలకొని తెప్పించి తలఁపులో నపుడు
ఆ కాంతనయనంబు లసమసాయకు[9]కు । కైకొన్న తూపులుగా నెన్ని యెన్ని,
ఆ మంజుభాషిణి [10]యాస్యబింబంబు । తామర [11]పూవుగాఁ దలపోసి పోసి,
ఆ రాజముఖికి [12]నొప్పిన యట్టి తొడలు । కోరిక నరఁటి మ్రాకులఁ బోల్చిపోల్చి,
ఆ సరోజాక్షికి నలరారు జంఘ । లాసాసఁ [13]గాహళులని [14]చూచిచూచి
[15]నాతిపాదము చేరి నతనాభిదాటి । చేతుల[16]కై వ్రాలి చెక్కులఁ [17]దాటి

---

1. వీఁడెన్ను చందమునఁ । గామినిఁ బంపినఁగాని యూఱడఁడు
ఒప్పునే సైరంధ్రి యురుపుణ్యసాధ్వి । ముప్పొంద నొడిఁగట్టె మూర్ఖుండితండు.
గంధర్వులేగురు గరితకుఁ బతులు । గంధద్విపోపమ ఘనపరాక్రములు
విడుతురే యూరక వీనిఁ జంపక యు । కడుదాపుగా వచ్చెఁ గాలంబు వీని
కెక్కడి కీచకుండింక; 2. గండరేఖలకు. 3. నేడ్చుచు. 4. మింక. 5. వచ్చు నేను బొమ్మనిన. 6. పుత్తెంతు దినములో ననిన. 7. వేగంబె. 8. వేళ. 9. ని. 10. కలవొప్పనాభి. 11. కొలనుగా. 12. నొప్పారు పాదములు–కోరికఁ జిగురుటాకులఁ బోల్చిపోల్చి; నొప్పలరు పెన్దొడలు. 13. గరి కుంభమని. 14. యెంచియెంచి.

15. పలుపోకలను బోయి పలుమాఱు వగచి । కలపుచేఁ గోల్పోయె వర బుద్ధిబలము.
చెలిపాదములఁ జేరి చెరలాడి దుమికి । నిలువంగ నెడమీని నెన్నడు మెడలి
ఘన జఘనంబుపైఁ గడు వేడ్కనాడి । యనువుపైఁ గరముల నలవోకఁ బ్రాఁకి
చెక్కుల నునుపుచేఁ జేరంగ నోడి । చిక్కని తనువల్లిఁ జేర బ్రాఁకుచును
మోము నందముఁ జూచి మోదించితిరిగి । యా మీఁద నెఱికప్పునందుఁ జిక్కికొని
క్రమ్మిన మోహాంధకారంబుఁ దొలఁగి । క్రమ్మఱు తెన్నెఱుంగక వాని మనము
అలతుఁ దోఁటఁ జెలంగు సగచరంబనఁగఁ । బలుపోకలను బోయి బాధింపనంతఁ
16. కాగ్రవాఁడి. 17. జేరి.

[1]తరుణిచన్నవ కేఁగి తనులత నీఁగి । తిరముగా నేఁగి దృగ్దృష్టిపైఁ గ్రాఁగి
యామీఁ[2]దఁ గ్రొమ్ముడి [3]యందమై కప్పు । కామాంధకారంబు తిన్నన్న [4]బెదరి
భ్రమానిపై విహరించు మర్కటంబనఁగ । మాంసం బిల్లు కోసులీయుచు [5]మొలఁగఁ
గినిసి [6]యంతటఁబోక కీచకాగ్రజుఁడు (?) । తనలోన చిట్టిసి తలపోయఁ దొడఁగె :
“నాయంత [7]సింగారి నాయంత భోగి । నాయంత రసికుని నాతి రమ్మనదు ;
పడఁతుక ననుజూచి పలుకకుండుటకు । నడుగని సిగ్గు కా[8]నోపుఁ గారణము ;
నిడు వాలుఁగన్నుల నెమ్మితో నన్నుఁ । బడఁతి చూచిన జన్మఫలము గాకున్నె !
పిచ్చు[9]కకుంటుపైఁ బెదగంగ గదలి । [10]వచ్చినట్టుల కాదె వనిత వచ్చినను!”
అని పెక్కుభంగుల నా సింహబలుఁడు । [11]తనలోన సతి రాకఁ దగఁ గోరుచుండె.

## కీచకు నింటికేఁగి కల్లు దెమ్మని సుదేష్ణ ద్రౌపదిని నియమించుట

అంత నక్కడ భూతలాధీశు దేవి । సంతతపుణ్యఁ బాంచాలి రప్పించి
పెదవులు తడుపుచుఁ [12]బేర్చు దాహమునఁ । గదలలేనిదిపోలెఁ గాంత కిట్లనియె :
“వనిత, నా వదనంబు వఱువట్లు [13]వట్టె ; । మనసయ్యె [14]నిపుడాన మదిరారసంబు ;
వాచవియగు కల్లు వాసించియుండుఁ । గీచకునింటఁ దక్కినచోట లేదు ;
కడువేగమునఁ బోయి కనక పాత్రమున । నిడికొని యది తెచ్చియిమ్ము నా.” కనిన[15]
సుదతి మాటలు కర్ణశూలమై తాఁకి । హృదయంబు చెదరి పెంపేది బిట్టులికి
పడఁతుక వడఁకి యాపాదమస్తకముఁ । దడిసిన చెమటతోఁ దరుణి కిట్లనియె :
“ఇంతియ కాక నిన్నేమందు నబల ! । యింతకు వచ్చెనా యెన్నంగ నేఁడు !

---

1. తవిలిచన్నవ కేఁగి తగుణికై మూఁగి। తివిరి మోమునకేఁగి దృష్టిపైఁ గ్రాఁగి. 2. ది. 3. క. 4. ఁజొచ్చి. 5. ఁదవిలి. 6. మారునిచేత. 7. రూపరి; శృంగారి. 8. ఁబోలు. 9. కుంటుని మీఁద. 10. వచ్చుట నాకు నా. 11. వనజలోచన రాక వడిఁ గోరుచుండె. 12. ఁబేరి పాదములు. 13. గొనియె. 14. నిప్పుడు.

15. నదరి యానుడి చెవి కమ్ముగా సోఁక । హృదయంబు గలఁగఁ బెంపేది బెట్టపలి
యేమిచేయుదు ! నెట్టు లిది తప్పుకొందు ! । కాముబారికి లోఁగెఁ గంటకుం డతఁడు ;
తనయింట నను జూడఁ దా నేలవిడుచు ? । కనికరం బతఁడేల గాంచు నా యెడను ?
కుపిత వార్యత్ఖంబుగుహఁ జొచ్చు మృగము । నిపుణత నుసుఱుతో నేప్చునే మరల ?
అందుఁ బోనొల్లనం చాడంగరాదు ; । మందతఁ బోరాదు ; మఱి యేమి చేయ ?”
అని యాత్మఁ జింతించి యంగనారత్న । మొనరిన చెమటచే నొడలెల్లఁ దడియ
నింతితో నిట్లను : నేమందు నిన్ను ? । ఇంతకు వచ్చెనా యెన్నంగ నేఁడు ?

ఏమని పిలిచితి? వేమిగాఁ జూచి? । తే మున్ను నీతోడ నేమిచెప్పితిని?
నీచంపుఁబనులకు నే నొల్లనంటిఁ । గీచకు నింటి కేక్రియఁ బుత్తురమ్మ?
కల్లుతెచ్చుట కేనుగాకున్న నేమి? । తల్లి, నీనగర నెందఱులేరు సతులు?
మగవారిసన్నిధి మఱఁగి నీ యుంటఁ । దగవొప్ప మెలఁగితిఁ దాల్మి వాటించి;
[1]అట్టిచో నాపద కడ్డమై రాక । నెట్టన నీవింక నిష్కృతి సేయుదువె!”
అనిన నట్టిదకాక యని సుదేష్ణయును । మనసులో శంకించి మఱియుఁ జింతించి
[2]తమ్మునివలన సత్తరుణి పోకున్న । నెమ్మి ధీరతఁజూచి నెలఁత యిట్లనియె:
“అక్కట! [3]యేవేడ్కనానుమద్యమున । కొక్క నీచను బంప నోపమిచేసి
నీతోడఁ జెప్పి[4]న, నీవింత నన్ను । నీతిఘాతినిఁజేసి నేర్చి యాడితివి;
వనిత, నా యిల్లేమి? వాని యిల్లేమి? । [5]నిను లాఁతియింటికి [6]నేఁ బుత్తునమ్మ?
నీ సాధుగుణములు నీ చరిత్రములు । నీ సమీపమువార లెఱుఁగకున్నారె?”

## ద్రౌపది కీచకు నింటికిఁ గల్లు దేఁబోవుట

అనిన ద్రౌపది [7]యింక ‘నబలశో నింత । పెనఁగుట కొఱగాదు ప్రియ[8]మేదు’ ననుచు
నుల్లంబు వగపున నుబ్బాఁత లూఁగ । మెల్లన సతిమాట మేకొనఁ[9]జూచి
‘సురభిగంధముచేత సురుచిరంబైన । సురఁ దెత్తు నీకు భాసురలీల’ ననుచుఁ
‘గనకపాత్రిక దెమ్ము కర్మబంధముల । ననుభవింపకపోదు హారికైన’ ననుచుఁ

---

1. నిరుపమశీలవౌ నీయిల్లు దలఁప । వరధర్మచరిత సంభరితంబటంచుఁ
బతుల యసన్నిధిఁ బరిపాటినుందు; । నతివ, దుష్టులచేత నాపదయైనఁ
బాపి రక్షింపఁగా భావింపఁబోలు । నోపి యపాయంబు నొనరింపఁ జన్నె?
ఏరి యింటికినేని యేపనికైన । నేరీతిఁ బంపుదు విటు నన్ను? నాఁడు
నేను బల్కినమాట నీవు నీకొనిన । వైనంబు మఱవంగఁ బాడియే యిపుడు?”
అనవుడుఁ దనచేయు ననుచితంబునకు । వనిత శంకించియు వలవంతఁ దమ్ముఁ
డడలుట దలపోసి యాసాధ్వితోడఁ । గడువేడ్క మంజులగతిఁ బల్కె నిట్లు.
అక్కట! యేవేడ్క; 2. వలను. 3. యతివేడ్క యనుచు మద్యంబు. 4. తి. 5. విను. 6. వెసఁబుత్తు నోటు. 7. యంత. 8. మేధియు. 9. జేసి.

గీచక మన్మథాగ్నియుఁ బోని పాత్ర । మా చంద్రముఖి[1]చేతి కవనీశు దేవి
యిచ్చినఁ గొని వానియింటికై యింతి । వచ్చుచు భక్తిమై వనజాప్తుఁ జూచి:
"కర్మసాక్షివి నీవు కమలబాంధవుఁడ ! । ధర్మంబు గెలిపించి దయసేయుమయ్య !
కీచకుఁ డొనరించు కీడు[2]దప్పించి ; [3]నాచేయు తపముకు నన్ను రక్షించు."
నని ప్రార్థనముసేయ నద్దివాకరుఁడు । దనుజుని బుత్తెంచెఁ దరుణి రక్షింప.
వాఁడు[4]ను బఱతెంచి పరమూర్తి దాఁచి । పోఁడిగా వినువీధిఁ బొంచి [5]యున్నంతఁ,
దూలుచు సోలుచు దుఃఖ[6]వారాశిఁ । దేలుచు లేచుచుఁ దెఱవ యేతెంచి
రయముతో నపుడు వారణయానగాన । భయముఁబొందుచు సింహబలు నిల్లు సొచ్చె
ముదమేది రాహువు ముఖగహ్వరంబుఁ । గదిసిన శీతాంశుకళఁబోలెఁ జూడఁ.
గుటిలకుంతల వాని కొలువుకూటంబుఁ । దటుకునఁ [7]జొచ్చి యాతలి కక్ష్య[8]దాఁటి,
యోలి[9]బండరువులు నుగ్రాయుధముల । శాలలు గజవాజిశాలలుఁ [10]గడచి,
[11]శర మొప్ప మెఱుఁగు మేఘముఁ జొచ్చినట్లు । పరఁగఁ గీచకుఁడున్న భవనంబుఁ జొచ్చె.
అప్పుడు సంతోష మానసాబ్జమున । ముప్పిరిగొనుచుండ మోహించి వాఁడు
వేఁడినిట్టూర్పుల విరహతాపంబు । పోఁడిగా బాధింపఁ బూఁబోణిఁ జూచి
యిందురమ్మనఁ జూచు నెదు రేఁగఁ జూచు, । నందంద [12]రతికేళి నలరింపఁ జూచుఁ,
గేలు కేలనుబట్టి కీలించి పెనఁగి । యాలోన సతిమోవి నానంగఁ జూచు.
సతి [13]యంతఁ బోయి కాంచనపాత్ర మూపి । యతనికి మొగమీక యర్థి నిట్లనియె:

---

1\. ... ... ... ... ... । యీయ నంది యెంతయును
ఇచ్చఁ గుందుచు వానియింటికై యింతి । వచ్చుచుఁ దనపాటు భావించి పొగిలి
"హా మాయవిధి యెట్టియాపద దెచ్చె ? । నామీఁది దయఁబాసె నారాయణుండు.
ఇఁక నాకు దిక్కెవ్వ రీవేళయందు ? । ఇఁక నెట్లు వీనిపోఁ రేఁబాయ ?" నంచుఁ
దలఁచి మోమున వెల్లఁదన మిన్నడింప । నులుకుచేఁ దనువల్లి యురుకంప మొందఁ
దొడరుభీతిని నడ తొట్రుపాటొదవ । నెడరుచే నిట్టూర్పు లెసఁగంగఁ జెమట
నొడలెల్లఁ దడియంగ నుప్పరంబునను । గడువేడ్కఁ గ్రాలు నక్కంజాప్తుఁ జూచి
కర్మసాక్షివి నీవు. 2. దప్పించు. 3. నీచేయు పురుషార్థనిచయంబు చాలు. 4. నదృశ్యుఁడై వనిత కెన్నంటి. 5. యుండంగ. 6. భారమున – గ్రాలుచుఁ దాను వారణ యానగాన । భయముతో నల సింహబలు నిల్లు దరిసి । నియతి దప్పమిఁజేసి నెగులొంది కుంది. 7. దూఱి. 8. గడచి. 9. బొక్కస మిండ్లు నుగ్రాణములును. 10. దాఁటి. 11. మెఱసి మేఘముఁ జొచ్చు మెఱుపు చందమునఁ । బరఁగ. 12. దుష్టేచ్ఛ లడఁగింపలేక. 13. యును.

"ఘనమైన దప్పిఁ గేకయరాజపుత్రి । యనిచె నన్నిటకు మద్యంబు దెమ్మనుచు;
పోయింపు మిదె వేగఁ బోవంగవలయు, । నాయింతి కోపించు నాలస్యమైన."
[1]అనవుడుఁ గీచకుం డాముగ్ధఁజూచి : । "వనిత, నీ వేటికి వచ్చి తీపనికి?
మెచ్చులనుద్యంబు మెలఁతి కీక్షణమె । పుచ్చెద [2] నీవందుఁ బోవంగవలదు."
మనసార మాన్పెదు మాయప్పదప్పి । వనిత, నాదప్పియు వలదె మాన్పంగ?
[3]ఆలోలనేత్ర, నీ యధరామృతంబు । గ్రోలక నాదప్పి కుదియింపరాదు;
పరువడి నీతోడ భాషింపకున్న । మరుఁడు వెట్టినదాడి మరలింపరాదు;
కరమొప్ప నీచన్నుఁగవ ప్రాపులేక । విరహవేదనఁ బ్రొద్దు వేగింపరాదు;
నీతోడి రతికేళి నేఁడు లేకున్న । నాతురం బింతింత యని చెప్పరాదు;
ఏకాంతమున నింత యేల యేఁచెదవు? । నీకుఁ దేకువ నేను నీబంట నగుదు."
ననియెడు నామాట లరవిందగంధి । వినమి చేయుటఁజేసి విఫలమైపోవ
నాలోన నిట్లను నాలోలనేత్ర : । "ఏల మద్యము పోయ వెంతసేపున్న?
కలదు లేదనిచెప్పి కడువేగఁ బంపు; । పలుకు లేటికి? నాకుఁ బని చాలఁగలదు."

## కీచకుఁడు ద్రౌపదిని బలాత్కరించుట

[4]అనవుడు నాతికిట్లనియెఁ గీచకుఁడు : । "వనులెల్ల నను నేలు పనిఁ బోల వబల!
నా రాజ్యలక్ష్మికి నా ధనంబునకు । నా రత్నరాశికి నా సర్వమునకు
నలినాక్షి, [5]కర్త్రవై నా కులస్త్రీలఁ । బలుమారు నేలుచుఁ బని [6]గొందు గాక;
మగలు హీనులుగాన మగువ, నీ కిట్లు । మొగి నితరుల కార్యములు సేయవలసె:
[7]కడఁగి నా పత్నివి గారాదె? నీకు । విడువక నృపులచే వెట్టి సేయింతు;
వెన నెంత చెప్పిన విననేర." ననుచు । ననమసాయకు గాసి నలసి కీచకుఁడు
ఘాతలాడుచుఁ గన్నుగానమిఁ జేసి । కోతి పైఁబడి పట్టుకొనఁ [8]జూచునట్లు

---

1. అనుటయు సతికి నిట్లనియెఁ గీచకుఁడు. 2. నీవుండు పోవనేమిటికి.
3. అని యంత నిలువక యతి నీచుఁడగుచు । ననయభాషల నాడ నరవింద నేత్ర
తనికిన చింతచేఁ దల్లడిల్లుచును । విననట్లు చూపట్టి వెస నిట్టులనియె.
ఏల మద్యముపోయ వింత సేపున్న । నాలస్యమున కింతి యాగ్రహంబడరు.
కలదు లేదని చెప్పి. 4. అనుటయు దాని. 5. రాణి. 6. పంతు. 7. తరుణి నా యెడ నీవు దయ నూపుదేని — నిరతంబు నినుఁగొల్చి నేనుండు వాఁడ – విని వెదు నామాట విననేర ననుచు – ననమ సాయకముల కలసి. 8. జాడ నొప్పె.

నయముచాలక [1]మున్న నవసుధా [2]ధాము । రయమునఁ బట్టిన రావణు [3]చందమున
నింతిఁ బట్టినఁ గావనే తెంచు దైత్యుఁ । డెంతయుఁ దన సత్త్వమెల్ల నిచ్చుటయుఁ,
బడఁతుక పెనఁగి యా పాపాత్ము[4]చేయి । విడిపించుకొని పాఱి వెడలె నా యిల్లు.
అట్టిద కాదె యన్యాయ [5]వర్తనులు । పట్టిన పనికాదు [6]బల మెంతయున్న.
కోమలి తప్పించుకొని [7]యిట్లు పోవఁ । దామసుఁడై వెంటఁ దగిలి కీచకుఁడు
[8]నమిలిఁ దఱుము బాలనాగంబు లీల । విమతుఁడై యేతేర వెలఁది వీక్షించి
'ఎక్కడఁ జొత్తు? [9]నేనెటఁ బోదు?' ననుచు । దిక్కులు చూచుచుఁ [10]దెగిపాఱుచుండఁ
దన భాగ్యమునఁ జేసి ధరణీశుఁ డపుడు । ఘనలీలఁ గొలువున్నఁ గదిసె నచ్చటికి.
ఖలుఁడు కీచకుఁడంతఁ గామాతురుండు । నలఘు సత్త్వుండు గర్వాంధుండుఁ గానఁ
బ్రజచూడఁ బరకాంతఁ బట్టఁ బోరామి । నిజముగా నెఱిఁగియు నీతిఁ బోవిడిచి
జలజాక్షిఁ [11]గదిసి యచ్చటివారు చూడఁ । దలఁ బట్టి తిగిచి యుద్ధతి [12]నేలఁ ద్రోచె.
అంత సూర్యుని యాజ్ఞ నరుదెంచు [13]దైత్యుఁ । డెంతయుఁ బననేసె నెలమిఁ గీచకుని.
వ్రేసినఁ బులి కోల వ్రేసినట్లులికి । యా సరోజాక్షి[14]కి నతఁడోసరించి
యొడుపుదప్పిన యట్టి యురగంబు పోలె । నుడుకుచు నుండె నిట్టూర్పులు నిగుడ.

## భీముఁడు కీచకు మడియింపఁ జూచుట

అప్పు[15]డన్నయుఁ దాను నాస్థానసీమ । [16]నొప్పుగా వాయుజుఁ డుండుటఁ జేసి
ద్రౌపది సభలోనఁ దలవట్టి యీడ్చు । పాపాత్ముఁ జూచి కోపము [17]సైఁపలేక
'దుశ్శాసనుఁడు [18]సేయు దుండగం [19]బితఁడు । నిశ్శంకఁ జేసె నిన్నియు నేల' యనుచు
నెరకిన్కఁ గనుదోయి నిప్పులు రాల । గరుపాఱి చెమట సంగము దొప్పదోఁగ
[20]సమద కీలాభీల చటులోగ్ర దృష్టి । రమణతోఁ గాలభైరవమూర్తిఁ [21]దెగడి

---

1. తొల్లి. 2. ధార. 3. వోయనఁగ — నంత ద్రౌపదిఁ గావ నరుదెంచు దైత్యుఁ డింతికిఁ దనసత్త్వ. 4. చెయ్యి. 5. వర్తులకు. 6. బలిమెంతయైన. 7. పోవఁబోవ. 8. నడఁగంగఁ దవిలెడు నాగంబపోలె — విడుకక పెఱతేర. 9. నా కెటుపోవ. 10. దెలివ యేతెంచి. 11. దన్నెన. 12. ఁగూలవైచె. 13. దూత — వింత యాబలిమిని వ్రేసెఁ గీచకుని. 14. ని నటు దోరగించి. 15. డగ్రజునితో. 16. నొప్పు వాయుజుఁ డట్టు లున్మద లీల. 17. నిల్ప. 18. సేయ. 19. పుడు, 20. బొమముడి నిక్కించి భుజము లుప్పొంగ. 21. మించి,

తలఁచె నప్పుడు భూమితలము నాకసము । వెలయఁ దాళములుగా వ్రేసి యాడంగ;
నుఱక చింతించెఁ బయోరాశిఁ గలఁచి । [1]మెఱసి చిక్కనిరొంపి మెయిఁబూసికొనఁగ;
నుంకించెఁ గులగిరు లూఁడఁ ద్రొంటెఁ దన్ని । కొంకక [2]తాడించి గుదిగ్రుచ్చి యాడ;
మిక్కిలి తమకించె మెలపుమై దిక్కు । లొక్క దిక్కు[4]కుఁ దెచ్చి యురుశక్తిఁ [5]బిడువ;
ఊహించెఁ గీచకు నొగిఁ బుత్రమిత్ర । సాహాయ్య సహితంబు చంపి చెండాడ.
తగ నిట్లు కోపించి తన భుజంబులకుఁ । దగిన కైదువు [6]లేమిఁ దలయూఁచి వగచి
ఘనమైన యొకమ్రాను గని [7]యంతలోనఁ । దనరనించుక ధర్మతనయుఁ జూచుటయు,
నతఁడును గనుసన్న [8]ననుజు వారించి । చతురుఁడై [9]వలలు విచారించి పలికె:
"వలల, వేఱొకచోట వంటకట్టియలు । గలుగవే? [10]యీ మ్రాను ఖండింపనేల?
ఇందఱుఁ జూడంగ నిది కూల్ప[11]కున్న । నెందును నీ లావు నెఱుఁగ [12]మే మున్న?
విఱువకు [13]మిప్పుడీ వృక్షంబు మనకుఁ । [14]దఱచు నీడలఁ బ్రాపు దాపునై యుండు."

## సైరంధ్రి విరటుకొల్వులో మొఱ వెట్టుకొనుట

అనిన మిన్నకయుండె ననిలనందనుఁడు । వనిత [15]యొయ్యన లేచి వారి నీక్షించి
[16]వనజంబులను మంచు వ్రాలు చందమునఁ । గనుఁగవ బాష్పంబు గడలు కొనంగఁ,
జంపకంబునఁ జేర్చు సౌరభంబనఁగ । నింపుగా ముక్కున నిట్టూర్పు నిగుడ,
విరిసిన కురులతో వెఱపుతో ధూళి । పొరసిన మేనితోఁ [17]బొగులుచు వచ్చి
జగతీశు డగ్గఱి సభవారిఁ జూచు । పగిది నెత్తుని చూడ్కిఁ బతులఁ జూచుచును
క్రూర కాకముచేతి [18]కోయిలఁ బోలె । నీ రెలుగునఁ గాంత యేడ్చుచుఁ బలికె:
"అకట! నా మగలు ధర్మాధర్మ విదులు । సకల శాత్రవలోక సంహారపరులు
పరులకునైన [19]యాపదలైన నణఁచి । వరుసఁ గీర్తులుగన్న వంశ [20]వర్ధనులు;
ఏవురు మగలు నా కెలమి గంధర్వు । లీ వేళ నన్ను నుపేక్షింపఁ [21]దగునె!
[22]రమణికి నొకఁడైన రక్షింపలేని । తమ పౌరుష [23]మ దేల? తమ లావ దేల?

---

1. మెఱయు. 2. తాటింప గుదురుగా గ్రువ్వ; తాడించి గుదులుగా గ్రుచ్చి. 3. మేలిమై. 4. న॰
5. బొదువ. 6. లేక. 7. లేవఁగడఁగి. 8. నతని. 9. వలలు. 10. యా. 11. నేల – నిండఱు. 12. రె.
13. మన్ననీ. 14. తఱచైనతల. 15. మెల్లన. 16. లేచి నెవ్వగ యోపలేక తూలుచును–లోచనాంబుజములలోన నీరూరఁ – జంపకంబులఁ జేర్చు సౌరభంబనఁగ – నించి (?) ముక్కున వేడి నిట్టూర్పు నిగుడ –విరిసిన కురులతో. 17. బొక్కుచు వచ్చి. 18. కోవిలఁబోలి – యా. 19. నా. 20. రత్నములు. 21. నగునె. 22. రమణిని నొకఁడైన. 23. ము లేల తమ లావు లేల.

[1]బలిమెంత గలిగినఁ [2]బ్రాప్తంబుదప్ప । నిల నెట్టివారికి నేమియు రాదు ;
ఈవేళ నెవ్వరి నేమనవచ్చు? । భూవిభుండును బాడిఁ బోరయఁ [3]డేమియును.
తనభూమి నొకనీచు తప్పుచేసినను । [4]జనదు నీకని వాని జంకింపఁ గావె?”
అనవుడు విరటుఁ డయ్యతివమాటలకుఁ । దన యాజ్ఞఁ జెల్లింపఁ దలఁపు పుట్టియును
హీనసత్త్వుఁడు గాన నెలమిఁ గీచకుని । [5]నోనాడనోడి సన్నుతు లొప్పఁజేసె.
వాఁడును [6]దనకోప మైభవంబణఁచి । పోఁడిగా నింటికిఁబోయెఁ ; [7]బోయినను
సైరంధ్రిఁ[8]జూచి యా సభలోనివారు । వారికి వారు దైన్యముఁ దూలువారు,
‘భూరాజ్యలక్ష్మి గాఁబోలు నీ యింతి । సైరంధ్రి గా’ దని శంకించువారు,
‘ఈసతి నిటుసేయ [9]నిది పాప’ మనుచు । నా సింహబలుమీఁద నలిగెడివారు,
‘ఈనాతి తానుండి యింతసేయింపఁ । గా నోపు’ నని దేశిఁ గనలెడివారు.
ప్రజలిట్లు పలువురుఁ బలుమాటలాడ । నిజ[10]సతిపై నల్కనెఱపి ధర్మజుఁడు
తొడరి మోమునఁ [11]గిన్క [12]దోఁపంగనీక । మడఁతి కిట్లనిపల్కె మధ్యస్థుపగిది :
“వినిరి నీమాటలు [13]వెన నెల్లవారు ; । చనరాదె [14]యింకనైన సభలోనఁ [15]దొలఁగి?
గంధర్వులకు వేళగాకుండెఁ గాక । సంధింప[16]కుందురె సాధ్వి, నీపనికి?
నెలకొన్న సమయంబు నీకు వారలకుఁ । గలుగకుండిన వచ్చి కావరే నిన్ను?
వారి నాడుటగాదు వడి నేఁగు.” మనిన, । సైరంధ్రి మఱియు నచ్చట [17]నిల్చి పలుకఁ
జూచినఁ గని ధర్మసుతుఁడు నా సతికిఁ । దోఁచిన కోపంబు[18]తోఁడ నిట్లనియె :
“నాన యించుకలేక [19]నర్తించుపగిదిఁ । బూని యీ శోకలఁ బోవ నేమిటికి?
కులకాంత లీరీతిఁ గొలువులో నిలిచి । పలుకరు నీ[20]వేల పలికెదో కాని!
జలజలోచన, చాలుఁజాలుఁ బో.” మ్మనినఁ । దొలఁగక సతి నేర్పుతోఁడ నిట్లనియె :
“నా వల్లభుఁడు మున్ను నటవేషధారి । కావున నాకట్లు గాక పోరాదు ;
నటమాత్రుఁడే కాదు నా ప్రాణనాథుఁ । డటుమటంబున జూద[21]మూడెడువాఁడు ;

---

1. బలుమెంత. 2. పంతంబు దప్ప – దిల నెట్టివారికి నేని నేనెంత; నేమనంగలను. 3. డెంతయును. 4. జనునె వారింపక సైరించియుండ. 5. నొండాడనోడి సన్నుతు లొప్పఁజేసి– యుండె విరాటుండు నోగిఁ జిన్నవోయి – వాఁడును. 6. నక్కోప. 7. బోవుటయు. 8. సభఁజూచి సభలోని జనులు. 9. నెంతవాఁ డనుచు. 10. బుద్ధిఁ గోపంబు. 11. వింత. 12. దొడరంగనీక. 13. వెఱ. 14. యింకనీ. 15. దొలఁగ. 16. కున్నారె. 17. నల్కఁపూన్చి. 18. దొడర. 19. నటియించు. 20. కెట్లు పలికితో గాక. 21. మాడంగనేర్చు – జూదరి యేలికిచోనైన యేవ – లేదు నన్నునఁ బనిలేదు నీకింక – అని చాయగా.

జూదరి యాలి కెచ్చోటనైన నాన । లే దున్నదనఁ బనిలేదు నీ కింక."
అని చాయగా నాడి యచ్చోటు తొలఁగి । చనుచుఁ బాంచాలి విచారింపఁదొడఁగె:

## ద్రౌపది సుదేష్ణను నొవ్వనాడుట

"ఇచ్చ[1] నా పాపాత్మునింటికి [2]నిట్లు । పుచ్చినసతి నింకఁ బోయి కోపింతు;
ఎఱిఁగియు నెఱిఁగియు నింతచేసినది । వెఱచునే నాకోపవిధము చూచినను?
[3]వెఱవదు కాకేమి వెసనింక నన్నుఁ । దఱుమదు కీచకాధము నింటి." కనుచు
నాదైన్యమున వచ్చి [4]యవనీశుసతికి । నాదటఁ బొడసూప నది సంభ్రమించి
యెఱుఁగని యదిపోలె నెలుఁగు [5]దప్పించి । వెఱఁగుపాటును బొంది వెలఁది కిట్లనియె:
"కలయ [6]నెన్నొసటిపైఁ గంధరఁ గలసి । చెలియ, నీ కురులేల చెమటతో[7]నంటె (?)
వెలఁది, నీకన్నీరు వెస[8]నోడి గిలుచుఁ । దెలి కన్నుఁగవకాంతి దీపించదేల?
మనసులోపల నెంతమాత్రమో వగపు? । వనిత, నీవదనంబు వాడఁబాఱినది;
ఎలమి నీతను[9]వేల యెలతీఁగఁబోలి । [10]ధూళిచే నెంతయుఁ దూలిపోయినది?
ఎవ్వఁడు నీ[11]కింత యెగ్గుగావించి । నెవ్వగ పుట్టించెనే చకోరాక్షి?
చెప్పుమా వానిని జెఱతు శిక్షింతు । నొప్పింతు." ననినఁ గన్నులనవ్వి యబల:
"మఱి యెవ్వరున్నారు మమ్ము మన్నింప? । నెఱిఁగింతు వినుము నీవెఱుఁగు కార్యంబె;
[12]పరికింప నీవు నొప్పరికించి నన్ను । సురకుఁ [13]బుచ్చితిగాదె సూతునింటికిని!
పుచ్చినఁ జని కల్లు పోయింపుమనిన । నచ్చలంబున వాఁడు నవినీతి [14]దలఁచి
పట్టవచ్చిన నేను [15]బట్టునఁ బాఱి । నెట్టనఁ గొలువులోనికిఁ [16]జేరుటయును,
వెనుకొని పఱతెంచి వెఱవేది వాఁడు । నను గూలఁద్రోచె మానవనాథు నెదు[17]ర;
తరుణి, యేఁబుట్టి యింతటిదాననైతి । నిరవొప్ప [18]నిట్టిపాటెఱుఁగ నెన్నఁడును."

---

1. ల. 2. ఁబనికి – వచ్చిన సతినింక వడిఁ గోపగింతు – నెఱిఁగెఱిఁగి తానెంత యేమిచేసినది (నెఱిఁగెఱింగియు నాకు నింతి చేసినది) – వెఱచునే. 3. వెఱవదు నాకింక వెసనేమి నేను – దఱుమదు. 4. యధినాథు. 5. కంపించి. 6. నీనుదుటిపైఁ గస్తూరి చెదరె. 7. నిండె. 8. వెసఁ జూడ్కి– నిలుప – నొలికెడు నేమమ్మ యోసరోజాక్షి! 9. వెల్లనెల. 10. పొలఁతి యెంతయుఁ దూలపోయి యున్నదియు. 11. దెస నెగ్గుగావించెఁ – జెప్పుమ వాని నే శిక్షింతుననిన – మఱి యెవ్వరున్నారు. 12. పరికించి నన్ను నేపని కంపితీవు – 13. బంపితి. 14. తోఁడ. 15. బట్టక. 16. వచ్చుటయును. 17. ట. 18. నెన్నఁడు నిట్టిది యెఱుఁగ – నాకు సిద్ధించును నలినాయతాక్షి – నీకు నిటువలెఁ జేయ నీతియే చెపుమ – అనవుడు.

అనవుడు [1]వెరవుతో సబల నూరాడ్పఁ । దసరఁ గేకయరాజతనయ యిట్లనియె :
"వగవకు వానిగర్వములెల్ల [2]మాన్చి । తగ[3]వుతో శిక్షింతుఁ [4]దమ్ముఁడంచనక ;
భూమీశుమాట వమ్ముగఁ బుచ్చఁగాని । నామాట [5]నాతఁ డెన్నఁడు దాఁటవెఱచు."
[6]అను కేకయాత్మజ కనియె ద్రౌపదియు : । "అనుజుపై [7]నీవింత యలుగనేమిటికి ?
ఊఱుమని పిడుగులై యువిద, నామగలు । చఱపనున్నారు కీచకు పీచమణఁచి ;
అప్పు డీవనికి లోనైనవారెల్లఁ । [8]దప్పుచేసితిమని తారె పొక్కెదరు."
అనిన మర్మమునాటి యబ్బోఁటి తలఁకి । తసర ద్రౌపదిఁ బెద్దతడవు ప్రార్థిం[9]ప
[10]నాదటఁ దన ఖేదమప్పటి కణఁచి । పోదయ్యె మజ్జన భోజ[11]నాదులకు.
[12]ఆ వేళ సఖులెల్ల నా సింహబలుని । చావు నిక్కముచేసి చాలఁ జింతింప
లీలతోఁ దమ పవ్వళించు తావులకుఁ । దూలుచుఁ [13]జనిరంత ద్రుపదపుత్రికయుఁ
జనుదెంచి మైఁదీఁగ సజ్జపైఁ జేర్చి । కనుఁగవఁ గన్నీటి కణములు దొరఁగఁ
బగతురచేతఁ దాఁ బడిన పాటెల్ల । [14]నెగఁబోసి దిగఁబోసి యిట్టట్టు వడుచు
'బలవంతుఁడగు సింహబలుని మర్దింపఁ । గలఁడు భీముఁడు నాకుఁ గలఁక యే' లనుచు
నినుఁ డస్తమించి పోయిన [15]నడురేయి । మనుజులందఱు మాటుమణఁగి [16]యుండఁగను
మగువ దిగ్గనలేచి మజ్జనంబాడి । పొగడ [17]నొప్పిన పట్టుపుట్టంబు గట్టి
చెక్కుల మెఱు[18]పులఁ జెదరి చీకట్లు । ప్రక్కలై పాఱ నావాసంబు వెడలి
నడు మసియాడంగ [19]నడతెంచె నపుడు । వడముడి నిద్రించు వంటయింటికిని.

## ద్రౌపది తన పరాభవమును భీమునితోఁ జెప్పుకొని దురపిల్లుట

అప్పుడు సుఖనిద్ర ననిల[20]సంభవుఁడు । తెప్పలు వెసమోడ్చి ఱిచ్చవడ్డట్లు
తోలుకారు మెఱుఁగుల తునకలో యనఁగఁ । గలికి యూర్పుల దీపకళికలల్లాడఁ
గల కౌరవులనెల్ల [21]గదపాలు సేయఁ । గలగని చిఱునవ్వుగల మోము వెలయ,

---

1. వెఱపుతో. 2. నిపుడు. 3. పని. 4. తమ్ముఁ డట్లనక ; తమ్ముఁడెంతైన. 5. కెన్న నెన్నఁడు. 6. అనిన సుదేష్ణతో ననియెఁ బాంచాలి. 7. నీవిట్టు లలుగంగ నేల. 8. దప్ప. 9. చి. 10. యాదరించిన మతి యలిగి ద్రౌపదియు. 11. నంబులకు. 12. ఆలోన సఖులెల్ల నాసింహబలుని – కాలకర్మంబులగతి గూడె ననుచుఁ – జావు నిక్కముసేసి చాలఁ జింతించి – పోవనీయదు విధిపొందెఁ దనకను చు–లీలతో. 13. జనుదెంచె...నందనయు. 14. నొగిఁ దలపోయుచు నుగ్మలివగచి. 15. మధ్యరాత్రి. 16. న వేళ. 17. నొప్పగు. 18. గుచేఁ జెదరి. 19. నడచి యేతెంచె. 20. నందనుఁడు. 21. ఁగడ.

నట్టిమురిఁ దాఁగొన్న యన్నంపురాసు । [1]లఱుగఁ బ్రేవులు కుక్షి [2]నలబలనేయఁ
గుడిప్రక్కమీఁదుగాఁ గొమ[3]రారియున్నఁ । బడఁతియొయ్యన[4]జేరి పతిఁజూచి పగచి :
"అక్కట [5]యీనుస నా కీచకుండు । తక్కక నాకు నంతటి తప్పుచేసి
మిసిమింతుఁడునుగాక మేటియై[6]పోయి । కుశలత నిద్రింపఁ గుంతీతనూజ!
కంటికి నిదుర యెక్కడఁ గల్గె నీకు? । వంటల డస్సితో? వానిఁ గాచితివో
మీయన్న వలదన్న మిగులంగలేక? । వాయుజ, నేనొల్ల వట్టిప్రాణములు."
అని పాణితలమున నతని పెన్వోడలు । వనజాక్షి చఱచిన వైళంబ లేచి
'నీ వెవ్వ?' రనుటయు నెలఁత 'నే' ననిన । భావంబులోన ద్రౌపది [7]యాట యెఱిఁగి
'కీచకుఁ జంపింపఁ గినిసి యేతెంచె । నీ చంద్రముఖి తానె యెఱిఁగించుఁ గాక'
యని తా నెఱుంగనియట్లు వాయుజుఁడు । వనితఁ దప్పకచూచి వలనొప్పఁ బలికె:
"నడురేయి నీరీతి నడయాడఁ దగునె? । [8]పడఁతి, యెవ్వరి కంటఁబడక వచ్చితివె?
ఏటికిఁ జనుదెంచి తెఱిఁగింపు." మనిన । బోఁటి యొయ్యనఁబల్కెఁ బురుషు నీక్షించి :
"ముంజేతి కంకణంబున కద్దమేల? । [9]కంజాక్ష, నాయున్నగతి గానరాదె (?)
ఎఱిఁగియు నెఱుఁగవే యెఱిఁగింపనేల? । మఱచిన విను నీకు మఱియుఁ జెప్పెదను;
జననాథు మఱఁది కీచకుఁ డప్పకడకు । వినతుఁడై పోవచ్చి వెస నన్నుజూచి
వలరాజువలఁ జిక్కి వరుస నాయెదురఁ । బెలుచ[10]మాటలు ప్రేలి ప్రియములు పలికి
తగదని యెన్నిచందములఁ జెప్పినను । మగుడనేరకయున్న మగుడ నిట్లంటి :
"గంధర్వులేవురు గలరు నామగలు । సంధించి నినుబట్టి చంపనోపుదురు;
వైరంబు కొఱగాదు వలదు పో." మ్మనిన । నీఱతాఱలు గొన్ని యెన్ని వాఁడపుడు
పోయెఁ; బోయిన నంత భూనాథుదేవి । [11]డాయంగ ననుఁబిల్చి [12]డప్పి భావించి
తమ్ముని యింటికి మద్యంబు [13]దెమ్మనుచుఁ । బొమ్మని నను బెద్దప్రొద్దు ప్రార్థింప[14]
నేమియు ననవేర కేనును బోయి । భామకు మద్య మప్పాపాత్ము నడుగ
వినక వాఁడును గొన్ని వెడమాటలాడి । ననుబట్ట వచ్చె నన్యాయంబు దలఁచి.
చేయూఁక యేనును శీఘ్రంబె పాఱి । మీయున్నసభఁ జేర మొఱసి కీచకుఁడు

1. లఱిగి. 2. నధికమై ప్రేయ. 3. రొప్ప. 4. బోయి. 5. యిసుమమీఁదై. 6. పోయె – నిసుమంతయును గిన్క నెదఁ గాంచవీవు. 7. యెలుంగెఱిఁగి. 8. మడఁతి, యెవ్వఁడు గన్న మాట పట్టోను; మడఁతి, యాడిక మాటపట్టు నెవ్వరిది. 9. కంజాత నేనున్న (?). 10. దుర్నీతిమైఁ బ్రేలఁగా నేను. 11. డా. 12. తప్ప వాటించి. 13. దెచ్చుటకు. 14. పోవక యేఁ గొంత పొద్దుపుచ్చినను.

కామాంధుఁడై తీవ్రగతిఁ [1]జేరవచ్చి । యేమేమిచేసెనో యెఱుఁగ[2]వా నీవు?
నీవేమి చేయుదు నీకోపవహ్ని । కావేళ యమసూతి యడ్డంబువచ్చె;
సభలోన మున్ను దుశ్శాసనుం[3]డర్థి । సభయుఁడై కావించె [4]సంతేసిపనులు;
మును జయద్రథుఁ డట్లు మొగి నరణ్యమున । ననుచితంబొనరించె నది చెల్లిపోయె;
నేఁడు కీచకుఁ డింత నికృతిగావించె । నాఁడును నేఁడు నున్నారు మీవాళ్ల;
ఎన్నఁడు మీలావు [5]నెఱిఁగింపనగునో? । యెన్నఁడు రిపుకోటి నేపణంచుటలో?
[6]ఆటది మొఱవెట్ట నకట నెవ్వారు । నేటికి యనివిందు రెచ్చోటనైన:
పగతుఁడు కొలువులోపల నన్ను దన్నఁ । దగునె [7]మిన్నకయుండ ధర్మసూనునకు?"
అనినఁ బాంచాలి కిట్లనియె వాయుజుఁడు: । "వనిత, ధర్మజు దూఱపల[8]దింక నీకు;
నావేళ [9]ననుజూచి యతఁ డూరకున్న । భూవల్లభుని [10]వానిఁ బొరఁగొందు [11]నేను;
పొరిగొన్న లోకులప్పుడు నన్ను నెఱిఁగి । వరుస వాయుజుఁడని [12]వాక్రుచ్చిరేని
నలినాక్షి, మనకుఁ [13]గానలభూములందు । వెలయఁ దొల్లిటియట్ల విహరింప[14]వలయు;
కావునఁ గోపింపఁ [15]గాదు ధర్మజుని; । భావింప [16]నాసింహబలుఁడు నాకెంత?
వలనొప్ప నజ్ఞాతవాస వత్సర[17]ము । తలపోయ [18]వలెఁగాని తమకింపరాదు."
అనిన [19]నట్టిదకాక యని భీమసేనుఁ । గనుఁగొని మఱియు నాకాంత యిట్లనియె:
"ఏమిచెప్పుదు [20]భీమ, యీ దేవియింట । నేమంబుతో నేను [21]నెఱవేర్చు పనులు;
నలుఁగు నూఱియుఁ జందనంబు దాచియును । గలయ [22]నాచేతులు కాయలుగాచె;
కుంతిదేవికి మీకుఁ గొంతేసిగాని । యెంతయు వెఱతు నే నీసుదేష్ణకును;
వెఱచిన వెఱపెల్ల వీటఁబోవంగ । నఱక తమ్ముని ఘాత కొప్పించె నన్ను;
[23]ఆ పగప్రువఁజేసి యప్పుడు ధర్మజునిఁ । బోవంగ నాడితిఁ బయలోట దక్కి.
పరహిత పరదయాపరుఁడు ధర్మజుఁడు; । పరిచిత నీతి తత్పరుఁడు ధర్మజుఁడు;

---

1. గూడ. 2. రామీరు. 3. ంత. 4. నంతటి; నన్నేసి. 5. లెన్నఁడు నేర్పు – లెన్నఁడు నృప కోటి నేపణంచెదరు. 6. వెలఁదులు మొఱపెట్టఁ బెఱవారలేని– తలపోయరే ప్రోవ ధర్మంబు దలఁచి. 7. యీక్రియనుండ. 8. దు నీవింత. 9. నినుజూచి యత. 10. వారి. 11. నపుడు. 12. వాక్రుత్తురేని. 13. గానలకుఁ బోఁబడును. 14. నిపుడు. 15. గారాదు గాన. 16. మఱి. 17. మ. 18. ఁదగుఁ గాక. 19. నంత్రియ. 20. నీవు నీ. 21. నిర్మించు. 22. ఁజేతులనెల్ల.

23. అంతయు నతివపై యపుడు ధర్మజుని । భ్రాంతిమై దూఱియు బలికితిఁగాన;
ఇట్టి ధర్మజు మాఱు నెవ్వరి వశము । పుట్టినివారి కెప్పుడు మి?(శ)త్రుఁ డతఁడు.

[1]శరణాగతత్రాణ చణుఁడు ధర్మజుఁడు ; । పరరాజ విదళనపరుఁడు ధర్మజుఁడు ;
భావింప సద్ధర్మపరుఁడు ధర్మజుఁడు ; । కేవల మానవాకృతుఁడు ధర్మజుఁడు.
ఇట్టి ధర్మజుదూఱ నెవ్వరివశము? । పుట్టని శత్రులెప్పుడుఁ గల్గునతఁడు.
విరటునిఁ దాఁగొల్చి విహరించు[2]నపుడు । పురపురఁబొక్కి [3]యెప్పుడుఁ గన్నమూయ ;
మఱియును నీచేయు మహితసత్త్వములు । మెఱసి [4]యెన్నెదమన్న మితి మేరలేదు ;
అట్టి నీవును [5]గట్టియలు పట్టి నిలువ । నెట్టన మనసులో [6]నెగులొందు నాకు ;
మదగజ శార్దూల మహి[7]షసింహములఁ । బదిలమై [8]గరిడిలోపల నీవు [9]చెనక
నన్నును బిలిపించి నరనాథుదేవి । నిన్నుఁజూపిన నాకు నిగ్రహంబణఁగు ;
నలినాక్షు లప్పుడు నా[10]వికారంబు । తెలియంగఁ జూచి [11]సందియముఁ బొందుదురు ;
కావున మనల నక్కడకు నక్కడకు । భావించి చూతురు ప్రజలు [12]దప్పకయ ;
మన యర్జునునిఁ జూడు మహినింతవానిఁ । [13]గనుపెట్టి దైవంబు గాసి[14]పెట్టెడిని ;
సృష్టిలోపల నుర్వశీ[15]మోహమునకు । దృష్టితాకినయట్లు [16]తేజంబుమాసె ;
తనుజూచి లజ్జింతుఁ [17]దగవొప్ప మున్ను । ననుజూడ నిప్పుడు నరుఁడు లజ్జించు ;
ప్రతివీరులకు బాహుబల మొప్పఁ జూపు । నతఁడు నాట్యముఁజూపు నతివల కిపుడు ;
అదియునుగాక పాయక నాకు నకులు । మదిలోనఁ [18]దలఁప నుమ్మలికంబు పుట్టు ;
అశ్వినీదేవతలందు జన్మించి । యశ్వశిక్షకుఁడయ్యె [19]నన్యులఁ గొలిచి ;
ఘనుఁడు మాద్రీదేవి గారాబుకొడుకు । తనకు నొండొకరాజుఁ దగఁ గొల్వవలసె ;
ఈచోట నీరీతి నింతవాఁ డున్నఁ । జూచినవారెల్లఁ జోద్యమందెదరు ;
సహదేవుఁడును ధర్మసహకారి సువ్వె । సహజ తేజోరాశి సహితుఁ డిమ్మహిని ;
గొంతి యీతనిఁ గూడుకొని వచ్చు పనికి । నెంతయుఁ జెప్పె నాకిట వచ్చునపుడు ;
నా నేర్చునంతఁ గానన[20]భూమి నితనిఁ । బూని [21]కూడుకవత్తు భోజనాదులకు ;

---

1. శరణాగతాభిరక్షకుఁడు ధర్మజుఁడు । చిరయశశ్చంద్రికాంచితుఁడు ధర్మజుఁడు
   ఇట్టి ధర్మజు దూఱ నెవ్వరివశము । పుట్టనివారి కెప్పుడు శత్రుఁడతఁడు ; ,
విరటునిఁ దాఁగొల్చి. 2. పనికి. 3. యప్పుడు శాంతిపొందు. 4. యెన్నితినైన మితి మేర లేదు.
5. గట్టియల్ నిలువఁజూచి. 6. నెగులుచుండుదును. 7. త. 8. నగరి. 9. పెనఁగ.
10. విచారములు. 11. సందేహమొందుదురు. 12. అందఱును. 13. కనువేది(?). 14. పెట్టినది.
15. మోహమునకును. 16. దేహంబు. 17. దగవుతో నేను – ననుజూచి తానును నగుచు లజ్జించు.
18. దలఁచియు మలినంబుపుట్టు. 19. నదికొంత పొసఁగు. 20. భూములందు. 21. తోడ్కొని.

పసుల[1]వెంబడిఁ జొచ్చి [2]పరులకై నేఁడు । కసుగందియున్నాఁడు కథలేల యింక."
అని తన [3]వగపెల్ల ననిలసూనునకు । వినిపించి యెలుఁగెత్తి [4]వెలఁది యేడ్చుటయు,
తనకు[5]ను వగవుట్టి ధైర్యంబుఁ బట్టి । ఘనుఁడు భీముఁడు కాంత కన్నీరు దుడిచి :

## భీముఁడు తగిన మాటలు చెప్పి ద్రౌపది నూరార్చుట

"శోకింపనేటికి సుఖము దుఃఖంబు । లోకులఁ బ్రాపించు లోలాక్షి, వినుము ;
అర్కున కుదయంబు నస్త[6]మయంబుఁ । దర్కింపఁగలిగె సందక్షిఁ జెప్పనేల ?
రమణి, హరిశ్చంద్ర రామచంద్రులకుఁ । గ్రమముతో నలునకుఁ [7]గలిగె నీపాటు ;
ఘనకీర్తిలక్ష్ములు గన్నారు వారు । [8]మనకు నట్టులకాదె మదిరాయతాక్షి !
ఒగిఁ గర్ణ శకుని దుర్యోధనాదులకుఁ । దగిన మృత్యువు వచ్చుదాఁక [9]నిద్రింప ;
నుడుగక వారి కాయువు నిండినట్లు । వడి [10]నిండ నజ్ఞాతవాస వత్సరము
కడమగా నొక కొంతకాలంబు గలదు ; । తడయక కీచకాధముఁ జంపవలయు.
పడఁతి, నిన్నిటుచేసి [11]ప్రాణంబుతోడఁ । గడచి నెల్లియుఁ జేరఁగలవాఁడు వాఁడు ;
చేరిన నోడఁబాటు చేసిన ట్లీవు । నేరుపు వాటించి నెమ్మి నిట్లనుము :
"సంకేతమగు నాట్యశాల యిద్దఱికి ; । శంకక యటకు రాఁగూడున రాత్రి ?
వచ్చిన నొంటి రావలయుఁ బో." మ్మనిన । వచ్చు వాఁడును జంపవచ్చు నచ్చపలు ;
సుదతి, యప్పుడు ధర్మసుతుఁ డడ్డపడినఁ । బదిలమై నీవడ్డపడిన నే విడువ ;
అటుగాక మనకార్య మనువుకు రాదు ; । కుటిలకుంతల, యింకఁ గుందంగవలదు ;
తెల్లవాఱఁగవచ్చె ధృతినింక మసల । నెల్లవారును జూతు రిట నుండవలదు ;
పొమ్ము నీ." వని వాయుపుత్రుండు లేచి । యమ్మార్గఁ గొంతదవ్వనిచి వచ్చుటయు,
శయ్యకుఁ జనుదెంచి జలజాయతాక్షి । యొయ్యన గనుమోడ్చి యుండె. నంతటను
జీఁకటిముసుఁగు [12]పుచ్చిన భూమిసతికి । వేఁకఫుఁ జన్నులై వెలుఁగొందె గిరులు.

---

1. మేఁతకు. 2. పసుల. 3. పసులెల్ల. 4. వెస నేడ్చుటయును. 5. దుఃఖము. 6. మానంబు.
7. గలుగదే. 8. మనము నట్టులకామె. 9. సైరింపు-ముడుగక. 10. నిండె.
11. పసిముట్ట కేఁగెఁ । గడఁగి యెల్లియును రాఁగలవాఁడు వాఁడు ;
వచ్చిన నొడఁబడ్డ వైఖరినీవు । నచ్చుగా నొంటిమై నర్ధరాత్రమున
నాటకశాల కున్నతి వచ్చితేని । వాటమై యేనును వచ్చెద నటకు ;
అనిపల్కు నాతోడ నన్నియుఁ దెల్పి । వినిపింపు నే వాని వెస మడియింతు ; పొమ్ము నీవని వాయు
పుత్రుండు. 12. విచ్చిన భూతలంబు - వీఁకమై నలరారె వెలుఁగొందె దిక్కు - లందు.

అందుఁ గుంకుమగంధ మలఁది [1]నట్లయ్యె । నందఱుఁ జూడంగ [2]నరుణోదయంబు;
తామర [3]మొగడలు తలలెత్తి నవ్వ । మోములు విన్ననై మొగిఁ గల్వ లోదిగె.
అంత సూర్యోదయంబయ్యెఁ దూర్పునను । సంతసంబున సర్వజనులు మ్రొక్కంగ
హరిహర చతురాస్యు లైక్యమై యుండు । పరమతేజము గానఁబడె స్పష్టి గనఁగ,
బడబాగ్ని ముఖమునఁ బడుటకై వెఱచి । జడధి వెళ్ళాడు రత్నసంఘమో యనఁగ,
అనమున వేదత్రయంబను శాఖఁ । బనసారఁ బండిన పండొకో యనఁగ.

## కీచకుఁడు మరల ద్రౌపదియొద్ద కేఁగి విలాసచేష్ట లొనర్చుట

ఇనుఁడిట్లు పొడిచిన నెలమిఁ గీచకుఁడు । తన యనుష్ఠాన మెంతయు వేగ నడపి,
తలఁపులోఁ బాంచాల తనయ రూపంబు । నెలకొని కోర్కులు నిండి దైవాఱఁ,
దెఱఁగొప్పఁ గస్తూరి తిలకంబు దీర్చి, । మెఱసిన జవ్వాది మెయినిండ నలఁది,
చిగురు వన్నియనొప్పు చీనాంబరంబు । తగురీతిఁ గట్టి రత్నపు సొమ్ము దొడిగి,
కొలఁది చెంగలువలు గురువిందవిరులు । మలఁచిన మాళిపై మకుటంబు వెట్టి,

1. నట్లగుచు. 2. నరుణుండు పొడిచె. 3. మొగడలఁ దగిలి తుమ్మెదలు – వేమఱు నొకపొద్దు వికసింప వడలె.

4. పోయిన చీఁకటి పోయినట్లయ్యె । వేయి భంగుల నంత విహరించె గిరుల.
పొరిఁ బొరిఁ దారకంబులు పోవునపుడు । విరులు రాల్చిన సెజ్జ విధమయ్యె మిన్ను.
సొరిది వేఁకువగాలి సోరణగండ్లఁ । జరియించి విట విటీజనులపై నొలసె.
చెమట చిత్తడిఁ దోఁగు చిత్తజాంకముల । నెమకిన వారెల్ల నిద్ర మేల్కాంచి
చొక్కపు రతికేళిఁ జొక్కి భీతిల్లి । దిక్కులు చూతురు తెలుపయ్యె ననుచు.
కడివోయి రాల్చిన కమ్మ పూవిరులు । విడువక నిండఁ బర్విసతీఁగ యట్ల
శంబరాంతకు బాణజాలలో యనఁగ । డంబరంబగుచుఁ జూడఁగ నొప్పె నపుడు.
ముని మాపు కలువల మొగిఁ దేనె గ్రోలి । మనసార నిద్రించి మత్తభృంగములు
వేఁకువ నవి మోష్వవెసఁగ మేల్కాంచి । యాఁకొని తమకించి యాశించె వెడల.
చక్కఁ జెక్కులు తార్చి చక్రవాకములు । ఇక్కులు వాసి పెల్లే తెంచి కూడి
చంచుల దిగిచి కాసారంబులందుఁ । దుంచిన తామరతూడు లొప్పారె.
మరకత పాత్రలో మక్తికాక్షతలు । సరసి జాతాంకు పూజకు వచ్చెననఁగ
నళుత పుప్పొడి నెట్టనై మంచుబొట్లు । నలినపత్రములతో (లో) నలినొప్పెఁ జూడ.

దివ్యమై యొప్పు [1]ముత్తియపు హారములు । సవ్యాపసవ్య పార్శ్వములపై [2]వైచి,
పడఁతుక చేయూఁది భవనంబు వెడలి । కనుమంచి రథమెక్కి కలిమి [3]యేర్పడఁగ
“సైరంధ్రి నెలయింతుఁ జలమున సాధింతు । మరుని మెప్పింతు[4]ను మహీమహేశో” యనుచుఁ
దరమిడి తన సహోదరి యింటికరిగి । సారెసెఁ గాల్నడఁ ద్రోడఁ జొచ్చి [5]యచ్చటను
దనతోడిమాటకై ద్రౌపదీదేవి । యొనరంగ నేకాంతమున్న నీక్షించి
[6]దర్పకు దర్పముల్ దలఁచి బిట్టులికి । సర్పంబు గఱచిన చందమై వాఁడు
తన కోలందులు గాక ధైర్యంబు [7]నెడలి । మునుకొన్న సిగ్గులో మునిఁగి [8]యోలాడి
మెలఁగు దీమముఁ జేరు మృగముచందమున । జలజాక్షి డగ్గఱఁ జని సింహబలుఁడు
తన వచ్చురాకకు ద్రౌపదీదేవి । కనియుఁ గానని రీతిగై కొన్న నెఱిఁగి
[9]పలుకు నూఱకయైనఁ బన లేనిపలుకు; । తలకొని ధరణిపైఁ దాటించుఁ గాలు;
నోడలెల్ల విఱుగంగ నుంకించి నవ్వుఁ; । వడిఁబెచ్చి కంబంబు వాయించుఁ గేల;
వెడఁ బాటపాడు; నవ్వేలఁది కట్టెదురఁ । బాడసూపు; [10]సతి చూపు పొడగాన కులుకు.
దొరకొని వాఁడిట్లు దుర్విలాసములు । [11]కరమర్థిఁ జూపి యక్కాంత కిట్లనియె :
“నెలఁత, భాగ్యముగాదె నీ పాదయుగముఁ । గొలిచియుండుట నాకుఁ గొమరు దీపింప;
ఇదియేమి సైరంధ్రి, యే నింత నిన్నుఁ । గదిసి ప్రార్థించినఁ గైకొన విపుడు !
వనజాక్షి, నన్ను నెవ్వనిఁగాఁ దలంతు ? । వినుఁడును బోనోడు నే నిల్వుమనిన ;
విరటుని నేఁదెచ్చి విభునిఁగాఁ జేసి । చిరకాలమును గూడఁ జీర[12]యుఁబెట్టి
యేలింప నేలుచు నెలమి నున్నాఁడు; । పోలింప నా లావు భువియెల్ల నెఱుఁగు;
ధనముఁ బ్రాణమ్మును దరుణి, నీ సొమ్ము; । నను [13]వెట్టి గొనరాదె నా వేడ్కఁ జేసి ?
పనిగొని నిన్నేను బలిమిఁ బట్టినను । వనజాక్షి, నా [14]వేలు నంప రెవ్వరును ;
అంత చేసితి నిన్ను నాస్థానభూమి । [15]నింతి, యెవ్వరికైన నేమన [16]వచ్చె ?
ఎక్కడి గంధర్వు ? లెక్కడి మగలు ? । నిక్క[17]మే కలిగిన నిన్న రావలదె ?
చపలాక్షి, యిటమీఁద సైరింప.” యనిన । ద్రుపదనందన యొఱ్ఱు తోడవుగా నిల్చి

1. రత్నపుహారములును. 2. నునిచి. 3. దీపింప. 4. నిమ్మహి మింతు. 5. పోనచట. 6. నేర్పార నిదిమంచి నెలవాయె ననుచు. 7. వదలి. 8. యేలాడి. 9. పలుక నేరకయున్నఁ బనిలేని మాట. 10. పొలఁతికి. 11. నెరయంగఁ జేసి యా నెలఁత కిట్లనియె. 12. బెట్టుదును – ధనముఁ బ్రాణము మానధనము నీ సొమ్ము. 13. జట్టి. 14. శేలు. 15. నింత నెవ్వరికైన. 16. వచ్చు. 17. మై.

'పన్నుగా నే మాయఁ బన్నకయున్న । మున్నాడు నే కార్య[1]మునుగా' దటంచు
నెయ్యంబు దోఁప సన్నిచు మాటలకు । నియ్యకొన్నదిపోలె నించుక నవ్వి

## ద్రౌపది కీచకుని భీమసేనుఁడు పన్నినమాయకు వశునిఁ జేయుట

వానితో నిట్లను : "వలనైన బుద్ధు । లే నెన్ని చెప్పిన హితవుగా వినవు ;
కీతెఱుంగవు వేగిరించెదు గాని । నీ తలంచిన యట్లు నేఁ జేయఁ గలను ;
[2]తగులున మగవాఁడు తమకించు నవుడు । మగువకుఁ దన పెంపు మానంగ రాదు ;
కావునఁ బ్రకటంబు గాని [3]మార్గంబు । భావింపవలయు [4]నేర్పడ నిట్టి పనుల."
[5]కనుటయు నా మాట కా సింహబలుఁడు । మనసులో నుప్పొంగి మఱియు నిట్లనియె

1. ముఖము గాదనుచు. 2. తగవేది. 3. మార్గమున. 4. నెప్పటియట్ల పనులు.

5 a. అనవుడు మదిలోన నాతఁ డుప్పొంగి । వనిత నీవేత్రోవఁ బరికింపు మేను
నీ మాట జవదాట నెఱినమ్ము మీవు । నేమంబుపై నిన్ను నేఁ గొల్తు నెపుడు.
మానిని విను నన్ను మఱువ లేవనుచు । నాన యీవలెనన్న నల్లన నగుచు
నా నీచుపైఁ గోప మాత్మలో నణఁచి । వానితో మఱియు నవ్వామాక్షి పలికె :
"ఆన యేటికి నిప్పుడయ్యెడు పనికి । నేనేల మఱచెద నీ వింకఁ బొమ్ము ;"
అనవుడు కీచకుం డాత్మఁ దానలరి : । 'వనజాక్షి, నను బ్రోవవలయు నీ' వనియె.
అనిన నామోదంబు నందిన ట్లతివ । 'చనదు నీకును నాకు సల్లాప మిచట
నడురేయిఁ జేరుము నాట్యాలయంబుఁ । గడువేడ్క నేనందుఁ గాచియుండెదను ;
అది చూడ నాకు రహస్యస్థలంబు । కదియ రెవ్వరు దానిఁ గటికి చీఁకటిని.
అనుమాన మేటి కే నందు వచ్చెదను । చనుము నీ యింటికి జవమొప్ప' ననిన,
నా నాతిమాటల కాత్మలో నలరి । 'యే నొక్కఁడన వత్తు నీ రాత్రి నటకు'
అని యాతఁడనఁ గాంత 'యది నీవు మఱవఁ । జనదు నీ వొంటిపైఁ జనుదేఱవలయు.
అటు గానియెడ నమ్మమట నిల్వలేను । దటుకున వేఁబోవుదాన నా త్రోవ'
అన నెంతయును బొంగి యా నీచుఁ డొప్పి । చనియె నింటికి నాత్మ సంచలింపఁగను ;
చతురతఁ గార్యంబు సవరించి యిట్లు । సతి తన పనులెల్ల జరుపంగ నరిగె.
అట్టిద కాదె కామాంధుఁ డే పనుల — (ముద్రిత ప్రతి)

5 b. అనవుడు విని వాఁడు నట్ల చేసెదను । అని పోవసుంకించి యతివ తోడుతను
'మానిని, విను మమ్మ మఱవ లేదనుచు । నాన యీవలె' నన్న నల్లన నగుచు
వానితో మఱియు నవ్వామాక్షి పలికె । 'ఆన యేటికి నిప్పుడయ్యెడు పనికి ?
నేనేల మఱచెద నిట తంట వచ్చు (?) । పూనికె మఱువక పొడచూపు చాలు ;

"పూఁపుచెప్పక మున్నె పొలఁతి, యిందాఁక । నేఁపితి వంటు నీకేమికూడినది?
నీవేమిచెప్పిన నెలఁత, నీమాట । కావఁగంజాలయు నడ్డంబు దాఁట;
ఏవేళ కెచ్చోట కేల్లు రావలయు । వేవేగ నెఱిఁగింపు వెలఁది, నా." కనినఁ
దనయంత్రమున వాఁడు దగిలెఁ బొమ్మనుచు । వనిత సంతోషించి వాని కిట్లనియె :
"ఉత్తర లోనుగా నుపిద లందఱును । నృత్తంబు పగలెల్ల నేర్చిపోవుటను
నరులు చేరరు రాత్రి నాటకశాల । పరఁగ నేకాంతమై భాసిల్లుచుండు.
అచ్చోటి కొంటిమై నర్ధరాత్రంబు । వచ్చినఁ దలకూర్పవచ్చు నీపనులు."
అనవుడు విని వాఁడు : "నట్ల చేసెదను । వనజాక్షి, నిజమె కావలయు నీపలుకు.
మానిని, విను నన్ను మఱువకు." మనిన । వానితో మఱియు నవ్వనజాక్షి పలికె:
"ఏనేల మఱచెద నిటువంటి పనులు? । పూని వే మఱువక పొడచూపు చాలు.
మనమింక నిచ్చట మసలుట గాదు । చనుము నీయింటికిఁ జనవొప్ప." ననిన
నా యింతిమాటల నాత్మలో నమ్మి । పోయె నెంతయు వాఁడు బుద్ధి పెంపేది.
అట్టిదకాదె కామాంధుఁ డేపనుల । [1]ముట్టినచో నెల్ల మోసపోకున్నె !
తనచేత నీరీతి దండింపఁబడియు । [2]మనసీప ద్రౌపది మరగునే తనకు !
వాఁ డట్లుపోయిన వడి నెల్లపనులు । పోఁడిగాఁ దీర్చి యప్పువ్వారుఁబోఁడి
వండెడు గృహములో వాయుసంభూతుఁ । డుండఁగా నచ్చోటి కొప్పారఁ బోయి
[3]తెలివి నెమ్మోమున దీప్తి చెన్నొందఁ । బలికె [4]నల్లననవ్వి బకవైరితోడ :
"వాయుజ, నేఁజేయ [5]వలయు కార్యంబు । లాయె నీవెఱుఁగుదు వటమీఁది పనులు;
ఘనమైన చీకటిగల రాత్రి నేఁడు । జనుల వంచించి కీచకుఁ జంపవచ్చు."
అనిన నించుక నవ్వి యతఁ డిట్టులనియె : । "వనిత, నీ వేమంటి? వాఁ డేమిపలికె?
చెప్పు మంతయు; వాని శిక్షించు పనులు । చెప్పనేటికి? [6]వాఁడు చిక్కినఁ జాలు."
అనవుడు పాంచాలి యా సింహబలుఁడు । జననాథు నగరికిఁ జనుదెంచు తెఱఁగుఁ,
జనుదెంచి తనుజూచి చపలుఁడై [7]యంతఁ । జనవు [8]బీరముఁ జూపి సంభ్రమించుటయు,

నను మాన మేటికి నా వేడ్క గనుము । చనుము నీ యింటికి జవమొప్ప' ననిన
నా యింతి మాటల కాత్మలో మెచ్చి । పోయె నింటికి వాఁడు బుద్ధి పెంపేది.
అట్టిద కాదె — (ఓరియంటల్ లైబ్రరీ ప్రతి)

1. పట్టినఁ బలుమాఱు పస మోసపోవు. 2. మనసీన. 3. తెలిసి నెమ్మోము. 4. తప్పక చూచి.
5. వలనైన కార్య — మాయె. 6. నాకు. 7. వాఁడు. 8. బింకము.

[1]వాని నుత్కటరీతి వరుస గాదనుచు । నానీచు వచనంబు లంగీకరించి
నెలకొన్న రాత్రి వానికి నాట్యశాల । యలరిన సంకేతమని చెప్పుటయును,
వాఁడంత నొంటి[2]మై నత్తుఁ గాకనుచుఁ । బోఁడిగాఁ జనుటయుఁ బొసఁగ నేర్పఱిచె.
అప్పుడు బకవైరి యంతరంగమున । నుప్పొంగి వేడ్కతో నువిద నీక్షించి :
"[3]కలకంఠి, వానినిఁ గడతేర్చు పనికిఁ । దలపూర్చి తెంతయుఁ; దనరంగ నేనుఁ
బరికించి వంచన బయలుగాకుండ । నరిజయం బొనరిం[4]తు నన్ను మెప్పింతు.
కలఁగక యొంటి రాఁగలఁడొకో వాఁడు? । పలుకుదోడుగఁ గొంత ప్రజఁ దేకరాఁడొ?
అంత చేయఁగనోడు; నబల! నీమాటఁ । జింతిం[5]చు; వాఁడు నిశ్చింతసాహసుఁడు;
వచ్చు[6]ను నిక్కంబు; వచ్చి నాచేతఁ । జచ్చు[7]ను నిక్కంబు సాధ్వి, కీచకుఁడు.
[8]ఏ వగనైన వాఁ డిటువచ్చి తనదు । భావంబునను గొంత పరికించి తొలఁగ
నప్పు డున్నది వాని కంత్యకాలంబు । చప్పుడుగాకుండఁ జంపివైచెదను.
అటుగాక వాఁడు [9]బాహాశక్తి మెఱసి । [10]కుటిలుఁడై ననుబట్టుకొనఁ జూచెనేని
జలధులు గలఁగ భూచక్రంబు వణఁక । గులగిరు లగల దిక్కులు వ్రయ్యఁ [11]గినిసి
యొగి సాళువము కాకి నొడియు చందమునఁ । [12]దెగి పోరి యేను వధింతుఁ గీచకుని."
అనుటయుఁ బాంచాలి యాత్మలో వెఱచి । యనిలసంభవుతోడ నలవొప్పఁ బలికె :
"ఇంత కోపించిన నెల్లమానవులు । వింతగాఁ జూతురు; [13]వెఱచు ధర్మజుఁడు;
చేసినకార్యంబుఁ [14]జెనఁటియైపోవు; ! చేసేత నపకీర్తి సిద్ధించు మనకు;
[15]నిరుచెవియును జెక్క నెఱుఁగరాకుండ । [16]పరబలుఁ గీచకుఁ బరిమార్పు."[17]మనిన,
అనిలజుఁ డిట్లను: "నతఁడును వచ్చి । తనలావు నాకు నుద్ధతిఁ జూపునపుడు
[18]పరఁగిన కిన్క మాన్పఁగ నేర్తునేని । హరిణాక్షి, [19]చూచెద నావేళకొలఁది."
అనిన సంతోషించి యతని దీవించి । పొనరఁ బాండవపత్ని పోయె నింటికిని.

---

1. నేనంత నాపల్క నిజబుద్ధి నెఱిఁగి. 2. గా. 3. ఎలనాగ నీకు నాయెడ నిట్టి ప్రియము । తలఁపని తలఁపు యుద్ధముఁ గూర్చి తిపుడు. 4. చి యన్న. 5. వ. 6, 7. ట. 8. నీవును ననుజేరి నిష్ఠూర మొప్ప । భావనలకుఁ గొంత పరికించి తొలఁగు । నప్పు డున్నది. 9. మహా. 10. పటుగతి నడరిన బ్రహ్మాండమద్రువ. 11. లగను. 12. తివిరి పోరాడి(?). 13. విభుఁడు కోపించి. 14. చెనసి. 15. ఇల. 16. బలవంతు. 17. మనఘ । యనిన ద్రౌపది కిట్టులనియె వాయుజుఁడు. 18. పరఁగఁ గీచకుని మాన్పఁగ నేర్తునని. 19. చూచెదు నాలావుకొలఁది.

## కీచకుఁడు ద్రౌపదిఁ గవియఁ దల్లడిలుట

అటఁ గీచకుఁడు మన్మథాగ్నిచేఁ [1]దూలి । ఘటికార్థమును బ్రొద్దు[2]గడపఁ జొప్పడక
యెలమావితోఁటలో నేకాంతసీమఁ । బొలుపైన కురువింద పొదరిల్లుచేరి
పన్నీరు చిలికించి పచ్చకప్పురము । [3]చెన్నార నెఱపిన చివురుఁ బాన్పునను
గలికి రాచిలుకలు గండుఁగోయిలలు । వెలయించు పలుకులు వినుచుఁ గూర్చుండి,
ద్రౌపదిరూపంబు ద్రౌపది [4] మెలుపు । ద్రౌపది గరువంబుఁ దలపోసికొనుచుఁ,
గలఁగుఁ దత్తఱపడుఁ గంపించు వగచు । విలపించుఁ దలయూఁచు [5]వెఱచు మైమఱచు.
విరహాగ్నిచే నిట్లు వెఱ్ఱియై వాఁడు । [6]తరమిడి తనలోనఁ దలపోయఁదొడఁగె :
"పడఁతుక నామాట పాలించునొక్కొ? । [7]కడఁగి వచ్చియు నన్ను గామించునొక్కొ?
రాకకు విఘ్నంబు రాకుండునొక్కొ? । భూకాంతు దేవి తాఁ బొమ్మనునొక్కొ?
[8]కాంతకు నేవురు గంధర్వులనుచుఁ । బంతమాడినమాట పరమార్థమొక్కొ?
తియ్యవిల్లును దాను దెరువుతోడగుచుఁ । దొయ్యలి వలరాజుఁ దోడ్తెచ్చునొక్కొ?
[9]అప్పటి కెదురాడ నలికి యారీతిఁ । దప్పించుకొనిపోయి తరళాక్షి యిటకు
నొంటిమై రాకున్న నొగి [10]లేవనడఁచి । కుంటుచూపినయట్లు ఘోరంబుగాదె?
అది యెట్లు రాకుండు నాసపుట్టించి । యెదిరిని దన్నుఁ దా నెఱుఁగదే మొదల?
[11]ఎఱుఁగకయున్న నేనేల పోవిడుతు? । వెఱవున సతిఁగూడి విహరింతుఁగాక."
అని తనకోర్కులుయ్యాలలూఁగఁగను । మనసిజునకు లోఁగి మఱియుఁ గీచకుఁడు
మృగనేత్ర తనయొద్ద మెలఁగినట్లనఁ । [12]దగిలి పట్టఁగఁ బోవుఁ దానె లజ్జించు;

---

1. గుంది. 2. గడపంగలేక. 3. లెన్నికఁ జల్లించి (రాజిల్లి) యెలమిఁ బుట్టంగ (ట్టించి). 4. నేర్పు.
5. వెఱచి. 6. తరలాక్షి మాటను. 7. కడకు నీడకు వచ్చి.
8. ఏకాంతముననుండి యెలనాగ వేడ్క । నాకుఁ బ్రీతియెలర్ప నాతోడ నపుడు
పంతమాడినమాట పరమార్థమొక్కొ । సంతసంబున రాక సాధించునొక్కొ
తియ్యవిల్లును ... ... ... ... ... ... ...
9. అప్పటి కెదురుతాఁకైన నాగాలి । తప్పించుకొనఁజూచెఁ దరళాక్షి బొంకి ; యొంటిమై.
10. లెమ్మటంచు. 11. అరిమురి సంకేత మట్లేల చెప్పు.
12. నగపడి సరసంబులాడినట్లైన । (సురతంబునకుఁ గేలు చూపినట్లైన
మరుతంత్రమున మేను మఱచినట్లైన) । బయలు కౌఁగిటఁజేర్చి భావించి వగచు
జయశాలి మారుండు చాల నాడింప । ఇన్నిలాగుల భ్రమ నెఱుక లేకున్న
యన్నఁ గీచకు తమ్ముఁ డప్పు డిట్లనియె । ఇదియేమి దుస్స్థితి ... ... ...

ప్రియముతో డగ్గఱి పిలిచినట్లైన । బయలు కౌఁగిటఁజేర్చి భావించి నగుచు;
సురతంబునకుఁ గేలుచూపినట్లైన । నిరుపమ నుతిఁ జూచి నిట్టూర్పుపుచ్చు.
ఇన్నిపోకలఁబోవ నెఱిఁగి సేవకులు । సన్నుతితోడఁ గీచకుఁ జేరవచ్చి:
"ఇదియేమి దప్పితి? విదియేమి బ్రమసి? । తిదియేమి [1]కీచక, యిచ్చోట నుంటి?
పగతు లేతెంచినఁ [2]బగల వెన్నఁడును; । [3]తగిలి మృత్యువుఁగన్నఁ దలఁక వెన్నఁడును;
పిడుగు[4]తాఁకుడుకైన బెగడ వెన్నఁడును; । తడయక తగునయ్య ధైర్యంబు విడువ?
పొద పొద పొద్దయ్యె భోజనంబునకుఁ । బదివేవురున్నారు పంక్తిఁ గూర్చుండ."
అనినఁ గీచకుఁ[5]డును నమ్మాటలెల్ల । వినక చేష్టలుదక్కి వెఱ్ఱియైయున్న
నా సేవకులు వాని నట భోజనంబు । చేసినవానిఁగాఁ జేసి పోవుటయు,
వెలుపలి కేతెంచి వెసఁ గీచకుండు । తలకొన్న [6]చలిగాలిఁ దల కంటగింప
సరసి డగ్గఱఁబోయి చక్రవాకముల । సురత వైభవములు చూడంగనోడు;
లేఁదీఁగ జొంపంబు లీలతోఁజేరి । పూఁదేనె జడికిఁ బుష్పాళికి భీతిల్లు;
పొలఁతికి ఫలరసంబులు పుక్కిలించి । యొలయించు గండుఁగోయిలఁజూచి బెగడు;
ఎలమావిమోకపై నింతినోలార్చు । చిలుకఁ దప్పకచూచి చిత్తంబు చెదరు;
పొలుపైన విందమ్మి పూఁదేనె దెచ్చి । మొలఁతకు నిచ్చు తుమ్మెదఁ జూచి తలఁకు;
దరిగొన్న విరహాగ్ని ధరియింప లేక । హరిణాక్షిఁ దలఁచి యిట్లనియె వెండియును:
"జిగి తొలంకుచు నున్న చెలువ చన్నులకుఁ । దగనిత్తు నఖంబు తలఁపు గూడినను;
నీలకుంతల మోము నేర్పుతోఁ జూచి । క్రోలుదు నధరంబు కోర్కి నిండఁగను;
వేడుక పుట్టించి విభవ మొప్పంగఁ । గూడుదు నబలతోఁ గూడఁ గల్గినను;
రస గుళికలు వోని రసిక వాక్యముల । శశిముఖి నవ్వింతుఁ జలము దక్కినను;
గ్రహదోష మనుమాట కలిగెనో కాక । కుహకి [7]యై సూర్యుఁడు గ్రుంక కున్నాఁడు;
పరశురాముఁడు వేడఁ బశ్చిమాంభోధి । పొరిఁబోరి దూరమై పోయెనో [8]కాక!
మెఱవడిఁ జనుదెంచి మేరుపర్వతము । చఱిఁబడి రవి తేరు సాగకున్నదియొ!
బిల్లచిమ్మన మాడ్కిఁ బెకలించి సూర్యుఁ । బల్లంబు చోటికిఁ బాఱఁ [9]జిమ్ముదునో!"
అని యిట్లు తమకించి యా సింహబలుఁడు । వనజలోచన రాక వడిఁ గోరు[10]చుండె.

---

1. యోయన్న. 2. పగిప. 3. తగులు. 4. కైనను మది బెళుక; నైనను జెంద బెళుక. 5. నను నామాటలెల్ల । నొనర బూడిదలోన హోమమైపోయె; ఆ సేవకులు. 6. తనుగాలి(!). 7. సూర్యుఁడు గ్రుంక కున్నాఁడు వేగ. 8. తిరిగి. 9. మీటుదునో. 10. చున్న.

## సూర్యాస్తమయ వర్ణనము

'ఈ నీచుఁ జంపింతు [1]నిదె నేను గ్రుంకి । వీనిఁ జూచుట కాదు వెన' నన్నయట్లు
విపుల [2]తేజంబెల్ల వేగంబె [3]విగిచి । యపరాబ్ధిలోఁ గ్రుంకె నర్కబింబంబు.
పడమటి దిక్కనఁ బరఁగు భామినికి । నడరి [4]సూర్యునఁ గూడ ననురాగ మెసఁగె
నన రాగమెసఁగి సంధ్యాకాల మయ్యె ; । ఘనమైన నక్షత్రగణ మంతఁ దోఁచె ;
కలువలు వికసించెఁ; గలఁగె జక్కవలు ; । వలరాజు విల్లెత్తె వసుధ [5]నెల్లెడల ;
ననలంబుఁ గెంపెక్కె ; నాడె భూతములు ; । మొనసి పయ్యెరవట్టె; మోడ్చెఁబద్మములు;
అంతలో బాలేందుఁ డస్తమించుటయు । [6]నంతకంతకుఁ బర్వె నంధకారంబు ;
వసుధపై నేకార్ణవంబైన మాడ్కి । నెసఁగెఁ జీకటి యయ్యె నెల్లదిక్కులను ;
[7]కన్ను మోడ్చుటయును గన్ను విచ్చుటయు । నున్నతి జనులకు నొక్కరూపయ్యె.
అప్పుడు పాంచాలి యనిల సంభవుని । [8]నొప్పుగా డగ్గఱి యొరు లెఱుంగకయ :
" ఇదివేళ కీచకు నేఁ పణంచుటకుఁ । బదిలమై భుజశక్తి పాటింతుగాక ;
వనములోఁ గీచకవ్రజముఁ దప్పించి । ఘన కీచకుల నెల్ల ఖండింతుగాక.
[9]మాటల కెడలేదు మసలరా. " యనిన । దాఁటుచు లేచి సంతస[10]మున నతఁడు
తలయుఁ జీరయుఁ వాయితము[11]చేసి బిగిచి । యలరఁ బెండ్లికిఁ బోవునంత వేడుకను
నెలఁతఁ జేకొని పిల్చి 'నీవు నా వెనుకఁ । దలకొని [12]వచ్చి యుద్ధముఁ జూడు' మనుచు
వడి మహామత్స్యంబు వనధిలోఁ జొచ్చు । వడువునఁ దనములో వచ్చి [13]యచ్చటను
గొనికొని సింగంబు గుహఁ జొచ్చు మాడ్కి । ననయంబు వేడ్క[14]తో నా నాట్యశాల
చొచ్చి ద్రౌపది నొక్కచో నుండఁబనిచి । యిచ్చలఁ జేజారలిడుచు వాయుజుఁడు
గడపలు నడవలు కంబంబు లరుగు । లెడపక నెత్తంబు లిక్కువ లెఱిఁగి
యుత్తర ప్రియముతో నుండు మంచమున । నుత్తమభుజసారుఁ డొప్పార నుండె.

---

1. నేనింక. 2. దీధితులెల్ల. 3. విడిచి. 4. కుంకుమ గంద మలఁదిన మాడ్కి — ననురాగ మెసఁగ. 5. పెంపెక్కె — ననయంబు రుచిగూడె. 6. వింతగాఁ జీకట్లు విరిసె నెల్లెడల. 7. కన్ను విచ్చిన మూయఁ గలయఁ జూడ్కులకు. 8. యొప్పారఁగాఁ జేరి యుత్సాహ మెసఁగ. 9. నేఁటి రాత్రిలోన నెలమితో నన్న. 10. మంది యతఁడు. 11. గాఁగ. 12. యింతింతఁ దగిలి రమ్మనుచు । వడి మహోత్సవముతో వనములోఁ జొచ్చు. 13. చొచ్చుటయు. 14. నాట్యపుశాలఁ జొచ్చి । గ్రుచ్చు చీఁకటియిల్లు మొగిఁ జొచ్చినట్టు । లిచ్చఁ బొంగుచు భీముఁ డింతితో నపుడు.

## కీచకుఁడు నర్తనశాలకుఁ బోవుట

అంతఁ గీచకముఖ్యుఁ డర్థిదీపించి । వింతగాఁ గైసేసి వేగిరంబున[1]ను,
'సైరంధ్రి యింతకు సంకేతమునకుఁ । జేరుఁ బో' మ్మను బుద్ధి చీకాకుపఱచ,
మధుపానమత్తుఁడై మత్తేభలీల । నధిక[2]మా విధిబారి [3]కగ్గమైనట్లు
తా[4]నొంటి వెడలె మంద అపట్టి(?) యప్పుడు । కానంగరాని చీఁకటికి భీతిలక.
వెన నిల్లు వెడలి భూవిభుమందిరమునఁ । బూనఁగు నాటకశాల బోరన చొచ్చి,
యాయున్న యునికి[5]యా నాశూన్య విధము । నాయంధకారంబు నాత్మఁగైకొనక
మరలక తనసేయు మగతనంబునకుఁ । దొరకిన భుజశక్తి తోడుగా నపుడు
శాలకు నడుమగాఁ జని శయ్యమీఁదఁ । గేలు[6]సాచినఁ జూచి కిమ్మీరవైరి
కోపాగ్ని నంగార[7]కుఁడు వోలె మండి । రూపింప లయకాలరుద్రుఁడై [8]కినిసి
"దాయ [9]కింకెక్కడఁ దప్పిపోవచ్చు ? । చేయనిచ్చెదఁ గొన్ని చేష్ట లిచ్చోట."
అని యూరకున్నచో నాసింహబలుఁడు । తనకేలు వాయునందనుమీఁదఁ బెట్టి
[10]సైరంధ్రి యనుబుద్ధిఁ జాల హర్షించి । గారవించుచు మేను గరుపాఱుచుండ[11]
మదనభూతము సోఁకి మర్మంబు వదలి । కదియు వచ్చుచు మోహకలితుఁడై పలికె:
"లీలతో నబల, మేలునువస్తువులను । వాలాయముగ నీకు వలచి తెచ్చితిని;
[12]తసరారు వేడ్కను దవిలి యంగనలు । చనవున నాకు లంచములు వెట్టుదురు;
నీవొక్కతెవు నేఁడు నిజముగా నన్ను । నీవిధంబున [13]మించి యేలఁజాలితివి;
నన్ను జూచినయట్టి నలినాయతాక్షి । యెన్నఁడు [14]నొరుఁ జూడ నెంచదు మదిని;
తలకొన్న నాచక్కఁదనము భావించి । చెలువ యెక్కడకయున్న చిగురాకుపాన్పు?
నావిలాసము గన్న నాతి[15]నీఁ జూచి । పూవింటివాఁ డేల పోవంగనిచ్చు?
పురుషులలో నేను బురుషరత్నమను । దరుణులలో నీవు [16]తరుణిరత్నమవు."
[17]అనిన నిస్సీయని యతని మాటలకు । ననిలసూనుఁడు వాని నధముగా [18]నెన్ని
తనమాటలుగ వాని ద్రౌపదీదేవి । వినునట్లు వానితో వెరవొప్పఁ బలికె:

---

1. కు. 2. ంబు. 3. కడ్డ. 4. నంత. 5. కి నా శూన్యమైన । యా యంధకారంబు కాత్మ భీతి లక. 6. మోపుట. 7. కుండును వోలె. 8. మండి. 9. నీకెక్కడ. 10. ఈపాదము ము. ప్ర. లో. లేదు. 11. భూరి విభ్రమలీల బుద్ధి చలింప । మసన. 12. వెనుకకు నాతోడ వేడ్క నతివలు । వెనుకొని తెచ్చి లంచములు పెట్టుదురు. 13. జూచి. 14. నొకనిపై నెట్లు మోహించు. 15. కౌంగిడక. 16. తగిన. 17. అనిన నిస్సీయని యతని. 18. నెఱిఁగి.

"అగుదు చక్కనివాఁడ, [1]వగు, నీకు నీవ । పొగడుకొంటివి [2]కాన పోదు మాకింక ;
ఇన్నియు ననసేల యీ [3]ధాత్రిలోన । నన్ను బోలినయట్టి నలినాక్షి గలదె?
అడిగినఁ బ్రాణంబులైన నీ[4]వలదె? । యొడపక నీవు నాకిచ్చి దెచ్చుటెంత?
ధీయుక్తి నన్ను బొందియు [5]నీవు మరలి । పోయి వేఱొకనాతిఁ బొందఁ[6]గల్గుదువె?
పొందిన నేను నేర్పున మేనుగన్న । చందమేటికి?" నని [7]సన్నద్ధుఁ డగుచు

## భీమసేనుఁడు కీచకు మడియించుట

ఖండితవైరి[8]విక్రముఁడైన వాని । దండిం[9]ప నొడిసి ముందలపట్టి [10]యీడ్చెఁ.
కడఁకతో వాఁడును [11]గంధర్వుఁ డనుచు । విడిపించికొని [12]లేచి వేగంబె కదిసి
నవరించి రెండుహస్తములు శాఁదిగిచి । పవనజు నవనిపైఁ బడవైచి పట్టి
కడుపును దొడలు మోఁకాళ్లతోఁ[13]బొడువ । వడిలేచి కోపించి వాయునందనుఁడు
గుది[14]గొనఁ బట్టి [15]గ్రక్కున వానిఁ దివియ । నదయుఁడై వాఁడు నయ్యనిలజుఁ బట్టె.
ఒండొరు లీరీతి నుగ్రులై [16]కదిసి । దండి[17]మైఁ దిగిచి యుద్ధంబు సేయుచును
దొండంబు లొండొంటితో [18]రాయుచుండు । శుండాలముల[19]రీతి స్రుక్కక కినిసి
యొరులు తమ్మెఱిఁగిన నొచ్చెంబు గాన । నిరువురు నేకాంత [20]మిచ్చవాటించి
పద[21]నేది(?) గుండియల్ పగులఁ [22]బొడ్చుచును । జదిసి వీపులఁ బాముచావ వ్రేయుచును
[23]గుజ్జుఱక తన్నియు ఘోర వక్షములు । [24]నజ్జుగాఁ బొడిచియు నలిరేగి యపుడు
కరములు శిరములు గళము లాయములు । నురము[25]లు బరులు నొండొంటితో నొంచి,
పదఘట్టనల భూమిభాగంబు పగుల । [26]నదలుపు పెట్టిన నాకాశమగల
నున్నచో, బకవైరి యుగ్రుఁడై [27]వాని । నన్నపుటెలుఁగునఁ జలముతోఁ బలికె:
"ఓరి పాపాత్మ! నీ యుదుటుగర్వంబుఁ । [28]దీఱెను నేటితోఁ దెలిసి పోరాడు.

---

1. వని. 2. నీకుఁ బోలు పారనింక. 3. రాత్రి. 4. వలయు. 5. నీకు బ్రదికి. 6. నెక్కుడిది. 7. సంభ్రమించుచును. 8. విక్రమలీల. 9. చి – యు. 10. వంచె. 11. గర్వాంధుఁడగుచు. 12. కడువేగంబె లేచి. 13. నూఁద. 14. యించి. 15. యు. 16. కణఁగి. 17. ంచి 18. బెట్టుపెనఁచి. 19. ఁబోలి సారిది నిద్దఱును. 20. మిట్లు. 21 రెడి. 22. దాఁకుచును – జదియ వీపులు ముష్టి. 23. సజ్జపై మోఁదియు సర్వాంగములును. 24. నజ్జగా. 25. బీరముల నొండొంటి నొప్పింప. 26. నదమదగా మోఁది సమసత్త్వులగుచు. 27. యిట్లు – తిన్నని యెలుఁగుతోఁ జెలఁగొప్పఁ బలికె. 28. ధీరత నిన్నాళ్లు.

సైరంధ్రిఁ దలఁబట్టి సభలోన నీడ్చు । క్రూరాత్ముఁడవు నీవు [1]కూళ, చిక్కితివి
ఇచ్చట నాచేత; నిదె వంటయిల్లు । చొచ్చిన కుందేటి చొప్పయ్యె నీకు."
అనవుడు వాఁడు [2]కోపాటోప మెసఁగ । ననిలజుతోడ నిట్లనియె గర్వించి:
"గంధర్వు లేయూరు? కదన మేయూరు? । సంధించి నను [3]బట్టి చంపు టేయూరు?
మిమ్ము నేపురఁ జంపి మెలఁత సైరంధ్రి । [4]నెమ్మిఁ గైకొనిగాక నేనేల విడుతు;
గుదియక వెసఁ గీచకుని చేతికోలఁది । మదినెఱుంగు[5]దుగాక మాటలేమిటికి?"
అనుచు నిష్ఠుర[6]ముష్టి ననిలసంభవుని । ఘనబాహుమధ్యంబు ఘట్టించుటయును,
బెదరక చెదరక [7]భీమసేనుండు । వదలక వానిసత్త్వము గుండెఱిఁగి
పిడుగుతో సరియైన పిడికిట వానిఁ । బొడిచె [8]నాక్షణమ యద్భుతశక్తి మెఱసి.
కీచకుం డపుడు మిక్కిలి మూర్ఛపోయి । లేచి వాయుజు ద్రోసె లీల నాక్షణమె.
ద్రోసినఁ దలఁబట్టి విదళించి వాని । [9]భూసెజ్జఁ గూల్చియుఁ బోక వాయుజుఁడు
కీచకు [10]నురము నుంకించి ద్రోయుటయు । [11]నాచేతిద్రోటున నవశుఁడై వాఁడు
విలవిలఁ గాళ్లను వెసఁ దన్నుకొనుచు । నలసి నెత్తురుగ్రక్కి యావులించుచును
దెలుపైన కన్నులు తిరుగవేయుచును । బలిమిఁ ద్రెక్కోలుగాఁ బ్రాణముల్ విడిచె.
అప్పుడు బహుభూషితాంగుఁ గీచకుని । నొప్పుగాఁ బడవైచియున్న వాయుజుఁడు
పల్లవ బహుపుష్పభరిత వృక్షంబుఁ । ద్రెళ్లవైచిన దంతి తెఱఁగయ్యెఁ జూడ.
అంతఁ గీచకుఁ జిత్రమగు చావు చంపి । యెంతయుఁ బ్రియ[12]ముతో నేచి వాయుజుఁడు
కరములుఁ బదములు ఘనమస్తకంబుఁ । గర మర్థితో వానికడుపులో [13]దూర్చి
ముష్టిఘట్టన[14]లచే ముద్దగాఁ[15]జేసె. । తుష్టుఁడై యపుడు వాతూలనందనుఁడు
తనజయం బాత్మలోఁ దల[16]పోయుచున్న । వనజనేత్రకు వానివధ యేర్పరింప
నచ్చోటి కొకరీతి ననలంబుఁ దెచ్చి । [17]చెచ్చెరఁ జూపఁగాఁ, జెలువ పాంచాలి
కన్నారఁ గీచకాగ్రణి చావు చూచి । సన్నపునగవుతో సంతసిల్లుచును
వెఱఁగుపాటున వాని వికృతంబు చూచి । [18]తఱమిడి నవ్వుచుఁ దరుణి యిట్లనియె:

---

1. గొంది; కూల. 2. నుగ్రాటోప. 3. జంపఁజాలు. 4. నెమ్మిమైఁ గైకొందు నేర్పున ననుచు. 5. నెఱింగెదు. 6. వృత్తి ననిలజుఁ బొడువ – ననిలజుండును వాని నఱచేత ద్రోసె. 7. ప్రిదులక పట్టు. 8. నంతటఁ జాల భుజశక్తి మెఱసి. 9. పూసెజ్జ; శయ్య. 10. ఁద్రొక్కి. 11. నేచిన నొప్పిచే నింపేది వాఁడు. 12. మైన. 13. ద్రోచి. 14. లిచ్చి. 15. జేసె. 16. పోయుచుండి. 17. యచ్చుగా ముట్టింప నపుడు. 18. తెలిచి భీమునిఁజేరి వీక్షించి పలికె.

"కూడునే కీచక ! కుడిచికూర్చుండి । వేడుక నీపాటు వెసఁ దెచ్చుకొంటి ;
నీవృథాగర్వంబు నీపాపమతియు । నీవర్తనము[1] నువ్వె నిన్నింతచేసె ;
అనుభవించితిగాక యాఫలం బిప్పుడు । నిను గట్టిగాఁ ద్రాళ్లు నీవె తెచ్చితివి"
అనుచున్న ద్రౌపది ననిలసంభవుఁడు । కనుఁగొని తనపెంపు కానరాఁ బలికె :
"మానినీమణి, నీకు మానెనే వగపు ? । పీనుఁగునై వీఁడు పృథివిఁ గూలుటయు ;
హరిణాక్షి, [2]సంతోషమయ్యెనే నీకు ? । దురితాత్ముఁడగు వీఁడు తొడరిచచ్చుటయు ;
వనిత, నీకింక [3]నెవ్వండెగ్గుదలఁచె । నని మొనఁ దెగటార్తు నతని నిబ్భంగి."
అనవుడుఁ బులకించి యతివ లజ్జించి । యనిలసంభవుఁ[4]జూచి యనువొప్పఁ బలికె :

## ద్రౌపది భీమసేనుఁ గొనియాడుట

"ఏ మానవుఁడు చేసె నిట్టి సాహసము ? । ఏమని వర్ణింతు నేను నీ[5]శక్తి ?
అల[6]నాఁడు ధర్మజుఁ డడ్డపెట్టుటయుఁ । గొలువులోపల [7]నీవు కోపంబుమాని
యీ నాట్యశాలలో నీ మధ్యరాత్రి । వీనితో మార్కొని వెఱపింతలేక
తొడఁబుట్టువు లన్నతో డాసపడక । చూడంగ [8]మిక్కిలిశూరత మెఱసి
ప్రజలు గానకయుండఁ బవమానతనయ ! । నిజముగా [9]నాపగ నీఁగితి పీవు ;
అగునింక దుర్యోధనాదులఁ [10]జంపి । పగ[11]దీర్పనోపుదు బాహు[12]గర్వమున."
అని యింతి కొనియాడ ననిలసంభవుఁడు । ఘనతర సంతోషకలితుఁడై పలికె :
"వచ్చిన పనులయ్యె [13]వనజాక్షి, మనకు । నిచ్చోట వర్తింప నేమికారణము ?
మనమాట లాలించి మనుజు లెవ్వారు । చనుదెంతురో ? పొద్దు చాలఁ బోయినది
నిద్రకన్నెఱుఁగక నీవు నిందాఁక । విద్రుమాధరి, [14]యుంట వేడ్క నీ వేఁగు."
అని[15]చెప్పి వీడ్కొల్పి యా వంట[16]యింటి । కనుపమంబున నేఁగి యనిలసంభవుఁడు
[17]ఒడలికింకిరివోవ నుదకంబులాడి । కడు మంచివస్త్రముల్ గట్టి కైసేసి

---

1. చేసె నేఁ డింతపట్టు । అనదవై కోరితి వతను సౌఖ్యంబు । ననుభవించెదు గాక యతను సౌఖ్యంబు ; అనుచున్న (ముద్రిత ప్రతి). అనుభవించెదు గాక యంతదుఃఖంబుఁ (ఓరియంటల్ ప్రతి). 2. కోపంబు లణఁగెనే నీకు । దొరలి పాపాత్ము నుద్ధురతఁ గూల్చుటయు. (ముద్రిత ప్రతి). 3. నెవ్వఁడు కీడు. 4. తోడవను. 5. కీర్తి. 6. వొప్ప. 7. నాఁడు. 8. ననహాయశూర మార్గమునఁ । బ్రజలఁ గానఁగనీక. 9. భుజశక్తి నెగడంగఁ జేసి । తగు. 10. గెలిచి. 11. నీఁగ 12. సత్వమున. 13. వనిత, నీవింక. 14. పోయి వేగ నిద్రించు. 15. పల్కి వీడ్కొని 16. యిల్లు । ననురాగమునఁ జొచ్చి. 17. ఒడలికి గదురువో.

హంసతూలికపాన్పునందు [1]మోదమున । గంసారి [2]మదినెన్ని కనుదోయిమోడ్చె."
అనుటయు [3]ముదమంది 'యటమీఁదికథయు । విన వేడ్క[4] యైనది వివరింపు' మనిన
[5]సత్యహరిశ్చంద్ర, సహజ[6]దేవేంద్ర, । నిత్య[7]నిర్మలతేజ, నీతిమాంధాత,
అనఘాత్మ, పంటవంశాంభోధిచంద్ర, । జననుత ప్రభురాజ, సాహిత్యభోజ,
దిగర్భేశ్వర, హరినామ నిరత, । భూదాన గోదాన భూరిప్రతాప!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
కృతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
చిత విరాటపర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొప్పె రెండవది.

---

1. వేవేగ. 2. మఱఁదుండి. 3. నింక నొయ్యన. 4. నాకది వినిపింపు. 5. ఈ కృతిసంబోధనద్విపదలు తంజావూరి ప్రతిలో లేవు. 6. సౌజన్య. 7. నిర్మలతేజ. చారిత్ర (తిరుపతి ప్రతి).

# తృతీయాశ్వాసము



[1]శ్రీ భవ్యదోర్దండ, చెరమీరగండ, । వైభవోపేంద్ర, దేవయ ముమ్మడీంద్ర!
వినుము వెండియు నిట్లు వివరింపఁ దొడఁగె । జనమేజయునకు వైశంపాయనుండు:
అంతటఁ బాంచాలి యంతరంగమున । 'నింతకు బకవైరి [2]యేఁగుఁ బో' మ్మనుచు
వెలయ నాటకశాల వెడలి యచ్చోట । నిలిచి కావలివారి నిద్రమేల్కొలిపి
తోడుకొని తెచ్చి సూతుని చావుచూపి । [4]యెడపక వారితో నిట్లని పలికె:
"అన్నన్న! గంధర్వులైన నా [5]పురుషు । లిన్నిచుఁ [6]దెగటార్చి రీక్షింపుఁ డి[7]పుడు;
చక్కనుండక పుణ్యసతులఁ గామించు । మొక్కలీంద్రకుఁ [8]జావు మొగి నిట్లె వచ్చు."
అనుటయు వారు హాహారావ మెసఁగఁ । జని వానిచావు కీచకుల[9]కుఁ దెల్ప
దివియకోలలుఁ దాముఁ దెరలి కీచకులు । [10]రవళితోఁ బాటి నర్త[11]నశాలఁ జొచ్చి
పరు[12]వడి సూతుపైఁ బడి యేడ్చువారుఁ । [13]బరవశంబైన మూర్ఛలఁ బొందువారుఁ
బొరిపొరి ధరణిపైఁ బొరలెడువారు । వరుసతో నెలుఁగెత్తి వాపోవువారు
నెలకొని వాని వర్ణించి వర్ణించి । పలవించువారునై బహుభంగి వగవ
వారి బాంధవులెల్ల వచ్చి కీచకునిఁ । జేరి వీక్షించి యచ్చెరువంది యపుడు:

### కీచకుని చావున కతని బాంధవులెల్ల విలపించుట

"విసుమానములుగాక [14]వెస నిట్టిచావు । పొసఁగ [15]నెవ్వరు ధాత్రిఁ బొడగన్నవారు!
ఎయ్యవి పాదము! లెయ్యవి కరము! । లెయ్యది మస్తకం [16]బీ కీచకునకు!

---

1. శ్రీ సమంచితనేత్ర శృంగారగాత్ర । వాసవామరసేవ్య వందితచరణ,
సాకేతపురినున్న జనుల కందఱికిఁ । జేకొని ముక్తియిచ్చినరామ, వినుము;
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథామాత్ర మిట్లని చెప్పఁదొడఁగె. (తంజావూరి ప్రతి)
2. యేఁగెఁ బొమ్మనఁగ. 3. తోడ్కొనివచ్చి. 4. వేడ్కతో నిట్లనె తెలుపింతలేక. 5. మగలు.
6. వధియించి. 7. డిఁకను. 8. నేల మోసలేకుండు. 9. కేర్పులుప – దివ్వెకోలల వారు తివిరి.
10. రవ్వతో. 11. క. 12. విడి.
13. పరులకు లోఁగనివాని శౌర్యమును । నెలకొన్నచింత వర్ణించి వర్ణించి,
పలవించువారునై వగఁజెంది తూల । వారి బాంధవులెల్ల. (ముద్రిత ప్రతి)
14. విన. 15. ధాత్రి నెవండు పొడగన్నవాఁడు. 16. బెయ్యదిదేహ । మెయ్యవి భూషణా
లెయ్యవి యనుచు । నెయ్యవి వివరింప నీ కీచకునకు । చెలఁగి.

చెలఁగి గంధర్వులచేఁ జచ్చువారి । కలయంగ నిదియ మర్యాద కా[1]ఁబోలు!
తగునయ్య కీచక, ధర్మంబు విడిచి । మగువకునై పోయి మరణంబు నొంద?
అడవినిఁ గాసినయట్టి వెన్నెలకు । నడరంగ సరియయ్యెనయ్య నీ[2]లావు ;
నినుఁగూల్చినట్టిఁడు నెఱి నెట్టివాఁడొ?" । అని పెక్కుభంగుల నడలఁగాఁ జూచి
విపులదుఃఖముచేత వెఱఁగందియున్న । యుపకీచకుఁడు పల్కె నొకయింత తెలిసి :
"మనమెంత యడలిన మఱికీచకుండు । విననేరఁ డిదియేల వెఱ్ఱిగొన్నారు!
[3]అతని కిరవైనయట్టి యీ తెఱఁగు । జూతురుగా కింక శోకింపనేల?"
అనవుడు [4]నాఁగాక యని లేచి వారు । పనిగొని యచ్చోటఁ బాంచాలిఁ జూచి :
"ఇదికాదె కీచకు నింతసేయించె! । నిదియు నీతనితోడ నేఁగుఁగా." కనుచుఁ
బెనఁచి ద్రౌపదిఁబట్టి పెడకేలు గట్టి । జననాథునకుఁ జెప్పఁజని రట్టి తెఱఁగు.
[5]అటమున్న విరటుండు నతనిచావునకుఁ । బటుతర [6]దుఃఖాగ్నిభరితుఁడై యున్నఁ,
జలమొప్పఁ జనుదెంచి సకలకీచకులు । [7]చెలువార నంజలిచేసి యిట్లనిరి :
"జగతీశ, వినవయ్య సైరంధ్రి నేఁడు । మగలచేఁ జంపించె మన సింహబలుని ;
[8]వడి నెన్నివిధముల వామాక్షి మాకుఁ । బొడవణంపకయున్నఁ బోదు నెంజిలియుఁ
బనివడి [9]మీకుఁ జెప్పంగ వచ్చితిమి ; । జననాథ, యిప్పుడీ చనవు మాకిమ్ము."
అనవుడు [10]తనమాట లపుడు కీచకులు । వినమిగా భావించి విభుఁడొప్పఁ బలికె :
"మీకుఁ దోఁచినయట్లు మీరు వర్తింపుఁ । డాకుల[11]పడి నన్ను నడుగ[12]నేమిటికి?
పలుకును బంతంబుఁ బాటింత్రుగాని । వలదన్న మానెడివారలే మీరు?"

## ఉపకీచకులు ద్రౌపదిని గీచకశవముతో బంధించి తీసికొనిపోవుట

అనుటయు ననుమతం బడియకాఁ దలఁచి । జననాథు వీడ్కొని చని దురాత్మకులు
'ఆలోకముననైన నతనితోఁ గూడు । నాలోలనేత్రఁ దెం' డని పట్టి తెచ్చి

1. నోపు. 2. భాగ్య - మని పెక్కుభంగుల. 3. ఈతనిఁ గొనిపోయి యిరవైన తెఱఁగు. 4. నందఱు నడలుట లుడిగి. 5. అటనున్న కీచకు లట వచ్చుటయును. 6. శోకాగ్ని. 7. అలుకఁ జెల్వొదొఱంగి యాగ్రహాంబెత్తి. 8. వడిఁ గీచకునితోడ వామాక్షిఁ గాల్పఁ । గడఁగి నీయనుమతిఁ గాంచ వచ్చితిమి ; పనివడి యటుచేయ వగలాఱు మాకు । ననవుడు విరటుండు నపుడు కీచకులు । తనమాట వినరది తాను భావించి । యనువార నిట్లనె నలవారితోడ । మీకుఁ దోఁచినయట్లు. (ముద్రిత ప్రతి) 9. నీకు. 10. నమ్మాట కపుడు ; విరటుండు నపుడు. 11. సతి. 12. ంగనేల । తలకొని మీయన్న తన వీథిఁ బోయె. (ముద్రితము).

పనిగొని [1]సూతుపైఁ బాంచాలిఁ గట్టి । గొనిపోవుచును గంధుకోట్లును దారుఁ
బొరిగెడి శోకాగ్నిఁ బిత్ృవనంబునకుఁ । గరదీపికలు పట్టి కదలిరందఱును.
[2]అప్పుడయ్యతివ బాష్పాంబుపూరములు । దొప్పదోఁగిన మోముతో నెలుఁగెత్తి
యసురులచేఁ జిక్కి యమరేంద్రలక్ష్మి । మసలక వాపోవుమాడ్కి నిట్లనియె :
" కలిత విక్రములార, గంధర్వులార, । దళితశాత్రవులార, [3]తంత్రజ్ఞులార,
నిర్మలమతులార, నియతాత్ములార, । ధర్మసమ్మతులార, దయసేయరయ్య !
చపలురై తమయన్నశవముతోఁ గూడ । నుపకీచకులు నన్ను నుఱుక బంధించి
కొనిపోవుచున్నారు [4]కుటిలవర్తనులు ; । నన్నుఁ గావరయ్య బన్నములెల్ల మాన్చి !
ఓ జయ నిజనామ ! యో జయంతాఖ్య ! । ఓ జైత్ర విజయుండ ! యో జయత్సేన !
ఓ జయద్బల ! [5]మీకు నుచితమే యిట్లు । తేజంబు సూపక [6]తివిచియున్నారు !
[7]ఆలికుయ్యాలింప రకట మీరుండి ! । ఏల యూరకయుండ నిట్టికార్యమున ! "

## భీముఁ డుపకీచకుల మడియించి ద్రౌపదిని విడిపించుట

అనుటయు నమ్మాట లాలించి పవన । తనయుండు మేల్కాంచి తలఁపులో నపుడు
" [8]పరులేచి వెండియుఁ బ్రాణవల్లభకుఁ । [9]గరమర్థితో నెగ్గు గావించి" రనుచు
భయరక్షణంబు [10]గోప్యంబుగాఁ జేయ । రయమున నాప్రాకారపుగోడ దాఁటి
పొలుపుమీఱఁగ రుద్రభూమిలో నిలిచి । వెలసిన యొక మహావృక్షంబుఁ బెఱికి
[11]భుజముపైఁ గీలించి భూరిశూలమున । గజదైత్యహరుఁడొప్పుకరణి నొప్పారెఁ
గుటిల[12]కోపాటోప ఘూర్ణితాలోక । [13]చటుల పాటవ భుజాసంరంభుఁడగుచు.
అంతఁ గీచకవైరి నల్లంతఁ గాంచి । యెంతయు భయముతో నెల్లకీచకులు
" అక్కటా గంధర్వు లదె వచ్చిరింక । నెక్కడఁజొత్తు మిఁకెట్లొకో !" యనుచుఁ
గువలయనేత్రతోఁ గూడఁ గీచకుని । శవము ధారుణివైచి చాలభీతిల్లి
[14]యుదకంబులను డాఁగి యోలిఁ బల్లముల । నొదిఁగియు నృక్షంబులొప్పఁ బ్రాఁకియును

---

1. శవముపై. 2. అప్పుడు పాంచాలి యంతరంగమున. 3. ధైర్యాత్ములార. 4. కూడంగ వచ్చి. 5. నీకు. 6. తెంపేదినట్లు; తెగి దాఁగి యిట్లు. 7. కాలయాపన సేయఁగానౌనె యకట (మీకుఁ దగునె) 8. అరయంగ. 9. బరులచే నీపాటు పాటిల్లె ననుచు. 10. గోప్యముగాఁగ వలసి. 11. మనుజాళనుల నెల్ల మర్దించునపుడు । ఘనదైత్యహరుఁడుగ్రగతి నొప్పునట్లు. 12. బాహాటోప. 13. చటులబాహునఁ గోపసన్నద్ధుఁ డగుచు. 14. పదపదుండని పాటి పాఱలేకచట.

దెరువులు గానక తిరుగఁ బాఱియును । [1]వెఱవొంది పఱచిన భీముండు దఱిమి
[2]కడలగి బెబ్బులి [3]లేళ్లఁగమిమీఁదఁ గవియు । వడువునఁ [4]గీచకవ్రజముపైఁ గవిసి
చలమొప్ప [5]డాసియుఁ జదియ వ్రేసియును । దలలూడఁ దన్నియు ధరణిఁ బ్రామియును
ఒడిచియు [6]నడఁచియు నక్కడంచియును । బొడిచియుఁ [7]జించియు భుజశక్తి నిట్లు
విపులకోపముతోడ వెస నూటయేవు । రుపకీచకులఁ బట్టి యుఱక చెండాడి
కమలాక్షిఁ గట్టిన కట్లెల్ల నూడ్చి । క్రమమొప్ప నూరార్చి కన్నీరు [8]దుడిచి
'దేవి, యింటికిఁబొమ్ము [9]తెఱఁగొప్ప' ననుచు । పావని [10]వెనుకొని పాంచాలి ననిచి
[11]బలికిని వెడలి వేఱొక్కమార్గమున । [12]బలువిడిఁ జనుదెంచెఁ బాకశాలకును.
ధరణీశుఁ డపుడు గంధర్వులచేతఁ । [13]బరఁగఁ గీచకులెల్లఁ బడిరని వినియుఁ
గేకయపుత్రి శోకించు తావునకుఁ । బ్రాకటంబుగఁ బోయి భయ[14]మంది పలికె:
"ఏపార సైరంధ్రి నిట నుండనీక । పాపుద మీకఁజాలుఁ బగివేలు వచ్చె;
[15]ప్రొద్దున నొకవంకఁ బొమ్ము నీ వనుచు । బుద్ధిగాఁ జెప్పి నేర్పున నంపుమబల!
మగవారు దానితో మాటాడవెఱతు; । రొగిఁ బట్టి చంపించు నొకముహూర్తమున;
ఈ యింతికై చావ నెందఱున్నారొ! । తోయజానన, పాముతోడి పొత్తయ్యె."
అనవుడు విరటుతో నబల యిట్లనియె: । "మనుజేంద్ర, కలసె నీమనను నామనసు;
ఏనును సైరంధ్రి నీవేళ ననుపఁ । బూనియుండితి; నీవుఁ బొసఁగఁ జెప్పితివి;
వెనుకొని యిఁక నింతి వెడలంగఁ ద్రోచి । జననాథ, [16]మఱి నీళ్లుచల్లి ప్రొక్కెదను."
అని చెప్పినంతలో నంధకారంబు । కనుకని విరిసి భాస్కరుఁడు తోఁచుటయుఁ,
గట్టినమడుఁగుతోఁ [17]గ్రమమొప్ప వచ్చి । నెట్టన నొకయేటినీటిలో [18]మునిఁగి
నగవున విలసిల్లు పలువొప్పు మోము । జగతిఁ బున్నమనాఁటి చంద్రు[19]నిఁ జెనక,
[20]ఆ రాజవీథిలో నరుదెంచునపుడు । పౌరులు [21]తనుజూచి భయము రెట్టింప :

---

1. తిరుగుడువడక సంధించి వాయుజుఁడు. 2. కడిఁది. 3. లేడి; లేటి. 4. నెంతయు వారిపై నేచి.
5. డా. 6. బొడిచియు.
7. నడఁచియుఁబోనీక పేర్చి-వరబాహుదర్ప ప్రభావంబు వఱల । శరవొప్ప నెంతయు వెస నూటయేవు।
రుపకీచకులఁ బట్టి యుఱక చెండాడి । విపులాంసముల శౌర్యవిభ్రమంబొప్పఁ । కమలాక్షిఁ గట్టిన.
(ముద్రితము) 8. నించి. 9. తెగువతో. 10. ఖిన్నుఁడై. 11. యురవున. 12. పరువడి. 13. పరువేది
(వడి) కీచకుల్ పడిరని (రినా) వినియు. 14. భక్తి. 15. ప్రొద్దున లేచి లే పొమ్మని మిగుల.
16. తే. 17. గడఁగి పాంచాలి. 18. దోఁగి. 19. తో. 20. సైరంధ్రి...చనుదెంచు. 21. వీక్షించి
భయమంది పలుక । నెంతయు సంతోష మిచ్చుఁ బాటించి(?) । అంగనవలె,

"నంగనవలెనుండి యఖలకీచకుల । మ్రింగినభూతంబు మెఱసిపోయెడిని ;
అరుగుc డడ్డమురాకుc డటుపోకుc డేcగి । తెరువింను తొలcగcడు [1]తిరిగిచూడకుcడు
చూచినc దెగcజూచుcజూ చంద్రవదన । చూచిన [2]సతిపోలె శోభిల్లుcగాని."
అనుచుc జేతుల ఱొమ్ము నప్పళించుచును । జను లొక్క మోటగా [3]శంకించి పలుక,
నెంతయు సంతోష [4]మెసcగc బాంచాలి । యంత నొయ్యనవచ్చి యట వంటయింటి
వాకిట నిలుచున్న వాయుసంభవునిc । బ్రాకటగతిc జాయబాఱc జూచుచును
దలకొన్న వేడ్కతోc దనలోనె తాను । బలుకుచుc జనుచేతిc [5]బలికె నచ్చోట :
"నయమించుకయు లేక నాకుc గీచకులు । భయము పుట్టింపc [6]దప్పక ప్రోచినట్టి
ఘనదయాపరునకు గంధర్వునకును । అనయంబుc బ్రణమిల్లి యర్థి మోదింతు."
అనిన భీముcడు గూఢమైనవాక్యముల । వనజలోచనc జూచి వలనొప్పc బలికె:
"చపలనేత్రకు నొక్కసంకటం బైన । యపుడు [7]తాc దఱివేచి యచట సంధించి
మగcటిమిc జూపని మగc డేటిమగcడు? । జగతివారికి నేల సత్కీర్తి గలుగు?"
అనుటయు వినుచు [8]నాట్యపుశాల చేరc । జని యర్జునుని జూచి నతి సంభ్రమింప,
నృత్తంబు[9]సాలించి నెమ్మిc గన్నియలు । మొత్తమై చనుదెంచి ముదిత కిట్లనిరి :
"చపలాక్షి, కీచకుc జంపించితమ్మ! । యుపకీచకులc బట్టి యొప్పించితమ్మ!
వారిచేc బడియు నొవ్వక వచ్చితమ్మ! । [10]నీరమణులలావు నెగడించితమ్మ!
అమ్మ, నీకెవ్వరు నపకార మింక । నెమ్మిc జేయcగలేరు నిఖిలలోకముల."
అని తారు మును విన్న[11]యట్టి కార్యముల । కనుమూప మగునీతి [12]నడుగుచోc గదిసి

## అర్జునుcడు ద్రౌపదితో సంభాషించుట

పలికె నింద్రునిపట్టి పాంచాలిc జూచి : । "జలజాక్షి, నిన్ను గీచకుc డేమిచేసె?
మఱి కీచకులనెల్ల మర్దించుతెఱcగు । [13]నెఱవుగా నెఱిcగింపు నీమాటగాcగ."
అనుటయు నామాట [14]కలనవ్వు నవ్వి । వనజాక్షి [15]తననేర్పు వలనొప్పc బలికె:

---

1. తెలియ. 2. cబెనుచేటు సోcకు నెంతయును. 3. జంకక. 4. మిచ్చc బాటించి । యింతి యొయ్యన వంటయింటికై పోయి – వాకిట. 5. పఱcతి యిట్లనియె. 6. చంపcగc జూచినట్టి. 7. తాళము వేసినట్లు. 8. నాట్యా లయమునకు. 9. గావించు. 10. హైరిదర్పమ్ముతో బలులు నీమగలు. 11. యఖిల ; యన్ని. 12. నాడుచో. 13. నెఱయ. 14. కలరంగ. 15. యతనితో.

"నీ కేమి నీవు కన్నియల కేఁప్రొద్దుఁ । జేకొని [1]నాట్యంబు చెప్పుచుండుదువు;
కడుకొని యెవ్వరెక్కడఁ బోయిరేమి । [2]తడవవు; నాపాటు తలఁప నీ[3]కేల?"
అనిన వాసవపుత్రుఁ డబల కిట్లనియె: । "నినుఁజూచి శోకింపనేర్తు నెంతయును
జెలియ, నీతోఁ బొత్తుచేసితిఁ గానఁ । దలఁప నీ శోకమైనఁ దడవకుండుదునె?
ఓ చంద్రవదన, యేనున్నభావంబుఁ । జూచి [4]యిందెవ్వరు శోకించువారు?"
అని యర్జునుఁడు పేడియైయున్న తనకు । ఘనవైరిశిక్షు యోగ్యముగామి దెలుప
విని సవ్యసాచికి వెలఁది యిట్లనియె: । "నిను దూఱవచ్చునే! నీవు మాన్యుఁడవు;
పృథివి నీరూపంబు బీభత్సమైనఁ । బృథివీశునకుఁ [5]జాలఁ బ్రియమయ్యె నేఁడు;
నరుఁడవు కావున నాదుఃఖసమితి । పొరసిన నొకవేళఁ బొరసెఁగాకేమి."
అనిచెప్పి [6]తనవెంట [7]నచటికన్నియలు । చనుదేరఁగా దేవిసదనంబుచొచ్చి
కడఁగిన తనయుబ్బు [8]గానరానీక । పొడమిన చిఱునవ్వు పొడమంగనీక
వెడలఁజూచినమాట వెడలంగనీక । యడరక తొడరక యప్పుడు పాంచాలి
యలరిన సంతోష[9]మను గుట్టమునకు । నలధైర్యమే కళ్లియంబుగాఁ బట్టి
దేవిముందటఁ వచ్చి తెఱఁగొప్ప నిలువ । దేవియు భయశోక దీనభావమున
మడుఁగులు దెప్పించి మణులు దెప్పించి । తొడవులు దెప్పించి ద్రుపదనందనకుఁ
బచ్చకప్పురముతో బాగాలు మొదల । నిచ్చి [10]సొమ్ములు చీర లిన్నియు నిచ్చి
పలికె నప్పుడు దుఃఖపరవశంబునను । బొలఁతితో నెంతయుఁ బొందు గావించి:

## సుదేష్ణ ద్రౌపది నిలువెడలఁ బంపఁజూచుట

"చక్కనిదానవు; సాధ్వి, నీమగలు । చక్కనుండరు; నీకుఁ జాటిచెప్పెదను.
మగవారు నినుఁజూచి మదనమోహమునఁ । దగులుటయును వారి దారు చంపుదురు;
నీ[11]మోముఁ జూచిన నెలఁత, మాకైనఁ । గామచేష్టలు దోఁచు కడసారిమాట;
వలవకుండఁగరాదు వలచినఁ జేటు; । మెలఁత, నీతో నెల్లు మెలఁగువారలము!
కావున మా[12]లోనఁ గాదు నీ[13]వుండ; । వేవేగ వెడలుము విభుఁడుఁ బొమ్మనియె."

---

1. భరతంబు. 2. తడయక మాపాటు. 3. శేమి. 4. యింకెవ్వరు. 5. జూడఁ బ్రియమైనఁ జాలు. 6. తెనువెంట. 7. నఖిల (?). 8. కడఁగంగ. 9. మటుగాన నీక । లలిత ధైర్యముచేత లంకె పట్టియును । దేవిముందట. 10. యిన్నియు నిచ్చి యిట్లని పలికె. 11. మూర్తి గనుఁగొన్న. 12. తోడ. 13. వింక.

అనుటయుఁ బాంచాలి యద్దేవి మోముఁ । గనుఁగొని వినయంబు గానరాఁ బలికె:
"పడఁతుక, యిఁక మీఁదఁ బదుమూఁడుదినము । లెడపక వర్తింపనిమ్ము నన్నిచట;
అంత నామగలు ప్రత్యక్షమై మీరు । చింతించుపనులెల్లఁ [1]జేకూర్పఁగలరు;
ఉపకారపరులు మహోగ్రసాహసులు । నృపునిచిత్తముఁ బట్టనేర్తు రెంతయును;
పొరవుగాఁ దలఁపకు పొలఁతి, నామాట; । పురుషార్థమును వచ్చుఁ బుణ్యంబు నీకు."
అనుటయు నమ్మాట లాత్మలో [2]నమ్మి । జననాథుదేవి పాంచాలి కిట్లనియె:
"ఉవిద, నీమాటల కొండాడ వెఱతు; । నవుఁగాము లెఱుఁగ నీయాజ్ఞ చేసెదను;
భూవిభుఁడున్నాఁడు పుత్రుఁడున్నాఁడు । మావారలున్నారు మన్నింపుమమ్మ;
తివుటమై నీవు చింతించుకార్యంబు । లివి యవి యని నాకు నెఱిఁగింపుమమ్మ!"
అనుచుఁ బ్రార్థించిన యద్దేవియింట । వనిత తొల్లిఁటియట్ల వర్తించుచుండ,
[3]జనులంత సకలభూచక్రంబునందుఁ । బనుగొని తమలోన భాషించి[4]రిట్లు:
"విరటుని మఱఁదియై వెలయు కీచకునిఁ । బరిమార్చిరఁట! యెంతబలియు[5]రున్నారొ!
వాని సాహసమును వాని దోర్బలము । వాని గర్వంబైన వర్ణింప నరుదు!
అట్టివాఁడును ఘోరమగు చావుఁ జచ్చె । నెట్టన గంధర్వ[6]నికరంబుచేత!
ఉపకీచకులుఁ జచ్చి రొక యింతికొఱకు! । నపజయం బిటమీఁద నా మత్స్యపతికి;
నెఱజోదులఁట! నేఁడు నిష్కారణంబు । పఱియలై [7]పోయిరి పగవారిచేత!"
అని యిట్లు సూతులు హతులైనవార్త । లనయంబు[8]జనులెల్ల నాడుచుండఁగను,
అంత నక్కడఁ గౌరవాధీశ్వరుండు । కౌంతేయు[9]లకు నిచ్చఁ గపటంబు దలఁచి
వారి నయ్యజ్ఞాతవాసకాలమున । ధారుణి వెదకింపఁ దాను బుచ్చుటయుఁ,
జతురులై పోయిన చారవర్గంబు । కుతల[10]మంతయుఁ [11]జొచ్చి గోరాడి వెదకి
రూపింపఁ బాండుపుత్రులు [12]చన్న సన్న । లేపార నెచ్చోట నెఱుఁగంగలేక
తిరుగుట చాలించి తిరిగి యేతెంచి । పొరిఁబొరి సంకేతభూమిపైఁ గూడి

1. జేయ నోపుదురు । ఎన్ని నాచారిత్ర మెల్లను దెలియ । మున్ను జెప్పితి నీకు మోసపోఁగాని । కీచకు నింతలోఁ గీడు వచ్చినను । నాచేయు తెఱఁగేమి నలినాక్షి యింక! పరసతి పరధన పరహింస చేయు । వారుఁడైనఁ జెడిపోవుననుఁ బురాణములు; కరుణతో నావ్రతము గడతేర్చుమమ్మ! పురుషార్థమును (తంజావూరి ప్రతి).

2. నిలిపి. 3. జనులాండ్రోరులు. 4. తు. 5. లు. 6. నిచయ. 7. 'మడిసిరి. 8. వర్తిల్లె నవని యంతటను. 9. ల ప్రతిజ్ఞ కలుషంబుసేయ. 10. మె. 11. జూచి గోడాడి. 12. నున్నచిన్నె.

‘యిత్తెఱఁ గధిపు[1]న కెఱిఁగింత’ మనుచు । పుత్తమై గజపురంబున[2]కు నేతెంచి
నతికెక్కు దుర్యోధనుని కొల్వుఁ గడకు । నతివేగమునఁ బోవ నదియు నొప్పారె
వినుత సర్వంసహావిభు నీతివోలె । ననుకూల భీష్మకృపావిష్టమగుచు,
నిరుపమ ప్రహ్లాద నిజమూర్తివోలె । గురు కర్ణ [3]విరస వాగ్భాషితంబగుచు,
దుష్టభూపాల బంధుర లక్ష్మివోలె । దిష్ట దుశ్శాసన ధృతరాష్ట్రమగుచు,
పరిణ[4]ద్ధ సురరాజ భవనంబువోలె । నర[5]సిద్ధ గంధర్వ [6]వసుయుక్తమగుచు.[7]
శక సాళ్వ కోసల సౌ[8]వీర మగధ । కుకురు కుంతల పాండ్య ఘూర్జ[9]రేశ్వరులు
ఘనత నాతని సమ్ముఖముఁ జేయునపుడు । తసరిన పసిఁడిబద్దలవారి రవళి
నలవుమీఱినయట్టి యాస్థానసీమఁ । జెలువైన బహురత్నసింహాసనమునఁ
దిరమొప్ప రెండవ దేవేంద్రుఁడనఁగఁ । గరమర్థిఁ గూర్చున్న కౌరవేశ్వరుని
దరిసించి [10]సాష్టాంగ దండప్రణామ । కర[11]కరచరణులై కరములు మొగిచి
[12]చారు లెంతయు నిర్వి[13]కారులై పలికి । రారూఢ వినయంబులైన వాక్యముల:
“అవధారు దేవ, నీవనిపి నట్లేము । జవమునఁ జని భూమిచక్రంబు [14]దిరిగి
పదిలమై డాఁగిన పాండునందనుల । వెదకునప్పుడు కొంత వేసటలేక
తొలి తొలి వారున్న దుర్గభూములకుఁ । జలమొప్పఁ జని పర్ణశాలలు వెదకి

1. తోనె. 2. కరుదెంచి. 3. విసర. 4. తి. 5. సతీ. 6. వర.

7. వితత కుంభజకోప విస్ఫూర్తివోలె । నతిరత్న కమలరత్నాకరంబగుచు.
మఱియుఁ గానుక దెచ్చు మండలేశ్వరుల । నెఱపిన భద్రేభనికరంబువలనఁ
దొరఁగెడు మదధారఁ దోఁగి పంకముల । బొరసిన లావులఁ బొదిగూడ నిలిచి
పదిలమై సందడిపడు పద్మముఖుల । పదముల కనువయ్యెఁ బంకజాకృతులు (?)
మెండైన తనువుల మెఱయు భూషణము । లొండొంటితో రాయ నుదయించు రజము
కదలు చామరములగాలిచేఁ గదలి । కదిసి పుష్పొడివోలెఁ గలయఁ బర్వుటయుఁ
బసపాడి రసిక (?) తప్పక యెల్లవారు । పసిఁడిపుత్తడిరేఖభాతి నుండుదురు.
మఱియు నొక్కొకచోట మహితనాట్యములు । మెఱయుఁచు నప్పుడు మృగవిలోచనలు
కాంచనలీలఁ జొక్కపుఁ జనుదోయి । మించులు పచరించు మెఱుపులై తారు
పరవశంబున ప్రోయు పసినిమట్టియలు । వెరవొప్ప నురుములవిధముగావించు,
రుచిరగానము సేయు రూపసుందరులు । కచభారములు మేఘగతులు గావింపఁ
జెలువమై యొలికెడు శృంగారరసము । పలుచని వానగాఁ బ్రస్తుతింపుదురు. (తం. ప్రతి.)

8. [illegible]. 9. రాదులకు. 10. సంప్రీతి. 11. శిరవత్కులై. 12. వార. 13. చారు. 14. నందు.

ప్రతిమహీధరమును బ్రతి[1]పాదపంబుఁ । బ్రతిలతాకుంజంబుఁ బ్రతిగృహాం[2]గణము
వెదకి పల్లంబులు వెదకి దీర్ఘికల । వెదకి నిర్ఘరముల వెదకియుఁ, బోక
వరమునులనక యన్యుల బోయలనక । తెరువరులనక శోధించి శోధించి,
యొకచోట నరదంబు లాగి నేఁగుచొప్పు । ప్రకటించి కని కూడఁబాఱుచో, నవియు
రథికశూన్యములైన రాజేంద్ర, మేము । పృథయైన[3]వేడ్కతో వెసఁ గూడఁబోక
[4]యంతనంతను బోవ, నవియు ద్వారకకు । నెంతయు వెస నేఁగె; నేము బోయి
వీథుల నుద్యానవీథుల సౌధ । వీథుల వీక్షించి వెసఁ గానలేక

మత్స్యపురిని బుట్టిన వింతలు వేగులవారు దుర్యోధనున కెఱిఁగించుట

తడయక మఱియు భూతలములపై [5]వెదలి । యుడుగ కూఱటలేక యోలి [6]నందఱము
బయలును [7]వనముగా భావించి [8]యరసి, । నియముతో గొందియు రచ్చగా వెదకి,
చెలమయు [9]జలధిగాఁ జింతించి [10]తడవి, । వెలుఁగును దమముగా [11]వివరించి నెమకి,
యేయుపేక్షయులేక యెఱుకపల్లియును । బాయక పురముగా భావించి తిరిగి,
పాండవులను [12]వార్తఁ బడికింపలేక । [13]యొండొకచో నంత నొనఁగూడి యేము
దేవ, నీకెఱిఁగింపఁ [14]దిరిగి వచ్చితిమి ; । భావింప ధర లేరు పాండునందనులు.
మఱియొక్క-చిత్రంబు, మత్స్యభూపాలు । మఱఁది గీచకు [15]నొకమగువకై [16]పట్టి
నడురేయి గంధర్వనాథు లేకతమ । కడఁగి కైదువులేక ఖండించివైచి
కరములుఁ బదములు ఘనమస్తకమును । గరమర్థితో వానికడుపులోఁ [17]ద్రోచి
విపరీతగతి మత్స్యవిభుఁడు శోకింప । నుపకీచకులఁ జంపి రొక[18]నిఁ బోనీక.
ఆ నృపాలుండు మీకహితుండు గాన । వాని[19]నేగియుఁ జెప్పవలసి చెప్పితిమి.
[20]ఏరీతి వెదకెద మింకఁ బాండవులఁ । గౌరవేశ్వర, మమ్ముఁ గరుణించి యనుపు."
అనవుడు నొఁగాక యని సుయోధనుఁడు । పనిగొన వారి నప్పటికిఁ బోననిపి
తడవుగాఁ జింతించి తనమంత్రివరులఁ । దడయక వీక్షించి తగ వేది పలికె:
"ఎలమిఁ బాండవులకు నిర్యోఁటి[21]తోడఁ । దలకొన్న సమయ[22]మంతయు నిండఁగలదు;

---

1. పదార్థంబు. 2. వఖులు. 3. వీక్షించి వే. 4. యంతంతఁ బోవ నే మవియు. 5. వెదకి. 6. నంతరము. 7. బయలుగా. 8. వెదకి. 9. గుంటయు. 10. యరసి. 11. వీక్షించి. 12. వారి భావంబు. 13. యొండొండ నేమంత నొనఁగూడి యేము. 14. దిరిగి. 15. డొక. 16. పట్టి. 17. దూర్చి. 18. యింతికొఱకు. 19. నెఱిఁగి. 20. భావింప ధర లేరు పాండునందనులు । దేవ, నేమెంతయుఁ దెలిసిన విధము । ఏరీతి. 21. లోన. 22. ంబు తగ.

నిండకమున్నె మున్నిటియట్ల వారి । నుండఁజేయుట కార్య ముగ్రాటవులను ;
కాకున్న [1]రాజ్యభాగంబుఁ దెమ్మనుచుఁ । జేకొని జగడంబు సేయుచుండుదురు ;
ఏరూపమున వారి నీక్షింపవచ్చు । నారీతి [2]నెఱిఁగింపుఁ డాత్మఁ [3]జింతించి."

### పాండవులయునికిఁగూర్చి దుర్యోధనుఁడు కర్ణాదులతో నాలోచించుట

అనుటయు రాధేయుఁ డవనీశుతోడ । విన నిచ్చ[4]యగుమాట వేడ్క నిట్లనియె :
"చారు[5]లు వివిధసంచారులై [6]వెదకి । పేరుగల్గినయట్టి పృథివీశులొద్ద
వికృతవేషముదాల్చి విహరింతురేని । నొకనాఁట నఱనాఁట నుదయించువార్త."
అనిన కర్ణునిమాట లాత్మఁ గైకొనక । కనుఁ[7]గవ గర్వంబు కాలుద్రవ్వంగ
దుర్యోధనునిఁ జూచి దుశ్శాసనుండు । కార్యంబు తెఱఁ గింతఁ గాన కిట్లనియె :
"ఆ పాండుతనయుల నరయఁబోనేల ? । దూపి[8]లి దుష్టజంతువులచేఁ జిక్కి
వారు చచ్చినయట్టి వనభూములందుఁ । బూరియు నీకలుఁ బొడమ నింతకును ;
ఏకశాసనముగా నెల్లరాజ్యంబుఁ । జేకొని పాలింపు చింతింపనేల ?"
అనవుడుఁ బలికె ద్రోణాచార్యుఁడపుడు : । "మనుజేంద్ర, యువరాజుమాట గైకొనకు ;
వారేల చత్తురు ? వా రనాచార । దూరులు ; భయ[9]రోగదూరు లెంతయును ;
దైవ[10]బలంబు నుత్తమ బాహుబలము । నావీరులకుఁగాని యమర వెవ్వరికి ;
ఒప్పఁ జంపునె వారి నుగ్రజంతువులు ? । నిప్పున కీఁగలు నేర్చునే ముసర ?
ఆమాటలేటికి ! నా పాండుసుతుల । భూమిపై [11]వెదకింపఁబుచ్చు కాదనక."
అనిన భీష్ముండు ద్రోణాచార్యుమాట । విని సంతసించి యవ్విభుఁజూచి పలికె :
"కలశ[12]సంజాతుఁ డొక్కఁడ నిక్కమాడె ; । కలవారిలోనెల్లఁ గార్యజ్ఞుఁ డితఁడు.
దైవబలాఢ్యు లెంతయుఁ బాండుసుతులు । కావున వెదకియుఁ గానంగలేరు ;
మీరని వారని మేము భేదింప । నేరము విను రెండునేత్రంబులట్లు ;
అవనీశ, నీవు మమ్మడిగితిగాన । వివరింతుఁ గార్యంబు వెనఁ దోఁచిన[13]ట్లు.
తెలియుము వా రుండు దేశంబునందుఁ । దలపోయఁ [14]దఱుఁగని ధాన్యంబుగలుగు ;

---

1. రాజ్యభాగంబుఁ దెమ్మనుచు. 2. నెమకింపు. 3. నూహించి. 4. మాటగా. 5. లై. 6. వారు. 7. గొని. 8. లు. 9. లోభ. 10. ంబు బలము. 11. వెదకంగఁ బుచ్చంగవలయు, 12. సంభవుఁడు నొక్కఁడు. 13. ంత. 14. దొఱ.

కాలవర్షంబులు గలిగి [1]ధారుణిని । జాల సుభిక్షమై జనము వర్థిల్లు;
[2]గురు మంత్ర పితృదేవ గోబ్రాహ్మణులకుఁ । జిరకాలమును భక్తిసేయుచుండుదురు;
అది[3]గాక గోవు లియ్యాకాలమనక । పిదుకు నూరకయైనఁ బెరుగు నర్థములు;
అట్టిదేశంబు లెయ్యవి మీరు వారి । నట్టిచో వెదకిం[4]పుఁ డపుడు తోఁచెదరు."
అనినఁ గృపాచార్యుఁ [5]డవనీశుఁ జూచి: । "మనుజేంద్ర, మీరేల మసలుచున్నారు?
వనమునఁ బన్రెండు వత్సరంబులును । జన గోప్యమున నొక్క సంవత్సరమును
నియతితో నిండించి నేఁడెల్లి వారు । రయమొప్పఁ గోపించి రానున్నవారు;
ఈలోపలనె వారి నీక్షించు తెఱఁగు । వాలాయము[6]గఁ జేయవలయుఁ [7]జేసినను;
[8]అదిగాక మనబలం బాయత్తపఱచి । పదిలమైయుండు[9]ట భావ్యంబు చూడ;
సైన్యంబు రప్పింపు సఖుల రప్పింపు । మాన్యుల రప్పింపు మనుజేంద్ర, నీవు;
[10]పాండవు లననేల పగవారు మఱియు । నొండొకరైన నుద్యోగంబు వలదె?"
అని యిట్లు తమబుద్ధు లర్థి [11]నందఱును । వినిపించుటయును భూవిభుఁడు చింతించి
కార్యంబు తుదఁ[12]గాంచి కర్ణాది రథిక । వర్యుల వీక్షించి వలనొప్పఁ బలికె:
"బలుఁడు భీముఁడు సింహబలుఁడు శల్యుండు । నిలలోన సమ[13]సత్త్వు లిద్ధసాహసులు;
వీరిలోపల వీరె వీరి చావులకుఁ । గారణంబులుగాని కా రన్యజనులు.
కీచకుచావు దాఁ గిమ్మీరవైరి । మోచినపనిగాని మోసంబుగాదు;
ఆ యింతి ద్రౌపది; యతఁడు వాయుజుఁడు; । వేయునేటికి మీకు విశదంబుగాదె?
గంధర్వులను [14]పేరఁ గనలి కీచకుని । బాంధవ[15]యుతముగాఁ బరిమార్చె నతఁడు;
ఈ భీముఁ డాడిన యన్ని[16]చిన్నెలును । శోభిల్లు విరటుండు సుఖ[17]ముండు పురిని;
కావునఁ బ్రచ్ఛన్నగతిఁ బాండుపుత్త్రు । లావిరటుని[18]పీట నర్థి నున్నారు;
విరటుండు మనకును విద్వేషిగానఁ । దరమిడి [19]వానిపై దాఁడిపోవచ్చు;
పోయి గో[20]గణములఁ బొదివిపట్టుటయు । నాయెడ యమసూనుఁ డడ్డమైవచ్చు;

1. ధారణలఁ. 2. పరమంత్ర దేవతా బ్రాహ్మణాదులకు. 3. యేల. 4. ప నయ్య. 5. డపు డూహచేసి. 6. న. 7. సెంతయును. 8. అదియేల ప్రజ గట్టి మాయత్త. 9. డు పని చాలఁ గలదు. 10. వడి వారు సమయంబు బాసమై సెఱపి । కడఁగి కయ్యమునకుఁ గాలు ద్రవ్వుచును,
రా నేమిచేసెదు ? రహి యుద్ధమునకుఁ । బూనంగవలె శాంతి పొసఁగకుండినను; (ముద్రితము) పాండవు లననేల. 11. నిద్దఱును. 12. దోఁచి. 13. బలులిట్టి. 14. పేరుగలిగి. 15. సహితంబు. 16. చిన్నెలును. 17. మున్నవాఁడు. 18. ప్రోల. 19. యతని. 20. ధనముల.

వచ్చిన నజ్ఞాతవాసభంగంబు । చెచ్చెర నెఱిఁగించి శీఘ్రంబె వారి
నడవికిఁ దొల్లిటియట్ల పోఁ[1]బంచి । పుడమి [2]గైకొందు నిప్పుడు మీరు మెచ్చ.
కౌంతేయు [3]లరయ నక్కడ లేకయున్నఁ । జింతింప విరటుని సిరి [4]దక్కు మనకు.
ఇది కార్యమని మీర లిచ్చ వాటించి । కదలుఁడు మేలు గాఁగలదు మీఁదటను.”
అనవుడు విని త్రిగర్తాధీశుఁడైన । ఘనుఁడు సుశర్మ దిగ్గనలేచి [5]ప్రమొక్కి
యువరాజకర్ణులు నొగి సమ్మతింప । నవనీశుతోడ నిట్లనియెఁ గేల్మోగిచి :
“దేవ, మున్నొకపరి దివిరి కీచకుఁడు । నావంకఁ బగమోచి నన్ను [6]భగ్నించె;
చేతప్పి వాయుజుచేఁ జచ్చె వాఁడు ; । ఆతనితో నాకు నని లేకపోయె.
నాఁటి [7]రోషము మత్స్యనాథుపై నేన । నాటింపనోపుదు నను [8]బంపవయ్య.
ఒనర నాజీతపుటూళ్లలో [9]సతఁడు । తనకుఁ గానుకలెత్తుఁ దగదన్న వినక.
పసుపు గోవులఁబట్టి పాండునందనులఁ । గనివత్తు విరటుభాగ్యము చూఱఁదెత్తు.”
అనవుడు భూపాలుఁ డనుజు వీక్షించి । ఘను ద్రోణు నీక్షించి కర్ణు [10]నీక్షించి :
“సభవారు మీరు సుశర్మవాక్యముల । రభసంబు వింటి రూరకయుండవలదు ;
ఇదికార్యమనిచెప్పు ; డిది నాకుఁజూడఁ । గొదలేదు విరటు మాఱ్కొనఁ[11]జాలు నితఁడు ;
చతురంగసన్నాహ సహితుఁడై [12]యిపుడు । జగనమై ముందట [13]సాఁగిపోయటకు
మొదవులఁబట్ట, నిమ్ముల మత్స్యవిభుఁడు । కదనంబునకు వచ్చుఁ గలసేన గొంచు ;
మఱునాఁడు మన మేఁగి మఱికొన్ని పశులఁ । గొఱలేనిపసఁ బట్టి కూఁతవేసినను
ఆవేళ దొరలెల్ల నచ్చోట లేమిఁ । దాఁవచ్చు నడ్డమై ధర్మనందనుఁడు ;
ఈ వార్త ధరణిపై నెసఁగకమున్న । వేవేగఁ బయనమై వెసఁ బోవవలయు ;
ఆయన కృష్ణపక్షాష్టమినాఁడు । పోయిన, మఱునాఁడు పోదమిందఱము ;
మీకుఁ గాదనరాదు మెఱసి నామాట । కాకున్నఁ జెప్పుఁడు గానిచందంబు.”
అనిన భూపతిబుద్ధు లందంద పొగడి । యనుమతించిరి మంత్రు లాకార్యమునకు.
[14]తమి ధార్తరాష్ట్రులు ధర్మజాదులను । నెమక నెన్నిరిగాని నెఱి వారలప్పు
డొరులెఱుంగనియట్టు లుండునయ్యేఁడు । నరుదుగా నిండెనం చరయలేరైరి.

---

1. ననిపి. 2. జేకొంద మప్పుడ యటుగాక. 3. లిప్పు డక్కడ. 4. యబ్బు. 5. యపుడు.
6. భంజించె. 7. కోపము. 8. బుచ్చు. 9. నెపుడు. 10. నిం గాంచి. 11. నోపు.
12. యితఁడు. 13. సాఁగుటయొప్పు । ననిన భూపతి బుద్ధు లందంద.
14. నాఁటి నిరుద్ధంబునకు మత్స్యనగర । నేఁటికిఁ గొఱఁతగా నెల్ల నిండించి
యున్న పాండవుల నుద్యోగించి చూడ । నెన్నిరిగాని తారెన్న రెన్నఁడును.

## దక్షిణ గోగ్రహణము

ఆ సుశర్మయు భూతలాధీశుఁ డనుపఁ । జేసేత యుద్ధంబుసేయు వేడుకను
సుభటులు విలుఁగోల జోడు పక్కెరల । విభవంబుగాఁ [1]దాల్చి వెనువెంట రాఁగఁ
బటహ కాహళ శంఖ[2]పటుఘోష మెడలి । కిటుకున బిరుదు టెక్కెములతో నెడలి,
వెడలిసపయనాన విడియకెచ్చోట, । పిడికిసఁ గొదలేక వేగంబె కదలి,
పయనంబు నిమ్మపైనఁ బ్రజ నొవ్వనీక, । [3]రయమొప్పఁ జని మత్స్యరాజ్యంబు గదిసి
వేగులవారిచే విరటభూపాలు । గోగణంబులు నున్న గుఱుతు మున్నెఱిఁగి,
కోలాహలముచేసి కూడంగఁబాఱి, । యాలమూఁకలమీఁద నాక్రమించుటయు,
గోపాలకులు లేచి [4]కోపంబులడరఁ । జాప ముద్గర కుంత శరపాణులగుచుఁ
[5]గాచుచు బలపరాక్రమములు [6]నూపఁ । జూచి సుశర్మ నిష్ఠురబాణతతుల
నేసి నొప్పించె ; ననేకరావుతు[7]లు । చేసూపు తమనాథు సెలవు గైకొనుచు
నీసుమై వారల నేసి యార్వఁగను । గాసిల్లి గోపవర్గము నిల్వలేక
నెత్తురు వఱద[8]గా నేల గ్రక్కదలఁ । దుత్తుమురై పాఱి దుఃఖంబుతోడ
విరటభూపతిఁ గాంచి వినతులై [9]భీతిఁ । గరపద్మములు మోడ్చి కడఁక నిట్లనిరి :
" దేవ, [10]త్రిగర్తులే తెంచి యుద్ధమున । గోవులఁ బట్టి యాక్రోశంబు నెఱపి
గజ వాజి రథ యోధగణములఁ [11]గూడి । యజితులై మమ్ము నాహవభూమి గెలిచి
పోవుచునున్నా[12]రు భుజశక్తి మెఱసి ; । దేవర, యింక మీ దివ్యచిత్తంబు."
అనుటయు మీసంబులదరఁ గోపించి । [13]కనుఁగొని వారితో ఘనత నిట్లనియె :
" ఎట్టెట్టురా ! త్రిగర్తేశుండు పసులఁ । బట్ట నెట్లోపెరా భయ మింతలేక !
పట్టిన విధియాజ్ఞ పట్టేఁ గాకేమి । పట్టి చంపఁగ నాకుఁ బట్టయ్యె నిపుడు.
ఓ మంత్రులార, మీరుగ్రవేగమున । నేమించి రథయోధనికరంబుఁ గూర్చి

---

1. గూర్చి వీరవేషమున. 2. పణవమృదంగ । కిటకాంగ బిరుదు టెక్కెములతో జెపలి(?) పటుఘోష రవము । కిటధాత్రిగ్రుంగ(?). 3. నయమునఁ జని మత్స్యనగరంబు చొచ్చి. 4. కోపవేగమున.
5. బలపరాక్రమముల బవరంబు సేయఁ । జూచి సుశర్మ నిష్ఠురబాణతతుల । చేచూపి వారిపై సెలవులు పెట్టి।గాసిల్ల గోపవర్గము సెల్లఁ బొడిచి । చేసిరి తమలోనసింహనాదములు। నెత్తురువఱద లై (తం.ప్ర.)
6. సేయ. 7. ల । చేసూపి వారల సెలవుగా విడువఁ । గాసిల్లి గోపవర్గము (ఓరియంటల్ ప్రతి).
8. లై. 9. వారు. 10. త్రిగర్తుఁ డే తెంచి. 11. తోడ । నజితులౌ మమ్ము. 12. ఁడు. 13. కను లెఱ్ఱవాఱ పై కంపంబునొంద,

వయనంబు సేయుఁడు భయదాట్టహాస । భయద భేరీ భూరి భాంకృతు లెసఁగ;
పోటుమానుసులెల్లఁ బురి నుండ[1]కుండఁ । జాటించి [2]పిలువుఁడు సంగ్రామమునకు;
భూరి శస్త్రాస్త్రాళిఁ బొలుపారునట్టి । తే రాయితముచేసి తెండు నేర్పునను."

## విరటుఁడు సుశర్మ నెదిరించుట

అనిచెప్పి విభుఁడు తా నఖిలసత్త్వమునఁ । గనకనిర్మిత వజ్రకవచంబుఁ బూని
[3]మించినహయముల మెఱుఁగుకైదువుల । నంచిత శృంగారమగు రథంబెక్కి
[4]వారణ బృంహితధ్వనుల నంబుధులు । [5]బోరుకలంగ నార్పులు మిన్నుముట్ట
గోవులేఁగినత్రోవ గోపాలసమితి । భావిం[7]చి యడుగుచుఁ బదిలమై [8]కదలె;
అంత నాతనితమ్ముఁడగు శతానీకుఁ । డంత[9]కాంతకమూర్తి యగుచుఁ గోపించి
పటు[10]ఘోటకవ్రాత భటమహార్భటము । లటునిటు [11]గ్రమ్మ బ్రహ్మాండంబు [12]పగుల,
సన్నుతరథమెక్కి శస్త్రాస్త్రనికర । సన్నద్ధుఁడై యుద్ధజయకాంక్ష వెడలె;
అతిఘోర గజయూథ మర్థితోఁ గొలువ । నతనితమ్ముఁడు మదిరాస్యుండు వెడలె;
ఆతని యనుజన్ముఁడగు సూర్యదత్తుఁ । డాతతసైన్య [13]దివ్యాస్త్రుఁడై వెడలె;
వరుసతో నంత భూవరు పెద్దకొడుకు । చరితా[14]ర్థతేజుండు శంఖునామకుఁడు
[15]హారిరత్న ఘనహీర హారమంజీర । [16]శరకంకణాంగద కరయుక్తుఁడగుచు
లావణ్యమెసఁగఁ దెల్లనిజోడు[17]దొడిగి । వేవిధంబుల [18]మత్స్యవీరులు గొలువఁ
బదిగుఱ్ఱములనొప్పు పసిఁడితేరెక్కి । కదలెఁ గోపముతోడఁ గదనంబుగోరి.
ఎలమితో మఱియు ననేకబాంధవులు । గొలువ భూపాలుండు కొంతదవ్వేఁగి
నెలకొని సేనలన్నియు వచ్చుదాఁక । నెలవుగా నొకచోట నిలిచియుండుటయు,
భీమ మాద్రేయులు పిఱుఁద నేతేరఁ । దా మును జనుదెంచి ధర్మనందనుఁడు
[19]సరభసరణమహోత్సాహంబు మెఱసి । విరటుఁ దప్పక చూచి వెరవొప్పఁ బలికె:

---

1. నీక. 2. పెడలింపు సమరంబుకనుచు । మించిన హయముల. 3. కాంచనధ్వజములు గలిగి. 4. దారుణ. 5. బోగుసఁ గలఁగ. 6. చోటు. 7. ప సేనతో. 8 వెడలె. 9. కోపముఁడాచు నతికోపమునను; కాలాంతకుం డనఁగఁ గోపించి. 10. రోషకాహాళ పటహార్భటములు । నటు. 11. చెదరి. 12. గలఁప. 13. విహారుఁడై. 14. త్మ. 15. హారిరత్నోదార. 16. కారణ కంకణ కర భూగుండగుచు. 17. పెట్టి. 18. మ్లేచ్ఛ. 19. సరభసంబున రణసన్నాహమొప్ప.

## ధర్మజాదులు విరటునకు రణసహాయులై వెడలుట

"నరనాథ, విను మున్ను నాకొక్కమౌని । తిరమైన మంత్రోపదేశంబు చేసె;
ఆ మంత్రశక్తిచే నాహవక్రీడ । [1]నే మునుపొక్కింత యెఱిఁగియుండుదును.
గోవుల విడిపింపఁగోరి యీరీతి । [2]నీవు సేనలఁ బోవ [3]నేను రావలదె?
వలలునిలావు నెవ్వారెఱుంగుదురు? । తలకొని యతఁడు యుద్ధముసేయుటొప్పు;
మతిఁదలపోయ దామగ్రంథి శూరుఁ । డతఁడు యుద్ధముసేయ నరుదెంచుటొప్పు;
తేజంబుగల్గు తంత్రీ[4]పాలుఁ డెప్పుడు । నాజి దుర్జయుఁడౌట నతఁడు రావలయు;
వీరిలావులు మున్ను వివరించినాఁడ । వీరికి రథములు వేగ దెప్పింపు."
అనవుడు నౌఁగాక యనుచు భూపాలుఁ । డనుజన్ముఁడైన శతానీకుఁ జూచి
రథములు [5]నాలుగు రమణఁ దెప్పించి । ప్రథిత శస్త్రాస్త్ర వర్మంబు లిమ్మనిన
వాఁడును [6]దెప్పించి వరుసఁ బాండవులఁ । బోఁడిమిగాఁ బురంబునకుఁ [7]దోడ్తెచ్చి
నవరణలన్నియు నరగ నిప్పించె; । వివిధాంబరంబులు [8]వెలయఁ గైసేసి
యారూఢమతితోడ నరదంబులెక్కి । సారథ్యములు తారె చక్కఁ బెట్టుచును
అనయంబుఁ గురుసేన నాపోశనంబు । గొనునంత వేడ్కఁ గైకొనిరి పాండవులు.
[9]అప్పుడు రణభేరు లందంద మ్రోయ । నుప్పతిల్లిన ధూళి యుడువీథి నిండ,
నుదధులు ఘోషింప నుర్వి కంపింపఁ । గదలె భూపాలుండు ఘనసేనతోడ.

## ఉభయసైన్యములు సంకులముగాఁ బోరుట

వెన నిట్లు [10]వెడలి యవ్విరటుసైన్యంబు, । దెసలు చిల్లులువోవఁ దివిరి యార్చుటయు,
[11]ఆ త్రిగర్తులసేన లటపోక నిలిచి । చిత్రలాఘవ [12]సత్త్వ శీఘ్రయానముల
వలనొప్పఁ గోపించి వచ్చి తాఁకుటయు । నెలమితోఁ దల[13]పడి యిరుసేన లపుడు

1. నేమైన నొక్కింత. 2. మీరు. 3. మేము. 4. పాలకూరుఁ । డాజి (కిఁ బయనమై) దుర్జయుఁ డౌట. 5. నాల్గు వీరలకు నిప్పించు । మధికశస్త్రాస్త్ర మైమరువు లిప్పించు । వాఁడును (తం. ప్రతి.). 6. చనుదెంచి. 7. రప్పించి. 8. వేస్కఁ గైకొనుచు. 9. అప్పుడు రథ (ములఁ నవని) వార మవనిపైఁ (మ్రోయ) బోవ నుప్పతిల్లినధూళి యుప్పరంబులము । నుదధులు. 10. వెడలి యవ్విరటుసైన్యంబు. 11. గురుసేనలను గూడ ఘోషంబుతోడ । విరసముతోఁ దవిలి వెన్నడింపఁగను. 12. మున సేనలన్నియును. 13. పడి రిపువాగు లపుడు.

శింజినీటంకార సింహనాదములఁ । గంజజాండము నల్లకల్లోల[1]పఱచి
మెఱుఁగువాలమ్ము[2]ల మెఱుఁగుశూలము[3]ల । మెఱుఁగునారసము[4]లమెండుగాఁ[5]గప్పి
పటుఖడ్గములఁ[6]నొంచి పరిఘలఁ [7]ద్రుంచి । చటులచక్రంబులఁ జక్కుగా నఱికి
వడిఁ బ్రాసము[8]ల వైచి వజ్రంబులాని । యడిదంబులను హతాహతముగా [9]వేసి
చూరకత్తుల [10] ముత్తి సురియలఁ గూల్చి । తోరంపు[11]శక్తులఁ ద్రుంచి [12]తూటాడి
ఘోటకంబులఁ దోలి గురుశక్తి మెఱసి । వేటారుతునియలై వెస డొల్లనేసి,
హేషారవంబుల [13]నిభకింకిణులను । ఘోషంబు మేఘనిర్ఘోషమై [14]వెలయఁ,
గరుల [15]డీకొల్పి వ్రక్కలుగాఁగ నేసి । [16]కెరలుచుఁ బొఱుచు ఘీంకారమెసఁగ
గదలు ముద్గరములుఁ గడఁకతోఁ ద్రిప్పి । [17]మెడదూడిపడఁ గొట్టి మెఱసి వెండియును
రథములు పఱపి సారథుల రథ్యములఁ । బృథివిపైఁ బడవైచి [18]పేరువాడియును
నాగనాగతోఁ దాఁకి నుగ్గుగా విరుగఁ । దెగువతో వేఱొక్క తేరు సంధించి
పోరాడి రివ్విధంబున రెండుతెగల । వారును [19]జతురంగవైభవంబెసఁగ.
అప్పుడు సేనల నన్యోన్యహతుల । [20]ముప్పిరిగొనుమూర్ఛ మునుఁగు సద్భటులు,
ఇరుమేను దున్నిపోయిన నారసములఁ । దిరమైన గుండెలు తెగి చచ్చువారు,
పక్కెరల్ వ్రక్కలై పల్లంబు లూడి । యెక్కిన రౌతుల నిలఁ బొఱవైచి
పాఱెడువాజులుఁ, బదిదిక్కులందు । సారెసారెకుఁ బడి చచ్చు నశ్వములు,
తురగంబు [21]కూలఁ దోడ్తోఁ గాళ్లువిరిగి । యరుగనోపక దీనులై నరావాహుతులు,
[22]నుదరి డీల్వడి పడియున్న కాల్బలముఁ, । జిదిసి పోలేక చెచ్చెరఁ గూలు కరులు,
నఱిముఖినుండి యాయము చోటు దాఁకి । కొఱప్రాణములతోడఁ గూలు మావటులు,
రయమేది కీలూడి మ్రగ్గు తేరులును, । భయమున మ్రాన్పడి పడిన మావులును,

---

1. మయ్యె. 2, 3, 4. లు. 5. గప్పు. 6. ద్రుంచి. 7. జించి. 8. లు. 9. నఱికి.
10. చేత. 11. గత్తుల. 12. చెండాడి. 13. నిద్ధ. 14. బెలుఁగ. 15. గీల్కొల్పి. 16. గిరమించి.
17. మెదడు వెల్వడ నెత్తిమీఁద వేసియును. 18. పేటాడి యంత. 19. జయకాంక్ష వర్ధిల్లనంత.
20. సర్పమై కెడసి మూర్ఛలనొందు భటులు । ఇరుప్రక్క డస్సిపోయినరౌతుతోడ । పరగ గుండెలు తెగి చచ్చు నశ్వములు । పక్కెరల్ వ్రక్కలై పల్లంబులూడి । యెక్కిన భటుపైచి యేఁగు గుఱ్ఱములుఁ । దురగంబు కూల (ముద్రితము).
21. కూలఁచో దొడగాళ్ళు పడుచు.
22. రయమేది రథములు రథములఁ దాఁకి । బయలనఁ గీలూడిపడిన రథ్యములు । రథములు గూల.

[1]రథములఁగూల సారథులఁ బోవిడిచి । ప్రథనంబునకు నోడి పాఱు యోధులును,
గలిగియు నిస్సాణ కాహళధ్వనులు । కలయఁ బర్వఁటఁజేసి కదన మొప్పారె.
అంత నింద్రుఁడు విమానారూఢుఁడగుచు । నంతరిక్షంబున నరుదెంచి నిలిచి
సురసిద్ధసాధ్యులు సొంపుగాఁ గొలువఁ । బరఁగిన వేడ్కఁ దప్పక చూచుచుండె.
అరులపైఁ గోపించి యా శతానీకుఁ । డరదంబు దోలించి యర్కుఁడో యనఁగ
నంధకారముఁ బోలి యరుదెంచుచున్న । సింధురములఁ బట్టి చించి చెండాడి,
కాలు[2]బలంబుల ఖండించివైచి, । నేలఁ [3]గాలువలుగా నెత్తురుల్ వఱపి,
మఱియు నంతటఁబోక మహితా స్త్ర[4]తతుల । నెఱి నాటనేయుచు నిమిషమాత్రమునఁ
దురగాళి, సూత కేతువులతోఁ గూడ । ధరఁ గూల్చె నూఱురథంబులవారి.
మదిరాస్యుఁడును గోప[5]మథితాస్యుఁడగుచుఁ । గదనంబునకును జక్కఁగఁ దేరు[6]వఱపి
బహుగుణధ్వనులచేఁ [7]బగిలి పాతాళ । కుహరంబు రోదసీకుహరంబు [8]చెదర,
జడిగాఁగ రిపులేయు శరపరంపరలు । నడుమనే [9]తుమురుగా నఱకివైచుచును
రూపించి [10]యోధవీరుల నోలిఁ [11]దాఁకి । చాప[12]కట్టుగఁ గూల్చి చమరిచెండాడి
రయమొప్ప నన్నూఱురథములవారి । దయలేక క్రొవ్వేల్మిడిఁ దఱిమి [13]సాధించె.
[14]ఆ సూర్యదత్తుండు సాహసోత్సాహ । భాసురమూర్తియై బవరంబుసేసి
రథనేమిఘాత నిర్యాతమై ధూళి । పృథివికి మింటికి భేదంబు మాన్ప,
పరశు తోమర[15]ములఁ బట్టసంబు[16]లను । శరములపఱపున శత్రుసైన్యములు
వెఱచియు మఱచియు వెసఁగావు[17]మనుచు । నఱచియుఁ బఱచియు [18]నటఁ గూడఁబడఁగ
నెదురైన రథికుల నెదురైన కరుల । నెదురైన యోధుల నిలఁ గూల్చుచుండె.
శంఖుండు నడరి నిశ్శంకమార్గమున । [19]శంఖంబు పూరించి సంకులంబెసఁగ

1. రథికులు దెగిన సారథి భయమంది । ప్రథనంబు చాలించి పాఱుతావులును (?) (రావుతులు) యోధములు — గలిగియు.

2. బంటులనెల్ల. 3. పై వఱదగా. 4. రుచుల. 5. మహితా. 6. గడపి. 7. బరఁగి. 8. నిండ. 9. తునియఁగా; తునుకగా. 10. రథిక. 11. సోల. 12. కట్టయి పడఁ జంపి నుగ్గాడి. 13. పోకార్చె.

14. శౌర్యంబు మెఱయంగ సత్వసంపదలఁ । ధైర్యసంపత్తియుఁ దనరార నతఁడు, భాసురకీర్తిమై బవరంబు సేయు । నా సమయంబున నల్లిబిల్లి కొనెఁ । బృథివియు మిన్నని భేదింపరాక । పృథు రోచు లంతట బెరయనించుచును । బరశు తోమర.

15. శూల. 16. లను. 17. డనుచు. 18. నలుకువ పడఁగ. 19. శంకింపఁ బెంధూళి.

జడధిలో మందరశైలంబువోలెఁ । [1]గడిమిమై రిపుసేనఁ గలఁచి యాడుచును,
అలుగులు [2]వఱదగా నాహవక్షోణి । గలయఁ గప్పిన దేవగణమెల్ల నార్చె ;
ఆడె నారదమౌని ; యప్సరస్స్త్రీలు । [3]పాడిరి ; యముఁ డంత బాహాస్ఫాళించె.

## విరాట సుశర్మల సమరము

ఈరీతిఁ దమ్ములు హితులు నందనులుఁ । బోరాడఁ గని మత్స్య[4]భూమీశ్వరుండు
భుజములు మూఁడుగాఁ బొంగి యుప్పొంగి । నిజసారథి[5]కి నేర్పు నెఱయ నిట్లనియె :
“సారథి, నీనేర్పు సకలంబు నిపుడు । పోరిలో [6]నాకుఁ జూపుదుగాక నీవు ;
ముందట నదె [7]కంటె మొన గానవచ్చె । నందులో నదె త్రిగర్తాధీశుపడగ ;
ఆ దిక్కునకుఁ[8]గాఁగ నరదంబు గడపు । భేదించి చొచ్చి నిర్భేదింతు [9]వాని.”
అనుటయు వాఁడు యుగ్యముల పగ్గములు । గనుకని విడువ నగ్గలికతో రథము
[10]నుప్పరంబెగసి యత్యుగ్రవేగమునఁ । దప్పక చనెఁ ద్రిగర్తాధీశుమీఁద.
విరటుండు నిజబాహువీర్యంబు మెఱయ । నరదంబు లేనూఱు హతముగాఁ బొడిచి
[11]తప్పిదారఁగనీక దంతిఘోటకము । తెప్పకాలై పడఁ దెగవ్రేయుటయును,
తేజంబు విరటుని తెగువయుఁ జూచి । యాజికి సన్నద్ధమై మత్స్యబలము
క్రోడ దిగ్గజ నాగ కూర్మంబు లదరఁ । గూడి [12]యొక్కట నిండి ఘోరమై నడువ,
నిలువనేరక పాఱు నిజసేనఁ జూచి । పలికెఁ ద్రిగర్తాధిపతితమ్ముఁ[13]డొకఁడు :
“ఎక్కడఁబోయెద రేనున్నవాఁడ ; । [14]ముక్కడిముగురికై మొగిఁ బాఱనేల ?
[15]తానసంబొగి నేర్పు కార్చిచ్చుపగిదిఁ । [16]బూని వైరులనెల్లఁ బోరిలో సణఁతు ;
తిరుగుఁడు మీరెల్ల ధీరులై యిపుడు । గరుడునిక్రియ నేను గయ్యంబు సేతుఁ

---

1. కడఁకమై. 2. వఱపంగ. 3. నాడిరి పాడిరి యతిమోదమునను. 4. భూమింజయుఁడు. 5. నిఁ జూచి నెటి నిట్టులనియె. 6. మాకు. 7. గట్టి. 8. బోవ. 9. గాని.
10. నొప్పారఁ బఱచి యత్యుగ్రవేగమున । నప్పుడె చనఁ ద్రిగర్తాధీశుమీఁద । విరటుండు.
11. తెప్పలై ధరఁగూలఁ దెగవ్రేయుటయును । కుప్పించి యరులపై ఘోరంబుగాను । రాజా దాఁ బోయెడు రండు రండనుచు । నాజికి సన్నద్ధమై (ముద్రిత ప్రతి).
12. సైన్యంబుల ఘోషంబుతోడఁ । జేరి పోరఁదొడంగి శితశస్త్రహతుల । గారింప బలమేసి కదనంబు నందు । నిలువనేరక (ముద్రిత ప్రతి).
13. గొడుకు. 14. ముక్కంటినైనను మొనఁ గూల్పనేర్తు. 15. కారణంబునఁ బేర్చు. 16. భూరి

గడఁక [1]రం." డని పల్కి ఘనకోపమునను । గడునెఱ్ఱనైనట్టి కనుదోయితోడఁ
[2]బటుతరంబగునట్టి పట్టంబు మెఱయఁ । జటులమేఘముపోలెఁ జాల గర్జించి
యరవాయిగొనక బాహాశక్తి మెఱసి । తరవాయిగొని వైరిదర్పంబు మాన్ప
నేలికఁ [3]బోడగని యెల్ల [4]సైనికులు । నాలంబు సేయుదమని [5]పూని నిలిచి
జలనిధితోఁ దాఁకు జలధిచందమున । బలము మీఱఁగ మత్స్యబలముతోఁ దాఁకి
ఘీంకారములను జంకించునార్పులను । బింకంబులను [6]జూపి పేర్చిపోరాడఁ
గని మత్స్యరాజు [7]త్రిగర్తేశు మీఁదఁ । దన తేరు పఱపించి [8]దర్పించి తాఁకి
జడి[9]వట్టిన ట్లర్ధచంద్ర బాణములు । తొడిగి యేసిన, వాఁడు తోన గోపించి
మింట మంటలు[10]గ్రమ్మ మెఱుఁగు నారసము । [11]లంటంగఁ దరిమి యందంద నాటించి
విలు ద్రుంచివైచిన, విభుఁడు వేఱొక్క । విలుగొని బహుకోప [12]వికృతాస్యుఁడగుచు
వడిఁ ద్రిగర్తే[13]శునివక్షంబు గాడఁ । దొడిబడి పదునాల్గుతూపు[14]లు పఱపి
పదియింట సారథిఁ బదియింట హరులఁ । బదియింటఁ గేతువు భంగించియార్చె.
వాఁడుఁ గోపించి యవ్వసుధేశు[15]మేన । వాఁడితూపులు నాఱు వడి నైదుపదులు.
దొరలిట్లు తలపడి దురము సేయంగ । నురు[16]తరాటోపులై యుభయ[17]సైనికులు
లావులు దాఁపక లలితవేగమున । వే[18]విధంబుల బాణవితతు లేసియును
దమకించి పోరాడ ధర[19]నుండి ధూళి । తమము కప్పినయట్లు దట్టమై [20]నిగిడి
[21]పరులను దమవారిఁ బరికింపనీక । పరపైన మొనలపైఁ బర్వె నాక్షణమె;
పోటు[22]గంట్లను రక్తపూరంబు వెడలి । పాటవంబున ధూళిపటలంబు నణఁచె;
అంతట నరుణోదయమునఁ జీఁకట్లు । వింతగా విరిసిన [23]విధమయ్యె; నపుడు
దళములఁ [24]జూచి సందడి కయ్యమునకుఁ । దలపడి యిటుపోరఁ దపనుండు గ్రుంకె;
గ్రుంకినఁ బోక యుక్కున సేన రెండు । వంకలు దెగి [25]వకావకలుగాఁ బెనఁగఁ
[26]దిమిరంబు వెసఁ బర్వె ధృతరాష్ట్రతనయుఁ । డమితంబుగాఁ గొన్న యపకీర్తిపోలె.

---

1. మీఱఁగ నంచుఁ గడు రౌద్రమునను. 2. పటుభల్ల నారాచ పట్టసంబులను. 3. పోఁగని. 4. సైన్యములు. 5. పోర. 6. మించి. 7. త్రిగర్తుల. 8. ధట్టించి. 9. వట్టవెస నర్ధ. 10. మండు. 11. కంటకంబున శైవఁ గార్ముకంబదర. 12. వివృ. 13. శ్వరువదనవక్షములు. 14. లంటించి. 15. మీఁద. 16. రథా. 17. సైన్యములు. 18. వితంబుల. 19. నిండి. 20. నిగుడ. 21. పరసేనఁ దమసేనఁ బరికింపలేక । పరపైనసేనపైఁ బరఁగ నాక్షణమె. 22. గట్టిన. 23. విధమును జూచి. 24. కదియ...కయ్యమయ్యె. 25. యథాయథలుగా. 26. సంధిసేయుద మని సైన్యంబు నడిమి । కంథరాకృతి (?) హరి యరుదెంచె ననఁగఁ । దిమిరంబు,

అప్పుడాచీఁకటి ననిసేయు[1]రాక । యొప్పార నున్నవారున్నచోటులను
నిలిచినఁ జూచి యా నీరజారాతి । [2]తలఁపునఁ దమతమ తమకంబు దెలిసి
కదనంబు వీరికిఁ గడఁగి యేఁచోక । యొదవద[3]న్నట్లు దా నుదయించి మించె.
అప్పుడు వెలుఁగైన నఖిలసైన్యము లు । నెప్పటియట్ల పెల్లేచి పోరాడ,
నా త్రిగర్తేశుని నతని తమ్మునిని । వి[త్రా[4]సుఁడై మత్స్యవిభుఁ డొప్పఁ దాఁకె;
తాఁకినఁ గని త్రిగర్తలు నొక్క తెగువఁ । దాఁకి యవ్విభునిరథ్యముల రూపణఁచి,
సారథిఁ దెగటార్చి చాపంబు దునిమి । తేరును ధరణిపైఁ ద్రెళ్లనేయుటయు,
విరథుఁడై ధరఁ[5]గూలు విరటుపై కుటికి । కరమర్థితోడఁ ద్రిగర్తనాయకుఁడు[6]
తన తేరిమీఁద నాతనిఁ [7]బట్టి కట్టి । వెనుకొన్న రిపుసేన వెఱచి నిల్చుటయు
జయజయధ్వనులతో జయకాహళములు । జయదుందుభులు మ్రోయ [8]జగతి గ్రక్కదల
నంత[9]టఁ దిరిగి సైన్యముల రాఁబనిచి । సంతోషమునఁ గొంత సాగిపోవుటయు,
విరటునిదెసఁ జూచి వెస యమసూనుఁ । డరుదైన కడఁక నిట్లనియె భీమునకు :

## పాండవులు సుశర్మ నోడించి విరటుని విడిపించుట

"అనిలజ, మనకు సౌఖ్యంబుగా నితఁడు । ఒనరఁ గట్టడచేసి యొకయేఁడు నిలిపె;
నిలిపినవానికి [10]నిక్కంబుగాఁగ । వెలయ నాపదయైన విడిపింపవలయు."
అనుటయు [11]మైవెంచి యా భీమసేనుఁ । డనిసేయఁ దివురుచు నన్న కిట్లనియె :
"అగు నట్లగాక మహాప్రసాదంబు ; । జగదీశ, ననుబంపు చాలు నీపనికి.
అల్లదె వృక్షంబు నవలీలఁ బెఱికి । [12]త్రుళ్లడంచియు దాయఁ దూలించి యేను
విరటుని విడిపించి వేవేగ వత్తు । వెరవుతో నాశక్తి వీక్షింపు [13]దేవ."
అనుటయు నగి పాండవాగ్రజుఁ డనియె : । "ఘన[14]రణోత్సాహంబు గని మెచ్చి పొగడె
[15]దింతసేయఁగనోపు దీవు సాహసుఁడ ; । వంతశౌర్యము సేయ నది నేఁడుగాదు ;

1. గాన । కొప్పార. 2. ఎలమిఁ బాండవు లనికిచ్చమైనుండ. 3. టంచు. 4. ణుఁడై. 5. నున్న విభునిపై కుటికి । యురవడితో వాని నుక్కణంపకయ. 6. అరిమురిఁ దిగిచి బాహాపంజరమునఁ । దన తేరుమీఁద (ముద్రితప్రతి). 7. దెచ్చిపెట్టి । ఘనయోధయూధంబు కడునార్చి యదర । జయ జయ. 8. జదలు. 9. సుశర్మ. 10. నిక్కంబు నేఁడు । వెలయ వైరులగెల్చి విడిపింతమనిన. 11. మేలెంచి. 12. పల్లాకుచొక్క(ప్పు)గాఁ బగతులఁ ద్రోసి. 13. మిపుడు. 14. మహో. 15. దింతసాహసివౌట ధూఱుఁగనే నేను ? । అంతకార్యము వలదయ్య యీవేళ.

లాలితగతులఁ గాలానకుఁ దగిన । కోలా[1]హలము మేలు కొంతేసి నడకు ;
కావునఁ జక్రరక్షకులుగా వీరిఁ । గావింపు మిదె నీకుఁ గవలున్న వారు ;
సాధనంబులు మీకుఁ జాపబాణములు । సాధింపు [2]వైరులఁ జలముతో." ననిన
గురుకుంభయుగళ మంకుశవు దాఁకుటయుఁ । దరుపు గూల్చకమాను దంతిచందమున
నన్నమాటకు భీముఁ డావృక్షచింత । క్రన్నన విడిచి సంగతిదోఁపఁ బలికెః
"అన్న, మీయానతి [3]కడ్డంబు చాఁట । సన్నుతగతిఁ బోయి జయము గైకొందు ;
మీరు రావల[4]దయ్య మేము చాలుదుము ; । గోరఁబోయెడిపని కొడ్డలేమిటికి ? "
అనవుడు నృపునితో నటమున్నె తాను ; ఘనరణం బొనరింపఁగలవాఁడ ననుచుఁ
బలికిన పలుకు లేర్పడఁజెప్పి తనకుఁ । బలికి బొంకఁగరాని భావంబు దెలిపి
వచ్చెదఁ బదమని వడి ధర్మరాజు । చెచ్చెరఁ జని వైరిసేనపైఁ గవిసి,
యనుజు[5]లుఁ దాను నానాస్త్రశస్త్రముల । మునుకొని పుంఖానుపుంఖంబు లేయఁ,
గరముగ్రముగను ద్రిగర్తసైన్యములు । తిరిగి లోకములకు దిగులుగా నార్చి
దాసియు వ్రేసియుఁ దాఁకఁగా [6]మరలఁ । జేసియు నేసియుఁ జెలఁగిపోరాడి
ప్రథితసత్త్వమున నేర్పడ, రెండువేల । రథములవారి దర్పము భీముఁ డణఁచె.
వీరుఁడై నకులుండు వెస నేడునూఱు । తేరుల ధరఁగూల్చి తివుటమై నార్చె.
సన్నుతసత్త్వుఁడై సహదేవుఁడపుడు । మున్నూఱురథముల మొదలంట నఱకె.
పాయక యమసూతి బాహు[7]దర్పమున । వేయితేరులవారి [8]విదళించి మించె ;
అంతఁ బోవక త్రిగర్తాధీశుఁ దాఁకి । యంతకతనయుఁ డత్యంతవేగమున
ఘనదీప్తినొప్పు వ్రేశపునారసములఁ । జనుమఱ నాటింపఁ జాల మూర్ఛిల్లి
జవమొప్పఁ దేఱి సుశర్మ ధర్మజుని । జవనాశ్వములమీఁద శరవృష్టి గురిసె.
ధీరుఁడై యంతఁ గౌంతేయుఁ డావీరు । సారథిఁ జంపి యశ్వములఁ జెండాడె.
అది సందుగాఁగ మత్స్యాధీశుఁ [9]డొక్క । గదగొని వానివక్షము నొవ్వనేసి
యతివృద్ధుఁడయ్యుఁ బ్రాయము[10]వానిపోలెఁ । గుతలంబునకు దాఁటి కుశలియైపోయె.
కరునలిపట్టి త్రిగర్తనాయకుని । యరదంబునకు దాఁటి యతని బంధించి
పగతురగుండియల్ పగుల నార్చుటయు, । మగఁటిమి దిగనాడి మఱి [11]వైరిసేన

1. టములు. 2. వీరల తృణములో. 3. యట్లకావింతు । సన్నుతగతి. 4. వదు. 5. ండుఁ దానును శస్త్రాస్త్రములను. 6. మొనలు. 7. సత్త్వమున. 8. విజయించి. 9. ఁడంత. 10. తోన మీరి. 11. వాని.

భీతిల్లి వెసఁ [1]గళాపికలుగాఁ బాఱె. । ఆతతగతి భీముఁ డడ్డంబు[2]దాఁకి
గొడుగులు [3]వ్రేయించి కొమరైన బిరుదు । పడగలు [4]వ్రేయించి పసిఁ గ్రమ్మరించి
మఱియును రథ వాజి మాతంగసమితి । నుఱక ధర్మజునకు నొప్పించెఁ దెచ్చి.
చెలఁగి యీవిధమున సేనతోఁ గూడ । బలియుఁ ద్రిగర్తాధిపతిఁ బట్టి తెచ్చి
తమ్ములుఁ దానును ధర్మనందనుఁడు । సమ్మదంబున మత్స్యజనపాలుఁ గనిన
నతఁడు నానందించి యా ధర్మజునకు । నతిగౌరవము మీఱ నర్థి నిట్లనియె:

## విరటుఁడు ధర్మజాదుల నగ్గించుట

"ఓ కంకుభట్ట, మీరొనఁగూడి నేఁడు । మాకుఁ జేసిన మేలు మఱవంగరాదు;
[5]తగిలి మీచేఁతకుఁ దగినట్టి మేలు । మగుడఁ జేసెదమన్న మాచేతఁగాదు;
కాకున్న నేమి [6]సౌఖ్యమున మాపదవిఁ । గైకొని మాకోర్కి గావింపుమయ్య;
[8]ఈయెడ లీలక్ష్మి యీమానధనము । నీయిచ్చినవి కావె! నీకిత్తు మగుడ;
ఎలమితో మిముఁగొల్వ నిహ[7]మునుబరముఁ । గలుగు నంతియచాలు గణుతింప మాకు."
అనుటయుఁ బ్రియమంది యాధర్మజుండు । మనుజేంద్రుఁజూచి సమ్మద మొప్పఁ బలికె:
"ఏమిటఁ గొఱఁత మా కెల్లభోగముల? । నీమన్ననయె చాలు నృపశేఖరోత్తముఁడ!
ప్రియముఁ బెద్దఱికంబుఁ బేరుఁ గీర్తియును । జయమును మీతోడి సఖ్యంబె చాలు."
అనుటయు మఱియు నిట్లనియె భూవిభుఁడు: । "విను కంకభట్ట, మీవిక్రమంబొప్ప;
మిక్కిలియును శాంతి మీమూర్తియైన । నెక్కడ నేర్చితి వీ సాహసంబు!
కలహలీలాప్రౌఢి గనఁగొన్నయపుడు । వలలునంతటివాఁడు వసుధలో లేఁడు;
[9]కలశజుపరిపాటిగాఁడె యీమేటి! । గెలిపించె నన్ను నక్షీణసాహసుఁడు.
మఱియును మాకు దామగ్రంథి నేఁడు । మెఱయఁజేసిన మేలు మితి మేర లేదు;
కడువేడ్క నాతఁ డఖండవిక్రముఁడు । జడియక వైరులఁ జంపె నొప్పార.
ధీభవ్యుఁడైన తంత్రీపాలుఁ డొకఁడు । [10]శోభన మొప్ప నన్ సుతులతోఁ గూర్చె.
మనసేన నెవ్వఁడైన మహితవిక్రమము । తనర యుద్ధముసేయఁ దలపడెనొక్కొ?
చెలికొందు నెడరైనఁ జేరి ప్రోవంగఁ । దలపోయువాఁడెవో ధర నుత్తముండు;

1. విశా. 2. వచ్చి. 3, 4. ఖైపించి. 5. తగిన. 6. సౌఖ్యతకు. 7. పరోన్నతులు. 8. లోకచంద్ర.
9. అళనినపరిపాటి నాపాటిగాఁడె. 10. సోపానపంక్తిగా సుభటులఁ గూల్చి.

కావున మీకు యోగ్యంబుగా మేలు । గావించి ఋణము నీఁగఁగ నెంతవాఁడ !
తరుణు లశ్వములును [1]ధనధాన్యములును । గరులు గ్రామంబులుఁ [2]గనకాంబరములు
నడుగుఁ డిచ్చెద [3]నేమి యభిమతం ?" బనినఁ । దడయక విభుఁజూచి ధర్మనందనుఁడు :
"[4]ఇచ్చెద ననుమాట యిప్పుడు మాచోట । నొచ్చెమైనది మీకు నుర్వీశ, వినుము.
ఇన్నియు నిచ్చుట యాత్రిగర్తేశు । మన్నించి సేనతో మరలనిచ్చినను ;
చాటంగఁబంపుమీ జయము [5]నేమంబుఁ । బాటించి మన మత్స్యపట్టణంబునను."
అనుటయు వాని సైన్యము[6]తోఁడ విడిచి । జననాథుఁడపుడు సుశర్మ వీడ్కొలిపి
[7]కాలరి నొకని నక్కడ మత్స్యపురికి । మేలువార్తలు దెల్ప మెలపుతో ననిచె.
అనుపుటయును వాఁడు ననిలవేగమునఁ । జని మత్స్యపురిఁ జొచ్చి జయము చాటింపఁ,
బురజనులెల్ల [8]నద్భుతమంది యప్పుడు । పురము శృంగారింపఁ బురవీథులందుఁ
గస్తూరి నలికించి కమ్మపూ[9]నరులు । ప్రస్తుతి [10]వెలయఁ దోరణము[11]లు గట్టఁ,
బుణ్య[12]గంధంబులుఁ బుణ్యనాదములుఁ । బుణ్యచేష్టలుఁ గల్గి పురలక్ష్మి [13]యొప్పె.
అవనీశచంద్రుని నర్థిఁ జూచుటకుఁ । గువలయాక్షులు చేరి కోరుచున్నంత,
నటఁ బాండవులు భూతలాధీశుతోడఁ । బటుతరసైన్య సంపన్నులై కదలి
సమరంబునడుమగాఁ జనుదెంచునపుడు । అమిత [14]భూతవ్యాప్తమైన తావులును,
కరిచొచ్చి విఱిచిన కదళీవనంబు । పరుసునఁ దొడలూడిపడిన తావులును,
పాతాళబిలములోఁ ఫణిరాజులున్న । భాతిఁ జేతులు[15]త్రెవ్వపడిన తావులును,
ఘనత నంచలుద్రెంచు కమలనాళములో । యనఁగఁ ద్రేవులు ప్రోవులైన తావులును,
బూని నెత్తురునీటఁ బుష్కరాకృతుల । నాననంబులు [16]త్రెవ్వియాడు తావులును,
చిగురాకు[17]నెఱసిన శృంగారవనము । పగిది నంగ్రములు త్రెవ్వపడిన [18]తావులును,
నీలాభ్రయుత శైలనికరంబులనఁగఁ । గూలినకరులు నెక్కొన్న[19]తావులును,
విరిగికూలిన సౌధ[20]వితతిచందమునఁ । బరియలై రథములుపడిన [21]తావులును

---

1. ధనము వస్తువులు. 2. కనకభూషణము । లడుగు. 3. నంటి. 4. ఇచ్చెద ననువేడ్క నిపుడు మాయొద్ద । నచ్చమైనది విను మవనీశతిలక (నచ్చమైనది మీకు నవనీశవినుము). 5. ఏఖ్యాతి. 6. తెల్ల. 7. పోలించి యా మత్స్యపురికిఁ దానపుడు. 8. నప్పురములో. 9. విరులు. 10. నిలిపి. 11. లెత్తించి. 12. జనంబులు. 13. వెలయు. 14. సత్త్వస్థిర. 15. తెగి. 16. త్రెస్సియలరు. 17. నెఱపిన. 18, 19. పోయుఁను, 20. వీధ. 21. పోటులను.

[1]గలిగి రోఁతయు భీతి గలిగించు కలను । దలకొని వెడలి యందఱు నొక్కచోట
వెన్నెల[2]ఁబయటను విడిసి నిద్రించి । యున్నత సుఖలీల నుండి రాఁ రేయి
కరమర్థి నట్టిసంగరమిుఁ జూచును । సురరాజు నటుపోయె సురలోకమునకు."
అనవిని తద్వ్యాతనైన వృత్తాంత । [3]మనఘాత్మ, యొఱఁగింపుమని వేఁడుటయును,
డిండీరకీర్తి, బట్టెపాటి నిలయ, । చండశాత్రవ[4]వీర సంహారశూర,
మదనసన్నిభగాత్ర, మలిరెడ్డిపౌత్ర, । విదిత సత్కుల[5]చంద్ర, విభవదేవేంద్ర,
లలిత చౌషష్టి కళాప్రవీణాత్మ, । కలిత మహాభాగ్య, కర్ణాటతిలక!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
రచిత విరాటపర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొప్పె మూఁడవది.

---

1. కలిగి లోకుల గేహగర్భంబుపోలె । బలరవనాశక్తి పంకిలంబగుచు । భీమాటవియుఁబోలెఁ బ్రధుల మాతంగ । గోమాయు గజ పుష్ప గోచరంబగుచు । శూలి మేనునుబోలె శూలాస్థితుండై । మాలా కపాల సమాయుక్తమగుచు । నొప్పైన రణభూమి నొగిఁ జూచుకొనుచుఁ । దప్పక వెడలి యందఱు నొక్కచోట । వెన్నెల చల్లఁగా విడిసి.
2. చల్లఁగా. 3. మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు (తం. ప్రతి.); అనఘాత్మ, వినిపింపుమని మ్రొక్కుటయును (తిరు. ప్రతి). 4. శూరసంచారధీర. 5. విద్యాకళాసౌఖ్య.

# చతుర్థాశ్వాసము



[1]శ్రీసమంచితనేత్ర, [2]శివకృపాపాత్ర, । వాసవాకార, దేవయ మంత్రిధీర !
వినుము వెండియు నిట్లు వివరింపఁదొడఁగె । జనమేజయునకు వైశంపాయనుండు :

## ఉత్తర గోగ్రహణము

"అంతఁ గౌరవనాథుఁ డరుణోదయమున । నంత[3]ములేని సైన్యంబు రాఁబనిచి
పాతాళ [4]భూతల బ్రహ్మలోక[5]ములు । భీతిల్లఁ [6]బ్రస్థానభేరి వేయించి
కదలె ద్రోణాచార్య గాంగేయ కృపులు । మొదలైన రథికులు మొత్తమై నడువ.
అప్పుడు సేనపై నాడె గృధ్రములు; । నిప్పులు వర్షించె [7]నిలిచి మేఘములు;
వసుమతి గంపించె; నక్కలు గూసె; । నెసఁగి యుర్వ్వి[8]న వీచె నెదురుగా గాలి;
ఇచ్చలో నివియెల్ల నెగ్గుగాఁ గొనక । వచ్చి కౌరవసేన [9]వడిమీఱి నార్చి
పొలుపుమీఱిన మత్స్యపురిసమీపమున । బలిమి నవ్విరటునిపసులఁ బట్టుటయుఁ,
గలగొల్లలెల్ల నొక్కట మూఁక[10]యగుచుఁ । [11]దలపడి ఘోరయుద్ధము సేయునపుడు,
కరముగ్రముగ భీష్మ కర్ణ వికర్ణ । గురు కృపాశ్వత్థామ కురురాజు లదరి
బాణజాలము లుచ్చిపాఱ నేయుటయుఁ । బ్రాణభీతికి నోడి పాఱి గోపకులు
కౌరవసైన్యంబుగా నిశ్చయించి । [12]యూరివేగముతోడ నరుగుదెంచుటయు
నతివీరుఁ డందు గవాధ్యక్షుఁ డొకఁడు । క్షితినాథు నగరివాకిటఁ దేగు డిగ్గి
తత్తఱంబెసఁగ నంతఃపురంబునకు । నుత్తరునకుఁ జెప్ప నొప్పారఁ బోయి
యతనిపాదములకు నర్థితో మ్రొక్కి । యతులితంబైన దైన్యము[13]దోఁపఁ బలికె:
"ఉత్తర, మనయూరి యుత్తరంబునను । క్రొత్తగా నిదె నేఁడు కురు[14]సేన వచ్చి

---

1. శ్రీవర గుణధామ శ్రీరఘురామ । పావనాతీత సౌభాగ్యసమేత,
హరివిల్లు విఱిచి సీతను బెండ్లియాడి(?) । కరుణ దాసులఁ బ్రోచు ఘన, చిత్తగింపు.
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథానూత్న ముట్లని చెప్పఁదొడఁగె. (తంజా. ప్రతి).
2. చిర. 3. యుఁ దెలిసి. 4. కుహరంబు. 5. ంబు. 6. బటురణ. 7. నిండు. 8. చు. 9. వరుసతో. 10. లగుచు. 11. తలకొని మఱియు. 12. యాగవారముతోడ నరుదెంచునప్పు । డతివీరుఁ డొకఁడు గవాక్షుఁ డన్వాఁడు. 13. తోడ. 14. రాజు.

గోగణంబులఁ బట్టి కొనిపోవఁ[1]జొచ్చె; । నీగుణంబులు లావు నెఱపుదుగాక;
అరదంబు దెప్పించు; మతిశీఘ్రగతుల । ధరియింపు కవచంబు; ధనువు దెప్పింపు
మాజికి; బలవంతులగువారితోడ । రాజు వర్ణించు నీరణకళాకేళి.
దానికిఁదగ [2]నంటఁదఱిమి గోగణముఁ । బోనీక [3]మగిడించి పొరెవుచ్చు మరుల;
నరుఁడొక్కరుఁడుగాని నరనాథతనయ, । కురుసేన[4]నోరుఁడు మార్కొన[5]జాలఁడంద్రు
ఆమాట బొంకుగా నా కౌరవుల[6]కు । నీమగఁటిమి చూపి [7]నేర్పుపాటింపు;
ఉత్తరుబలము లోకోత్తరంబనుచు । వత్తురు నినుజూడ వసుమతీజనులు."

## ఉత్తరుఁడు కౌరవులపై నెత్తిపోవుట కుద్యమించుట

అని [8]యంగనలచెంత నగ్గించి యతఁడుఁ । దను బెద్దసేయ నుత్తరకుమారుండు
'వా[9]రెట్లు? నే[10]నెట్లు? వలదు పొ.' మ్మనక । కౌరవసేన[11]పైఁ గాలుద్రవ్వుచును
మెలఁతలు దనుజూచి మేలు మేలనఁగఁ । బలికె గర్వించి [12]గోపాలు నీక్షించి:
"పొదపొద గోవులు పోనెట్లువచ్చు? । ఇదె వచ్చుచున్నాఁడ నేఁ గయ్యమునకు;
కురుసేన పనియెంత? ఘోరబాణములు । గురిసినఁ జాలు సంక్షోభింపఁ[13]వలదె;
సారథి దొరకఁడు సంగ్రామమునకు; । నేరూపమునఁ[14]గల్గు నేమిసేయుదును?
[15]కలిగిన వెదకుఁ డెక్కడనైనఁ[16]గాని । [17]కలఁగి గోవులు దప్పఁగాఁ బోకమున్నె.
ఈవేళ నేనుండి యింతకార్యంబుఁ । గావింపకున్న భూకాంతుఁ డేమనునో? "
అనుటయుఁ బాంచాలి యచ్చోటనుండి । మనుజేంద్రసుతుఁ డాడుమాట లాలించి
వచ్చి [18]యంతయును వివ్వచ్చుతోఁ జెప్ప । నిచ్చలో నపుడు దేవేంద్రనందనుఁడు
వడినెన్ని యజ్ఞాతవాస వత్సరము । కడచుట యెఱిఁగి యాకాంత కిట్లనియె:
"జలజాక్షి, యతనితో సారథ్యమునకు । నలువొప్ప [19]మనబృహన్నల నేర్చుననుము;
వడి నర్జునుఁడు ఖాండవంబేర్చునపుడు । కడఁగి సారథ్యంబు గావించె ననుము;
చతురుఁడై మఱియు వాసవుతేరు గడపె । నితఁడు ముఖ్యుండు నేనెఱుఁగుదు ననుము;
సారథి యితఁడైన సమరమధ్యమునఁ । [20]గౌరవులేల లోకము గెల్తువనుము;

1. దొడఁగె. 2. వెంటఁదగిలి. 3. విడిపింపు పోనీక రిపుల. 4. తోడ. 5. లేఁడఁటన్న; నెవ్వఁడోపు. 6. ను. 7. నెఱి గెల్పుమంత. 8. పద్మముఖులలో నాకార్యమునకు. 9. రెంత 10. నెంత. 11. తో. 12. గోపకుల నీక్షించి. 13. గలదు. 14. గాని యెయి. 15. కదుకొని. 16. నొకని. 17. కడచి. 18. యత్తెఱఁగు. 19. నా. 20. కౌరవేశ్వరు గెల్వఁగలవు నీవనుము.

మఱియును వాఁడేమిమాటలాడినను । నెఱుఁగక ననుబిల్చువిధము గావింపు."
అనుటయు నౌఁగాక యనుచు ద్రౌపదియు । నెనయ నుత్తరయున్నయెడకు మున్నేఁగి
యా ముగ్ధ కిట్లను: "నతిని, మీయన్న । వేమాఱు సారథి వెదకుచున్నాఁడు;
అంతకు నేఁ గన్నయంత చెప్పెదను । జింతింప సారథి సిద్ధించె మనకు;
అతఁ డెవ్వఁడ[1]న్న మున్నర్థిఁ బార్థునకు । నతులితగతి సూతుఁడైన మీగురువు.
ఈ మాటలన్నియు నీవును నేను । భూమింజయునితోడఁ బోసఁగఁ జెప్పుదము
ర." మ్మని చనుదెంచి రమణీలలామ । యిమ్ముల నృప[2]సూతి కెఱిఁగింప నంత,
మందహాసముచేసి మనుజేంద్రసుతుఁడు । పొందుగాఁ బాంచాలపుత్రి కిట్లనియె:
"మాలిని, [3]నీమాట మందెమేలంబు; । ఏల నీకన్నుల కేఁబట్టనెట్లు!
ఆవలఁ గురుసేవ యనుదెంచె నట్టె! । [4]భావింప నే వారిపైఁ బోదునట్టె!
పేడి సారథియైనఁ బృథివిలో [5]నగరె? । కూడదు నగుబాటు [6]కోటి సెప్పినను;
మున్నెన్నఁడును బేడిమోము నేఁ జూడఁ । జెన్నార సారథిఁజేయ నోపుదునె!
కరమొప్ప సారథి కఱవయ్యెనేని । పరిహాసములు నీకుఁ బాటిగా." దనిన
ద్రౌపది వెసఁ బల్కె: "దైవాజ్ఞ నతని । కాపేడితనమైన నయ్యెఁగాకేమి;
ఖాండవదహనాదికములఁ బార్థునకు । దండియై మున్ను నాతఁడె తేరు[7]గడపె;
సారథి యతఁడైన జననాథతనయ! । [8]కౌరవులేల లోకముల గెల్చెదవు."
అనిన భూమింజయుం డచ్చోట నారులు । తనకు సారథిలేమిఁ దలపోసిచూచి
యొడఁబాటులేకయు నువిదతో నతనిఁ । దోడుకరమ్మని నేర్పుతోడఁ జెప్పుటయు,
'నిత్తెఱఁగైన నేనిదె తెత్తు' ననుచు । నుత్తర [9]తా లేచి యొయ్యారమునను

1. దనినను. 2. తికి నేర్పఱించుటయు. 3. మాతోడ మందమేలములె । ఏల నీవిట్లాడ నిపుడు
నాయెడను । బరిహాసములు నీకుఁ బాడియే యకట! । అరయంగ లేవు నీవాలంపువితము । ఆ మహా
సేనలు నరు. 4. భామరో. 5. గలరె. 6. కోలఁది.

7. గడప । సమకూరె నావుడు త్ష్మాభర్తసుతుఁడు । కోమ, వీఁడు రథచోదకుండౌట నరున । కరయఁగా
నిజమకానె యది చెప్పు మ (యబ్జాక్షి య) నిన । మరియు ద్రౌపది యనుమానింపకయ్యు । సారథి
యతఁడైన. 8. కౌరవులను గెల్తు కడఁక నీవనిన । నెడపక సారథి యెందు లేకునికిఁ । దోడుకరమ్మని
వేడ్కతోఁ జెప్పుటయును । ఇత్తెఱఁగైన. 9. వెడలి తా నల్లంబుచెలఁగ; వీడ్కొని యువి
ధయుఁదాను,

గలికి కన్నులడాలు కర్ణపూరముల । వెలుఁగున మెఱుఁగెక్కి వింతయై పొలయ,
[1]అంచలగమి వేగ నరుదెంచె ననఁగ । నంచిత మణినూపురారావ మెసఁగ,
నెడపక మెఱుఁగుఁ బాలిండ్ల ఱేకమున । [2]నడుమసియాడంగ నడచి యేతెంచి
నాటకశాలలో నరుఁగాంచి యతనిఁ । బాటించి చూచుచుఁ బడఁతి యిట్లనియె :
“ఉత్తరునకు మున్న నొక్క-కయ్యమున । నుత్తమగుణజాతుఁ డొకసూతుఁ డీల్గె ;
తరువాత సూత[3]కృత్యంబుఁ జెల్లింప । [4]నెఱవాది మఱిలేఁడు నేఁడు నిచ్చోట ;
అది యటులుండె ; నేఁ డఖిలకౌరవులు । మొదవులఁ [5]బట్ట నమ్మొగి చక్కఁబెట్ట
నన్న తాఁబోయెదనని విచారించి । క్రన్ననఁ దగిన సారథిలేక వగవఁ,
జూచి సైరంధ్రి నీచొప్పుఁ జెప్పుటయు । నేచిన వేడ్క నన్నిచటికి నతఁడు
నిన్నుఁ దోడ్కొని తేర నెమ్మిఁ బుత్తెంచె ; । మన్నించి నీవు నామాటకై రమ్ము.”
అనవుడుఁ [6]దరుణి కిట్లనియె నర్జునుఁడు : । “వనిత, సారథ్యంబువల నేనెఱుంగ ;
నీవు వచ్చితిగాన నీవేడ్క నాకుఁ । గావింపకుండుట కాదెన్ని [7]విధుల ;
రయమొప్పఁ జేయంగరాని కార్యంబు । నియతిఁ జేయుదు [8]నేఁడు నీమాటకొఱకు.”

## ఉత్తరుఁడు బృహన్నలను దనకు సారథిగాఁ గోరుట

అనుచు నాటకశాల నర్థితో వెడలి । చను[9]దెంచు నరుఁ జూచి జననాథసుతుఁడు
ఆదరంబొప్ప నిట్లను : “నాకు నీవు । అదట సూతకృత్యము సేయవలయు ;
ఆరీతి [10]నేరఁ బొమ్మనరాదు నీకు ; । సైరంధ్రి చెప్పె నీ సామర్థ్యమెల్ల ;
కౌరవులకు నాకుఁ [11]గయ్యంబు గలిగె ; । వారక ధరియింపు వజ్రాంగిజోడు.”
అనిన యుత్తరుతోడ నాక్రీడి పలికె : । “చనునయ్య నను [12]బిల్వ సారథ్యమునకు ?
ఆటపాటలఁ బిల్వ నర్హంబుగాని, । [13]పోటులచోటను బోఁటి యేమెఱుఁగు ?
చారు దోర్బల శౌర్యసంపన్నుఁడొకఁడు । తేరు దోలినఁగాని తీఱునే పనులు ?”

---

1. అందెలమొరపంబు లరసి యంచలును । సందడిఁ దనవెంటఁ జనుదెంచుచుండ । నడుగుల నునుగాంతి నవనీతలంబు । కడుకొని పద్మరాగస్ఫూర్తి నలరఁ । గ్రచ్చరఁ గామాంధకారంబువెంట । వచ్చునా క్రొవ్విద పరిఢవింపఁ జని । నాటకశాలలో. 2. నడుము జవ్వాడంగ నరుదెంచి యపుడు. 3. వర్తనము. 4. వెరవరి మఱిలేఁడు వెదకిచూచినను. 5. బట్టినమొనఁ జక్కఁబెట్టి । యన్న. 6. రమణి. 7. గతుల. 8. నేను. 9. దేర. 10. జేయ. 11. కార్యంబు. 12. బంప. 13. పోటులాటకు నాకుఁ బొసఁగునే యకట!

అనుటయు నరున కిట్లనియె నుత్తరుఁడు : । "విను బృహన్నల, నీవు వేడ్కతోఁ దొల్లి
యరదంబు దోలిన యాశక్తిఁగాదె । నరుఁడు ఖాండవదహనం బొప్పఁజేసె;
నాఁటి దోర్బలమును నాఁటి సాహసము । నాఁటి నేర్పును [1]నేల నాకు దాఁచెదవు;
ఒప్పగ నీవింక నొకటిపై నొకటి । చెప్పి రాకుండినఁ జిత్తంబు నొచ్చు."
అనిన నుత్తరుమాట కడ్డంబులాడ । మనసులో వెఱచినమాడ్కి నర్జునుఁడు
[2]అనుమతిసేయ నాయన కుత్తరుండు । ఘన వజ్ర కవచంబు కడఁకఁ దెప్పించి
తొడుగు మీ వని వేడ్కతోడ నిచ్చుటయుఁ । దొడుగనేరనిలాగు దోఁప నర్జునుఁడు
నట్టిట్టు దొడిగిన నచటి కామినులు । [3]పొట్ట తా నటఁ బొట్టుపొరలుగా నవ్వఁ
దా వచ్చి తొడిగె నుత్తరకుమారుండు । దేవేంద్రసుతుని మూర్తికి నంతలిల్లి.
తానును వజ్రాంగి ధరియించి మించి । యానరు వీక్షించి యతఁ డిట్టులనియె :
"మనమింక గోవుల మరలించుకొఱకుఁ । [4]బొనరఁ జూచుచును జంపును జేయరాదు;
పోదము తేరెక్కి పూన్కి గుఱ్ఱముల; । నాదట నిడమొత్తు." మనినఁ గవ్వడియు
వారువంబులఁ దెచ్చి వలనొప్పఁ గట్టి । తేరున [5]సింహాకృతిధ్వజ మెత్తి
శర శరాసన ఖడ్గ చక్రాదు లందు । [6]నురవడిగాఁ బెట్టుచున్నచోఁ గదిసి
చెలులు నుత్తరయుఁ జెచ్చెరఁ గ్రీడిఁ జూచి । పలికిరి : "మీ రింకఁ బరుల నిర్జించి
వచ్చునప్పుడు మీరు వారివస్త్రములు । తెచ్చి మా బొమ్మపొత్తికల కీవలయు."
అనుటయు వారి కిట్లనియె నర్జునుఁడు : । "వినుఁ డుత్తరుఁడు శత్రుపితతి [7]నిర్జింప
నమరిన పనిగాక యపుడు వస్త్రములు । క్రమ మొప్పఁ దెచ్చుట కడిఁదియే నాకు?
[8]పొసఁగ నిన్నియుఁ బొల్లుపోరాదు గాక । వినువక గొనివత్తు వివిధాంబరములు."
అనుచుఁ బంతములాడి యరదంబు నెక్కి । యనువుగాఁ బగ్గంబు లాయత్తపఱచె.
ఉత్తరుండును గోవులాగఁ బట్టుపడ్డ । నెత్తంబు గోపాలనికరంబు నడిగి
[9]వారిచేఁ బితృభూమివం కని తెలిసి । దే రెక్కి కదలిన ధృతిఁ బౌరు లప్పుడు
ముత్తెపుసేసలు ముద మొప్పఁ జల్లి । యుత్తరు దీవించి యోలి నందఱును

---

1. జూపి నా మెప్పు గాంచ । కొప్పని యట్లింక (కొప్పగా నీవింక) నొకటిపై నొకటి । చెప్పు చుండిన నాదుచిత్తంబు నొచ్చు । అనిన. 2. అనుమతించుటఁ జేసి యతని కుత్తరుఁడు. 3. నెట్టన నదిచూచి నెఱి నవ్వుచుండ. 4. నొనరంగఁ బోనొప్పు నులియాడనేల. 5. సింహంబు ధృతి. 6. నొరసలి. 7. నిర్జించి । యమరారఁ జీరల నపుడు గైకొనుచు. 8. పొనర నన్నడిగినఁ బొల్లు పోరాదు । వినుతి సేయఁగఁ దెత్తు. 9. వారుచూపిన త్రోవ వదలకపోవ.

నరుఁజూచి పలికెఁ: "నాఁ డర్జునునకు । [1]సరదంబు గడపి బృహన్నల, యీవు
ఏరీతి గెలిపించి హితము గావించి । తారీతి గెలిపింపు మధిపనందనుని."
[2]అనుచుండ నా మాట లాలించి విరట । తనయుఁ డప్పట్టణద్వారంబు వెడలి
విజయునేప్పున వాయువేగమై పోవు । నిజరథగతులు వర్ణించి మెచ్చుచును,
భీమ పిశాచగర్భితమైన రుద్ర । భూమిఁ జేరఁగఁ బోయిపోయి దవ్వులను
వీక్షింపఁ గురురాజు [3]విపుల సైన్యంబు । సక్షీణ గజయూథమై యున్నదాని,
బహురత్నములు గూర్చి పఱచినయట్లు । బహువర్ణధూళి నభ్రమునఁ గప్పుదాని,
ఫణి తాళ సింహాది పటుకేతనములఁ । బ్రణుతింప మిక్కిలి భాసిల్లుదానిఁ,
కుంభసంభవుఁడు దోఁకొని పోవుచునికిఁ । గుంభిని యొకదిక్కు క్రుంగించుదాని,
భావించి నిస్సాణపటలంబుచేత । గోవులరొదచేత [4]ఘోషితంబగుచు
నలుఁగుల మెఱుఁగుల నఖిలదిక్తటులఁ । గలిగి మేఘమువోలెఁ గరమొప్పుదానిఁ,
గని యొంతయును భీతిఁ గంపించి [5]మఱియుఁ । [6]దనువెల్లఁ బులకించి ధైర్యంబు డించి
వెఱపింపఁగాఁ బోయి వెఱచిన రీతిఁ । బిఱికియై నరుఁ జూచి ప్రియమొప్పఁ బలికె:

## కురుసేనలఁ జూచి యుత్తరుఁడు భయమందుట

రథము పోనీకు సారథి, నిల్పునిల్పు ; । పృథివిలోఁ గురుసేన భేదింప వశమె?
వాఁడె కౌరవభర్త వాఁడె భీష్ముండు, । వాఁడె యశ్వత్థామ, వాఁడె ద్రోణుండు,
అతఁడు కృపాచార్యుఁ, డతఁడు కర్ణుండు, । చతురులు వీరెల్ల సంగ్రామమునకు ;
[7]తగరు పెన్గొండతోఁ దాఁకినయట్లు । వగదెలియక పోయి వచ్చునె తాఁక?
బాలుండ నొక్కండఁ; బ్రౌఢులు వారు । వేలసంఖ్యల మీఱి వెలయుచున్నారు;
వీరి మార్కొననేల? విరిగిపో నేల? । ఈ రీతి యెఱుఁగక యేను వచ్చితిని.
మరలకుండుట గాదు మరలింపు తేరు ; । తిర మొప్పఁ బ్రాణంబు తీపన వినవె?"
అనినఁ గవ్వడి మందహాసంబు చేసి । [8]తనర నుత్తరుఁజూచి తగవొప్పఁ బలికె:
"ఈ సైన్యముల మీఁద నేనేల పోము? । ఆ సమీపంబున నదె చూడు పసులు;

---

1. నరుదారఁగాను బృహన్నలరథము । నేరీతి నడపి గెల్పించితి విభుఁడు । నాకీవి. 2. అని పొరలాడు మాటాలించి; అనుచోట నా మాట లాలించి. 3. వివిధ. 4. ఘోషంబుగాఁగ. 5. యతఁడు. 6. తనువున. 7. తగరును గొండయుఁదాఁకె నన్నట్లు । తగవేది వీరితోఁ దాఁక నోపుదునె. 8. గొన కొని తా రాచకొడుకున కనియె.

పరికింప నచ్చోటఁ బసలేదు నేఁడు । పసువడి నటఁబోయి పసులఁ ¹ద్రిప్పుదము.
పౌరులు దీవింపఁ బణంతు లుప్పొంగఁ । దొరక్క జనులకే తెంచి ²నీ విపుడు
³మొనలకు బీతాడి మార్గతఁ దిరిగి । చనిన నాడిక గాదె జగతిలో ⁴నగవు?"
అనిన గాండీవికి నిట్లనియె నుత్తరుండు : । "మును జూఁగాడిన ⁵మాటలు మఱచ్చింగి ⁶నవేల?
మును సముద్రము మూయ మూఁక గలదె? । విను మేను గోవుల విడిపింప ⁷నోప ;
పరరాష్ట్రములనైనఁ బసులకై బసుల । నిఁ వొప్ప సాధింతు నివియేల నాకు?"
అనిన నుత్తరుతోడ నా క్రీడి పలికెః ! "మనసు జాఱఁగనీక ⁸మునుక కొల్లఁగొనక
ఘోరమై ధూళి పైకొనఁ గైకొనక । యరుదెత్తి వచ్చిన నంటిపోమ్మనక
శరపరంపర చూచి చాలభీతిలక । భేరిభాంకృతి విని బెదరి లోపడక
రణము గెల్చినఁగాక రాజసూనులకు । గణుతింప నూరక గలుగునే కీర్తి?
రాజనందనుఁ డేమి రణభీతియేమి । భూజనంబులు మెచ్చఁ బొలియింపు రిపుల."
అనిన ⁹భూమింజయుం డమరేంద్రపుత్త్రుఁ । గనుఁగొని పలికె నంగము చంచలింప :
"జనపాలకుఁడు నిన్ను సకలసైన్యములు । గొనిపోయె రిపురాజకోటి నిర్జింప;
మనకుఁ దోడెవ్వరు? మన లావు లెంత? । మనకుఁ గణ్ణుఁడుచాలు ¹⁰మర్మంబగల్వ ;
జనులెల్ల సర్వ సశక్త ¹¹మజ్జంత । మనకుఁ జేయఁగ నేల? మరలు నీ." వనినఁ
బలికె నర్జునుఁడంతఁ : "బసులు రాకున్న । పలనొప్ప మరలని వ్రతము నావ్రతము ;
కురురాజు గానిమ్ము గురుఁడు గానిమ్ము । సురరాజు గానిమ్ము పోరదిఁ దాఁకుదము.
సైరంధ్రి నను బిల్చి సారథ్యమునకుఁ । బ్రారంభ మొనరిం¹²పఁ బ్రార్థించి తెచ్చె;
అదిగాక గెల్చిరమ్మని పౌరజనులు । ముదముతోఁ జల్లిరి ముత్యాలసేస ;
లే నేల మరలుదు? నీవుఁ బో¹³నేల? । పూని గోవులురాక పోరాదు మనకు."
అనుచు వాసవపుత్త్రుఁ డరదంబు గడపఁ । దనుదానె బెదరి యుత్తరకుమారుండు :
"అగుఁ దేరకాఁడ వేమయిన దిక్కేది? । తగువాఁడ ¹⁴వని చూడ దాయవై తిపుడు ;
పసులేల నీ వేల పలుకులే?" లనుచు । వసుధకు ¹⁵లంఘించి వాసిఁబోవిడిచి

---

1. బట్టెదము. 2. తి. 3. మొనకు భీతిల్లుచు ముగ్ధత. 4. పలను. 5. నేమి. 6. గరిమె.
7. జాల. 8. మాకుఁగానైన । రాజనందనుఁడేల రణభీతియేల । భూజనంబులు మెచ్చఁ బొలియింపు రిపుల । అరుదెత్తివచ్చిన నంటి పొమ్మనక । శరపరంపర చూచి చాల భీతిలక । ఘోరమై ధూళి పైకొనినఁ గైకొనక । భేరిభాంకృతి. 9. భూపతిపుత్త్రు. 10. మనలావు గలదె. 11. జృంభణము. 12. చి ప్రార్థించె మొనల. 13. రాను. 14. వే. 15. గుప్పించి.

తలవీడ [1]వలువూడఁ దనమోము వాడఁ । గలయ సేనలుచూడఁ [2]గడునోడిపాఱె.
అంత నర్జునుఁడాత్మ నతఁడు పాఱుటయు । నెంతయుఁ జింతించి యెలమిఁ బగ్గములు
నొగలతో ముడిచి తానును డిగ్గనుఱికి । తగ నుత్తరుని వెంటఁ దగిలిపోవుటయుఁ,
గురుసేనలోపలఁ గొందఱర్జునునిఁ । బరికించి యాజానుబాహు [3]లీలయును
గమనలక్షణమును గర్వరేఖయును । సమరసన్నాహంబుఁ జర్చించి యపుడు
పలికిరి తమలోన: "భావింప నితనిఁ । బొలఁతి చందముగాదు పురుషుండు [4]గాఁడు;
గమనంబు [5]చందంబు ఘనబాహుయుగము । నమరేంద్రసుతుని కెట్లట్ల యీతనికి;
విజయుండు పేడియై విరటు సేవించి । నిజకాంతియును దాఁచి నెమ్మితో నుండి
తఱివేచి మనమీఁదఁ దా వచ్చెఁగాక । వెఱవక వచ్చునే వేఱొకఁ[6]డైన?
మన త్రిగర్తులమీఁద మత్స్యనాయకుఁడు । తనసేనలును దాను దాడిపోవుటయుఁ,
దోడెవ్వరును లేక తోడరి యుత్తరుఁడు । వేడుక మనమీఁద వెడలెనో నేఁడు!
ఇతని సారథిఁజేసి యేతెంచి మనల । వితతసైన్యముఁ జూచి వెఱచి [7]పాఱెడిని!
తనకేలపాఱు నెంతయు [8]ముగ్ధగాక; । మును ధనంజయుసత్త్వమును జూడఁ[9]డొక్కొ!"
అనుచు సందేహింప నంతలో నరుఁడు । జననాథసుతుఁ గూడఁజని పట్టుకొనిన
[10]నతఁ డంత వలఁజిక్కినట్లు భీతిల్లి, । కుతలంబుమీఁద నంఘ్రులు [11]మోపలేక,
తడవిచూచిన నోటఁ దడిలేక, చెమటఁ । దడిసి వివర్ణమై తనువు కంపింప,
నెలుఁగు సన్నఁబుగా నేడ్చుచు నరునిఁ । బలుమాఱు చూచుచుఁ బ్రార్థించిపలికె:
"ఏల బృహన్నల, యేలయ్య! నీకు । నోలి లంచంబుగా నొక్కగ్రామంబు
కరులు [12]నశ్వములును గనకంబు మత్స్య । పురిఁ జొచ్చి[13]నపు డిత్తుఁ బోవనీవయ్య!
మాతల్లి నారాక మదిఁ గోరుచుండుఁ । జూతుఁ బోని." మ్మని శోకించి మఱియు
"[14]నీవేల పోరెదు; నేనేయ వెఱతు; । నీ వీరవరుల నే నెటుగెల్తు!" ననుచు
నిత్తెఱంగున భీతి కిరవైనయట్టి । యుత్తరుఁ దెచ్చి యా యుత్తుంగభుజుఁడు

---

1. మొలవీడ. 2. గతి. 3. పొటయును. 4. గాని. 5. వర్ణంబు. 6. డిట్లు. 7. పాఱెడినో. 8. మూర్ఖుఁడౌచు. 9. నట్లు. 10. నతఁడు బోసున. 11. మోపనీక । తడిసి వివర్ణమైతనువుకంపింప । నుడుగనిభీతిచే నుల్లంబుచెదర । నెలుఁగుసన్నంబుగా. 12. స్వతంబులు. 13. యిచ్చెదఁబోనిమ్ము నన్ను. 14. నీవేల బాధింప నేను రానోప । నా వీరవరులతో ననిసేయ ననుచు. నీవేళ నీవేయు మే నేయ వెఱతు । నా వీరవరుల నేమని గెల్వ ననుచు.

## అర్జునుఁ డుత్తరునకు ధైర్యము నూల్కొల్పి తాను రథికుఁడగుట

తేరు డగ్గరి వాని దృష్టించి పలికె: । "ఈకీతిఁ దమకింపనేల నేఁగలుగ ![1]
కౌరవసైన్యంబు గలఁపనోపుదును; । కౌరవపతిబుద్ధిఁ గలఁపనోపుదును;
మహి[2]మెచ్చ గోవుల మరలింపఁగలను । సహజవిక్రమము, నీవు[3]సాక్షివై యుండు."
అని బుద్ధిచెప్పిన నతఁ డెన్నిగతుల । ననుమతింపక యున్న నమరేంద్రసుతుఁడు
'సారథివై యుండుఁ జాలు [4]నీ' వనుచు । దేరిపై నుత్తరుఁ దెఱఁగొప్పఁ బెట్టి
తానును రథికుచందమునఁ దేరెక్కి । సేనచూడఁగ జమ్మిచేరంగఁ బోయి
యందు నిక్షేపించినట్టి [5]యాయుధము । లందుటకై రథ మచ్చోట [6]నిలుప,
నపుఁడొట యెఱిఁగి ద్రోణాచార్యుఁ డప్పుడు । సురనదీసుతు[7]వంకఁ జూచి యిట్లనియె:
"కౌరవసేనలోఁ గలయ నుత్పాత । కారణంబయి తోఁచెఁ గంటిరే మీరు?
దినమణిరుచి[8]మాసె; దిగ్ధూమమెసఁగె; । ఘనకేతు[9]వులు వ్రాలె; కరులెల్లఁ[10]దూలె;
[11]వారువంబులు బాష్పవారి వర్షించె; । వారిదమ్ములు మ్రోసె; వసుధ గ్రక్కదలె."
అనిచెప్పి యతఁడు తా నర్జునుండగుట । మనసులో నెఱిఁగియు మఱువెట్టి పలికె:
"ఎవ్వఁడొకో వీఁడు! హితబుద్ధి [12]విడిచి । క్రొవ్వునఁ దలపూపెఁ గురుసేనయెదుర?
నరుఁ డనరాదు నానావిధంబులను । సురరాజు[13]బోలె భానుమూర్తి[14]వాఁడు;
తొడరి కౌరవసేనతోడ మార్కొనిన । [15]జడునకు విపినంబు శరణంబుగాదె?"
అనుటయు భీష్ముఁ డయ్యర్థంబు దెలిసి । యనువొప్పఁ బలికె ద్రోణాచార్యుతోడ:
"ఎడపక రిపుకోటి [16]కిమ్మైనతావు । గడచివచ్చితి మింకఁ [17]గళవళం బేల?
ఒక్కఁడు రానిమ్ము యుద్ధంబు సేయఁ । బెక్కురీతుల సేన [18]పెకలిరానిమ్ము;
అమితసత్త్వము[19]చూప నమ్మైనవేళ । సమరంబు సేయుఁడు శంకింప[20]వలదు;
దేశకాలంబులు [21]దృష్టించువారు । చేసినపని [22]లెస్స సిద్ధించునెపుడు."

---

1. వీరారి దారుణ వివిధాస్త్రతతులఁ । గౌరవసైన్యంబు గలఁపనోపుదును । మహిమెచ్చ. 2. మాత్స్య. 3. చాటుగానుండు; సాటివై. 4. నాకనుచు. 5. కైదువల । నందుటకును. 6. నిలిపె । గుఱుచంతి సరుకాంతి గలుగుతూగా నెఱిఁగి । సురనదీ 7. జూచి సొరిది. 8. బాసె. 9. వుల్ గూలె. 10. గూలె. 11. వావురంబులు మ్రొగ్గె వసుధ గ్రక్కదలె । వాహిని గోమాయువర్గంబు లఱచె । ననిచెప్ప మఱి యతం డర్జునుఁడగుట. 12. మఱచి. 13. బోలు. 14. యి (య) తఁడు. 15. జడియక. 16. కిడవైన. 17. గలకలం. 18. పెరఁగ. 19. మాన్ప. 20. నేల. 21. దృష్టించి. 22. గాదె.

అనిన ద్రోణాచార్యుఁ డాత్మలోఁ బొంగు । తనయులసమయంబు దాఁటెఁబొమ్మనుచు
నానందమునఁ బొంది యద్ధంబు లేక । సేనలఁ గలయ వీక్షించి యిట్లనియె:
"అదె వచ్చెఁ బులివలె నమరేంద్రసుతుఁడు; । కదుపుల మరలింపఁగలఁ డింక నితఁడు;
ఎక్కటి[1]పోరాట నీకు నొప్పించెఁ । దక్కినవారెంత ధర నర్జునునకు!
ఆఁకలిగొనిన సింహము సామజముల । మూఁకపై లంఘింప మోదించినట్లు
వనవాసముననున్న వంత యంతయును । మనమీఁదఁ బుచ్చక మానునే యితఁడు!
కౌరవసేనలో గాండీవి [2]కెదురు । ధీరుఁడు దూరుపెత్తినఁ గానరాఁడు."
అనుటయు రవిసూనుఁ డాగ్రహం బెత్తి । కనుఁగొని చాపశిక్షకున కిట్లనియె:
"[3]వడి నోరుగాయవు; భట్టుఁడు బోలెఁ । బుడమిఁ గౌంతేయులఁ బొగడుచుండుదువు;
ప్రుక్కఁక నిజము విస్తారంబుగాక । యొక్క [4]కుత్తుకగాదె యొగి వారు నీవు!
నీవిట్లు [5]పొగడిన నిఖిలసేనలకు । భావంబులోపల భయము రెట్టించు;
పెద్దల మిమ్ముఁ గోపింపంగ రాదు; । తద్దయు వివరించి తగవు దప్పకుఁడు.
అర్జునుఁ బట్టి నే నాహవక్షోణి । నిర్జింపఁగాఁ జూచి నీవె మెచ్చెదవు."
అనినఁ గౌరవనాథుఁ డర్థి నిట్లనియె: । "[6]వినుఁడు గాండీవైన వేయునేమిటికి
భావించి మనదృష్టిపథమునఁ [7]బడుటఁ । బోవు నింతియు[8]కాక పోనఁగఁ గానలకు;
కాక వేఱొకఁడైన ఘనబాణతతులఁ । బ్రాకటంబుగ నేసి పాఱఁద్రోలుదము."
అనిన నామాటలకా సేనలెల్ల । మనసులోపలను సమ్మతి సేయునంత,

## శమినిక్షిప్తంబైన గాండీవంబు అర్జునుఁ డుత్తరుచేఁ దీయించుట

సంచితశక్తి నట్లరదంబు నిల్పిఁ । బంచి యుత్తరుఁజూచి పార్థుఁ డిట్లనియె:
"ఎలమితోఁ బాండవు లీ జమ్మిమీఁద । నెలవుగాఁ దమ శస్త్రనికరంబు లిడిరి;
అందులో గాండివం బవసరంబిపుడు । పొందుగా నిటు తెమ్ము భూపాలతనయ!
ఈవిండ్లు కుఱుచ[9]లు నెమ్మోయి సేయ । లావునఁ బసలేదు లఘువు లెంతయును;

---

1. పోరాడి యీకు మెప్పించె. 2. దాఁకు । ధీరుఁ డొక్కఁడు లేఁడు త్రివిధి చూచినను. 3. భళిర పాండవపక్షపాతంబుచేతఁ । బలుమాఱు నీవిట్లుపలవరించెదవు । ప్రుక్కఁక. 4. కంఠమువ గారె యొగి నీవువారు. 5. ప్రేలిన. 6. వినుఁ డర్జునుఁడైన. 7. బడిన; ఒడియె. 8. కాని పోక. 9. లా వేలీల,

కరుల మైమఱువుల ఖండించునపుడు । [1]శరము లే విండ్లను సంధింప రాదు.
కైదువు పసలేని కయ్యంబు గలదె? । అదట నాచేతి కసిగాని కాదు.
ఇమ్మహీరుహమెక్కి యీవు గాండీవము । నెమ్మితోఁ దిగిచి యన్నియుఁ దొంటియట్ల
కట్టి ర." మ్మని శవాకారమై యున్న । కట్టఁ జూపినఁ జూచి కలఁగి యుత్తరుఁడు:
"అదియేమి పీనుఁగు [2]నంటఁ బొమ్మంటి! । నీది యింత తెఱఁగవే యాచరిత్రంబు?
ఎక్కసక్కెములిగాఁగ [3]నిట్లు నీకుఁ । జిక్కితి[4]నని వెట్టిఁ జేయఁ జూచెదవా?
మనసులో నెంచవు మర్యాద కొంత! । [5]సుపిశితాస్త్రములంచుఁ జూపితి శవము;
తెలియఁ[6]జాలదె నీకు దృష్టిపాటవము! । పలసిన సిమ్రాను వడిఁగ నీవెక్కి
యావిల్లు [7]దెచ్చికొ." మ్మన్నఁ బార్థుఁడు । భూవల్లభుని పుత్త్రు బోధించి పలికె:
"ప్రజలు ముట్టకయుండఁ బాండునందనులు । నిజకార్ముకము లిట్లు నిలిపిరి గాక;
పీనుఁగు గా దిది పృథ్వీశతనయ! । పూని నే నక్కైనఁ బుత్తునే నిన్ను?
ఇంక నామాటల కిదియె తార్కాణ; । శంకింప కటఁ బొమ్ము శవ మది గాదు;
వేవేగ నాకును విల్లు దె." మ్మనిన । భూవిభుపుత్త్రుండు భూజంబు ప్రాఁకి
మోపు విచ్చుటయును, ముసల నారాచ । చాప గదా ఖడ్గ చక్ర దీధితులు
నెఱిమీఱ మెఱుఁగులన్నియు నొక్కసారి । మెఱుముకై వడి [8]దృష్టి మిఱుమిట్లు గొలుప
భావించి చూచినఁ బాములై యున్న । వేవేగ వెఱచి య వ్విరటనందనుఁడు
వెలయ నత్తెఱఁగెల్ల విజయుచే నెఱిఁగి । తలకొన్న భీతి యంతయు డిందుపఱచి
తేరిపై నిలుచున్న దేవేం[9]ద్రసుతుని । 'సారథీ', యనిపిల్చి చనవొప్పఁ బలికె:
"ఇంద్రాయుధముపోలె నిది యొక్క విల్లు । సాంద్రదీధితులచేఁ జాల నొప్పారి
గ్రహములలోన భాస్కరునిచందమున । బహుచాపములలోన భాసిల్లు [10]నొకటి;
నహిరాజగుణమగు హరుచాపమైన । సహజమై [11]యుండును జగతి [12]దీనికిని.
ఎవ్వరెవ్వారిలో నివ్విల్లుదాల్తు? । రెవ్వరెవ్వరు దాల్తు [13]రీవిండు?" లనిన
దివిజేంద్రసుతుఁడు [14]పార్థివనందనునకు । వివరింపఁదొడఁగె నా వృత్తాంతమెల్ల:

---

1. శరములు లేవిండు సాధింపరాదు. 2. నంటికొమ్మంటి. 3. లచే. 4. నను. 5. సలలితాస్త్రము లంచు శవముఁ జూపితివి. 6. జాలవు నీవు. 7. నీవె తెమ్మన్న. 8. దృష్టి. 9. ద్రు పట్టి. 10. నిదియు; దాని; గుణమైన హరుబాణమైన. 11. యుండును; యుండదే; యుండును. 12. దీనికిని; నవ్వింట. 13. రివియెల్ల. 14. దాఁ దివిరి యాతనికి; ధాత్రీశపుత్త్రునకు.

### అర్జునుఁడు తన యాయుధములఁగూర్చి యుత్తరునకుఁ జెప్పుట

"తొలుత నీవడిగిన తోరంపువిల్లు । వెలయ గాండివనామ విఖ్యాతినొప్పు;
[1]దనుజ గీర్వాణ గంధర్వ [2]రాక్షసుల । నెనయంగ సాధించె నీవింట నరుఁడు;
ఇది యుద్ధసాధన మిది సర్వరక్ష । యిది యేడుగడయు [3]దేవేంద్రసూనునకు;
ఈ వింటఁ దొడిగిన యిషుపరంపరల । కావల గిరులైన నడ్డంబుగావు.
నుతశక్తి నిది బ్రహ్మ నూఱువేలేండ్లు । చతురుఁడై తాల్చి ప్రజాపతి కిచ్చె;
నలి [4]నతఁ డరువదినాల్గువేలేండ్లు । విలసితగతిఁ దాల్చి వృత్రారికిచ్చె;
ఎలమి వృత్రారియు [5]నెనుబదేనేండ్లు । కలయంగ నిది తాల్చి కమలారికిచ్చె;
అతఁ డంత నేనూఱు[6]హాయనంబులకు । హితబుద్ధి వరుణున కిచ్చె నావిల్లు;
అతఁడు నూఱేండ్లకు నగ్నికొప్పించె; । అతఁడు [7]నిప్పుడు క్రీడి కది తెచ్చియిచ్చె;
అరయఁ గ్రీడియు నిది యరువ[8]దేనేండ్లు । ధరియింపఁగలవాఁడు ధాత్రీశతనయ!
కావున నిది దివ్యకల్పితం బింక । భావింప నితరచాపములెల్ల వినుము.
వెలయ [9]నీలతయును వృషభలాంఛనముఁ । గలవిల్లు పాండవాగ్రజుఁ డొప్పఁ దాల్చు;
ఘనతాళమితియు [10]మర్కటలాంఛనంబు । నొనరినవిల్లు వాయుజుఁ డొప్పఁ దాల్చు;
అనలవర్ణంబు మీనాంకంబుఁ గలుగు । ధను వది నకులుసాధనము యుద్ధమున;
పసుపు[11]వన్నియయును బర్హిలాంఛనము । [12]నెసకమా సహదేవుఁ డీవిల్లు పట్టు;
చదలఁ గ్రొమ్మెఱుఁగులు చల్లు[13]చుండునది । గద చూడు భీముసంగ్రామసాధనము."
అనిచెప్పి మఱియు [14]ఖడ్గాదివర్ణనము । లనఁ బొప్పఁ జెప్ప నిట్లనియె నుత్తరుఁడు:

### అర్జునుఁ డుత్తరునకుఁ దన తెఱఁ గెఱిఁగించుట

" అక్కట కౌంతేయు లస్త్రశస్త్రముల । నిక్కడఁ బెట్టి తా రెటుపోయి[15]నారొ!
ఆ పాండవులకు మేనల్లుండ నేను । రేపునుమాపు వారికి మేలుతలఁతు.
కాంతినెంతయు నొప్పి కల్పవృక్షములు । కౌంతేయులై [16]పుట్టెఁ; గానిచో ధరణి
నా కీర్తిపుష్పంబు లా దాన[17]దళము । లా కార్యఫలము లెయ్యవి మానవులకు?

---

1. తఱిమి. 2. యక్షులను. 3. నా యింద్రనందనున । కీ. 4. నజుం. 5. నెనుబదియేండ్లు. 6. లబ్దంబు (లకును) లైన. 7. గిరీటికి నది. 8. ది యేండ్లు. 9. ంగ నెంతయు. 10. గర్కట. 11. వర్ణంబును. 12. నెసఁగు నా సహదేవుఁ డిలఁ దాల్చు వింట. 13. చున్నదియు. 14. గాండాదివర్ణంబు. 15. రొక్కొ. 16. పుట్టంగలిగెను ధరణి; పుట్టెఁగాద ధారుణిని. 17. గుణము । లా.

ఘనులు వారిప్పు డెక్కడ నున్నవారో ? । కిరీయక నీవెఱింగినఁ జెప్పవయ్య.
ద్యూతంబు తలపెట్టి దుర్యోధనుండు । పాతకంబొనరించి[1] పాడియే తనకు !
దుర్మతి వలఁజిక్కి దుఃఖయైనాఁడు । ధర్మజుఁ డాకీడు తాఁ దెచ్చుకొనియె.
సకలశాత్రవకోటి సమరాంగణమున । నకలంకగతినోర్చు నతిబాహుసత్త్వ
లల భీమ విజయాదు లకట ! యెయ్యెడల । నలజడిపాలైరొ ? యఖిలభూపాల
నల్లభాదీపికా ప్రథగల్గు కృష్ణ । చెల్లఁబో తానెంత సిలుగులంబడునొ !
ఏమని విందునో యేను నీచేత ! । [2]ఏమూట వారిపొం దెఱిఁగింపు." మనిన
ఆతనితోడ నిట్లనియె నర్జునుఁడు : । " భీతినొందకు నా రథేశ్య విక్రములు ;
ప్రీతి [3]రెట్టింపఁ బండ్రెండు వత్సరము । లాతత వనభూములందు వర్తించి
జను లెఱుంగకయుండ సతి[4]తోడఁ గూడి । మనకోట నిపుడు నెమ్మది నున్నవారు.
పరికింపఁ గంకుఁడు పాండవాగ్రజుఁడు ; । వరుస నా వలలుఁడు వాయునందనుఁడు ;
మరుఁబోలువాఁడు దామగ్రంథి నకులుఁ ; । డరయఁ దత్రీపాలుఁ డతని సోదరుఁడు ;
మాలిని పాంచాలి ; మఱి నీకు బొంక । నేల యుత్తర, విను మే నర్జునుండ.
మాలినికై కాదె ! మన భీమసేనుఁ । డా లోనఁ గీచకు [5]నణఁగించి వుచ్చె."
అనిన భూమింజయుం డాశ్చర్యజలధి । మునిఁగి [6]తేలియుఁ గడు మోదించి పలికె :
" తనర నర్జునునకు దశనామకములు । వినఁబడు నవి నీవు [7]వివరింతువేని
నెమ్మి నప్పుడ కాని నీ వాతఁడగుట । నమ్మఁ బో" మ్మనుటయు నరుఁడొప్పఁ బలికె :
" కొలఁది నర్జునుఁడు ఫల్గునుఁడు పార్థుండు । చెలఁగి కిరీటియు శ్వేతవాహనుఁడు
వెలయ [8]బీభత్సుండు విజయుండు జిష్ణుఁ । డిల సవ్యసాచియు నీ ధనంజయుఁడు
నన నివి పది [9]పేరు లా యర్జునునకు । ననుపమస్థితి నొప్పు." నన నుత్తరుండు :
" ఈ నామములు [10]క్రీడి కేరీతిఁ గల్గెఁ । బూని యొండొండఁ జెప్పుము విస్తరించి.
వంత[11]న 'కేను గవ్వడి' నన్న నిన్ను । నింత మాత్రంబున నెట్లు నమ్ముదును !"
అనిన నించుక నవ్వి యవ్వుఁగాక యనుచు । వినిపింపఁ దొడఁగె నావిధ మర్జునుండు :
" అర్జునవర్ణమై యమర నా కీర్తి । యర్జున నామధేయము నాకు వచ్చె ;

1. చెఁ బరిహరింపకయు. 2. ఏమి నీ వెఱిఁగిన నెఱిఁగింపు ; ఏమేమి వారి పొందెఱిఁగింపు. 3. తోడుతను. 4. యుఁ బాండవులు. 5. నణఁచి చొప్పణఁచె. 6. యొంతయుఁ బొద్దు; తేలాడియు. 7. వినిపింతువేని. 8. విష్వచ్ఛుండు. 9. పేస్ళ నా రూఢికెక్కె. 10. వానికెట్టులు. 11. కిపుడు కవ్వడి నేన యనెద । వింత.

ఉత్తరఫల్గుని నుద[1]యించినాఁడఁ । గ్రొత్తగా దేవుఁడు ఫల్గునుఁ [2]డండ్రు నన్ను ;
పృథయను పేరను బృథివి మా తల్లి । ప్రథితమైనది గానఁ బార్థుండ [3]నైతి ;
వెసఁ గిరీటము నాకు వేల్పుఱేఁడీయ । వసుధఁ గిరీటినై వర్తింతు ; మఱియుఁ
దలఁప నా తేరున ధవళ[4]వాహనము । లలరంగ శ్వేతవాహనుఁ డండ్రు నన్ను ;
ప్రథితులౌ రిపుల బీభత్స గావింపఁ । బృథివిలోపల నన్ను బీభత్సుఁడండ్రు ;
[5]సమరాంగణంబుల శాతాస్త్రతతుల । విమతవీరులఁ గూల్చి విజయుండనైతి ;
కలనిలో ధర్మజుఁ గారించునతనిఁ । జెలఁగి చంపుదుఁ గాన జిష్ణుండనైతి ;
దురములో రెండుచేతుల విల్లు [6]దివియ । సరసులు ననుమెచ్చి సవ్యసాచండ్రు ;
మునుమిడి రిపుధనంబులు చూఱఁ గొనఁగ । నను మహీజనులు ధనంజయుం డండ్రు.
ఈ పది[7]పేళ్లు నాకీ కారణమునఁ । బ్రాపించె నేను ధర్మజుని సోదరుఁడ ;
నఱిముఱి [8]నేఁ గల్లలాడ నీ తోడ ; । నెఱిఁ ద్రిశుద్ధిగ నమ్ము నే నర్జునుఁడను.
ఖాండవదహనంబు గావించి సురల । దండించునాఁడు నా దర్పంబు చూచి
శ్రీకంఠుఁడును విరించియు వచ్చి మెచ్చి । నాకు నిచ్చిరి కృష్ణనామధేయంబు ;
మఱివచ్చి సురలెల్ల [9]మంత్రయుక్తముగఁ । దెఱఁగొప్ప నిచ్చిరి దివ్యాయుధములు ;
అవి సాధనములుగా నర్థితో నేను । దివిజేంద్రు రథమెక్కి దివ్యలోకముల
నవిరళ సురవైరులైన నివాత । కవచులఁ [10]గోటిసంఖ్యల గెల్చినాఁడ.
ఇరవొంద సురగణాహితులు హిరణ్య । పుర నివాసకులైన భూరిదానవులఁ
దెఱఁ గొప్ప భాగీరథీతీర భూమి । నరువది వేవుర [11]నర్థిఁ జంపితిని.
అప్పుడు ప్రత్యక్షమై కాదె వజ్రి । యొప్పార నిచ్చె నా కొక కిరీటంబు.
దేవదత్తంబను దివ్య శంఖంబు । దేవసంఘంబును ధృతి నిచ్చె నాకు.
మనుజులు నా తోడ మచ్చరిం[12]చుటకు । [13]గొనకొన రని చెప్పుకొననేల నాకు ?
గంధర్వపతి మున్న గాంధారిసుతుని । బంధించి కొనిపోవ బలిమిమైఁ దాఁకి
విడిపించి పుచ్చితి [14]వినవె నా లావు ? । ఎడపక మఱియు ననేకముల్ గలవు.

---

1. యింపఁ గాను. 2. దనఁజెల్లు. 3. నేను. 4. ఘోటకము. 5. విమతవీరులఁ జంపి విజయుండ నైతి । సమర జిష్ణుఁడఁ గాన జగతి జిష్ణుఁడను. 6. దివియు । పరవిక్షేతను సవ్యసాచినాఁ బోలుతు. 7. నామంబు లీ విధంబునను । బ్రాపించె నాకు ధర్మజుసోదరునకు. 8. గల్లలనాడ నేలయ్య. 9. మంత్రంబు తోడ. 10. గెలిచితిఁ గదనంబునందు. 11. నందంద చంపి. 12. చినను. 13. ఘన భుజాటోపంబు కలిమిఁ జూపుదును. 14. వినుము.

నీ వింక వెఱవకు మఖిల కౌరవుల । నాఃపల్లవులఁ జేసి హతులను గావించి
పన్నగధ్వజు మానభంగంబు చేసి । పన్నుగా మరలింతుఁ బసుల నీక్షణమె.”

## ఉత్తరుఁడు బృహన్నల నర్జునుఁగా నెఱింగి ప్రణమిల్లుట

అనిన భూమింజయుం డానందమంది । [1]జనితాభిషేకుఁడై శమి డిగ్గనుఱికి
సవ్యసాచికిఁ జక్కఁ జాఁగిలి మ్రొక్కి । భవ్యాత్ముఁడై లేచి భక్తి నిట్లనియె :
“శ్రీకంఠ పదపద్మ సేవా ధురీణ ! । ప్రాకట ధర్మజప్రాణ సంత్రాణ![2]
అర్జున, నీవు నన్నాదరించుటకు । నర్జించినాఁడఁ [3]బుణ్యాము లనేకములు ;
ఏను మీ రెఱుఁగక యేమని కొన్ని । కాని మాటలు [4]నిన్నుఁ గడవనాడితిని ;
తప్పు లోఁగొని నన్ను దయసేయు.” మనిన , । నప్పుడు బీభత్సుఁ డరదంబు డిగ్గి
యతనిఁ గౌఁగిటఁ జేర్చి యాదరించుటయు, । నతఁడును మోదించి యర్థి నిట్లనియె :
“మంచు విచ్చినయట్లు మనసులోనున్న । చంచలత్వము [5]వాసె జయశీల, వినుము ;
నీ తేరు గడపుదు నెఱి నింద్రు తేరు । మాతలి గడపిన మాడ్కిఁ గయ్యమున ;
గోవుల మరలింపు కురురాజు నోంపు । నీ విక్రమము చూపు నృపకోటి మెచ్చ.
కోరుచుండుదు నీకు ఘోరాహవమున । సారథ్య మొనరింప జగదేకవీర !
అది నేడు కల్గె దైవానుకూల్యమునఁ । గదలుము తేరెక్కి ఘనలీల.” ననిన
అర్జునుఁ డిట్లను : “అఖిలకౌరవుల । నర్జింతుఁ; [6]గయ్యంబు నిను దాఁకనీను ;
ఆలంబులో నీవు నశ్వరత్నములఁ । దోలుము పసుల గాఁదోలుదు నేను ;
అరయ మీపసులెన్ని యన్నియేనుఁగులఁ । గురురాజు [7]సాధించి గొనితెత్తు నీకు.”
అనిన భూమింజయుఁ డతని కిట్లనియె : । “విను నీవు చెప్పినవిధమె కావింతు ;
మఱవక మేఁ ఘనామవు గాన [8]ముద్దు । మెఱసి యొండడిగెద మెలఁపుతో [9]నిన్ను ;
వదలక [10]పేడిభావంబేల దాల్తఁ । బెదలుపట్టినయట్లు సిద్ధించె [11]నీకు ?
చెప్పవే! [12]యీమూర్తి శృంగారజలధి । [13]నెప్పుడు నినుబోంది నిదియేమిచోద్య !”

---

1. జనితానురాగుఁడై జమ్మి వేనుఱికి. 2. వివిధ సుభద్రామనో వివిధకల్యాణ (?): వితత శుభద్రోణవృద్ధి కల్యాణ । జిత లోకదానవ శిక్షాప్రవీణ । అర్జున. 3. నానాపుణ్యములను. 4. చాల; మిమ్ము. 5. వీడె. 6. గయ్యాన నిన్ను గన్నులమల । గాలియు సోఁకఁ గాఁగాని షైఖరుల । నోలిఁ గాచెదఁ జూడు ముత్తర, యింక. 7. మొనచూఱఁ. 8. నీవు. 9. నీకు. 10. పండభావంబేల యెపుడు. 11. నిట్లు. 12. నీ. 13. యెపుడు నేఁడాతు నిదియేమి నేఁడు.

మనుటయు నర్జునుం డమరలోకమునఁ । దనర నూర్వశి మున్ను దనకిచ్చినట్టి
శాపప్రకారంబు సకలంబుఁ జెప్పి । యేపార నృపసూతి కిట్లనె మఱియు :
"ఎలమితో నీ వింక నీ జమ్మినెక్కి । కలయఁ దనుత్రాణ కంకటంబులును
గవదొనలును హేమకలితబాణములుఁ । దివిరి గాండీవంబుఁ దెమ్ము నా." కనిన
అమ్మహీరుహమెక్కి యతఁడు గాండీవి । తెచ్చున్న యావియెల్లఁ [1]దివిచి యాక్షణమ
కడునొప్పు [2]తక్కటి కై దువు[3]లెల్లఁ । [4]గడఁగి తొల్లిటియట్ల కట్టగాఁ గట్టి
జమ్మి[5]వేగమె డిగ్గె జననాథతనయుఁ; । డిమ్ముల [6]సవిచూచి యింద్రనందనుఁడు
నస్త్రదేవతలకు నతిభక్తి మ్రొక్కి । శాస్త్రక్రమంబున సంతోషపఱచి
పురములు సాధింపఁబోవుచున్నట్టి । పరమేశ్వరుఁడువోలెఁ బౌరుషంబునను
గోత్రారి యిచ్చిన కుండలద్వయముఁ । జిత్రమై[7]నట్టి యుష్ణీషంబుఁ దలఁచి
తప్పక రప్పించి [8]తలచుట్టుఁజుట్టి । యొప్పారఁ గుండలయుగళంబు పూని
దివ్యాంబరముఁ జేర్చి దిండుగాఁ గట్టి । భవ్యాంగరాగంబు పలుచగా నలఁది
యంకురింపుచునున్న హాసంబుతోడ । నంకలు ధరఁగూల నందందు నొక్కి.
అప్పుడు మాళిపై నయ్యర్జునునకు । నుప్పతిల్లినమూడ్కి నుదయార్కుఁబోలి
చెన్నార నింద్రుఁ డిచ్చిన కిరీటంబు । కన్నులపండువై కాంతి [9]దైవాఱె.

అర్జునుఁ డుత్తర సారథికంబగు రథమెక్కి దేవదత్తంబు పూరించుట

నరుఁ డంత రథమెక్కి నానాస్త్రవితతు । లరదంబుపైఁ బెట్టి యతిసంభ్రమమునఁ
గవచ శిరస్త్రాణ కలితుఁడై మెఱసి । కవదొనలునుబూని గాండీవమెత్తి
లలి నెక్కువెట్టి మెల్లన ముష్టిఁబట్టి । వలనొప్ప [10]వరగుణధ్వని సేయు[11]టయును
జెదరె నంబరవీధి శేషాహి వణఁకె । బెదరెఁ గౌరవసేన పృథివి యల్లాడె
[12]గిరులు పాతరలాడెఁ గిటి సంచలించెఁ । [13]దిరమేది దిర్దిరఁదిరిగె లోకములు.
అంతలో మఱియు నయ్యమరేంద్రసుతుఁడు । చింతించె నగ్ని యిచ్చిన కేతనంబు.
అదియు మహోగ్రమై యఖిలమాయలకుఁ । గుదురై మహాభూతకోటులు గొల్వ
వానరాకారమై వచ్చి నిల్చుటయు । మానసంబున మోదమానుఁడై నరుఁడు

1. దివిరి నేర్పునను. 2. లైన. 3. లును. 4. కడఁక. 5. వేగమె. 6. నవిచూప. 7. యున్న విశేషంబు (?). 8. తమకంబుమీర. 9. నొప్పారె, 10. నది. 11. నపుడు. 12. గిరు లూడిపడియె నా కిటి సంచలించె. 13. స్థిర.

చెలువారు నుత్తరు సింహకేతనముఁ । దొలఁగించి ప్లవగకేతువు తేరిమీఁద -
నెత్తించుమంతలో నేతెంచి దేవ । దత్తంబువోఁప నెంతయు సంతసిల్లె.
క్షితీశసుతుఁడును సన్నద్ధుఁడగుచు । నొగ్గలెక్కి హరులమేనులు [1]వేడ్కనిమిరి
పగ్గంబు లాయత్తపఱుచుచో నతని । యగ్గలికను జూచి యాక్రీడి పలికె:
"ఆలస్యమెంతయు నయ్యె నిచ్చోట । లేలెమ్ము [2]పసుల మర్లింపఁబోవలయు;
మెలపుమైఁ దేరు జమ్మికిఁ బ్రదక్షిణము । పొలుపారఁ జేయించి పోవలె." ననిన
నవనీశ[3]తనయుండు నట్లు గావింప । దివిజేంద్రసుతుఁ డొత్తె దేవదత్తంబు.
ఆ మహారవమున నంబుధుల్ గలఁగె; । హేమాద్రిశిఖరంబు లిట్టట్టు వడియె;
అద్రిజ భీతిల్లి హరుఁ గౌఁగిలించె; । నిద్ర[4]మేల్కాని శౌరి [5]నింగికై చూచె;
బలభేది వెఱచి గీష్పతివంక [6]చూచె; । లలిఁ బద్మభవుఁడు కాలంబెన్ని చూచె;
ఉత్తరుండును మూర్ఛనొరఁగె; వారువము । లెత్తిన లేవలే కిలమీఁదఁ [7]గెడసె.
కెడసిన వీక్షించి క్రీడి యేతెంచి । కడువేగ హరుల వాగలు పట్టియెత్తి
వెన్నులు చఱచి వేవేగ నూల్కొల్పి । యన్నరేశ్వరపుత్త్రు నర్థితోఁ దెలిపి
యాలింగనముచేసి యందంద [8]పిలిచి । వాలిన వికృతభావము చక్కఁబెట్టి
ప్రియమొప్పఁబలికెఁ: "గంపింతువే! నీవు । భయమెఱుంగని మత్స్యపతికుమారుఁడవు!
దురమున శంఖ దుందుభినాదములకు । ధరణీశతనయులు తల్లడిల్లుదురె!
[9]వెరవిడివై నీవు వెఱతుగాకేమి । తరమిడి శంఖ మొత్తకమాన [10]నేను
నిట్లింక." ననుడు మహీపాలసుతుఁడు । నిట్లను విజయుతో నెలుఁగుకంపింప:
"భేరినాదము విందుఁ బృథుల శంఖము[11]ల । భూరినాదము విందుఁ బోరిలో నెపుడుఁ
[12]గరిబృంహితము విందుఁ గాని నేనెఱుఁగ । నరభసంబగు నిట్టి శంఖనాదంబు.
కలఁగె గర్భంబును గలఁగె [13]ధైర్యంబు । తొలఁగెఁ బ్రాణంబులు తునిసె[14]గుండియలు;
నాకు నీకపికేతనంబుఁ జూచినను । నీకాంతిఁ జూచిన నెఱి నాకె భీతి.
విమతవీరుల[15]కెల్ల వెఱపఁ [16]బొమ్మనఁగఁ । గ్రమము[17]న భీతి[18]వెగ్గలమయ్యె [19]నాకు."

---

1. పెద్ద. 2. రిపులఁజాలింప. 3. తిలకుండు. 4. మేల్కానె. 5. నింగిబిట్టువిసె. 6. గాంచె.
7. బడియెఁ । బడిన వీక్షించి యాఫల్గునుండంత । గెడపకశ్వముల వాగెలు పట్టియెత్తి. 8. మఱియు.
9. వెఱపరి. 10. రాదు । అనిన నానరుతోడ నా మహీపాల । తనయుఁ డిట్లనియెను దనువు కంపింప.
11. లు । పూరింపఁగా. 12. గరిబృంహితధ్వని కరమొప్ప విందు । నరుదయ్యె నిది యిప్పు డవియట్లు కావు.
13. జత్తంబు. 14. చిత్తంబు. 15. కింత. 16. నీయెడన. 17. తో. 18. యగ్గల. 19. నిపుడు.

అనిన వాసవపుత్త్రుఁ డా యుత్తరునకు । మనసులోపలి భీతి మాన్పంగ వలసి
చిందంబుమ్రోఁతయు శింజినీరవము । నందంద [1]మొరయించి యలవాటు చేసె.
అరదంబు [2]ఘూర్ణించు చరుదెంచు నపుడు । గురు మద్దవిడిఁ బల్కెఁ గురు[3]రాజుతోడ:

### వచ్చినవాఁడు ఫల్గునుఁడని ద్రోణుఁడు రారాజున కెఱిఁగించుట

" ఇంక సందియమేల ? యింద్రనందనుఁడు । శంకింప కిటువచ్చె సమరంబుఁ గోరి ;
అదె వచ్చె దేవదత్తాభీలరవము ; । అదె తోఁచె గాండివ జ్యానినాదములు ;
అదె చూడు దేవేంద్రుఁ డతని లావునకు । మది మెచ్చి యిచ్చిన మణికిరీటంబు ;
అదె చూడు భూతంబు లతి ఘోరభంగిఁ । గదిసి కొల్వఁగ నొప్పెఁ గపికేతనంబు ;
కాకున్న నింత భీకరవృత్తి మనకుఁ । జేకొని తోఁచునే [4]సృష్టి నన్యుండు ?
ఇతనితో మార్కొన నిరవైన తెఱఁగు । చతురతఁ గావింపు జననాథతనయ !"
అనిచెప్పి మఱియుఁ గృపాచార్య భీష్ము(ఁ) । గనుఁగొని పలికె నక్కలశసంభవుఁడు :
" ఇన్ని యుత్పాతంబు లీ సేనఁ బుట్టెఁ । జెన్నారఁ గ్రీడికి సిద్ధించు జయము.
విలుకాఁడు [6]కవ్వడి విల్లుగాండివము । తలపోయ నతఁడు యుద్ధము [7]గెల్చుటరుదె ?
సేనకు నృపునకు సేమంబు గలుగ । నే నొక్క చందంబు నేర్పఱించెదను.
భూతలాధీశుఁడు [8]మున్నాడి పోవ । నాతనివెంట నొయ్యనఁ బోవుఁబసులు ;
ఈవల మనయోధులెల్ల [9]నేఁగుటయు । నా నచ్చు క్రీడికి నంద [10]పీ పసులు."
అనవుడు విని కౌరవాధీశ్వరుండు । తన మహారథుల నందఱఁ జూచి పలికె :

### దుర్యోధనుఁడు ద్రోణు నొవ్వనాడుట

"ఓహో ! విచారింప కూరక మీర । లాహవంబునకు సన్నాడుచున్నారు.
ఆడికవడి జూదమాడి కౌంతేయు । లోడిననాఁడు. తా ముగ్రాటవులను
జరియించి పండ్రెండు సంవత్సరములు । నొరు లెఱుంగకయుండ నొక యేఁడుగడప
[11]నొడఁబాటు చేసి; రా యొడఁబాటు చక్కఁ । గడపకమున్నెల కాన్పించు నరుఁడు ;
ఇప్పుడేమిటఁదప్పె నెల్ల పాండవులు । నెప్పటియట్ల పోయెదరు కానలకు ;

---

1. పరఁగించి. 2. వీతెంచు నారవంబువిని; వీతెంచునప్పుడు మఱియు. 3. నాథు. 4. చేష్టితంబుగను. 5. ఏవ్వు. 6. గాండీవి. 7. సేయు. 8. పోవుచున్నాడి. 9. గల్గఁగను. 10. వు. 11. నొడఁబడి రిట్టుల యొడ్డఁబాటుచక్క.

ఈ తెఱంగంతయు నిట నచ్చునప్పుడు । మీతోడఁ జెప్పితి [1]మీఁదు చింతించి ;
యెక్కుడు తక్కువ లీ కాలమునకు । సిక్కంబు భీష్ములు నిర్ణయించెదరు.
వెనకొంత తెఱఁగులై సిరాట భూపాలు । పసులఁ బట్టుటయొల్లఁ బాండునందనులఁ
జూడ నింతియకాదె ? చూచితి మితని ; । వేషము [2]నరోకఁడైన వివరింతుఁ బ్రమతు;
పరికింప మేలయ్యెఁ బసులఁ బట్టితిమి. । నరుఁడైన హరుఁడైన నా కేల వెఱవ ?
రానిమ్ము వచ్చిన రణము సేయుదము । సేనల [3]శిక్షోడ జాసినయట్టి మనము
సరగ జయింతుము చంచలింపకుఁడు ; । అరుదెంచె రథి[4]యోధు లాయత్తపడుఁడు ;
పరికింపఁ బగవాఁడు పాత్రుఁడుఁ బడిన । కరణి నర్జునుఁ డొంటిగా వచ్చె నేఁడు ;
సంతసింతుము గాక సైన్యంబు బెదర । నింత భూషింతురో యెమరైన రిపుని ?
అనుకూల పవనంబు [5]సహరి హేషితములు । మన సేనలోఁ గల్గె మనము గెల్చెదము ;
గురుఁడిట్లు గాండీవిఁ గొండగాఁ జెప్పెఁ । బరఁగఁ బాండవపక్షపాతి గావునను ;
నీతిశాస్త్రపుగోష్ఠి నెఱిఁ జేయునపుడు । నాతత శస్త్రవిద్యలు నేర్పునపుడు
ననిచినతమి భోజనము సేయునపుడుఁ । బొసర సిష్టాలాపములు పల్కఁగాని
కలశజుఁడని సేయఁగలవాఁడు గాఁడు ; । తొలఁగింత మతఁడేల దురములోపలను ?
ఏపార నొక కొంత హితుఁడయి మనకు । రూపింప మేలుగోరుచు నున్నఁ జాలు."
అనిన నశ్వత్థామ యధిపు నీక్షించి । వినయమని మొగమోట విడిచి యిట్లనియె :

## అశ్వత్థామ దుర్యోధను నధిక్షేపించుట

"ముసలి బోయలగెల్చి మొదవులఁ బట్టి । వసుధేశ, నీ కింత వలదు గర్వింప ;
అసుల గెల్చుటలేదు పార్షించిపుడికి । నరుగుటలేదు మీఁ దరయఁగా వలదె!
ధరణీశ, కుటిల జూదము నేరనట్టి । గురుఁడేల కృపుఁడేల కురురాజ, నీకు !
అడియును నీక నేల యఖిల పాండవులుఁ । గదలివత్తురు రాజ్యకాంక్ష నెల్లుండి ;
అలనాఁడు శకునితోడైనఁ బాండవుల । గెలిచిన ట్లిప్పుడు గెలుతు గాకేమి !
ఘనతఁ గవ్వడి పాచికలు వేయు రాఁడు । వినుతబాణము లేసి విదళించుఁగాని ;
లీల నాచార్యుఁ బల్కిన యట్లుగాదు । తూలి తొప్పరలాడు దురములోఁ గ్రీడి.

---

1. మీరేల పదర. 2. గయ్యంబు విజయుతోఁ గల్గె. 3. లోన వ్రాలిన మేలుమనకు । జయము గాకిది మీరు చంచలింపకుఁడు । నయముతో మీరలు నామాటవినుఁడు । అరుదెంచె. 4. యోధుఁడాయత్త. 5. లతి ఘోషితములు । మనకుఁ గల్గెను ఇంక మనము.

నిలిచి కవ్వడితోడ నీవు మార్కొనఁగ । [1]నెలమిఁ జూచెదముగా కొంకుఁ బోయెదము.
అక్కట ప్రియశిష్యుఁడని ద్రోణుఁడతని । నొక్కింత పొగడిన నోర్వలేవైతి !
కిన్నర సుర సిద్ధఖేచరు లతని । సన్నుతింతురు మాన్పఁజాలుదె నీవు ?
అదియును గాక ద్రోణాచార్యుఁ డెప్డుఁ । గదనంబు సేయఁడుగాక, చేసినను
దిక్కులు వ్రక్కలై ధృతిఁ బట్టపగల । చుక్కలు పొడుచు శేషుఁడు మూర్ఛపోవు.
అది యెన్న నేల ! మీ రందఱుఁగూడి । పదిలమై యుఱుదెంచు పసులఁ బట్టినను
ఎలమితో నుత్తరుఁ డిట వచ్చెనేని । తలపడి పోరాడఁ దగుఁగాక ; తప్పి
కౌంతేయుఁ డరుదెంచెఁ గడఁగి యవ్వీరు । చెంతఁ జేరెడివానిఁ జెప్పుమీ." వనిన,

## కర్ణుఁడు బీరములు పల్కుట

నంతయు విని కర్ణుఁ డతని కిట్లనియె : । "కౌంతేయు నిర్జింపఁగా నేను గలను ;
పనుపడి మీ రేల పాండునందనులఁ । గనుఁగొన [2]వచ్చి యిక్కడ పార్థుఁ జూచి
చలమునఁ బోరాడ సన్నాహపడక । పలుమాఱు నా వీరుఁ బ్రస్తుతించెదరు !
ప్రకటిం[3]చి వెఱచెడి వారలు తొలఁగుఁ ; । డొకని నొక్కఁడ చాలు యుద్ధంబు సేయ.
కవ్వడి చాపంబుఁ గపికేతనంబు । దవ్వులఁ ద్రుంచి యాతని నాక్రమించి
సప్తాంబురాసులు సప్త శైలములు । సప్తలోకంబులు [4]సంచలింపఁగను
కోపాగ్ని బాణాగ్నిఁ గూడ మైకొలిపి । చూపెద నాలావు [5]చూడరె మీరు ?
అదె క్రీడి పదుమూఁడు హాయనంబులకు । వదలక తనదు సత్త్వము జోకచేసి
ధృతిఁ బూదిపట్టి యేతెంచె ; మీ రతని । జితలోకుఁడని పెద్ద సేయుచున్నారు.
ఏనును బంటనే హిత[6]వృత్తితోడ । నీ సరేశ్వరు సొమ్ము హితముగాఁ గుడిచి
గాండీవి గెలిచినఁగాని కాదనుచు । [7]నుండిన నింతలో నొదవెఁ గయ్యంబు ;
అతని నా లోని యీ యధికత్వ మెఱుఁగ । ధృతిఁ గోరు జనుల సందేహంబు[8]మాన్తు ;
రమణతో జమదగ్నిరాముచేఁ గన్న । యమిత శస్త్రాస్త్ర విద్యలు విస్తరింతు.
మొగి సారసత్త్వాల మొనవాఁడఁ జేయు । పగిది నర్జును నంత ప్రస్తుతింపకుఁడు.

---

1. ఎలమితో నుత్తరుఁ డిట వచ్చెనేనిఁ । దలపడుదుము గాని తలఁప నర్జునుని । అనిన రాధేయుఁ డుగ్రాకారుఁ డగుచు । జనపతి మెచ్చ నశ్వత్థామఁ జూచి । యింత చింతింప నీ కేల యుద్ధమునఁ । గౌంతేయు నిర్జింపఁగా. 2. నిటువచ్చి కౌంతేయు. 3. ప మీరలు పొలుపోఁ. 4. చ. 5. చూడుఁడు. 6. బుద్ధి. 7. నుండితి నున్నందు. 8. మాన్ప.

పై పచారమె కాని పౌరుషంబున[1]ను । ఆ పార్థుఁడేమి [2]కార్యము సేయనోపు !
గోవుల వెనుకఁ జేకొని మీరు కూడి । పోవుట మేలు గుంపులుగట్టి. " యనినఁ

## కృపుఁడు కర్ణునిఁ బరిహసించుట

గిలకిలమని నవ్వి కృపుఁ డొప్పఁ బలికె : । " పలుకనేర్తువు కర్ణ, బహుభాషణములు !
పలుకు మాత్రమె [3]గాని పలికినయంత । నిలవాకు చేసిన నేమేమి గాదు !
కవ్వడి నిర్జింపఁగలవు నీ వనిన । నెవ్వఁడు నమ్మెు ? [4]నిన్నెఱుఁగమే మొదల ?
గాండీవి ద్రౌపదిఁ గైకొన్నఁ [5]గనలి । మెండైన నృపు [6]లెల్ల మెఱసి [7]పోరాడి
యతనిచే గజిబిజియై [8]పాఱినాఁడు । జతనమై నీవు నచ్చుటఁ బాఱ[9]లేదె ?
పతిభక్తి గలవని పరికింతు మేని, । పతి మున్న గంధర్వపతిచేతఁ జిక్కఁ
జేయవైతివి లావు ! చేతులు కూర । గోయఁబోయెదె కర్ణ ! కోపింప వలదు.
'ఒంటి వచ్చిన క్రీడి నోర్తునే' నంటి । వొంటిమైఁ గాలకేయులఁ జంపె నితఁడు ;
ఇంద్రాది దివిజుల నితఁడొంటి గెలిచె ; । [10]చంద్రశేఖరు నొంటి సాధించె నితఁడు ;
[11]చూచినవారెల్లఁ జోద్యంబు నొంద । నేచి యాదవసేన నితఁడొంటి గెలిచె ;
ఎలమిఁ గౌరవసేన [12]నెన్నికకెక్కఁ । గలుగు దీ వెన్నఁడే కయ్యంబులోన
నిలిచి గెల్చితివది నిక్కంబు దెలుపు. । పలుకనేర్తువు [13]చాలఁ బలుకులింకేల !
పోటుమాటలె కాని బుద్ధిమార్గంబు । [14]నూటి నీ వెఱుఁగవు ; సూక్ష్మంబుగాను
వివరింతు మది నీకు వినుము ; కౌంతేయు । లవనిఁ [15]బ్రఖ్యాతసమర్థు లందఱును.
చెచ్చెర నంభోధిఁ జేయీఁత నీఁద । వచ్చినవచ్చు ; వివ్వచ్చు గెల్వఁగను
గావు పో ; ద్రోణుండు గాంగేయుఁడేను । నీవు నీ తమ్ముఁడు నృపుఁడు సైన్యములఁ
గూడి తాఁకినఁగాక, ఘోరాహవమునఁ । గ్రీడితోనొంటిఁ దాఁకిన [16]నోర్వవశమె ?
అనుటయు రాధేయుఁ డాజ్యంబుపడిన । యనలంబుక్రియ మండి యతని కిట్లనియె :
" అగు నీవు పగతుర [17]నతిభక్తితోడఁ । [18]బొగడుట యెల్లను భూనాథుఁ డెఱిఁగె ;
ఎఱిఁగి[19]యుఁ నిను బిల్వఁ ; డిదె మిన్నుపడిన । నఱచేతు లి[20]డను సాహసులున్నవారె !

1. కు. 2. ధాన్యములోని వాఁడు (?). 3. గాక. 4. మున్నెఱుఁగమేనిన్ను. 5. నలిగి. 6. లతో. 7. పోరాడ. 8. పోవు. 9. దగునె. 10. ఇంద్ర దిక్పాలవారినితఁడొంటి గెలిచె. 11. ఈ ద్విపద తంజా. ప్ర. లో లేదు. 12. నెన్నఁడో గెలిచె. 13. చాలు. 14. చోటు. 15. బ్రత్యేక. 16. గెల్వ. 17. నవలీల. 18. బొగడనేర్చుట యెల్ల. 19. రే. 20. డఁగ.

చేకొని [1]యీ రాజుసిరి యడ్డ[2]మూఁక । లేక భోగించితి లీలతో నీవు;[3]
వెడలు మిచ్చటఁ బాసి వివిధ యజ్ఞములఁ । గుడిచి నెమ్మదినుండు ఘోరాజి యేల ?[4]
నేను విల్లందిన నింద్రాది సురల । నైనను విదళింతు నా పార్థుఁడెంత !"
అనిన భీష్మాచార్యు లతని మాటలకు । మనసునఁ గోపించి మనుజేంద్రుఁ జూచి:

## భీష్ముఁ డెల్లర శాంతింపఁ జేసి ప్రస్తుతకార్యపరులఁ జేయుట

"కలశజు పలుకొప్పఁ గలశజాత్మజుని । పలుకును; మేలు తప్పకపల్కెఁ గృపుఁడు;
కర్ణుండు తనదు సంగ్రామపాటవము । [5]నిర్ణయించెడిఁ గొంత నీమ కక్కెదుటఁ;
తగిలి కోపించి పెద్దల ధిక్కరింపఁ । దగదు; నీకును వినఁదగదు, వారింపు;
ఏ కాంగిఁ దలపడి యెలమి నర్జునుని । భీకరాకృతి [6]నోర్చు బిరుదువాఁడైన
నరనాథుచేత మన్ననఁ బొందుఁగాక । పరనింద [7]చేసి పాపముఁ బొందనేల !
కొనియాడుదురు శత్రు[8]కోటుల నైనఁ; । బని మోచునపుడు దోర్బలము చూపుదురు·
ధరణిఁ బెద్దలజాడ తానేమి యెఱుఁగు ? । సురల నైవేద్యంబు శునక మేమెఱుఁగు ?"
అనిచెప్పి గాంగేయుఁ డాచార్యుఁ గృపుని । ఘను ద్రోణనందనుఁ [9]గడఁగి ప్రార్థించి:
"పని చాలఁగలదు బీభత్సుఁ డేతెంచె । మనలోన మనకింత మచ్చరంబేల ?
[10]కలహా సన్నాహంబు గడఁగుఁ డన్యోన్య । కలహంబు కొఱగాదు కదనంబుచోట.
వేదంబులును ధనుర్వేదంబుఁ గలుగు । భూదేవులును మీరు భూప్రసిద్ధులును;
కావునఁ గురుసేనఁ గల మేలుఁగీడు । నేవంక వ్రాలునో యెంచంగవలదె ?
కాపేయరతుఁడైన కర్ణుమాటలకుఁ । గోపంబుమానుఁడు కురురాజుఁ జూచి."
అనిన దుర్యోధనుం డపుడు తాలేచి । [11]మునుకొని యాచార్యముఖ్యులఁ జూచి
బలసి భీష్ముఁడుఁ దాను భానునందనుఁడుఁ । గలశజుఁ బ్రార్థింపఁ [12]గలఁక పోవిడిచి
పరివేషనిర్ముక్త పద్మా[13]రివోలె । వరదుఁడై ద్రోణుండు వలనొప్పఁ బలికె:

---

1. మా. 2. మింత. 3. కుడిచిన దానికిఁ గొదవ లేదెందు । వెడలు. 4. బడుగు బాపఁడ, నీకుఁ బతి సంతసింప । నేను విల్లందిన. 5. నిర్ణయించును గాక నృపుని. 6. చేర్చు. 7. లాడి. 8. కోట్లనెందైన. 9. గడు వేఁడుకొనుము. 10. కడుకొని యన్యోన్య కలహంబు మాని । తోడఁ గుఁడు బీభత్సుదురములో గెల్వ — కలహాసన్నాహంబు కడఁగి మత్సైన్య । కలహంబు మానుఁడు కురురాజుఁజూచి. 11. యలభీష్ముఁడును గర్ణుఁడను గమింపఁగను । గలశజు. 12. గనలు. 13. ప్తు.

"మానెఁ గోపము భీష్ముమాట విన్నపుడె; । ఏచేలఁగోపింతు నిట్టి[1]కార్యమున?
క్షితినాథు [2]నిదె సురక్షితుని జేయుదము; । ప్రతివీరులకు బాహుబలముచూపుదము.
[3]జననాథుఁ డిప్పుడు సమయంబు దాఁటె । నని పాండవుల నాడె యది విచారించి
భీష్ముఁడుత్తరమిచ్చుఁ బ్రియమునతో." ననుచు । భీష్ముఁ డిట్లనిపల్కెఁ బృథివీశుఁజూచి:
"అధికమాసమ్ము రెండవయేట వచ్చె । నధిప, పాండవు [4]లిప్పు డవియెల్లఁ గూర్చి
పుడమిమెచ్చఁగఁ బదుమూఁడవయేఁడు । కడమ సండించిరి [5]కాదనరాదు.
సమయంబు నిండక చనుదెంచుపనులు । యమసూతి సేయింపఁ డనుజులచేత.
ఆపాటివారైన నాస్థానసీమ । ద్రౌపదిఁ [6]బగవారు తలపట్టియీడ్వ
[7]వెలయఁ గన్నులుగల వేల్పులై చూడఁ । గలరె! పీడింతురుగాక లోకములు!
వా రింతకాలంబు వనభూమిఁ దిరిగి । [8]క్రూరులైయున్నారు కురుసేనమీఁద.
అటు[9]మీఁద నర్జునుఁ డరుదెంచినాఁడు । నిటలాక్షు గెలిచిన నెఱవాది [10]యితఁడు.
ఇంత శూరుని [11]గెల్వ నిపుడు మాతోడఁ బంతమాడఁగ రాదు; భాగ్యంబు కొలఁది.
కాదేని యని సేయఁగాఁ జెప్పినట్లు । రాదట మేలును గీడు రణశూరునకును.
సంధిసేయుట మేలు సకల [12]భాగ్యములు । సంధించు [13]మనకు నచ్చలమేల!" యనిన
బలిమిఁ బార్థివుఁడంతఁ బార్థుతో నపుడు । సలలితముగ యుద్ధసన్నద్ధుఁడగుచు:
"సంధిమాటలు మీరు సంధింప [14]వలదు; । బంధుత్వమున రాజ్యభాగంబు నీను;
పోరాడఁ దొడఁగుదు భుజశక్తి." [15]ననిన । నాయూథిఁ దోఁపంగ నాచార్యుఁ డనియె:
"రాజున[16]కంటె సంగ్రామకార్యంబు । భూజను[17]లకు నేరఁ బోల; దక్షైన

---

1. మాటలకు. 2. కిదెసురక్షితము. 3. జననాథుఁడనెఁ గ్రీడి సమయంబు దాఁటె । నని కిట్లు వచ్చుట నది విచారించి. 4. లిట్టు లవియెల్లఁజూచి. 5. కానరే మీరు. 6. మీరట్లు.

7. కనియు నూరకయుంట కటు ధర్మపాశ । మునకు లోఁబడి కాలమును వేచియుంట । కనియేల తెలియరయ్యాభీల శౌర్య । ధనులు నాఁడె తతియఁ దాఁకిన మిమ్ము । నరిమురిఁ జక్కాడి యమలోకమునకుఁ । దెరువు చూపర మీకుఁ దెలివిడీల్వడియె (ము. ప్ర).

8. వారక యజ్ఞాతవాస కష్టములు । తాలిమి నోరిచి తమపూన్కి నెఱపి । వాలిన కోపాగ్ని ప్రజ్వరిల్లఁగను । క్రూరులై యున్నారు కురువార మనఁగ । నేరీతిఁ జూచిన నెద భీతియడరు । నటు మీఁద. 9. చూడుమర్జును. 10. వాఁడు. 11. గెల్తు నిపు డంచుఁ బలికి. 12. యత్నముల. 13. గాకింత చలమేల మనకు । ననిన సుయోధనుండా భీష్ముతోడ – వినవయ్య నేనెన్ని విధములనైన । నలవడఁ గ్రీడితో నడరి యుద్ధంబు । చెలువారఁ జేయుదు సిద్ధమీ పలుకు । సంధి మాటలు. 14. రాదు. 15. ననియె । నారీతి నృపుఁడాడ నాచార్యుఁ డనియె. 16. కైన. 17. లెఱుఁగంగ.

నే నెఱింగిన యంత నేర్పఱించెదను. । సేన నాలవపాలు [1]సేవింప నృపుఁడు
మున్నాడిపోయిన మొగి నంతసేస । [2]తన్ను గొల్వఁగఁబోవుఁ దగిలి గోగణము.
వెనుకొని [3]యక్లైన విభుఁడు గోవులును । మనభూమిఁ జొచ్చు నెమ్మది నీ క్షణంబె.
నానా ముఖంబుల నరుఁడు వచ్చినను । సేనకు [4]నడ్డంబు సేయు మే." లనిన (?)
నెలమితో [5]భీష్ముండు నిదియె మేలనుచు । బలము భూవిభునకు [6]భాగించి యిచ్చి
యతని ముందఱఁబుచ్చి యంత సైన్యంబు । ధృతిఁ బంచి గోవులఁ దెఱఁగొప్పఁ బుచ్చి
వెనుక నుజ్జ్వలసైన్య [7]వినరంబు మెఱయ । [8] మొనసేసి యపుడు నిమ్మల ద్రోణు నడుమఁ
దలకొని కర్ణు ముందఱఁ గృపాచార్యు । [9]వలపలి తల నిల్పి వరుస నెల్లెడల
శకుని వికర్ణ దుశ్శాసన ద్రౌణి । [10]శుక బాహ్లికాదులా శూరపుంగవులఁ
దనర నిల్వఁగఁ బంచి తా నందఱకును । వెనుక[11]నై సన్నాహ విభవంబు మెఱసి
పరికింపఁ దగు తాటిపడగ యెత్తించి । యరుగుచు నుండెఁ దూర్యములు ఘోషింప.
అంత నింద్రుఁడు దివ్యమగు విమానమున । నంతరిక్షంబున నరుదెంచి నిల్చి
పరసులై సురలు ఖేచరులుఁ గిన్నరులు । గరుడ గంధర్వులుఁ గరమర్థిఁ గొలువఁ,
[12]జక్రిప్రాపునఁ గాలచక్రంబు [13]గెలుచు । చక్రవర్తులు రాజ[14]చక్రంబుఁ గొలువ,
'నీ మహారథులతో [15]నితఁ డొంటిఁ దాఁకి । యేమి సేయఁగ నోపు! నిది చోద్య!" మనుచు

## అర్జునుఁడు కౌరవసైన్యముఁ గవియుట

వీక్షించుచున్నచో, విజయుఁ డాకీతి । నక్షీణ [16]శత్రుసైన్యములపైఁ గదిసి,
కొలఁది మీఱిన [17]దైత్యకోటుల [18]మీఁద । బలశీలుఁడై పోవు బలభేది పోలెఁ
దడయక బహుపయోధర పంక్తి మీఁద । వడిఁగూడి చను గంధవాహుండు పోలె
నతి [19]ఘోర గాండీవ జ్యానినాదంబు । ప్రతిపక్షులకుఁ బ్రాణభయము సేయఁగను

---

1. సేయించి. 2. తెన్నాడు కదుపుల తెసఁజుట్టి చనును । తక్కటి సగముతోఁ దగ మోహరించి । యుక్కుపైఁ. । 3. పోవనవ్విభుఁడు. 4. యుద్ధంబు సేయఁ బొండనిన. 5. గర్ణుండు నిదియె మేలనియె। అల ద్రోణు మాటల నాలించి భీష్ముఁ । డెలనవ్వు చెలువార నీకొని యపుడు । బలము. 6. పాలించి. 7. విభవంబు. 8. మొనసి యా సేనకిమ్మల. 9. వలపటఁ దను నిల్చి వరుస ముందటను. 10. శుకసోమదత్త బాహ్లిక సైంధవులును; శకుని సోదరులును సకల బాంధవులు మనమున సన్నాహమగ్నులై యంత. 11. పై సంతత. 12. చక్రంబునను. చక్రిపంపున. 13. గెలిచి. 14. చక్రముల్. 15. నిట్లొంటి. 16. శక్తిసైన్యములపై నడచి. 17. సైన్య. 18. తోడ. 19. ధీర.

దరమిడి దేవదత్తంబు పూరించి । కురుసేన గుండెలు గుస్కరించుచును,
గపికేతన జ్వాల [1]కబళించి విడువ । నృపుల చిత్తంబులు సెఱు చేయుచును,
[2]ఏయఁడు చూడఁడు ఇంక నొక్కొక్కఁడు । వేయఁడూరకె సేన పత్తిగెంబో యనఁగఁ
బలుపినంతనె మింటి వలదీగె మెఱుఁగు । మెఱసినగతిఁ దేరు మెఱసి యేతేర,
దళములఁ గ్రోశమాత్రంబులోఁ గూడి । తలయెత్తి చూచి యుత్తరున కిట్లనియె :
"[3]అదె చూడు కురుసేన లదెచూడు మొనలు । పదపడి యొంటరింపఁ బౌఁజులతోడ
నరుదైన వాద్య ఘోషములు మిన్నందఁ । దిరిగి పోయెడు మూఁకఁ దెఱఁగులై మెఱసి,
ఈవలి పౌఁజు దానిది మహాఘనము ; । భావింప నడుమ నల్పంబు సైన్యంబు ;
ముందఱ నల్లదె [4]మొత్తము కొంత । యెం దున్నవాఁడొకో యీ [5]కురువిభుఁడు ?
తడయక యతనిఁ జూతముగాని తేరు । నడపుదుగాక సేనకు దాపలించి.
[6]అజుఁ డడ్డమగునేని హరుఁడడ్డమైన । నిజబాణతతులచే నిర్జింతు వినువ.
అంతట సేన కన్నది కన్నవంక । నెంతయ్యుఁ బనచెడు నితఁడు చిక్కనను.
ఈ పౌఁజులోపల నితఁడు లేకున్న । వే పోయి గోవుల విడిపింపవచ్చు.
అక్కడ రొదసేయ నప్పుడైన డాయ । [7]"చిక్కకపోఁ" డంచుఁ జిత్రంబుగాను
నరుఁడు చెప్పిన యంత నరనాథతనయుఁ । డరదంబు నడపింప నపుడు సైన్యముల
నరసకె తెంచి యా సర్పకేతనునిఁ । బరికించి యందులోపలఁ గానరాక
నరుఁడట్టి సేనకు నడుమ ముందఱను । వరుసతో [8]దక్షిణ వామభాగముల
వెనుక దిక్కుననున్న వీరవర్గముల । నొనరంగ భూమింజయున కేర్పరించి :
"[9]తొలఁగు మిచ్చట లేఁడు దుర్యోధనుండు । [10]తలకొని పసివెంటఁ దాఁబోవనోవు.
లీల [11]నిచ్చట రాజులేని కయ్యంబు । నేల సేయఁగ [12]మన కీ సేనతోడ ?
పోదపోద మన తేరుపోవని" య్యనుచుఁ । బదిలంబుగాఁ జెప్పి బలభేదిసుతుఁడు

---

1. గగనంబునందు.

2. ఏయుఁడు చూడగా నిటు రాకపోఁడు । వ్రేయుఁ డంచును గురువీరు లార్వఁగను । మెఱసిన మింటఁగ్రొమ్మెఱుఁగు చందమున । మిఱుమిట్లుగొనఁదేరు మెఱసి యేతేర.

3. వెరవక కురుసేన వేచూడు మొనలు । తిరిగి పోయెడిఁ జూడు తెఱఁగులై చూడు । మీవలి పౌఁజా నిదెంతయు ఘనము । భావింప. 4. మొత్తమదా సేన. 5. సైన్య. 6. అతఁ డడ్డమగునేని హరుఁడడ్డమైన । వితత బాణములేసి విఱుతుఁ బోనీను. 7. చిక్కుఁ జిక్కకపోఁడు. 8. నుభయ పార్శ్వముల భాగముల. 9. తొలఁగె నిచ్చట. 10. తలఁగి పసులవెంట. 11. యొప్పఁగ. 12. నాకు నీ.

[1]కృతభక్తి ద్రోణ గాంగేయుల కృపుల । శ్రుతి పాదయుగళ[2]ముల్ సోఁక రెండేసి
బాణంబులేసినఁ బరిజనంబులకు । ద్రోణుఁ డర్జునుఁ జూపి [3]తోడరి యిట్లనియె :

## ద్రోణుఁ డర్జును నగ్గించుట

"అర్జును జితమల్లికార్జునుఁ జూడుఁ । డర్జునవర్ణ విఖ్యాతవాహానుని
తేరు మేఘమువోల దేవేంద్రుఁ డనఁగ । నారూఢగతి నొప్పె నదె చూడుఁడితని.
చరణాబ్జములమీఁద సాయకద్వయము । కరమర్థి మ్రొక్కుటగా నేసి మఱియు
సోఁకి సోఁకములుగా శ్రుతిపుటంబులకు । సోఁకునట్లుగ నాదు సుఖమెల్ల నడిగె.
ఇడుమలఁ బడి [4]నొచ్చి యింతకాలంబు । నడవి నుండిన [5]శోకమంతయుఁ బుచ్చి
సమయంబు వెస నిశాసమయంబు భంగి । నమరంగ [6]నెఱపి మార్తాండుఁడై [7]కదిసె."
అని గురుండాడంగ నా భీష్మకృపులు । మనసున నరుఁడేయు మార్గణంబులకుఁ
గుశల ప్రశ్నంబు మ్రొక్కుటయుఁ గాఁ దెలిసి । యసమున మోదించి. రంత నర్జునుఁడు
తక్కినవారికి దర్శింప రాక । గ్రుక్కక పసులేఁగు చోటికై పోవ,
నాతనిఁ జూచి దివ్యాపగాసుతుఁడు । నాతత కురుసేన కర్థి నిట్లనియె :
"నరుఁ బెద్దకాలంబునకుఁ జూడఁ గల్గె । నరసుఁ డీతఁడు వీని సౌజన్య మొప్పు.
ఇన్నరు వీక్షింప నింద్రుండు వేయుఁ । గన్నులు ధరియించెఁ గానోపు మొదల.
కలఁగక మన పౌఁజుకై వచ్చి తాను । దొలుతను దన తేరు తొలఁగఁ దోలించె.
బలములఁ గ్రీఁగంటఁ బరఁగఁ జూచుచును । వెలయఁ గౌరవరాజు వెదకుచున్నాఁడు.
చిక్కినఁ గరిరాజు సింహంబు చేతఁ । జిక్కినచందంబు సిద్ధించుఁ బతికి.
[8]నరనాథు మననందునకుఁ గ్రీడిచనినఁ । గురురాజు విడిపించు కొనరాదు మనకు ;

---

1. అతివేగ భీష్మద్రోణాచార్యసుతుల. 2. ంబు. 3. తొలఁగఁ గీర్తించి । ఒనర గాండీవము విద్యుల్లీలఁ గ్రాల । వనచరధ్వజరావ పటు గర్జ లాలయ । జలదాకృతిం దాల్చి జవమొప్పవచ్చు । నల రథంబునఁ జూడుఁ డలరారు నదిగో । పర్జన్యునోజ దోర్బలసాంద్రుఁ డగుచు । నర్జునుం డిదె చూడుఁ డస్త్ర యుగ్మముల । నా పాదముల మ్రోల నయమొప్ప నేసి । యేపునఁ బూజించె నింతయే కాక । సోఁకిసోఁకములుగా. 4. వారలింత. 5. కోప మటఁ బుచ్చు నేఁడు. 6. పుచ్చి. 7. వచ్చె । నని చెప్పుచున్నచో నాభీష్మకృపులు । మనములలోన సమ్మతి సేయునపుడు । దమకు మ్రొక్కుటగాఁ దమ సేమమరయు । క్రమముగా నెఱిఁగి లోఁగడఁగిరి క్రీడి । తక్కినవారికి. 8. మనకు నాతనికిని మధ్యంబు క్రీడి । చన రాజు విడిపింపఁ జనునొక్కొ మనకు.

అతని కొక్కటియైన నఖిలంబుఁ జిప్పు ; । నితర కార్యములేల యీ గోవులేల ?”
అని సేనలును దాను నతులవేగమున । జననాథు మొనఁ జేరఁ [1]జను దెంచునంత,
మొదవుల వెనుక నిమ్ములఁ బోవు ప్రజయు । నదె వచ్చె నరుఁడని యాసంద [2]పఱచె.
గోవుల నరుఁడంతఁ గోశద్వయమున । వేవేగఁ గూడి భూపతిసూనుఁ బలికె :
“చేకొని కూడ వచ్చితిమి గోవులను ; [3]వే నరుఁడిఁ బఱతెంచె [4]వెనుక సైన్యంబు
[5]లరదంబు రెండు సైన్యముల మధ్యమున । నరుదార నడపు ; బాహాశక్తి నేను
ద్రిప్పుదుఁ బసుల ; నుద్రేకించి రిపులఁ । గప్పుదు శరవృష్టిఁ ; గలఁతుం భూనాథుఁ

## అర్జునుఁడు దుర్యోధను నిలువరించుట

అనిన నా సేనకు నడ్డంబు [7]గాఁగ । మునుమిడిఁ దూరుపుముఖముగా రథము
జననాథతనయుండు చననిచ్చుటయును, । దన పేరు వాడి సుత్రామనందనుఁడు
పాతాళలోకంబు బబ్బరింపంగ । [8]నాతత జ్యాఘోష మందంద [9]నెఱపి
యెలమితో ‘నెందుఁ [10]బోయెదు పోకుపోకు । [11]నిలు’మని చేవీచి నిష్ఠురాస్త్రముల[12]
మిన్ను నేలయుఁ గప్పి మెఱసియార్చుటయుఁ, । గన్నులఁ దిమిరంబు గదియ నాబలము
నెదురుగా నడుమను నేపారి పఱచి । కుదురుగా నిలువక గుండె వట్టకయు
వెఱచి తప్పక చూడ వెఱచి చేష్టలను । మఱచి యుండెను ; క్రీడి మహితవేగమున
మొదవుల వెంట నిమ్ములఁ బోవు[13] ప్రజల । నదలించి తూర్పునకై [14]పాఱఁదోలి
తెలిపి గావించినఁ దెఱఁగొప్పెఁ జూడఁ । దఱచైన గోవులాతత సేననడుమఁ
దునిసిన మొయిలుసందునఁ గానఁ బడిన । ఘనమైన శతతారకముల చందమున.[15]
సవ్యసాచియు నంత సవరించి యొత్తె । దివ్యశంఖంబు భూదిశలు ఘూర్ణిల్ల.
హరికేతనము నేయు నార్భటంబునకు । హరికేతు భూతాట్ట హాసంబునకును
శోభిల్లు మకుటరోచుల తీవ్రతకును । [16]ఆభీల గాండివ జ్యాఘోషమునకు

1 జనుచుండిరపుడు. 2. పఱవ. 3. వీఁకతో. 4. వేగ. 5. సరగున నరదంబు సైన్యమధ్యమున. 6. దీవ్రత. 7. నడప. 8. నాతటి రథఘోష. 9. పఱపి. 10. బోయెదరు పో నానా. 11. నిలుఁడని. 12. జెన్నుగా సేనలు చెదరఁగ నేసి । మిన్ను నేలయు. 13. ప్రజయు. 14. పాఱుసేన. 15. భవ్యదోస్సారంబు భాసిల్ల నిలిచి । సవ్యసాచియు నారిసారించి ప్రోఁత । దివ్యశస్త్రాస్త్రముల్ దిశలు కంపింప । నవ్యయంబగు దాని యారవంబునకు । హరికేతనము. 16. అభోగ భవ నిర్గతారవంబునకు.

సరిసేన సేయు హాహారవంబులకు । నురవడి సేయు దివ్యుల యెలుంగులకు
బెదరి గోవులమూఁక పృథివి గంపింపఁ । బెదరి గాండీవి వచ్చిన జాడఁ బట్టి
చిఱు కొట్టుచును వాల శిఖరంబు లెత్తి । పఱచె దక్షిణ దిశాభాగంబునకును.
పసులతోడన పట్టువడిన గోపకులు । వెసనేఁగి రా ధేనువితతి వెన్దగిలి.
అనఘుఁ డర్జునుఁడంత నాహవోత్సాహ । మొనర మూఁపులు పొంగ నుత్తరుఁ జూచి:
"అరులు గోవుల [1]కింక నడ్డంబు [2]వత్తు । రరదంబు నీవు నా రరుదెంచు నెడకుఁ
బోవని" మ్మని చెప్పి [3]భుజదండ మెత్తి । గోవులదెసఁ జూపి గోపవర్గముల
"నోడకుండింక నే నున్నాఁడఁ [4]బసులఁ । గూడిపొం" డని చెప్పె. కొమరొప్ప నంత
వెరవునఁ దేనెగప్పిన మక్షికముల । పరుసునఁ గురుసేన [5]పసులకై పొదువ,
వెమ్ముఁచుఁ గోపించి వెసఁ [6]జొరరాక । యమ్ములు [7]పఱపి బాహాశక్తి నతఁడు
భావంబునకు వచ్చు బహు వికారములఁ । బోవఁ ద్రోచిన యోగి పురుషుండువోలె
వారించుటయు సేనవశము గాకుండె; । చేరె గోవులు తోటిసీమ కన్నియును."
అనినఁ 'గౌరవులెల్ల నటమీఁద నేమి । [8]యొనరించి రది తెల్పు మొనరంగ' ననిన
చారుయశఃపూర, సరస గంభీర,[9] । భీమ నైరిత్రాణ [10]బిరుద ప్రతాప,
తాపస కృతసౌఖ్య, [11]ధర్మస్వరూప, । రూపమనోజాత, రుచిభానుబింబ,
బింబాధరా భద్ర బిరుదావలంబ, । లంబధరా [12]ధీర, లలిత[13]సంచార,
[14]చారుతరస్తుత సద్గుణాధార, । ధారాధరౌదార్యధర శుభావాస,
వాసవ ప్రతిమాన వరజనా[15]ధీశ, । ధీశక్తి నిజపాత్ర, దేవయపుత్ర!
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
స్తుతిపాత్ర వల్లభసూరి సత్పుత్త్ర) । మతిమద్విధేయ తిమ్మయ నాథేమయ
రచిత విరాటపర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొప్పె నాలవది.

---

1. కింత. 2. రాక । యరదంబు వారలు నరుదెంచు నెడకుఁ । బోవని. 3. భుజశక్తి మెఱయ.
4. ననుచు. 5. పైఁబఱవ. 6. బాఱఁదోలి. 7. జొరప; తొడిగి. 8. యొనర సేయుటయును' నొగిఁ జెప్పుమనిన.

9. వారణ భయరక్షవరద ముకుంద । తాపస కృతముఖ్య ధర్మానురూప । రూపయౌవన కళారుచిర ప్రవీణ । అరవింద భవపూజ్య అమృతశరీర । కరుణించి నన్నేలు కాకుత్స్థరామ ఇది సదాశివభక్త (తంజా. ప్ర.). 10. భీమ. 11. ధర్మానుకూల. 12. ధార. 13. సంసార.
14. చారణస్తుతభాగ్య. 15. వాస.

# పంచమాశ్వాసము



శ్రీకర చారిత్ర, శృంగారగాత్ర, । [1]ధీకల్పితాధార, దేవయ ముమ్మ!
వినుము వెండియునిట్లు వివరింపఁ దొడఁగె । జనమేజయునకు వైశంపాయనుండు :
ఈ చందమునఁ గౌరవేశుండు మొనలఁ । జూచుచు నుండంగ సురరాజసుతుఁడు
బాహుబలాభీల భవ్య [2]గాండీవ । దోహల బాణ సందోహంబు [3]వఱపి
పులినోటి మాంసంబుఁ బుచ్చికొన్నట్లు । బలియురచేఁ బడ్డ పసిఁ గ్రమ్మరించి
[4]గారుడంబొగిఁ బన్నగముఁ గన్నవాఁడ్కిఁ । జేరువ కురురాజు సేనపై కుఱికి
యమ్మహీపతిమీఁద నరదంబుఁ బోవ । నిమ్మని నృపసూతి కేర్పరించుటయుఁ,
[5]బ్రథితారి వీరులేర్పడ రెండువేల । రథములవారు ధీరత మున్నె కడఁగి
వేయేసి రథముల వెనఁ గర్ణభీష్ము । లాయత్తమై వచ్చి రతని కడ్డంబు.
నరనాథుఁ డట మున్నె నరుచేతఁ బసులు । తిరుగుట వీక్షించి దీనభావమున
రాయుచు ననుజవర్గముఁ దాను మగిడి । వేయి రథములతో వెఱఁగంది నిలిచె.
తక్కటి బలము లుద్ధతి మోహరించి । రెక్కడ చూచిన నిల యీనినట్లు.
ఇందఱు నొకనిపై [6]నింతేల యనుచు । నందఁదు [7]నేకాంగి కనువైన యట్లు
దర్పించి ననుఁజూడు తనుఁ జూడుమనుచు । నేర్పులు దొరలతో నిర్ణయించుచును[8]
ఉదయించు భాస్కరు నుగ్రరాక్షసులు । పొదివినగతిఁ గ్రీడిఁ [9]బొదువవచ్చుటయు,
నతఁడు మోమున మందహాసంబు నిగుడ । నతి వీరరసవార్ధి నందంద తేలి,

### అర్జునుఁ డుత్తరునకుఁ గురువీరులఁ బేర్పేరఁ జూపి చెప్పుట

యుత్తరు వీక్షించి యొప్పారఁ బలికె : । "ఉత్తర, చూచితే యుగ్రసైన్యముల ?

---

1. ప్రాకట గుణధామ భవ్యసుత్రామ । ఆ విభీషణుని లంకా రాజ్యమునకుఁ । గావించి నిలిపిన ఘన, చిత్తగింపు. అక్కథకుఁడు శౌనకాది సన్మునుల కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె. ఈ చందమున (తం. ప్రతి). 2. దోర్దండ. 3. లేసి; చూపి. 4. యరుదొంది కురునాథుఁ డరిసేననుంట । గరుడుండు తాఁ బన్నగముఁ గన్న మాడ్కి । నాహూఢి నర్జునుండపుడు వీక్షించి । బీరంబు మోమున వెలయంగఁ బొంగి । యమ్మహీపతి. 5. ప్రథిత కౌరవులు నేర్పడ. 6. నింత సేయుచును. 7. గడఁగి యు నను. 8. ఎక్కడఁ జూచిన నిల యీనినట్లు । తక్కక వచ్చి యందఱు బీరములర । నుదయించు, 9. బొదువ నత్తఱిని.

అర్థితో వీర లిట్లరుదెంచుటెల్లఁ । బార్థునోఁచిన నోముఫలము[1]గా నెఱుఁగు.
కురువీరవరులకు గుఱుతు చెప్పెదను । [2]దెఱఁగొప్ప నది నీవు తెలియంగ వినుము.
పసిఁడిఁ జేసిన వేది [3]పడగపై నుండ । ననయూన[4]గతినొప్పు నతఁడు ద్రోణుండు ;
శృంగారమైయున్న సింగంపుఁ బడగ । [5]యంగీకరించువాఁ డతని నందనుఁడు ;
పసిఁడి యాఁబోతు[6]నఁ బడగ యెత్తించి । ననమాత్రుసమరూపుఁ డగువాఁడు కృపుఁడు ;
ఉడురాజు సరిపోలుచున్న శంఖంబు । పడగఁ దాఁ గలవాఁడు భానునందనుఁడు ;
పడగలలోఁ గానఁబడు త్రాటిమాని- । పడగ దాఁ గలవాఁడు పరఁగ భీష్ముండు ;
[7]సర్పంబుతోఁ దాను సరివచ్చుఁ గాన । సర్పకేతువువాఁడు సరవి రారాజు.
ఎసఁగిన వేడ్కతో నింక ద్రోణునకు । వెసఁ బ్రదక్షిణము గావింతముగాని
తేరుదోలుము వీరిదెస నెన్న మనకుఁ । గ్రూరంబు గొఱగాదు గురుమూర్తి గాన.
జలదంబుఁ బిడుగుతో సంధించినట్లు । విలువిద్య నేర్పె నీ విప్రోత్తముండు.
[8]జానొప్ప నెపుడు నశ్వత్థామ కల్ల । యేను నిజంబు నాయెడ నట్టిప్రీతి ;
కావున నితనితోఁ గయ్యంబు సేయ । భావంబు గొలుపదు పరికింప నాకు.
కురురాజుతోడ మాఱ్కొనఁగఁ దానిట్టు । లరుదెంచె నితఁ డేసినప్పు డేయుదము.
అతనిపుత్త్రుఁడు తండ్రియంతటివాఁడు । అతులితంబైన శస్త్రాస్త్రవిద్యలను.
పురహరువరమునఁ బుట్టె ద్రోణునకుఁ । బురుహూతుతోనైనఁ బోరాడు నతఁడు.
మఱి కృపాచార్యుండు మాతండ్రి సఖుఁడు । చిఱుతకాలమునాఁడు చెప్పె విల్విద్య.
కృపుఁడంట గాని నిష్కృపుఁడు వైరులకుఁ । జపల దుర్యోధను సర్వాంగరక్ష.
ఈ యిరువురు నేయ కేనేయ వెఱతు । మాయెడఁ గృపగల్గు మాన్యు లెంతయును.[9]
అదె చూడు [10]రాధేయుఁ డాహవక్షోణిఁ । గదలకుండెడి మేటి గర్వపర్వతము.
ఇతఁ డర్థికోటికి నిచ్చు కాంచనము । ద్రుతగతి రెండుమేరువులంత గలదు.
[11]కురురాజు 'వీఁడు నన్ ఘోరాజిగెల్చు । నరుదార' నంచుఁ దా నాత్మలోఁదలఁచు,

---

1. కాఁబోలు. 2. తెరవొప్ప నది నీవు వినియుండవలయు. 3. పడగయైయుండు. 4. రుచి. 5. అంగితమైనవా. 6. ను బడగలోఁ గల్గు. 7. సర్పంబుఁ దానును సరి వచ్చుచుంట. 8. భావింపఁ దెలియు నశ్వత్థామకన్నఁ । గేవలమును నను గృపసేయు మదిని.. 9. ఆయనపైరథం బటు పోవనీకు । అదె చూడు. 10. రాథేయు నాహవధేయు (?) । గదనంబులో వీఁ డఖండవిక్రముఁడు । ఇతఁ డర్థి.
11. గురునితో నరునితో ఘోరాజి ననుచు । నరుదెంచుఁ దాను యుద్ధమున నన్ గెలువ;
...డర్జును నేయు ఘోరాజి ననుచు । నరుదెంచుఁ దానును అర్జును గెలువ.

వీక్షింపు కౌరవవిభుఁ డల్లవాఁడె । [1]యక్షీణుఁ డభిమాని యసమానబలుఁడు ;
ఈరాజుబండార మింటివాకిటికి । నా రాజరాజైన నక్కఱై వచ్చు ;
బలిమిఁ బాండవుల[2]కుఁ బాలీక యేఁపఁ । గలిగె నాకని [3]యూము గవిసియున్నాఁడు ;
కలిగె నీతనితోడఁ గయ్యంబు[4] నీయఁ ; । గలిగెఁ [5]బంటువు నాకు గాండీవమునకు.
అర్జునుఁడు నీతఁ డని సన్నుగన్న । సూర్యజుఁ గలవారు మదిఁ గొంకులేక.
ఎలమితో వీరల నేనేయునప్పుడు । జాలపక నీనేర్పు [6]సూపంగవలయు.
పిడుగైన నిల్చు నా చేతు సెప్పినను । బుడమిపై వీరి నిల్చుట యెంత నాకు?
[7]రారాజు మనమీఁద రానోడియున్న । నేరీతినైన నన్నాదరింపు మితని ;
నింక భీష్మునిఁ జూడు మితఁ డాజిజిష్ణుఁ । [9]డింకించు నరిబలంబేచి యెల్లెడల ;
సంచిత భుజబలసంపన్నుఁ డీతఁ । డంచితగాంభీర్యుఁ డసమసాహసుఁడు ;
పరశురామునిలావు పరఁగ నిర్జించె ; । మరు కేళి హనుమంతుమాడ్కి వర్జించె ;
తలపోయఁ బాండవ ధార్తరాష్ట్రులకు । [10]మెలపుతో నొకరీతి మేలుదలంచు.
ఇతని[11]శాంతను బోవనీకుమీ రథము । జితలోకుఁ డితఁడు [12]నిర్జింపనీఁ డరుల."
అని మహావీరుల నతని కేర్పఱిచి । యనిసేయ నర్జునుం డరుదెంచునప్పు
డెలమి నశ్వత్థామ యించుక నవ్వి । పలికెఁ గర్ణునిఁజూచి భావంబు చెదర :
"కర్ణ, నీమాట లాకర్ణిఁ[13]చె నృపుఁడు ; । నిర్ణయిం[14]చితి క్రీడి నిర్జింతుననుచు ;
అదె వచ్చె [15]బీభత్సుఁ డాహవంబునకు । నెదురేఁగి పోరాడ విదియేమి [16]నేఁడు !
దలఁకైన [17]శకునితోఁ దలపోసి చూడు ; । తలఁప [18]నిద్దఱు గారె తలపోయఁ బతికి?
బలుక[19]నేర్తురు గాని పలికనల్లెల్ల । నిలవారు చేసిన నేమేమిగాదు ?"
అనుటయుఁ గోపించి యర్కనందనుఁడు । పెనుపునఁ బడగెత్తు పెనుఁబాముపోలె
[20]నిట్లను "నీకేల యింత గర్వింప? । నట్లు భీతిలువారి కర్థి నే మగఁడ ;

---

1. యక్షీణమానసుఁ డసమాన. 2. ను వారక. 3. యూస గలిగి. 4. నాకు. 5. నిప్పుడు. 6. చూపుమీ నాకు. 7. రారాజు మార్గాన రాకున్నవాని । తేరు చేరవఁబోవఁ దెలివితోఁ జూరుము. 8. భీష్మ్మ. 9. 'డింకించు', 'సంచిత' అను పాదములు ముద్రితప్రతిలోనే గలవు. 10. తులవోలెనొక్కరీతుల మేలుదలఁచు ; । నెలమిపై నొకరీతి నే కార్యమునను । భేద మించుకలేక పిల్చి తానెపుడు । నాదరించును గూర్మియలరార నితఁడు. 11. మీఁదను. 12. నిర్జించు నిందఱను. 13. ప నరుడు. 14. తువు. 15. విష్వచ్చు. 16. నీవు. 17. వానితో. 18. నిందఱు. 19. నేర్తువు గాన. 20. నిట్లనిపల్కె నేనెట్టులాడితినో । యట్లె చేయుదుఁ జూడు మాలంబులోన.

అర్థితో వీర లిట్లరుదెంచుచెల్లఁ । బార్థునోఁచిన నోముఫలము[1]గా నెఱుఁగు.
కురువీరవరులకు గుఱుతు చెప్పెదను । [2]దెఱఁగొప్ప నది నీవు తెలియంగ వినుము.
పసిఁడిఁ జేసిన వేది [3]పడగపైనుండ । ననమాన[4]గతినొప్పు నతఁడు ద్రోణుండు ;
శృంగారమైయున్న సింగంపుఁ బడగ । [5]యంగీకరించువాఁ డతని నందనుఁడు ;
పసిఁడి యాఁబోతు[6]నఁ బడగయెత్తించి । ననమాత్మనమరూపుఁ డగువాఁడు కృపుఁడు ;
ఉడురాజు సరిపోలుచున్న శంఖంబు । పడగఁ దాఁ గలవాఁడు భానునందనుఁడు ;
పడగలలోఁ గానఁబడు త్రాటిమాని - । పడగ దాఁ గలవాఁడు పరఁగ భీష్ముండు ;
[7]సర్పంబుతోఁ దాను సరివచ్చుఁ గాన । సర్పకేతువువాఁడు సరవి రారాజు.
ఎసఁగిన వేడ్కతో నింక ద్రోణునకు । వెసఁ బ్రదక్షిణము గావింతుముగాని
తేరుదోలుము వీరిదెస నన్న మనకుఁ । బ్రాఁరంబు గొఱగాదు గురుమూర్తి గాన.
జలదంబుఁ బిడుగుతో సంధించినట్లు । విలువిద్యనేర్పె నీ విప్రోత్తముండు.
[8]జానొప్ప నెపుడు నశ్వత్థామ కల్ల । యేను నిజంబు నాయెడ నట్టిప్రీతి ;
కావున నితనితోఁ గయ్యంబుసేయ । భావంబు గొలుపదు పరికింప నాకు.
కురురాజుతోడ మార్కొనఁగఁ దానిట్టు । లరుదెంచె నితఁ డేసినప్పు డేయుదము.
అతనిపుత్త్రుఁడు తండ్రియంతటివాఁడు । అతులితంబైన శస్త్రాస్త్రవిద్యలను.
పురహారువరమునఁ బుట్టె ద్రోణునకుఁ । బురుహూతుతోనైనఁ బోరాడు నతఁడు.
మఱి కృపాచార్యుండు మాతండ్రి సఖుఁడు । చిఱుతకాలమునాఁడు చెప్పె విల్విద్య.
కృపుఁడంట గాని నిష్కృపుఁడు వైరులకుఁ । జపల దుర్యోధను సర్వాంగరక్ష.
ఈ యిరువురు నేయ కేనేయ వెఱతు । మాయెడఁ గృపగల్గు మాన్యు లెంతయును.[9]
అదె చూడు [10]రాధేయుఁ డాహవక్షోణిఁ । గదలకుండెడి మేటి గర్వపర్వతము.
ఇతఁ డర్థికోటికి నిచ్చు కాంచనము । ద్రుతగతి రెండుమేరువులంత గలదు.
[11]కురురాజు 'వీఁడు నన్ ఘోరాజిగెల్వు । నరుదార' నంచుఁ దా నాత్మలోఁదలఁచు,

---

1. కాఁబోలు. 2. వెరవొప్ప నది నీవు వినియుండవలయు. 3. పడగయైయుండు. 4. రుచి. 5. అంగితమైనవా. 6. ను బడగలోఁ గల్గు. 7. సర్పంబుఁ దానును సరి వచ్చుచుంట. 8. భావింపఁ జెలియు మశ్వత్థామకన్నఁ । గేవలమును నను గృపసేయు మదిని.. 9. అయనపైరథం బటు పోవనీకు । అదె చూడు. 10. రాధేయు నామవధేయు (?) । గదనంబులో వీఁ డఖండవిక్రముఁడు । ఇతఁ డర్థి. 11. గురునితో నరునితో ఘోరాజి ననుచు । నరుదెంచుఁ దాను యుద్ధమున నన్ గెలువ ;
...డర్జును నేయు ఘోరాజి ననుచు । నరుదెంచుఁ దానును అర్జును గెలువ.

వీక్షింపు కౌరవవిభుఁ డల్లవాఁడె । [1]యక్షీణుఁ డభిమాని యసమానబలుఁడు ;
ఈరాజుబండార మింటివాకిటికి । నా రాజరాజైన నక్కఱరై వచ్చు ;
బలిమిఁ బాండవుల[2]కుఁ బాలీక యేఁపఁ । గలిగె నాకని [3]యూము గవిసియున్నాఁడు ;
కలిగె నీతనితోడఁ గయ్యంబు[4] సేయఁ ; । గలిగెఁ [5]బండువు నాకు గాండీవమునకు.
అర్కనూనుఁడు నీతఁ డని నన్నుఁగన్న । మూర్కొనఁ గలవారు మదిఁ గొంకులేక.
ఎలమితో వీరల నేనేయునపుడు । సొలవక నీనేర్పు [6]సూపంగవలయు.
పిడుగైన నిల్చు నాపేరు సెప్పినను । బుడమిపై వీరి నిల్పుట యెంత నాకు ?
[7]రారాజు మనమీఁద రానోడియున్న । నేరీతినైన నన్నెదిరింపు మితని ;
నింక భీష్ముని జూడు మితఁ డాజి[8]జిష్ణుఁ । [9]డింకించు నరిబలంబేచి యెల్లెడల ;
సంచిత భుజబలసంపన్నుఁ డీతఁ । డంచితగాంభీర్యుఁ డసమసాహసుఁడు ;
పరశురామునిలావు పరఁగ నిర్జించె ; । మరు కేళి హనుమంతుమాడ్కి వర్జించె ;
తలపోయఁ బాండవ ధార్తరాష్ట్రులకు । [10]మెలపుతో నొకరీతి మేలుదలంచు.
ఇతని[11]పొంతను బోవనీకుమీ రథము । జితలోకుఁ డితఁడు [12]నిర్జింపనీఁ డరుల."
అని మహావీరుల నతని కేర్పఱిచి । యనిసేయ నర్జునుం డరుదెంచునప్పు
డెలమి నశ్వత్థామ యించుక నవ్వి । పలికెఁ గర్ణునిఁజూచి భావంబు చెదర :
"కర్ణ, నీమాట లాకర్ణిం[13]చె నృపుఁడు ; । నిర్ణయిం[14]చితి క్రీడి నిర్జింతుననుచు ;
అదె వచ్చె [15]బీభత్సుఁ డాహవంబునకు । నెదురేఁగి పోరాడ విదియేమి [16]నేఁడు !
దలఁకైన [17]శకునితోఁ దలపోసి చూడు ; । తలఁప [18]నిద్దఱు గారె తలపోయఁ బతికిఁ ?
బలుక[19]నేర్తురు గాని పలికనట్లెల్ల । నిలవారు చేసిన నేమేమిగాదు ?"
అనుటయుఁ గోపించి యర్కనందనుఁడు । పెనుపునఁ బడగెత్తు పెనుఁబామువోలె
[20]నిట్లను "నీకేల యింత గర్వింప ? । నట్లు భీతిలువారి కర్థి నే మగఁడ ;

1. యక్షీణమానసుఁ డసమాన. 2. ను వారక. 3. యాస గలిగి. 4. నాకు. 5. నిప్పుడు. 6. చూపుమీ నాకు. 7. రారాజు మార్కొన రాకున్నవాని । తేరు చేరవఁబోవఁ జెలివితోఁ జోరుము. 8. భీష్మ. 9. 'డింకించు', 'సంచిత' అను పాదములు ముద్రితప్రతిలోనే గలవు. 10. తులవోలెనొక్కరీతుల మేలుదలఁచు ; । నెలమిమై నొకరీతి నే కార్యమునను । భేద మించుకలేక పిల్చి తానెపుడు । నాదరించును గూర్మియలరార నితఁడు. 11. మీఁదను. 12. నిర్జించు నిందఱను. 13. ప నరుదు. 14. తువు. 15. వివ్వచ్చు. 16. నీవు. 17. వానితో. 18. నిందఱు. 19. నేర్తువు గాన. 20. నిట్లనిపల్కె నేనెట్టులాడితినో । యట్లె చేయుదుఁ జూడు మాలంబులోన.

నిను నమ్మి వచ్చితి నే కయ్యమునకు ? । విను నీవు నన్ను నవ్విన[1]యట్ల యుండు ;
బీభత్సు నిదె యడ్డపెట్టెద." ననుచు । [2]నాభీల శరవేగుఁడై త్రోచి నడవ

### కర్ణాది రథికు లొక్కపెట్టున నర్జునుఁ దాఁకుట

నతనికి మున్ను భీష్మాచార్య కృపులు । చతురులై నడచి రశ్వత్థామతోడ.
ఈ రీతి నవ్వీరు లేవురు నడవ । ధారుణీవిభుఁ డంతఁ దానుఁ దమ్ములును
శకుని సైంధవముఖ్య సకల బాంధవులుఁ । బ్రకట [3]బాహ్లీకప్రముఖ్య బహు మహీవిభులు
[4]సకల కుంజరములు సకలాశ్వములును । సకల రథంబులు సకలయోధులును
గూడి యొక్కటఁ జేర్చి ఘోరారావమునఁ । గ్రీడిఁ దాఁకినఁ బోఁకెఁ గెంధూళి మింట;
గజగజ వణఁకె దిగ్గజము లన్నియును ; । త్రిజగ[5]మ్ము లదరె; వారిధు లెల్లఁ [6]గలఁగెఁ ;
పటహ భాంకరవములఁ బగిలె నల్దెసలు ; । పటు బాణరుచులచే భానుండు మాసె;
హా పుత్త్ర! హా పుత్త్ర! యని వజ్రి పలికె । చూపి[7]చి పాండుపుత్త్రుని [8]శంక బొగడి.
అప్పుడు తఱచుగా నవనీరుహములు । గప్పిన శిఖిపోలె గాండీవధరుఁడు
నిరవొప్ప బాణంబు [9]లీసుళ్ళపుట్ట. । విరిసిన గతినుండ వెదచల్లి మెఱసి,
వెలయ సైన్యంబుల వీరువారనక । కలసి పాఱఁగ నొక్క కాలంబునందుఁ
బదియింటఁ బదియింటఁ బరఁగ సాధించి, । త్రిదశులు బెదర నుద్రేకించి యార్చి,
తల మీఱి ముట్టవచ్చిన వారినెల్లఁ । దొలితొలి చెండాడి, తోడ్తోన మఱియు
భంగంబుతోఁ బటాపంచలై పాఱ । ముంగలి మొనవారి [10]మొత్తి పోఁద్రోలి,
శింజినీ నాదంబు [11]సింహనాదంబు । రంజిల్లు గతి నొక్కరవముగా మొరయ
దళములపైఁ దేరు దఱిమించి మించి । కొలను సొచ్చిన యట్టి కుంజరంబనఁగ
బంధుర గాండీవ పటుమౌర్వియందు । సంధించి యేయుచో శరపరంపరలు
పదియు నూఱును వేయి పదివేలు లక్ష । పదిలక్షలును గోట్లు పదికోట్లనంగ

---

1. నేమియయ్యె. 2. నాభోగ. 3. బాహ్లీకాది పట మహీపతులు. 4. సకలంకగతి బీర మభివృద్ధి చెంద. 5. ముల్గలఁగె. 6. నింకె. 7. ప. 8. లావు మించె. 9. లీసుమైఁ గురిసి । యరులమార్కొనుచు బాహాటోప మొప్ప । వైరిసైన్యముఁ జొచ్చి వారు వీరనక । ఘోరశరాగ్ని గగ్గోలుగాఁ బఱచి । కదిసి పాఱఁగ నొక్క కాలంబునందుఁ । బదియింటఁ బదియింట భటవార మేర్చి । త్రిదశులు బెదర నుద్రేకించి యార్చి । కదనంపుఁ గ్రీడలోఁ గడు దిట్టయగుచుఁ । దలఁకక మార్కొనఁ దమకించువారిఁ । దొలుతను జెండాడి తోడ్తోడ భటులు । భంగంబుతో.
10. మోదిమోదించి; 11. సింధుగర్జనము (నాదంబు).

మెఱసి లెక్కకు మీఱి [1]మిఱుమిట్లు గొనఁగ । నెఱమంట [2]లుమియుచు నిండి వేగమున
నిలువక కలనిలో నెత్తుటఁ దోఁగి, । [3]యలమి సైన్యమునెల్ల నదలించి మించి,
పంచాననంబులపగిది నేనుఁగులఁ । జించి, మాంసంబులఁ జిద్రుపలై రాల్చి,
జన[4]నాథులనుబోలె [5]శాస్త్రసమ్మతుల । ఘన [6]హస్త పదమస్తకముల ఖండించి,
యురవడి నుగ్రవాయువుల చందమున । సరదంబు లొకకొన్ని హతము గా[7]వించి,
శాత్రను[8]ముల వోలె గతి [9]సేపురేఁగి । [10]మీఱిన హయుల నెమ్మేయిఁ ద్రుంచివైచి,
జలజనాభుని మూర్తి సంపదపోలెఁ । దలఁప నెక్కడనైనఁ [11]దామయై యుండె.

## అర్జునుఁ డంపఱ కందఱై కౌరవసైన్యమును జించి చెండాడుట

అప్పుడు సైన్యంబు [12]లధినాథు పనుపు । తప్పక నరుమీఁద దట్టమై [13]తాఁకి
జలధిపైఁ గవిసిన [14]చటుల పాంశువుల । పోలుపున రూపఱి[15]పోవు నన్నియును.
[16]అరుదార నొకకొంద ఱలుకమైఁ బొదివి । ... ... ... ... ...
యుఱుముల గతి భేరులుగ్రమై మ్రోయ । వఱలు వాలమ్ములు వర్షించి తాఁకి
సురరాజసుతుని యాశుగ వేగమునకుఁ । బరువిడి సిలువ నోపక[17]పోదు రోడి.
[18]మఱికొంద ఱుత్తుంగ మాతంగ సమితిఁ । దఱచు డీకొల్పుచుఁ దగఁ బార్థుమీఁదఁ
బరిఘ ముద్గర కుంత బాణనారాచ । కరవాల శూల చక్రము లొప్పవైచి
కుంభజుతోడ మార్కొనిన వారిధుల । జృంభణ మెట్లయ్యెఁ జెలఁగి యట్లయిరి.
రథికులు కొంద ఱూరక చిత్తజల్లు । పృథివీధరంబుఁ గప్పిన రీతి దోఁప
బెడిదంపుఁ దూపుల బీభత్సుఁ గప్పి । బెడబెడమని యార్చి [19]పేర్చి పోరాడి
పురములు మూఁడు గోపురము[20]ల తోడ । హరుచేతఁ బడినట్ల యతనిచేఁ [21]బడిరి.
చాకళించుచు రాజసమితితోఁ గొంద । ఱా[22]కీర్ణ శరఖడ్గులై వచ్చి తాఁకి
హేషారవంబుల నిద్ధ కింకిణుల । రోషభాషణముల రొదచేసి కప్ప

---

1. మిణుఁగుర్లు చెదర. 2. గ్రక్కుచు. 3. నెలమి ... నేల సేవించు. 4. నాథుఁడును. 5. శస్త్ర సమ్మితులఁ. 6. హస్తిమద. 7. ఁబొడిచి. 8. ముసు. 9. గండుమీఱి. 10. మీఱి వైరులనెల్ల మెఱయంగఁ ద్రుంచి. 11. దాన. 12. లాయోధవరులఁ. 13. కదిసి. 14. చటులాగ్ని సమితి. 15. పోవ. 16. పరఁగ వాలమ్ములు వర్షించితాఁకి । యరుదారనిసగేల నాలంబుసలుపు । సురరాజ. 17. పాటి పోవ. 18. మరలి కొందఱు మత్త. 19. వే పోయి మఱియు. 20. లు మున్ను. 21. బడియు. 22. కర్ణశత.

శబ్దభేదములు [1]కొన్ని సంధించి యప్పు । డబ్బవాహసపుత్త్రుఁ డస్త్రంబు లేయ
[2]నూతగమ్మిన మాడ్కి నొక్కఁడై న పోక । యూఁతగా వసియించి రొగిఁ గాలుఁబ్రోల.
అంత నర్జునుచేత నా భంగి సేన । యెంతయుఁ గాసిల్లుటెఱిఁగి రారాజు
గజపురంబునఁ బేరుగల వీరవరుల । గజహయారూఢులఁగాఁ జేసి యేర్చి
పదివేలఁ బొండని పంపువెట్టుటయుఁ । ద్రిదశేంద్ర సుతుఁడాఁకి దీపులై వారు
'కదియుఁడు [3]పొదువుఁడు ఖండింపుఁ డేయుఁ । డదలింపుఁ[4]డటనొంపుఁ'డనుమాటలెసఁగ
నిప్పులు గురియించు నిష్ఠురాస్త్రములు । కప్పిన, సంతోషకలితుఁడై నరుఁడు
నుత్తరుపై బాణ మొకటి [5]రానీక । యుత్తమాశ్వంబుల నొకటి [6]రానీక
గ్రక్కునఁ దన తేరు [7]గరిగంటి గాక । చెక్కు చెమర్పక చెలువు[8]మై మెఱసి
తులలేని యక్షయ తూణీరములును । [9]వెలితి యయ్యెడుపాటి వేగంబు మెఱసి
శరములు సంధించి సైన్యంబు మీఁదఁ । బరువడి వర్షింప, భగ్నమై యదియుఁ
గరములు[10]నుచ్చి యంగములు[11]నొచ్చియును । శరవహ్నిఁ[12]జచ్చియుశరణుచొచ్చియును
వడిఁ గూడఁ [13]బాఱియు వంజువాఱియును । జడబుద్ధి మీఱియు నఖులఁ జీరియును
నెత్తురుగ్రక్కియు నెఱయఁ జిక్కియును । జిత్తంబు స్రుక్కియుఁ జేష్టదక్కియును
వీడిన, వెస నేఁగి వీక్షించి వీరు । లోడ కోడకుఁ డని యొకలక్ష గూడి
కర్ణాదు లనువ నగ్గలికతో వచ్చి । యర్ణవ[14]ధ్వనితోఁప నందంద [15]యార్చి
నరుమీఁద నేసిన, నరుఁడు భీతిలక । దరహాస [16]మెసఁగ నుత్తరున కిట్లనియె :
"ఓ రాజనందన, యుద్ధంబు బలిసె ; । సారథ్యమునకు వేసఱకుమీ నీవు.
ఈ సేనఁజొచ్చిన [17]నిఁకఁ బన్ని రాదు । భానునగతిఁ దేరుఁ బాఱని." యనిన
మెలపుతో [18]నతఁడును మిఱ్ఱుపల్లంబుఁ । దలఁపఁ జేరుచయును దవ్వు దుర్ఘటము
నొక్కసమానమై [19]యుండున ట్లరద । మెక్కుడు వెసఁదోలె నెల్ల[20]సేనలకు
నెలకొని యుద్ధంబు నిడుపు[21]మూలలను । వలయంబులును గాఁగ వచ్చి [22]నర్తింప.
నరునిబాణముల రత్నపుఁ గేతనములు । ధరఁగూలెఁ జుక్క లుద్ధతిఁ గూలినట్లు ;
మముఁగావుమని మ్రొక్కుమాడ్కి నశ్వములు । నమరేంద్రసుత బాణహతిఁజేసిమ్రొగ్గ ;

---

1. గాన సంధింపరాక. 2. నాతత బాణాగ్ని యలమ నందఱును । నూతగా నశియించి రొగిఁజూడ నపుడు. 3. పొడువుఁడు. 4. 'డనుసొంపులగు. 5. 6. పో. 7. గడగండ్లఁ బడక. 8. డై. 9. తెలువడి యొండొంటి వెంటనే నిలుచు. 10. నొంచి. 11. త్రెంచియును. 12. జించియు. 13. బోరియు వంతఁబాఱియును. 14. ధృతి. 15. పేర్చి. 16. మునను. 17. నింకఁ బైరాదు. 18. నప్పుడు. 19. యుండ సారథము. 20. సేనలును. 21. మూఁకలకు. 22. వర్తింప.

రక్తాబ్ధిలోన వారణపయోదములు । యుక్తంబుగాఁ గూలె నొకక్రీడిచేత ;
పడగలు గొడుగులుఁ బార్థబాణములఁ । గడువేగమునఁ ద్రెవ్వి గాలిచే నెగసె ;
అటమున్నె దివి కేఁగి యాడెఁ [1]నట్టలును । జటుల భూపాల లాంఛనము[2]లో యనఁగ.
కొలఁది మీఱినయట్టి ఘోరయుద్ధంబు । చెలఁగఁ గౌరవరాజు సేనలో నపుడు
చిదిసిన హరులు, వ్రస్సిన రథావళులు, । [3]చెదరినకరులు, నొచ్చిన యోధవరులు,
నొరఁగిన కేతువు, లొఱలు సారథులు, । విరిగిన విండ్లుఁ, ద్రెవ్విన గుండియలును,
దునిసిన జోళ్లును, దొరఁగు నెత్తురులుఁ, । బెనఁగొన్న ప్రేవులు, బెరయు [4]పీనుఁగులుఁ
గలుగుచు సంగరాంగణము చూడ్కులకు । విలయకాలమునాఁటి విభవంబు చూపె.[5]

---

1. నట్టులును. 2. లైయుండు. 3. మదమేదికూలిన మాతంగఘటలు. 4. తావులును.

5. ఇగురుపెట్టినయట్టి యెలమావితోఁట । పగిది నెత్తుటఁదోఁగి ప్రధనభాగంబు
కరికుంభదళిత ముక్తాపుష్పకలిత । కరవాల భృంగ సంఘములచేఁ బొలిచి
లలిత వసంతకాలము చూపునట్లు । వెలసినఁ, గాముఁడై విజయుఁ డచ్చోట
వీరలక్ష్మికి వలచి విరహాగ్ని విరియు । వీరుల వెసనేయ, విరథులై వారు
చదురొప్పఁగా రక్తచందనంబలఁది । పదియవస్థలకు లోఁబడి రనంబడిరి.
మహినైదు నెత్తురుమడుఁగులు రాముఁ । డహితులఁ గూల్చిన నగు టెంత యనుచు
మెచ్చునిగతిఁ గ్రీడి మెఱసి శాత్రవుల । గుచ్చియేసినయట్టి కోలలగ్గలము
గలిగి ఖండితములై ఘనకేతనములఁ । గలిగి ముఖాంబుజాక్రాంతంబులైన
రణముల డస్సివారణములఁ బడను(?) । ప్రణుత జలక్రీడ పాటింపఁజొచ్చె.
మైమఱువులతోడ మలయు మావుతుల । నా మడువులలోన హతముగా ముంచె.
కొనలకుఁ ద్రుంచిన క్రొవ్వాడిపడగ । లొనరఁ దేరులమీఁద నున్న వోఁ గడఁగి
యట్టలాకసమున నాటలాలించె । నెట్టన దవిలి శోణితధార లొలుక.
బలములన్నియు జొత్తు పాపలై తడిసి । కలయంగ నొకనికొక్కఁడు దాపుగాఁగ
నిలిచెఁ జెలియలికట్ట నిలిచినయట్లు । కలనిలోఁ బీనుఁగు గమిపోలెఁ జూడ.
వేవేగఁ గొందఱు విరథులై పాఱఁ । ద్రేవులు కాళ్లతోఁ బెనఁచి పోనీక
యొనరఁ గ్రీడికిఁ దెచ్చి యొప్పించినట్లు । అనిచొచ్చు వీరుల నర్జునాస్త్రములు
ఘనమైన వెసఁగూల్చెఁ గదనంబులోన । ... ... ... ...
గుమురులుగాఁగూడి కొంద ఱేతెంచి । యమరేంద్రసుతు బాణహతిఁజేసి త్రెవ్వి
కలయంగ నొకని కొక్కఁడు దాపుగాఁగ । నిలిచెఁ జెలియలికట్ట నిల్చినయట్లు.
తొలకాడు మేనులు తునియలై తలలు । ఫులుఁగులు గొంపోవఁ బొడవుగా నెగసి
వడిఁ బ్రజ్వరిల్లు కవ్వడి ప్రతాపాగ్ని । కడునొప్పు విస్ఫులింగము లన నొప్పె.

కాలినశిఖఁ[1]జొచ్చి కనకఖండములు । కాలుష్యములుమాని కడునొప్పినట్టు
లనిఁ జొచ్చి [2]పేరు లా యర్జునాస్త్రముల । మనుజభావము[3]లూడ్చి మఱి దివ్యలగుచు
రమణతోఁ గొందఱు రంభలోఁగిటను । గ్రమముతోఁ గొంద ఱూర్వశిసౌధములను
మెలపుతోఁ గొందఱు మేనకయింటఁ । [4]జలమొప్ప గొందఱు సహజన్యయింట
నలవొప్ప నిండి, వేశ్యల పాల్బుపోక । తలకొని ఘోరయుద్ధము చేసిరచట.
అప్పుడు క్రీడిచే నాభంగి సేన । చెప్పఁ జూపఁగ[5]రాక శీఘ్రంబె తెగిన,

## అర్జును తాఁకుదలకు మహారథికులుగూడ వెన్నిచ్చి పాఱుట

నతిరథ సమరథు లట మహారథులు । ధృతి నర్థరథులు నుద్రే[6]కించి తాఁకి
పరఁగ నర్జునుఁడను బడబాగ్ని మీఁదఁ । బొరిపొరి శరవార్ధి పురికొల్పుటయును,
అది లెక్కసేయక హరితనూభవుఁడు । త్రిదశు లిచ్చినయట్టి దివ్యబాణములు
కలుషించి యేయుచోఁ గలశసంభవుని । నలువొప్ప డెబ్బది నాటె బాణములు ;
పరఁగ దుశ్శాసనుఁ బదియేను నాటె ; । పరఁగంగ దుస్సహుఁ బండ్రెండు నాటె ;
నలువొప్ప నలువది నాటె సౌబలుని ; । [7]నలుకతో ముప్పది యా కృపు నాటె.
కర్ణు రథ్యంబులఁ గర్ణు సారథినిఁ । గర్ణు తేరిని ద్రుంచి కర్ణు నొప్పించి
ధీరుఁడై నరుఁ డంత దేవదత్తంబు । పూరించె సైన్యంబు భుజశక్తి [8]వదల.
దొరలిట్లు వడుటయుఁ దొడరి వీక్షించి । వరుస నిల్వఁగలేక పాఱె సైన్యంబు
సేనానిచే దైత్యసేనలు [9]త్రొల్లి । జానొప్పఁ బాఱినచందంబు దోఁప.
సురరాజసుతుమూర్తిఁ జూడంగ వెఱచి । మరలి గాంగేయుని మరుఁగు[10]వొచ్చుటయు
నతఁడు వారలకెల్ల నభయహస్తంబు । చతురత నిచ్చి యాశ్వాసించి పలికె:

## గాంగేయుఁ డెల్లర నిలువరించుట

"ఓ కర్ణసైన్యంబ, యో ద్రోణుసేన, । యో కృపుసైన్యంబ, యోడకుఁ." డనుచుఁ
"క్రమముఁ[11]దప్పఁగ మీఱి కాలాగ్ని రాదు ; । రమణతో జలధి మేరకు మీఱిరాదు;
కఱకంఠు మెడనున్న గరళంబు రాదు ; । తెఱఁగొప్ప శమనుఁ డుద్రేకించి రాఁడు ;
ఒకవింటివానికి నోడి వచ్చితిరి ! । ప్రకటింపఁ దల్లిగర్భముఁ జొచ్చువారె !

---

1. చెచ్చి ఘనకందరములఁ(?). 2. విరథులై. 3. లూడ్చి. 4. దలఁపఁ గొందఱు తిలోత్తమ యింటఁ గాఁగ. 5. లేక. 6. కంబుతోడ. 7. నలరంగ. 8. వెడల. 9. దూలి. 10. సొచ్చినను. 11. సర్వము.

మెఱయ విండ్లునుగావె మీరు పట్టినవి? । మెఱయ తేరులుగావె మీరలెక్కినవి?
ఎలమి నెంతటికైన నేనున్నవాఁడఁ । దలపడి [1]క్రీడి నుద్ధతినేయుఁ." డనిన
నీసున నటుపోక [2]యెల్లసైన్యములు । భాసురగతి భూమిఁ [3]బ్రతినతో నిలిచి
మఱియుఁ గవ్వడిమీఁద మహితసత్త్వంబు । నెఱప నుద్యోగిం[4]చి నెమ్మితోఁ జేయ,
నుత్తరునకు వారి యుత్సాహమెల్ల । [5]నత్తఱిఁ జూపుచు నర్జునుం డనియె:
"కురురాజుగూర్చిన ఘోటక[6]ద్విరద । వర రథసైన్యవైభవముఁ జూచితివె?
[7]యెలమితో మనమిదె యెంత చంపినను । వలనొప్పఁ దన పంచవన్నియ చెడదు;
ఇటమీఁద మనము ప్రత్యేకయుద్ధమునఁ । బటుభయంకర[8]బాహుబలము చూపుదము.
నెఱయ నించుక[9]సేపు నీవు రథ్యములఁ । దఱుమక నిల్పి [10]కందము లప్పళింపు.
జానొప్పఁ జూతము సైన్యమధ్యమునఁ । గానవచ్చుచు నుండుఁ గర్ణకేతనము.
వాఁడు మార్కొననున్న[11]వాఁ డింక మనకు । వాఁడిమి పచరింపవలయు మున్నాఁడి.
ఆదిక్కునకుఁగాఁగ నరదంబు పఱపు; । మాదిత్యతనయుని [12]నవలీలఁ దాఁకి
వీని సత్త్వము నమ్మి వీఱిఁడై యున్న । భూనాథుబుద్ధి దుర్బుద్ధిగావింతు.
విన్నాణమునఁ జేసి వెసఁ జిన్ననాఁటి । చన్నుఁబాలును వెళ్ల సాధింతు." ననిన
పృథివీశతనయుండు పృథతనూభవుని । రథము వేగమె తోలె రాధేయుమీఁద.

## అర్జునుఁడు చిత్రాంగదాది కుమారవర్గము నుఱుమాడుట

నరుఁ డిట్లు సింగంబునకు నాదికొన్న । శరభంబుకరణి భాస్కరసూతిఁ దొడరఁ
జిత్రాంగదుండును జిత్రసేనుండుఁ । జిత్రరథుండుఁ జెచ్చెర వికర్ణుండు
నరగ శత్రుంతప సంగ్రామజిత్తు । లరయ దుర్ముఖ దుర్జయాఖ్య దుష్కృతులు

1. మీరలు. 2. రేచి యార్చుచును. 3. పైఁద్రొక్కి నిలిచి. 4. చెనెఱి సైన్యవితతి । అట లేచు వైరుల యాటోపమెల్లఁ । బటుకార్యగతిఁజూపి బాహులుప్పొంగ । నుత్తరునకు. 5. తత్తరింపక చూపి తనర నిట్లనియె. 6. వితతి । పరిణద్ధ. 7. యెలమితో మనమెంత యేపునూపినను । బలము దగ్గక వైరివర్గంబు పొలుచు. (ము. ప్ర.) 8. లీల బటువు. 9. నీవు నీరథ్యములను. 10. కంధర మప్పళింపు. 11. వాఁడు కయ్యమున.

12. యాటోపమెల్ల । నుడిగింతునని పల్కనుత్తరుండపుడు । కడుకొని హరులపగ్గము సడల్చుచును । రథము వేగమె తోలె రాధేయుమీఁదఁ । బ్రథిత బాహాగర్వ పరివేష్టుఁ డగుచు । నావుల మందలో వ్యాఘ్రుంబుచొచ్చి । వావిరిఁగలఁచు నప్పగిది నర్జునుఁడు । కురుసేనఁ జొచ్చి తా ఘోరంబుగాను । శరములు వర్షించి సమయింప నరులఁ । జిత్రాంగదుండును.

మఱియుఁ [1]భీరైన కుమారవర్గంబు । మురువొప్పఁగాఁ గ్రీడి మున్నాడి తాఁకి,
తఱ[2]చైన తూపు లుద్ధతిఁ [3]బింజపింజ । గఱచియుండఁగ దీప్తి కడలొత్తవైచి,
చెలరేఁగి తమసేయు సింహనాదముల । బలిమి శేషుని శ్రోత్రపటలంబు పగుల్చఁ
గదనంబుసేయుచో, గాండీవి యపుడు । పదరనేటికి మీరు పసిబిడ్డలనుచుఁ
దలపోసి సగరనందనులపైఁ దొల్లి । నలిగిన కపిలసంయమిపోలె నలిగి
ధరఁగూల్చె బాణసంధాన జర్ఝరిత । పరచాప పరయుగ్య పరకేతనములు.
అంత వికర్ణుఁ డత్యంతవేగమునఁ । గౌంతేయుమీఁద మార్గణవృష్టి గురిసి
యఱిముఱిఁ దనచాప మతనిబాణముల । విఱుగంగఁ దానును విఱుగుచో [4]వీరు
లుసిగిపోవకుమని యొత్తి చెప్పినను । వెన వికర్ణుఁడు కాన వినలేక పాఱె.
క్రూరుఁడై యపుడు శత్రుంతపుం [5]డార్చి । నారాచ[6]తతుల నన్నరు[7]తేరు మాటి
యుత్తరుఁ జంప నుద్యోగించి యపుడు । చిత్తవిక్షేపంబు సేయుచో, నరుఁడు
వాని సూతునిఁ జంపి, వాని విల్విఱిచి, । వాని రథ్యంబుల వసుధపైఁ జమరి,
చెలఁగి యా యాహవక్షేత్రపాలునకు । బలియిచ్చె మఱి వాని పటుమస్తకంబు.
ఇచ్చి యంతటఁ బోక యా కుమారకులు । విచ్చి పాఱినఁ గాని విభుఁడు రాఁడనుచు
దృష్టింప వరుదైన దివ్యబాణముల । సృష్టిఁ జీఁకటిపడఁ జేసి యేసినను
[8]దనరారు వీరులందఱుఁ 'బాఱు పట్టు' । మనుచు నుద్ధతిఁ బాఱి రనిలోనఁ దొలఁగి.
ఇత్తెఱంగునఁ బాఱ నెలమి సంగ్రామ । జిత్తు తాఁ బాఱక జిష్ణుపైఁ గవిసి
మునుమిడిఁ గర్తరీముఖ కూర్మనఖము । లను సాయకము లేయ నతఁడు నవ్వుచును
దలమీఱి వాని కేతనముఁ జాపంబుఁ । దలయును ద్రుంచి యాతలఁ బాఱవైచె.[9]

## కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము

ఈచందమునఁ దమ్ముఁ డిలమీఁదఁ బడినఁ । జూచి యాగ్రహమును జోద్యంబు నెరయ
నుడికెడి నేతిలో నుదకంబు వడిన । వడువునఁ జెలఁరేగి బలిమిఁ గర్ణుండు

---

1. బెక్కైన. 2. చగా. 3. సెల్లరొయెడలఁ । బఱపి దిక్కులు దీప్తిఁ బరిఢవిల్లఁగను. 4. ప్రజలు । ఎసఁగిపోవకుమని యెంత చెప్పినను. 5. డార్చె । వాఁడంత శౌర్యంబు వడిఁ బేర్చి తిరిగి । పోఁడిమిగాఁ దన భుజసత్త్వమునను । నారాచ. 6. కోటి. 7. తేరిమీఁద । క్రూరాస్త్రములు వైచి కో యని యార్చి । యుత్తరు. 8. తనికిన దిగులుచే ధైర్యంబు వదలి । యనిఁ దొలంగుచుఁ బాఱి రరియోధ వరులు. 9. ఇనజు నేయనిరుయేట్లు హృదయంబులోన । ననుజాని పాటు శల్యంబుగా జొనుప (?.)

దివిజేంద్రసుతుమీఁదఁ దేరు దోలించి । వివిధ బాణంబులు [1]వెల్లి గొల్పుచును
రథికు నొప్పించి సారథిఁ జిక్కుపఱిచి । రథరథ్యకేతు [2]మర్మములు నాటింప
నరుఁడంతఁ గోపించి నారిసారించి । పరవీర సంహార పటు విచారమున
నెలమితో జలరాశి యెదురుగాఁ దొట్టి । సెలయేటి నీటిఁ జెచ్చెరఁ ద్రిప్పు కరణి
రవిసూనుఁడేయు మార్గణపంక్తి నఱకి । యవిరళ బాణంబు లతనిపైఁ బఱప
నా యమ్ములకుఁ బాఱి యా యమ్ములతనిఁ । జేయాడనీక చెచ్చెరఁ దాఁకునపుడు
కడఁక మార్గణములు గనుక ప్రాణముల । నడిగిన రవిసూనుఁ డవి చూపకున్న
గడుఁ బ్రాంతవాఁడైన కర్ణుమర్మములు । గడుకొని నొప్పించు గతి నుచ్చిపాఱె.
అతఁడును శ్వేతవాహను బాణములకుఁ । బ్రతిబాణతతులేసి భగ్నంబు సేసి
కుతలంబు పగుల మిక్కుటముగా నార్చి । చతురుఁడై కురురాజు సంతోష పఱచె.
ఆ మహావీరు లట్లాహవోద్దామ । భీమ ప్రతాపులై పేర్చి పోరాడ
[3]సేనలన్నియు నాజి సేఁత చాలించి । పూని చూచుచు నుండి బుద్ధి మార్గమునఁ
గౌంతేయు నొప్పికిఁ గర్ణు నొప్పికిని । సంతోష భయ [4]శోక సంయుతులైరి.
నరుఁడంతఁ గోపించి నారాచ భల్ల । శర శితక్రకచార్ధ చంద్రబాణముల
సూతుని నరదంబు జోడుఁ జాపంబుఁ । గేతువు హరుల మిక్కిలి నొవ్వనేసి
కర్ణుఁ దప్పక చూచి కరమొప్పఁ బలికె: । "కర్ణ ! చిక్కితి [5]నేఁడు గాండీవిచేత ;
ప్రేలుచుందువు కొన్ని పిట్ట బీరములు ; । నీ లావు పసయెల్ల నేఁడు చూచెదను.
అదియును గాక నీ యనుజన్ము చావు । పొదివి చూచితిఁ గానఁ బోరాదు నీకు.
ద్రోవది తలపట్టి దుశ్శాసనుండు । వేవురు నూడఁగా వెస నీడ్చునపుడు
విడిపింతుననిన నవ్వీన ఫలం [6]బెల్లఁ । గుడువ కూరక పోవఁ గూడునే నీకు ?
తగవొప్ప నాఁ డేను ధర్మపాశములఁ । దగిలి యుండుటఁ జేసి తప్పిపోయితివి ;
నేఁడెట్లు పోయెదు నీ?" యన్న నతఁడు । వేఁడిచూపులఁ గ్రీడి వీక్షించి పలికె:

---

1. వెసనేసి యేసి. 2. మర్మంబులు నాటి । బలిమి వాటింప నా పార్థుండు కినిసి । బలు నారసంబులు వైరిసంత్రాస । కరదర్ప పరిణతిఁ గర్ణుపైఁ గురిసి । వరభండ నోద్దామ పటుకేళి సలిపె । గరుడుండు టెక్కలన్ గప్పుచుఁ బాముఁ । బోరిగొన్న వడువున భూరి శౌర్యమున । రవి సూనుఁ దాఁకి దారుణకర్మ పరత । దివిజేంద్ర సుతుఁడేచి దివ్యాంబకములఁ । గలనెల్ల నిండఁగాఁ గడువేడ్కఁ బఱప । నలకర్ణుఁ డవియెల్ల నందంద చదిపి । నిజ పరాక్రమలీల నెరపంగ నెన్ని । విజయుఁ గిట్టెనుగోపవేగంబు మెఱయ । నా మహావీరులు. 3. సేనాను లపు డాజి. 4. రోష సంయుతు. 5. గాదె. 6. బింక.

"కుంతికుమార, నీకును బంటు కొలఁది । వంత యింతయుఁ గాక -బహుభాషలేల ?
నీవు ధర్మజుమీఁద నేరంబు [1]మోపి । లావు సేయక నాఁడు లజ్జఁ గోల్పడితి !
క్రోధించి నేఁడు గైకొన్న లావేది ? । రాధేయు గెల్చితో ? రాజు గెల్చితివో ?
వనవాస మీడేర్చి వచ్చినఁ గాని । మన రాజ్యభాగంబు [2]మన కీరటంచు
నా యానఁ గాదె మీ రాయాసపడుట ! । దాయలు మీ [3]కేల ధర్మసంచయము !
ఈవల నావల నీవు గావించు । లావులవలెఁ గాదు లలిఁ గర్ణు [4]చోట ;
చూచి పోరాడు నిష్ఠురవృత్తి." యనుచు । నేచి వాలమ్ము లనేకమ్ము లేసె.
అతఁడును నేయుచో నయ్యస్త్రవితతి । కుతలంబుఁ బొదివి యర్కుని కాంతి [5]నణఁచె.
అప్పుడు రణభూమి నంధకారంబు । [6]గప్పెను ; వాయు[7]వేగము లేకయుండె.
భానుజు బలమంతఁ బార్థుపైఁ గవిసి । నానా [8]శరంబు లున్నతశక్తి నేయఁ
జలమొప్ప మందు వేసవిఁ దుంగ మహువు । [9]మలసి చొచ్చిన దంతి[10]మాడ్కి నర్జునుఁడు
చతురంగబలముల సమర రంగమున । ధృతిఁగూల్చి మఱియు రాధేయు నొప్పించి
పరికించి యతని చాపము ద్రుంచివైవ । నుకుతర క్రోధియై యుగ్రాంశు కొడుకు
మింట మంటలు [11]వాఱ మెఱుఁగారు శక్తి । [12]ఘంటికాధ్వని దోఁపఁ గాంతేయు వైచె.
ఆ శక్తిఁ జూచి భయాసక్తి [13]నడలి । వాసవాదులు చూడ వాసవాత్మజుఁడు
పదిలుఁడై [14]పటు బాణపటలంబు దొడిగి । యది నూఱుఖండంబులై రాలనేసె.
నుతశక్తి నంతఁ గర్ణుని మూలబలము । పతికి నడ్డమువచ్చి పార్థుపైఁ [15]గవిసి
భద్రదంతావళ ప్రతతి డీకొల్పి । రౌద్రముద్రోన్నిద్ర రసిక భావమునఁ
బలుతూపు లేసి యార్భటము చేయుటయుఁ । బ్రళయ కాలాంతక ప్రతిముఁడై యతఁడు
దండ కాండంబులు తరు మండలములు । సంతత మదధార చారు నిర్ఝరము
ఘన గండయుగళముల్ గండశైలములు । కొనముక్కుఁ జెఱఁగులు గుహలుగాఁ గలిగి
పొలుపైన భూధరంబులఁ బోలు కరుల । బలు పిడుగులఁ బోని బాణంబు లేసి
యిలఁ గూల్చునంతలో; నినతనూభవుఁడు । వెలయంగ వేఱొక విల్లు సంధించి
యాఱింట నుత్తరు, నాఱింట హరుల, । నాఱింట రథముఁ, బదాఱింటఁ బడగ,

---

1. పెట్టి. 2. మనకు రాదనుచు. 3. కేడ. 4. లావు. 5. (బొదివె. 6. గప్పుచు.
7. మార్గము. 8. విధంబుల ననిచి రేఁగఁగను. 9. బలిమి. 10. భాతి. 11. మండ. 12. గంట
గింపుచుఁ గేలఁ గడుఁ బల్మిఁ బట్టి । గట్టిగా ధృతి దోఁపఁ గాంతేయు మీఁద । నెట్టన వైచె
నిర్నిద్ర దర్పమున. 13. చెదరి. 14. బహు. 15. నపుడు.

నరుమేన డెబ్బదినాల్గు బాణముల । వరుసతో నాటి భూవరుని మెప్పించె.
నరుఁడుఁ గర్ణుని నేసె నరుఁ గర్ణుఁడేసె; । నిరువురుఁ బోరాడి రిట్లొక్కరీతి.
అప్పుడు కౌంతేయుఁ డలుక [1]రెట్టించి । తప్పక వీనితోఁ దడ[2]వేల యనుచుఁ
గడఁగి నన్నూరు ప్రేకపునారసములు । తొడిగి రాధేయు బంధుర కంధరమునఁ
గరములఁ బార్శ్వభాగమున ఫాలమున । నురమున రక్తంబు లొలుక నేయుటయు
[3]మతి గట్టిపెట్టి యా మార్తాండు పట్టి । ధృతి తగదొట్టి భీతియుఁబుట్టి పాఱె.
పాఱిన వైరాటి పకపక నవ్వెఁ; । మీఱి శంఖము మ్రోఁత మెఱయించె నరుఁడు ;
పొగడిరి సురలెల్లఁ; [4]బొగడిరి నరులు ; । పొగడిరి క్రీడిఁ దుంబురు నారదులును.
[5]రవిజుతో నీ భంగి రణము నేసియును । దివిరెడి రణకాంక్ష దీరక నరుఁడు
అరదంబు [6]గురునిపై నరుగనిమ్మనుచు । నరనాథసుతున కున్నతిఁ [7]జెప్పుటయును
నొగిలి నమ్మాట కోల నొగలపై నతఁ[8]డు । డిగ[9]వైచి భీతి రెట్టింప నిట్లనియె:
"అమ్మక్క ! [10]యింక నేమైనఁ గానిమ్ము । నెమ్మి నెవ్వండోపు నీ తేరు గడప!
తురగ యూథము మీఁదఁ దోలి వేసరితిఁ, । గరిసమూహము మీఁదఁ గడపి వేసరితిఁ
దలమీఱి దొరలపైఁ దఱిమి వేసరితి, । బలియురపై నెల్లఁ బఱపి వేసరితి,
తుదయేది మొదలేది దురము చేయుటకు! । ఇదె నీకు భుజసార మెక్కుచున్నదియ?
([11]అరయ శౌర్యము నీకు నభివృద్ధిచెందెఁ । గరము నిర్భరమైన ఘనతేజ మొప్పె.
ఇటు లెక్కుడగు లావు నేనెందుఁ జూడ । నటమటించెను జిత్తమాలంబునందు ;
సారథి కార్యంబు సాధింపఁ జాల. । వారక చేష్టలు పాసె నెమ్మేను
భీతిమై నిండారె విహ్వల భావ । మే తీరునను బుద్ధి యొలమిమై నిలువ.")

## అర్జునుఁడు ద్రోణుపైఁ గవియుట

దనిన భూమింజయు నా క్రీడి చూచి: । "వినుము వేసరనేల వీరకార్యముల?
నేనున్నవాఁడ నీ కేల చింతింప? । పూని యశ్వంబుల బోధించి నడపు;

---

1. దీపింప. 2. వయ్యె ననుచు. 3. మతిగిట్టి పెసఁగిట్టి. మార్తాండు పట్టి । ధృతి గట్టిపెట్టి భీతిలి ముట్టఁ బాఱె. 4. బోరన మునులు. 5. తివిరిన రణకాంక్ష తిరమైన నతఁడు । తవిలి నల్గడలను దవ్వు వీక్షించి । యరదంబు. 6. నరులపై. 7. జెప్ప నతఁడు. 8. వైచి. 9. ఁజూచి. 10. లార. 11. ఈ కుండలీ కృతభాగము తంజా. ప్రతిలోను, మ. ఓరియంటల్ ప్రతిలోను లేదు. అచ్చో నీ ద్విపద గలదు – పరఁగ నెందైనఁ బంపకుమయ్య నన్ను । పురిదాఁక హరుల జొంపుట (దోలుట) యొంత బంట (టి).

అరుణాశ్వములతోడి యరదంబు మీఁద । గురుఁడున్నవాఁడు చూడ్కులనిల్పు మచట;
ఉరుకంధరమును మహోల్లాస ముఖముఁ । బలుపైన యురమును బాహు దీర్ఘతయుఁ
గలిగిన పుణ్యుఁ డాగమశాస్త్ర విదుఁడు । చెలువార విలువిద్య చెప్పె మా కితఁడు.
క్షత్రియ గోత్ర సంజాత దోషమునఁ । జిత్ర మీతని నేను జెనకంగ వలసె!
కానీను చందంబు గా[1]నీను ద్రోణు । నేను [2]మార్కొని పోదు నింతియు కాని.
పొలుపార మన తేరుఁ బోవని." యనుచుఁ । దొలఁగక ద్రోణుపైఁ దోలించి యతఁడు
అక్కజంబుగ మ్రొక్కి యాచార్యుఁ బలికె: । "అక్కటా! మీతోడ నని సేయవలసె;
భీకరాటవిలోనఁ బెద్దకాలంబు । చేకొని తిరిగి వచ్చిన విపన్నులము ;
కురుసేన [3]తోడ మార్కొన [4]మాకు వలసెఁ; । గరమర్థి మీ రెఱుంగని పనిగాదు ;
'గురువులతోడనా గుటగుట' లనక । కరుణింపుమయ్య సంగరము [5]సేయఁగను.
మున్ను మీ రేయక మొగినేయ." ననినఁ । బన్నుగా నిరువది బాణంబు లతఁడు
దొడిగి యేసిన వానిఁ దోడ్తోడఁ గ్రీడి । నడుమనే తునుమాడె నాల్గుబాణముల.
గురుఁడు వెండియు నేసెఁ గోటి బాణములు । నరుఁడవియును ద్రుంచె నానాస్త్రతతుల.
గతభీతి నిట్లు దిగ్గజము[6]లు రెండు । ప్రతిఘటించిన మాడ్కిఁ బార్థుండు గురుఁడు
బవరంబు సేయుచో బాణఘట్టనలఁ । బ్రవిమల [7]బ్రహ్మాండ భాండంబు పగిలె ;
సురగిరి కంపించె; సొరిగిరి మునులు ; । సురరాజు దప్పక చూడలేఁ డయ్యె.
ఇద్దఱు రణశూరు లిద్దఱు ధీరు । లిద్దఱు నతిరథు లిలఁ బార్థగురులు.
చెలువార గురుభక్తి శిష్యమోహములు । తొలఁగించి కోపంబుతోడ సేయుచును
గోలలు దప్పించుకొను నేర్పుతోడ । నాలోన నొవ్వనేయని వారిఁ బోలె
నున్నచోఁ, గురుసేన లొప్పారు వేడ్కఁ । బన్నుగాఁ దమలోన భాషించిరిట్లు :
"గురునితో నిట్లు మార్కొని లావునూప । నరుఁ డోపుఁగాక యే నరుఁడోపు నింక.
[8]నలుపైన గఱులు నున్నతిఁ దెల్లగఱులుఁ । గలుగు బాణంబులు కౌంతేయగురులు
ఏయుచో [9]నవి చూపుఁ డెలమిఁ జీకటియు । రేయెండయును [10]గూడు రీతినై తోఁచె.
ఒక్క బాణముపోలె నొగి బాణపంక్తి । నెక్కొని [11]గురుఁడేయ నిమిషమాత్రమున
నరుఁడది తుమురుగా నఱకుచున్నాఁడు ; । ధరణి నేమని చెప్పుదము [12]వీని నేర్పు!"

---

1. నేడు. 2. మార్కొనువాఁడ నీ కేల తలఁక. 3. నెల్ల. 4. వలె మాకు. 5. సేసెదము. 6. దిగ్గజము. 7. ధ్వనుల బ్రహ్మాండంబు పగిలె (?). 8. నలి నెఱ్ఱగఱులు. 9. చూపఱ కేపుమై రవియు. 10. బోలు. 11. గురుఁడేయు. 12. వీరి.

అనుసంత గురుఁడు దివ్యాస్త్రంబు లింద్ర । తనయుపై [1]నేయంగ ధరణి గ్రక్కదల
[2]భుగులను పొగలతో భూరి బాణాగ్ను । [3]లెగచినఁ జూచి యాయింద్ర నందనుఁడు
వరుసతో నింద్రాగ్ని వరుణాది సురుల । వరములఁ గొన్న యుజ్జ్వల బాణతతులఁ
[4]బ్రతి బాణములు గూర్చి పరఁగ నేయుటయు, । నతులమై బాణపక్షానిలం బపుడు
పడగలు [5]చించి యంబరవీధి కెగయ । గొడుగులు గొనిపోయెఁ గురుసేనలోన.
[6]తెగి ద్రోణుఁ డేసిన దివ్యబాణములు । పొగలఁజిక్కిన వహ్నిఁబోలె నుక్కణఁ[7]గె.
అప్పుడు కసలి ద్రోణాచార్యసేన । కుప్పలుపడ నస్త్రకోటు లేయుచును
గాండీవిఁ దాఁకినఁ గల్పాంత చండ । దండధరోద్దండ[8]దండుఁడై యతఁడు
తడిచేత [9]భిత్తిచిత్రము మాపినట్లు । తడయక సేననంతయు రూపుమాపి
యంకితరత్నంబులగు కిరీటములఁ, । గంకణంబులనొప్పు ఘనబాహుతతులఁ,
గలితకుండలములౌ కర్ణజాలములఁ । గలని శృంగారింపఁ గడఁకతో నచట
విపులమై నిండి పర్విన రక్తవార్ధి । కపుడు రత్నాకరంబను పేరు చెల్లె.
అర్జునుండపుడు సైన్యముఁ జంపివైచి । దుర్జయుఁడై పేర్చి ద్రోణు దేహమునఁ
బసిఁడిపింజలచేతఁ బరఁగు బాణములు । దశకోటి శతకోటి దాఁక నేయుటయు,
నతఁడును దలయూఁచి [10]యాత్మీయశిష్యు । మతిలోన మెచ్చి సమ్మతి మెప్పఁ బలికె :
"శూరుండవగుదు వర్జున, మేలు మేలు ! । ధారుణి నెవ్వరితరము [11]నిన్నెదుర ?
వృష్టిగాఁ దూపులు వెదచల్లనేర్తు । వష్టావధానంబు [12]లస్త్రలాఘవము !
మిగులనేర్పున మమ్ము మించితి గాన । జగతిలో వింటి కాచార్యుండ వీవ."
అని పెక్కుభంగుల నగ్గించు[13]టయును । వినువీధిఁ గొలువున్న వేల్పులందఱును :
"గురుఁడు గాండీవి మార్కొని యింతసేపు । దురములో నిల్చె సంతోషింపవచ్చు ;
ధరణి దావాగ్నిముందర నిల్వవచ్చు ; । ధరణి నుగ్రాక్షుముందఱ నిల్వవచ్చు ;
[14]బడబాగ్ని యెదుట నిల్వఁగవచ్చుఁగాని, । వడి నిల్వరాదు కవ్వడి యేయునపుడు.
అల్లవో కలశజ ! యల్లవో ద్రోణ ! । యెల్లసేనలలోన నీవె శూరుఁడవు."
అనునంతఁ గౌంతేయుఁ డాచార్యుమీఁదఁ । బనిగొని శరపరంపర బిట్టుపఱపి

---

1. సంధించి. 2. బుగులు కొంచును చేర్చు. 3. లెగయంగ. 4. నతితీక్ష్ణముల. 5. చించె నంబర మును జించె. 6. తెగఁబడి ద్రోణుఁ డద్దివ్యబాణముల. 7. చె. 8. తండమై 9. దుడిచి. 10. యాశ్చర్యమంది. 11. నిన్గెలువ. 12. హస్త. 13. నపుడు. 14. నిలువంగవచ్చునే సెటిఁ గీడిముందు । విలువిద్య మేటివి పెఱవక నిలిచి । తల్లవో.

సారథి యరదంబు చాపంబు హయము । లా రథికుఁడు కేతువనక యన్నియును
బాణాంబురాశిలోపల మునుంచుటయును । ద్రోణుఁగానక సేన దుఃఖింపఁదొడఁగె.

## అశ్వత్థామ యర్జునుఁ దలపడుట

అప్పు డశ్వత్థామ యాచార్యునొప్పి । తప్పకచూచి యుద్దండకోపమునఁ
దనర నెందఱునైన దండించు నతనిఁ । దనసేనలును దాను దట్టమై తాఁకి
పామునాల్కలఁబోని బాణంబులేసి । భూమియు మిన్ను నద్భుతముగాఁ గప్పె.
ఈతూపు లీవంక నితనిపైఁ గప్ప । నేతెఱంగునఁ జాల నిరులుగ్రమ్మఁగను
నరుఁడు వానిని ముంచె నారాచవృష్టి । గురుపుత్త్రుఁ డంతటఁ గోపంబు పెరుగఁ
[2]జక్రధారులఁ గొంత [3]జంకించిచూచె; । విక్రమంబునఁ గొంత వెఱపించిచూచెఁ;
బెలుచ [4]నుత్తరుఁ గొంత బెదరించిచూచెఁ; । [7]బలములఁ గోపించి పైఁదోలిచూచె;
బాశజాలంబుల భర్జించిచూచె; । డాసిన పడగ నాటఁగ నేసిచూచె.
నతఁ డెంతచూచిన [6]నద్దంబులోని । ప్రతిబింబమును బోలి [7]పార్థునిరథము
నందినగతి నుండు నందంగ[8]రాదు । ముందఱ విహరించు ముట్టంగ[9]రాదు.
విజయుఁ డప్పుడు శత్రువిజయంబు[10]మెఱసి । భుజములు తలమీఱి పొంగారుచుండ
గురుతనూభవుసేన ఘోరాజిలోన । నరికట్టుకొని భీషణాస్త్రంబులేయఁ
గొందఱ వంచించి కొందఱ నొంచి । కొందఱ విదళించి కొందఱఁ జించి
నడుములు ద్రుంచి యాననములు ద్రెంచి । నిడుపు ప్రయ్యలు వాఱనెఱపి కొందఱను
బొట్టలు చించి వీపులు విదళించి । యట్టలు నేలతో నణఁచెఁ గొందఱను.
బెగ్గడించుచు నిట్లు బీభత్సుచేత । స్రగ్గుడు ప్రగ్గుడై సకలసైన్యములు
వెన వార్థిలో నోడ విరియుచందమునఁ । బొసఁగ నర్జునవార్ధి [11]బొంకక విరిసె.
విరిసినఁ గోపించి విజయు నీక్షించి । గురుతనూజాతుండు కొమరొప్పఁ బలికె:
"ముదమున నావంక మొగముగా వైఱచి । కదన మెవ్వరితోడఁ గాంతేయ, నీకు?

---

1. ఫల్గును నేపు నశ్వత్థామ చూచి । విల్గొని దాఁకె నవ్వీరు మార్కొనుచు
 ఆమెయి గురుపుత్త్రుఁ డధికరోషమున । భీమ కోపాటోపభీషణుండగుచు
 నామేటి కెదురుగా నరిగి బాణముల । భూమియు.

2. చక్రాయుధులను. 3. జళిపించి. 4. నత్తఱి. 5. బలుతూపులేయుచు భర్జించి చూచె. 6. నరదంబు. 7. పార్థుఁడు. 8, 9. రాఁడు. 10. నెఱపి. 11. బొక్కన.

ఆచార్యు గెలిచిన యా బీరమెల్లఁ । బాచిపుచ్చెదఁ [1]గాని బంటవై రమ్ము.
[2]గాండీవమునఁ గాదె గర్వించినాఁడ । వొండేల యింక నేయుదుగాక." యనుచు
జలజలఁ గ్రీడిపై శరవృష్టి[3]గురిసి । నలువొప్ప నొకకోల నారి ఖండించె ;
అతఁడు వేఱొకనారి యరయుసందునను । నుతశక్తి సందంద నొప్పించి యార్చె.
సురలంత నాచార్యసుతుని వీక్షించి : । "కురువీరులందు నెక్కుడు [4]శూరుఁడితఁడు ;
[5]చక్కఁగా దీ సవ్యసాచి చాపంబు । చక్కనున్నది వాని సత్యంబుకతన.
చెచ్చెఱ వీరవర్జితమైన నేసఁ । [6]జొచ్చి చక్కఁడు నస్జును విల్లు నేఁడు ;
తల[7]మీఱు నల ద్రోణతనయుసాధించుఁ । జెలఁగుచుఁ దలయెత్తి సిద్ధమింతయును."
అని నారి ద్రెవ్విన యా క్రీడి విల్లు । వెసఁగొని సురలెల్ల వీక్షించు[8]నెడను,
ఒక్కంత నగుచు వేఱొక నారి వింట । నెక్కించి ద్రోణి మిన్నెక్కించి నరుఁడు
నాచార్యసుతునితో నతిఘోరసమర । సూచిత బాణవిస్ఫూర్తిమైఁ బోరి
గనబెన నతనియంగము లచ్చిపాఱ । ననమునఁ గ్రొవ్వాఁడి యమ్ములేయుటయు,
లావున లక్షోపలక్షబాణముల । దేవేంద్రసుతువైచె ధీరుఁడై ద్రోణి.
ఇరువురు నీ రీతి నిరుమూఁడు గడియ । లరుదారఁ [9]బోరుచో నర్జు నాస్త్రములు
అక్షయంబులు గాన నభివృద్ధి నొందె ; । నీక్షింప ద్రోణికి నిష్పంక్తి పొలిసె.

## కృపాచార్యుఁ డెదురేచ్చి యర్జును నెదుర్చుట

ఆ వేళ నెఱిఁగి కృపాచార్యుఁ డెలమిఁ । దా వచ్చి ద్రోణిముందఱఁ బన్ని నిలిచి
వశము గాదనక వివ్వచ్చుపై నడరి । పసిఁడి యమ్ములు కొన్ని పాఱవైచుటయుఁ,
పీతాంబరంబు గప్పిన శౌరిపోలె । నాతఁడు కృపనూర్గణావిష్టుఁ [10]డగుచుఁ
డెఱఁగొప్పఁ దానును దివ్యబాణములు । పఱపి కృపాచార్యుఁ బరఁగ నొప్పించె.
మౌర్వీనినాదంబు మహిత నాదంబుఁ, । బర్విన కోపాగ్ని బడబానలంబు,
నురుతర శరకోటు లూర్మిమాలికలుఁ,[11] । జిగి వీరలక్ష్మి లక్ష్మియుఁ గాఁగఁ గలిగి

1. మంచి. 2. గాండీవముండఁగాఁ గాదె గర్వించి। తొండేల. 3. నెఱపి. 4. వీరు. 5. చక్కనుండని. 6. చొచ్చెను నెలమి ; చొచ్చిన లజ్జ. 7. ధరించిన ; వంచె ద్రోణియుఁ దననారిదుసుమ. 8. టయును. 9. బోరాడి రర్జు. 10. డయ్యుఁ । చెరలమిఁ దానును దేవేంద్ర సుతునిఁ । దిరమొప్ప నేసెను ధీరుఁడై ద్రోణి । యిరవొప్ప నర్జునుఁ డిషుపరంపలు । పఱపి. 11. నరుణ వీక్షణపుష్పహార వల్లరులుఁ । గలితశోణిత వస్త్రకాండంబు రుచులు । గల వీరలక్ష్మియుఁ గలిగి చూపఱకు । సులభ.

సులభ గాంభీర్య మర్జున పయోరాశి । ప్రళయ కాలమునాఁటి భావంబు [1]దాల్చి
చెలరేఁగి [2]ముంప వచ్చినఁ, గృపాచార్యుఁ । డలవోక [3]వారించి యలుక రెట్టించి
కడు వాఁడి తూపులఁ గపికేతనంబు । తోడింబడ [4]నాటించి దోర్బలంబునను
దొనకుఁ జే చాచుట తూపుగైకొనుట । ధనువుతోఁ దివియుట తగనేయుటయును
ఎలమి నింద్రునకైన నెఱుఁగ [5]రాకుండ । బలిమి [6]వేఁడిమి చూపి పార్థునొప్పిం[7]ప,
లావునఁ జెఱుతకాలమునాఁటి గురువు । భావింప గురుఁడని పాండవుం డలరి
తూపులఁ గృపుని కేతువు ద్రుంచివైచి । చాపంబు రథము [8]వక్షము నేయునంత,
[9]సురథనాముఁడు నరిష్టుఁడు సుకేతుండు । సరవిఁ జిత్రాశ్వుండుఁ జంద్రకేతుఁడు
మఱియును హేమవర్ణుయు సుషేణుండు । మఱి మణిమంతుండు మంజుమాళియును
అను నొప్పు నామధేయములవా రార్చి । గొనకొని రథ రక్షకులు దాఁకుటయును,
ఆ పార్థుఁ డందఱ కన్నిబాణములు । చాప శింజినియందు సంధించివైచి
పొనఁగఁ దాళీఫలంబులు [10]డుల్చువగిది । వసుధ డొల్లఁగనేసె వారి[11]శీర్షములు.
అంతటఁ బోక తానా గొంతికొడుకు । వింతగాఁ గోపించి వెసఁ గృపాచార్యు
నొప్పించి యరదంబు నుగ్గుగా విఱిచె; । అప్పుడైనను బోక హరులఁ జెండాడి
సారథిఁ దెగటార్చి చాపంబు దునిమి । పూరించె శంఖంబు భూమి గ్రక్కదల.
విరథుఁడై కృపుఁడంత విపుల [12]రోషమున । నరుణ పంకజము లట్లక్షు లొప్పార
[13]ధారాకరాళమై తనరారు శక్తి । బోరనఁ గ్రీడిపైఁ బూన్చి యేయుటయు
నది ఘోర భయకారణాకార మగుచు । నది భానుకోటి ప్రభాభాసియగుచు
నది శూలధర కేళికాభీల మగుచు । నది [14]గాంగవారుణంబగు వర్ణమగుచు
వచ్చుచో, నడరి వివ్వచ్చుఁ డాశక్తి । [15]నిచ్చలఁ బదితూపులేసి ఖండించె.
అలుకతో మఱియుఁ గృపాచార్యుఁ డేచి । పలుకయు నడిదంబు పదిలుఁడై పట్టి

---

1. దాల్చె 2. ముంచ. 3. గావించె. 4. యతఁడిట్లు. 5. ంగరాక. 6. పోఁడిమి. 7. ప.
8. లక్ష్యము సేయు.

9. సుర తనూభవు నరిష్టుండును గృపుఁడు । సరవిఁ జిత్రాంశుండుఁ జంద్రకేతుండు । నరుణవర్ణుఁడు ధీరుఁడగు సుషేణుండు । మఱి మణిమంతుండు మంజు కాశియును । అననొప్పు పేళ్ళవా రటఁ గూడి తాఁకి (యార్చి) । గొనకొని రథరక్షకుల నొంచుటయును (దాఁకుటయును) । ఆపార్థు. 10. రాల్చు కరణి. 11. మస్తములు. 12. కోపమున. 13. దారుణాకృతి యగుచు. 14. కారవా. గౌరవా దూర మగుచు. 15. యిచ్చు పోనేసిన మడుగక యదియు । నడతెంచు.

నడతెంచు[1]చుండ నున్న తఱిఁ బార్థుఁ [2]డళియుఁ । బొడిపొడిగాఁ జేసి భూమి రాల్చుటయు,
నరు నంత దేవదానవ సిద్ధ ఖచర । నరులు కీర్తించిరి నానా[3]విధముల.
ఆ కృపాచార్యుండు నట [4]ద్రోణిరథముఁ । జేకొని నిల్చె నొచ్చినవాఁడు గాన.
అప్పుడంతటి వీరుఁ డాచందమైనఁ । [5]గప్పుకుత్తుక వడిగల సేనలెల్లఁ
జంద్రికలెల్ల [6]భాస్కరునకు వెఱచి । చంద్రుమమాటున కేఁగు చందంబు దోఁప
మఱిపోయి భీష్ముని మఱుఁగు చొచ్చుటయు, । నఱిమఱి బీభత్సుఁ డంటంగఁ దఱిమి
సమరశంఖంబులు సమరకాహళులు । సమరభేరులు మ్రోయ సమరంబు చేసి
[7]పొనరిన యుక్తితో [8]భుజశక్తి చూపి । [9]ఘనుకొని కుంతంబు మొనఁగొంతఁ బొడిచి
యలరు చక్రంబుల నరిచక్ర మణఁ[10]చె. । [11]బలిమి బాణంబుల బ్రద్దలై పగిలి
పడియున్న పునకలు పానపాత్రములు, । మడపక రుధిరంబు మదిరారసంబు,
శరవహ్నిఁ గురియు మాంసంబు కూరలును । ఒరతంబగు నేత్రతతులు మీనములు,[12]
తగు పిశాచంబు లుద్ధతిఁ బ్రవర్తకులు । పొగడొందు [13]ఝుంకృతుల్ మ్రోఁతలు గాఁగఁ
బొనర యుద్ధము పానభూమి[14]గాఁ జేసి । ఘనత గాంగేయు[15]పైఁ గడఁకతో నరుగు-
నెడఁ జొచ్చి వృషసేనుఁ డిషుపరంపరలు । [16]విడువని చలముతో విజయుపైఁ గురియఁ
జతురుఁడై నరుఁ డర్ధచంద్ర బాణముల । నతని విల్లును ద్రుంచి నైదు[17]తూపులను
వక్షంబు నేయుచో, వ్యాఘ్రంబుఁ గన్న । [18]యుక్షంబుగతిఁ బాఱె నొగిఁ దేరుడిగ్గి.
అంత దుశ్శాసనుం డా వికర్ణుండు । నంతతోద్ధతి వివింశతి దుర్ముఖుండు
వచ్చి తాఁకినఁ గ్రీడి వారి మస్త్రంబు । లుచ్చి పాఱఁగ [19]నేసి యుగ్యసారథుల
[20]నఱకి వర్మంబులు [21]నఱకి చాపములు । నఱకినఁ బాఱి రన్నరనాథ సుతులు.
పాఱినఁ గని నవ్వి పాండునందనుఁడు । మీఱిన వేడ్క భూమింజయుఁ జూచి :

---

1. చున్న. 2. డపుడు. 3. ముఖముల. 4. ద్రోణు. 5. గప్పిన భీతిమైఁ గల సేనలెల్ల. 6. భాస్కరమూర్తికిఁ జెదరి. 7. యొ. 8. యురుశక్తి - మెఱసి. 9. మునుకొని మొత్తంబు మొగిఁ గొంత పొడిచి (?). 10. చి. 11. బలిమినిఁ బ్రాణుల ప్రాణంబు లొలిచి. 12. గాఁగఁ గైకొని భూతకాండంబు లచట । వీఁగ కెంతయు వేడ్క విహరింపఁ దొడఁగెఁ । బొనర యుద్ధము రణభూమిలో బలియ । ఘనత గాంగేయుపైఁ గడఁకతో నరుగు । నెడఁ జొచ్చి. 13. మ్రోఁత యుబ్బుట గాఁగఁ జేసి. 14. తోఁ బొల్చి. 15. తోఁ గదనంబు సేయ. 16. ఒడలుపడంగ నా పార్థుపైఁ గురియ. 17. బాణముల. 18. ఋక్షంబు ... నిట .... . 19. నేసె నుగ్రబాణముల. 20, 21. నఱకె.

## భీష్మార్జునులసమరము

“మనమింక భీష్మునితో మార్కొన్న మేలు; । ఘనతాళకేతువు గంటివే యతని?
పనివడి యతనితోఁ బనచూపకున్నఁ । [1]దనియదు హృదయ మెంతటి కయ్యమునకు.
వరుసఁ బగ్గంబులు వదలుగా విడిచి । హరుల వేగమె తోలు మచ్చోటి.” కనిన
నవనీశతనయుఁడు నట్లకా కనుచు । జవనాశ్వములమీఁద [2]సమ్మెట వేసి
యరయ నూలును బట్టినట్లుండ నడుపి । యరదంబు దోలెఁ జయ్యన భీష్మమీఁద.
అప్పు డర్జునునకు నా శాంతనవున । కొప్పార నతిఘోరయుద్ధంబు చెల్లె.
అందు గాంగేయుండు నాహవోత్సాహ । సందేహములు మాని శంఖ మొత్తుటయు
నతఁడును నొత్తె బ్రహ్మాండంబు [3]పగుల । [4]ధృతిలోకచిత్తంబు దేవదత్తంబు.
కౌరవేశ్వరుఁ డంత ‘గాంగేయు[5]తోడఁ । బోరాడి నరుఁ డోడిపోవుఁ బో’ మ్మనుచుఁ
గొండంత వేడ్క గైకొని చూచుచుండ । నొండొరుల్ దల[6]పడి రొగి భీష్మ నరులు.
నుత వాయువేగ మనో[7]వేగులగుచు । నతి తీవ్రగతిఁ దేరులప్పుడు వర్తింపఁ
దొడిగి [8]వారేసిన తూపులన్నియును । నడుమఁ[9]మార్కొని పోరి నగ్గుగాఁ దూలు
పొనర నాగ్నేయాస్త్రమునకు వారుణము । మునుమిడి నైంద్రాస్త్రమునకు రాక్షసము
పొనరఁ [10]దమోబాణమునకు సౌరమును । మునుకొన్న నాగాస్త్రమునకు గారుడముఁ
బొలుపైన దైత్యాస్త్రమునకు వైష్ణవము । నలి మేఘబాణంబునకు వాయుశరము
మొదలైన ప్రతిబాణములు సంతరించి । కదిసి యొక్కరుని కొక్కరు [11]వట్రపడక
చలమొప్ప దొనలపైఁ జాచిన చేయి । సొలవక శరముఁ దెచ్చుచునున్న చేయి
క్రచ్చఱ వేగంబు గైకొన్న చేయి । క్రుచ్చి యమ్ముల నారిఁ గోరాడు చేయి
గలిగి నిశ్చలబాహు ఘనచతుర్భుజునిఁ । దలపించుచుండి రిద్దఱుఁ బెద్దప్రొద్దు.
అడరి కౌరవసేన లంత నార్పులును । బెడబొబ్బలును మీఱ భీష్మ నగ్గించి:
“[12]గెలువుము గాంగేయ, గెలువు మర్జునునిఁ । దలపంగ మాపాలి దైవంబ వీవ;
నీవు విల్లందిన నృపుఁడు మిన్నందె । నావల నీచిత్త.” మనిన భీష్ముండు
పడగపై నెనిమిది బాణంబులేసి । పడగనుండెడి భూతపంక్తి నొప్పించి

---

1. దనియదు ప్రాణుఁ డెంతటి కయ్యమునకు (?). 2. సంపెట. 3. లగల. 4. ధృతి దేవదత్తంబు. 5. దొడరి. 6. మీఱి రొగి. 7. వేగములను । అతిభారగతిఁ దేరులపుడు వర్తించె. 8. రేయుచు నున్న. 9. దార్కొనఁగాని యటఁ ద్రోచిరావు. 10. ంగ నంతక. 11. డీలు. 12. గెలిచితి.

పరఁగ నుత్తరుమీఁదఁ బదితూపులేసి । పరఁగ రథ్యములపైఁ బదితూపులేసి
యర్జునుపైఁ దూపు లరిఁబోయునంత । నర్జునుఁ డవిద్రుంచె నస్త్రవర్షముల.
త్రుంచి వెండియు మించుదొరఁగు వేగమున । నంచితకాండంబు లతనిపై[1]నేయ
నవియును భీష్మబాహాతీవ్రగతుల । రవిచేత నంధకారమువోలె నడఁగె.
వెండియు నరుఁడేయ వెస భీష్ముఁడేయ । మండుచు బాణాగ్ని మహితమై [2]పర్వి
నెఱయ వార్ధులలోని నీరెల్లఁ [3]గాఁచె । [4]మెఱయ వేల్పులకొండ [5]మెత్తగాఁ గరఁచె
సురనదితోఁగూడ సురరాజుతోఁటఁ । బరఁగఁ బచ్చని శాకపాకంబుచేసె.
అంత నర్జునుఁ డేచి యాభీష్ముచాప । మింతింత [6]తురుముగా నేసి యార్చుటయుఁ
[7]బోనరఁ బండులులేని పులివోలె భీష్ముఁ । డానరఁ గోపించి వేఱొక విల్లుదాల్చి
శరము లేయుచునుండెఁ ; జక్రరక్షకులు । తరమిడి ఘోరయుద్ధము సేయునెడను
నరుఁడేచి వారినందఱఁ ద్రుంచివైచె. । సురరాజసుతుఁడు భీష్ముని నొవ్వనేసి
యతని సారథిఁ జంపి హరులఁ జెండాడి । యతని [8]సిడంబు వ్రయ్యలు వాఱనేసి
వనజాసనునకైన వారింపరాని । యనువునఁ బోరాడ, నడరి భీష్ముండు
భయమేది నరుని దాపలి భుజంబునను । రయమొప్ప దొడ్డ నారసము నాటించి
సిందూరములతోడి సింధురంబనఁగ । నందంద రక్తసిక్తాంగుఁ జేయుటయు,
వెండియు [9]గాంగేయువిల్లు భల్లమున । ఖండించి [10]యార్చె [11]నాఖండలాత్మజుఁడు.
అతఁడు వేఱొక[12]చాప మరయు నాలోన । శతలక్ష శతకోటి [13]శరపరంపరల
ఘనమైన యురము వ్రక్కలుసేయ నతఁడు । పనిచెడి రథముపైఁబడి మూర్ఛపోయె.
పోయినఁ [14]గడుఁజిన్నఁబోయి సారథియు । నా[15]యెడ రథము నొయ్యనఁ దోలుకొనుచు
నచ్చోటు దొలఁగిన నాహవక్రీడ । నిచ్చలోఁ దనివోక యింద్రనందనుఁడు
తలయెత్తిచూచి రాధాపుత్త్రుఁ గృపునిఁ । గలశజు మఱియు నక్కడివారిఁ గాంచి
యటఁ దేరు దోలింప నంత ద్రోణజుఁడు । పటుతరాటోపుఁడై పలికె భానుజుని :
"గాంఢీవి మఱియు నిక్కడవచ్చెఁ గర్ణ ! । చెండాడి విడుచును సేన [16]నింతటను ;
ఏవంక దొలఁగుద మేమిసేయుదము ? । నీవు మార్కొనరాదె ? నిలుచు నీచేత ;

1. ఁబఱప. 2. పర్వ. 3. గ్రాఁగి. 4. యరయ. 5. యంతగాఁ గాచి. 6. తుమురు. 7. మునుకొని కేఁగిన. 8. రథంబు. 9. నాతని వింటి నర్జునుఁడు ; విల్లు భావించి భల్లమున. 10. మించె. 11. నఖండ కోపమున ; నఖండవిక్రముఁడు. 12. నారి యరిఁబోయునంత. 13. శత. 14. యెడ. 15. యన. 16. నంతయును.

సకలసేనలు గాచి జయసిద్ధిఁ బొందు । మొకని కొక్కఁడు చాలు యుద్ధంబు సేయ.”
అని మర్మమెత్తిన నతఁడు కోపించి : । ‘నను గేలిగొనఁగ మానఁగఁ జాల వకట!
ఇంకఁ దప్పకచూడు మితని సత్త్వంబు । బొంకుచేసెద నీవు బుద్ధిలో మెచ్చ.’
అనుచు రాధేయుఁ డాహవకాంక్షుఁడగుచుఁ । జనఁజొచ్చె నతని[1]పై సైన్యంబుతోడ.
క్రమ్మరి [2]యిటువచ్చు ఘనసేన నంత । నిమ్ములఁ జూచి దేవేంద్రనందనుఁడు
వెలయఁ బండినచేను వృషభంబుసొచ్చు । పోలుపునఁ జొచ్చి యద్భుతలీల మెఱయ
సైరింపరాని యస్త్రములు సంధించి । ధీరుఁడై శరములు ద్రోపఁ[3]బూనుటయు
నతని బాహాశక్తి యంతకంతకును । వితతమై [4]పేర్చుట వీక్షించి సేన
పతికి లజ్జించిన బాలచందమునఁ । బ్రతిచేష్ట చేయనేరక యూరకుండె.
అంత గాండీవి కిట్లనియె నుత్తరుఁడు : । “కౌంతేయ, రమ్ము సంగ్రామమ్ము చాలు ;
ఇది యాదిగా నొక్కయేఁడు పోరెనను । మదిలోన రణకాంక్ష మానదు నీకు.
లక్షింపఁ గురుసేనలకు సిగ్గులేదు । శిక్షించి విడిచినఁ జెదరిపోవలదె!
[5]అది వచ్చి తాఁకినయప్పుడు ఖండింపఁ । బదిలమై కలసి యెప్పటియట్ల వచ్చు!
ఎన్నఁడు మోక్ష? మింకెన్నఁడు [6]గెల్పు? । ఎన్నఁడు విరటుతో నేను భాషింతు?
సూత[7]కృత్యమునకుఁ జొరఁజాల నింకఁ । జేతులు[8]మోడ్తు డస్సితి.” నన్న నవ్వి
నరుఁ డొప్ప ననియె : “మానవనాథతనయ! । కర మొప్ప నీడేఱెఁ గార్యమంతయును.

## అర్జునుఁడు దుర్యోధనునితో యుద్ధము సేయుట

తొడరి యింతకుమున్న దుర్యోధనునకు । [9]జడిగొను తూపుల చవి చూపలేదు ;
అతఁడును సన్నద్ధుఁడై యున్నవాఁడు । హితులుఁ దమ్ములుఁ దాను నిదె కయ్యమునకు ;
తురగరత్నంబులఁ దోలి [10]వేసరితి । పరఁగ నేనును దోడువడువాఁడ [11]నిపుడు
తేరు పోని.” మ్మని [12]తెలిపి చెప్పినను । ధీరుఁడై యపుడు ధాత్రీపాలసుతుఁడు
సేనలుచెదర నాక్షితి[13]భాగ మదర । [14]భానుఁడు బెదర దుర్భరధూళి గదుర
రారాజుపై [15]నిట్లు రథము దోలుటయు । వారును మదిని దుర్వారకోపమునఁ

1. తో సకలసైన్యములు. 2. కడఁకతోఁ గల సేనలెల్ల. 3. జొచ్చు. 4. హెచ్చుట. 5. చదియంగఁ గొట్టిన జాఱంగలేక. 6. చత్తు । రెన్నఁడు. 7. కార్య. 8. నొచ్చె నొచ్చితి. 9. సుడియు... చూపంగలేదు. 10. వేసరఁగ. 11. ననుచు. 12. తెలివి. 13. నాగ. 14. భూనభోంతరము నద్భుతధూళి మునుఁగ. 15. వాఁడు.

బైపాటు సేయుచోఁ బార్థుండు వారిఁ । బ్రాపైనతూపులఁ బాఱఁదోలుచును
గురురాజుఁ దాఁకి రక్షోవీధియందు । సరవి నాటఁగ రెండు శరము లేయుటయు
మదధార లొలికెడు మదహస్తిపోలెఁ । [1]గదిసి నెత్తురుగాఱఁ గౌరవేశ్వరుఁడు
నోలిమై నెత్తురు లొలుక నర్జునుని । ఫాలమ్ము వాలమ్ముఁ [2]బరఁగ నాటించి
యొకరశ్మి మున్నుగా నుదయించు సూర్యు । నకలంకగతిఁ [3]బొల్చు నతనిపై మఱియు
బొమముడి [4]నిక్కించి భూరిబాణములు । శమన మహారాతిసముఁడౌచుఁ [5]బఱపి
యాతని బాణంబు లంతంత నఱకి । చాతుర్యమున నొక్కశక్తి వైచినను
'మేలు దుర్యోధన, మేలు మే!' లనుచుఁ । జాల సంతోషించి శక్రనందనుఁడు
నతఁడు వైచిన శక్తి [6]నవలీలఁ ద్రుంచి । మితిలేని శరముల మెఱసి వర్షించి
లాక్షాగృహంబు గాల్పఁగనున్న పగయు । నక్షీణ కపటాత్ముఁడై యున్న పగయు
నెడపక పాంచాలి నీడ్చిన పగయు । [7]నడవులలోఁ దమ్ము నలయించు పగయు
నొక్కట సాధింప నుద్యోగపడఁగ, । గ్రక్కున నతనిభాగ్యము కల్మిఁ జేసి
ఘనుఁడు వికర్ణుండు కరిరాజు నెక్కి । తనవెంట రథములు దవిలి యేతేర
జలదంబుపైనున్న జంభారిపోలెఁ । బలుతూపుగములను బార్థుఁ గప్పుచును
ఎడఁజొచ్చి నిల్చి తా నెల్లసేనలకుఁ । గడువేడ్క సేయుచోఁ, గాంతేయుఁ డలిగి
కాలదండముఁబోలు కఱకునారసము । లీల సంధించి వాలినదృష్టి నిలిపి
తెఱఁగొప్పఁ దెగ నిండఁ దిగిచి యేయుటయుఁ । బరఁగంగ నది దంతిఫాలంబు గాఁడి
యొనర వాలముచాయ నుచ్చిపోవుటయు । ననయంబుఁ [8]గంపించి యామహాగజము
కులిశంబు దాఁకినఁ గుంభినీధరము । [9]చలియించి కూలినచందమై కూలె.[10]
అతిభీతుఁడై [11]యంత నా వికర్ణుండు । [12]ధృతిఁబాసి తనయన్న తేరుఁ జేరుటయు,
నరుఁడు వేఱొక దొడ్డ నారసంబునను । గురురాజు నొప్పించి కురుసేనమీఁద
గణుతింపరాని మార్గణము లేయుటయు । రణము చాలించి కౌరవరాజుసేన
యేలినవారి నయ్యెడఁ బాఱవైచి । కాలిచప్పుడు దివ్యకటకంబు ముట్ట,
రథములు విడిచి వారణములు విడిచి । ప్రథనంబు విడిచి గర్వము లుజ్జగించి

---

1. గదలి. 2 బఱపి నొప్పించె. 3. బొల్చు యంతట నరుఁడు. 4. నెరయంగ. 5. నెఱపె. 6. నవనిపైఁ గూల్చి. 7. నుడుగక పుట్టంబు లొల్చిన పగయు. 8. నొప్పిచే నా. 9. చలియించు తెఱఁగునఁ జలనమై కూలె. 10. కడఁగి పెక్కండ్లు వ్రక్కలుసేయు ధాత్రిఁ । బడిన లోహపుగట్టుభాతిగా నున్న । నతిభీతుఁడై. 11. పాఱి యా. 12. ధృతిని గర్ణుండున్న.

కురుభూమికై గుండుగూడి పాఱుటయుఁ, । గురురాజు తానును గుట్టుపోవిడిచి
సారథి యప్పుడు మెచ్చఁగ వేగమునను । దేరు దాఁదోలుచు ధీరుఁడై మరలి
గాలిఁబోవుచునున్న కారాకుపోలెఁ । దేలి పాఱఁగఁజూచి తిరమేది దొరలు
తారును దమయంతఁ దగిలి పాఱుటయు । వారక నరుఁడంత [1]వడివెన్నుదవిలి
యువరాజు వీపున నుచ్చిపోనేసి । రవిసూను పెడతల రయమొప్పనేసి,
దివిజులు కొనియాడ దివ్యశంఖంబు । రవళిచేసినఁ జూచి రవితనూభవుఁడు :
"కలశసంభవ, పోకు ; గాంగేయ, తిరుగు ; । బలభేదిసూనుండు పతిమీఁద వచ్చె ;
నిలువు మశ్వత్థామ, నిలువుము శకుని, । యెలమి సందడిఁ బోదురే కృపాచార్య !
ఇప్పుడు [2]ప్రాపుగా నీనృపాలునకుఁ । జెప్పుఁడు మనమేమి [3]చేయంగనొప్పు ?
పదివేల రక్షించు పతి రక్షసేయ । [4]నిది వేళ." యనుటయు నెల్ల[5]వీరులును:
"తిరుగనోపినఁ గర్ణ, తిరుగు ; మే[6]మైనఁ । దిరుగనోపము పార్థు తెరువు పోలేము ;
[7]కనలు నర్జునుఁ దాఁక గతియేది మనకు ? । దొనలలో వెదకినఁ దూపులు లేవు ;
రథికయుగ్మము లొక్కరథముపై నిలిచె ; । రథముల రెండేసి రథ్యంబు లయ్యె ;
పటుశస్త్రములువైచి [8]బలిమిఁ బోనాడి । [9]భటు లాలమునుబాసి పాఱుచున్నారు ;
పోయినఁ గయ్యంబు పోవని." యనుచు । వాయువేగముతోడ వచ్చుచో నతఁడు:
"వెనుకఁజిక్కిన సేన వెసఁ గూడుకొనక । చనుట ధర్మముగాదు చర్చింప [10]మీకు ;
చెన్నారఁ గవ్వడిచేతితూపులకుఁ । గన్నులుగల వెందుఁ గాదునో యెఱుఁగ !
కూడి పొం." డనుటయు గురుఁడు భీష్ముండు । వీడినసేనకు వెనుకయై నిలిచి
యొయ్యనఁ బోవుచో, నొనరఁ బార్థుండు । చయ్యన నెలుఁగెత్తి జననాథు[11]కనియె :

## అర్జునుఁడు దుర్యోధనుని చిన్నఁబుచ్చుట

"నిలుము దుర్యోధన, నీయంతరాజు । తొలఁగి[12]పోవునె యిట్లు దురముచాలించి ?
నీవు నీ[13]పుత్రులు నీసహోదరులు । నీవు మన్నించిన నృపులు నీసఖులు
వచ్చితి ; రేనొంటి వచ్చి తాఁకుటయు । విచ్చితి ; రిదిచూడ వీరధర్మంబె ?

1. వారి వెన్దగిలి। వివిధసాయకముల వేధించి తోలి. 2. నామాటలీ. 3. సేఁత మిద్దఱము. 4. రిది యేల. 5. సైనికులు. 6. మింక. 7. తనువున నర్జునాస్త్రములు గ్రిక్కిఱిసె. 8. బాహుదండములు. 9. భటులు ప్రేవులుపట్టి పాఱుచున్నారు. 10. మనకు. 11. బిలిచి. 12. పోదురె యట్లు. 13. మంత్రులు.

గజపురి [1]పౌరవర్గములెల్లఁ జూడ । గజముపై వచ్చుటగాదు కయ్యంబు!
తద్దయుఁ గై సేసి తగఁ గొల్వులోన । [2]గద్దియ యెక్కుటగాదు కయ్యంబు!
అస్తోక దివ్య గంధాకీర్ణమైన । కస్తూరిఁ బూయుటగాదు కయ్యంబు!
సంతోషమున రత్నసౌధంబులందుఁ । గాంతలఁ గూడుటగాదు కయ్యంబు!
ఏదిగాఁ జూచితివీవు కయ్యంబు? । జూదమాడిననాఁటి చూఱలుగలవె?
[3]పొలుపార నీకొక్క బుద్ధిచెప్పెదను । దొలఁగక నీవు నాతోడ మార్కొనుము;
ఏను నినుఁబట్టి యెల్లరుఁజూడఁ । బీనుఁగుఁ జేయుచోఁ బృథివీశ, వినుము
ఎదురుగా వచ్చు దేవేంద్రలోకంబు; । చనురొప్ప నంటలి సౌఖ్యంబు మేలు;
అటు[4]కాక పాఱిన నపకీర్తి నీకు; । కుటిలవర్తను నిన్నుఁ గొల్తురే నృపులు?
పోరాము, పోయినఁ బోనీ." యనినఁ । గౌరవనాథుఁ డాగ్రహముతోఁ దిరిగి
తొలఁగక గాంగేయ ద్రోణులఁ గడచి । బలభేది సుతుఁ దాఁకి బవరంబు సేయ
దొరలును మరలి బంధుర బాణవర్ష । నిరతులై తాఁకిరి నెమ్మి నర్జునుని.
వారలఁ జూచి కవ్వడి విల్లుద్రిప్పఁ । గౌరవబలము నక్కడఁబోక తిరిగి
ధైర్యంబు భీతియుఁ [5]దగిలి పర్తింప । శౌర్యభూషణుఁడైన శక్రజుఁ దాఁకి[6]
బంధుర రథ గజప్రతతు లందంద । కెంధూళి మిన్నంటఁ గేలిమైఁ దోఁపఁ
గరవాల పటుశూల ఘనభిండివాల । శరజాలములనెల్లఁ జతురులై [7]కప్పి
యెవ్వఁ డేకైగువ నేపాటి నేర్చెఁ । గవ్వడిపై వాఁడు కలనేర్పుఁ జూపి
వడినెల్లదిక్కులు వ్రయ్యనార్చుటయుఁ । గడు నుగ్రుఁడై మంశి గాండీవధనుఁడు
అలయక రిపుల రూపణఁప నోపియును । దెలిసి పాండవుల ప్రతిజ్ఞలూహించి?
'పేర్చి వీరల భంగపెట్టెదఁగాని । చర్చింప నూఁక చంపఁ బో' మ్మనుచు
సమ్మదంబున నున్న శక్రుచేఁ గొన్న । సమ్మోహనాస్త్రంబు సంధించి మించి
సేనలఁ గలయ నీక్షించి యేయుటయు, । సొనలు మఱచి భూమికి వ్రాలి తూలి
శరశరాసనములు జాఱంగవిడిచి । పరఁగ నిద్రలువోపు పగిది నందఱును
నెట్టన వివశులై నెఱి వింధ్యమాఁక । పెట్టిన గతి నుండఁ, [8]బ్రీతుఁడై నవ్వి

1. వీర. 2. గద్దెపై నుండుట. 3. పొంద. 4. కాన. 5. దపఁబాటు గదుర. 6. భూరజఃపటలంబు భువనంబు నిండ । నాశాచరోచులు నలువైపు లలమ । సింహనాదార్భటిఁ జెవులు ఘూర్ణిల్ల । రంహావిస్ఫూర్తి తోరంబుగాఁ బ్రబలఁ । గరవాల (ముద్రి. ప్ర). 7. కప్ప । నవ్వడి కొదుగక యాలంబుసేయు. 8. వేడ్కతో.

తనలోనఁ బార్థుఁ డుత్తరమాటఁ దలఁచి । మనుజేంద్రసుతుఁ జూచి మఱుకవఁ బలికె:
"ఉత్తర, నీవింక నుగ్రసైన్యముల । హత్తిన సొక్కు మాయకమున్న కవిసి
నలువురై మున్న ద్రోణ సుయోధనులయుఁ । [1]దలచుట్లుతిగిచి, యెంతయు వేగమునను
భానుజు తలనున్న పచ్చనివాగ । మానక తిగిచి, క్రమ్మఱఁ [2]దెల్లనైన
ద్రోణుని కృపుని శిరోవేష్టనములు । జాణతనంబున సంధించి తెమ్ము
హితపుణ్యుఁడగు భీష్ముఁడీమంత్రమునకుఁ । బ్రతి[3]కృతియెఱుఁగు మూర్ఛయుఁ[4]బోఁడుగాన
నతనిఁ జేరకు." మన్న హరులపగ్గములు । నుతలీల [5]నప్పుడు నొగలతో ముడిచి
యనువొప్పఁ[6]బోయి వాఁడవియెల్లఁ దిగిచి- । కొనివచ్చి నిలిచె గ్రక్కునఁ దేరిమీఁద.
అట్టిదకాదె నాఁడబలవస్త్రంబుఁ । బట్టిన దోషంబు [7]ప్రాపింపకున్నె!
తనరార నంత నుత్తరుఁ జూచి నరుఁడు: । "మనకిఁక [8]పరుల సమ్మర్దంబు వలను,
[9]దురదుర మన తేరు దోలగింపు." మనిన । సురనదీసూనుఁ డర్జును వచ్చి తాఁకి
యెందుఁబోయెద వని యెలుఁ[10]గించి బాణ । సందోహములఁ గప్పి సంభ్రమించుటయు
'మీకు నేటికి రేఁగ మిగిలినయట్టి । చీఁకటి నీఁక' నంచుఁ జెలఁగి యర్జునుఁడు
గరళంబు రూపులై కరమొప్పు తూపు । లరుదార[11]నేసి యాయనఁ జిక్కుపఱచి
యడరి రాహుగ్రస్తమై నోరిలోన । వెడలిన [12]రవిఁబోలె వెడలె నచ్చోటు.
అప్పుడు. మూర్ఛ దొయ్యనఁ దేఱి [13]నృపుఁడు । తెప్పలు దెఱచి జాఱిన విల్లుదాల్చి
తలచీర[14]లేమి నెంతయు వెచ్చనూర్చి । నలుదిక్కులను జూచి నరు[15]నంతఁ గాంచి
[16]యరదంబుతోల నుద్యతుఁడైనఁ జూచి । పరఁగ లేనగవుతోఁ బలికె భీష్ముండు:
"నరనాథ, యింక మానఁగరాదె రణము? । నరు[17]చేతికిచ్చి సైన్యముఁ జంపు[18]కొనకు;
ఈమాటు నామాట యిచ్చలో నాటు । మీ[19]మచ్చరమ్ము నీవిఁక మాను." మనిన
గురుమంత్రయుతమైన ఘోరాహివోలెఁ । గురురాజు నిలిచె నక్షులఁ గెంపుగదుర.

---

1. తలచుట్లు తెమ్మ రొంతటఁ జోక మఱియు. 2. ధీరులైన; నల్లనైన. 3. బాణ మెఱుఁగు. 4. బొందకుండు. 5. నమ్మిట. 6. నటఁబోయి యవి. 7. ప్రాపించె నృపుని. 8. వైరి. 9. తురతుర. 10. గత్తి. 11. నేయుచు నట. 12. యిను. 13. విభుఁడు. 14. గాన కెంతయు. 15. నొప్ప. 16. కాలాగ్నిరుద్రునికరణిఁ గోపించి । యాలంబుసేయ నుద్యతుఁడైనఁ జూచి । పరఁగ లేనగవుతో. 17. చేతఁజిక్కి. 18. కొనక । తిరిగి యూరును జేరి తెఱఁగొప్పఁ బాండు । తనయులకును వారి తండ్రిపాలొసఁగి । పెనుపొరు కూరిమి నెలయించుటొప్పు । ఈమాటు (ము. ప్ర.). 19. మచ్చరము నేటి కేమిటి కనిన.

ఇతరసైన్యంబులు నెలమితోఁ [1]దెలిసి । హితవాదియగు భీష్ము నెలమితోఁ బొగడి
రారాజు[2]నకుఁ గొంత రక్షణమై తారు । భేరుల రొదమాన్చి [3]భీకరమార్గమున
బెదరుచుఁ దమయూరి పెనుత్రోవఁబట్టి । కదలిన[4]యెడ, నార్చి గాండీవధరుఁడు
గుణనాదములు శంఖ[5]ఘోరనాదములుఁ । బ్రణుతించు దివ్యుల భాషణంబులును
భూనభోవీథిఁ గప్పఁగ నంటఁదఱిమి । 'సేనకుఁ బోయివచ్చెద' నని చెప్పి,
బెడఁగైన గొడుగులు బిరుదు టెక్కెములు । [6]నడియాలములు మట్టు లవనిపై పించి,
సరసుఁడై గురు కృపాచార్య భీష్ములకుఁ । బరఁగ నమస్కారబాణంబులేసి,
యొక్క మిట్టకోల నయ్యుగ్రరగ కేతనుని । ముకుట[7]రత్నంబులు మహిఁడొల్లనేసి,
వారి వీడ్కొనిన భావము నిర్వహించి । ధీరుఁడై నిలిచినఁ, దెరలిసైన్యములు
'ఇటు వేగ పద' మని హెచ్చరింపుచును । 'భటులు రారే' రని పతికిఁ జెప్పుచును
[8]జోళులు వెసనూడ్చి చులకనై చనుచు । [9]నూళులఁ జొరఁబాఱి యుదకమానుచును
హయకులు [10]నుష్ణించెనని డిగ్గి చనుచు । 'రయమున రాదు వారణమేల' యనుచుఁ
గురుసేన పోయినఁ, గుంతినందనుఁడు । పరితోషమున మత్స్యపతిసూనుఁజూచి :

అర్జునుఁ డుత్తరునితోఁ బురమునకు మరలుట

"మనకు గోవులువచ్చె ; మనము గెల్చితిమి ; । మనచేత రారాజు మదము[11]గోల్పడియె ;
రయమొప్ప దొరలు చీరలు దోఁపువడిరి ; । భయముతో నైచిరి పడగ లన్నియును ;
[12]మచ్చరం బిఁక నేల ! మరలింపు తేరు ; । వచ్చియుఁ దడవయ్యె వాహంబులలసె ;
నీ తల్లి ప్రజలెల్ల నీరాక కెదురు । చూతురు [13]శంకింపఁ జూతు రింతకును
నడపింపు." మనుటయు నరనాథసుతుఁడు । తడయక పాండునందను తేరుద్రిప్పి
నలువుమీఱఁగ మత్స్యనగరమార్గమున । నలయక వచ్చుచో, నమరేంద్రసుతుఁడు
ఉత్తరాయనముననుండి భాస్కరుఁడు । క్రొత్తగా యామ్యదిక్కున కేఁగునట్లు
మీఱి యేతెంచుచు మొఱయు మార్గమునఁ । బాఱనోపక పోవు భటుల నీక్షించి
'వెఱవకుఁడోరి ! మీవిభుఁ గూడిపొండు ; । నెఱి మిమ్ముఁజంప ; మన్నించితి' ననుచు

1. ద్రెళ్ల । కితవాడెనని. 2. నొకకొంత రక్షించుకొనుచు. 3. భీరంబు లెడలి. 4. ఁజెడ. 5. కోలాహలమున. 6. నడియాలములనెల్ల నవనిపైఁగూల్చి. 7. రత్నాంశువు. 8. బెల్లుబ్బి దప్పిచే జెగడొంది నడచి. 9. యూళ్లలోఁజొరఁబడి. 10. మట్టించె. 11. పోనాడె. 12. మచ్చరింపఁగ. 13. శోకింప.

నభయహస్తంబిచ్చి యాసేనచేత । శుభమైన దీవెనల్ [1]సొరిదిఁ బొందుచును
ఒకకొంత దవ్వేఁగి యుత్తరుఁ బలికె: । "ప్రకటింపవలదు భూపతితోడ నన్ను ;
కురుసేన గెల్చిన గురుశక్తియెల్లఁ । గరమొప్ప నీశక్తిగాఁ బ్రతిష్ఠింపు;
తనరూపు నెన్నఁడు ధర్మనందనుఁడు । మనుజుల కెఱిఁగించు మనుజేంద్రతనయ,
మాకు నప్పుడుగాని మా [2]త్రొంటివిధముఁ । గైకొని వర్తింపఁగాదు ; కావునను
రథికుండ వీవు సారథి యే నటంచుఁ । బృథివీశునకుఁ దెల్పు ప్రియముతో." ననిన
భావించి లజ్జించి పలికె నుత్తరుఁడు : । "భూవిభుఁ డెఱుఁగఁడె బొంకినమాట?
వెసఁ గౌరవుల నేను విదళింపలేమి । వసుధేశుఁ డేల యెవ్వరు నెఱుఁగుదురు ;
మించిన నణఁగునే మార్తాండరుచులు? । నించిన నీలాపు నెఱి దాఁపనేర ;
నీ యనుమతిలేక నీ ప్రసంగంబు । నేయ నేఁ బతితోడఁ జిరకీర్తిహార!
మీవాఁడ మీయాజ్ఞ మీఱలే." ననఁగ । నా వాసవాత్మజుం డట జమ్మిఁజేరి,
యొనర గాండీవాది యుద్ధసాధనము । లనువుగాఁ దొల్లిటియట్ల కట్టించి,
కపికేతనంబు శంఖము కిరీటంబు । విపులముల్ మఱికొన్ని వేల్పులిచ్చినవి
వీక్షించి మ్రొక్కి వేర్వేఱ వీడ్కొలిపి । యక్షీణరథముపై [3]హరికేతువెత్తి
యత్తఱిఁ దొంటి శస్త్రాస్త్రంబు లిచ్చి । యుత్తరు రథికుఁగా నొనరించి తాను
సారథియై నపుంసకరేఖఁ దాల్చి । ధీరుఁడై నొగలెక్కి తేరుదోలుచును
అరుదెంచునంత, నొయ్యనఁ గొల్వు విరిసి । సురరాజు మునులతో సురలతోఁ గూడి
నరునిఁ గీర్తించుచు నరుని మెచ్చుచును । 'నరుఁడు నారాయణునకు [4]నుద్ది' యనుచు
నది ప్రసంగంబుగా నానందమంది । త్రిదివంబునకుఁ బోయి [5]తిరమొప్ప నుండె.
అప్పు డుత్తరుఁ జూచి యాక్రీడి పలికె : । "చెప్పి పంపుము నీదు సేమంబు పురికి
గోపాలకులు వీరె కొలిచియున్నారు । నీపంపు సేయఁ బూనినవార." లనిన
రాజనందనుఁడు వారలఁ జేరఁబిలిచి । యోజించి [6]పంపె మహోత్సవంబునకు.
అంతకుమున్నె మత్స్యాధీశుఁ డచటఁ । గౌంతేయులును దానుఁ గదనంబు గెలిచి
మెండైనచీరలు మెఱుఁగారు మణులు । దండనాయకులకుఁ దగఁ గట్టనిచ్చి
విభవదేవేంద్రుఁడై వెస మత్స్యపురము । శుభముహూర్తంబునఁ జొత్తెంచునపుడు

---

1. సొబగు పెంపొంది. 2. తోడి. 3. హరిణపతాక । యత్తి తొల్లిటియట్ల యస్త్రంబు లునిచి । యుత్తరు. 4. నాత్మ. 5. తెఱఁగొప్ప. 6. పలికె నయ్యుత్సాహమునకు.

చెలఁగి పుణ్యస్త్రీలు సేసలు చల్ల । నలమి విప్రులు పుణ్యు లాశీర్వదింప
వందిమాగధకోటి వరుసఁ [1]గీర్తింప । మందిరద్వారంబు మఱి చేరి నిల్చి
‘యలసి వచ్చితి’ రని యాసేన నంపి । యెలమిఁ బాండవులును హితులు నేతేర
హరిమధ్యలును గొల్వ నంతఃపురమున । కరుదెంచి రత్నసింహాసనంబునను
సుఖలీలఁగూర్చుండి సుముఖుఁడై పద్మ । ముఖిఁ జూచి మోహంబు మొనయ నిట్లనియె :

## ఉత్తరుఁడు కురుసైన్యముపైఁ బోవుట విని విరటుఁడు చింతించుట

‘ఉత్తరుఁ డెచ్చోట నున్నవాఁ’ డనిన । మత్తకోకిలవాణి మనుజేంద్రుఁ జూచి :
“వినవయ్య తెలిపెద విరటభూపాల ! । మనమీఁదఁ గురురాజు మచ్చరంబెత్తి
తానును గురుఁడు మందాకినీసుతుఁడు । భానుజ కృపులు సౌబల ద్రోణసుతులు
[2]మఱియును జతురంగ మహితసైన్యములు । పఱతెంచి మనయూరిపసులఁ బట్టుటయు
నగధీరుఁడై బృహన్నల తేరుగడపఁ । దగఁ గూయివోయె నుత్తరకుమారుండు.”
అనిన గంపించి మత్స్యాధీశ్వరుండు । తన మంత్రివరుల నందఱఁ జూచి యనియె :
“పసులఁ బట్టుట విని పసిబిడ్డగానఁ । బూనఁగ మీఁదెఱుఁగకపోయె నుత్తరుఁడు ;
[3]ఎలమితోఁ దనకుఁ దోడెవ్వరున్నారు ? । కలఁగిన దానెట్లు ! కౌరవులెట్లు !
తప్పెడు గతియెల్లఁ దప్పెఁ గార్యంబు ; । చెప్పెద వినుఁడింక సేన రప్పించి
యాబిడ్డనికి సహాయము సేయవలయు ; । మీబలంబులు మీరు మెఱసిపొం.” డనినఁ
గంకుఁ డిట్లనియె భూకాంతు నీక్షించి : । “శంక నీకేల సుశర్మ గెల్చియును ?
వాఁ డోడెఁ గాన నవ్వలను రారాజు । నేఁ డోడిపోవుట నిర్ణయించితిమి.
అదియునుగాక, బృహన్నల నేఁడు । కదనంబునకుఁ దోడుగాఁ బోయెఁ గానఁ
గురుసేన గెల్చుట కొనియాడనేల ? । సురసేననైన నీసుతుఁడు నిర్జించు.”
అని[4]చెప్ప మఱియు భీతాత్ముఁడై నృపుఁడు । తనబాంధవులఁజూచి తగుసంభ్రమమున :
‘ఏమిసేయుదు నింక ? నెల్లసైన్యములు । భీమయుద్ధముచేసి పెద్ద నొచ్చినవి ;

---

1. నుతింప. 2. నెఱయు సైన్యముతోడ నెఱబీర మొప్పఁ.
3. ఇతఁడెంత కురువీరులెంత మీరకట । హితమాడ కాతని నిట్లు పుచ్చితిరి । తప్పెఁ గార్యము గానఁ దగుసేనఁగూర్చి । యప్పాపనికి సాయ మనువొందఁజేయ । మీబలంబులు మీరు మెఱసిపోవలయు । నా బాలుఁ గొనితెచ్చి ననుఁ బ్రోవుఁ డనినఁ । గంకుఁ డిట్లనియె.
4. తెల్ప.

పోటులు దాఁకక పోడవై నవారిఁ । బాటించి రిపులపైఁ బంపెదఁగాక.
మునుపు రాలేనైతి! ముద్దుపాపనికి । ననిలోన నేచందమయ్యెనో నేఁడు ?
ఎఱిఁగితి నని వచ్చి యింతలో నొకఁడు । చిఱుతపాపనిమాట చెప్పఁడే నాకు ?"
[1]అని యని చింతింప నంత నుత్తరుఁడు - । పనిచిన గోపాలబాలు రేతెంచి
నరపతిఁగాంచి: "భూనాథ, నీకొడుకు । [2]గురుబలాధికమైన కురుసేన గెలిచి
యాలమూఁకలు ద్రిప్పి యాలంబులోనఁ । గాల ముల్ గాడక గౌరీశుకృపను
సారథియును దానుఁ జనుదెంచుచుండి । వారక యీ మేలువార్త చెప్పుటకు
మున్నాడి[3]పొండని మొగి [4]మమ్ముఁబనుపఁ । జెన్నార మేము వచ్చిన రాక." యనిన
జననాథుఁ డానందజలధిలో మునిఁగి । తనువునఁ బులక లెంతయు విస్తరిల్లఁ
బటలమై పొడమిన బాష్పబిందువులు । పటునఖంబుల నూడ్చి పాఱఁ [5]జిమ్ముచును
సకలమంత్రులఁజూచి చాల గర్వించి । యకలంకచిత్తుఁడై యర్థి నిట్లనియె:
"ఇదిగాక సంతోష! మిదిగాక తేజ! । మిదిగాక [6]పుత్త్రుఁ డొల్లైత్తిన ఫలము!
అర్జునుండన మించి యఖిలకౌరవుల । నిర్జించె [7] నావంశ నిస్తారకుండు ;
కరి[8]రాజుమీఁద జేగంట యెత్తించి । పురిలోనఁ జాటఁబంపుఁడు వాని జయము ;
వేదపారగులైన విప్రపుంగవుల । వాదిత్రములతోడ వారువంబులను[9]
బోదివి కైచేసిన పుణ్యభామినుల । నెదురుగాఁ బుచ్చుఁడు హితులెల్లఁ బొండు ;
మకరతోరణములు మణితోరణములు । ముకురతోరణములు మొగినెత్తికొనుచు
నతివలుఁ దానుఁ బుష్పాక్షతల్ గొనుచు । హితరీతి నుత్తర నెదురు పొమ్మనుఁడు."
అని మంత్రులకుఁ జెప్పి యాగోపకులకు । ధనధాన్య మణులిచ్చి ధర్మజుఁజూచి:
'[10]యొత్తినవేడ్కతో [11]నొగి నొక్కపలక । నెత్తమాడుద' మన నృపుఁజూచి యతఁడు :
'నీవు నుపాళించి నిన్ను నీవెఱుఁగ । వీవేళ నీతోడ నేనాడ' ననిన
నించుక నగుచు ధాత్రీశుఁ డచ్చోటఁ । బాంచాలిచేత నప్పలకఁ దెప్పించి
సారెలు దిగిచి యీసారి రమ్మనినఁ । [12]జేరఁగఁ జని సుఖాసీనుఁడై యతఁడు :

1. అని తలపోయు నయ్యవసరంబునను । బనివడి యొక్క గోపాలుఁ డేతెంచి । నరపతి.
2. కురుధరాధిపుఁడైన కురురాజు గెలిచి. 3. పొమ్మని. 4. నన్ను. 5. జల్లు. 6. సత్పుత్త్రు నిలఁ గాంచు. 7. మద్వంశ. 8. రాజములమీఁద గంట. 9. వరరథప్రతతుల భద్రద్విపముల । గురుశౌర్య రంజితకోటిసైనికులఁ । బోదివి. 10. యెత్తిన. 11. నృపుఁడొక్క. 12. నారసి ధర్మజుఁ డవనీశుతోడ.

"ఈ జూదమునఁ గాదె యెలమి ధర్మజుఁడు । రాజచిహ్నముతోడి రాజ్యంబునోడి
యనుజులనోడి పుణ్యాంగననోడి । వనము [1]గొల్వఁగఁబోయె వలదు జూదంబు."
[2]అనియు సారెలనంది యాడంగఁ దొడఁగె. । అనువైనచోటఁ దా మర్థి నిద్దఱును
చవ్వంచ దుగయును సతయు దుచ్చౌక । తివ్వంచ భార యిత్తిగయు వేఁడుచును

## విరటుఁడు సారెలతో ధర్మజు నేయుట

ఆడఁగ విరటుఁ డిట్లనుఁ: "గంకుభట్ట! । కూడిన కురుసేన ఘోరాజిఁ దాఁకి
పోఁడి గాదనక యల్పులె వీరలనక । తోడెవ్వరనక కైదువు దాఁకుననక
తలమీఱి గెలిచె నింతటివాఁడు గలఁడె? । కులముద్ధరించిన కొడుకు నాకొడుకు
ధాత్రిలో నిదియుఁ జిత్రముగాదె!" యనిన । ధాత్రీశ, వినుమని ధర్మ[3]రాజనియె:
"కౌరవులెల్ల నిక్కడ వచ్చిరనఁగ । బోరునఁ బోయి మీ భూమింజయుండు
వారల బాహుగర్వము[4]నకు నోర్చి । శూరుఁడై గెల్చివచ్చుట నిక్కమైన
నితనిఁ బోలిన వీరు లెవ్వరుగలరు? । హితబుద్ధి వీని మీ రెఱుఁగరే?" యనిన
నుర్వీశుఁ డామాట నోర్వంగలేక । గర్వించి పాండవాగ్రజువంకఁ జూచి:
"ఎలమి[5]తో నట్లైన నీవు మానుతుని । [6]గెలువలేఁడనుచుఁ బల్కిన జాడగాదె!
చాలు నూరకయుండు సన్యాసివగుటఁ । జాలించి విడిచితిఁ [7]జలముఁ గోపంబు.
తగఁ బెద్దవయ్యుఁ బెద్దలజాడనుండ । [8]కగునాకో నీవిటు లాడుచుండఁగను?"
అని ముట్టఁగోపించి యా నెత్తపలక । నినదంబు ఘనముగా నృపుఁ డాడుటయును,
అది లెక్కసేయక యమతనూభవుఁడు । మదిలోన గర్వించి మఱియు నిట్లనియె:
"నరనాథ, మన బృహన్నల తేరిమీఁద । నరివీర [9]దర్పాపహారియై నిలిచి
భుజబలంబచటఁ జూపుటఁ జేసికాదె । నిజముగా గెలిచెను నీకుమారుండు!
అతఁడు తోడై యున్న నమరేంద్రునైనఁ । గృతకృత్యుఁడై తాఁకి గెలుచు నుత్తరుఁడు;[10]
బిసరుహాక్షునకైన బెదరఁ డుత్తరుఁడు; । [11]అసమసాహసకేళి నందఱ గెలుచు;
[12]అటుగాన నీకీర్తి కతఁ డెవ్వఁ." డనినఁ । గటము లుప్పొంగ నుత్కటకోపుఁ డగుచు

1. బాల్పడెఁ గాన. 2. అనుచు సారెలఁ దిగిచి యదలించి తమకు. 3. నందనుఁడు. 4. కు భీతిలక. 5. నిట్లను పెల్ల. 6. గెలుపు లేదనెడు చక్కియపల్కగాదె. 7. సకల. 8. రగువారి నేమైన నాడుచుండుదురు. 9. శౌర్యా; వరుఁ డప. 10. అతులవీరులకైన నణఁగఁ డుత్తరుఁడు. 11. అసమఁ డాతఁడు గల్గ నాలంబులోన. 12. అటులౌట జయమొందు టబ్రంబె.

నరనాథుఁ డా ధర్మనందనుఁ జూచి: । "ధరలోనఁ గ్రొత్తచందములు చెప్పెదవు;
సారథు లేయూర సమరంబుగెలిచి । శూరులై యున్నారు చోద్యంబుగాఁగ?
ఏఁగాఁగ నోర్చితి నిన్నిమాటలకు । లోఁగక యింకఁ బల్కుటగాదు విడువు."
అనుటయుఁ జలముతో నతఁడు వెండియును । జననాథుఁజూచి హాస్యము దోఁపఁబలికె:
"వెన బృహన్నల నేఁడు వీరాహవమున । రసికు మీసుతుని సారథిఁజేసి తాను
ధనువు ధరించి యుద్ధముచేసెఁ గాని । యొనర సాధికృత్య మొనరింపఁ డతఁడు;
కడపట నిట్లు కాఁగలదు కార్యంబు; । తడయక నీవింక ధరణీశలేశ!
నగరంబులో బృహన్నల గెల్పు చాటఁ । దగువారిఁ బంపుము తగవొప్ప." ననిపఁ
జండ[1]కోపావేశ జాల్మఁడై మండి । దండమెత్తిన దండధరుని చందమునఁ
దనచేతిసారె నుద్ధతిఁబూని ధర్మ । తనయుని నేయఁ గ్రోధము లేక యతఁడు
తొడరి యజాతశత్రుఁడు గాన నవ్వి । తడయక ద్రుపదనందనఁ[2] జూచుటయును
అరుదారఁ జనుదెంచి యావ్రేటుగంటిఁ । దొరఁగు నెత్తురుఁజూచి ద్రుపదతనూజ
యది [3]పడకుండఁ బయ్యదకొంగునందు । మృదువుగాఁదుడిచి యమ్మొలఁత వెండియును
బసిఁడిబిందియ[4]యందు భాసిల్లు నీటఁ । బస[5]మీఱఁ దన పాణిపద్మంబు దడిపి
తుడుచుచో 'నీవేల దుడిచెద' వనినఁ । బుడమిఱేనికిని నా పూఁబోఁడి యనియె:
"ఇతఁ డుత్తమాచార్యుఁ డితఁ[6]డు సభ్యుఁడును; । ఇతనినెత్తురు ధాత్రి నెన్ని బిందువులు
రాలెడి నన్నివర్షములు నీభూమిఁ । జాల దుర్భిక్షదోషము [7]గల్గుఁ గాన
విను నీకు హితవుగావించితి." ననుచు । నొనరంగఁ [8]దుడుచుచునుండె నమ్ముదిత.
అంత నక్కడఁ బౌరు లా యుత్తరునకు । నెంతయు వేడ్కతో నెదురుగాఁ బోయి
శుభతూర్యములు కర్ణసుఖముగా మ్రోయ । శుభ[9]వాక్యములతోడ సొంపగ్గలించి
నరనాథసుతుమీఁద నరుమీఁద నపుడు । సరసాక్షతలు నిండఁ జల్లి దీవి[10]ప.

---

1. కోపాటోప. 2. కుఁ జూపుటయు. 3. యొల్లఁ దనదు. 4. చెంత. 5. నార. 6. ఁడస దృశుఁడు. 7. పొందు. 8. బాంచాలి యుండె నచ్చటను. 9. నాద.

10. చి । రావేళఁ జూపరు లల మారుగజమొ! । భావింప భావజు పటుశస్త్రమొక్కొ!
యసమయా మరుని మోహన విద్యయొక్కొ! । కుసుమాస్త్రుసతి చిల్క కొదమయా నొక్కొ!"
యని యాత్మ నబ్బురంబంది చూడఁగను । ఒనర బంగరుబొమ్మ యొప్పు గైకొనుచు
వేపురకన్యలు వెన్నాడికొలువఁ । దావచ్చి నగుచు నుత్తర యన్నమీఁద
విజయుమీఁదను గూర్మి వెలయంగ నంత । నిజకటాక్షప్రభల్ నింగినిండఁగను
మృగనాభితో (ముద్రిత ప్రతి).

గలసి వేవురుకన్యకలు గొల్వ వచ్చి । యెలమి నుత్తర మంచి హేమపుష్పములు
మృగనాభితోఁ గూడి మేలైన విరులు । నగరు మిశ్రములైన యాణిముత్తెములుఁ
గరపల్లవంబులఁ గరమర్థిఁబట్టి । [1]వరుస నగ్రజుమీఁద వడిఁ గ్రీడిమీఁదఁ
జల్లి మ్రొక్కిన నంత సకలబాంధవులు । నుల్లంబులింపార నుత్తరుఁజూచి
సాహసభుజసార [2]జయములగ్గింప । నోహటింపుచు విని యుత్తరుండనియె:
"కినిసి కౌరవులను గెలిచి వచ్చుటయు । మన పాఁడికుఱ్ఱులు మగిడి వచ్చుటయు
నాకును నీబృహన్నల గల్గఁబట్టి । చే[3]కూరెఁ గాని నాజీవా లవెంత?
[4]ఓలి సారథు [5]లెందునున్నారు [6]గాని । [7]యీలాగు సారథి నేఁజూచి యెఱుఁగ."
అని సూతనుతిదోఁప నర్జునిఁ బొగడి । ఘనమైన రాజమార్గముఁ [8]జొచ్చి వచ్చి
పతిమందిరముఁజేరఁ బణిహారి [9]పాఱి । యతఁడు వచ్చుటయెల్ల నధిపుతోఁ జెప్ప
రాజును 'రథికసారథుల నిచ్చటికి । రాజిల్లఁ దోడ్కొనిరమ్ము పో' మ్మనిన
నరిగెడు పణిహారి నాధర్మసూనుఁ । డరుదారఁ బిలిచి యొయ్యన వానితోడ:
"నీ యొల్కు[10]శోణిత మింకునందాఁక । నాయున్న యెడ బృహన్నలఁ [11]దేఁగవలదు;
పరికింప ననుభక్తిఁ బాటించుఁ గాన । విరటుఁ గోపించు నావ్రేటు చూచినను.
హితగతి నుత్తరు నిటఁ దెత్తుగాని । యతనిఁ దోడ్కొనిరాకు;" మని చెప్పి యనిపె.
నృపతియు 'నిదియేమి యేకాంత' మనక । విపుల హర్షావేశవివశుఁడై యుండె:
అత్తఱిఁ బణిహారి యాక్రీడి నిలిపి । యుత్తరుఁ దోడ్తెచ్చె నుర్వీశుకడకు.
అతఁడును సాష్టాంగ[12]మపుడు గావింప । సుతుని రాఁదిగిచి భాసురలీల నృపుఁడు
కౌఁగిటఁ జేర్చి గద్గదకంఠుఁడగుచు । మూఁగినవేడ్క [13]మోమున ముద్దువెట్టి
కన్నీట దోఁగి యేఁకట వాయఁజూచి । వెన్నుప్పళించి దీవించువో నతఁడు
నొక్కింత భీతితో నొగి ధర్మజునకు । మ్రొక్కుచు నతనిమోమున గంటిఁజూచి
'యిదియేమి?' యనిన ధాత్రీశుఁ డిట్లనియె: । "అది నీకుఁజెప్పెద నర్థితో వినుము
నేఁటి యుద్ధంబున నీగెల్పుగాఁగ । మాటలాడఁగఁ దాను మాటిమాటికిని

---

1. మురువైన గాజుల మెరపంబులలర. 2. జయరమాధార । బాహుదర్పోల్లాస వరకీర్తివాస । కురువీరులను దాఁకి కొమరొప్ప జయము । నరుదార నింకొరుఁ డందఁగఁ గలఁడె । నినుబోలు శూరుండు నెగడునే యిలను । అని పల్క నుత్తరుం డనువారఁ బలికె । కినిసి. 3. కూడెఁగాక. 4. ఒవర. 5. లుర్వి. 6. గాఁక. 7. తనరారు బలిమి నీతనిసాటి. 8. పట్టిచొచ్చి. 9. నృపున । కతఁడు. 10. నెత్తురు నిల్చు. 11. రాఁగ. 12. మవనిపై నిడిన. 13. తో ముద్రింపలేక.

'[1]దగఁ జేడిగెల్చె నుత్తరుఁడు గాఁ' డనినఁ । [2]దగిలి నెత్తపుసారె [3]తాఁకనేసితిని ;
ఇది స్వయంకృతదోష మిామాటని." కనిన । మదిలోన భీతుఁడై మనుజేంద్రసుతుఁడు :
"తగునయ్య కోపింప? తప్పుచేసితిరి ; । మగుడ నాడుదురయ్య మాన్య లేమనిన ?
ఆడుటగాక నోసడఁచిరా రతని ! । పాడిదప్పిన [4]రాజుఁ బాయదే లక్ష్మి ?
కావున వీరి నిక్కడ నె ప్రార్థింపుఁ । డే వెంట [5]నిటఁ బట్టు మిాపుణ్యమనను ;
కారణపురుషులు గారె వీ !" రనిన । ధారుణీనాథుండు తల్లడిల్లుచును
గంకుఁ బ్రార్థించినఁ, [6]కంకుండు నగుచు : । "శంకింపనేటికి జననాథతనయ ?
నాకుఁ గోపములేదు ; నరనాథు [7]నెడను । నేకల్మషములేదు ; హితకారిగాని.
పొడమె నూరక వాదు ప్రొద్దు[8]కీడునను । గుటిలమూలముగాదు కొనసాఁగ" దనుచు
మనుజేంద్రునకుఁ దాను మంచివాఁడగుట । ఘనత నుత్తరునకుఁ గాన్పించునంత,
నరుఁడు ప్రవేశించి నరనాథుఁ గనినఁ । గరమర్థి[9]తోడ సత్కారముల్ చేసి
తగుచోట నునిచి యుత్తరుపంకఁ జూచి । మొగమునఁ జిఱునవ్వు మొలవ [10]నిట్లనియె:
"ఉత్తర, నీవు లోకోత్తరప్రౌఢి । నొత్తిన కౌరవ[11]వ్యూహంబుఁ జొచ్చి
కృపునిఁ గైకొనక గాంగేయుఁ గైకొనక । నృపునిఁ గైకొనక కానీనుఁ గైకొనక
గురుతనూజాతుని గురునిఁ గైకొనక । వెరవొప్ప సామంత వితతిఁ గైకొనక
కదుపులు మరలించి కదనంబు గెల్చి । త్రిదశవీరులు మెచ్చఁ దిరిగి వచ్చితివి ;
ఒకపౌఁజు విరిగిన నొకపౌఁజు గదియు ; । నొకవీరుఁ డోడిన నొకవీరుఁ డడరు ;
ఓడిన బలమైన నొకతేరి వాని । [12]నోడింతు ననుఁగాని యొగిఁ దీసిపోదు ;
నృపునిసన్నిధిఁ గాన నిఖలసైన్యములుఁ । గపటంబులేక సంగ్రామంబు సేయు ;
ధృతరాష్ట్రసుతులన్న ధృతి నొక్కరొకరు । కుతలంబు గెలిచిన క్రొవ్వాడిమగలు !
దివ్యాస్త్రముల మించి దివ్యుల గెల్చి । భవ్యులై యున్న నేర్పరు లందులోన !
ఏరీతి మరలించితీవు గోగణము ? । కౌరవసేన నొక్కటను గెల్చితివి ?
రారాజు విరిగి [13]యూరక యెట్లుపోయె ? । నీరణస్థితి మాకు నెఱిఁగింపు." మనిన,

1. గవ. 2. గవలి. 3. గాఁడ. 4. వారి. 5. ఁబోగులరాదీపుణ్యమనను. 6. డిట్లనియె. 7. డైన । నేకిల్బిషియు గాఁడు. 8. కీడనఁగ । జడియనేల యటంచు శాంతంబుదోఁప । మనుజేంద్రునకు. 9. ప్రబలినసత్కారముల్. 10. భూవిభుఁడు. 11. యూథంబు. 12. నోడింతు మనుగాని యులు కత్తిపోదు. 13. యూరక.

## సమరప్రకార ముత్తరుఁడు విరటునకు వివరించి చెప్పుట

నుత్తరుం డిట్లను : "ఓ మహీనాథ! । చిత్తగింపవె యేను సేయ యుద్ధంబు ;
గోవులమరలింపఁ ; గురు[1] సేన నొంప ; । ఆవేళ నొక్కపుణ్యాత్ముఁ[2]డే తెంచి
తనమేను దేవేంద్రు తనువన నొప్పి । మఱిగోధనముఁ [3] ద్రిప్పి మడియించె రిపుల.
అటు విస్తరించెద నవనీశ, వినుము । చటులతరంబైన సంగ్రామవిధము.
కదనంబునకు నేను గర్వించి వెడలి । మదముతో నుత్తరముఖముగా నడచి
ధర సంచలింప నుత్కటధూళి ముంప । నరుగుచునున్న సైన్యముఁజూచి వెఱచి
యరదంబు డిగిపాఱ నతఁ డేఁగుదెంచి । తిరుగఁ దోడ్తెచ్చి యెత్తినభీతి మాన్చి
నన్ను సారథిఁజేసి నయమొప్పఁ దాను । [4]సన్నద్ధరథికుఁడై సైన్యంబుఁ గదిసి
యందు భూపతిఁ జూచి [5]యచట లేకున్న । ముందట మొనకునై మున్నాడిపోయి
మొదవుల [6]నన్నియు ముదముతోఁ ద్రిప్పి । కదియు సేనలనెల్ల గాసిల్లనేసి
సందడిఁబడక గోచయ మేఁగునంత । ముందటఁ జనుచున్న మొదటి కౌరవునిఁ
గనుఁగొని యనిసేయఁ గడఁగుచో బలము । జననాథుఁగూడి యచ్చలముతో నిల్వ
వారితోఁ బోరాడ వసుధేశ, వినుము । [7]ధీరుఁడాతనిమూర్తి దృష్టింప నరుదు !
ఆరీతి పోరాట నతనిబాణములఁ । దేరులు ధరఁగూలెఁ ద్రెవ్వెఁ బగ్గములు
హతులైరి సారథు లణఁగె రథ్యములు । గతిమయ్యెఁ గరులు [8]వక్కలువాఱె హరులు
మెదిసిరి భటులు భూమికిఁ వ్రాలె విండ్లు । చిదిసిరి సంగ్రామచింతతో దొరలు.
అంతఁ గర్ణుఁడు దాఁకి యనువెల్లఁ బొలిసి । పంతంబుచెడి పాఱెఁ బ్రజలెల్ల నవ్వ.
గురుఁడును దాఁకి నుగ్గులుగాఁగఁ బోరి । శరములు గాఁడి మూర్ఛను జెందిపోయె.
మఱియు నశ్వత్థామ మహితుఁడై తాఁకి । నెఱయ నెన్నటికి మూసిసి గాకపోయె.
[9]అతనిపై నాభీష్ముఁ డరదంబుతోలి । యతుల దివ్యాస్త్రంబు లందంద పఱప,

---

1. రాజు. 2. డు వచ్చి. 3. లు ద్రిమ్మరగెల్చె రిపుల । నది విస్తరించెద నవనీశ, వినుము । కదనంబు.
4. సన్నుత. 5. యతఁడు. 6. లచ్చటనున్న. 7. ధీరుఁడౌ నతనిమూర్తినిఁజూచి నరుఁడు । వైరులఁ బరిమార్చు పగిదిఁ జూపట్టె । నారీతి. 8. మైరి యరులు. . .వాసెఁ గరులు.
9. అప్పుడు గాంగేయుఁ డాలంబుచొచ్చి । నిప్పులు గన్నుల నెఱయంగ నడరి
వితత శౌర్యాటోప విభవంబు దోఁప । నతుల దివ్యాస్త్రంబు లందంద పఱపి
పోరాడియును వైరిభూరిబాణములఁ । బాఱి భీరమునూప వలఁతిగా కకటు
యురము బీటలువాఱ నొగిని మూర్ఛిల్లె । నరిది శౌర్యమునూపి యమ్మహాపురుషుఁ
డెదురైన వీరుల నిట్లు గెల్వఁగను । జెదరిన సైన్యంబుఁ జేరంగఁబిలిచి
తమ్ములఁ దాను.

నరదంబు పోనాడి హారులఁ జెండాడి । యురముచించిన డస్సి నొగిని మూర్ఛిల్లె
తమ్ములుఁ దాను భూతలనాథుఁ డంత । నిమ్ముల నతనితో నెదిరి పోరాడ
నురములు వ్రక్కలై యూరులు పగిలి । కరములు తెగిపోవ గళములు గ్రుచ్చి
ఫాలసీమలు [1]నొచ్చి బరు లుచ్చి[2]పోయి । కాలు [3]చేయాడక గాసిల్లు నంతఁ
గరి నెక్కవచ్చి వికీర్ణుఁ డడ్డంబు । చొరఁబాఱి [4]తనలావు చూపుచో, నతఁడు
వాని యేనుఁగుఁజంపి వానిఁ బోఁదోలి । మాన మేశ్వరుమీఁద మఱియు నేయుటయుఁ,
బలి [5]నచ్చెనని సేన భగ్నమైపాఱెఁ ; । బలియును బాఱె భూభాగంబు లగల.
ఆవీరుఁడును [6]వారి నటఁబోవ [7]వెలిచి । తావచ్చె." ననిన భూతలనాథుఁ డలరి :
"ఇట్టిపుణ్యాత్ముఁ డెయ్యెడనుండుఁ జెపుమ ; । నెట్టనఁ దోడ్తేర నేర్వలేవైతి.
ఆతనిఁ బూజింతు నర్ఘ్యపాద్యముల ; । నాతని చరణంబు లర్థితోఁ గొలుతు ;
అన్నన్న యతఁడు రాఁడయ్యె నిచ్చటికి! । నెన్నఁడు వీక్షింతు నే! " నన్న నతఁడు
"తావచ్చి వచ్చి యంతర్ధానుఁ డయ్యెఁ ; । నేవేళ వచ్చునో! యిట రాకపోఁడు.
దేవతాంశమువాఁడు దివ్యాస్త్రవిదుఁడు । భూవర, మనకు నాపురుషుండు వచ్చి
చెలఁగి సంభాషణ సేయుచున్నాఁడు ; । [9]నెలకొని మనల మన్నింపనున్నాఁడు ;
మనవంశమునవారి మనుపనున్నాఁడు । మనభాగ్యదేవత మఱియు వేయేల ? "
అనిచెప్పి భూపాలు నాశ్చర్యపఱుప । ననుజన్ముఁ జూడక యపుడు ధర్మజుఁడు
దనవ్రేటుగంటిపైఁ దనశాటివైచి । కినియక యుండెఁ జెక్కటఁ జేయిఁ[10]జేర్చి.
పఱియంత నిట్టి దోర్బలకళాలోలుఁ । డిశఁడె [11]షాముని నిర్ణయింపనేరమిని
'పేడి, [12]షా' మ్మని పల్కి బీభత్సు ననిచి । వేడుకఁ దనపుత్త్రు వీడ్కొల్పి[13] మఱియుఁ
గడుమంచిమణులిచ్చి కంకు వీడ్కొలిపి । యడరి మంత్రులనెల్ల ననిచి తానపుడు
క్రన్ననఁ బోయి కేకయరాజపుత్రి । యున్న మందిర[14]భూమి నుదకంబులాడి
భోజన లేపన పుష్పభోగముల । నాఁజేసిన దప్పి నణఁచి నిద్రించె.
అంత నుత్తరుఁగూడి యతనిమాటలకు । సంతసిల్లుచు నాట్యశాలకై నరుఁడు
వచ్చి యచ్చటను భూపతిసూతి ననిపి । క్రచ్చర నుత్తరాంగనఁ జేరఁబిలిచి

---

1. నొంచి. 2. పాఱి. 3. చెయ్యాడక. 4. తూపులసోనలఁ గురిసి । తనలావు చూపుచోఁ దడఁబాటులేక । యనువుగా నొకకోల నమ్మహాత్ముండు । వాని యేనుఁగు. 5. నొచ్చె. 6. బాఱి యతనిఁ బోఁదఱిమి. 7. నిలిపి. 8. షణ. 9. నెలవుతో నాయన నీతిపాలకుఁడు. 10. మోపి. 11. శ్వా యని. 12. రమ్మని పిల్చి. 13. యంత. 14. సీమ.

బొమ్మపొత్తికలిచ్చి పొసఁగ [1]మన్నించి । సమ్మతిఁ దననివాసముఁ జేరియుండె.
అప్పుడు దిననాథుఁ డస్తమించుటయు । నప్పాండుతనయులు నబ్జాక్షి తారు
యమసూనుఁడున్న [2]గేహమునందుఁగూడి । విమతులోడినవార్త విన్నవారగుచుఁ
గడు సంతసిల్లి యగ్రజువంకఁ జూచి । వడముడితోడ వివ్వచ్చుఁ డిట్లనియె:

విరటుఁడు తన యన్నను సారెతోఁ గొట్టుట విని యర్జునుఁడు మండిపడుట

"[3] ఇప్పుడేమిటికిఁ గా నితఁడు నావంకఁ । దప్పక చూడఁ డేతప్పు చేసితినో!
[4]సమయంబు దప్పెనో, చలము రెట్టింప । విమతులఁ [5] దోలిన విధమేమి తప్పొ?
ఏవెంట వెదకిన నీకారణంబు । భావింపనేర నేర్పుఱుప వే!" యనిన
ననుజన్ము నీక్షించి యమసూతి పలికె: । "విను మేదియునులేదు విరటుండు నేఁడు
తనకుమారుండు యుద్ధము గెల్చెననుచుఁ । గొనియాడుటకు నిన్నుఁ గొనియాడ నేను
మన బృహన్నల గెల్చె మఱి గెల్చువారు । మఁవీట లేరన్న మదిలోన[6]మండి
'యుత్తరుజయ[7]వార్త నోర్వలే' వనుచు । మొత్తె నెత్తుపుసారె మోము దాఁకంగ.
ఆపోటుగంటి నీకావేళఁ జూప । నోపక చీర మాటొనరించి నేను
నుండితి." నని గంటి నొయ్యనఁ జూప । గాండీవి లయకాలకాలుఁడై [8]పలికె:
"వినుము గర్వించిన విరటు మర్దించి । మనము చేకొందము మత్స్యరాజ్యంబు ;
[9] తనరార నేమిటఁ దప్పె నుప్పరికి । యినుమడించుట యమ్మె నితనికోపంబు.
చెనఁటియై మిమ్ముఁ వేయఁ జేతులెట్లాడె? । పనుపుఁడేఁ గెద." నన్నఁ బలికె వాయుజుఁడు:
"నీదాఁక నేటికి నెమ్మి నేనేఁగి । యీ దుష్టమతిఁగూల్చి యతనిచుట్టములఁ
బాల మొక యెముకగాఁ బోరాడి చంపి । కలహంబు [10]లేని యీాకనలు పోవిడుతుఁ
బోయెద." నని ధర్మపుత్త్రుఁ జూచుటయు । నాయుత్తముఁడు వారి నపుడు వారించి:
"అక్కట మీర లిట్లననేల? మనల । నిక్కపుహూవులు నృపుఁ డేమియెఱుఁగు?
[11]ఎఱిఁగింత మెఱిఁగియు నిట్టివాఁడైనఁ । [12]దరువాత తనవిధిఁ దానె పోయెడిని;
వానిరాజ్యంబున వసియించి మనము । నానాసుఖంబుల నడచుచుండితిమి ;
కడపట నొకతప్పు [18]గాంచిననేమి? । యుడుగుఁ డాగ్రహ." మన్న నుడిగిరందఱును.

---

1. వీడ్కోలిపి. 2. గృహమ్మందు. 3. ఇప్పుడేటికి భీతి. 4. సమయ ముల్లంఘింప చల ముగ్గలింప. 5. మన్నింప వింతలు దప్పు. 6. క్రమంది. 7. మాడ. 8. మండి. 9. తనుఁ దా నెఱుంగక తానెంత చేసె । అనుమానమేల వీఁ డధముండుగాఁడె. 10. లేని యీాకనలు పోవిడుతు. 11. ఎఱిఁగి యెఱింగి తానెంతవాఁడైన. 12. తరువాత నిట్టిదితలపోయఁదగును. 12. గాచిననేమి; గాచిపోవిడుతు.

## పాండవులు నిజరూపములతో రాజసభకుఁ బోవుట

ఎలమిఁ బాండవు లిట్లు హితభాషణములఁ । దలకొన్న వేడ్క నెంతయుఁ బ్రొద్దుపుచ్చి
'యెల్లి వత్తుముగాక యీరాజసభకుఁ । దొల్లిటిరూపులతో' నంచుఁ బలికి
యారాత్రిపుచ్చి పూర్వాద్రిపై నినుఁడు । తేఱ[1] ద్రిప్పకమున్నె తీర్థంబులాడి
కాలోచితములైన కర్మంబులెల్ల । నాలోచి[2] తోద్యోగులై సిర్వహించి
ధవళవస్త్రంబులు ధవళగంధములు । ధవళమాల్యంబులుఁ దగురీతిఁ దాల్చి
యేడుదీవులుఁ నేలు నృపులగీతిగను । జూడనొప్పెడుభాతి సుభగ వేషమున
ధరణీశు నగరి నాస్థానంబుఁ జేరి । పరఁగంగ బసిఁడికంబముల మధ్యమునఁ
బొలుపుమీఱినయట్టి పుష్పమాలికల । నొలికెడు పూఁదేనె నొక్కింత దోఁగి
యీపాటిపోడ వని యెఱుఁగంగరాక । దీపితరత్న దీధితిచేత నొప్పి
నలు[3]వైన సింహాసనముఁ[4] జేరి యందుఁ । దలకొని కూర్చుండె ధర్మనందనుఁడు.
తమ్ములు నతనిపాదములు సేవించి । నెమ్మి నుండిరి రత్నచితపీఠముల.
ఆలోన విరటుఁ డింపారఁ గైసేసి । యోలి మంత్రులుఁ దాను నుత్తరుఁగూడి
బోరున నాస్థానభూమి కేతెంచి । యారూఢగతిఁ బాండవాగ్రజుఁ జూచి :
"[5]ఇదియేమి వివరింపు[6]మీ కంకుభట్ట! । మదిలోన గర్వించి మమ్ముఁ గైకొనక
తగవేది మాతోడ [7]దట్టికి దరికి । జగడించితివి నిన్న సౌజన్యమేది;
నెఱయ సంతటఁబోక నేఁడన్న [8]నేఁడు । మెఱ[9]య నాగద్దియ[10]మీఁద నెక్కితివి!
తలపోయ నిది నీకు ధర్మమే?" యనిన । వెలయ నించుక నవ్వి విజయుఁ డిట్లనియె :
"ఇంక నెక్కడి కంకుఁ డితఁడు ధర్మజుఁడు । బొంకాడ నేరని పుణ్యుఁ డీరాజు;
అవని నీతఁడుగాచు; నవనీశు లితని । యవసరంబులు [11]గాతు రతిభక్తితోడ.
ధరణి నీతఁడు [12]మోఁచు ధరణీధరములు । పరఁగంగ నీతని పగవారి మోఁచు;
లలిఁ జక్రవాళశైలమ్ములో [13]నిండి । యిలఁ [14]బూర్ణశశిఁబోలు నీరాజుకీర్తి;
రాజుల ధనమెల్ల గాజసూయమునఁ । బూజలు[15]గొని యిచ్చెఁ బొసఁగ విప్రులకు;
[16]ఇతని బాహాశక్తి కింద్రప్రస్థంబు । ధృతిఁ జేరఁ జెనకంగ దృష్టింపరాదు.

---

1. చూపక. 2. త.ధ్యానులై. 3. వొప్ప. 4. జూచి. 5. అది. 6. మా. 7. దట్టించి పలికి. 8. నిట్లు. 9. సి. 10. మీఁదెక్కితిపుడు. 11. చూతు. 12. ప్రోచు. 13. నుండి. 14. నిండు. 15. గొనియిచ్చెఁ బొసఁగ విప్రులకు. 16. ఇతనికై రరిగాపులెల్ల భూవిభులు । నితని బాహాశక్తి కాదు రెందు లేదు.

ఇతని బాహాశక్తి కెదురులేదెందు; । ఇతఁడుండఁ జెల్లు నయ్యింద్రాసనంబు
ధృతి నిట్టి కుఱుచగద్దియ [1]నుండఁ దగఁడె?" । ... ... ... ...
అనుటయు విని విస్మయమును సంశయముఁ । దనఁ జుట్టుకొనఁగ భూతలనాథుఁ డ[2]లరి:
"ఇతఁడు ధర్మజుఁడైన నింక వాయుజుఁడు । హతవైరి క్రీడియు నా మాద్రిసుతులు
నెచ్చటనున్న వా? లేది పాంచాలి? । యచ్చుగా వివరింపు." మనిన [3]నింద్రజుఁడు:
"వలల నామముఁ దాల్చి వంటకై నిన్నుఁ । గొలిచి కేసరి మల్ల కుంజరంబులను
బొనర [4]మేడములోనఁ బోరాడ గెలిచెఁ; । బెనుపొంద నతఁడెపో భీమసేనుండు.
మనుజేంద్ర, మఱియు దామగ్రంథి [5]యనఁగ । నినుఁగొల్చి నీయశ్వనికరంబు నరసి
ప్రకట బాహాశక్తిపరుఁడైన [6]యతఁడు । నకులుండు మాద్రిమన్ననఁ గన్న వాఁడు.
తెఱఁగొప్ప మఱియుఁ దంత్రీపాలుఁ డనఁగ । మెఱసి నీగోవుల మేపఁ[7]బుచ్చుచును
గొల్లవాఁడై నిన్నుఁ గొలిచి[8]నాతండు । అల్లవో సహదేవుఁడని నిశ్చయింపు.
జననాథ, వెండియు సైరంధ్రి [9]యగుచు । నను[10]వొప్ప మాలిని యనుపేరు దాల్చి
కేకయపుత్రి మిక్కిలి గారవింపఁ । బ్రాకటగతినున్న భామ పాంచాలి.
పాంచాలికై కాదె! పవమానసుతుఁడు । ద్రుంచె నక్కీచకుఁ దోడికీచకుల."
అని[11]చెప్ప నంతలో ననిలసంభవుఁడు । జనలోకపతికి వాసవపుత్త్రుఁజూపి:
"నరనాథ, యీబృహన్నల [12]దాని నరుఁడు! । పొరసె నుర్వశిశాపమునఁ బేడితనము;
తగ నృత్తగీత వాద్యముల నుత్తరకు । మిగులంగ నేర్పిన మేటి దా నితఁడు;
ఖాండవంబేర్చి యాఖండలు గెలిచి । ఖండించె నతనికై కాలకేయులను;
గంధర్వపతిగెల్చి గాంధారిసుతుని । బంధమోక్షముచేసె బలియుఁడై యితఁడు;
మఱియు రాక్షసకోటి మర్దించె." ననిన । మెఱయ సంతోషించి మేదినీశ్వరుఁడు
ఆశ్చర్య[13]మగ్నుఁడై యపుడైన వారి । నిశ్చయింపఁగలేక నిర్విణ్ణుఁడైన,
భూమీశ్వరున కింద్రపుత్త్రునిఁ జూపి । భూమింజయుఁడు పల్కెఁ బొలుపుదీపింప:

కౌరవులఁ గెల్చి పశుల మరల్చినవాఁ డర్జునుఁడని యుత్తరుఁడు తండ్రి కెఱిఁగించుట

"ఇతఁడు నీతోఁ [14]దన్ను నెఱుఁగంగనీక । ధృతి నాజ్ఞచేసినఁ దెగి చెప్ప వెఱచి
[15]చెలఁగి వేఱొకఁడని చెప్పితిఁగాని । కలహంబు గెలిచిన ఘనుఁడు దా నితఁడు.

---

1. కైనఁ దగఁడె. 2. ంత. 3. నర్జునుఁడు. 4. మేదిని. 5. నాఁగ. 6. వాఁడు. 7. బోవు.
8. యున్నాఁడు. 9. యనుచు. 10. వొంద. 11. చెప్పుచున్నచో. 12. గాఁడె. 13. చిత్తుఁడై.
14. మున్ను. 15. యొదవె గెల్పు మహాత్ముఁ డొకఁ డుండనంటిఁ । గదనంబు గెలిచిన ఘనుఁడు దా నితఁడు.

అరదంబుడిగ్గి యే[1]నరుదేరఁ దాను । గురురాజుచూడఁగాఁ గూడ నేతెంచి
వెఱపుదీర్చినయట్టి వీరవాక్యములు । మఱవంగ[2]లేను క్రమ్మఱఁ జెప్ప[3]లేను.
తననామములుచెప్పి తనసహోదరులు । మనవీటనుండుట మఱి నాకుఁజెప్పి
కదనంబు[4]నకుఁ దేరు[5]గదలని మ్మనిన । నది లోకవిపరీతమగుట నేనెఱుఁగ.
పోరిలో హయరత్నములఁ దోలి తోలి । వారక ధృతిఁదూలి వశముగాకున్నఁ
గుశలుఁడై యితఁడు నాకును దోడుచేసెఁ । [6]బొసఁగ వైరుల భగ్నముగఁజేసె." ననిన

## పాండవుల నిజస్వరూప మెఱిఁగి విరాటుఁడు వారల నెంతయు నాదరించుట

వెఱపు సంతోషంబు వినయంబుఁ బ్రియము । నెఱయఁ బార్థుని రాజు నెఱిఁగౌఁగిలించి
పాండవాగ్రజునకు భక్తి సాష్టాంగ । దండప్రణామంబు తగ నాచరించి
యతనిఁ గౌఁగిటఁజేర్చి యాభీము యములఁ । [7]గృతపుణ్యహితులఁ గౌఁగిటఁజేర్చి మించి
చాల భీతిల్లి హస్తములొప్ప మొగిచి । మౌళిపైఁజేర్చి ధర్మజుఁ జూచుచుండ,
నతిసంభ్రమంబుతో నంత నవ్విభుని । సుతులు సోదరులును జుట్టాలు హితులుం
దాదులు [8]సచివు లెంతయుఁ బెద్దవారు । భూదేవతలుఁ బౌండుపుత్త్రులఁ జూడఁ
జనుదెంచి యందంద సందడించుటయు, । జననాథుఁ డామూఁకఁ జదియ వేయించి
యమనందనునియాజ్ఞ ననుజులుఁ దాను । సముచితాసనమునఁ జతురుఁడై యుండి
కంచుకిచేతఁ గేకయరాజసుతకుఁ । బాంచాలిఁ గైసేయఁ [9]బనిచెప్పి యనిపి
తనలోనఁ దాను సంతసమందు [10]విరటుఁ । గనుఁగొని ప్రియముతో గాండీవి పలికె:
"ఏసంకటములేక యిచట నజ్ఞాత । వాస వత్సరము నిర్వర్తింపఁ గలిగె;
[11]ఈవెఱుంగవుగాని యేమున్న తెఱఁగు । నేవెంట [12]గొదలేక [13]హితముచేసితివి.
విరటుండు [14]మేటి భూవిభులలో ననుచుఁ । బరికించి వచ్చె నీపాండవాగ్రజుఁడు;
[15]అదియెల్ల నిజమయ్యె." ననిన నవ్విరటుఁ: । "డిది నాతపఃఫలం బిది నాదుకోర్కి;
వసుధ మిమ్మన్నించువారిలో నొకఁడఁ; । బొసఁగ నన్యునిఁగాఁగఁ బోహాణింపకుఁడు.
నాపాలఁ [16]గరుణించి ననుబెద్దచేసి । మీపూన్కి దీర్చుట మిగులంగ లెస్స.

---

1. నటుపాటిపోవ. 2, 3. రాదు. 4. లో. 5. గదలింపుమనిన. 6. తెసనన్ననప్పుడు విరటభూవిభుఁడు.
7. నతిసంభ్రమంబున నంత వీక్షించి. 8. ప్రజలు బాంధవజనంబులును. 9. బను పిచ్చి. 10. విభుని.
11. నీవు దానెఱుఁగవు నేమున్న. 12. వచ్చిన. 13. హితవు. 14. మేలు. 15. పైరివంచితులపై
వచ్చి నీప్రాపు । చేరి యేకొదలేక చెలఁగితి మనుడు । మదిసంతసించి యామానవేశ్వరుఁడు । ఇది నా.
16. పనియించి.

ఏను ధర్మజునకు నీరాజ్యమిచ్చి । యేనున్న పురినిచ్చి యిభకోటినిచ్చి
ధనధాన్య మణులిచ్చి [1]దళమెల్లనిచ్చి । నను వచ్చి సేవించు నాథులనిచ్చి
హితులను మఱి పురోహితుల బాంధవుల । సుతుల మంత్రులఁగూడి జోకమై నెపుడు
నితఁ డేడుగడయుఁగా నితని పాదములు । చతురత్వమునఁ గొల్తు సర్వకాలంబు.
గజపురి[2]పై దాడి గావించెనేని । భుజశక్తి నచటఁ జూపుదు నోపినంత."
అనిన నుత్తరునకు నామాటలెల్ల । మనసులో సొగయక మత్స్యేశుఁజూచి :
"రణములలో వీరు రక్షింపకున్న । గణుతింప [4]మనకు నెక్కడిది రాజ్యంబు ?
ఈరీతి నీవాకఁ డిచ్చువాఁడవును । కోరి వారొగిఁ బుచ్చుకొనెడివారలునె ?
కాన [5]వీరల నింతకాలంబు [6]మనము । పూని కొల్వనితప్పు బుద్ధిఁ జింతింపు.
దీనికై మనము ప్రార్థించుట గాఁగ । మీనాక్షి నిత్తము మీతనూభవను.
మణులు రాజ్యంబును మనకుఁ బోత్రాఁతి । తృణముగా నవి వారు దృష్టింతు." రనిన

## ఉత్తరను గైసేసి మంత్రులు పాండవులయొద్దకుఁ గొనివచ్చుట

మనసునఁ బ్రియ[7]మంది మంత్రిపుంగవులఁ । గనుఁగొని వారి నాక్షణమె [8]యచ్చటికి
నుత్తరఁ గైసేసి యొనరఁ దెచ్చుటకుఁ । బుత్తెంచుటయు, వారు పొంగుచు వచ్చి
పొలుపారఁ గేకయపుత్రితోఁ జెప్పఁ । జెలువ శృంగారింపఁ జెలులఁ [9]బుచ్చుటయుఁ,
బనిఁబూని వారలు పసిఁడికొప్పెరలఁ । గొనితెచ్చి యుదకంబు కొమ్మకు[10]నార్చి,
తనువు మెత్తనిచీరఁ దడియొత్తి నతికిఁ । బొనర హంసావళి పుట్టఁబుగట్టి,
నిడుదలై యొప్పారు నిండుమెంద్రుకల । తడియార్చి నవపుష్పదామముల్ దుఱిమి
పన్నీటఁ గుంకుమ పదనిచ్చి కలిపి । నున్నని మెయిపూఁత నుతలీలఁ బూసి,
గోరోజనంబు చెక్కులఁ దీర్చి వ్రాసి । తోరమై నుదుటఁ గస్తురిబొట్టు[11]వెట్టి,
పలుకుల మెదిచిన పచ్చకప్పురము । గలిపి కాటుకనీటఁ గనుదోయి దిద్ది
లత్తుక [12]దిగిచి యాలలనపాదముల । హత్తించి కెమ్మోవి కదివన్నె[13]వెట్టి,
పసిఁడిమట్టియలును బసిఁడియందియలు । రశనాగుణంబులు రత్నముద్రికలు
మణిహార నాసికామణి [14]కర్ణపూర । మణికంకణంబులు మానుగాఁ బెట్టి,

1. ధవళంబులిచ్చి ; దళవళంబిచ్చి (?). 2. కై. 3. (బుచ్చె)నేని. 4. నింక. 5. మి మనమింత. 6. వీరి. 7. మంట. 8. భూనాథుఁ । డు. 9. బంచుటయు. 10. వార్చి. 11. దీర్చి. 12. జిగియారు లలిత. 13. శెట్ట. 14. కంఠహార.

[1]నీరజాక్షికి నభ్డ నిలువుటద్దంబు । గారాముతోఁ జూపి కడుసంభ్రమమున
'నతివఁ గై సేసితి' మని ప్రధానులకు । నతి[2]భక్తిఁ జూపుచో, నాశ్చర్యమంది
“వలరాజుదీమమో వలుదముత్తియమొ । వెలలేని పసిఁడియో [3]విరటు లేఁజూలో!
పులుగడిగిన యాణిముత్తెంబుపోలె । నెలమిఁ గై సేసిన నిట్లుండవలదె!”
అని మంత్రివరులు ముక్తాతపత్రములు । వనితకుఁ బట్టించి వరుసఁ దోడ్తెర
నెదురేఁగి విరటుండు హితులును దాను । మదిరాక్షిఁ దెచ్చి ధర్మజుమ్రోల నిలిపి
“దేవ, యీముద్దియ దేవేంద్రజునకు । దేవి గాఁ[4]దగునని తెచ్చి చూపితిని;
ఈనాతి నీరీతి నితని కిప్పించి । మానేర్పు నేరముల్ మఱువంగవలయు;
మీరు నిల్చుటఁజేసి మెఱసె నాభూమి । వారక దుర్భిక్ష వర్జితంబయ్యె;
మీరు వచ్చుటఁజేసి మెఱసి నాకీర్తి । ధారుణి నాచంద్ర[5]తారార్కమయ్యె;
మీరు వచ్చుటఁజేసి మెఱసి[6]కౌరవ్యుఁ । డూరక విరిగె నాయూరి చేరువను;
నావంశమును [7]బావనముసేయవలయు । నీవారిరుహనేత్ర[8]నిపుడు చేకొనుఁడు.”
అన విని ధర్మజుం డమరేంద్రసుతునిఁ । గనుఁగొన విరటుతో గాండీవి పలికె:
“నృత్తగీతంబులు నిఖిలవాద్యములు । నుత్తర నాచేత నొప్పుగా నేర్చెఁ;
కోడలై యుండఁ జేకొనువాఁడఁ గాని । వేడుక నీయింతి వింతగాఁ దలఁప.
వావిదప్పిన పనుల్ వరుసఁ బాండవులు । గావింప; రది మీకుఁ గానవచ్చినది.
కావున నభిమన్యుఁ గల్యాణధన్యు । నా[9]వీరరాజన్యు నమరేంద్రమాన్యుఁ
బురుషుఁ జేసెదుగాక [10]పువ్వుఁబోఁడికిని; । చిరకాల మిదినేను జింతించుచుంటి;
నిది ధర్మసూనున కిది భీమునకును । నిది బంధుజనులకు హితకార్య.” మనిన
విరటుండు మోదించి విజయు నీక్షించి । చరితార్థుఁడై [11]పల్కె సంభ్రమం[12]బునను:
“వినుమేను నీతోడ వియ్యమందుటకుఁ । దనరి యోగ్యుఁడనైతి ధన్యుండనైతి;
హరికి మేనల్లుఁడు హరిపరాక్రముఁడు । మరునిఁ బోలినవాఁడు మాపుత్రిమగఁడు;
పరఁగఁ గులస్థాన పౌరుషంబుల[13]కు । నిరవైన[14]సుకుమారుఁ డీయింతిమగఁడు.”
అని[15]యని కొనియాడ నాధర్మసూనుఁ । డనయంబు వేడ్కతో నతని వీక్షించి,

1. నీరేజవాక్షికి. 2. యుక్తి. 3. విమలకౌముదియొ. 4. జను. 5. తారకంబయ్యె. 6. కౌరవులు । నా[illegible]. 7. బావనంబయ్యె నింక. 8. నిట్లు. 9. పుత్త్రి. 10. పుష్పకోమలికి. 11. యొప్పి. 12. [illegible] 13. స. 14. సౌభద్రు; చంద్రుండు ఈ. 15. కొని.

“ పార్థుమాటల మాకుఁ బరితోషమయ్యె ; । పార్థివ, నీవింక బంధువర్గములఁ
బిలిపింపు ; ముత్తరపెండ్లి వేగంబె । [1] మొరయింపు మిది సర్వమోహానం.” బనిన
మిన్నుదాఁకుచు మత్స్యమేదినీశ్వరుఁడు । క్రన్ననఁ దనపుత్త్రిఁ గౌంతేయులకును
బ్రొక్కించుటయు వారు ముదిత దీవించి । తక్కక యనిచి రంతఃపురంబునకు.
ఆవేళ విరటుఁ డత్యంత హర్షమున । దైవజ్ఞులను బిల్చి తాంబూలమిచ్చి
లలిత వైవాహికలగ్ననిశ్చయము । తలకొని చేయించి తదనంతరమున
మెఱసి వారలుఁ దాను మేటికాలరులఁ । దఱిమి పాంచాల యాదవ ముఖ్యులైన
చుట్టాల రండని శుభలేఖ లనిపి. । రట్టిచో ధర్మజుం డతని వీక్షించి :
“ వనవాసముననుండి వచ్చి నీయింట । మనసులోపలనున్న మలినంబు మాన్చి
యఖిలభోగంబులు ననుభవించితిమి । సుఖ మయ్యె నేఁడిదె శుభము చేసితివి ;
ఎందుఁ[2]బట్టిన మాకు నేకీకులేని । విందవు నీవు గోవిందుని[3]యట్లు
ర.” మ్మని తిగిచి విరటభూమిపాలుఁ । గ్రమ్మఱ బిగియారఁ గౌఁగిలించుటయు
నతఁడు వారలకు మజ్జనముసేయించి । యతివేగమునఁ బ్రీతి నన్నపానములు
[4]తనుపారఁ బెట్టించి తగ గారవంబు । లొనరించి గంధపుష్పోపహారములు
[5]వితతాంబరమ్ములు వెలలేనిసొమ్ము । [6]లతిభక్తితో నిచ్చి యామోదమందె.
ఇటఁ గౌరవాధీశుఁ డిభపురంబునకు । భటులుఁ దానును సిగ్గుపడి [7]వచ్చుచుండి
తనుపార నొక్క శీతలభూమి విడిసి । యినజుతో ననుజుతో నేకాంతమాడి :

## అజ్ఞాతవాస నిరూపణము

“ సమయకాలముపోక చనుదెంచెఁ గ్రీడి ; । క్రమమెఱుంగక చెప్పె గాంగేయుఁడపుడు.
ధర్మ [8]చిత్తున కిది ధర్మరాజునకు । సర్మిలి నెఱిఁగింత.” మని దూతఁ [9]బనుప
నాదూత చనుదెంచి యమసూతిఁ [10]గాంచి । చేదోయి ఫాలంబుఁజేర్చి [11]యిట్లనియె :
“ వడిఁ గ్రీడి యజ్ఞాతవాసవత్సరము । కడవకమున్నె సంగరకౌతుకమునఁ
గురుసేనతోడ [12]మార్కొనెఁ బేరువాడి ; । విరటసూనుఁడు సాక్షి ; వినుఁడింక మీరు

1. యొలమిఁ జేయుదమన్న నెసఁగు వేగమున. 2. జూచినఁ గూర్మి యొసఁగంగ మాకు. 3. మాకు.
4, 5. ఈపాదములు ముద్రితప్రతిలోనే గలవు. 6. లతిభక్తి శక్తులంతయుఁ జూపునంత. 7. వచ్చి
వచ్చి ; వచ్చి మఱియు । ననువుగ మార్గమునందుఁ దా విడిసి । యినజుతో. 8. వత్తునకు. 9. బనిచె.
10. జూచి. 11. తాఁబలికె. 12. మార్కొనఁ బేరువాఢి.

పోయి తొల్లిటియట్ల భూరిదుర్గముల । జాయాసమేతులై చరియింపవలయు ;
నీవెఱుంగని కార్యనిచయంబు లేదు ; । భూవల్లభుఁడు చెప్పి పుత్తెంచె." ననఁగ
మానితసత్త్వుఁడై మహినొప్పు ధర్మ । సూనుఁ డిట్లను వానిఁజూచి నవ్వుచును :
"తమతోడఁ గ్రీడి యుద్ధము సేయునప్పుడు । సమయకాలముపోయెఁ జర్చింప మున్నె ;
గురుభీష్ము[1] లదియెఱుంగుదురు నీవింకఁ । గురురాజుతోఁ బెద్దకొలువులోపలను
వారలు సమయసంవత్సరంబెల్లఁ । బూరించి రనిపల్కు పొమ్ము పొ." మ్మనుచుఁ
[2]గట్టనిచ్చినఁ బోయి కౌరవేంద్రునకు । [3]నట్టి ధర్మజుమాట లతఁడు తెల్పుటయుఁ,
బోలుపార వినియును బుద్ధిపెంపేది । కొలువిచ్చి యారాత్రి కురుసైన్యవిభుఁడు
అనుజులుఁ గృపుఁడు దివ్యాపగాసుతుఁడు । నినజుండు ద్రోణుండు నేతెంచియుండ
దూతఁ బుచ్చుటయును దూత వచ్చుటయు । [4]బ్రాతిఁజెప్పకపల్కఁ బనిలేనిపల్కు :
"ఒప్పార మఱచితి నొకదొడ్డపలుకు ; । చెప్పలేరైతిరి చేరి మీరైన ;
సమయకాలముమీఱి జంభారిసుతుఁడు । సమరంబుచేయుచోఁ జాలించి మనము
నిను నెఱింగితిమన్న నిక్కృతుఁడై పోఁడె ? । పనిలేనిపని [5]నిన్న బవరమేమిటికి ?
ఇది ధర్మరాజున కెఱింగింత." మనిన । నదయుఁడై కోపించి యాభీష్ముఁ డనియె :
"వినెడువారలు నవ్వ విభుఁడవై యుండి । [6]చనునె సంగతిగాని చపలోక్తులాడ ?
చెన్నారఁ గ్రీడివచ్చిన వేళయందు । నన్నుతి నధికమాసములు లెక్కింప
మొగిఁ బాండవులు పదుమూఁడు వర్షములు । నగణితస్థితిఁ బుచ్చిరని చెప్పినాఁడ ;
ఇది నీవు మఱచుట కేది కారణము ? । మది నొవ్వనాడెదు మమ్మింత." యనిన
అందఱు నామాట లగుఁ దప్పవనిరి. । [7]మందానురాగుఁడై మఱునాఁడు పతియుఁ
జావఁగా మిగిలిన సైన్యంబుతోడ । వేవేగ నగరప్రవేశంబు చేసి
గ్రక్కున రేపాడి గగనభాగమునఁ । జుక్కలపసలేని శుభ్రాంశుపగిది
[8]వడి నాజిఁగూలినవారి బంధువులు । విడువక వాపోవ వినుచు నేతెంచి
యమ్మకు నటమ్రొక్కి యాంబికేయునకు । [9]నెమ్మితో మ్రొక్కి మున్నిటియట్లయుండె.
అట జమ్మికడ కేగి యల్ల పాండవులు । పటుతరాస్త్రంబులు భక్తి నర్చించి
కైకొని విరటభూకాంతుఁ దోడ్కొనుచుఁ । బ్రాకటగతి నుపప్లావ్యంబుఁ జొచ్చి

1. లెఱుఁగఁగఁ గోర్కి. 2. గంటగించిన. 3. నంట. 4. ఆతతి చెప్పక యతఁ డిట్టులనియె.
5. గాదె వానితోఁ బోరు । టిది. 6. పనికిమాలినయట్టి పల్కు పల్కెదవు । ఇది నీకు మఱచుట.
7. మందానురాగుఁడై. 8. బడియాజి. 9. నిమ్ములఁ మ్రొక్కి తొల్లిటియట్టు లుండె.

తమకు రాజులు కన్నదసయఁ గానుకలు । క్రమ మొప్ప[1]నిడి మ్రొక్కఁ గడఁగి గైకొనుచు
వేడుక రెట్టింప విరటభూపాలుఁ । డూడిగంబులు సేయ నున్నత[2]శ్రీల

## కృష్ణుఁడు బాంధవులతోఁ గూడి పాండవులఁ జూడవచ్చుట

భాసిల్లు నంతలో, బలుఁడు నచ్యుతుఁడు । నాసాత్యకియు సుభద్రాభిమన్యులును
దనరఁ బ్రద్యుమ్నుండుఁ దగ యుధామన్యుఁ । డనఘుఁ డక్రూరుండు నంత సాంబుండు
కృతవర్మ తారుఁ గ్రిక్కిఱిసి యాదవులు । నతి[3]వీరు లింద్రసేనాది సారథులు
మణిరథారూఢులై మత్తేభ తురగ । మణులతోఁ గామినీమణులతోఁ గదిలి
పసిఁడి యందలములుఁ బసిఁడి గొల్లెనలు । పసనారు[4]రథములుఁ [5]బట్టైన బండ్లు
[6]దగిన పెక్కెంబులుఁ దమ్మటంబులును । జగజంపుగొడుగులుఁ జామరంబులును
[7]గపురైనయోధులుఁ గవులుఁ బాఠకులు । విపుల వీణావేణు వివిధవాద్యములుఁ
బెనుపొంద నభిమన్యు పెండ్లి[8]కేతెంచి । పొనర నుపప్లావ్యపురముఁ జొచ్చుటయు,
[9]యదుకుమారులుఁ దాను హరివచ్చె ననుచు । నెదురేఁగి పాండవు లింపుసొంపారఁ
బుండరీకాక్షుని భువనైకవంద్యుఁ । బాండుభూపతిఁగన్న పగిది నీక్షించి
యానందవివశులై యట మూర్ఛదెలిసి । జానొప్పఁ దగిన యాచారంబు నడపి
యమరంగ బలముఖ్యులగు యాదవులకు । నముచిత[10]భక్తితో సత్క్రియల్ నెఱపి[11]
భాసిల్లు తనయుతోఁ బాంచాలికడకు । [12]నీసుభద్రాదేవి [13]యేఁగుఁగాకనుచు
సరస నభ్యంతరజనముతోఁ గూడఁ । గరమర్థిఁబుచ్చుచోఁ, గమలాక్షుఁ డంతఁ
బీతాంబరమువోని పృథులవస్త్రములు । భాతి కౌస్తుభలీలఁ బరఁగు రత్నములు
వైనతేయునికంటె వడినేఁగు హరులు । పూని గోవర్ధనంబును బోనికరులు
పాండుపుత్త్రునికిచ్చి పాంచాలికడకు । మెండైన తొడవులు మృదులవస్త్రములు
భాసిల్లు నొకమంచి పసిఁడి గద్దియయు । దాసీజనంబులుఁ దగురీతి నిచ్చి
కౌంతేయులును దానుఁ గలిసి యంతంత । సంతోషముననున్న సమయంబునందు,

1. నిచ్చినఁ గడఁగి. 2. స్థితిని. 3. వీరదండ సేనాధినాయకులు. 4. సరకులు. 5. బాటబండ్లులును. 6. దగరు. 7. దమతోడ నేతేరఁ దత్వైభవంబు । లమరంగ నెంతయు నానందమలరఁ । బెనుపొంద. 8. గావింప. 9. నదె......తోడ. 10. సంగమాచారముల్ నడపి. 11. యెంతయుఁ బ్రీతిఁ దా మెసఁగుచుండఁగను । ఇంతులు దనుఁగొల్వ నిభరాజగతుల । భాసిల్లి. 12. నా. 13. యరుగఁగానుకలు.

ద్రుపదుండు హితులుఁ బుత్త్రులుఁ దానుఁగూడి । [1]విపుల సేనాసూన విభవుఁడై వచ్చి
యల్లుండ్రఁ బూజించి యంతఁ గూఁతునకు । నుల్లంబురంజిల్ల నొకహారమిచ్చి
వారి మన్ననఁగాంచి వర్తించునంతఁ । జారువర్తనుఁడగు శైబ్యుఁడన్ రాజు
కాశిరాజును సుప్రకాశితశ్రీలు । భాసిల్ల వచ్చుచోఁ బాండునందనులు
ఎదురేఁగి [2]తోడ్తెచ్చి యెలమిఁ బూజించి । ముదమావహించిరి మొగి [3]నిద్దఱకును.
వెండియుఁ దమరాజ్యవిభవంబు మెఱసి । పాండవ విరటభూపాల బంధువులు
వచ్చిన విరటుండు వారిఁ బూజించి । యిచ్చకుఁ దగినచో నిమ్ముగావించి

## ఉత్తరాభిమన్యుల వివాహము

తనవీటిలోన నుత్తరపెండ్లి చాటఁ । [4]బనిచిన భృత్యులుఁ బౌరు లా పురిని
మేడలు [5]ధవళించి మృగనాభి [6]నలఁది । వాడలు శోధించి వలుదము త్తెములఁ
జెలఁగి ముగ్గులువెట్టి, చీనాంబరముల । కలువడంబులుగట్టి, కంబాలు[7]దోమి
పోఁకమ్రాఁకులుదాపి పువ్వులు నెఱపి । తాఁకోర్వఁ దోరణస్తంభం[8]బు లెత్తి,
మణిగానసముచేసి మహిత[9]కుడ్యముల । ననువొంద లక్ష్మీకల్యాణముల్ వ్రాసి,
ఘనసారధూళితోఁ గలిపి యొక్కింత । యనువైన జవ్వాజి యట్టళ్లమెత్తి,
రంగువిరాజిన గోపురములపై నున్న । బంగారుకుండలు ప్రభ[10]వెట్ట నెలచి,
వెండి[11]యుఁ గంబముల్ వివిధతోరణము । లొండొండ వీథుల నొప్పారఁ గట్టి
చెలువ[12]ంబునకుఁ బ్రోదిసేయుచందమున । నెలమిఁ [13]బుష్పాళ్లతో నెల్లఁ గై సేసి,
తొడరి కాలాగరు ధూమమెల్లెడలఁ । గడలుకొల్పినఁ గాంతిగలిగి యప్పురము
మాయాపురముమించె మఱపించెఁ గాంచి । నాయయోధ్యనుబోలె [14]నలకనుబోలె.
[15]అప్పు డప్పనముండి యధికారులనుపఁ । దప్పక నగరిలోఁ [16]దగువారు చొచ్చి
పచ్చపట్టెలభాతిఁ బవడాలు నిలిపి । [17]పచ్చిదవనముతోఁ బందిళ్లువెట్టి
కొలువుకూటంబులఁ గుంకుమ [18]నలికి । పాలుపారఁ గప్రంపు ముగ్గులువెట్టి

---

1. విపుల సమ్మోదాబ్ధి వీచులన్ మునిఁగి । యుండఁగాఁ గాశీశుఁ డురుశైబ్యవిభుఁడు । దండ నేతేరంగ ధర్మజాదులును । ఎదురేఁగి. 2. పూజించి యెలమిఁ దోతెంచి. 3. నందఱకును. 4. బనుప సంభ్రమితులై. 5. వాడలు. 6. నలికి. 7. పొదివి. 8. ముల్ నిలిపి. 9. రీతులను । అనువొందఁ గల్యాణచిత్రముల్ వ్రాసి. 10. గాంచఁ దోమి. 11. కోటలువాతి. 12. వేగిన. 13. బూఁబోణుల. 14. నాలంక గెలిచె. 15. అప్పుడాయధికారు లనుపమగతుల. 16. దగవార. 17. పచ్చతెల్లులుదోఁప. 18. ంబలఁది.

[1]మణికుడ్యములయందు మణిగవాక్షముల । మణిదీపముల మాలికలఁ గంగఁ జేసి,
మెత్తనివలిపట్టు మేల్కట్లుగట్టి । ముత్తెంబులును బువ్వములు వ్రేలఁగట్టి
హయదంతిశాలలు నస్త్రశాలలును । నియతి [2]శోధించి వెన్నెల [3]సిగ్గుదొరయఁ
జతురత మఱి పెండ్లి చవికెయు నరుగు । [4]నతియత్నమునఁ జేయునపుడు మోదమునఁ
బవడంపుబోదలుఁ బసిఁడివాసములు । నవరత్నమయములౌ నాల్గుకంబములు
వెండిపట్టెలు వట్టివేరు కప్పులును । [5]వెండియు శీతాంశువేదిభాగమును
నొనరించి [6]యొప్పుగా నొగి నందుమీఁదఁ । గనకపీఠమువెట్టి కడఁకతో మఱియు
వలయు కార్యంబుల వర్తించి రంత. । వెలఁదులఁ బిలిపించి విరట భూవిభుఁడు
ఘనలీల నుత్తరఁ గైసేయఁ బనిచె. । తనయులుఁ దమ్ములుఁ దానుఁ బత్నియును
బహుకుంకుమాంబరాభరణ మాల్యముల । విహిత [7]శృంగారులై విప్రపుంగవులఁ
బిలిపించి పూజించి పేరటాండ్రకును । దిలకించు కట్నముల్ దెఱఁగొప్ప నిచ్చి
[8]మహితవైభవమున మఱియుఁ గొల్వుండి । యహితసంతోషుఁడౌ నా ధర్మజునకు
ననుపమంబగు లగ్నమా[9]సన్నమయ్యె । ననిచెప్పి పంపిన నతఁడు వేగమున
వనజనాభునియాజ్ఞ వలనొప్పఁ బడసి । యనుజన్ములును దాను నర్థిఁ గైసేసి
శుభవేష[10]మహితులై చుట్టాలు గొలువ । నభిమన్యు [11]భూషించి యక్కుమారకునిఁ
బట్టపుటేనుంగుపై నుండఁ బనిచి । నెట్టన శుభతూర్య[12]నిచయంబు మ్రోయ
నుత్తుంగగజములు నుత్తమాశ్వములుఁ । గ్రొత్తగాఁ గైసేసి కొన్నింటిఁ గొనుచు
లెక్కకు మిగులు పల్లిక[13]లు దెప్పించి । చొక్కపుమణులు భాసురవస్త్రచయముఁ
[14]గల వస్తువులు దివ్యగంధముల్ మఱియుఁ । బోలుపైన తొడవులుఁ బువ్వుమాలికలు
మధురభక్ష్యంబులు మఱియుఁ బెక్కైన । విధముల క్రంతలు వింతగా నడువఁ
దగురీతి బ్రాహ్మణోత్తముల దీవెనలు । మగువలపాటలు మాగధస్తుతులుఁ
దఱచుగా వినుచు ముందర శౌరి నడువఁ । దిరమొప్ప విరటుమందిరభూమిఁ గదిసి
భాసిల్లి యెదురుగాఁ బఱతెంచి సతులు । సేసలు చల్లువోఁ జెలఁగి కైకొనుచుఁ

1. మాణిక్యదీపముల్ మణికవాటకముల । రాణించి నిరుపమప్రభ గొల్పుచుండ। మెత్తని. 2. భూషించి. 3. ముగ్గుచూపి. 4. నతి విచిత్రముగాఁగ నలకరించుటయు. 5. ఒండొంటి మిగులంగ నొక వేదియందు. 6. యావేది నొప్పుగా నలికి. 7. వేదజ్ఞులౌ. 8. మయమూర్తికలతోడ మహిమఁ గొల్వుండి (?) । యమిత సంతోషుఁడై యా ధర్మజునకు. 9. యత్త. 10. యుతులౌచు. 11. బూజించి. 12. నినదంబు(?). 13. లందునిండి. 14. ఫలవస్త్రములు దివ్యభవ్యగంధములు,

జటుల ఘంటాముఖ సకలనాదముల । బటువైన విరటభూపతియిల్లు చొచ్చె.
అతఁడు భీతియు సిగ్గు హర్షంబు[1] మెఱయ । వితత వైదికతంత్ర విభవంబు నడవఁ
[2] గేశవుండును దానుఁ గృష్ణ ధర్మజులు । నానుభద్రాసుతు నర్థిఁ దోడ్కొనుచుఁ
గరమొప్పు నుత్తరాంగనకు నూటున్న । తెరయొద్ద నిలిపినఁ దెరయొప్పెఁ జూడఁ
దొలఁగక దివసరాత్రుల నట్టనడుమ । నిలిచిన [3]సంజవెన్నెల చాలుపోలె,
దిననాథ వికచపద్మినుల మధ్యమున । [4]జనులు చూడఁగనున్న జలదంబుపోలె.
ఆవేళ దైవజ్ఞు లఖిలదేవతల । భావించి కీర్తించి [5]పరమమోదమున
రమణీయ శుభతూర్యరవమురంజిల్ల । సుముఖులై దీవించి సుముహూర్తమనుచుఁ
దెరచీరఁ దిగిచిన దేవేంద్రుమనుమఁ । డరవిందముఖి వక్త్ర మభిలాషఁ జూచె.
ఆ చూపులను తేఁటు లామో[6]ముదమ్మి । నేచిన మాధుర్య మింపారఁ గ్రోలి
మగుడ నేరనిమాడ్కి నురగుచున్నంత, । మగువయుఁ దనచూడ్కి మగనిపాదముల
నిలిపినఁ గస్తూరినీట నచ్చోటఁ । దొలికినచందమై తోఁచెఁ జూపఱకు.
అంతఁ గ్రమ్మఱివచ్చి యభిమన్యుచూడ్కి । యింతి[7]బంగరుమేన నిరవొందియలర
నాపొలంతుకచూపు లభిమన్యు[8]మోముఁ । బ్రాపించి నిలువనేరక సంచలించె.
అలఁతివేడ్కయు సిగ్గు [9]నప్పుడిద్దఱకుఁ । దలఁపు[10]ల దిగఁబాఱ తడఁబాటు సూపఁ
బతిచూపు మఱి త్రిప్ప భామచూపలర । సతిచూపులను ద్రిప్ప సౌభద్రుచూపు.[11]
పరికింప నిట్లు దంపతులచూపులును । దరమిడి యన్యోన్య తనువులు దాఁకి
జిగియారు చెమరునఁ జిక్కి యొక్కింత । మగుడ నేరనిమాడ్కి మఱి చేరవయ్యె.
తదనంతరంబ యుద్దఱుఁ దంత్రమరసి । ముద మొప్ప [12]నక్షతంబులు దోయిలించి
యొగిఁ దీఁగయును బ్రమాను నొండొంటిమీఁదఁ । దగిలి [13]బ్రొవ్విరినేన దలపెట్టుకరణిఁ
జెలువార నొండొరుల్ శిరములమీఁదఁ । దలఁబ్రాలు[14]పోసిరెంతయు సిగ్గు[15]తోడ.
అభిమన్యుఁ డప్పు డయ్యు[16]తివ కెంగేలు । రభస[17]వత్సులకాంగరాగుఁడై పట్టి

---

1. దోఁప. 2. వాసిమీఱఁగ వైభవంబు దళ్కొత్త । నా సుభద్రా. 3. లేఁత. 4. గనుపట్టు నుదయరాగచ్ఛాయపోలె. 5. పరమాదరమున. 6. ద మంది. 7. మెత్తనిమేన నెఱ (ఱి) మించు లొరయ (లవయ). 8. మేన. 9. నా వేళఁగలసి. 10. లు జెలిబాఱ. 11. అంతట మునులుఁ బుణ్యాంగనల్ విప్రు । లెంతయు దీవింప నెలమిఁ గృష్ణుండు । ధర్మజాదుల వేడ్కఁదగిలి కీర్తింపఁ । జేర్చి సౌభద్రుండు పృథులహర్షమునఁ । గలకంఠి కంఠభాగమునఁ గీలించెఁ । గళల నింపొందు మంగళసూత్ర మెలమిఁ । దదనంతరంబ. 12. దోసి (యి) ళ్ళ ముత్యముల్ నించి. 13. యొయ్యన విరుల్ దమిరాల్చుకరణి. 14. నించి. 15. దోఁప, 16. ంగన కేలు. 17. విస్ఫురితానురాగుఁడై మించి.

చెలువారు [1] మొత్తని చిగురాకుసురియ । వెలయఁబట్టిన తియ్యవిలుకాఁడుపోలె
వెలఁదిఁ దోడ్కొని హేమవేదిక యెక్కి । నలువొప్ప నేకాసనంబున నొప్పి
నొగి రోహిణి[2]నిఁగూడి యుదయాద్రిమీఁద । మిగులఁ జూపట్టిన మృగ[3]ధరుఁబోలె.
ఆలోన యాజ్ఞికు[4]లగ్నియు దర్భ । పాలాశ సమిథలు [5] బ్రహ్మపాశములు
[6]సరసాక్షతలును లాజలు గిన్నియలుఁను । సురభిగంధము నేయి స్రుక్స్రువంబులును
మొదలైన సద్ద్రవ్యములుగూర్చి క్రియలు । వదలక [7]యువ్వధూవరుల వేల్పింప
వారును సంతోషవనధి నోలాడి । కోరిక [8]లెంతయుఁ గొనసాఁగి వెలయఁ
దనువులించుక సోఁకఁ దలచూపి పులక । [9]ల్రానర మేనులునిండి యొండొండ నిగుడ
హోమకార్యము దీర్చి యుర్వీదేవతలు । వేమాఱు నిచ్చు దీవెనలు గైకొనిరి.
పెనుపార నీరీతిఁ బెండ్లి చెల్లుటయు । ఘనుఁడు విరాటుఁ డగ్గలికతో నవుడు
పట్టుపచ్చడమును [10]బంగారు నగలుఁ । గట్టంగ మడువులుఁ గంఠమాలికలుఁ
బొసఁగఁ బూబంతులుఁ బోకలాకులును । బసిఁడి పళ్ళెరములఁ బచరించి తెచ్చి
పొనర నచ్యుతునకుఁ బూజించి యిచ్చి । వినతిఁ బాండవులకు వేర్వేఱ నిచ్చి
తెఱఁగొప్ప నా ద్రౌపదికి సుభద్రకును । నెఱయ భూషణ వస్త్ర నిచయంబు లిచ్చి
పదపడి [11]యొక వేయి భద్రనాగములు । [12]పదివేల సంఖ్యల భటఘోటకములు
గణుతింప నైదులక్షలు పాఁడి పసులుఁ । బ్రణుతింప నరుదైన పసిఁడి[13]టంకములు
విభవంబు దైవాఱ వేగఁ దెప్పించి । యభిమన్యునకుఁ గూర్మి [14]నరణమిప్పించి
యితర బాంధవులకు నింపుసొంపారఁ । బ్రతిలేని భూషణాంబరము లిప్పించి
యనఘుఁడై [15]యుందఱ నన్నపానములఁ । దనిపెఁ బాయున [16]నూపదథులతోఁగూడ.
వివరింప నప్పుడు విరటు మందిరము । కవిలోక గోష్ఠీవికాసంబు వలనఁ
జటుల గీతంబు[17]ల సరసవాద్యముల । నటనటీజన[18]మూడు నాట్యంబువలన
యాదవ పాంచాలు రాదిగాఁ గల్గు । మేదినీ[19]విభులాడు మేలంబువలన,
లలిమీఱ దంపతులకు నివాళికలు । సలువొప్పనిచ్చు పుణ్యస్త్రీల వలనఁ,

---

1. జిగిమించు. 2. యును దాను నుద. 3. ధారు. 4 లన్నంబు. 5. భవ్యపాత్రములు. 6. వర శుభాక్షతలును బసిఁడి గిన్నియలు. 7. వానిచే వరుసఁ జేయింప. 8. లారీతి. 9. లొనరెఁ జేతులు దాఁక నొడలెల్లఁ జెమట. 10. బసిఁడి యుత్త (త్తె) రలు. 11. పదివేలు. 12. చదురొప్ప రథము లశ్వములు సద్భటులు. 13. టెక్కెములు. 14. యమర. 15. విప్రుల నధిక దానముల. 16. పూప కతులతో. 17. పీసర పోవకుండ. 18. ఘననాట్య సంగతుల. 19. విభుల సమ్మేళంబు వలన.

ప్రాకట శుభవేష భరితులై [1] వెలుఁగు । రాకొమరుల హాస్య [2] రసపుష్టి వలనఁ,
గుల పౌరుషము లెత్తి కుంభినీశ్వరులఁ । గలయఁ గీర్తించు మాగధపంక్తివలనఁ,
బొనర మిన్నులు దాఁకు భూరిదక్షిణలఁ । దనిసిన భూదేవతా కోటివలనఁ,
జతుర విలాసినీ చక్రంబువలన । నతిమనోహరమయ్యెనని చెప్పుటయును
జాల సంతోషించి జనమేజయుండు । మేలైన పూజల మెప్పించె నతని.
[3]పంచాక్షరీ మంత్ర పరమతత్త్వజ్ఞ ! । పంచమ వేద ప్రబంధ నిర్వాహణ !
జనదోషహరణ ! శిష్ట ప్రతిపాల ! । ఘనభుజాటోప ! మార్కండేయ నిత్య !
ప్రథిత జంబూద్వీప భారధారేయ ! । పృథులసౌభాగ్య ! గంభీరసముద్ర !
అని యిట్లు [4]కృతిపతి కభివృద్ధిగాఁగ । నెనసిన వేట్కతో [5]నేఁ జెప్పినట్టి
యీ పుణ్యకథ విన్న నెలమి వ్రాసినను । రూపించి చదివిన రుచిరపుణ్యులకు
నరుదారఁ బుత్రపౌత్రాభివృద్ధియును । బరమసౌభాగ్యంబు భాగ్యవృద్ధియును

---

1. మెలఁగు. 2. రవముల వలన.
3. దశరథరామ సీతాపతిరామ । శశికలాధర సేవ్యసన్మాని వంద్య
రావణసంహార రాక్షస వైరి । భావజజనక శ్రీభవ వాసుదేవ
సాకేతపురినాథ జగదేకనాథ । నా కేడుగడయునై నన్ను రక్షింపు
భోసలాన్వయ సుధాంభోధి చంద్రునకు । భాసుర శౌర్యానుభావ సాంద్రునకు
శివసముత్కట జటాభరణాయమాన । ధవళకీర్తి మనోజ్ఞతరగాంగ భంగ
గాహనైక పవిత్ర గంధర్వగాన । మోహితామర వధూముఖ కాంతశ్రీయు
మనుజభావునకు రామామనోజునకు । ననఘ సన్నుతికి శాహాజీ పతికి
నింబాజి వ్రాయించె నిఖిలార్థ వితతి । కంభోధి యగుచుండునట్టి భారతము
నిటలాక్ష పదపద్మనిహిత ప్రసన్న । పటుచిత్తుఁడైన కుప్పయమంత్రిచేత.
ఈ పుణ్యకథ విన్న నెలమి వ్రాసినను । రూపించి చదివిన రుచిర పుణ్యులకు
గంగలోపల వేయి కపిలధేనువులు । నంగజజనకును నర్పించు ఫలము
నరుదారఁ బుత్రపౌత్రాభివృద్ధియును । జిరతర కీర్తులు శ్రీలురాజ్యములు
నిహలోక పరలోక హితమైన సుఖము । మహితాయురారోగ్య మంగళచయము
రమణమై నిచ్చు శ్రీరాఘవేశ్వరుఁడు । క్రమము దప్పక యెల్లకాలంబునందు.
ఈ మహాకృతి మహియెంతకాలంబు । హేమాద్రి శిఖరంబు లెంతకాలంబు
ఎలమిఁ జంద్రార్కులు నెంతకాలంబు । పొలుపొంద వెలుఁగును భువనంబు లెఱుఁగ
ననుపమస్థితి నొప్పు నంతకాలంబు । మునుకొని కథల నిమ్ములనొప్పుఁ గాన.
ఇది సదాశివభక్త ... ... ... (తంజా. ప్రతి).
4. నృపతికి. 5. నెలమి వర్ణించి. 6. ప,

[1]ఇహలోక పరలోక హితమైన సుఖము । మహితాయురారోగ్య మంగళచయము
రమణ బట్టేపాటి రామలింగంబు । క్రమము దప్పక యిచ్చుఁ గలకాలమెల్ల.
ఆవేల్పుఁ గొల్చిన యనఘాత్ముపేర । దేవయప్రభు వంశ తిలకంబుపేర
సరణిగాఁ బంట వంశప్రభుపేర । మఱియు జంగాల [2]ముమ్మయధీరుపేర
సహజసజ్జనుపేర సంప్రోక్తమైన । [3]మహిత [4]కావ్యము ధాత్రి మను నెంతకాల
మిన సోమ తారక లెంతకాలంబు । ననుపమస్థితి నొప్పు నంతకాలంబు.
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ [5]తిమ్మయ నామధేయ
రచిత విరాటపర్వమున నాశ్వాస । ముచితార్థయుతముగా నొప్పె నేనవది.

---

1. పరలోక ఇహలోక శాగైన సుఖము (?). 2. ముమ్మన శౌరి. 3. మహిలోన నెంతటు యొప్పుచుండు । ఇది సదాశివ (తిరు. ప్రతి). 4. సత్కృతి. 5. తిమ్మన.

# ప్రథమాశ్వాసము



[1]శ్రీరత్నయుత వక్ష, శ్రితసత్కటాక్ష, । కారుణ్యగుణధామ, కౌశల్యరామ,
అక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథాసూత్ర మిట్లని చెప్పఁదొడఁగె:
[2]పాండవాగ్రజుఁడు శోభనమైనపిదపఁ । బుండరీకాక్షునిఁ బూజలుసేసి
యేనగునాఁడు మత్స్యేశుకొల్వునను । భూనాథుఁడును దానుఁ బోయి కూర్చుండి
తమ్ములుఁ దనయులుఁ [3]దగువారుఁ గొలువ । నెమ్మి నిష్టాలాప[4]నిరతి నున్నంతఁ
[5]గాంతేయకార్యంబు కమలనాభుండు । చింతించి నృపుల వీక్షించి యిట్లనియె:

### కౌరవులయొద్దకు దూత నంపు టుచితమని కృష్ణుఁడు వల్కుట

"ధారుణీపతులార, ధర్మజు[6]పాటి । సైరణగల[7]వాఁడు జగతిలో లేఁడు;
వనవాస మజ్ఞాతవాసయుక్తముగ । జను లియ్యకొనఁ [8]దీర్చి సంబంధి యింట
నున్నవాఁ డితనికి నుర్వీరాజ్యంబు । పన్నగధ్వజుఁ డింకఁ బంచి యీఁ[9]దగదె?
వాఁడేల యిచ్చు గర్వపుఁ గూటివాఁడు । పోఁడిగాఁ బ్రజఁగూర్చి పోరాడుఁగాక;
వనవాసముననున్న[10]వారిఁక వీరు । నని సేయుదురు[11]గాక యతనిఁ గైకొనరు;
ఆ మత్తుఁడును [12]వీర లసహాయులనుచుఁ । దా మహా[13]సైన్యుఁడై తద్ద గైకొనఁడు;
కావున వీరలు [14]గలహయత్నంబు । నీవేళ సేయక [15]యిట్లునికి గాదు;
దూతఁ బుత్తముగాక దుర్యోధనునకు । నాతని[16]తలఁపుఁ దా నరయంగవలయు;
[17]పుచ్చిన నతఁడును భూరాజ్యభాగ । మిచ్చెద రండన్న నిది సర్వహితము."

### దుర్యోధనుఁ డపరాధి కాఁడని బలరాముఁడు పల్కుట

అనిన నెంతయు మెచ్చి హలపాణి పలికె: । "[18]వనజాయతాక్షుని వాక్యంబు మేలు;
క్షీరోదకన్యాయసిద్ధి [19]నిక్కైనఁ । గౌరవులును [20]వీరుఁ గలయంగఁగలరు;

---

1. శ్రీ వెంకటాధీశ సృష్టిప్రకాశ । దేవపూజిత పాద దివ్యప్రసాద । జనమేజయునకు వైశంపాయనుండు । ఘనతతో భారతకథ చెప్పఁదొడఁగె. (ఓరియంటల్ ప్రతి). 2. పాండవు లిట్లు. 3. దన. 4. నియతి. 5. కౌంతేయులను జూచి కంసమర్దనుఁడు. 6. జోలి. 7. రాజు. 8. దేర్చి సమ్మతి నిట్లు. 9. గలఁడె. 10. వారలై వీర । లని. 11. గాని. 12. వీరి న. 13. సేనుఁడై తద్దయు. 14. గణఁగి. 15. యిటులున్న. 16. లోభంబు. 17. పుచ్చఁగా. 18. వనజాతనాభ నీ. 19. నింపెసఁగ. 20. వీరి.

* ఈ పర్వము నందలి పాఠాంతరములన్నియు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ ప్రతిలోనివి.

వెరవెఱింగిన దూత వేగంబె పనుపుఁ । దరిగెనేనియు దూత యతిగర్విగాక
యనువైన[1]వేళ నొయ్యన సుయోధనుని । మనసు నొవ్వకయుండ మాటాడవలయు;
తల[2]పోయ నతఁడును ధర్మంబుదప్పి । మెలఁగఁ డా వివరంబు మీకుఁ జెప్పెదను.
తాను నేరకపోయి తనమేనమామఁ । బూని జూదమునకుఁ బొదవెట్టె; నతఁడు
నిలిచి పీరొడ్డిన నెత్తంబులెల్ల । గెలిచె గెల్చిన వీరిఁ [3] గీడుసోఁకినది;
జూదమాడినవారి సోఁకు నాపదలు; । మేదిని నలున కేమిట [4] నెక్కుడితఁడు?
అతఁడుగాఁ [5]డిందు నపరాధి." యనిన । నాతనిమీఁద సాత్యకి చాల నలిగి:

## సాత్యకి దూత నంపఁ దగ దనుట

"పక్షమాడితిగాక పాండవాగ్రజు[6]ని । నక్షవిద్యకు లోలుఁడని యెన్నఁదగునె?
ఇంత [7] సైరించినాఁ డితఁడు జూదంబు । పొంతఁ బోవునె మోసపుచ్చిరిగాక;
మాట లిన్నియు నేల మనదూత వారి । వాటపుగర్వోక్తి వలయుఁ బొలదుగ;
నొనఁగకయుండిన యుద్ధమధ్యమున । నసిధారరప్పింతు నన్నిభాగములు.
ఎంతకులేరు [8] పీరీ భీమ విజయు? । లింత[9]యు నెఱిఁగిపోఁడే [10] మొన్నవచ్చి?
నేఁటిపట్టుననైన నిజగర్వరేఖ । మీటక రిపుఁడేల [11] మెదుగుఁ బార్థులకు?
గర్వోక్తు[12]లాడినఁగాని దుష్టాత్ముఁ । డుర్విలో మృదుభాష నోజకురాఁడు;
ధన [13]రాజ్య యౌవన దర్పాంధుఁ [14]డతఁడు । మన దూతమాట సన్మానించి వినునె!
యుద్ధంబు గాఁగల దుద్యోగపడుఁడు । సిద్ధమింతయు నన్న శ్రీకృష్ణుఁజూచి
పాంచాలపతి పల్కు: "బలుఁ డేమి యెఱుఁగు? । సంచిత సత్య మీ సాత్యకి పలుకు.
కౌరవాగ్రజుఁ డాడు గర్వోక్తి మాన్ప । నేరరు కొలిచిన [15]నియతి నద్దాంలు;
ధృతరాష్ట్రుఁ డతనిబుద్ధికి మాఱుపల్కఁ; । డతిమాత్రముగఁ గయ్యమగు వేయునేల?
గణుతింప [16]నిటమీఁదఁ గౌంతేయులకును । రణసహాయులనెల్ల రప్పింపవలయు;
రారాజు మునుమున్న యేరాజుఁ బిల్చు । నారాజు మనకు రాఁ డటఁ బోవుఁగాని."
అనిచెప్పి [17]పాంచాలుఁ డబ్జనాభునకుఁ । దన పురోహితుఁజూపి తగవొప్పఁ బలికె:

---

1. వేళల నా. 2. కొని యతఁ డింత. 3. గిట్టెటు నడగె (?). 4. దక్కు వి.
5. డీతఁ డపరాధి. 6. ఁడు. 7. సేయించెనే యితఁడు. 8. నేఁడీ. 9. కు. 10. మున్న. 11. మేటి.
12. లాడక గాదు దుర్మతుఁడు. 13. ధాన్య. 14. డగుచు. 15. వినయ కా. 16. నప్పుడీ.
17. ద్రుపదుండు హరికి వెండియును,

“ మతిమంతుఁ డీతఁడు మాట పొందెఱుఁగు ; । నతివేగమునఁ బోయి హాస్తినాపురికి
మనము [1]చెప్పినయట్టి మాట లందఱకు । వినిపించు వేర్వేఱ [2]విశదంబుగాఁగ;
వారలతలఁపు సర్వముఁ గానవచ్చు । నీరీతి.” ననుటయు నిందిరావిభుఁడు :
“ పాంచాల, నీవిట్లు బ్రాహ్మణోత్తమునిఁ । బంచిన వారు తాత్పర్యంబుతోడ
‘ద్రుపదుఁడు మనకు నాప్తుఁడు బుద్ధి[3]త్రోవ । గృపసేసె’ ననుచు మిక్కిలి సమ్మతించి
పాలిత్తురవనిలోఁ బాండుసూనులకుఁ ; । బోల నెవ్వరి నందుఁ బుచ్చినఁగాదు.
సమ్మతింపక యుద్ధసన్నద్ధులైన । నెమ్మిఁ బాండవులంత నిజసేనఁ గూడి
నన్నును బిలిపింప నాఁడేను వత్తు ; । నెన్న నెవ్వరునేల యాక్రీడి గలఁడు.
వడిఁ బెండ్లిపనికినై వచ్చి పాండవులఁ । బొడగంటి మిటఁ జాలుఁ బోయివచ్చెదము.”
అని లేచి బలముఖ్యులైన యాదవులు । [4] తనవెంట నడవ యాదవచక్రవర్తి
విరటు వీడ్కొని పాండవేయుల నిలిపి । [5]తఱి ద్వారవతి కేఁగెఁ దగు వైభవమున.
అంత [6]వివాహార్థమై వచ్చి నృపులు । కౌంతేయపక్షులై కదనంబుగోరి
యాధర్మసుతుఁ డంప నాత్మభూములకు । సాధనసైన్యసంచయ [7]బుద్ధిఁ జనిరి.
[8]సరవిఁ బాండవులును సన్నద్ధులగుచు । విరటునితోఁ[9]గూడ వెలివీడు విడిసి
యనిసేయఁ[10] దోడురండని యాప్తనృపుల । కనిచిరి మతిమంతులైన దూతలను.
అటఁ గౌరవాధీశుఁ డావార్త యెఱిఁగి । తటుకునఁ దానును దన విధేయులకు
నొనర దూతలఁ [11]బంప నుభయపక్షములఁ । జనుదేరఁ దొడఁగిరి జగతిపై నృపులు.
పాంచాలుఁడును నంత బ్రాహ్మణదూతఁ । బంచె బుద్ధులుచెప్పి పసదనంబిచ్చి.
అక్కడఁ గురురాజు హరిఁబిల్చు పనికి । నొక్క[12]దూతను బుచ్చ నోడి తావెడలి

## దుర్యోధనుఁడు కృష్ణుని సాయము గోరుట

ద్వారావతీ పురోత్తమమున కరిగి । వారిజోదరుఁ గానవచ్చుచో, నతఁడు
నిద్రానిమీలితనేత్రుఁడై యున్న । [13]నుద్రేకమగు వేడ్క నొయ్యన చొచ్చి
తలయంపిదిక్కునఁ దగినపీఠమునఁ । దలకొని కూర్చున్నఁ, దక్షిణంబునను
హరిఁబిల్వఁ గ్రీడియు నరుదెంచి యతని । చరణాబ్జముల[14]యొద్ద సద్భక్తితోడ

1. చెప్పంపిన. 2. విభుఁ డదిగాక. 3. ద్రోఁప. 4. అనురాగమునఁ బొంద యదు. 5. తన పురంబున. 6. విహారార్థ మరుదెంచి. 7. ముతో. 8. సరస. 9. గూడి. 10. రమ్మని యాప్తులా. 11. బుచ్చి. 12. మానిసిఁ బంప. 13. నుద్దేశ. 14. యొడ.

నిలిచిన, నంతలో నిద్రమేల్కాంచి । జలజనాభుఁడు తోల్త శక్రజుఁ[1]గాంచి
వెనుక కౌరవుఁ[2]గాంచి వేడ్క నిర్వరను । అనుకూలముగ వారి నాదరించుచును
'ఏమొకో [3]వచ్చితి రిరువురు?' ననిన । దామోదరునిఁ జూచి ధార్తరాష్ట్రుండు:
"ఓడక నిన్నేను యుద్ధకార్యము[4]నఁ । దోడాసపడి పిల్వఁ దొలుత నచ్చితిని;
[5]ఏముఁ బాండవులు మీకేకరూపంబు; । ఏ మున్న [6]వచ్చితి నెఱిఁగి ర." మ్మనినఁ:

## అర్జునుఁడు తనకు రణసహాయునిగాఁ గృష్ణు నెన్నుకొనుట

"గవ్వడిఁ దొలుత నేఁ గన్నారఁ గంటి; । నివ్వల నినుఁగంటి; [7]నీవుఁ దా మొదల
వచ్చుటఁజేసి [8]భావ్యము నిరువురకు । వచ్చి తోడొనరింప వలయుట నాకు.
పదివేవు రుద్దండబలులు [9]యాదవులు । విదితశస్త్రాస్త్రులు విపుల సాహసులు
నారాయణాఖ్యులు ననుఁబోలువారు । ధీరు లేతెంతురు ధృతరాష్ట్రతనయ!
యే యాయుధములేక యేనొంటి వత్తు; । ధీయుక్తి నీ రెండు తెఱఁగులయందు
నడుగుఁ డెయ్యదియిష్ట; మడుగు[10]చో బాలుఁ । డడరి మున్నడుగుట[11]కర్హుండు గాన
హరినందనుండు మున్నడుగుఁగా." కనుచు । హరిపల్క నరుఁడు[12]దా హరినేరుకొనియె.
[13]అందుకు తోషించి యాధార్తరాష్ట్రుఁ । డొందిన[14]వేడ్కఁ దా నున్న పాల్గొనుచు
బలుఁ గానఁబోయి యబ్బలునిఁ దోడునకుఁ । బిలిచిన, నతఁడు[15]ను బృథివీశుఁ జూచి:
"వినవయ్య పెండ్లికి విరటుఁడు మమ్ముఁ । బనివడి పిలువ నుపప్లావ్యపురికిఁ
బోయిలి మచ్చోటఁ బుట్టె నీవార్త; । లాయెడ నీపక్షమాడితి నెఱుఁగ.
ఆపల్క హరికిఁ బథ్యము గాకయున్న । భూపాల, యేనును బుద్ధిలో నపుడు
కురురాజసూనులఁ గొనియాడనేల! । గరుడాంకుచిత్త మీఁగతి నొవ్వనేల!
ఈ యుద్ధమున నన్ను నెవ్వారు తోడు । సేయఁ [16]బిల్చినఁ దోడు సేయఁ బొమ్మనుచు
నున్నాఁడ." ననిన దుర్యోధనుఁ డతనిఁ । జెన్నార వీడ్కొని శీఘ్రుంబె పోయి
కృతవర్మఁ గాంచినఁ, గృతవర్మ యతని । నతిభక్తిఁ బూజించి యంజలి చేసి,
"కొనివత్తు నీకు నక్షోహిణిసేన । యనిసేయఁ దో." డని యనిచిన, నతఁడు

1, 2. గాంచె. 3. వచ్చినా. 4. కు. 5. మేముఁ బాండవులును మీకొక్కరూపు. 6. వచ్చుట. 7. నిప్పుడా. 8. భావ్యము నిరువురకు. 9. గోపకులు. 10. డు. 11. హర్షంబు. 12. నా. 13. అందు సంతోషించి. 14. లెక్క. 15. తల్. 16. కేరినఁ బోకసేయ.

కరిపురి [1]కరిగె. నిక్కడ [2]నంత శౌరి । దరహాస [3]మిగురొత్త ధవళాక్షుఁ జూచి:
"నారాయణాభిధానముఁ[4]గొన్న గోవ । వీరులఁ గురురాజు [5] వేఁగోరి పడసె.
నీకేల రణముమానిననన్నుఁ బిలువఁ? । జేకొని పని తప్పఁ[6]జేసితి." వనిన
అమరేంద్ర[7]సూనుఁ డిట్లను: "నీవు శస్త్ర । విముఖుఁడవై యుంటు విధము నాకోర్కి;
ఈవు పోరాడిన నిలఁ [8]బ్రసిద్ధుఁడవు । కావున విజయవిఖ్యాతి నిన్నొందు;
అనిమొన సూతకృత్యము నీవు నాకు । నొవరింతు[9]నంటి మున్నొక[10]నాఁడు కృష్ణ!
అది మఱువకు చాలు; నాజిలో నీకు । [11]నెదుర నిల్వరు గాన నిశ్లేరుకొంటి."
[12]నన నొడఁబడియు నా నరు నాదరించి । మనమున సంతోషమగ్నుఁ గావించి
భావికార్యము మఱి భావించి తెలిసి । గోవిందుఁ డస్త్రసంకుల రథంబెక్కి
శైనేయసహితుఁడై చనుదెంచి ధర్మ । సూనునిఁ గలసె నాక్షోణీశుఁ [13]డలర.

### దుర్యోధనుఁడు శల్యుని దనకు రణసహాయునిగాఁ గోరుట

అంతఁ బాండవదూత లరుదెంచి పిలువ । నెంతయు సేన మద్రేశుఁడు గూడి
యనుదిన యాత్రల నరుదెంచు వార్త । విని కౌరవుఁడు మంత్రివితతిఁ బుత్తెంచి
మద్రభూవిభుఁ డేఁగు మార్గమధ్యమున । భద్రేభశాలలుఁ బఱపైన యిండ్లుఁ
గొలువుకూటంబులుఁ గూపదీర్ఘికలుఁ । గలవు బియ్యము నెయ్యి కాయగూరలును
గడ్డిగవణము లాదిగా విడిదలల । నొడ్డిన, శల్యుఁ డయ్యుద్యోగమునకు
సంతసిల్లుచు నాత్మ సచివులఁ బలికె: । "ఇంత సంతసచేసె నెవ్వఁడు నాకు?
కౌంతేయసచివుండు గానేర్చు నతని । నెంతయు మన్నింతు నిటఁ బిల్వుఁ" డనిన
నచ్చోటి కట మున్న యాసుయోధనుఁడు । వచ్చి పల్లాయనవువారిలోఁ దాఁగి
యున్నాఁడు గాన శల్యుని పలుకులకు । మిన్నంది యతని కమ్మొయిఁ బొడసూపె.
శల్యుఁ డచ్చెరువంది సంప్రీతి వెలయఁ । [14]గల్యాంశభవు గ్రుచ్చి కౌఁగిటఁజేర్చి:
"నీ యత్న[15]మేగాక నిఖిలంబు నధిప! । నా యెడ [16]నింతేల నడపితి భక్తి?
అదిగాన మెచ్చితి నడుగుము వరము । వదిలంబుగా." నన్నఁ బార్థివుండలరి:
"పక్షము మా యందుఁ బాండవులందు । వీక్షింప నీకొక్కవిధము మద్రేశ!

1. కేఁగె. 2. శౌరి వేడ్క. 3. వదనుఁడై. 4. తోటి. 5. వెయినోచి. 6. జేసితె యనిన. 7. తనయు. 8. బ్రబు. 9. వంటి. 10. మాటం. 11. నెదుట. 12. —నిని యొడఁబడు నరు నాదరించి । గోవిందుఁ డస్త్ర. 13. డంత. 14. కల్యసంభవు. 15. ములు. 16. ఇంతేల నసుబంధు పనుల.

కావున నాకు సంగ్రామ మధ్యమున । నీవు సహాయమై నిఖిల సైన్యముల
నడపుట [1]యీగిగా నాకు ని." మ్మనిన । నొడఁబడి యతఁడు దుర్యోధనుఁ జూచి:
"నను మున్న వీక్షించినాఁడవు గాన । నని నీకుఁ దోడురా నర్హంబు నాకు;
వచ్చెద నిపు[2]డేఁగు వనవాస కృశుల । నచ్చోటఁ బార్థుల నరసి రావలయు."

శల్యుఁడు పాండవులఁ జూడఁ బోవుట

అని యట్లు [3]రారాజు ననిపి శల్యుండు । పొనర నుపప్లావ్య పురవరంబునకు
నరు[4]గఁగా, నెదురేఁగి యతనిఁ దోడ్తెచ్చి । సిరి పెంపుమెఱయఁ బూజించి పాండవులు
సేమంబులడుగ నా క్షితిపతివారి । సేమంబు [5]లడిగి విచిత్రవస్తువుల
నుపదగాఁ బెట్టి యనూన సహస్ర । తపనీయ [6]మణులట్లు తగనొప్ప నిచ్చి
యందు ధర్మజుఁజూచి యత్యాదరమున: । "నిందు వంశేంద్ర, నీ హితశాంతి యొప్పు;
[7]బాగతి యిడుమ లోపక యెవ్వరెంత । వేగిరించినఁ బూన్కి విడువలేవైతి.
అడరి బలాఢ్యులై యల్పులతోడ । నొడఁబాటు నడపువారున్నారె తలఁచు?
మేలైనబుద్ధి నేమిట మోసపోక । పాలడుగు పనికి నేర్పడితివి చాలు.
ఇల ధర్మపరులకు [8]నెట్టి యాపదలు । నిలువలేవనుమాట నిక్కంబు సువ్వె!"
అని పల్కి వెండియు నతఁడు రారాజు । తనుఁ బిల్వవచ్చి ప్రార్థనసేయు విధముఁ
దానియ్యకొనిన చందముఁ జెప్ప ధర్మ । సూనుఁ డాతనిఁ జూచి సుముఖుఁడై పలికె:
"సంచిత [9]మతి మిమ్ము సాధించి మున్న । గాంచె నాతఁడు మీరు గాదనరాదు;
విచ్చేయుదురు గాక; వినుఁడు మీకేను । జెచ్చెర నొకమాట చెప్పంగ [10]వలయు.
శౌరి కటాక్షించి శక్రసూనునకు । సారథ్య మొనరింపఁ జాలియున్నాఁడు;
ఎనయ నర్జుని [11]తోడి యీసునఁ గర్ణుఁ । డని సేయఁ గడఁగుచో నతని తేరునకు
హరిఁబోలు సారథి యచ్చోట లేమిఁ । గురురాజు నిన్నియ్య కొలుపు నిప్పనికి;
విను మియ్యకొని యుద్ధవేళ నకర్ణు । మనసు నొవ్వఁగ నీవు మాటాడవలయు.
పగవఁ బాండవ పక్ష[12]పాతంబు మీకుఁ । దగని కార్యముగాదు ధర్మంబ యిదియు."
అనిన శల్యుఁడు [13]పల్కు: "నట్లు రారాజు । నను సూతకృత్యంబునకుఁ బంపునేని
కర్ణ కఠోర వాక్యములఁ గయ్యమునఁ । గర్ణుచిత్తము నీరుగాఁ జేయువాఁడ.

---

1. వరము. 2. డేఁగి. 3. నాగాంకు. 4. దార. 5. లును నడిగి చిత్రవస్తువులు । నుపమఁ దాఁ దెచ్చిన యొల్లవస్తువులు(?). 6. కోటులు. 7. బాగైన. 8. నెలమి నా. 9. గతి. 10. వలసె. 11. తోటి. 12. వ్రతమైన. 13. పల్కె నపుడు.

ఏయఁ జేయాడక యేనాడు మాట । నా యెడఁ గలఁగుచో నర్జునాస్త్రములఁ
గర్ణహీనతఁ బొంది కౌరవసేన । [1]మరునాఁడు మొగ [2]విచ్చి మఱిరాదు పాఱు—,
కొలువులోపల నాఁడు కోపించి వాఁడు । పలుమాఱు మిమ్ము దుర్భాష [3]దూషించె;
ఆ పగ నేఁదీర్తు; నకట [4]మీ బోఁటి । కీ పాటి మేలైనఁ నేఁజేయఁ దగదె ?
ఈ పాటు వాటిల్లె నెట్లొకో ? యనుచు । నో పాండుపుత్త్రి,[5] నీవుఱక చింతిలకు;
తొల్లి శచీదేవితోఁ గూడ వజ్రి । యెల్ల వేల్పులుఁజూడ నేపాటు వడఁడు ?
అతఁడు వృత్రునిఁ [6]జంపి యా తరువాత । హితశక్తి నేలఁడే యీ జగత్త్రియము ?
వెరవొప్ప మీరును విమతు మర్దించి । ధర యేలఁ గల." రన్న ధర్మరా జలరి :
" మామ, వచ్చితిగాదె మమ్ము ని ట్లరయ ! । నేమింక ధన్యుల మెల్లచందముల.
ఎనసిన చుట్టాల నీక్షింపకున్న । జనులకు దుఃఖోపశమన మెక్కడిది ? "
అనుచు మజ్జన భోజనాదుల నతని । కనయంబుఁ బ్రియము సేయఁగ మద్రపతియు
యమసూతి వీడ్కొని యా ప్రొద్దె కదలి । క్రమమొప్ప నేతెంచెఁ గరిపురంబునకు.

## పాండవులకు బాసటగాఁ బార్థివు లేతెంచుట

దూతలు మఱియు నిందును నందు వెడలి । భూతలాధిపుల నేర్పునఁ బిల్చుచోటఁ
బాండవులకుఁ దోడు పాంచాలపతులు । నిండార నక్షోహిణికిఁ గూడి చనిరి.
ధృష్టకేతుఁడు చేదిదేశంబురాజు । ధృష్ట మక్షోహిణి దెచ్చె సైన్యంబు.
సహదేవుఁ డా జరాసంధనందనుఁడు । [7]నిహతారి యక్షోహిణికిఁ దెచ్చె సేన.
కృతమతి నేవురు కేకయాధిపులు । అతులసైన్యముఁ దెచ్చి రక్షోహిణికిని.
మఱి [8]పార్వతీయుండు మత్స్యనాయకుఁడు । నెఱయ నేకాక్షోహిణికిఁ గూడి రందు.
హరివెంట మున్ను సాత్యకి దెచ్చు సేన । నిరతి నేకాక్షోహిణికిఁ దోడుసూపె.
అంతటఁ బాండ్యదేశాధీశు సేన । యెంతయుఁ గలిగె నేకాక్షోహిణికిని.

## కౌరవులకు రణసహాయులై రాజు లేతెంచుట

అక్కడ కృతవర్మ యహికేతనునకు । నొక్క యక్షోహిణి నొప్పారఁ దెచ్చె.
ఎనయ మాహిష్మతి నేలు నీలుండు । కొనివచ్చె నొక్క యక్షోహిణి యందు.

---

1. 'మర్నాఁడు' అని కవి యుద్దేశమేమో. 2. మిచ్చి మఱి వారు రారు (మూ). 3. భాషించె. 4. యిచ్చోట । నీపాటి మేలును । ఇటు సేయఁదగదె. 5. క యుఱక. 6. జంపె. 7. నిహతరా ; నిహితాహి న (?) (మూ). 8. పార్వతేయుండు (మూ).

భూరి దానవదైత్య భూతభేతాళ । కై (రాతసైన్య సంఘములు తన్ గొలువ)
నక్షోహిణికిఁ గూడి యట భగదత్తుఁ । డాక్షోణికిని వచ్చె నసురాధిరాజు.
భూరిశ్రవసు బలంబును శల్యుబలము । నారయఁ గలిగె నేకాక్షోహిణికిని.
సౌవీరు లిక్ష్వాకుసైన్య సంసేవ్య (?) । లా వేళఁ గలిగి రేకాక్షోహిణికిని.
విందానువిందులు విభు లన్నదమ్ము । లందంద తెచ్చి రేకాక్షోహిణికిని.
నిరతి నేకాక్షోహిణికి సేనగూడి । యరిగి రవంతీశు లక్కురిపురికి.
మఱియు నానాదేశ మనుజేంద్రసేన । నెఱిఁగల్గె నక్షోహిణీత్రయంబునకు.
ఎనయఁ [1]గౌరవ పాండవేయుల కిట్లు । ఘనసప్తసంఖ్య యేకాదశసంఖ్య
యక్షోహిణులుగూడె నాహవోత్సాహ । దీక్షగైకొని శస్త్రదీప్తులు మెఱయ.

## ద్రుపదపురోహితుఁడు దూతయై కరిపురి కరుగుట

అటమున్న పాంచాలుఁ డనిపిన దూత । పటు[2]లీలఁ గౌరవపట్టణంబునకుఁ
దగువిధంబునఁ బోయి ధార్తరాష్ట్రులకుఁ । దగువారి యెదుర నాస్థానమధ్యమున
భువిఁ బాండవులు సేమమున నున్న తెఱఁగు, । తవిలి [3]పాలడుగంగఁ దనుబంపు తెఱఁగు,
నడిగిన నిచ్చుట యర్హమౌ తెఱఁగుఁ, । గడు శౌరి వారికిఁ గలిగిన తెఱఁగు
మృదురీతిఁ జెప్పిన మిన్నేటితనయుఁ । డది కార్యమగునని యతనిఁ గీర్తించి
"అడిగించుకొనుట కార్యమె కౌరవునకు? । తడయక యాపాండుతనయులఁ బిలిచి
[4]యుచితపూజల వారి యుల్లంబువట్టి । [5]సుచిర భూభాగ మిచ్చుట మేలుగాక.
అదియునుగాక [6]తా నా ద్యూతవేళ । నదయుఁడై పాంచాలి నప్పాటుపఱచె;
గావించె నటమున్న కడు నగ్నిభయము; । పావని కూటిలో[7]పల విషంబొలికె;
[8]వానినే ద్రోయించె వడి గంగనీట; । [9]నానీతి నెగ్గు సేయుని దినంబేది?
అనదలగతి వార లన్నియు నోర్చి । చనుదెంచి రడవులు చాలించి నేఁడు.
దొనఁగు[10]లు వన్నినఁ దూఁగునె యింక? । నసమాక్షునైన వా రాజిఁ గైకొనరు.
పోరాడఁ దొడఁగిన భూజనక్షయము; । మీరుచేసిన[11]పోరు మిథ్య గాదింక.
జూదమాడిన తప్పు [12]సోఁకుటఁ జేసి । యాదట నరుఁ డప్పు డన్నకన్నెఱిఁగి

---

1. బాండవ కౌరవులకును నిట్లు. 2. గతి. 3. పాలడిగిన తలఁపైన తెఱఁగు; పాలడుగఁ దన్ననిచిన తెఱఁగు(?). 4. యురుపూజలను. 5. సురుచిరభాగ్య. 6. నాఁడా. 7. బస. 8. వారి. 9. నారీతి నెగ్గుగా నని. 10. లన్నియుఁ బడ. 11. వారు. 12. బొందుటఁజేసి.

కసలనొల్లకమానెఁ [1] గాక యేపాటి । కినిసినఁ ద్రిజగంబు గెలుచు నాక్షణమె.”
అనవిని కోపాగ్ని యంగాధిరాజు । కనుఁగొన నిగురొత్త గాంగేయుఁజూచి :
“తగవేది మీరు జూదము జూదమనుచుఁ । దగిలి దుర్యోధనుఁ దప్పనాడెదరు;
[2] గెలువరె యెవ్వారు! గెలిచె [3] నీతండు; । ఇల నెవ్వరును నోడరే! యోడె[4]నతఁడు;
అజ్ఞాత[5]చర్యలో నదియేమి నరుఁడు । సుజ్ఞాని తాఁ బొడసూపె నందఱకు!
ఇది తప్పుగా నేల యెన్నవునీవు? । పోదివి [6]పాలికినైనఁ బూనితి.” వనిన,
[7] తలఁగుండి యుండక తగువారి యెదురఁ । బలికెదు సూతసంభవ, సిగ్గుపడవు.
నాఁ డిందఱను గెల్చె నరుఁడు బాణముల । నేఁడు గెల్చెదు [8]వాని నీవు మాటలను.
గోవుల విడిపింపఁగోరి పార్థుండు । వేవేగ వచ్చుచో వేవురు వినఁగ
[9]వారలు సమయ సంవత్సరంబెల్లఁ । [10]బూరించిరంటిఁ దప్పునె యింక?” ననుచు
గాంగేయుఁ డాడుచోఁ గౌరవుతండ్రి । యంగాధిరాజువాక్యము నిరసించి
[11]యిలదేవువాక్యంబు లెలమిఁ బాటించి : । “తలపోయ నీమాట తథ్యంబు విప్ర!
పొమ్ము నీవును మాకు బుద్ధిచెప్పితివి; । నెమ్మదిఁ బిలిచి మన్నింతుఁ బాండవులఁ;
బుత్తెంతు నచటికి బుద్ధిజ్ఞు నొకని; । ఇత్తెఱంగెఱిఁగింపుమీవు[12]ము.” న్ననుచు
ననిచినఁ బోయి బ్రాహ్మణుఁడు పార్థులకు । వినిపించె వైచిత్రవీర్యు వాక్యములు.

## సంజయు రాయబారము

ఇట నాంబికేయుండు హితులును దాను । జటులారి[13]విజయు సంజయుని రా[14]వించి
యతని కిట్లను: “సంజయా, నీవు తీవ్ర । గతి నుపప్లావ్యంబు కడకేఁగి యందుఁ
దనయులఁ బాండవోత్తముల దర్శించి । [15]మనము లూఱడ మంచిమాటలు పల్కి—
‘మీయున్న క్షేమంబు మీతండ్రి[16]యడుగ । ధీయుక్తి [17]నన్ను బుత్తెంచె[18]నిం’ దనుము;
‘ఉఱక మీరడవుల నున్నకోపంబు । మఱవుఁడు ధృతరాష్ట్రుమన్నించి’ యనుము;
‘కౌరవుఁ డెఱుఁగఁడు గణుతింపఁ బాప । మేరీతి నట వంశహిత[19]మెన్న’ మనుము;
ఇల యేను భాగించి యిత్తు వారలకు । నెలమి సోదరుభాగ మీ వ్రేఁగు గాదు;

---

1. గాని. 2. గెలుతురె. 3. నే యతఁడు. 4. నితఁడు. 5. చరితలో. 6. వానికి. 7. తలగుండ్రి గుండ్రక; తలగుద్ది గుద్దక. 8. మమ్ము. 9. వారల. 10. బూరించె నంటి; బూరించి రనుట. 11. బలదేవు వాక్యంబు పాటించి పలికె. 12. మున్నెఱిఁగి. 13. జయుని. 14. బనిచి. 15. మన మూఱడఁగ. 16. యడిగి. 17. నిందు. 18. నన్ననుము. 19. మెన్నఁడనుము(?).

నామాటుగా [1]నందు ననిపెద [2]నిన్ను । నేమాట్కి నటఁ ద్రిప్ప మిప్పటిరణము ;
తేరెక్కి పో." మ్మని తెలుఁగొప్పఁ జనుప । నారూఢవేగుఁడై యతఁ డేఁగుదెంచి
ఘనులు పాండవులున్న కటకంబు సొచ్చి । వనజనాభుని యింటివాఁకిట నిలిచి
తనరాక యెఱిఁగించి తగఁజొచ్చి యింద్ర । తనయు సమ్మతి నందు దైత్యారిఁగాంచి
ప్రియముతో నాతఁ [3]డిప్పించు సత్క్రియలు । భయభక్తిఁ గైకొని భాషించి వెడలి
యమసూతి కొలువులో నవసరం బెఱిఁగి । సముచితంబుగఁ గాంచి సంభ్రమం బొప్ప,
నాతత సాష్టాంగమగు మ్రొక్కు మ్రొక్క । నాతఁ డా సంజయు నత్యాదరమునఁ
దన[4]యొద్ద నాసనస్థానుఁ జేయుటయు । జననాథుఁ జూచి యంజలిచేసి యతఁడు :
"అయ్య ధర్మజ, వినవయ్య మాయయ్య । యియ్యెడ మాయున్కి యెఱిఁగి మోదించి
తనయులకును మీకు ద్రౌపది సతికి । ననుజన్ములకునైన యా సేమ మడుగఁ
బొమ్మని యిదె నన్నుఁ బుత్తెంచె." ననిన । సమ్మోదమున నయ్యజాతశత్రుండు :
"ఆ మహారాజు మమ్మరయించుకతన । సేమ మెప్పుడు మాకు సిద్ధించియుండు ;
నటమీఁద నీవిట నరుదెంచినాఁడ । విటమీఁద సేమంబు [5]లెప్పుడు మాకు.
ధృతరాష్ట్రుఁ[6]డిపుడు ధాత్రికి మేలు[7] సేయ । సుతులుఁ[8]బౌత్రులుఁ దాను సుఖమున్న[9]వాఁడె?
గురుభీష్మ కృపులకు గురుతనూజునకుఁ । జిరపుణ్య తనులకు సేమమే చెపుమ ?
ఏము వెట్టిన వృత్తులెలమి మార్పడక । భూమిదేవత[10]లకు భోగింపఁ [11]గలదె ?
పొరుగురాజులు మన భూము [12]లాత్తంగ । [13]నరునిఁ దలంతురే నా సహోదరుని ?
ఊఱటమైఁ గర్ణుఁ డున్నాఁడె యిపుడు । రారాజు [14]కోపాగ్ని రాఁజఁ బెట్టుచును ?
రారాజు ఘోషయాత్రావేళఁ దగిలి । యేరీతి విడివడె నిది దలంపుదురె ?
[15]తాచి సుశర్మ[16]యుఁ దండతండముల । గోచయమును బట్టి కురురాజు [17]తాను
వీచిన చేతికి వెయ్యేఁడు లనుచు । నేచి యూరక [18]వచ్చి రిది తలంపుదురె ?
వినుము సంజయ, వైరివీరు లీ పార్థుఁ । జెనకి నిల్వఁగలేరు సిద్ధ మింతయును."
అనిన ధర్మజునకు నా సంజయుండు । వినుమని వినయంబు వెలయ నిట్లనియె :
"సచ్చరిత్రులు దుష్టచరితులు సములు । నచ్చోట నున్నవా రది చెప్ప నేల ?

1. నిన్ను. 2. నంద. 3. డర్పించు. 4. యొద్దనే స్థాయి దగఁ జేయుటయును. 5. లెవ్వరు. 6. డెపుడు. 7. తెలయ. 8. నాప్తులు దాను. 9. వారె. 10. లును. 11. గలరె. 12. లొత్తుటయు. 13. మరలింత ... మా ... సహోదరులు. 14. కోపంబు. 15. తాను. 16. యుద్దండ. 17. తొన్న. 18. వచ్చె నిది.

అందఱ వాక్రుచ్చి యడిగితి గానఁ । బొందుగనిట వారు భూరిసౌఖ్యములు
కురురాజు నేరఁడు కోపంబె కాని । ధరణీశ, మీకు నెంతయుఁ గీడుచేసె.
అతనికి హితవాక్య మాంబికేయుండు । ధృతినొత్తి చెప్పక [1]తెచ్చె నింతయును ;
ఆ యుపేక్షాదోష మట్లుండ నిమ్ము । నీ యోర్పువలన నన్నియు నొప్పివచ్చె.
పూతాత్ములైన విప్రుల వృత్తి మాన్సు । పాతకులున్నారె! భయమంద వలదు ;
పరభూమి విభులకుఁ బలుమాఱు పిఱిగి । నరపతుల్ భయమున నరుఁ దలంపుదురు ;
కరిపురిజనులు నీ కరుణ కీర్తించి । కురురాజు నేరమిఁ గుత్సింతు రెపుడు ;
నరనాథ, గోగ్రహణము నాఁటనుండి । కురురాజు లజ్జించు గోవుఁ జూచినను ;
ధృతరాష్ట్రుఁ డిపుడు మీ [2]యెడఁ బొందుగోరి । యతిశాంత చేతస్కుఁడై యున్నవాఁడు.
ఇట నన్ను బనుపుచో నేమని చెప్పఁ । దటుకున నరదంబుఁ దానె పన్నించె.
నీతిమూర్తి విగాన నీవు నీ కొలఁది । నాతని [3]పనులెల్ల నంగీకరింతు ;
మడుగుఁ బుట్టంబున మసిపోలె నతని । కొడుకు మీ కులమునఁ గుటిలుఁడై పుట్టె.
ఆ వెఱ్ఱిబిడ్డఁ డేమైపోయెనేమి । నీ వింక మనములో నిగ్రహం [4]బూది
సమర సన్నాహంబు చాలింపవలయు ; । సమరంబు భూజనక్షయ కారణంబు.
ఈ సరోరుహనాభుఁ డీ భీమసేనుఁ । డీ సవ్యసాచి [5]యు నీ విరాటుండు
సాత్యకి మొదలుగా సంగ్రామ భీమ । నిత్యప్రతాపులు నీకు నున్నారు.
వీరు లా వీటను విను మింతలేసి । వారలు [6]గలరు సత్త్వమున గర్వమున ;
లక్షల సంఖ్యఁ గూల్పక వీరుదెగరు ; । రక్షింపఁ [7]దగదె భూప్రజల నీ వారి?
ఎడపక [8]నీ వింక నెవ్వరినైన । నడిగి చూడు[9]ము పథ్యమనరు యుద్ధంబు."
అనిన నవ్వుచుఁ బల్కె యమతనూభవుఁడు: । "వినుమేల కయ్యంబు వేడ్కయె మాకు?
తిరమైన సంధి[10]చెందినఁ జాలుఁగాక. । కురుకుమా[11]రులు మేముఁ గూడియుండెదము ;
అడవికి [12]మముఁ ను నుపాయమునఁ బొమ్మనిన । గొడవగానీ కేము గూడిపోయినను
బేదవారని యడ్డ పెట్టించుఁగాక । యాదరించునె సంజయా, యింక నతఁడు ?
తనయులా వెఱ్ఱిగి[13]యుఁ దండ్రి తానేల । [14]యనునయాలాపంబులాడి పుత్తెంచె ?
జూదమాడిననాఁడు సుతుని దుర్ణయము । కాదన వెఱచు [15]నీ కార్యంబు వినునె ?

1. చేసె నింతేసి. 2. దెస మేలుగోరు. 3. చనవెల్ల. 4. బేది; బుడిగి. 5. నేఁడీ. 6. న్నారు.
7. గదవె యోరాజవరేణ్య. 8. మీ రింక. 9. డు, తథ్య మనరు; వధ్యమనిరి. 10. చేఁ దిరిగిన. 11. ల.
12. మము నపా. 13. యా. 14. యనయనా (?). 15. సెక్కడిమాట తనకు.

గణన కెక్కుడు సేనగలవాఁడ ననుచు । రణమేల మానుఁ గౌరవుఁడు సంజయుఁడ?
నరుఁడు గాండీవమున నారి యెక్కిడినఁ । గరమున భీముండు గదఁ బుచ్చుకొనినఁ
గినుకఁ గృష్ణునికంటఁ గెంపుసొంపైనఁ । దనసేన యెక్కుడు తా నె[1]ఱిఁగెడిని.
గురుభీష్మ-కృపకర్ణ [2]గురుకుమారకులఁ । దరమిడి గెలువ సాత్యకి తానె చాలు;
సమరంబులోన సంజయ, వారు మేము । సమసత్త్వు ల[3]నెడి పక్షపుమాట విడువు.
వావిరిఁ దల[4]మోచి వచ్చితి గాన । నీవు చెప్పినమాట నేము గాదనము;
మగు[5]డ నూరికిఁబోయి మమ్ము [6]రప్పింపు; । జగతిలో [7]సాఁబాలు సరసనిప్పిం[8]పు;
అరయ నింద్రప్రస్థమైన వేఱొక్క । పురమైన మాకుఁ గాఁపురమున కొసఁగ
వారల నియమింపు వచ్చెద." మనిన । ఆ రాజుఁ జూచి యిట్లనియె సంజయుఁడు :
"కరుణ[9]యే సొమ్ముగాఁ గలవాఁడవగుటఁ । జిరపుణ్య, యొకమాట చెప్పెద [10]వినుము.
వేవిధంబుల బుద్ధి వివరింప వినక । యా వృథాహంకారు లధికలోభమునఁ
[11]జెనఁటులై పోలిక చెడఁదలంచినను । వినుము నీవును హింస విడిచి శాంతతను
భిక్షాటనంబైనఁ బృథివిపైఁ జేసి । కుక్షిపూరణ[12]మాత్ర గొనియుండుటొప్పు.
రాశి కెక్కినయట్టి రాజసూయంబు । చేసి విశ్వహితంబు [13]చేసిన నీవు
కౌరవు లొనరించు కలుషంబు లోర్చి । పోరా[14]డ నొల్లక పుణ్యచిత్తమున
మెలఁగుచుండితి వింక మేదినికొఱకుఁ । గుల బాంధవులఁ జంపి గురుహింస దలఁచి
యిల [15]యేలఁ బూనిన నేమి మే!" లనిన, । పలికె నించుక నవ్వి పాండవాగ్రజుఁడు:
"ధర్మంబు[16]వలె నుండు ధర నధర్మంబు; । ధర్మేతరముఁ [17]బోలు ధరను ధర్మంబు:
ఈ పని నా మీఁద నీ వధర్మంబు । [18]మోపి దూఱుదుగాని మునుముట్ట వినుము
కులకంటకులఁ [19]బోని కుటిల వర్తనులఁ । బొలియింపకుండుట భువి ధర్మహాని;
తనవాఁడు వీఁడుగదా యనరాదు; । ఘనవైరివధ మాకుఁ గలుగుఁ బుణ్యంబు.
సకల ధర్మాధర్మసారంబు మాకుఁ । బ్రకటింపఁ గలఁ[20]డిదె పద్మనాభుండు."
అనిన [21]సంజయుఁజూచి హరి యిట్టులనియె : । "విను నాకు నొకరూపు వీరును వారు;
నీయట్ల నేనును నృపులయుద్ధంబు । మాయఁ ద్రోయువిధంబు [22]పన్నుచుండుదును.

1. తెల్పెడిని. 2. కురు. 3. నట. 4. పఁగ. 5. డియు. 6. రప్పించి. 7. సగఁ బాలు. 8. చి. 9. యుద్ధము గాఁగ (?). 10. నిపుడు. 11. చెనఁటిరై యిటు వినక. 12. మింత గొని యూడ్చు. 13. చేయుచు. 14. ట. 15. బూనుటయు నేల. 16. వలికిన. 17. బోలెఁ దనర. 18. మోపఁ బోదురు. 19. లోన. 20. డెందు. 21. గృష్ణుఁడు పల్కెనటు సంజయునకు. 22. పనుపు.

ధర్మజు[1]మాటచందము వింటె! సమర । కర్మంబుగాని చక్కటి గానరాదు;
కుటిలుఁడు రారాజు గుణిగామిఁ జేసి । [2]యటుగాన నిశవికి సంశయంబు రాదు;
[3]నేయుంబుగలిగి మానిన [4]మహానేఁగాక । యీయన పాలిక యేల పోవిడుచు?
వైరులగెలువక వచ్చునే పనులు । పూరి వేఁడినమాడ్కి భూమి వేఁడినను?
కురురాజు చేసిన క్రూరకర్మంబు । దురము[5]చేసినఁగాని దొరయు[6]దేమిటను;
అంచిత[7]గతి జూదమాడుఁ గాకేమి । పాంచాలిఁ బఱచినపాటు సన్నంబె?
శత్రుఁ డెగ్గొనరించి జగతిపై నుండ । క్షత్రియులకుఁ [8]జేత శస్త్ర మెన్నటికి?
అలుగనోడిరిగాక యప్పుడు భీష్మాదు । లలిగి కౌరవరాజు నదలింపఁ[9]దగదె?
కోడలు వాపోవఁ గురురాజుతండ్రి । వేడుకఁ [10]దా నెట్లు వినుచూరకుండె?
హెచ్చిన మఱఁదిచే [11]సీద్పులువడిన । చిచ్చున నాయింతి [12]చిమడుచో నవ్వి
'విడిచిరి నిను [13]వీరు వేఱొక్కమగనిఁ । దడవి[14]కో' మ్మనిన రాధాసుతుమాట
వేళ్లువాఱెడుఁగాక విను సంధి గలదె? । నీళ్లను సమలక నీవింకఁ బొమ్ము.
ఇట్టుగదాయని యే నుపేక్షింపఁ । బుట్టింతు నుపశాంతి [15]బుద్ధిఁ బార్థులకు.
మొగి లోకసంహారమూలంబులైన । జగడంబు లివి యేను జక్కఁబెట్టెదను.
వీరికి నామాట వినకపోరాదు; । వారు విందురుగాని వాదింపరంత.
కదలివచ్చెద నెల్లి కరిపురంబునకు । నిది వారి కెఱిఁగింపు[16]మీవు మున్నేఁగి."
[17]అనిన సంజయుఁడంత యమసూతిఁజూచి : । "అనఘాత్మ, సంధికి [18]హరి తానెచాలె;
వచ్చిన[19]పనియు సర్వమునయ్యెఁ; బోయి । వచ్చెదఁ; బుత్తెమ్ము వనజాక్షు నెల్లి;
యేనాఁడు మాటల నేమైనఁ గొంత । కానిచందము లేదు[20]గా చెప్పు." మనినఁ
బతిపల్కు: "నక్లేల పలికెద వీవు? । హితముచెప్పితి మాకు [21]నెనఁగదుగాని;
దనరారు క్షత్త్రియధర్మ మిట్లుండె; । వినుమింక నీవేగి విభుఁగాంచి మ్రొక్కి
యతనికి భీష్ముల కాచార్యకృపుల । కితర[22]వంద్యులకు నేమెఱఁగుట చెప్పి
సోదరులైన దుర్యోధనాదులకు । నాదట నేమమే నడుగుట [23]చెప్పి
గొంతికి మేము మ్రొక్కుట [24]విన్నవించి । యంత నిట్లని పల్కు మాంబికేయునకు

---

1. ఁడాడుమాటలు. 2. యటుగామి; యటుగాన. 3. నెయ్యంబుగలిగి. 4. మానుఁగాని. 5. చేయుట. 6. ఁడే. 7. మతి. 8. జేతి శస్త్రంబు లేల. 9. దగఁడె. 10. నాఁడైన వినుచె సాధైన; దానట్లు వినుచుచు నుండె. 11. నిట్టూల. 12. చిమము. 13. మగల్. 14. పొమ్మనిన. 15. పుట్టి. 16. మిప్పుడే పోయి. 17. అన సంజయుఁడు హరిని. 18. నరుదెంచి యేను. 19. పనులు. 20. గావింపు. 21. నెసలదు. 22. బందులకు. 23. చెప్పు. 24. విదురునకు । నెంతయు నిటఁబల్కు(?).

వారికిఁ బాండుభూ[1]పతి పరోక్షమున । ధారుణి [2]పాలిచ్చి తద్ద మన్నించి
సేవగొంటివి నాఁటి చిత్తంబు [3]నింత । నీవు [4]వోఁద్రెంచుట నీతిగా దనుము ;
సొలయక [5]యంత భీష్ములతోడ నీవు । 'కులము నీచేఁగాదె కొనసాఁగె నట్లు !
అంత యత్నముచేసి యఖిలకౌరవుల । సంతతులను నిల్పఁ జాల మే' లనుము ;
విదురు నశ్వత్థామ వెండియు నచటఁ । గుదురైన నృపుల మా కుశలోక్తి పలికి
వెండియు [6]రారాజు వీక్షించి 'నీవు । పాండుసూనుల [7]కేల పగవాఁడవైతి ?
గరళాన్నమిడుటయుఁ గల్లజూదంబు । విరచించుటయు నూరువెడలఁద్రోచుటయు
సతినట్లు సభ నుల్లసంబులాడుటయు । మతినోర్చి వచ్చె ధర్మజుఁడు గాఁబట్టి ;
ధరణి[8]భాగంబిమ్ము ధర్మరాజునకుఁ ; । గురుకుమారుల[9]ద్రుంగికొనకు యుద్ధమున.
అతఁడును రణమేల యనుచునున్నాఁడు ; । హితమతి [10]నీవంత యీనోపవేని
భూరి కుశస్థలంబును వృకస్థలము । వారణా[11]వతమును వాసంతిపురము
[12]నేనుపురంబుల కివి నాలుగయ్యె । నేనవపుర మింక నేమైనఁ జాలు
నొసఁగుము వారికి నుండ నేగురకు ; । [13]నొసఁగ వారలును సంధింతు రిట్లైన.
సేన పెక్కువ [14]గని చేకొనఁడేని । మానెఁ గయ్యముమేలు [15]మాకింతకంటె."
అన విని యతఁడు : "దేవా, యెల్లతెఱఁగు । వినిపింతు వారికి విశదంబుగాఁగ ;
మీతండ్రి [16]మీకు నెమ్మియి-మేలుసేయు । నా తెఱంగెఱిఁగింతు నరిగెద." ననిన
భుజియించి మఱికదా పోవుట యనుచు । విజయునిఁ బనిచి [17]భూవిభుఁ డాదరమున
నతని భోజన మజ్జనాది సత్కార । యుతుఁజేసి యనిచె [18]నెయ్యురు సంతసింప.
అంత సంజయుఁడు సాయంకాలమునకు । నెంతయు వెసనేగి యిభపురిఁ జొచ్చి
యవనీశు వాకిట నరదంబు డిగ్గి । యవసరంబునఁ బోయి యాతనిఁ గాంచి
ధరఁ జాఁగి మ్రొక్కుచో, ధరణీశుఁ డతనిఁ । గరమర్థి నుచిత సత్కారపూర్వముగ
మన్నింప నంజలి మౌళిపైఁ జేర్చి । కన్నుల నల్కలొల్కఁగఁ బల్కె నతఁడు: (?)
"క్షితినాథ, నీయాజ్ఞ శీలించి ధర్మ । సుతుని సోదరయుక్తుఁ జూచి వచ్చితిని ;
సుఖమున్నవాఁడు ; నీ సుఖములు నడిగె ; । నిఖిలబంధులు చూడ నీకుఁ గేల్మొగిచె ;

---

1. పరు. 2. పాలించి. 3. హత్తు. 4. పొందించుట. 5. ద్రోణ. 6. కురు. 7. కెల్ల. 8. పాలడుగుము. 9. జంపు. 10. నా. 11. వతి. 12. నను పురంబుల కివి యెనయ నాలయ్యె । నెనయ నేనవపుర మేమైన. 13. నొసఁగ వారును సంధి యిత్తు(ంతు) రిట్లనుము. 14. నిది ; దీని. 15. మన. 16. మాకు(?). 17. యా. 18. నందఱు(?).

నీ నందనులనగ్గె; [1] నృపతుల నడిగె ; । నానావిధంబుల నన్నుఁ బూజించె ;
శానలనుండినగతి [2] గానరాదు । భానుభాసురమూర్తిఁ బరఁగుచున్నాఁడు.
అతఁడు [3] నీమీఁదఁ బుణ్యాపుణ్యభరము । చతురతమోపి నిశ్చలమానసమున
మానుషబలము నమ్మక దైవబలముఁ । బూని ధర్మోపాయమునఁ గీర్తి [4]వడయు
నున్నాఁడు; నీకైన నురగకేతనుని । యెన్నికగాని మీఁ దెఱుగ వేమియును.
ఉడుగని తిట్టుపాటోర్చి పాపమున । కొడిగట్టి [5]చెడిపోవనున్నాఁడ వకట!
పరికింపఁ గర్ణ సౌబల సుయోధనుల । దొరపాటివారని [6]దుర్మతి నీవు
వెసఁ బాండుపుత్త్రుల వెడలఁ ద్రోచితివి ; । వసుమతి [7]నిష్కారవముగాదె యనుచుఁ
గదనమొల్లక వారు కడుశాంతులైన । నది నీకు వెఱచుటయై తోఁచె నపుడు.
చలము మానుము గాక సాఁచు రేఁగినను । దలపోలంబున నైనఁ దలఁచు నే నిలువ?
చెనఁటి జూదమునాఁటి చిచ్చార్ప నీకుఁ । జనదె? యేలాగు సజ్జనుఁడవౌ కాక.
అనమున నేఁటికి నలసివచ్చితిని । వసుధేశ, యిది యెంత వలసినఁ గలదు.
పొద్దు తానెంతయుఁ బోయె, నేనెల్లి । ప్రొద్దున నాస్థానమున నిన్నుఁ గదిసి
వినిపింతు నచ్చటి వృత్తాంత[8]మెల్ల. । అన విని జనపతి యతని వీడ్కొలిపి
చిత్తంబు గంపింప శీఘ్రంబ విదురు । నుత్తముఁ [9]బిలిపించి యొక యేకతమున
నాతని నిజపీఠి నాసీనుఁ జేసి । కాతరభావంబు గానరాఁ బలికె :
" వినుము సంజయుఁ బాండవేయులఁ జూడఁ । జనుమంటి ; నతఁడు నచ్చటికేఁగి వచ్చి
యింతసేపును నన్ను నిచ్చ[10]నోనాడి । వింతమాటలు రేపు వివరింతు ననుచుఁ
[11]బోయె ; నప్పటినుండి బుద్ధిలో నాకుఁ । బాయదు భీతి యేర్పడ నిద్రరాదు
నిన్నేను బిలువఁ[12]బన్నితి దీని." కనిన । [13]నన్నరాధిపుఁ బల్క నతఁడు నిర్భీతి :
"ధనముగోల్పడిన యాతఁడు [14]కాముకుండు । ఘనమైన ప్రముచ్చును గానఁడు నిద్ర.
ఈవు మువ్వురిలోన నెవ్వఁడే నొకఁడు । [15]కావుగదా నిద్ర గాన వేనియును?
ఇది నాకుఁ దొలుత [16]సెవెఱిఁగింపు." మనిన । విదురువాక్యము బుద్ధి వేధింప నతఁడు :

---

1. నెయ్యంబు లలర. 2. గాదు భాను । భానునిదీప్తుల. 3. మీ. 4. వడసి । యున్నాఁడు.
5. వాపోవ. 6. దుర్నీతి. 7. నిష్కారణమ్ముగా నింక. 8. మనిన । జనపతి యపుడు సంజయుని
వీడ్కొలిపి । చిత్తంబు. 9. రప్పించి యొక్క చిత్తమున. 10. పోనాడి. 11. బోయి.
12. బుత్తెంచితి. 13. నన్నృపాలుఁడు పల్క నపుడు. 14. దోగి. భువిని । ఘనుఁడు ప్రముచ్చిలువాఁడు
గానఁడు నిద్ర. 15. కావున దా నిద్ర గానఁడు యేమి (?). 16. గా.

“ కౌంతేయు మాటలగతి విన్న[1]దనుకఁ । జింతాజ్వరంబునఁ జెదరుచున్నాఁడ ;
ఏమని విందునో యెల్లి నే విదుర ! । నా మది భయము మానఁగఁ జేయు.” మనిన

## విదురుఁడు ధృతరాష్ట్రునకు హితోపదేశము సేయుట

విదురుఁడిట్లను : “ నీకు వెఱవ నేమిటికి ? । అదయ వాక్యముఁ [2]బల్కఁడా ధర్మరాజు ;
మతిలోన మీకు నేమమె గోరుగాని ; । అతఁడిట్టిచోటికి నహితుఁడు గాఁడు.
[3]కాకుండు గతిచూచి కాదె [4]వారలకు । నీ కుమారులు నీవు నికృతి [5]చేసితిరి ;
ఇప్పుడేమి[6]టఁ దప్పె ? [7]నెల్లి పాండవుల । రప్పించి భాగమీరాదె రాజ్యమున ?
అకట [8]నిక్కము తండ్రివని నిన్ను నమ్మి । యొక విచారము [9]నొందకున్నారువారు;
పారుష్యమున [10]దున్న పక్వంబు నన్న । చేరదొకో యన్న చింత నీ.” కన్నఁ (?)
గటకటఁబడి యంబికా తనూభవుఁడు : । “ పటుబుద్ధి నీవు రేపాడి నా యెదుర
సూతజు మాటలుచొప్పు మున్నెఱిఁగి । యా తెఱఁగున నొవ్వనాడుదు [11]గాని
యీ వేళ [12]మందు నా హృదయతాపంబు । నీ వాక్యజలముల నియమింపు.” మనిన
నీతి యిట్లని చెప్పె నృపునకు నతఁడు : । “ పాతక విముఖత పరమార్థ నీతి ;
ఏలికయును వేల్పు నిలఁ గులస్త్రీలుఁ । దా లెస్సవారైనఁ దగ ఫలింపుదురు ;
కోపంబు పాపరిబు కుటిలభావంబుఁ । జాపలత్వము దుష్టజన లక్షణములు ;
వడిఁ దన్ను నొల్లనివానిఁ జేపట్టి । కడుఁ గూర్చువాని దగ్గఱ [13] నీఁడు ఖలుఁడు ;
ధన వయో వంశ విద్యల నుత్తముండు । వినయాఢ్యుఁడగు ; [14]పీన విపరీతుఁ [15]డుబ్బు.
ఘనబాణనిహతి యొక్కనిఁ గూల్చుఁ గాని । విను నీతి దెగటార్చు వినుత[16]కోటులను ;
నీతిలావునఁ గాదె [17]నృపులు భూవలయ । మాతంకములు లేక యరయుచున్నారు ;
పోఁడిగా నొకటి [18]చొప్పను రెంటి దెలిసి । మూఁడు నాల్గును వశ్యములుగా నొనర్చి
క్రీడైన యేనింటి గెలిచి యా తెఱఁగి । యేడొల్ల [19]కుండురా జిల యేలనేర్చు.
పొనరఁ బల్వురు నిద్రపోవుచోఁ ద్రోవఁ । జనుచోటఁ గార్యవిచారంబు చోట
మొగి మధురాహారములు గొనుచోటఁ । దగవుగా [20]దొంటి నెంతటి [21]వానికైన.

1. దాఁక. 2. లొల్ల. 3. కాకున్న. 4. యీతనికి. 5. చేసెదరు. 6. యు 7. సెల్ల. 8. నిక్కమె.
9. నొల్ల. 10. ధర్మపంకమున నున్న (?). 11. గాక. 12. విదుర. 13. నుండఁ గలఁడు (?).
14. దీన; విను. 15. డగును (?). 16. రిపుకోట్ల. 17. నిఖిల. 18. చొప్పన రెండు. 19. కున్న.
20. దుండు టె. అధ్యాహార్యము. 21. జారి.

సత్యశౌచంబులు శాంతియుఁ గృపయు । నిత్యంబుఁ గలరాజు నేరఁడు చెడఁగ.
[1]చెల్లియు సైరణసేయు నయోగ్యుర్వు । నెల్లెడఁ బేదయై యీ నేర్పు [2]నరిది.
చలమును జూదంబు సంభాషణంబుఁ । జెలిమియు నధముతోఁ జేయరుత్తములు.
తను దానె పొగడుట తగనిచ్చి వగపు । మనసు నొచ్చెడి[3]పల్కు మహినోజగాదు.
పాత్రత్రయంబు నపాత్ర వర్జనము । ధాత్రి విత్తము గలదానికి ఫలము.
కొంచెమైనను బంచి [4]కుడుచును బుధుఁడు । వంచింపనేరఁడు వైరి వేఁడినను.
బహుదుఃఖమోర్చు నల్పపు సుఖంబునకు । మహి[5]నిట్టి నీతి ధర్మజునకుఁ గలదు.
అట్టి ధర్మజుఁ బోవనడఁచి పాపంబు । గట్టుకొంటివి నీతి కథ [6]యిఁక నేల ?
కాకంబు పికములఁ [7]గడు వేడ్కఁ బెనిచి । చేకొని మఱి చంపఁ జింతించు పగిదిఁ
దమ్ముని తనయుల దయ నీవె పెనిచి । యిమ్మాడ్కిఁ జెఱుప [8]నూహించుట తగునె?
క్షితిమీఁద నీ మాట చెల్లుచు[9]నుండ । హితముపల్కవు నిన్ను నేమందు." ననిన
నా మాట [10]వెడవెడ నాలించి మఱియు । భూమీశ్వరుఁడు లోభబుద్ధి నిట్లనియె :
"హితకాముఁడవు నాకు నీవు పాండవుల । మతము నెఱుంగుదు [11]మంత్రిధౌరేయ !
హితవు నాకెయ్యది యెఱిఁగింపు." మనిన । నతఁడు వివేకించి యారాజుఁ [12]బలికె :
"క్షితి నీవె యేలఁజూచెదు వెఱ్ఱిరాజ ! । సుతుల నొల్లవుగాక సుఖదమే యదియు?
మీనంబు గాల మామిషకాంక్ష మ్రింగఁ । బూనిన విధము నీబుద్ధిచందంబు.
కానున్న మరణంబుఁ గానని [13]నీచు । పూనిక నీవును భోగేచ్ఛ పేర్మిఁ
దలఁపవు పాండునందనుల పౌరుషము । నలి నుడు [14]ములికిన నడుఁకునె బడియు?"
అన విని మఱుమాట [15]యతఁ డాడలేక । మనమున భీతుఁడై మఱియు నిట్లనియె :
"విదుర, నీమాటలు విన నాకుఁ గొంత । హృదయతాపముమానె ; నిటమీఁద నీవ
యనయంబు నయమునెయ్యది నాకుఁ దెలియ । వినిపింపు." మనుటయు విని విదురుండు
దోరగాయలు దిన్నఁ దొలుత విత్త్రొ[16]దవ । నేరదు చవిలేదు నీతియు నట్లు.
అలులు [17]పూవుల తేనియల లీలఁ గ్రోలు । మెలవు కార్యములందు మేలు రాజులకు.
ఒరులకునైన యభ్యుదయంబు చూచి । పరితాపమును బొందుఁ బాపాత్ముఁ డెందు.
ఎదిరికిఁ దనకును హితమైనమాట । యొదవకుండిన నూఱకుం[18]డుట మేలు.

---

1. చెల్లినచోఁ బాఁడి. 2. నెరవి. 3. నులుకు. 4. కుడుతు రుత్తములు. 5. నిది. 6. నీకు. 7. గని. 8 నూహించెదు. 9. నుండు. 10. లటవేడ. 11. మంత్రిశధుర్య. 12. ,కనియె. 13. మనుజు. 14. షుడఁచిన నణఁగునె బడియ. 15. ఉత. 16. నర. 17. పూవులు లీలశాలయంగ. 18. డిన,

ధరణి సంభాషణ తారతమ్యతల । నరునకు వచ్చు నున్నతియు హీనతయు.
ప్రల్లదంబులు [1]పల్కి పాపయిగాదె । త్రెళ్లె నన్నహుషుండు దేవేంద్రుఁడయ్యు.
పరశుఖండితశాఖ పరఁగునోగాని । పరఁగదు కార్యంబు పలుకుచేఁ దెగిన.
నాటిన మేనిబాణముఁ బుచ్చవచ్చు । మాట [2] నోనాటిన నుఱి పుచ్చరాదు.
అక్కట! యంత[3]వాఁడయ్యు ధర్మజుఁడు । స్రుక్కఁగ నెపుడు నిష్ఠురభాషిగాఁడు.
ఊఱకయుఁ [4]గోపింతు రుర్విపైఁ [5]గొఱత । నుఱియలు నీపుత్త్రు లుగ్రభాషణులు;
ఏల యాధర్మజు [6] నీవు గానీవు? । మీలోన నతఁడు ధార్మికుఁ డనఁబరఁగు.
ఒకటి చందనమైన నున్న వృక్షములుఁ । [7] బ్రకటిత పరిమళాస్పదములు గాదె!
ఏడుదీవులు గిట్టి యేలిన నేమి । పాఁడి దప్పనివాఁడె పరమధార్మికుఁడు;
అందుఁ గీర్తిజనించు నాకీర్తి భూమి । నెందాఁక నందాఁక నింద్రభోగంబు.
తనవాఁడు పెఱవాఁడు తగవువచ్చినను । జనులకుఁ దగదు పక్షపుమాటలాడ.
పాపికిఁ బాపంబు పథ్యమైయుండు । నేపార సుకృతికి హితము పుణ్యంబు.
అనఘాత్మ, నీతి సాహస భృత్యగతుల । మనువార లుత్తమ మధ్యమాధములు.
తన్ను రక్షించిన దాతపైఁ గపట । మెన్నువారికిఁ గల్గ విహపరోన్నతులు.
ఏకారణములేక హిత మితరులకుఁ । జేకొని కావించు సృష్టి నుత్తముఁడు;
[7]ఇతరుఁడు చేసిన హిత మాత్మఁదలఁచి । ప్రతిహిత[8]మాత్ర మేర్పఱచు మధ్యముఁడు;
తగ మేలునకు మేలు దాఁ జేయ[9]కయును । మగిడి కీడొనరించు మనుజాధముండు.
ఇందఱిగుణముల నెఱిఁగి [10]వర్తింప । విందువంశాధీశ, యేమనఁ[11]గలదు?
సొరిది మేలును గీడు సుఖము దుఃఖంబు । నరుఁదేర నెట్లొకో యని చింతవలదు.
విను దీర్ఘచింతఁ బ్రవేశించుఁ దెవులు । మనుజుఁ డాతెవులున మరణంబునొందు.
[12]అలర నింద్రియనిగ్రహమున యోగమునఁ । బొలుచులోభత్యాగమున ముక్తి[13]గలుగు.
జ్ఞాతుల చనవు గోసంఘంబుచనవు । నాతులచనవు నెన్నఁడు మాన్ప[14]రాదు.
ఆతత [15]జ్ఞాతిశూన్యత [16]గలయట్టి । యేతఱి సంసార మెన్న నెక్కడిది?
ఇల నొంటిమ్రాను రాయిడి నొందినట్లు । బలిమి నాపదనొందు బంధుశూన్యుండు;

---

1. పల్కి పాపమై. 2. లోనాటి; నోరాడిన. 3. వాఁడైన. 4. గోల్పోదు. 5. నేల. 6. నకట చందనములౌ నన్నియుఁ జూడ. 7. హితుఁడు చేసిన హిత మిచ్చలో నిలిపి. 8. మాత్రనే. 9. రమచు. 10. వర్తించు । మిందు; వర్తింతు । రిందు. 11. గలరు. 12. అరయ. 13. గలదు. 14. వలయు. 15. జ్ఞాన. 16. గలుగున.

కావున నీ[1]యొద్దఁ గాంతేయులున్న । భావింప నెట్టి దైన్యభయ[2]ములు లేవు.
మీకు వారలు ప్రాపు ; మీప్రాపు వారు । చేకొని యునికి నిశ్చింతంబు సువ్వె.
ద్రుపదుఁడు పాండుపుత్త్రులు [3]విరాటాది । నృపతులు లీన్నృపతులు నీతనూభవులు
నిర్వైరమునఁ[4]గూడి నిన్ను సేవింప । పార్థివ భాగ్యము గల్గు నన్నదా నీకు ?
నీకుఁజెప్పెడి నీతి నీటిపై వ్రాఁత ; । యేకార్య [5]మెట్లు గానిచ్చు నీసుతుఁడు ?
లోఁగి నీయాజ్ఞకు లోనుగాకున్నఁ । జాఁగొట్టరాదె దుశ్శాసనాగ్రజుని.
సుతుఁడని వర్జింపఁ జొరవు కౌరవుని । నితరుఁడె [6]వర్జింప నిట్లు ధర్మజుఁడు ?
నారీతి వెఱవక నయమేర్పరింప । నీరాజ్యమున నెవ్వఁ డెఱుఁగవుగాక.
తనర దేహికిఁ జావు తథ్యంబుగానఁ । దనయుని విడుమంటిఁ దప్పుగాఁ గొనకు ;
[7]ఇల యథోచితభాగ మీలేకయున్నఁ । దలఁపునఁ గలపాటి ధర్మజుఁ గూర్పు."
అన విని ధృతరాష్ట్రుఁ : "డట్లచేసెదను । జనలోకహితనీతి సచివ, నీనీతి.
శాంతి నెంతయు నొందదె సంతాపభరము । నింతట [8]నధ్యాత్మమెఱిఁగింపు [9]కొంత."
అనిన : "నేశూద్రుఁడ నది చెప్ప వెఱతు । వినిపింపఁదగు వేదవేత్త నీకదియు.
నరనాథ, నీకు సనత్సుజాతుండు । పరమయోగీంద్రుండు పటుకృపాబుద్ధి
తలఁచిన [10]వచ్చి యంతయుఁ జెప్పు నతనిఁ । దలఁపవే." యనిన నాతఁడు భక్తి[11]నిలిచి
ముకుళితహస్తుఁడై మునినాథుఁ దలఁపఁ । బ్రకట నిత్యానంద పరవశుఁ డగుచు
నిదిసుఖ మిదిదుఃఖ మిదిపర మపర । మిది [12]మిథ్యయను [13]నీమ లిన్నియు మఱచి
అష్టాంగ యోగ విద్యాగుచ్ఛ మనఁగ । వేష్టిత[14]జటలతో వేవచ్చి యతఁడు
పూజించి యాసనంబునఁ దన్ను నిడిన । రాజుకిట్లనె మనోరథ మాత్మఁ [15]దలఁచి :

## సనత్సుజాతుండు ధృతరాష్ట్రున కధ్యాత్మతత్త్వ మెఱిఁగించుట

"అధ్యాత్మవిద్య నీ వడిగెదు నన్ను । బోధ్యుఁడ వనవచ్చు భూపాల, నిన్ను (?)
వెలుపల మరగిన విషయవైభవము । లలి లోననిడక నిల్వదు తత్త్వచింత.
భోగకాల (?) వివేకములఁ బోవుఁగాని । భోగింప భోగేచ్ఛ పోనేరదెపుడు.

1. వద్ద. 2. మును లేదు. 3. విరాటుండు. 4. జేరి. 5. మెట్టు. 6. పాండవుఁ డిట్లు.
7. మెలయఁ దోఁచిన ... వారికున్న. 8. నద్వైత. 9. మనిన । నెనయ శూద్రుఁడఁ గాన నే.
10. వచ్చు నెంతయును నీవతనిఁ । దలఁపుము. 11. లేచి. 12. విత్తమను. 13. నీతు.
14. జటలతో విమలుఁడై నిలువ. 15. నిలిపి.

విడువక యాత్మ వివేక నేత్రమునఁ । బొడగాంచు యోగికిఁ బొడమునె మాయ ?
మాయలోనుండియు మాయా విదూర । మై యున్న తత్త్వంబు నరిదియె మెఱుఁగ?
క్షితిప, యా తత్త్వ మచింత్య మవ్యక్త । మతిగోచరము (?) సచ్చిదానందమయము.
నిత్యమైయుండి యనిత్యంబుఁ బోలు ; । సత్యమైయుండి యసత్యంబుఁ బోలు ;
అట మృతంబును బోలె నమృతమై యుండు । ... ... ... ...
కొదలేక దెలియునే గురుకృప లేక. । ... ... ... ... ...
సందేహములగని చలనంబు పుట్ట । పొందైన దృష్టాంతములకు దూరంబు
ఆశ్చర్యముల పోక యాగమహృదయ । నిశ్చితం బది కాననేర్తురె యొరులు ?
సర్వతోధికమును సర్వకారణము । సర్వాంతరాళ నిశ్చయ [1]మది." యనుచు (?)
నుతరహస్యంబు లనుగ్రహింపంగఁ । బతియు [2]నూఁకొనుచుండెఁ బలపల [3]వేగె.
మాయాంధకారంబు మాని వాక్యము[4]లఁ । బోయిన నృపునకు బోధ సూర్యుండు
ఉదయిం[5]చె ననఁగ సూర్యోదయంబయ్యె. । విదురమానీంద్రుల విభుఁ డర్థి ననిచి
స్నాన [6]సంధ్యాధ్యాన జపయజ్ఞహోమ । [7]దాన సూర్యోపాస్తి దైవార్చనములు
క్రమ[8]మునఁ దీర్చి శృంగారించి వెడలి । కొమరొప్పఁ దన పెద్ద కొలువుకూటమున
సుతులుఁ బ్రధానులుఁ జుట్టాలు భటులు । హితులుఁ బురోహితు లితర భూపతులుఁ
గొలువఁ గొల్వున్నచోఁ, గోమలాభరణ । సలలితాకృతి[9]యయి సంజయుఁ [10]డేఁగి
యుచితాసనంబున నుండి భీష్మాది । సచివులఁ గనుఁగొని సరవి నందఱను
అలవడ సేమంబు[11]లడుగ ధర్మజుఁడు । పలుక నేమించిన పలుకులు [12]చెప్పి,
యా భక్తి యా రక్తి యా కుశలోక్తి । యా భంగి నృపసోదరాలి కేర్పఱుప,
రాగిల్లి నృపుఁడు : "ధర్మజుఁ జెప్పనేల ! । యా గరుడాంకుఁ డేమని చెప్పియనిచె ?
అతని మఱంది యేమనియె నర్జునుఁడు ? । హిత[13]చింత మామీఁద నెంత వారలకు ?
ఏవేళ వా రుండ నేఁగితి వీవు ? । [14]బావుగా నాకు నేర్పఱతుగా." కనిన

## సంజయుఁడు రాయబార విశేషములు ధృతరాష్ట్రున కెఱిఁగించుట

ఆ సంజయుఁడు పల్కు : "నధిప, నే మొదల । భాసురగతి నుపప్లావ్యంబు చొచ్చి
గరుడ కీలితమైన ఘనతోరణమునఁ । గర[15]మొప్పు హరి గృహాంగణసీమ [16]నిలిచి

1. బుద్ధి. 2. ను గొనుచుండ. 3. వేగ. 4. న. 5. చి నట్లు. 6. యత్న విధాన. 7. ధ్యాన. 8. మొప్ప. 9. వచ్చె. 10. డెతేఁగి. 11. లడిగి. 12. చెప్ప. 13. భక్తి. 14. బాగుగా. 15. మొప్ప. 16. గదిసి.

హరి కేను వచ్చితినని చెప్పి యనుప । హరి యర్జునుఁడుఁ దాను సపుడు ద్రౌపదియు
సత్యభామయు రహస్యమున నుండియును । భృత్యుఁడఁ గాన నన్ బిలిపించె నధిప !
పిలిపించుటయు నేను భీతిఁ గంచుకముఁ । దలపాగయును బూని తగ నేఁగునపుడు
తానున్న శయ్య నింద్రజుఁ డున్నవాఁడు । తేనుండి (?) తాఁ దన దివ్యపాదములు
నరుని యూరులఁ జాచినాఁడు ; నారులును । ధరణిపై నున్నారు తగిన పీఠముల.
అంత నేఁబోయి సాష్టాంగంబు లెఱఁగ । నెంతయుఁ బ్రియముతో నిందు రమ్మనుచుఁ
బంకజాక్షుఁడు తన పాదపీఠంబు । పంకజాక్షుల చేతఁ బట్టి తెప్పించి
నాకుఁ బెట్టించిన నరనాథ, యేను । గైకొన్నవాఁడనై కరమందు మోపి
ధరను గూర్చుండి యిద్దఱను గన్గొంటి । వరున నేమనిచెప్ప వారి తేజములు !
చూడ్కికి వ్రేఁగైన సురమునిద్వయము । వేడ్కఁజూచిన నాకు వెడలె బాష్పములు.
అంతటి రణధుర్యులాజ్ఞ పాలింప । నంతకాత్మ[1]జున కవజ్ఞ యెక్కడిది ?
విను మట్లు నను గారవించి యా కృష్ణు । లోనరంగఁ దా రుపయోగించునట్టి
యన్నపానములు నా కర్థిఁ బెట్టించి । సన్నుత వస్త్రభూషణము లిప్పించి
కూరిమి నిచ్చోటి కుశలంబులడుగ । వారక యే నవి వారి కేర్పఱచి
పోయిన పనియుఁ జెప్పుటయు, గాండీవి । యామెడఁ గోపింప నతని వారించి
హరి నన్ను నిట్లనె: “ నక్కట ! తగునె । కురురాజు ధర్మజుఁ గోపింపఁ జేసె ;
ధాత్రిపై నింక శాంతముగాదు ధర్మ । పుత్రుకోపము నీటఁ బుట్టిన చిచ్చు ;
నాకు మాన్పఁగరాదు ; నాకు వారలకు । నే కాలముననైన నెడయదు మైత్రి.
కురువంశజుల నీవు కొలువులోఁ గాంచి । హరి చెప్పి పుత్తెంచె ననుచు నిట్లనుము :
ఇష్టదైవముఁ గొల్వఁడింత యేమఱక । శిష్టవర్తన [2]గొం డరిష్టశాంతికిని ;
చెలులఁ [3] జుట్టముల నాశ్రితుల రప్పించి । వలసినవారికి [4]వలసిన విందు ;
సభయులై విప్రభోజనములు [5]పెట్టుఁ । డిభపురి జనులకు నిలుచూరలిందు ;
ఏనేమి గోరుదు రెల్ల కోరికలు । నేమించి [6]సలుపుఁడు నేఁట [7]నెల్లిటను.
అది యేమికారణం బనిన నేనింకఁ । గదనంబులోఁ దేరు గడప గాండీవి
కురుకులం బావహుతి గొననున్నవాఁడు ; । హరుఁడడ్డ [8] మైనఁ బోదని చెప్పుమనియె.

---

1. జాఁడున కాజ్ఞ (?). 2. దొడ్డు; గొండు శిష్ట. 3. జుట్టాల. 4. వలసినట్లుండ. 5. పెట్టి । యిభ.
6. పలుకుఁడు. 7. రేపటను. 8. పడిన.

అంత గాండీవి యిట్లని చెప్పుమనియె: । "ఎంతచేసియు మీకు నేము శత్రులము;
కానల[1]వర్తించుకాలంబు ధర్మ । సూనుఁడు భూశయ్య [2]సోలి నిద్రించె.
ఆ కౌరవుల ధాత్రి నణఁచినఁ గాక । [3]యీక్రోధ మూఱక యేలాగు మాను?
ఇంతటనైనఁ బాలీఁడు కౌరవుఁడు; । శాంతి [4]రాజ్యంబేల శత్రురాజిచ్చు!
పేర్మిఁ బ్రతాప[5]పాగ్ని పేర్చినఁ గాక । ధర్మజు మీసుయోధనుఁడు గైకొనునె?
భీమగదాఘాతభీతికిఁ గాక । సామవార్తకు నేల శత్రుండు [6]వఁగు?
వినుము మహామారి విశ్వజీవముల । తినువులుగొన్న చందమున సాత్యకియుఁ,
జిఱు[7]లేళ్లమూఁకఁ జొచ్చిన పెద్దపులుల । తెఱఁగునఁ జెలఁగి మాద్రీ[8]తనూభవులు,
రౌద్రుఁడై దక్షాధ్వరముఁజొచ్చు వీర । భద్రునికరణి సుభద్రసూనుండు
నీరసాటవిమీఁద నిగుడు కాలాగ్ని । నాయూహ్య మొదవఁ బాంచాలిపుత్త్రులును
గురుసేన నేలకుఁ గోలకుఁ [9]దెచ్చు । పరిపాటి మఱిగదా పాలిచ్చు నతఁడు!
పరికింప గాండీవపాణి[10]నై యేను । హరి తేరుగడపఁ [11]గయ్యముచొచ్చి రిపులఁ
గరులనెక్కినవారిఁ గాల్నడవారి । సరదమెక్కినవారి హయములవారి
నిదితల యిదిపాద మిదిబాహుదండ । మిది[12]మొండియంబని యెఱుఁగరాకుండ
వాఁడితూపులఁ జించి[13]వైచినఁ గాని । వాఁడిమి కురురాజు వర్జించువాఁడె?
కాకున్నఁ దనకుఁ గేకయుల పౌరుషము । డాకకాఁడైన ధృష్టద్యుమ్నబలము
విరటునూనులలావు విరట పాంచాలు । శరములు వలయుఁ బ్రశాంతి పుట్టింప.
వనవాసమున నొచ్చి వచ్చిన యేము । మనమారఁ జంపక మానము రిపుల.
ఆవేళ కృపుఁడైన నాచార్యుఁడైన । దేవవ్రతుండైనఁ [14]ద్రెవ్వ వ్రేయుదుము;
అందుఁ బాపమునచ్చె నపకీర్తివచ్చెఁ । బొందైన సిరివచ్చెఁ బోవనీ[15]మనుము.
త్రైలోక్యగురుఁడైన దామోదరుండు । మాలోన [16]నొజ్జయై మమ్ముఁ జేపట్టి
మూఁడుకాలముల 'ధర్మో జయ' [17]తనఁగ । నేఁడు ధర్మజుఁ బొందనేరదె జయము?
సంజయ, నీవింకఁ జయ్యనఁ బోయి । [18]రంజిత్రోక్తులు పూని రాజు రారాజు
ననికి నాయితులైన యఖిల[19]యోధులును । వినునట్టు [20]నావాక్యవిధ మేర్పరింపు'
అనిపల్కి పుత్తెంచె." ననిన భీష్ముండు । తనయుఁ జేర్కొని పిల్చి తా నిట్టులనియె:

---

1. వర్తింపఁగాదె మా. 2. చూరి. 3. నాకోప ముఱక మానఁగ నేల నేర్చు. 4. కార్యంబేల... డార్జించు. 5. పంబు ప్రిదిలిన. 6. వ్రాలు. 7. లేటి. 8. సుతద్వయము. 9. దేను(?). 10. నై. 11. చయ్యన. 12. మొండెమని నిర్ణయింపరాకుండ. 13. వ్రచ్చిన. 14. దెగనె. 15. రనుము. 16. నోజయై. 17. మనఁగ. 18. రంజరోక్తులు. 19. యోధనుల(?). 20. గా.

## కృష్ణార్జునులు నర నారాయణు లని భీష్ముఁ డెఱిఁగించుట

"వినుము మున్నొకనాఁడు వేలుపులెల్లఁ । గనకగర్భునిఁ గొల్వఁగా నందులోన
గురు శాంతనిధుల నిర్వర వ్రేలఁజూపి । సురగురుఁ డా పద్మజునకు నిట్లనియె :
"ఎఱిఁగింపు దేవ, వీరెవ్వ రిర్వురును ? । మెఱుపుఁగొండలు రెండు మెలఁగుచున్నవియొ ?
అతి గర్వ[1]రేఖ నిన్నైన నైనఁ గైకొనరు ; । నుతశాంతి హరుని విష్ణునిఁ బోలువారు ;
చాపాగ్రబాహులు సత్యప్రతాపు । లే పని వెంట వీరెప్పుడు నుండుదురు ?"
అన విని గురున కిట్లని చెప్పె [2]నజుఁడు : । "మునులు వీరలు విశ్వమోహనాకృతులు ;
నరుఁ డతం డాతఁడు నారాయణుండు ; । పరికింప జీవాత్మ పరమాత్మ లల్లు
... ... ... ... ... । ... ... ... ... ...
ధర నధర్మముచేత ధర్మంబు డెగిన । నరస దారది[3]యెల్లఁ జక్కఁబెట్టుదురు ;
బలభేదికొఱకు దోర్బల[4]మున వీరు । బలియురై బహుదైత్యబలముఁ జంపుదురు.
మానవయోనుల మహి జనించియును । దానవతతిఁ ద్రుంచు [5]ధన్యులు వీరు."
అని చెప్పె నట్టి పుణ్యాత్ము లీ శక్ర । తనయుఁడు హరియునై ధరఁ బుట్టి రిపుడు.
నీకుమారులు పాపనిరతులు గాన । నాకిల్బిషము మాన్ప నరుదెంచినారు.
నరుఁడు మహోగ్రదానవుల [6]మర్దించె । నరుల ఘర్దించు నన్యాయుల నింక.
కంసుఁడు మొదలుగాఁగల దురాత్మకులఁ । గంసారి తెగ[7]టార్చె గణుతింపరాదె ?
గ్రహములు గూడినగతి వీరు గూడి । మహి నొక్క రథమెక్క మఱి యెదు రేది ?
కురురాజు కౌరవకుల వినాశంబుఁ । బరి[8]కింపఁ గర్ణ సౌబలులఁ జే[9]పట్టి
శునకపుచ్ఛముఁబట్టి సుర[10]సింధు వీఁదఁ । బెనఁగినగతి [11]మఱి పెనఁగెడి నెదిరి."
అనినఁ గర్ణుఁడు పల్కె నాగ్రహంబెత్తి : । "జనపతి గెలిపింపఁ జాలనే యేను ?
నను నమ్మె నతఁ డేను నమ్మితి నతని ; । నని మోదినపుడుగదా ! మాటలేల ?
నాపస యెఱుఁగకే నను రాజుగాఁగఁ । [12]జేపట్టునే పుణ్యసీమ రారాజు !
వివరింపఁ బౌరుష[13]విధిని నావిధిని । డివురక యొక్కింత దృష్టింపుఁ." డనినఁ
గనుఁగవఁ గెంపార గాంగేయుఁ డలిగి : । "[14]వినుకర్ణ, నీబుద్ధి వీఱిఁడి యయ్యె ;
వివరింప నీవు త్రెళ్ళిన [15]గాలిపడగ ; । పవనీశు [16]లబలులు నై పోయిరేమి ?

---

1. మున నిన్నునైన. 2. బ్రహ్మ. 3. చుట్టి. 4. శక్తి. 5. తగరులు. 6. నిర్జించె. 7. ఁజూచె. 8. కింప. 9. పట్టె. 10. నదియీద. 11. మఱి పెనఁకువ గదలె; వీరు పెనఁగుదురెదిరి. 12. చేపట్టె. 13. విధి నావిధి(?). 14. వినవయ్య నీబుద్ధివిరివి బోవయ్య. 15. గాని వేగు । నవ(?). 16. లవనిసేమై.

వక్రవిక్రమ, [1]సీకు వశితభూచక్ర । శక్రజు[2]నకు నెన్ని చాళ్లుల పెట్టు?
ఆ జిష్ణుచేత నీయనుజుఁ [3]గోల్పడియు । నాజి సన్న్యాస[4]మేలా గొనవీవు?
కౌరవమరణంబుఁ గౌంతేయజయము । నోరి, నీవెఱుఁగ[5]కయున్న యర్థంబె?"
అని విడనాడుచో నంత ద్రోణుండు । జనపతిఁ బలికె విశ్వాసపూర్వముగ:
"పెద్దవాఁడవు నీవు పిన్నబిడ్డలకు । బుద్ధిచెప్పుట మేలు పొందుగానట్లు.
విజయుఁడు గిరివోలు విల్లెక్కువెట్టి । భుజబలోద్దాముఁడై పోరిలోనున్న
మనకు వేయును నింక మాట[6]లేమిటికి? । వినకుండుఁ గర్ణుండు వెడమాటలాడు.
నరకునిఁ జంపుచో నారాయణుండు । సురమూర్తి గెలిచె నక్షోహిణీశతము.
అతఁడు చేపట్టిన యర్జునాదులును । మతి నింత వెఱవరు మఱియుఁ గయ్యముల."
అనుచుఁ బాండవసత్వ మందఱుఁ దెలియ । వినిపింప వినియు వివేకింపలేక
యందఱుఁ గలుషింప నాంబికేయుండు: । ... ... ... ... ...
... ... ... ... ... । "అంబుజోదర పార్థు లట్లు మమ్మనిరె?
యమసూనుఁ డిచటి సైన్యము మిక్కిలియును । దమసేన[7]కోలఁదియుఁ దలపోసియెఱుఁగు.
తానింక నెవ్వరిదర్పంబు నమ్మి । మానక చనుదెంచు మనమీఁద?" ననిన
సంజయుఁ డతని యజ్ఞానవాక్యముల । సంజాతమూర్ఛుఁడై జగతిపై వ్రాలి
యెట్టకేలకుఁ దేరి హృదయంబు వడఁక । నిట్టూర్పునిగుడఁ గన్నీరొల్కఁ బలికె:

## పాండవ బలమును సంజయుఁడు ధృతరాష్ట్రున కెఱిఁగించుట

"[8]తాఁకును దలఁపవు తగ నెట్టి[9]తీరె । రోఁకలి తలఁజుట్టరో [10]యందువీవు;
అందఱు నతివీరులని పాండుసుతుల । నిందాఁక వినియును నిట్లాడఁ దగునె?
ధర సుయోధనునకుఁ దండ్రిగాఁ దగుదు! । నిరతి భ్రమింగుదుగాక నృపకులంబెల్ల.
కానిమ్ము నీదువాక్యముల కుత్తరము । నానేర్చునంత విన్నపము చేసెదను.
పనుగొనఁ దాఁబుట్టి పదియవనాఁడు । జనయిత్రిచే దప్పి చట్రాతఁ బడిన
నది చూర్ణమైపోయె నట్టి వాయుజుఁడు । పదివేల గిరులైనఁ బడఁద్రోచు [11]నేఁడు.

---

1. విన్ను వలయు(?). 2. నిటు నెన్ని చాళులుపెట్టు(?). 3. గోల్పోయి. 4. మే యలవి గైకొనవు.
5. వు ఉడుగు యుద్ధంబు. 6. లిఁక్కేల. 7. కొంచెము. 8. తాఁకినఁ దలఁకవు. 9. దెలిసె.
10. యంటి. 11. నెపుడు.

కొన్నాఁడు బకుని వక్షోవీధి నుసురు । కన్నాఁడు సుతు ఘటోత్కచునంతవాని ;
ఆ భీమసేను [1]బాహాశక్తినమ్మి । శోభితగతి వచ్చెఁ జూవె ధర్మజుఁడు !
కదలింప మోపెట్టఁ గర్ణాంతముదకుఁ । బ్రదరంబు[2]దేరాని పాంచాలువిల్లు
నశ్రమంబున మోపి యస్త్రంబుతోన । విశ్రుత నృపవర్గ విభవంబు గ్రుంచి
వెలయు క్రీడిని లోకవీరుని నమ్మి । తలపడు మనతోడ ధర్మనందనుఁడు.
తావచ్చి రణములో ధనువందికొనిన । నావల గీర్వాణులైన భీతిలఁ[3]గ,
నలిగిన గిరులైన నంభోధులైనఁ । దొలఁగింపఁ గలిగిన దోశ్శక్తిగలిగి
నలువొప్పు నకులుని నమ్మి నీతోడఁ । గలహింపఁ బాండవాగ్రజుఁ డిట వచ్చు.
ధీరత దక్షిణ దిగ్విజయమున । వారాశిదరినుండి వైభవంబొప్పఁ
దన[4]రాక లంకకుఁ [5]దగఁజెప్పి పంపి । ఘనవిభీషణుచేతఁ గప్పంబుగొనిన
యా సహదేవు శౌర్యము నమ్మి సువ్వె । భాసురగతి వచ్చెఁ బాండవాగ్రజుఁడు.
దనుజుల మనుజుల ధర్మదూషకులఁ । దునుమాడి దునుమాడి దురములు లేక
[6]యలుగు చాలించియు నాజిఁ బాండవుల । గెలిపింపఁ[7]బూనిన కృష్ణుని నమ్మి
మనమీఁదఁ గౌరవ మరణదీక్షితుఁడు । చనుదెంచు నెఱుఁగుము శమనసందనుఁడు.
జవనాశ్వము[8]ల నర్ధచంద్రబాణము[9]లఁ । గవచంబు[10]లను వాఁడిగల నారసము[11]లఁ
[12]దేరెక్కుమగ[13]లను దివ్యబాణము[14]ల । వారణంబు[15]ల [16]గద్దవాతితూపులను
బొసఁగించి యెప్పుడెప్పుడు రణంబనుచుఁ । గొసరుచు నిటలాక్షు కొలఁదితోనున్న
సాత్యకి[17]కోపంబు చాపంబు నమ్మి । సత్య[18]మీదెపవచ్చు శమననందనుఁడు.
మఱియు ధృష్టద్యుమ్ను మత్స్యభూపాలుఁ । దెఱఁగొప్ప సౌభద్రు దిక్కుల నృపుల
నమ్మి యాతఁడు వచ్చు ; నరనింద్యులైన । మిమ్మెల్లఁగైకొను మేదినీనాథ ! ”
అన విని భీతుఁడై యాగర్వ మణఁగి । జనపతి గద్గదస్వరముతోఁ బలికె :

## ధృతరాష్ట్రుఁడు పాండవ పరాక్రమమునకు భీతిల్లుట

“ ఉన్నట్ల పలికితి ; యుద్ధమధ్యమున । నెన్నఁ బాండవులకు నెదు రెందుఁగలదు ?
అందఱు నొకతల యాజిలో వాయు । నందనుఁ డొకతల నాకుఁ జూపినను.

1. మహా. 2. దిగ. 3. క(?). 4. రార. 5. దరమి చెప్పించి. 6. యలసి. 7. బోయిన. 8, 9, 10, 11. లు. 12. దే రుక్కు. 13, 14, 15. లు. 16. కడ్డ వాఁడితూపులను. 17. రోషంబు. 18. మిదే.

శౌరి [1]యే నేవెంటఁ గుడిచిన కూడు । నూరుతేఁ దలఁచిన మాయమైపోవు.
అతఁడఁట నరుఁడఁట హరియఁట రిపులు । ధృతరాష్ట్ర[2]తనయు లేగ్నతి నిల్చు[3]వారు?
ద్రుపదు సౌభద్రు [4]మాత్స్యుని ఘటోత్కచుని । నుపపాండవుల నుత్తమౌజు శిఖండి
నృపుల వెండియుఁ గూడి నిశ్శంక వచ్చు । నృపుని ధర్మజుఁ దాఁకనేర్తురే [5]యొరులు?
మాబిడ్డ యెఱుఁగఁడు; మాటలపెద్ద; । సౌబల కర్ణ శిక్షలఁ గుక్షిఁ బెంచు;
పాండునందనులతోఁ బగగొని బ్రదుకు । గూడియ నున్నాఁడు కూడదు గాని;
కుదియక కృప భీష్మ కుంభసంభవుల । నెదురు చేసుకయుండు నెప్పుడు వారలకు.
ఊరక మనలోన నున్న తప్పునకుఁ । బోరిలోఁ దలచూపి పోదురుగాక.
వారికి [6] మనకును [7] వా రొక్కభంగి; । యేరీతిఁ బగదీర్తు [8] రిటువంటివారు?"
అనఁ గౌరవా[9]గ్రజుఁ డాగ్రహవ్యగ్ర । జనితోగ్రభావుఁడై జనకు[10]నీక్షించి:

## దుర్యోధనుఁడు బీరములు వల్కుట

"ఏల చింతించెద వీ దీర్ఘచింత? । ఏల సంజయుమాట కింత లోఁగితివి?
అడవులఁ గూరగాయలఁ బొద్దుపుచ్చి । కెడఁగుడుపడి చిక్కి వికృతాంగులైన
పాండుసూనుల నేఁడు పద్మనాభుండు । భండనంబొనరింపఁ బ్రార్థించి తెచ్చె.
అట్టి కూటువమూఁక కాత్మలో [11]వెఱచి । [12]జట్టిసగంబు రాజ్యమునఁ బాలీను.
జమదగ్ని రామభంజనుఁడు భీష్ముండు, । శమనారి వరలబ్ధ[13]జన్మఁ డీద్రౌణి,
నుతలీలఁ గృపుఁడు ద్రోణుఁడు నయోనిజులు, । చతురుఁ డీకర్ణుండు సహజకుండలుఁడు,
భీమ బాహా[14]గర్వభేది శల్యుండు, । సోమదత్తాదు [15]ల సులభవిక్రములు
కినిసియు వీరొప్పగింతురే నన్ను? । ననుకూల వర్తను లాజిలోపలను.
అటుగాక ప్రజలెల్ల నా వంక చనిన । నిట [16]నొంటిగతిఁదాఁకి యొరుగుదు గాని (?)
తోడఁబడఁ బాండుపుత్త్రుల యడుగులకు । మడుఁగులు [17]పఱచుట మాచేతగాదు.
ఎత్తివచ్చిన వైరి [18]నెల్ల చందములఁ । దుత్తుమురుగఁ [19]జేతు దురములో [20]జెనకి.
అండజధ్వజు పూనిక యయ్యెడునొకటి; । [21]యొండైన నాపూనిక [22]యొదవెడునొకటి;

1. కడుపునిండ. 2. సుతులఁట. 3. వారె. 4. పార్థుని. 5. సుతులు. 6. మాకొక. 7. పగయింత లేమి (లేక). 8. రీ రీతి. 9. ధీశుఁ డాగ్రహోదగ్ర. 10. ని జూచి. 11. వగవ. 12. సట్ట; జట్ట. 13. శమనుండు(?). 14. బల. 15. లు సుభట; లు సులభ. 16. నెద్దిగతి దాని నెతిఁగెద. 17. పఱచంగ. 18. నెన్ని. 19. నేను. 20. జెనక. 21. యొండేను; యొండేల. 22. కీబాధ.

క్షాత్త్రధర్మముఁ [1]బాయఁ జాల నా మీఁదఁ । బుత్త్రమోహము నిల్పి [2]పోగులకునీవు.
మది నేల తలఁకెదు మారుతిఁ దలఁచి? । గదయందు నాపాటి గలఁడె భీముండు?
తగిలి నా గదకు నాతని ప్రాణములకుఁ । దగులైన చందఁబు ధర్మరాజెఱుఁగు.
అది యెఱింగియె గాదె యయిదు గ్రామములు । పదివేలు మాకని పలికి పుత్తెంచె.
నరుఁ డెన్ని దివ్యబాణములు [3]గల్గినను । గురుభీష్మ కృపుల కెక్కుడుగాఁడు వినుము.
ఒసరఁ బార్థునిఁ జంపనోసిన శక్తి । మన కర్ణుచేనుండు మఘవుఁ డిచ్చినది.
అనిలజ పార్థు లాహవమునఁ బడిన । మనల మార్కొన నందు మగవాఁడు లేఁడు.
ఉంకించి నీ పుత్త్రు లొగి [4]ముడ్చి జగము । చంకఁ బెట్టినవారు సరస నూర్వురును."
అని విజృంభించి యిట్లనె సంజయునకు : । "వినుము సంజయ, వారి విధము చూచితివి
శూరత్వ మదినీకుఁ జూడ నెట్లుండు? । ఏరీతిఁ బోరెద? [5]రే సేన ఘనము?
తలఁకికున్నారె యుద్ధము కార్య[6]మునకు? । [7]అలుగక యెఱిఁగింపు." మనినసంజయుఁడు:
"అల్పసైన్యులు గాన నాజికి వెఱచి । యల్పపునేల వారడిగి నా రనుచుఁ
దలఁచెదు వెఱ్ఱి, యా తలఁపులు మాను ; । [8]తలఁకరాజికిఁ గాలు ద్రవ్వుచున్నారు ;
కదనంబు నిజమగు కాంక్ష వారలది । ... ... ... ... ...
సంధి[9]తోఁ దమ ప్రతిజ్ఞలు చెల్లవనుచు । మంధర[10]గతి నుండు [11]మహాధర్మరాజు.
వడముడి తన ప్రభావము చూపఁగోరి । విడువిడు మనుచుండు వేగిరంబునను.
కదనంబు నిజమైన గాండీవధరుఁడు । ముదముతో నార్చిన మూరేఁడు పెరుగు
ఆమంత్రణోత్సవుఁడగు విప్రుపగిది । నా మేటిగాఁడె నిత్యము రణోత్సవుఁడు?
ఎక్కడ రణమబ్బు నేది సందనుచు । నొక్క కాలనె నిల్చియున్నారు కవలు.
వీరు వారననేల విను మెల్లవారుఁ । గౌరవకోటి నొక్కటఁ గూల్పఁ గలరు."
అనినఁ జింతింపక యతఁడు వెండియును : । "అని సేయఁ దమకు నెయ్యవి సాధనములు?
రథము లేగతివి? సారథు లెట్టివారు? । కథ మాని నిక్కంబుగాఁ జెప్పు." మనిన
సూతజుఁ డా పాండుసుతుల శస్త్రాస్త్ర । [12]కేతన హయ రథాకృతు లేర్పఱించి
విరటాది నృపతుల వివిధ సంగ్రామ । పరికరాకృతులెల్లఁ బరఁగ నేర్పఱిచి,
తక్కటి భటుల సాధన విశేషములు । [13]నొక్కటఁ జెప్పుచో నురగాంకుతండ్రి :

1. పీడ. 2. పోరలకు. 3. గల్గియును. 4. మూడ్చి. 5. రీసేన. 6. మైన. 7. అలయక. 8. కలహంబు నిజమగు కాంక్ష వారలది। సంధితో. 9. లో. 10. మతి. 11. మతి. 12. మాతత కేతు రథాదు లేర్పఱిచి. 13. నొక్కడ.

"వినుమా సంజయ, యెల్లవిధముఁ జెప్పితివి ; । మనసేన నిదె మహామహు లున్నవారు;
వీరికిఁ బ్రతియైన వీరులాసేన । వీరు [1]వారనిమాకు వివరింపు." యనిన

## వీరప్రతివీరుల సంజయుఁడు ధృతరాష్ట్రున కెఱిఁగించుట

నా సూతజుఁడు పల్కు : "ననిలజుపాలు । నీ సూనులందఱు నిక్కంబు [2]వినుము ;
అరయ శిఖండిపా లాపగేయుండు ; । పరఁగ ధృష్టద్యుమ్నుపాలు ద్రోణుండు ;
అరుదార నీ పౌత్రు లభిమన్యుపాలు ; । పరికింప ధర్మజుపాలు శల్యుండు ;
సైంధవాశ్వత్థామ శకుని కర్ణాది । బంధుర బలులెల్లఁ బార్థునిపాలు ;
పరికింప నకులునిపా లులూకుండు ; । సరస కాళింగులు సహదేవుపాలు ;
ఎలమిఁ గేకయునిపా లిచటి కేకయులు ; । చలమొప్పఁ గృతవర్మ సాత్యకిపాలు ;
చేకితానునిపాలు క్షితి సోమదత్తుఁ ; । [3]డీక్రొలందుల వార లెన్నుదు రధిప !
ఇదిగాక యేవీరుఁడీ వంకవ్రాలుఁ । జదురున [4]నచ్చటఁ జాలియున్నారు.
తప్పక దీనికిఁ దగిన యత్నంబు । చెప్పఁ డీ." యనిన వైచిత్రవీర్యుండు :
"కరమర్థి నాకు నెక్కుడి పుత్త్రులింక ! । దురములోపల వారిఁ [5]దొడరఁగలారె !
గెలిపింప హరి కర్త, గెలుపు పార్థులది, । వలవని వైరంబు వలదన్న వినరు.
[6]అరయనిబుద్ధి నీ యసమ యుద్ధంబు । [7]దొరఁకొన్న వాఁడెల్ల దుర్యోధనుండు ;
మిగులఁ జెప్పినవారి మీఁద[8]నే యలుగు ; । జగడంబు వలదు సంజయ, యూరకుండు.
ఫాలాక్షురంబులు భవుఁడైనఁ దుడువఁ । జాలఁడు నీవేల సంభ్రమించెదవు ?"
అనునంతఁ దండ్రి కిట్లనియె రారాజు : । "జనులేమి దలఁపరు జయకాంక్ష తండ్రి !
యిన్నియు నిజమైన నేమి గానేర ? । దెన్నుమా మనయోధు లెంతటివారొ !
మిన్ను క్రిందును భూమి మీఁదును జేసి । నిన్నింద్రపదమున నిలుపఁ బంపుదునె !
నిండిన మనసేన నిండినట్లుండఁ । బాండవులను జంపఁ బంపువెట్టుదునె ?
వనరాసులెల్ల రేపట మంటఁ బూన్చి । ఘనపట్టణములందుఁ గట్టఁ బంపుదునె ?
నా పాలి వీరుల నమ్మవుగాక । యేపౌరుషము [9] లేక యేనేల గూర్తు ?

---

1. వారనుచును వివరింపు నాకు. 2. సుమ్ము. 3. సకల సైంధవులు నశ్వత్థామ మఱియుఁ । గర్ణుఁ డర్జునుపాలు కౌరవజనక! । నిర్ణయిం చిటు వారలెన్నుదు రధిప. 4. నెదుర నచ్చటఁ జాలినారు. 5. తోడిచె తారు; తో నిచె తారు (?). 6. అవివేకముద్ర యీ; అవివేకి బుద్ధి నీ. 7. దొరకొన్న; తొవికిన (?). 8. మీఁదలుగు. 9. లైన (?). 10. బాలయ్యో.

మారుతి నాపాలు మఱి వైరులెల్ల । ఘోరాజిఁ గృప భీష్మగురుల పా." లనిన
నా సంజయునిఁ బల్కె నాంబికేయుండు : । " వేసరితిమి వీని [1]వికృతవాక్యముల;
అదిగాన నదియేమి! యమసూతి[2]యొద్దఁ । గదిసి పంతములాడు ఘనుఁ డెవఁ డందు?
అదివిని [3]యేమను నాధర్మరాజు? । వివరింపు." మనుటయు విభుఁజూచి యతఁడు :
" నడరి ధృష్టద్యుమ్నుఁ డప్పటప్పటికిఁ । గడు నుగ్రగతి నిట్లు కలహోక్తులాడు
'నాయోధ గణమెల్ల నాయోధనమున । [4]నాయొడ్డనంబుపై నడతెంచునపుడు
అటుచూడఁ[5]డెన్ని రథ్యములఁ జంపుదు[6]నో! । భటుల నెందఱిఁ బట్టి బలిమిఁ బ్రామెద[7]నో!
యేనుఁగుమొత్తంబు లెన్ని గూల్చెద[8]నో! । [9]సేనాపతుల నెట్లు చెండివైచెదనో!
మును భీష్మగురు నెట్టు[10]ముఱియఁ బ్రామెద[11]నో! । ఘనకిరీటము లెన్ని కలన వ్రాల్చెదనో!'
అనిపల్కఁ బల్కిన యమ[12]సూనుఁ డతని । మనసులోపల మెచ్చి మఱి నన్నుఁ జూచి
'ప్లవగకేతువు పాశుపతము గాండివము । సవరణములై యుండు శక్రసూనునకు;
రణమున మాగెల్పు రారాజెఱుంగు । గుణమునఁ బొలిచ్చి కూడుట మేలు;
వెనుకకుఁ [13]గపటంబు విరచించినాఁడ । ఘను[14]ల వారల[15]నెట్లు[16]కాంతు నావలదు;
కురురాజు తా వృథాకోపంబు మాని । శరణన్నఁ జాలు సంజయ, కాతు నేను;
ఇడుమలఁ బడియు మేమిటు శాంతివలుక । వెడలఁద్రోచిన తారు వీఁగుట తగదు;
పోరాని మోమోటఁ బొత్తులై యున్న । వీరుల నునురుతో వీడ్కొల్పు మనుము.'
అనిచెప్పి పుత్తెంచె నతనివాక్యములఁ । గినుకలే." దనిన నాక్షితిపతి కలఁగి

### సంధి కొడఁబడుమని ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుని బోధించుట

నిట్టూర్పునిగిడించి నిజపుత్త్రుఁ బలికె : । " ఇట్టిది తప్పదు హితమాడె నతఁడు;
పాడైన కర్ణుని భాష లాలించి । కూడిన కుల[17]మేల కూలఁద్రోసెదవు?
చనదు, ధర్మజుతోడి సాఁబాలు [18]నీవు । ననుభవింపఁగఁ[19]గల్గునఖిలపుణ్యములు.
వినుము నావాక్యంబు వినవేని ద్రోహి! । నిను విడుతురుసుమ్ము నృపులు నేఁ." డనిన
జనకున కిట్లను సర్పకేతనుఁడు : । " [20]వినవొల్ల నిందఱు విడిచి[21]పోనిమ్ము;

---

1. వివిధ. 2. వద్ద. 3. నిన్ను నేమనె. 4. నాయోధనములైన (?). 5. డేను. 6, 7, 8. ను. 9. సేనాధిపులనెల్ల చించివైచెదను. 10. ముదిమి(?). 11. ను. 12. సూతి యతని. 13. వారల వివరించినాఁడ (?). 14. డు. 15. కెట్లు. 16. కాదు నా. 17. మెల్ల. 18. నీకు. 19. జాలు. 20. వినుమెల్ల. 21. పొమ్మనిన.

జోడైన యంగరాజునకును నాకు । నోడఁగట్టినదూల ముగ్రాహవమున ;
మేదినీస్థలిలోన మీపాదమాన । సూదిమోపినయంత చోటీను దనకు ;
నేనొండె నతఁడొండె నేలుదు ముర్వి ; । భూనాథ, కారాదు పొత్తుల [1] నేల."
ననిన వెండియుఁ దండ్రి యాత్మజుఁ గినిసి : । "ననునెల్లు నొల్లవు నామాటవినవు
[2] పన్నిన గజపురంబందున్న సేన । తిన్న యట్లునుగాఁగఁ దెగటార్చి పేర్చి
క్రందున నీసేనఁ గారించు పవన । నందనుఁ గనినాయైన నామాట తలఁపు.
తేరుల తుమురు ప్రమందిన [3] కాల్బురగమి । వారణంబులకుప్ప వాజులతిప్ప
[4] ధర త్రోవదెలుప శాత్రవులలో వచ్చు । [5] నరుఁ జూచినపుడైన నామాట దలఁపు.
గురుఁడీల్గె భీష్ముండుఁగూలెఁ గర్ణుండు । నురువడిఁ గెడసె [6] శల్యుఁడుఁ ద్రెళ్లెనసఁగ
[7] మాటిమాటికి నీదుమది శోకశరము । [8] నాటినయపుడైన నామాట [9] తలఁపు."
[10] అనిచెప్పి కొంతసే పతఁ డూరకుండి । తనలోని పుత్త్రవాత్సల్యంబు [11] కతన
నుభయసైన్యోత్సాహ మూహించి చూచి । యుభయపక్షబలంబు లూహించి చూచి
దైవమానుషశక్తిఁ దలపోసి చూచి । దైవ [12] శక్తికిఁ దారు దవ్వని చూచి
యిది యెఱింగించెద నితనికి ననుచు । సదయుఁడై పలికె దుశ్శాసనాగ్రజుని :
"శమన సమీరణ శక్రాశ్వినులకుఁ । గ్రమముతోఁ బుట్టిన ఘనులు పాండవులు ;
దేవసేనలనైనఁ దెత్తురు ధరకుఁ । గేవల మనుజశక్తియు నీకుఁ గలదె !
దివిజులతోఁ గూడ దేవేంద్రు గెలిచి । [13] తివిరి సమస్తగంధర్వుల గెలిచి
కాలకేయాది రాక్షసులను గెలిచి । వ్రాలిన నరుఁడు దైవముకంటెఁ బెద్ద.
చెండిమవలదు, నీసైన్యకాష్ఠములఁ । బాండవానల [14] మేల ప్రబలఁజేసెదవు ?
తలఁకెడు [15] నకట మీతల్లిగాంధారి ; । వలదువైరము." లన్న వాఁ డంత వినక

## దుర్యోధనుఁడు తనవారి బలిమి తండ్రి కెఱిఁగించుట

"దేవమూర్తులుగాక దేవవ్రతాదు । [16] లీవల మున్నేమి హీనమానవులె ?
కొడుకులై దివిజులు గొంతిగర్భమునఁ । బొడమినప్పుడె పోయె భువిఁ దమ మహిమ.

1. యూల. 2. పన్నిన గజపరంపరవడ్డ । దిన్నయట్లునుగంటి(?). 3. కాల్బురగుమురు (గుమియు).
4. తన. 5. నరుని తేరపుడైన; నరుసిఁజూచపుడైన. 6. శల్యుండునణంగె. 7. మాటికిమాటికి. 8. నాటు నాఁటికినైన. 9. వినుము. 10. అని యని. 11. వలన. 12. శక్తిని వారు దప్పమి. 13. దవవహ్ని కిచ్చి నుద్ధతి ఖాండవంబు. 14. మెల్ల. 15. నటమీఁద. 16. లీవల నరులేమి యీసమానములె.

ఆవిధం బట్లుండె, ననిలంబు నిలుప । దావాగ్ని నడుప భూతములబంధింప
జలము [1]గట్టిగఁ జేసి సైన్యంబు నడప । వలసినచో నెల్లవారి నిర్మింపఁ
గ్రూర[2]సత్వంబుల కోపాగ్నులుడుప । లా వంతఁ గూల్ప శిలావృష్టి మాన్ప
నెఱుఁగుదు మంత్రంబు[3]లెంతయు ; మఱియు । వెఱపితునా[4]పోయి వేల్పులందఱను.
ఏను గర్వములాడ నింతయు నిజము ; । రానెట్లు గలరు వారలు నన్ను మిగిలి ?
ఇంతవాఁ డనుచు మున్నెఱిఁగియే గాదె । కౌంతేయు [5]లుండిరి కానల నణఁగి!"
అని చెప్పి యందఱ నాశ్చర్యపఱుప । ననుకూలగతిఁ గర్ణుఁ డతని కిట్లనియె :

## దుర్యోధను నడిబీరములకుఁ గర్ణుఁడు మాట తొడగుట

"పరశురాముఁడు నాకు బాణంబులిచ్చి । హరియించె వెనుకఁ దా నా బాణశక్తి ;
క్రమ్మఱ నది నాకుఁ గరుణించెఁ జువ్వె ! । నమ్ముము కురురాజ, నా బాహుబలము ;
ఏనున్న మొన చుక్కయెదురు పార్థునకు । నీనేల వానికి నీనేల సగము ?
కుంభజ భీష్మ ముఖ్యులు యోధు లరయ । జంభారిసుతుఁ దాఁకి సమరమధ్యమున
విచ్ఛిన్నధన్వుని విగతసారథిని । నచ్ఛిద్రకవచుని నభయుఁ జేయుదును ;
ప్రాణంబుతోడ ధర్మజుఁ బట్టి తెత్తు ; । ద్రోణాదులేటికి దురములో ?" ననిన

## భీష్ముఁడు కర్ణుఁ గినిసి జాతివైరంబు తగదని ధృతరాష్ట్రునకు బోధించుట

బోరన దానికప్పుడు భీష్ముఁ డలిగి : । "[6]యోరి, యీ ప్రల్లదంబులు దక్కు నీకు ;
చేయఁడే నరుఁడు ? నీ చేతఁ గాఁబోదు ! । చేయఁడో పూరకే చెప్పుచుండుదువు.
[7]లేని దబ్బరలు ప్రేలినఁ బ్రేలుచుండు । మే నిన్ను నధముగా నీక్షింతుఁ గర్ణ !
బీభత్సుఁ జంపనోపిన శక్తి నాకు । లాభించె ననుచు నేలా మిట్టిపడెదు ?
వనజోదరునిచేత వ్రయ్యలై యదియుఁ । దునియలై చిద్రుపలై ధూళి గాఁగలదు.
సర్పబాణము నాకు సంపన్న మనుచు । దర్పించి [8]నాఁడవు దర్పాంధ, వినుము ;
[9]సారెసారెకు వచ్చి చక్రిచే నదియు । ఘోరాజిఁ గూలు ఫల్గునుఁ బంక రాదు."
అని చెప్పి భీష్ముఁ డిట్లను నాంబికేయు : । "జననాథ, తగునె యీ [10]జ్ఞాతివైరంబు ?

---

1. గట్టుగ. 2. సర్పంబుల. 3. లెఱుఁగుదు ధాత్రి. 4. మీఁద వేల్పులఁ దమ్ము. 5. ల నణంపఁ గైకొంటిఁ గర్ణ. 6. యోరోరి. 7. పూని నీ దబ్బరల్ ప్రేలుచుండుదువు. 8. నావు దుర్దర్పాంధ. 9. సారసానక. 10. జాతి.

ఇహలోక పరలోకహితులు దాయాదు । లహితంబు వారికి నాచరింపుదురె?
అన్నదమ్ముల కుర్వి నన్యోన్యమైనఁ । గన్నుల పండువై గాన్పించుఁ బ్రజకు.
రారాజు వారితో రాజ్య[1]లోభమునఁ । బోరాడి చచ్చు నాప్తులుఁ దాను." ననిన
నప్పుడు ధృతరాష్ట్రుఁ డాత్మజుఁ బలికె: । "ఎప్పుడు వినువాఁడ వీబుద్ధి పుత్త్ర!
పితృపతి సూనుండు పితృసమానుండు; । మతిలోన నతని నామూరుగాఁ దలఁపు;
భావించి యాతనిఁ బట్ట బుగట్టు; । యావరాజ్యము నీకు నందమైయుండుఁ;
గాకున్న వారిభాగము వారికిచ్చి । నీకు వచ్చినపాల నృపతివై యుండు."
అని యెంతచెప్పిన నా సుయోధనుఁడు । తనలోన వేఱొండు దలపోయుచున్న
నా కోపమునఁ [2]బల్కె నతఁడు రాధేయు: । "నీకుచ్చితంబు పినికిఁబుట్టెఁ గర్ణ!
కలహించి మొన్న గోగ్రహణ యుద్ధమున । గెలిపించి [3]తారీతి గెలిపింపు మితని.
వెఱ్ఱిమాటల నిట్లు పీనిఁ బ్రేరేంచి । తుఱ్ఱునఁ బోవుదు దురములో విఱిగి.
మా లావు లెఱుఁగుదు మము నీటనైనఁ । బాలనైనను ముంపు పలుకు [4]లే." లనిన
భూరికోపంబున బొమముడి బిగియ । నా రాజుతోడ నిట్లనియెఁ గర్ణుండు:

భీష్ముఁడు పడుదాఁకఁ దా ననికిరానని కర్ణుఁడు ప్రతిన వట్టుట

"అట్టిద కాదె యేమన నేర్తు నధిప! । దిట్టతనంబు సిద్ధించె యోధులకు. (?)
[6]మందాకినేయుండు మనసు నోనాడి । యెందును నా తోడ నిట్లు వక్రించు.
కపటోక్తి [7]నన్ను నకారణం బితఁడు । నృపుల సన్నిధినాడె నృపచంద్ర, వినుము.
కదన మెవ్విధినైనఁ గాక పోదింకఁ । గదన మేఁ జేయ నీ గాంగేయుఁడున్న;
అతఁడును దనచేతనైనంత పెనఁగి । ప్రతిపక్షు నిహతుఁడై పడిన నాఁటికిని
వచ్చి వైరులనెల్ల వధియింతు." ననుచు । నచ్చట నస్త్రసన్న్యాసంబు చేసి
సభలోన వెడలిన జాహ్నవీ తనయుఁ । డభినవంబుగ నవ్వి యహికేతుఁ జూచి:
"నిజమతిగల వీఁడు నిష్ఠురంబాడె; । విజయాదు లింతకు వెఱవకున్నారె!
రారాజు, నీవును రాధేయు నమ్మి । పోరాడ[8]వత్తు వప్పుడు నన్నుఁ జూడు.
బాణారి మదిమెచ్చ బాణంబులేసి । ప్రాణంబు[9]తోడ క్షాత్రవకోటిఁ [10]బట్ట

1. గర్వమున. 2. బల్కె. 3. తే. 4. లింకేల. 5. కార్యంబున. 6. మందాకిని నేఁడు మనసున నోడు । నెందును నాచోటి కితఁడు వక్రించు. 7. నన్నన్న. 8. వచ్చునప్పుడు. 9. లోడు. 10. బట్టి.

వాఁడును వచ్చి యెవ్వరిఁ జంపఁగలఁడో । నాఁడుచూచెద." వన్న నయమేది యతఁడు
కర్ణపక్షము దోఁప గాంగేయుఁ బలికె: । "కర్ణుఁ [1]డొక్కఁడు మీకుఁ గలఁడు కోపింప
లలి మీరు పాండవులకు లెస్సవారు ; । నలువొప్ప నతఁడు నా నమ్మినబంటు ;
మఱి [2]దప్పినాఁడవో! మమ్ము నోడింప । వ్రతము గైకొంటివో! [3]వానిఁ బాపితివి.
కర్ణుఁడు నాకు సంగ్రామాబ్ధిలోనఁ । గర్ణధారుఁడు గాఁడె గాంగేయ?" యనిన,
ధృతరాష్ట్రుఁ డతని బుద్ధికి నాత్మఁ రోసి । హితుఁడైన విదురున కిట్లనె నపుడు:
"విదుర, నామాటలు వినరునందనులు; । హృదయంబు నాకుఁ దానెఱియుచున్నదియు;
నుడి [4]గొనునట్టి రాజులఁ గొనిపోయి । కొడుకు తమ్ములుఁ దాను ఘోరాజిఁ బడిన
సుదతీమణియు నేను శోకాబ్ధిలోన । ముదిమి ముప్పున నింక మునుఁగుదు." మనిన
విదురుఁ డిట్లను: "నీకు విధి దాఁటవశమె? । మొదల చెప్పితిఁగాదె మూర్ఖుఁవీ డనుచు!
వీరు తాఁ దమలోన విరసంబె కాని । వారిలాగున నేకవాక్యులై రారు ;
రాధేయుఁ డసనేయ రాకయుండుట యు । నా ధర్మ[5]రాజున కతిహిత." మనిన
నామాట లటునిల్పి యాంబికేయుండు । మోము సంజయువంక [6]మొనపి యిట్లనియె:
"మనసిచ్చి నీతోడ మాట లట్లాడి । యనుపుచో మాకు నేమని చెప్పె నరుఁడు?
జనపూజ్య, వస్త్రమజ్జన భోజనముల । నిను సత్కరించిరే నిఖిల పాండవులు?
ఆదర మేపాటి[7]దై యుండె?" ననిన: । "మేదినీశ్వర, విను మీతోడ నరుఁడు
పలుక నేమించిన పలుకు చెప్పెదను. । తలకొని తముఁబిల్చి తండ్రిపాలిచ్చి
కుస్తరించుట మేలు ; కొడుకు దుర్బుద్ధి । విస్తరించితి వేని వీరాహవమున
రమణ నొక్కొక్క కౌరవుఁబట్టిపట్టి । యము[8]నిప్రోలికి మీటు ననిలజుఁ డనుము.
అనిచెప్పి నన్ను గృహంబు లోపలికిఁ । గొనిపోయి పెక్కుభంగుల సత్కరించి
[9]యన్నపానాదుల నాలింగనముల । మన్నించి [10]పార్థుండు మఱినన్నుఁ బనిచె."
అని సంజయుఁడు చెప్ప నాంబికేయుండు । [11]తనరారు వెఱఁ గొంతతడ వూఱకుండి
తనయు సంజయుఁ దక్కఁ దక్కినవారి । ననిపి సంజయుఁ బల్కె నాఱడియూన:
"అన్న సంజయ, నీకు నఖిలంబుఁ దెలియు । నున్నచందము చెప్పుమొకటి నాతోడ ;

---

1. డెప్పుడు. 2. దప్పనోడవు (?). 3. వారిఁ గాంచితివో (?). 4. గొననిట్టి. 5. నూనున.
6. మొనసి. 7. యై. 8. పాలికై. 9. యన్నలుఁ దానును. 10. నన్నంచె మఱియుఁ బార్థుండు.
11. తనచింత పెస.

పాండవబలము మాబలముఁ జూచితివి । భండనంబున [1]గెల్చుభాగ్య మెవ్వరిది?
మనకు గెల్పగునొక్కొ మనలోనివారట? । ఘనజయాటోపమెక్కనిపాలఁ బోదు."
అనిన సంజయుఁ: "డిట్టియర్థంబు నీకు । వినిపింప నీవంటి వింటివేనియును;
పిలిపింపు గాంధారిఁ బ్రీతి నిచ్చటికిఁ; । దలఁచి రప్పింపు వేదవ్యాస[2]ఘనుని;
వారు మీలోభంబు వారింపఁ గలరు; । వారిసన్నిధి [3]దీని వర్ణింతు." ననిన
ధరణీశుఁ డపుడు గాంధారి [4]రప్పించి । తరణితేజుని వ్యాసుఁ దలఁచి రప్పించి
యుచితభావంబుల నుపచరించుటయు । నచలితమతి వారి కంజలిచేసి
[5]ప్రతిప్రశ్నమునకు నేర్పడ నుత్తరంబు । హితమతి సంజయుఁ డిటు విన్నవించె:

## పాండవులు దైవబలసంపన్నులని సంజయుఁడు ధృతరాష్ట్రున కెఱింగించుట

బలము పెక్కువ గెల్పుప్రాపించుననుచుఁ । గలయనొల్లఁడు రాజు కౌంతేయు నకట!
బలమేల వారికిఁ బద్మనాభుండు । గలఁడు; మీకెవ్వఁడు గలఁ డంతవాఁడు?
మనమెచ్చి మనలోన [7]మనుచున్నయంత । మనుజసామాన్యుఁడే? మధుకైటభారి!
ఇలఁ బాండవుల నేమ మింతియేకాని । పాలియిం[8]పనున్నాఁడు భూప్రజ నతఁడు;
విశ్వైకజనకుండు విశ్వరక్షకుఁడు । విశ్వభక్షకుఁ[9]డును విష్ణుండు దాన;
సంకల్పసిద్ధుండు జగదీశ్వరుండు । పంకజాక్షుఁడు [10]జీవభావగోచరుఁడు;
పనివడి పాండవబలుల కైదువులఁ । దన చక్రధార లాతఁడు నించినాఁడు;
జంతుభారా[11]ర్తమై జగతి కుయ్యిడఁగఁ । జింతించి మాన్పవచ్చిన [12]వేల్పుగాఁడె!
మీరు భజింపుఁడు మీవాఁడు నగును; । వైరంబు వేల్పుతో వలదు కూరెదరు;
ఇంతకంటెను బుద్ధి యింక లే." దనిన । నంత వ్యాసుఁడు చెప్పె 'నది కార్య' మనుచు;
గాంధారియును జెప్పెఁ గౌరవ్యుతోడ । 'సంధి[13]కంటెను మేలు సమకూర' దనుచు.
ధృతరాష్ట్రుఁ '[14]డా కృష్ణదేవు నీవెఱుఁగు । దతని నేనెఱిఁగెడి యనువేది?' యనిన
వ్యాసుని యనుమతి వసుధేశ్వరునకు । నా సంజయుఁడు చెప్పె నతిరహస్యంబు:
"విద్య యెఱింగించు విష్ణు నేపొద్దు । విద్య దా మొదల వివేకింపవలయు;

---

1. గెల్పు. 2. మునిని. 3. వినవర్తింతు. 4. (బిలిపించి. 5. యతిప్రశ్నమునకు నిట్లని యుత్తరముగ । నతి మతి సంజయుఁడనియె నూహించి. 6. యిచ్చ. 7. మనమున్నయపుడు. 8. పుచు. 9. డగు. 10. భీమ. 11. ర్థమై. 12. వాఁడు. 13. కార్యము. 14. డా కృష్ణదేవుని నెఱుఁగ; దేవునినివంటియెఱుఁగు(?).

మాయ [1]తోఁపించిన మహిత భేదములఁ । బాయఁ ద్రోయు నుపాయపద్ధతి విద్య.
చిరకాలమైయున్న జీవభావంబు । పరఁగ నాహుతిగాను [2]బ్రహ్మాదివిద్య.
నిజమూలకుండలినీ ప్రబోధమున । నిజముగాఁ [3] బుట్టును నిర్వాణవిద్య.
భవుఁడు మధ్యమదృష్టిఁ బరికించు [4]తత్త్వ । మవధాననిరూఢిఁ దా నతివిద్య యగును.
గురుకృప నదియుఁ గల్గుచునుండు.” ననిన । ధరణీశుఁ డాసూతతనయునిఁ బలికె :
“హరి నేను సతతంబు నాశ్రయించెదను । హరికథాలాపంబు లాత్మఁ గోరెదను
నయనేంద్రియము లేక నాకు నవ్వేల్పుఁ । బ్రియు[5]మూరిఁ జూడఁ దప్పినఁ దప్పనిమ్ము;
ఆతనిఁ బొంద నెయ్యది యుపాయంబు ? । సూతజ, నాకు నచ్చుగఁ జెప్పు.” మనిన
నా సంజయుఁడు పల్కు : “నతిరహస్యంబు । వ్యాసుని కృపఁ జెప్పవలసి చెప్పెదను.
భక్తపరాధీనుఁ [6]బద్మాక్షుఁ బొంద । యుక్తు లెయ్యవి లేవు యోగంబు దప్ప.
చిత్తవికారంబు శిథిలంబుచేసి । దత్తావధానులై తలఁచి ధైర్యమున
శుక వామదేవాది సుజను [7]లావేల్పు । సకలంక[8]మతిఁ బొంది.” రని [9]చెప్ప నతఁడు
సుతున కిట్లను : “నీవు సుజనభావమున । నితని మాటలవెంట [10]నెఱుఁగుమా హరిని ;
తలఁచుచిత్తము గల్గ దైవంబు గలుగు । వలయునే వెండియు వ్రాలఁ గర్మముల ;
లోకులలోనుండి లోకేశు మఱచి । పోకలఁబోవుదు పుత్త్ర, నీ.” వనినఁ
దనయుండు ప్రియముతోఁ దండ్రికిట్లనియె : । “వనజాక్షుమహిమ సర్వము నట్లయగును ;
అతని సేవించిన నపవర్గపదము । సతతంబుఁ గలుగుట సత్యంబు నగును ;
శ్రీకాంతుఁ డర్జును చెలియైన కతన । నాకు నాతనిఁ గొల్వ నగుఁ బాటు వచ్చు.
ఇనుముగూడిన యగ్ని యిల వ్రేటువడిన । యనువున నాచేత నాతఁడు వడినఁ
గాయాంత్యమున శౌరిఁ గలియుదు.” ననినఁ । బాయనికృప నిట్లు పలికె నందనుని :
“చిలుకకుఁ బలె నీకుఁ జెప్పిన బుద్ధి । జలధిఁ జొచ్చిన నీటిచవిఁ బోలెఁ బుత్త్ర !
ఆయువుఁ దేజంబు నైశ్వర్యసుఖముఁ । బోయెను పనివెంటఁ బోదువె నీవు !
విదితంబు[11]సేయుమా విష్ణుతత్త్వంబు । [12]మదిలోన నెఱిఁగిన మఱతురే యిట్టు ?”
లనునంత నృపుఁ బల్కె నావ్యాసమాని : । “తన యిచ్చఁ బోనిమ్ము తడయకు[13]తనయు;
హరిభక్తుఁడవు నీవు హరి నాశ్రయింపు । పరమసాయుజ్యంబు పడయుదు వేగ.

---

1. దీపించిన. 2. బహ్మాసి. 3. బుద్ధిగా(?). 4. విద్య. 5. మాడు నాకుఁ దప్పినఁ దప్పనిమ్ము.
6. పరమాత్ము. 7. లు సుశ్వా. 8. గతి. 9. చెప్పె. 10. నెఱుఁగవే హరిని. 11. సేయవే.
12. మది కార్యకృతము సూక్ష్మము లెఱుంగుదువు. 13. తనయ.

ఇతనికి విధి యిది యెవ్వారిపలుకు । హితము గా.'' దని చెప్పి యేఁగె [1] నెందేని.
సుత సూతసుతుల భాసురలీల ననిచి । పతియు లోపలి కేఁగె భామయుఁ దాను.
అని యిట్లు జనమేజయ క్షితిపతికి । [2] వినిపించె ననిచెప్పి వేడ్కతో మఱియు
దశరథసుత, యయోధ్యాపురీ నిలయ, । నిశిత శూద్రకముని నియమాంతరాయ,
కుశలవ గానానుగుణ గుణస్థాన, । పశుపతి కామినీ పఠిత నామాంక,
ప్లవగ దంతావళభరణ ప్రమోద, । దివిజవందిత మోక్షదృష్టిప్రసాద !
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
యోజిత భారతోద్యోగపర్వమున । నోజతో నాశ్వాస మొక్కటి యయ్యె.

---

1. నమ్మ్రాని. 2. మని చెప్పుటయు విని మోదించి యతఁడు । ననఘాత్మ తరువాత సైనవృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు । ఇది సదాశివ (మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ ప్రతి).

# ద్వితీయాశ్వాసము



[1]శ్రీ నిరంతరరూప, స్మితకళాలాప, । మానితగుణధామ, మంజులరామ!
అంగదు దూతగా ననిచి రాక్షసుల । యింగిత మెఱుఁగు స్వామీ! చిత్తగింపు.
జనమేజయునకు వైశంపాయనుండు । మును వినిపించిన ముఖ్యమార్గమున
నక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథాసూత్ర మిట్లని చెప్పఁ దొడఁగె:

## శ్రీకృష్ణరాయబారము

అటఁ బాండవాగ్రజుఁ డట్లు సంజయునిఁ । బటు ధర్మ[2]చిత్తుఁడై భాషించి యనిచి
మఱునాఁడు తమ్ముల మంత్రిపుంగవులఁ । దఱువాత పిలిపించి తగవొప్పఁ బలికె:
“ఈవేళఁ గరిపురి కేఁగి రమ్మనుచు । గోవిందునొగి వేఁడుకొందమా పోయి?
అతని మాటలఁ[3]గాని యన్యమాటలను । ధృతరాష్ట్రసుతులు సంధికి నియ్యకొనరు.
ఒకనాఁటివలె నుండ దొకనాఁటి బుద్ధి । సకలరీతుల వారి జాడఁ జూచెదను.”
అని యందఱనుగూడి హరిగృహంబునకుఁ । జనుదెంచి యతనిచే సత్కారమంది
యుచితాసనంబుల నున్న చో నంత । సుచరిత్ర పాంచాలసుతయుఁ గూర్చుండె.
అప్పుడు యమ[4]సూనుఁ డంబుజోదరునిఁ । దప్పక చూచి యెంతయు వేడ్కఁ బలికె:
“శోకంబు [5]నడఁపను సుఖవృత్తి నడప । మాకుఁ బాండునిమాఱు మాధవ, నీవు;
దుర్యోధనాదులతోడి సంగ్రామ । కార్యంబు దప్పించి [6]కరుణించు మమ్ము;
ఓడక నీకుఁ బ్రద్యుమ్నాది సుతుల । తోడివారము [7]గామె తొల్లియు.” ననిన
నాతఁడు: “నీవు నా కంత చెప్పకుము । నీ తలంపెయ్యది? నృపచంద్ర.” యనిన
నాతఁడిట్లను: “దేవ, హస్తిపురమున । కీ తరువాత నీ వెళ్లినఁ బోయి
యోజకురాని దుర్యోధను మనసు । తేజంబుగలుగ సంధికి నియ్యకొలుపు.

---

1. శ్రీవేంకటేశ, లక్ష్మీహృదయేశ । జీవన శుభలేశ, చిత్తసంవేశ । వినుము వెండియు నిట్లు వివరింపఁ దొడఁగె । జనమేజయునకు వైశంపాయనుండు । అటఁ బాండవాగ్రజుఁ. (మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ ప్రతి). 2. యుక్తుఁడై. 3. గాక. 4. సూతియంబు. 5. ఉడుపను శుభమైనయదియు । నేకాలము నొసఁగి యీ జన్మమునను । అండగానుండి మమ్మరసి రక్షింపఁ । బాండునిమాఱు మాపతి, మాకు మీరు. 6. కరుణ రక్షింపు. 7. గాదె.

[1]అడిగి పుచ్చితిని నే నైదుగ్రామములు । కడ[2]పట నవియైనఁ [3] గలిగింపు మాకు.
చూచితే! తమ మాత సూతసంభవుఁడు । రాచకార్యము నేర్పరా నిందువచ్చి
మనతోడ భాషించి మన[4]కుఁ దాఁ గొంత । చనవు చూపుటగాఁగ శాంతిఁ బొందించి,
‘పాలిచ్చు[5]నని పెద్ద భావింపఁ గాని । మేలు మీ తోడిదే మీ తండ్రి’ కనియె.
ఏయూరి కే[6]పొందు! హితమేది [7]యింక? । నా యంశ మీరఁట నా[8]కేమి శాంతి!
గాంధారితనయుండు గలకాలమెల్ల । బాంధవం [9]బొనరునే పతికి మాతోడ?
చుట్టపువరసయు సుజనసమ్మతియు । నెట్టొకో కలదని యేను జూచెదను.
పదివేలు చెప్పినఁ బద్మపత్రాక్ష! । బ్రతుకునకై చంప బంగుకోటులను.
ఎక్కడి నిజనీతి యీ రాజనీతి! । క్రుక్కక నృపులఁ గూల్చుచు నుండవలెనె?
రణములో [10]జయమును బరాజయస్థితియు । గుణధామ, రాట్నపు గుండులుగావె!
జయమైనఁ [11]బగ పరాజయమైనఁ జావు । నయధామ, రణమున నయము[12]లీ పగిది.
వాడు పుట్టకయుండ వారి మా[13]నందు । మోదంబు నడపు దామోదర, నీవు.
కలుపుకోల్మాట[14]లఁ గసరు లేకుండఁ । దలపెట్టుచో నిన్ను ధార్తరాష్ట్రుండు
పాలు [15]పంపీనని పంతమాడినను । మేలయ్యె ననుచు రమ్మీ వాదుమాని.
నీయంత దొరమాట నేఁడు లంఘించి । యా[16]యన దుష్కీర్తి నందిపోనిమ్ము.
అంబికా తనయుండు నతనిఁ గూడినను । [17]నమ్మతింతువుగాని సాధింతుననకు.
ఘనులు హింసకుఁ గోసి కౌంతేయు [18]లరులఁ । గినియకున్నారను కీర్తి మాకిమ్ము.
కీర్తి లక్ష్ములలోనఁ గీర్తి నిత్యంబు । కీర్తియె నాకు దక్కినసొమ్ము కృష్ణ!
రాజరాజునకంటె రాజ్యభోగముల । రాజిల్లువాఁడ నుర్వర యేలకయును.
ఒక్కటి [19]తలఁపయ్యె నో[20]వాసుదేవ! । తక్కువు రారాజు దర్శింపఁ జనుట.
వాఁడేమి సేయునో! వాఁడు దుర్మదుఁడు ; । నాఁడు పెట్టఁడె విషాన్నములు మా.” కనిన

## కృష్ణుఁడు యుద్ధము తథ్యమని పల్కుట

నతఁడునవ్వుచుఁబల్కె: “నకట! గాంధారి । సుతుఁడు నన్నటు [21]సేయఁజూడ నయ్యెడనె
రమణ నూర్వుర ధార్తరాష్ట్రులఁ జంపి । క్రమముతో భీమునిఁ [22]గదఁ జిన్నఁబుత్తు.

1. అడిగించి పుచ్చితి. 2. సారి. 3. గల్పింపు. 4. తోడ. 5. పనిచెప్ప. 6. పొద్దు. 7. యందు. 8. కేల! 9. పొనరింప బ్రదికి (?). 10. జయ మపరాజయ స్థితులు. 11. మరి. 12. లోపలిది (మా). 13. సంధి. 14. లు కలును. 15. పంచెదనని బలిమి నాడినను. 16. యొడ. 17. సమ్మతింతువు. 18. లోరుల. 19. తప్పయ్యె. 20. కృష్ణరాయ. 21. చేసి చూడఁడయ్యెడిని. 22. గడు.

అనుపు మంపినఁ బోదు హస్తినాపురికిఁ; । జని యందుఁ గౌరవేశ్వరు నియ్యకొలిపి
యిలలోని సమభాగ మిప్పింతు నొకటి; । కలయఁ గీర్తులు నీకుఁ గల్పింతు నొకటి.
ఉత్తముండవు నీకు నుల్లంబు మృదువు; । కత్తెరవలె నుండుఁ గౌరవ్యుమనము.
జగతి నెక్కటి [1] నేలి చనిగొన్నవారు । దగిలి ప్రార్థించిరే దగవు సేయుదు[2]రె!
అదియేమి [3]మిమ్ము నాఁడా పాటుపఱచి । మదిలోన ఎగవరే మంచివారైన?
ఏల ధర్మజ, నీకు నీ వృథాభ్రాంతి? । వాలాయమునఁ జంపవలయుఁ గౌరవుల.
నీ మృదుత్వము హాని నేర్పునఁ జూచి । భూమిఁ [4]బొంకనివాని [5]పొక్కుచుండుదురు.
[6]పగవారిఁ జంపనోపని పార్థివులకు । జగతిఁ గీర్తియు లేదు సౌఖ్యంబు లేదు.
పాపాగ్ని దగ్ధుల బద్ధమత్సరుల । నోపినఁ జంపు లోకోపకారముగ.
[7]నిజకులోచిత ధర్మ [8]నిస్తారకుండవు । గజపురీశ్వరుతోడఁ గార్పణ్యమేల?
ఏనును బోయి నీ హృదయంబు తెఱఁగు । జానొప్ప ధృతరాష్ట్ర సమ్ముఖంబునను
విదుర భీష్మాదులు విన నేర్పరించి । కదనంబు లేనిపక్షము నిర్వహింతు.
సర్పకేతనుఁ డేల సంధికిఁ జొచ్చు? । దర్పించియున్నాఁడు తా రాజ ననుచు.
మీరును సంధి నమ్మినవారు గాక । పోరాడ నాయితంబుగ నుండుఁ." డనిన
ననిలజుఁ డిట్లను: "ఆ పోటు[9]మాట । పనివడి మాకుఁ జెప్పఁగనేల కృష్ణ?
నీవు నీపని బంధునికరంబు మెచ్చఁ । గావించి రమ్ము వేగమె పొమ్ము లెమ్ము.
హస్తినాపురికేఁగి యాంబికేయునకు । నాస్థతో సంధికార్యంబది తెలిపి
తగదిట్లు నలువురుఁ దలలెత్తి చూడఁ । బగమోచి మనలోనఁ బ్రజ[11]గూల్ప ననుము;
లలిఁ [12]బొందు సేయ నాలస్యంబె కాని । తలపడి పోరాడఁ దడవులేదనుము;
పాయఁగాఁ బాయఁగాఁ బగయైన యట్లు । డాయఁగా డాయఁ జుట్టఱికంబు లనుము;
శ్రీకాంత, మనమెంత చెప్పి పుచ్చినను । గైకొననేరఁడు కౌరవరాజు.
ఆనీచు నాచేత నాజిలోఁ దొడలు । పోనాడుఁగాక నీబుద్ధిఁ బోయెడినె!"
అనిపల్కి భీముఁ డొయ్యనఁ గొంత[13]సేపు । మనసులోఁ దలపోసి మఱియు నిట్లనియె:
"కదుపునఁ గదిపెండు గలరు [14]బాంధవులు । కదనంబులోన నెక్కడ నేమియగునో!
నీవు విచ్చేయుట నిఖిలసమ్మతము; । గోవింద, మాన్పు[15]మా ఘోరాజి." యనినఁ

1. నేల. 2. రె. 3. నిన్ను. 4. బొంకని. 5. బొంకు. 6. పగలువారింప. 7. ద్విజ. 8. విస్తార. 9. చోటు. 10. తగఁదెట్లు; తగనిట్లు. 11. గూడననఁగ; గూడదనుము. 12. పొందు సేన. 13. తడవు. 14. కౌరవులు. 15. మీ.

## కృష్ణుఁడు భీమసేనుని సమరమునకుఁ బురికొల్పుట

బిన్ననవ్వున శౌరి భీమునిఁ బలికె: । "అన్న, నీ కేటికి నాహవభయము ?
అంతచేసిన కౌరవాధము[1]మీఁద । శాంతి నీకునుబుట్టెఁ జాలుఁ గయ్యములు ;
ఈ వేళఁ గయ్యంబు హితకార్యమగుట । నీవెఱుంగుదువని నిన్ను నమ్మితిని.
ఎవ్వండొకో నీకు నీబుద్ధి చెప్పి । చివ్వకు రానీక చెయ్యాఁగినాఁడు ?
జలజబాంధవునకుఁ జలిభీతివోలె । నలవడునే నీకు [2]నరిభీతి ?" యనిన
లలి భీముఁ డతని మేలంపుమాటలకు । [3]సెలవివాఱఁగ నవ్వి చెలువొప్పఁ బలికె:
"భయము నాకెయ్యది ? పాండవాగ్రజుని । నియతిలోపలి[4]రాక నీకు నవ్వయ్యె.
నీవును నృపుమాట నిల[5]దాఁటనోడి । యా వైరిపురి కేఁగి యన్నియుఁ దెలిపి
సాగకవచ్చెదు సంధి యెప్పుడును ; । నాగారివాహన, నన్నాజిఁ జూడు."
అనిన: "నీ[6]వోపవా యంతటిపనికి ! । నను నేరుకొన్నాఁడు నరుఁడు తేరునకు ;
యుద్ధ మేనును గోరుచున్నాఁడఁ గాన । సిద్ధముగా సంధి చెదరింతు." ననిన
హరిఁజూచి యిట్లను ననిల[7]సంభవుఁడు : । "నరుఁడు నీవునుగూడి నానా[8]ముఖములఁ
బరవీరవాహినీ భటసమూహములఁ । గరి ఘోటకానీక ఘనరథంబులను,
ఘోరారితతిఁద్రుంపఁ గొఱగాక [9]యేను । జేరి [10]మిత్తిక్కిఁ జూచెదఁగాక యేమి !"
అనినఁ గృష్ణుఁడు [11]పల్కెఁ : "నదియేమి భీమ ! । కినియకు మేలుపల్కితి వినోదముగ.
ఈవు [12]చించిన పౌఁజు నేముఁజించుదుము ; । ఈవు[13]నొంచినవారి నేము[14]నొంపుదుము.
అనిమొన నీసహాయత కల్గెఁగాదె । వెనుకొని కురురాజు వెఱచుఁ [15]గృష్ణునకు."

## అర్జునుఁడు కృష్ణునితోఁ దన యభిప్రాయము చెప్పుట

నావిని కృష్ణుతో నరుఁ డిట్టులనియె : । "నీవందు విచ్చేసి నిఖిలేశ, వినుము
సరసులు మదిమెచ్చ సంధికార్యంబు । కర[16]మర్థి నొడఁగూర్పు గాక పోరాదు.
కురురాజు కపటంబుఁ గుంతినందనుల । పరమశాంతియు [17]నెన్నఁ బనిలేదుసుమ్ము.
యమసూతి కాఁబట్టి [18]యన్నియు నోర్చి । విమతుల మన్నించె వేయునేమిటికి !
బవరమయ్యెడునంతపని పుట్టెనేని । దివిరి కౌరవుచావు దేవతాపరము.

1. తోడ. 2. నతి. 3. సెలవుగా నవ్వుచు. 4. రాఁగ. 5. నాడ. 6. వొప్పవా. 7. నందనుఁడు. 8. విధముల. 9. యేమి. 10. మత్తిక్కి. 11. పల్కె. 12. నొంచినరాజు: 13. చింపిన. 14. చింపుదుము. 15. దండ్రికిని. 16. మొప్ప. 17. నమ్మ. 18. యవియెల్ల.

యజ్ఞా[1]ని యగువాని [2]నటు శాంతపుచ్చి । యజ్ఞాంశ, కురువంశ మవనిపై నిలుపు.
కాదుగదా నీవు గన్న కాన్పునను । మాదైనదేన మాన్పి మము నుద్ధరింపు."
అనిన నారాయణుం : "డది యట్లతగును ; । మనమాటవినఁడు దుర్మదుఁడు రారాజు.
భానునిదీప్తి గూబకుఁ బత్య[3]ముగునె! । వానికి నామాట వడిఁ బథ్యముగునె!
పుట్టి బుద్ధెఱిఁగి యీ పూర్వకాలమున । దట్టించు మిము వాఁడు తనప్రజ్ఞ మెఱసి.
నేఁడు వేఱొకబుద్ధి నేర్చునా [4]వాఁడు! । పోఁడి[5]మిగా నేను బోయివచ్చెదను."

## నకులు నభిప్రాయము

నావిని శౌరితో నకులుఁ డిట్లనియె : । "ఏవిధంబుననైన నీడేర్పు సంధి ;
తగిలి కానలనున్న ద్వాదశాబ్దములు । నొగి విరాటునిప్రోలనున్న వర్షమును
దాము కాంతాసమేతముగఁ బడ్డట్టి । యీ మహాపదలచే నలసి క్రోధించి
కౌరవ్యుఁ గినిసిరిగాక నేఁ డట్టి । క్రూరత్వ మొల్లరు కుంతినందనులు.
కౌరవపతియు గోగ్రహణయుద్ధమున । ఘోరాస్త్రములు[6]తాఁకి కొంత క్రొవ్వడఁగి -
యున్నాఁడు దానిపై యుద్ధంబు మాన్పఁ । బన్నిపోయెదు నీవు ప్రభుఁడు ప్రార్థింప ;
కూడ రింతియె నువ్వో కురు పాండుసుతులు । చూడుము నామాట సునిశితార్థంబు."

## సహదేవు నాశయము

అనునంత సహదేవుఁ డాకృష్ణుఁ బలికె : । "మన[7]వార లిదియేటిమాట లాడెదరు!
ఆలించి [8]విసఁగ నాగాంకుఁ డేయూరు । పాలిచ్చు టేయూరు పాండు[9]సూనులకు!
[10]దానవాంతక, నీవు తలపోసిచూడు । వానిఁ బ్రార్థింతురే వసుధకై పోయి!
తలవంపుఁ గూటికిఁ దగువారు నవ్వ । నిల యేలకుండిన నేమి చిక్కినది!
తెఱమినఁ[11]గాని గాంధారినందనులు । వెఱచిన[12]వారిని వెంటఁబెట్టుదురు.
ధావంతపడి నీవు దవ్వు పోవలదు । దేవరవలె నుండు దేవేంద్రవంద్య!
వారియకొనుటయు వడిఁ బచ్చి కడవ । నీరముంచిన యట్లు [13]నిలనేర." దనిన
సాత్యకి యతనిభావకుఁ జాల నలరి । సత్యభామాప్రాణసఖునితోఁ బలికె :

---

1. న మగు. 2. కటుచింత మాన్పి ; యటు శాంతమాని. 3. పైన. 4. రాజు. 5. గానే నేఁడు పోయి వచ్చెదను. 6. గూడి. 7. మనమార నిదియేమి. 8. వినుఁడు. 9. పుత్త్రులకు. 10. లీల నాదృశ్యు లింతేసి మానుసులు(?). 11. గాంధారతనయ. 12. వారలు. 13. నిలువ లేదనిన.

"పోఁగఁ బాడు కర్పూరముగఁ జేయరాదు। జగతి రారాజు సజ్జనుఁ జేయరాదు;
మహిఁ గాకిపైఁడి హేంసము సేయరాదు। అహి కేతు శాంతుఁ జేయఁగరాదు వినుము.
హరివోయి సంధిసేయక వచ్చెనసఁగ। ధరలోన నపకీర్తి తథ్యంబు నీకు.
కాదేని నను బంపు కౌరవ్యుచేత। మేదిని సర్వంబు మీకు నిప్పింతు."
అనిన సైనికులెల్ల నతని వాక్యములు। కొనియాడి రా[1]ద్రోవఁత కొలువెల్ల నిండె

## ద్రౌపది కృష్ణునితోఁ దనవడ్డ బన్నములు సెప్పుట

[2]ఆ వేళఁ బాంచాలి యమసూతి మాట। [3]భాంవించి శోకించి [4]బాష్పంబు లొలుక
హరిఁజూచి యిట్లను; "సకల ధర్మజుఁడు। [5]కరుణచేఁ దగదన్న కౌరవేశ్వరునిఁ
జెలఁగి చిత్తముపోక శివుపోక గాఁగఁ (?)। గలియు నింతియగాని ఖండింపఁ డతని.
చెలరేఁగి కీడుచేసిన దురాచారిఁ। బొలియింప నొల్లక [6]భూషించుటెల్ల
నొగిఁ దన్నుఁ గఱచిన యురగంబు నోరు। మగుడఁ దాఁ దుడిచిన మార్గంబు గాదె!
అతఁడీఁడు చూడు[7]మీ యయిదూళ్ళు మనకు; । నితఁడు నేరకపోయె నేమిసేయుదును!
తమ్ముని మన్నించి తాఁ గీర్తిఁబొందె। [8]నిమ్ముల నా కోప మీడేరదయ్యె.
వరమున ద్రుపదభూవరు పుత్రినైతి; । భరత [9]వంశముఁ జొచ్చి పావనినైతి;
భాసిల్లఁ బాండవపత్నినై మిగుల। రాశికెక్కితిఁ బాండురాజు కోడలన;
నీకుఁ జెల్లెలనైతి నిఖిలేశ, నాకు। నీ కష్టదశవచ్చె నేమిసేయుదును!
సువిదితంబుగ రాజసూయయాగమున। నవభృథస్నానమే నాచరించితిని;
దానఁ బవిత్రమై తనరు నా వేణి। [10]చే నంటి యా దుస్ససేనుండు తివిచె.
ఆ భంగి నన్నీడ్చి యాస్థానభూమిఁ। బ్రాభవం[11]బున వాఁడు పైచీర [12]దోఁచఁ
జెనకనొల్లని వీరి చిత్తమే నెఱిఁగి। నినుఁ దలంచినఁ గాదె నీవు గాచితివి!
వానిఁ జంపుట మాని వరదయాబుద్ధి। వానికిఁ జెప్పంగ వలయునే సంధి?
అలిఁ బట్టినదైత్యు హరియించె రాముఁ। డా లాగు తలపోయ రకట పాండవులు!
లలనలు కలహామూలం బనవలదు। జలజాక్ష, నా పాటు సకలంబుఁ జూడు."

---

1. మాట. 2. అలోన. 3. లాలించి. 4. లలి వగఁబొంది. 5. కరుణించె గదవన్న. 6. భూషించె
చేల; బోధించుటెల్ల. 7. మా. 8. నెమ్మిన నాకోప ముడుగనిదయ్యె (?). 9. వంశంబు లోపలను
జొచ్చితిని. 10. జైనంటి యిపుడు దుశ్శాసనుఁ డీడ్చె; చెనఁటియై దుశ్శాసనుఁడు పట్టి తివిచె.
11. బడ వాఁడు. 12. దోఁప,

అని లేచి కచభార మబ్జాక్షి [1]విడ్చి । తనచేత ధరియించి దైత్యారిఁ [2] బలికె :
"భాసిల్లు [3]నిది వాఁడు పట్టి [4]యీడ్వంగఁ । జేకిక్కఁ ద్రెవ్వి నిల్చిన కలాప[5]ంబు ;
కురుపాండుతనయులఁ గూర్పఁ బోయెదవు । పరికింపు మిదియున్న భావంబు తొలుత.
తవిలి దుర్యోధను ధరఁ గూల్పలేని । పవనజుగదయేల ? పార్థు శిల్లేల ?
తొలఁగక నీ యట్టి తోడఁబుట్టు[6]వును । [7]గలుగ నాకీపాటు గలిగెఁ బో." మ్మనుచు

## కృష్ణుఁడు ద్రౌపది నూరార్చుట

వింతగా నేడ్చిన, విష్ణుఁ డా కుటిల । కుంతల నూరార్చి కూర్చుండఁ బనిచి
కచములు బంధింపఁ గన్నీరు దుడువ । నుచితజ్ఞుఁడై కొంద ఱువిదలఁ బనిచి
కరుణించి యిట్లనుఁ: "గాంత, నేఁ గలుగఁ । బరువడి దుఃఖింపఁ బనిలేదు [8] నీకు ;
మారుతి జిష్ణు ధర్మజ సహాయమునఁ । గౌరవ కులమెల్ల ఖండింతు వినుము ;
మన ప్రయత్నమె కాని మన సంధి వారు । వినరు నీ వేటికి వేగిరించెదవు ?
ధార్తరాష్ట్రు[9]ల చావుఁ దత్కులస్త్రీల । యార్తనాదము లర్థి నాలింతు [10]గాక ;
నీవు శోకింపకు నిఖిల యత్నముల । దైవంబె సమకూర్చుఁ దనుదానె." యనిన
జలద ధారాసిక్త జగతి చందమున । జలజాతముఖి వీతసంతాప యయ్యె.
అంత గాండివపాణి హరిఁ జూచి పలికె: । "ఇంత మాటలవెంట నీవు రావలదు ;
తగిన కార్యముచేసి ధర్మంబు [11]నిలుపు ; । ఒగి వారు నేము నీకొక్క రూపంబు ;
యమసూతి నీతివాక్యము వినరేని । తమ నేరములఁ దార తాఱునీ రిపుల ;
ఇది నీవు మఱవకు మెల్లి రేపాడి । కదలుము దినశుద్ధి [12]గలదు రేపటికి ;
ధీర, రోహిణిఁ బుట్టితివి గానఁ జంద్ర । తారాబలంబు లుత్తమములు నీకు."
అని వేడ్కతోఁ జెప్పి హరినియ్యకొలిపి । [13]వనితా సహాయులై వచ్చిరి నృపులు.
నరకమర్దనుఁ డంత నాఁటి వేకువను । వెరవొప్ప సంధ్యాది విధు లనుష్ఠించి
వివిధ దానంబుల విప్రులఁ దనిపి । యువతి నేత్రానంద[14]మొప్పఁ గైసేసి
భూసురాశీర్వాద పుణ్యఘోషములు । భాసిల్ల వెడలి సభావేది యెక్కి
యటమున్న వచ్చిన యనుజు శైనేయుఁ । బటు భక్తి ధౌరేయుఁ [15]బలికె నిట్లనుచు :

---

1. యీడ్చి. 2. కనియె. 3. నను. 4. నన్నీడ్వ. 5. ములు. 6. వయు. 7. గలిగి. 8. మీకు. 9. లు చావ. 10. గాని. 11. నడపు. 12. గలుగు. 13. ఘనలీల నారాత్రి గడచి రేపాడి । యువతి. 14. మొనర. 15. బరికించి పలికె.

## కృష్ణుఁడు సపరివారముగాఁ గరిపురి కేఁగుట

“ పనివడి మనసేనఁ బయనంబు సేసి । కొని తెమ్ము పోదము కురురాజుపురికి.
ధృతరాష్ట్రసూనుల దృష్టింపఁ జనుచు । జతనమై యుండుట సాధుకార్యంబు ;
కావునఁ జక్రముఖ్యములు కైదువులు । రావలె మఱినీవు రాకున్నఁ గాదు.”
అని చెప్పి కృష్ణుఁ డయ్యవసరంబునకుఁ । జనుదెంచి నిలుచున్న సారథిఁ జూచి,
“ దారక, నీ వింకఁ దడవుగానీక । తేరాయితము చేసి తెమ్ము నా.” కనిన
నతఁడు రణోద్దామమగు తేరిమీఁదఁ । జతురతఁ బన్నగాశన కేతువెత్తి
శ్లాఘనీయములైన సైన్య సుగ్రీవ । మేఘ పుష్పకము లర్మిలి వలాహకము
[1] ననఁనొప్పు హయముల నందు బంధించి । పొసఁగ సర్వాయుధంబులు నందు నిలిపి
తేరాయి[2]తముచేసి తెచ్చిచూపుటయు, । శౌరి దిగ్గనలేచి సంభ్రమంబునను
దోరమై మంగళ[3]తూర్యముల్ మొరయ । నారోహణముచేసె నమ్మహారథము.
అంతలో సాత్య[4]కి యంతంబులేని । దంతిరథాశ్వపదాతి[5]వర్గంబు
గొనివచ్చి కాంచిన గోవిందుఁ డతనిఁ । దనరథ మెక్కించి తగువైభవమునఁ
గదలె మాగధకోటి[6]గదిసి కీర్తింపఁ । ద్రిదశులు వివశులై దివినుండి చూడ.

## పాండవు లల్లంతవఱకు వెన్నంటి కృష్ణుని సాగనంపుట

హరి యిట్లు గదలిన నఖిలపాండవులు । నరదంబులెక్కి సైన్యములతోవచ్చి
విడిదల పొలిమేర వెడలునందాఁకఁ । గడువేడ్క నతని డగ్గఱఁ గొల్చిపోయి
యంపించుకొనువేళ హరి తేరు గదిసి । సొంపార సమవర్తిసూనుఁ డిట్లనియె :
“ పోవుచున్నాఁడవు పుండరీకాక్ష ! । యీవార్త యింతకు నెఱుఁగు మాతల్లి ;
[7]మునుపెయచ్చటికేఁగి మ్రొక్కి యాయమకు । మనసులోపలివంత మాన్ప[8]మీకొంత.
ఏమరణ్యములకు నేతెంచునపుడు । తా మమ్ము ననుప నెంతయు దవ్వువచ్చి
మగుడనేరక యేడ్చి మగిడె ; [9]నింతకును । [10]మిగుల నలంగును మేనెల్ల బడలు.
కడుపారఁ గొడుకులఁ గాంచియుఁ గొంతి । యడుగక వేఁగుచునుండఁ[11]గా నలసె.

---

1. ననువొప్పు. 2. తంబని తెచ్చిచూపినను. 3. తూర్యంబులొలయ. 4. కనంతంబులైన. 5. గణంబు. 6. గడఁగి. 7. మునుమున ; మునుపె. 8. ము. 9. నింటికిని. 10. మిగుల నొగలుదుసుమ్మీ పోదుగాక (?). 11. బా లయ్యె.

నెలకొని మఱి మాకు నీకటాక్షంబు । కలుగుట దలపోసి కడు దుఃఖపడదు.
[1]ఆదట నూరార్చి యచటిబంధువుల । నాదరింపుము వందనాదికృత్యముల.
ఇన్నియు [2]మాకుఁగా నిట్లాచరించి । చెన్నారఁ గౌఁగిటఁ జేర్చుచూ విదురు.
ఆతఁ డక్కడఁ గంటకాటవినడుమఁ । [3]జాతపోత్రమువోలె శోభించుచుండు."
అనుటయు "మీరేటి కరుగుదెంచెదరు ? । చనుఁ డిన్నివిధముల సంధించివత్తు.
హితమును ధర్మంబు నిచటిశాంతియును । మతికెక్క వారితో మాటలాడెదను.
మీకుఁ బాలిచ్చుట మేలైనగుణము ; । ఈకున్న రణము రెండే నిర్ణయములు.
తారింత వినకున్నఁ దమమీఁది పాటు । రారాజునకు వినరాఁ జెప్పివత్తు."
అనిచెప్పి పార్థుల నభివందనాది । వినయపూర్వకముగా వీడ్కొల్పి శౌరి
యావృతసైన్యుఁడై హాస్తిపురంబు । త్రోవ గైకొని వేడ్కతో వచ్చి వచ్చి,

## కృష్ణుఁడు తాపసులఁగని సంభావించుట

యొకచోట నారదు నొగి జమదగ్నిఁ । బ్రకటించి మఱియుఁ దాపసులఁ బెక్కండ్రఁ
బొడగాంచి తన తేరు బోరన డిగ్గి । తడయక మ్రొక్కి యందఱ సేమమడిగి
'యీరు విచ్చేసితిరేమొకో ?' యనిన । నారాయణునిఁజూచి నారదుం డనియె :
"కమలాక్ష, నీవేఁగి కౌరవ్యుతోడ । సమసంధికై చేయు సంభాషణంబు
అదివిని విదుర భీష్మాదులు నృపులు । పదపడి నీతోడ భాషించువిధము
వినవేడ్కనైవచ్చి విభుఁడ, నిన్నిచటఁ । గనుఁగొంటి." మనుటయు గరుడవాహనుఁడు
"ఆహాహ ! కడులెస్స[4]యయ్యె మీరాక ; । సాహాయ్యమును నాకు సమ[5]కూరె నేఁడు ;
అరదంబుమీఁదికి నరుగుదెం." డనిన । హరిఁజూచి వారు: "మీరరుగుఁడు మొదల
నచట నేమును గాననయ్యెద." మనుచు । నుచితయాత్రలఁ బోవ నొయ్యనఁ గదలి
తపనుండు గ్రుంకునంతకుఁ గుశస్థలము । సపరివారంబుగా శౌరి ప్రాపించె.
ఆ రాజధాని బ్రాహ్మణు లంత నలరి । తోరణపంక్తి వీథులఁ గట్టఁబనిచి
హరికిఁ దారెదురేఁగి యాశీర్వదించి । యరుదారఁ దమయిండ్ల కతనిఁ బిల్చుటయు
"సైన్యమంతయు వచ్చు నమ్మర్దమేల ? । మాన్యులు మీ." రని మధుసూదనుండు
ఆ జనపదమున కనతిదూరమున । రాజిల్ల బసలనరాతు లెత్తించి

1. ఆమెను. 2. మానుగా. 3. జాతివృక్షముపోలెఁ జయ్యన నుండు. 4. యయ్యె. ౫. కూరు చున్నె.

పటకుటీపటలంబు పరఁగ నెత్తించి । భటులుఁ దానును నందుఁ బాళెంబు విడిసె.
అట చారముఖమున నావార్త[1]యెఱిఁగి । తటుకున మంత్రులఁ [2]దనయు రప్పించి

## కృష్ణుని రాకకు ధృతరాష్ట్రుఁడు సంతసిల్లుట

యారాత్రి యిట్లను నాంబికేయుండు : । "కౌరవభటులార! కంటిఁ బుణ్యంబు;
ఇచ్చటఁ దన కిఁక నేమికార్యంబొ । వచ్చుచు[3]న్నాఁడట వాసుదేవుండు!
అదె [4]నేఁటి విడిదల యాకుశస్థలము । వదలక యెదురేఁగవలయు మీరెల్ల;
ధర నాడఁబోవఁ దీర్థంబెదురయ్యె; । పురము శృంగారింపఁ బుచ్చుఁ[5]డింపొంద;
కలిమియేర్పడఁ గానికలు సంతరింపుఁ; । [6]డలవున విందున కాయత్తపడుఁడు;
చప్పరంబులు వృకస్థలమునఁ గట్టఁ । జెప్పుఁ[7]డు విడియింతు శ్రీకాంతు నందు."
అనిచెప్పి విదురున కభిముఖుఁడగుచు । జనపతి యిట్లను సంభ్రమంబొప్ప :
"ఏనిత్తు శౌరికి నిభ[8]హయ వస్త్ర । మానినీ భూషణ మణి రథావళులు;
అతనికి నాయింట నహికేతునింట । హితమైన వస్తువు లేమి గల్గినను
[9]అడుగుట భాగ్య మేమైన నేనిత్తు." । అనిన నించుక నవ్వి యవ్విదురుండు :
"బంధుఁడనని శౌరి [10]పనిలేక రాఁడు; । సంధికి రానోపు శమనజుఁ డనుప.
కాదేని [11]యర్ఘ్యముల్ గంధమాల్యములుఁ । బోదని తాంబూలములుఁ[12]ముట్టుఁగాని
యవనీశ, నామాట యాత్మలో నమ్ము । తవిలి నీచేత పీనము నానపడఁడు.
గారవింపుఁడు చాలుఁ గార్యంబుచేసి । సారసాక్షునిఁ గృష్ణు సకలలోకేశు.
హరికిఁ బాండవకార్య [13]మనువైనఁ జాలుఁ । గరులేల మణులేల కలకంఠులేల?"
అనిన భీష్ముండు నయ్యర్థంబు పలుకఁ । దనయుఁడు వీక్షించి తండ్రి కిట్లనియె :

## దుర్యోధనుఁడు కృష్ణుని బట్టి బంధింతు ననుట

"అ ప్పాండుతనయుల కతఁడు సంధాన । మిప్పింప [14]వచ్చిన నీ నోపఁగాని,
పూజనీయుఁడు గానఁ బూజింత మతని । నాజికి వెఱచిన ట్లర్థ మీ నేల?
ఏ నొండు తలఁచితి నిది మీరు వినుఁడు । మానక హరిఁబట్టి మనము బంధించి

1. తె. 2. దనర. 3. నున్నాఁడు. 4. నేఁడు. 5. డీ ప్రొద్దు. 6. డలవడ. 7. డీ. 8. వస్త్రతురగ.
9. అన్నవొప్పఁగా నన్ను నడుగుట భాగ్య. 10. పస. 11. యాజ్యముల్. 12. బెట్టు. 13. మైనను.
14. వచ్చెనే.

పోవ నీ కుండిన బుద్ధిలో వెఱచి । రా వెఱతురు పాండురాజనందనులు ;
పోలుచు [1]జీవములేని బొంది చందమున । నిలువరు హరిలేక నిఖిల పాండవులు.
అప్పుడు [2]ద్రుపదాదులైన బాంధవులు । చెప్పినయట్లెల్లఁ జేయరే నాకు !
ఇది నిర్ణయం" బన్న నిచ్చలో భీతి । [3]యొదవఁగ నాంబికేయుఁడు పుత్త్రుఁ బలికె :

## ధృతరాష్ట్రుఁడు కుమారు మందలించుట

"ఓరి ! విష్ణుద్రోహ ముచితమే నీకు ? । నీరసాత్ముఁడ వైతి నీతి వోవిడిచి.
పంకజాక్షునిఁ బట్టి బంధింతునంటి । వింకఁ బాపములకు నేలరోయుదువు !
సంసారబంధంబు సడలింపఁ[4]జాలు । కంసారి నీ చేతఁ [5]గట్టంగఁ బడునె ?
దూతయై వచ్చె బంధుఁడటమీఁద । నే తెఱంగుననైన నతఁడు [6]బంధ్యుండె ?
వారింపరాని యీ వాగ్దోషమునకు । నారాయణ స్మరణము సేయవలయు."
అని ప్రధానులనన్ని యాత్మజు ననిచి । జనపతి యా రాత్రి చనియె లోపలికి.

## కృష్ణుని కరిపుర ప్రవేశము

అట నాఁటివేకువ యాదవాధిపుఁడు । పటుతరానుష్ఠాన [7]పరిపాటిఁ దీర్చి
కరమొప్పఁ దేరెక్కి కదలి [8]వచ్చుచును । వరుసఁ గుశస్థలవాసుల ననిచి
[9]యెలమితోఁ గౌరవ్యుఁ డెదురు పుత్తెంచు । ఫలవస్తుతతు లాసపడక గైకొనుచు,
ధృతరాష్ట్రుఁ డనిపిన దేవవ్రతాది । హితు లెదుర్కొనుటకు నిచ్చఁ బొంగుచును,
కృతవర్మమీఁది మిక్కిలి [10]ప్రేమఁ జేసి । యతనితో సల్లాప మాచరించుచును,
ఘనశోభిధామ పతాకాభిరామ । ఘనహాస్తిపురము మార్గము చొచ్చి వచ్చె.
అప్పుడు నవ కుంకుమార్ద్రపుష్పములఁ । గప్పురంబును దివ్య గంధాక్షతములు
మేడలపైనుండి మృగ విలోచనలు । క్రీడార్థ పరుఁడైన కృష్ణుపైఁ జల్లి
పలికిరి తమలోనఁ బరమమోదమున : । "పోలఁతిరో, చూచితే ! పురుషోత్తముని
అతివ[11]రో ! యితఁడు మత్స్యావతారమున । శ్రుతి రక్షణార్థమై సోమకుఁ జంపె.
మానిని, యితఁడు కూర్మస్వరూపమున । మానుగా ధరియించె మందరాచలము.

1. జీవుఁడు. 2. బలహీనులైన పాండవులు. 3. నొదుకుచు. 4. గలఁడు. 5. గట్టుల. 6. బోధ్యుండు; బాధ్యుండె. 7. పరిశుద్ధి పొంది. 8. వచ్చుటయు. 9. యెడనెడ. 10. వేడ్క. 11. యీతండు.

అతివ, యీతఁడు హిరణ్యాక్షు మర్దించి । కుతలంబు వెసనెత్తెఁ గ్రోడరూపమున.
చెలువ, యీతఁడు నారసింహుఁడై పుట్టి । కలుషదైత్యునిఁ జంపెఁ గంబంబు వెడలి.
అబల, యీతఁ[1]డె వామనావతారమునఁ । బ్రబలుఁడై బలిఁబట్టి బంధించెఁ దొల్లి.
రాజాస్య, జమదగ్నిరాముఁడై యితఁడు । రాజులఁ జంపె నిర్వది యొక్కమాఱు.
రామ, యీతఁడె రఘురాముఁడై పుట్టి । రామకునై చంపె రావణాసురుని.
బలరాముఁడై పుట్టి పద్మాక్షి, యితఁడు । హలముఖంబున ధేనుకాసురుఁ జంపె.
ముదిత, యీతఁడె కృష్ణమూర్తియై పుట్టి । పదియాఱువేల గోపస్త్రీల నేలె.
కలకంఠి, [2]యీతఁడె కలికియై పుట్టి । నెలవుగా ధర్మంబు నిలుప నున్నాఁడు.”
అనునంతఁ బురిలోన హరిఁ జూడవచ్చి । జనులు పైపైఁబడి సందడిం[3]పఁగను
‘పాయుఁ డొత్తకుఁ’ డని పటు వేత్ర[4]ధరులు । వ్రేయ[5]వ్రేయఁగనీక వేడ్కవారించి

## కృష్ణుఁడు ధృతరాష్ట్రమందిరమున కేఁగుట

సమ్మర్దమందమైచను తేరిమీఁద । నెమ్మిఁ గృష్ణుఁడు వచ్చి నృపునిల్లు గదిసి
వరరత్నతోరణద్వారంబు దూఱి । [6]కరమర్థి మెఱయు కక్ష్యలు దాఁటిపోయి
సరస [7]నేనుంగు మోసాలయుఁ జొచ్చి । యరదంబు డిగ్గి యొయ్యన వచ్చునపుడు
మున్నాడి చని భీష్మముఖ్యులా తెఱఁగు । విన్నవించిన [8]భూమివిభుఁ డర్థి లేచి
సదయాత్ముఁడగు శంఖచక్రాయుధునకు । నెదురుగా వచ్చిన నింపార నతఁడు
కౌరవేశ్వరు గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి । యా రాజసమున నొయ్యన [9]గారవించి,
యాచోటి వృద్ధుల కంతరం బెఱిఁగి । యాచార మొనరింప ననుజుఁ జాలించి,
తగఁ జొచ్చి ధృతరాష్ట్ర దర్శితంబైన । తగు పీఠ[10]మెక్క నత్తఱిఁ బురోహితులు
అధినాథు పనుపున [11]నర్ఘ్యపాద్యముల । మధుపర్కవిధుల సన్మానించి రొప్ప.
అంతట [12]నందఱు నాసీనులైనఁ । గంతునితండ్రిచేఁ గర మొప్పెఁ గొలువు.
హరియు ధర్మజుమాట [13]లచటి బంధులకుఁ । బరిరంభ వందనపరిపాటిఁ [14]జెప్పి
పతితోడ వినయంబు ప్రజతోడ మెలపు । హితులతో మేలంబు నెసఁగ భాషించి,
సొరిది నందఱకును సుదినంబుచేసి । కురురాజు తండ్రిఁ బేర్కొని వినయమున

1. ండె నృసింహుఁడై. 2. యితఁడమ్మ. 3. పుచును. 4. కరులు. 5. ంగఁ బూనిన. 6. కరము మెఱయంగ. 7. భోజన. 8. ను భూవిభుఁడు వేవేగ. 9. గౌఁగిలించి. 10. మెక్కినంతట. 11. హరి నర్ఘ్యపాద్య. 12. నచ్చట. 13. లన్ని. 14. దీర్చి.

## కృష్ణుఁడు విదురు సదనమున కేఁగుట

“విదురు [1] నిల్లును గొంతివేశ్మంబుఁ జొచ్చి । పదపడి వచ్చెదఁ బనిగల.” దంచు
నతని సమ్మతమున నచ్చోటు [2] గదలి । జతనంబుతో శౌరి చనుదెంచుటెఱిఁగి
ముదమున విదురుండు మున్నాడిపోయి । చదురునఁ దనయింట జలజనాభునకు
నీరాజనంబులు నియతిఁ బాద్యములు । హారిదర్భలతోడ నర్ఘ్యపాద్యములు(?)
నాసనంబులుఁ [3] జీర లనులేపనములు । వాసనాజస్రములు వరభూషణములు
దంతి ధేను రథాశ్వ దాసీజనములు । సంతన కట్టించి సంభ్రమంబొప్ప
సుదతులుఁ దానును సుతులు నాతనికి । నెదురేఁగి కొనివచ్చి యెలమిఁ బూజించి
కుశలంబులడుగ నక్కోలఁదు లన్నియును । విశదంబుగాఁ జెప్పి వేడ్కఁ దైవాఱ
నిష్ట కథాగోష్ఠి నించుక[4]తడవు । విష్టపధరుఁ డుండి విదురునీక్షించి

## కృష్ణుఁడు కుంతి యింటి కరుగుట

‘మాకుంతి కడ కేఁగి మఱివత్తు’ ననిన । ‘మీకు [5]మాయింట సుమీ నేఁడు విందు
విచ్చేయుఁ’ డని చెప్పి విదురుఁ డున్నంత । నచ్చక్రధరుఁడేఁగి యత్తకు మ్రొక్క
నద్దేవి హరిఁజూచి యాత్మీయ[6]సుతులఁ । దద్దయుఁ దలఁచి సంతాప[7]భారమునఁ
జక్రి కంఠప్రదేశము గౌఁగిలించి । యాక్రందనము[8]సేయ [9]నతఁడు వారించి
యూరార్చుటయుఁ [10]గొంతియుడుకారి [11]కుంతి । శౌరికిఁ దగినపూజలుసేయఁ బనిచి
యతని గద్దియపొంత నాసనంబెక్కి । యతిదైన్యవృత్తి నిట్లని పల్కఁదొడఁగె :
“గోపాలవల్లభ, కుశలమే నీకు? । నా[12]పుత్త్రపౌత్త్రు లున్నారె సేమమున?
నీశిక్షఁ బెరిగిరి నిఖిలజ్ఞులయిరి । రాశికెక్కిరి వారు రాజ్యంబుగనిరి.
[13]అంతటివారి కా యా పరిభావ! । మింతయు నాపుణ్య మేమనఁగలదు!
ఏనుబెట్టినకూడు హిత[14]ముగాఁ గుడిచి । పానుపు[15]లొప్పఁగాఁ బరఁగ నిద్రించి
కరిబృంహితములు మంగళపాఠరవము । లరసి మేల్కొను భోగు లకట! పాండవులు
నేఁడు కూరలు తిని నేల నిద్రించి । వాఁడి మృగంబులు వాపోవ లేచి

---

1. నిల్ కుంతి నివేశంబు. 2. వెడలి. 3. విరు. 4. సేపు. 5. నా. 6. జనుల. 7. భావమున. 8. సేయు. 9. నపుడు; నంత; నత్త. 10. గొంతి. 11. కొంత. 12. పుత్త్రులెల్ల నున్నారె. 13. ఇంతటివారికె యీ. 14. మని. 15, లొప్పు.

యిడుమల నడవి ననేకకాలంబు । పడిరి పాండుఁడు లేని పాపంబువలన.
అంచిత దుఃఖంబులన్నియు నోర్చి । పాంచాలి [1] యున్నదే పతులసన్నిధిని !
అది నన్నుఁ గొడుకులయట్ల సేవించు । మది వేఱు సేయు సమ్మగువకు నేను;
పగతురచే [2]నట్లు బన్నంబునొంది । ముగద ప్రాణము లోకమోప్పుగా మోచు.
వనితకు నాఁడట్లు వస్త్రంబులిచ్చి । మునుమిడి [3] మూనాల్క మ్రుల్లుపుచ్చితివి.
నరకవిరోధి, యెన్నఁడు వేఁగునాకు ? । కురురాజు పెట్టఁగాఁ గూడెట్లు గుడుతు ?
నేనును గురురాజు నిచ్చలోఁ బొందు । సూనుల మాఱుగాఁ జూతుఁ; జూచినను
గనకలేపన తామ్రకలశమై వాఁడు । తన యంతరాత్మశుద్ధత నొందనీఁడు.
అనఘ, మాబావయునటువంటివాఁడు । మనకునాడుటగాదు; మాన్యుఁ [5]డొక్కరుఁడు
[4]విదురుఁ[6]డాతఁడు ధర్మవిదుఁ డంగులోన; । అది కొంత సంతోషమైయుండు నాకు.
ఇంక ధర్మజుతోడ నీవు సంగ్రామ । మంకురించినఁగాని యశము లేదనుము.
వారక భీముఁ గవ్వడిఁ జూచి నాకు । వీరసూ[7]శబ్దంబు వెలయిం[8]పుఁ డనుము.
నకులుని సహదేవు నా[9]మాటగాఁగఁ । బ్రకటశౌర్యము దాఁపఁ బాడిగాదనుము.
ద్రౌపదితోనైనఁ దలపోసిచూడుఁ డేపారఁ । గదనంబు హితము మీకనుము.
వారంత మెఱుఁగరు వారికి నీవు । కౌరవక్షయ చింత [10]గావింపవయ్య.
అర్జును డుదయింప నాకాశవాణి । 'నిర్జించు [11]వీఁ డరి నృపకోటి' ననియె.
అదియెల్ల నిజముసేయక నీకుఁబోదు । కదనంబులో వారిఁ గదియింపు." మనిన
నీలవర్ణుఁడు పల్కు: "నెలఁత, నీయాజ్ఞ । వాలాయమును జేయువారు పాండవులు.
నీపల్కులకుఁగాదె నెమ్మి[12]నేవురును । ద్రౌపదీకాంతకు ధవులైరి వారు;
విమతశిక్షయు వారు వెదకుచున్నారు; । సుముఖి, నీదీవన సుఖమున్నవారు;
ధర నీవు మేనయత్తవు తల్లిమాఱు । గురువాక్య మేనట్లు కుఱుచసేయుదునె !
పాండవులకుఁ జెప్పి పరులఁ జంపింతు । నుండు నెమ్మది." నని యుపచరించుటయు
గొంతి గోవిందునిఁ గొనియాడుచుండె. । నంతఁ గృష్ణుఁడు లేచి యాదేవి నిలిపి

## శ్రీకృష్ణుఁడు దుర్యోధను మందిరమునకు వెడలుట

ప్రత్యక్షరాక్షసు ఫణికేతుఁజూడ । సాత్యకి కృతవర్మ సహితుఁడై పోవ
దౌవారికులు పాఱి ధార్తరాష్ట్రునకు । నావార్త యెఱిఁగింప నంతకుమున్నె

1. యున్నది. 2. బడి భంగంబు. 3. నాలుక. 4. అనఘాత్మ. 5. లంచఱును. 6. డొక్కఁడు. 7. నామంబు. 8. మనుము. 9. మాఱు. 10. గల్పింపుమయ్య. 11. వీఁడుపో. 12. ఁబాండవులు.

[1]ముత్తేలమేడపై మురిపంబు మెఱయఁ । గ్రొత్తగాఁ గురురాజు కొలువున్నకతన
హరి నిందుఁ దోడితెండని వారి ననుప । నరుదెంచి వారు నయ్యధిపుఁ దోడ్తెచ్చి
కక్ష్యలు దాఁటించి కనకసోపాన । కక్ష్యల సౌధమార్గంబు నెక్కించి
కురురాజుఁ జూపినఁ, గురురాజు భీష్మ । గురుకర్ణ[2]ముఖ్యులు గొబ్బున లేచి
శౌరి కౌఁగిలిఁగాంచి సద్భక్తి నతని । [3]నారూఢి సింహాసనాసీనుఁ జేసి
యనుజన్మశతముచే నమ్మహాత్మునకు । ననుజన్మయుతముగా నర్చన లిచ్చి
[4]మణిభూషణాంబర మాల్యంబులిచ్చి । గుణకీర్తనముచేసి కూర్చున్నయెడను
వాసుదేవుం డొకవంక భోజనము । చేసి [5]వచ్చెడుమాడ్కి చిహ్నంబుదోఁప
శాకపాకంబుల చవు లుగ్గడింప । నాకథ యెఱిఁగి నాగాంకుఁడు కర్ణు
నల్లన నిట్లను: "హరిచూడు కుడువ । నొల్లని తలఁపువై నున్నవాఁ డిచట;
ఆకారణం బేనె యడిగిచూచెదను । [6]మాకడఁ గుడువక మానుఁగా." కనుచుఁ
బీతాంబరునిఁజూచి పృథివీశతనయుఁ: । "దేతెమ్ము [7]కుడువ నాయితముచేసితిమి;
కడుయత్నమునఁ జవిగాఁ గూడు కూర । కడగట్టి చేసిరిక్కడ నేఁడు నీకు;
నీవు వచ్చినదాఁక నేను భోజనము । గావింప [8] నిప్పుడు కదలి ర." మ్మనిన
హరి పల్కె: "నే దూతనై వచ్చినాఁడఁ । గురురాజ, నీయింటఁ గుడువఁగారాదు;
ఏను వచ్చినకార్య మీడేర్పు తొలుతఁ । బూని భోజన మెందుఁబోయెడి?" ననిన
జననాథుఁ డిట్లనుఁ: "జనదిట్లు పలుకఁ । బనిగాక [9]కుడువనన్ బ్రతిన నీకేల?
దూత మాత్రుఁడవె! బంధుఁడ వీవు మాకు; । నీతెఱంగున వింతలేటికి?" ననిన
హరి చిన్ననగవుతో నతనిహస్తంబు । కరమర్థిఁ దన కేలఁ గబళించి పలికె:
"ఆపన్నునకునైన నాప్తునకైన । నేపార భోజన మిడవలె వినుము;
ఆపద లెఱుఁగ [10]నేనాప్తుఁడఁ గాను । భూపాల! నీయింట భోజనం బేల?
వినుము వైరులఁ బిల్చి విందుచేసినను । మనసు నమ్మకయుండు మతిమంతులకును.
పగతునిఁ గుడువఁజెప్పక వానియింటఁ । దగిలి తాఁ గుడువక తప్పింపవలయు.
'అట్లైనఁ బగవాఁడ [11]ననికదా నన్ను । నిట్లు పల్కితి' వని యెగ్గుపట్టకుము.

---

1. ముత్యాల. 2. ముఖ్య శల్యులుఁ దాను. 3. అరూఢ రత్నసింహాసనుఁజేసి. 4. గుణకీర్తనముచేసి కూర్చున్నయెడను । గణుఁకఁ గౌరవపతి ఘననిభశ్యాముఁ । బద్మనాభుని దిక్కు భక్తి వీక్షింపఁ । బద్మపత్రాక్షుఁ డొకప్రక్క భోజనము । చేసి వచ్చినయట్టి. 5. వచ్చినయట్టి; వచ్చినమాడ్కి. 6. నీకేమి రాకమానిన మానెఁగాక; అకట కుడువక మానినమానె ననుచు. 7. భోజనాయితము చేసినది. 8. కున్నాఁడ. 9. కుడువని. 10. నీ యాప్తుఁడ. 11. వని.

పాండవద్వేషివై పరఁగిన నీవు । పాండవప్రాణికిఁ బగగావె నాకు ?
అరయ [1]నీవిడిన దుష్టాన్న మేనొల్ల । సరిగాద విదురుఁ డిష్టాన్నంబు వెట్టు.''
అనిచెప్పి హరి లేచి యతఁడు తన్ననుప । ననుజనమేతుఁడై హార్మ్యంబు డిగ్గ
గురు ముఖ్య మంత్రులు కూడంగఁబాఱి । "సరసిజనేత్ర, మాసదనం[2]బులకును
నరుదెంచి మమ్ముఁ గృతార్థులఁజేయు । మరయఁ గానుకలిత్తు.'' మనుటయు నిలిచి
సరసిజాక్షుఁడు వారిఁ "జాలఁ గానుకలు । పొరసితిఁ బొం'' డని పొందొంద [3]నిలిపి

విదురుఁడు కృష్ణు నుపచరించుట

రథమెక్కి యింటికిరా విదురుండు । ప్రథితసంతోషుఁడై భార్యలుఁ దాను
శౌరిఁ దోడ్కొనిపోయి సపరివారముగఁ । జారుతోయముల మజ్జనమొప్ప నార్చి
వెసఁ జతురంతమై విస్తరంబైన । పసిఁడికూటములోనఁ బంతిగా నునిచి
రత్నదీపంబులు రత్నపాత్రములు । యత్నంబుతోఁ బెట్టి యదుకుమారు[4]నకుఁ
గలవంటకములు శాకములుఁ బాయసము । ఫలములు నేయి సూపము[5]లు భక్ష్యములు
వడియంబు లుక్కెరల్ వరుగు లప్పళము । పడిదెముల్ పచ్చళ్లుఁ [6]బానీయములును
గాయలు గలపులుఁ గజ్జంబు లూరు । గాయలు [7]మొదలుగాఁ గడఁగి వడ్డింప
నవిరళ [8]హితముతో హరి యారగించి । భువనభాజనమైన బొజ్జ నిండింప
నాయెడ విదురుండు హస్తోదకములు । పోయించి హరికిఁ దాంబూలంబు లిచ్చి
మెలపైన బంగారు మేడపై నునిచి । పులుగుఁ జందనముఁ గర్పూరంబు నలఁది
తోలఁగక చామరాందోళనంబునకు । నెలఁతల [9]నియమించి నెఱిఁ గొల్చియుండఁ
[10]గవి నట పాఠక గాయకా[11]దులును । వివిధ విద్యలవారు వెసఁ గానవచ్చి[12]

1. మీయిండ్ల. 2. భూములకు. 3. ననిపి. 4. లకు. 5. లపూపములు. 6. బానకంబులును.
7. వడలాదిగాఁగ. 8. హితులతో. 9. ఁజాలించి. 10. గవిసిన. 11. ధిపుల.

11. వెరవొప్పఁ దమ తమ విద్యలు చూపఁ । బరఁగి రావలె మాకుఁ బన్నిద్దఱకును
అని తోడువాయక నరయ వెదకుటకుఁ । జనునట్లు రవిగ్రుంకెఁ జరమాబ్ధిలోన.
తనుబట్టఁజూచిన దాయలమీఁదఁ । బనివడ నిట్లుఱఁబొఱు నచ్యుతుఁడు
అనిచూపి చెప్పినయట్లుఱసంజ । గనుపట్టె నరుణపంకజ నిభచ్ఛాయ.
హరి వచ్చియును సంధి యమరకపోవ । పురములు దలఁచి(?) భూభుజులాత్మ నిట్లు
చిన్నఁబోవుదురని చెప్పినయట్లు । క్రన్నన నణఁగెఁ బంకజవికాసంబు.

హరిచేత బహులాభ మందు నొందఁగను । సరసిజాప్తుఁడు గ్రుంకె జరమశైలమున.
అప్పుడు సాంధ్యకృత్యములెల్లఁ దీర్చి । యొప్పైన పాన్పున నురగేంద్రశాయి

## కృష్ణుఁడు విదురుతోఁ బ్రసంగించుట

పవ్వళింపఁగఁ జేరి పల్కెను విదురుఁ: । "డివ్వేళ నెత్తువే యీవు సంధికిని?
ఆరూఢమైన నీయానతిక్రమము । కౌరవు లొనరింపఁ గలవారు గారు;
కర్ణ భీష్ముల లావుగని నమ్మి వీరు । దుర్ణయంబున [1]నాజి దొరకొన్నవారు.
రాజసూయమునఁ బరాజితులైన । రాజులందఱును రారాజుతోఁ గలిసి
చలమున నాతని [2]సంధింపనీరు. । తెలియఁజెప్పెద మీకు దేవతావంద్య!
హుంకారయోగ్యుల నొరఁగు సీలలకు । వంకసీలలుగూర్చి వలదు బోధింప;
మృత్యువునకు వీరి మీఁదెత్తియుండు । సత్య మీ పలు." కన్న జలజనాభుండు:
"కలదిది నేనును గన్నయర్థంబు । వలదని యొక [3]మాటు వారించి చూతు;
[4]సంధిమానిన యుద్ధసంధిఁ బాండవుల । సంధించు శరములసంధి కౌరవుల(?)
ఆపద యెడలించి యతులమోదమ్ము । చూపిన యదిగదా చుట్టఱికమ్ము!
ఇచ్ఛతో వీనిఁ బోయినయట్లు పోవ । నిచ్చుటగా దింక నేను రేపాడి
విననిమ్ము కురురాజు వినకపోనిమ్ము । పనివడి బుద్ధిచెప్పకమాన." ననుచు
విదురునిఁ బోనిచ్చి విశ్రామనిద్ర । యొదవి సుఖించె నయ్యురుపుణ్యమూర్తి.
అమృతంబు ద్రావుచో నాబిందువొకటి । యమరేంద్రుసతి మింటి [5]కటు చిమ్మెననఁగఁ
[6]గూచికుత్తుకఁ గోడి కూయకమున్నె । తోఁచె వేగురుఁజుక్క తూర్పుదిక్కునను;

---

హరియెల్లి నగరికి నరుగుచో వీధిఁ । బురకామినులు చల్లు పుష్పాక్షతముల
నంబరమిట్టుండు నని చెప్పినట్లు । పంబి చుక్కలుదోఁచె బహుభంగి మింట.
దినమెల్ల దరుల ధాత్రికి మోమువాల్చి । యినుఁడు గ్రుంకఁ జెలంగి రేయేతెంచెననఁగఁ
గీలిత మణిదీప కృతదివ్యరూప । మాలికాస్తవితాన మంజుసోపాన
కుంకుమాగరుదీప కువలయవ్యాప్త । సంకీర్ణ బాలికాస్వర చంద్రశాలఁ
దగు హంసతూలికా తల్పంబునందు । సుగుణుండు నిద్రచే సుఖమున్నయంత
నమృతంబు ద్రావుచో. (ఆదిగా మూలము చూచునది)

1. కాజి దొరకుకొన్నారు. 2. సంధి గానీరు. 3. మాట. 4. గట్టక. 5. కది మీజె. 6. దోఁచె వేగురుఁజుక్క తూర్పుదిక్కునను । గూసెఁ గొక్కెర కోడి కోయని యపుడు (?).

సంధిగిట్టక శౌరి చనుదెంచు నింక । సంధిల్లు రణమని సకలపార్థులకు
నానంబులు విచ్చునన్నట్లు నలిన । కాననంబులు విచ్చెఁ [1]గమలాకరముల;
విహగవాహనుఁ డిందు వేంచేసినాఁడు । మహి[2]మతో మనకేల మాన మన్నట్లు
క్రమ మొప్ప భాషించుగతి విహంగముల । గుములు పల్కఁగఁ జొచ్చె గూఁడులు వెడలి;
బడబాగ్నిఁ బడకుండఁ బ్రాచి బంగారు । కడవ మీఁదికి నెత్తెఁ గలశాబ్ధినుండి
యనఁ గుంకుమచ్ఛాయ [3]యలుఁగులు వాఱ । [4]వనజాప్త బింబంబు వారిధి వెడలె.

## భాగవతులు కృష్ణునిఁ గైవారము సేయుట

ఆ తెఱఁగున వేఁగునంత లోపలను । బాతకవిముఖులు పరమార్థవిదులు
శ్రీ భూవరప్రియ [5]చిహ్నోర్ధ్వ పుండ్ర । శోభితుల్ భువన విశుద్ధ పద్మాక్ష
మాలికాలంకృతుల్ మణిమయ భూష । ణాలంకృతులు ధవళాంబరావృతులు
పంచ సంస్కారైకపావనుల్ నిత్య । పంచమహాయజ్ఞ పారీణు లఖిల
వేద వేదాంతార్థవేదులు సామ । వేదోపవేదప్రవీణు లైనట్టి
ఘనభాగవతు లుషఃకాలంబునందుఁ । జనుదెంచి విదురుని సదనోపకంఠ
మున నిల్చి దండెలు మొగిఁ దాళములును । బనుపడఁ గూర్చి సంభ్రమమునఁ బేర్చి
నారద వీణా నినాదానుకారి । నారదగాన మానము మించనపుడు
ఉదయరాగము లింపు లుదయింపఁజేసి । యదుకులస్వామి కల్యాణగుణంబు
లంకించి పాడిరి యానందమెసఁగ । సంకీర్తన క్రమసరణి నిట్లనుచు :
" భూరమణీ చతుర్ముఖ ముఖ్యదేవ । తారాధ్య దివ్యపాదాబ్జ! మేల్కనుము.
దేవ గోవిప్ర వైదికములకైన । దేవకీసుత! వాసుదేవ! మేల్కనుము.
హరి బలభద్ర రామానుజ మనుజ । వరవేషనుత! తపోవరద! మేల్కనుము.
పూతనా స్తన్య మింపుగ నాని దానిఁ । బూతాత్మఁ జేసిన పుణ్య! మేల్కనుము.
వికటంపు శకటంపువేషి విద్వేషి । వికటానఁ దన్నిన నిపుణ! మేల్కనుము.
వడి గాలి కీలున వసుధపైఁ గూల । సుడిగాలిఁ దివిసినశూర! మేల్కనుము.

---

1. గడుఁ గొలంకులను. 2. మనలకు నెల్ల మాన మే లనుచు. 3. నలఁపులు. 4. నెనయంగఁ దూర్పున నెఱసంజవొడమె । ఈ తెఱంగున వేగ నిందిరావిభుఁడు । సూతుఁడు బోధింప సుముఖుఁడై తెలిసి । యప్పుడు సాంధ్యకృత్యము లెల్లఁ దీర్చి । యొప్పుగా భూషించి యుండె నంతటను । అంత దుర్యోధ నుండు ... 5. శ్రితులార్ధ్వ.

ఉద్దుల మద్దుల నొక రోలఁ దగుల । గ్రద్దన గూల్చిన ఘనుఁడ ! మేల్కొనుము.
కొద్దిమీఱిన పెరుఁగులును మీఁగడలు । ముద్దల వెన్నల ముద్దు చిన్నెలను
ఆలోలగతిఁ గొల్లలాడి గొల్లతలఁ । గేళిఁ దేల్చిన దుండగీఁడ ! మేల్కొనుము.
అజగరంబై యున్న యమ దైత్యుచేత । వ్రజముగాఁ దగిలిన వత్సబాలకులఁ (?)
బ్రకటించి వెడలించె బాలుఁడై యుండి । సకల మునీంద్రులు సన్నుతుల్ సేయ
నిది చోద్యమాతని నీక్షింత. " మనుచు । ముదితాత్ము లై సురమునులు దేవతలు
నినుఁ బరీక్షింపఁ బూనిక వచ్చినపుడు । వనజసంభవుని దుర్వార స్వీయ
మహనీయ మాయాబ్ధిమగ్నుఁ గావించి । మహిమమించిన జగన్మయ ! మేలుకనుము.
శ్రోణీ[1]భరంబులు శోణాధరములు । వేణీ[2]భరంబులు వృత్తస్తనములు
రాణించు గోపికావ్రజముఁ జొక్కించు । వేణునాదైక ప్రవీణ ! మేల్కొనుము.
వరయమునాతీర వన్యావిహార । సరస రసక్రియా చతుర, మేల్కొనుము.
గోవర్గ గోపాలకులను రక్షింప । గోవర్ధనంబెత్తి గొడుగుగాఁ బట్టి
సురరాజు గర్వంబు ప్రుక్కించునట్టి । వర దేవతా చక్రవర్తి ! మేల్కొనుము.
కాళియ ఖర ధేనుక ప్రముఖారి । జాలమర్దన, దయాశాలి ! మేల్కొనుము.
మేదురమణిదండ మిహిరప్రచండ । కోదండ వేదండ గురుకరోద్దండ
భుజదండ చాణూర ముష్టిక దళన । నిజభుజాదండ నిర్నిద్ర ! మేల్కొనుము.
కట్టిఁడి కంసునిఁ గడ తేర్చి తాతఁ । బట్టంబుగట్టిన ప్రభువ ! మేల్కొనుము.
తనరార [3]గురుసుతున్ ద్వారక విప్ర । తనయులఁ దెచ్చిన ధన్య ! మేల్కొనుము.
సనమల రుక్మిణీ సత్యభామాది । మదవతీ మదనమన్మథ ! మేలుకనుము.
బాణాసురాంతక [4]బాణ, ప్రసూన । బాణారి భయదోగ్రబాణ ! మేల్కొనుము.
భవ్య దివ్యజ్ఞాన భక్తిప్రపత్తు । లవ్యయ ధర్మంబులనుచుఁ బార్థులకు
నుపదేశ మొనరింప నురగిధ్వజాది । విపరీత చరితుల వేగఁ [5]జంపింపఁ
బాండవాగ్రజు సార్వభౌముఁ గావింప । దండి రాక్షసకోటి ధరమీఁదఁ గూల్ప
(జనియించినట్టి యో జగదేకవర్య !) । ... ... ... ... ...
వనజాక్ష, యోగీంద్రవంద్య, ముకుంద, । వనమాలి, రుక్మిణీవరద ! మేల్కొనుము.
ధారుణి శిశుపాల దంతవక్త్రాది । క్రూరకర్ములఁ ద్రుంచి కుంభినీభార

1. 2. ధర. 3. గురుసుతు న్ద్వారక. 4. ప్రాణా. 5. రప్పింప.

మడఁగించి వేదమార్గము మీఱ నియతి । నడపించినట్టి భూనాథ! మేల్కనుము.
[1]తడవుండ సంపదల్ దానవర్గముకుఁ । జెడని యర్థంబు కుచేలాదులకును
జిరరాజ్యపద ముగ్రసేనాదులకును । ఉరుముక్తి పదవియు నుద్ధవాదులకుఁ
బ్రణుతింప నొసఁగిన పరమకల్యాణ । గుణగణాంభోధి! మేల్కను." మంచుఁ బాడ
క్షీరవారాశిపై శేషతల్పమున । నారూఢ యోగ నిద్రాసక్తి నున్న
నారాయణుఁడు తొల్లి నానావిచిత్ర । నారద గానమానము వించువించుఁ
గరుణతో మేల్కొన్న గతిని శ్రీకృష్ణుఁ । డురు దయామతి నిద్ర యొక్కింత దెలిసి
మేనొయ్య నొక్కింత మెదల నిట్టట్టు । పానుపు గదలఁ జొప్పడఁ బొడవెట్టి
నిక్క పాదంబులు నిగిడించి చేతు । లొక్కింత చాచుచు నొయ్యన నిగిడి
కరుణారసం బెందుఁ గలయంగ [2]విచ్చు । తరుణారవింద సౌందర్యంబులైన
తెలిగన్ను లొయ్యనఁ దెఱచి వే[3]దెలిసి । కలితాత్ముఁడై యొక్కగడియ గూర్చుండి
తూఁగుమంచముచెంతఁ దొరసియున్నట్టి । బాగైన బంగారు పావలు మెట్టి-
కొని, చని తనుశుద్ధి కొమరొప్పఁ దీర్చి, । గొనకొని బంగారు కొప్పెరలందుఁ
బ్రమదలు దాఁచిన పన్నీట మజ్జ । నము క్రమమునఁ దీర్చి నలినలోచనుఁడు
[4]చీనిపావడలఁ జెచ్చెరఁ దడియొత్తి । వేనలి యొక శిరోవేష్టిచేఁ జుట్టి
ధవళంపు టుభయవస్త్రములును గట్టి । నవరగాఁ గేశపాశము లార్చి కూర్చి
నిడుదగాఁ గీల్గంటు నేర్పున వైచి । కడఁక సంక్షాళిత కరపద్ముఁ డగుచు
నలరి శుద్ధాచమనాంత్యంబునందుఁ । బొలుపారఁగా నూర్ధ్వపుండ్రముల్ దాల్చి
పనుపడ సంధ్యాజపంబులు దీర్చి । తనరార నగ్నిహోత్రక్రియ నడపి
పొగడొందఁగా దేవపూజయొనర్చి । తగు విప్రులకు నిత్యదానంబు లొసఁగి
చెలఁగి వారొసఁగు నాశీర్వాదమంత్ర । సలలితాక్షతలు మస్తకమునఁ దాల్చి
వినయాంజలులు చేసి వేడ్క వీడ్కొలిపి । ఘనసార మృగమద గంధంబు లలఁది
కుండల కేయూర కోటీరహార । మండల ముద్రికా మంజీర ముఖ్య
నిస్తుల రత్నమానిత భూషణములు । కౌస్తుభ వనమాలికలు లీలఁ దాల్చి
యిన్నియు [5]నిలఁదోఁప నెలమంచుఁబోలు । సన్నపుఁ[6]బేరణి సరసతఁ దొడిగి
యిచ్చలో మెచ్చు లూరించు కప్పడ[7]పుఁ । గుచ్చుల ముత్యాలకొంగులు చుంగు

1. దడవంద. 2. విందు. 3. దెఱచి. 4. చని. 5. సెల. 6. వేరిణి. 7. ము,

లోనపరిగాఁ దూల నొయ్యారమునను । బసిఁడిపచ్చడము నేర్పడ వల్లెవైచి
కనకంపు మణిపాదుకలు లీల మెట్టి । ఘనుఁడైన యొకమంత్రి కైలాగువట్టి
కొమరొప్పు ముత్యాల గొడుగులనీడ । సమదేభలీల రాజన ముప్పతిల్లఁ
జనుదేరఁ, గంచుకిజనము లావేళఁ । గనకవేత్రోల్లాస కరపద్ములగుచు
"రాజేంద్ర, దేవ, పరాకు! హెచ్చరిక! । శ్రీజయోన్నత, జియ్య, శ్రీపాద, జతన!
అవధారు దేవర!" యనెడు కైవార । రవళియు బహువాద్య[1]రవళియు నడర,
నగరర్థి వెడలి నానా చిత్రగతుల । జిగిమించు మణిహేమ చీనాంబరాదు
లొనరింప శృంగార మొప్పు హజార । మునకు నేతేర సన్మనులు విద్వాంసు
లిష్టమంత్రులు పురోహితులు భూపతులు । శిష్టవర్తనులు విశిష్ట విద్యా వి
శిష్టులు మొదలైన సేవకోత్తములు(?) । నిష్టాత్ములై నిండి యిరువంక బలసి
గొలువంగనుండ, ముకుందుండు నమిత । సులభుండు వేదాంత సూత్రపాత్రుండు
శ్రీకాంతుఁ డతిదయాసింధుం డశేష । లోకనాయకుఁడు సుశ్లోకుండు జనుల
నయనాబ్జ హృదయాబ్జ నమితముఖాబ్జ । చయములకెల్ల వికాసంబు[2]నొదవ
బలువిడి విదురాది బంధులు గొల్వఁ । గొలువిచ్చియుండెను గోవిందుఁ డపుడు.

## దుర్యోధనుఁడు శ్రీకృష్ణుని సభకుఁ దోడ్కొనిపోవుట

అంత దుర్యోధనుఁ డధిపతియాజ్ఞ । నంతంతఁ గర్ణాదు లరుదేరఁ గదలి
విదురునింటికినచ్చి విష్ణునిఁగాంచి । హృదయంబు గానరా నెలమి వాటించి
'మాతండ్రి యాస్థానమంటపంబునకు । నేతెంచె' ననఁగ లక్ష్మీశుండు లేచి
యాదవ కురువీరు లర్థిఁ దన్గొలువ । నాదట రథమెక్కి యతివైభవమున
శకుని నాగాంక దుశ్శాసన కర్ణు.। [3]లొక తేరఁ గృతవర్మయును సాత్యకియును
ఒక తేరుఁ దగనెక్కి యుభయపార్శ్వముల । సకలసేనాధ్యులై చనుదేరఁ గదలి
నలుగడ గరుడచిహ్నములు దూఁగాడ । వెలయఁ బౌరులకెల్ల వేడ్క చేయుచును
రాజీవనేత్రుండు రాజమార్గమున । రాజిల్లుగతి వచ్చి రాజిల్లు చొచ్చి
యరద మెయ్యనడిగ్గి యనుజన్ము నిదురు । కరములు తనరెండు కరముల నూఁది
నడతేరఁ, గర్ణుండు నాగకేతనుఁడు । జడిగొన్న సందడి జడియ(?)వేయుచును

1. రభసంబు. 2. నొంద. 3. లొకవంక రాఁ గృతవర్మ సాత్యకియు.

ధృతరాష్ట్రుఁ[1]జూపి, యు త్తమములపీఠమున । నతనిఁ దారునిచిన యంతలోపలను
నారదాదులు మునినాథు లభ్రమునఁ । జేరువఁ గానవచ్చిన, శౌరి లేచి
వారలఁజూచి దేవవ్రతుఁ[2]బలికె : । "వీరికిఁ దెప్పింపు విహితాసనములు ;
మనలఁ జూడఁగవచ్చి మాన్యు లిట్లుండ । మనకుఁ గూర్చుండుట మర్యాదగాదు.
అర్ఘ్యపాద్యములకు నాయిత్తపఱుపు । మర్త్యులు వీరు లోకారాధ్యు." లనినఁ
బరిచారకులచేత భాగీరథేయుఁ । డురు రత్నపీఠంబు[3]లొప్పఁ దెప్పించి
యందుఁ గృతాసీనులగు మునీశ్వరుల । నందంద పూజించె[4]నర్ఘ్యాభావమున.
అంతఁ గౌరవులెల్ల నమ్మహాత్ములకు । సంతోషమున మ్రొక్కి సమ్మతి వడసి
హరిపూర్వముగ[5]నప్పు డాసీనులైరి. । హరినలపటనుండె నటఁ గృతవర్మ ;
ఉరుశక్తి దాపటనుండె సాత్యకియు ; । వెరవుతో విదురుండు వెనుకఁగూర్చుండె ;
నొక్కపీఠమున దుర్యోధన కర్ణు । లొక్కటఁ గూర్చుండి రొడళ్ళలు రాయ.
కడుమంచి పీఠిని గాంధారరాజు । గొడుకుల నడుమను[6]గూర్చుండె ; నంతఁ
గలువల విందు చుక్కలలోన నొప్పు । చెలువున నృపులలో శ్రీకృష్ణుఁ డొప్పె.
అందఱు హరిఁ గన్నులారఁ జూచుచును । నందడిమాటలు జరుపరేమియును.

## శ్రీకృష్ణుఁడు కౌరవసభలోఁ బ్రసంగించుట

ఆయెడ శౌరి మేఘాటోపరవము । సేయుచుఁ బలికె వైచిత్రవీర్యునిని :
"ధృతరాష్ట్ర, నీవు నీతిప్రవీణుఁడవు ; । చతురత సోమవంశప్రదీపుఁడవు.
సదయచిత్తులకును సాధువృత్తులకు । మొఱలిల్లు నీయిల్లు మోమాటగాదు ;
ఐనను నీకు నేనాప్తంబు చెప్పఁ । బూని వచ్చితి రాకపోరాదు గాన.
వినుము నీకులమున వెనుకనెవ్వరును । [7]జెనసి దుష్కీర్తి[8]మోచినవారు లేరు ;
ఇప్పుడు నీనూను లిదె పాండుసుతుల । రప్పింప రవని సర్థంబుఁ దామీరు.
ఈకపోయిన వారి నెఱుఁగరుగాని । లోకులు మఱి నిన్ను లోభాత్ముఁ డంద్రు ;
ఇది[9]నెట్టుకొన నీకు నిప్పింపవచ్చు । మది నుపేక్షించుట మనుజేంద్ర, తగదు ;
పోనఁగఁ బాండుసిచేతఁ బొందిన మేలు । వెనఁ జౌట[10]నాలికిన విత్తుగానీకు.

---

1. దపుడు. 2. బిల్చి. 3. లోలిఁ బెట్టింప. 4. హర్ష. 5. నప్పుడా. 6. గూర్చుండె నంత.
7. చనంటి. 8. చేసిన. 9. యెట్లు మీకును. 10. నేలపై.

ఆతని కడిమిఁ గదా యింత విరివి । భూతలంబబ్బె [1]నీఁబోలదె నీకు!
రణముఖంబున నుర్వి రాఁదలంపకుము ; । రణములోన జయింపరాదు పాండవుల ;
నరభోజనులనైన నరుఁడు మర్దించు । నరపదం బతని కెన్నఁగ [2]నెంతగలదు ?
భారతభటు లిట్లు బాహుగర్వమునఁ । బోరాడి పడుట మాన్పుము మాన్పవచ్చు.
పార్థులఁ బాండుభూపతి పరోక్షమున । నర్థితోఁ [3]బెంచి రాజ్యము చవిచూపి
[4]నేఁ డింత సేయుట నీతియె! వారిఁ । బోఁడిగా రప్పింపు భూమి యిప్పింపు.
భూపాల, నీతోడఁ బుత్త్రులు వినఁగ । నా [5]పాండవేయు లిట్లని పల్కు మనిరి :
"వనవాస మజ్ఞాతవాసయుక్తముగ । నొనరించి వచ్చితి ముర్వరయెఱుఁగ.
తప్పయ్యె నొప్పయ్యెఁ దానోర్చి మమ్ము । రప్పించి ధర నర్ధరాజ్య మీఁదగును.
వావిరి గురువు దైవము మాకుఁ దానఁ । గావునఁ దమతోడఁ గలహింప మెపుడు.
ఎంతచేసిన నోర్తు రీపార్థు లనక । యింతట మా భాగ [6]మిచ్చుటయొప్పు.
మాయెడఁ దాను నిర్మలచిత్తుఁడైన । వేయేల కురురాజు విడుచు నాగ్రహము."
అని చెప్పిరమ్మని రదియుఁ జెప్పితిని । విను మేనుజెప్పినవిధ ముత్తమంబు.
మదము మాత్సర్యంబు మాని పార్థులకు । ముదము చేసితివేని మోదించి వారు
తమపాల వచ్చిన ధాత్రి యేలుచును । మిముఁ గీర్తి లాభ సమ్మితులఁ జేయుదురు.
మున్ను నింద్రప్రస్థముననుండి వారు । జన్నంబు నెపముగాఁ జని నాల్గుదిశల
నరులచేఁ గొన్న రాజ్యంబు[7]ల మీఱు । విరివితోడుతఁ బాల్గు విడనాడినారు.
ఈనున్నచో వానినెల్ల రారాజు । పూని జూదమునెపంబున నాచు[8]కొనియె.
ఆజూదమున ద్రుపదాత్మజఁ బట్టి । రాజరాజట్లు చీరలు దోచు[9]కొనఁడె!
ఇదియేమి పౌరుష ? మిదియేమి నేర్పు ? । మది నెవ్వఁడోర్చు ధర్మజుఁ డోర్చెఁగాక.
ఆచేతకై నీవె యనుమతించితివి ; । చూచినయట్లు వచ్చునె మీఁదిపనులు ?
అవివేకమున నాఁటి కట్లాయెఁ బోయె । నవనీశ, వారి [10]నేఁడైనఁ గాపాడు.
ఎలమిఁ బాండవు లిప్పు డేవురు నిన్నుఁ । గొలిచి యుండెదమని కోరియున్నారు
రండని పిలుతువో ? రణబుద్ధి దగిలి । రండని పిలుతువో రాజేంద్ర ! " యనిన,
జనులెల్లఁ గర్ణరసాయనంబైన । వనజాక్షు పలుకులవలన హర్షించి ;
ఏమియు ననక నరేంద్రుఁ డున్నంత । జామదగ్న్యుఁడు పల్కె సర్పకేతనుని :

---

1. రాఁబోలెనె నీకు ; రాఁబోలేదు. 2. నేమి. 3. బెర్చి. 4. నేఁ డీయ ననుమాట. 5. పాండుపుత్త్రు. 6. మిప్పించు. 7. లు మీరు. 8. కొనఁడె. 9. దోచుమనియె. 10. నెట్లైన.

## జామదగ్న్యుఁడు దుర్యోధనునకు హిత ముపదేశించుట

"అవని దంభోద్భవుఁ డనురాజు తొల్లి । యవగాఢ బాహువీర్యమున గర్వించి
గంధమాదనశైల కంధరంబునను । గంధ సింధుర [1]యూధ కలితుఁడై పోయి
యాచోట నరుని నారాయణమౌనిఁ । జూచి కయ్యమునకు శూరుఁడై [2] పిలిచె.
పిలిచిన నరుఁడు కోపించి దర్భలను । వలకేలఁ గబళించి వరుస మంత్రించి
దంభోద్భవునిమీఁదఁ దవిలి వైచుటయుఁ । గుంభినిపై వాఁడు గూలెఁ; [3]గావునను
నాఁటి యానరుఁడును నారాయణుండు । నేఁటిమాత్రము[4]నను నిను గెల్వలేరె?
తనలావు నెదిరిసత్త్వము [5]నెన్నికాదె । యని సేయవలె." నని యాతండు సెప్పఁ

## కణ్వుఁడు దుర్యోధనునకు హితోపదేశము సేయుట

గౌరవేశ్వరుఁ జూచి కణ్వుఁ [6]డిట్లనియె: । "ఈరీతి కుచితమౌ యితిహాస మొకటి
వినఁబడు నది నీవు వినుము; మాతలికి । ననఘాత్మ, గుణకేశి యను పుత్రి గలదు;
ఆపుత్రి పెండ్లిప్రాయమునఁ జూపఱకుఁ । దీపు పుట్టించుచో దేవసారథియు
దీని లోకోత్తరతేజుఁడై మెఱయు । వాని కిచ్చెదనని వరుసఁ దానరసి
పాతాళమున కేఁగి ఫణికుమారకునిఁ । జూతాస్త్రసన్నిభు సుముఖుఁ బ్రార్థింప,
సురసూతుఁ బలికె నా సుముఖుని తాత: । "సుర[7]పురి వీనికిఁ జొరరాదు వినుము;
వీనితండ్రి వధించి వినతాసుతుండు । మానక వీనిని మర్దింతు ననుచు
వెదకుచున్నాఁడు నే వినువలే" ననినఁ । ద్రిదివసారథిఁ బల్కెఁ 'దెచులకు తాత!
హరిచేత వీనికి నభయమిప్పింతు । నరుదెంచు మీ' రని యటఁ గొనిపోయి
యాపాఁపఁ జేనిఁ దా నచ్యుతేంద్రులకుఁ । జూపి యత్తెఱఁగు భాసురలీలఁ జెప్ప
హరి కరుణించి యయ్యచలారిచేత । నురగేంద్రసుతుఁ జిరాయుష్యుఁ జేయించి
సర్పవైరికిఁ దానుఁ జాలియున్నంత । నర్పించె మాతలి యహికి నాత్మజను.
వైనతేయుఁడు వైరివధము లేకపుడు । దీనికి మూలంబు దేవేంద్రుఁ డనుచు
శ్రీపతియుతుఁడైన జిష్ణుసన్నిధికి । వేపోయి కోపింప వెఱచి వాసవుఁడు
'హరి యింతసేయించె నంత యేనెఱుఁగఁ । గరుణించి యాతప్పు కావవే!' యనిన
నది తద్ద వినక గర్వాతిరేకమునఁ । ద్రిదశేంద్రునకు వైనతేయుఁ డిట్లనియె:

---

1. కోటి. 2. నిలిచి. 3. గూలుటయు. 4. నకు. 5. నమ్మి. 6. ండు పలికె. 7. రాజపురి వీఁడు.

'నిన్ను నీతమ్ముని నిఖిలలోకములుఁ । గొన్ని చెప్పఁగనేల కొనరెక్కఁ దాల్తు.
నీకూడు గొని[1]పోక నిలిపితి [2]నిన్న । నాకూడు నీకిట్లు న్యాయమా సేయ?
ఊహింప మహినుండ నోడి నాదైన । యాహార[3]మది శూలి కటు హారమయ్యె.
ఇదియు నేఁడిట్లైన నేనిన్ను విడువఁ । గదఃఁబునకు వత్తుగా." కన్న శౌరి:
"యగు నంతలావు లేదనరాదు నీకు; । జగముల ననుఁ బ్రోవఁజాలుదు వీవు.
నీమీఁద నాకేలు నిలుపుచున్నాఁడఁ । [4]బ్రేముడిఁ దాల్పనోపినఁ దాల్పు." మనుచు
ముదలించి తనకేలు మోపఁ దార్క్ష్యుండు । చతికిలఁబడి హీనసత్త్వుఁడై యఱచి
తట తట రెక్కలు దాటించుకొనుచు । నటునిటు పెనఁగుచో నా కేలు దిగిచి
శ్రీకృష్ణుఁ డతనిఁ [5]జెచ్చెర గారవించి । కైకొనె నటుగానఁ గౌరవ్య, వినుము.
ఈతఁడు నాఁటియుపేంద్రుండు శౌరి । నీతిదప్పినవారి నియమించు." ననిన

## నారదుఁడు దుర్యోధనునకు నీతి గఱపుట

రారాజుఁ జూచి నారదుఁ డిట్టులనియె: । "సారచిత్తుఁడ వీవు [6]చపలత్వముడుగు;
చలము మానుము శౌరి సద్బుద్ధివినుము; । మెలపుతోఁ బార్థులమీఁది యాగ్రహము
విడువ[7]కయున్నను వినుము గాలవుఁడు । పడిన[8]పాటులు వచ్చు బహుభంగి నీకు.
గాలవుఁడను ముని కౌశికువలన । నోలి విద్యలు నేర్చి యొక్కనాఁ డతని
గురుపూజ నాచేతఁ [9]గొందుగా కనినఁ । గరుణాసమేతుఁడై కౌశికముని:
"పుత్త్ర, నీచేసెడిపూజ నేనొల్లఁ; । జిత్రంబుగా నన్ను సేవించి." తనిన
గాలవుం "డటుగాదు గావింతుఁ బూజ । వాలాయముగఁ గొనవలయు నీ." వనుచు
వడి వేసరింప విశ్వామిత్రుఁ డలిగి: । "విడువక యెల్లచో వెదకి నీవిపుడు

1. పోవ. 2. నన్ను. 3. భీతి నీయహిరసాతలము । వెసఁ జొచ్చియుండ నవ్వైరపెల్ల జరపి । దస గలి గిటకుఁ దోడ్తేర నెవ్వఁడవు.

4. భూమిఁగూలక వహింపుము చాలు ననుచు । నవలీల నతనిపై హస్తంబు చాచి । నివిడి నంతయు మేను నిమురఁ దార్క్ష్యుండు । నదరుచుఁ దన గర్వ మంతయు వదలి । చదికిలఁబడి.

5. నంచిత కృపాదృష్టిఁ । జేకొని యనిచె నీక్షితి నాతఁ డలరె । కావున నీదేవ కంటకవైరి । భావింప గర్వాంధుఁ బట్టి వధించు । నది నీవెఱింగి యీ యఖిలైకవంద్యుఁ । గొదలేని భక్తితోఁ గొలువు మేలనిన । రారాజు.

6. చలపట్టఁ దగదు. 7. కుండిన మున్ను. 8. పాటెఱిఁగింతు.

9. గొనుఁడు మీరనిన । గురువు శిష్యునిఁజూచి కోమరొప్పఁ బలికె । పుత్త్రక, నీచేయు.

కప్పారు నొకచెవి గలిగి శ్వేతాంగ । [1]మొప్పారు నెనమనూఱుత్తమాశ్వములు
తెమ్ము నా." కనుడు ధాత్రీభాగమెల్లఁ । [2]ద్రిమ్మరి తానట్టి తెఱఁగు గుఱ్ఱముల
నెచ్చోటఁ గానక యేడ్చుచో గరుడుఁ । [3]డచ్చోటి కేతెంచి యతని నూరార్చి
యమరేంద్రుపురిఁగాని యట్టియశ్వములు । సమకూర వందు రాఁజాలుదే ? యనుచు
నొడఁబాటుగల మాని నురు[4]పక్షపీధి । నిడుకొని జవమున నేతేర, నతఁడు
పలుచనై నిలువనోపక తూల ధాత్రిఁ । బులుఁగు ఱేఁ డొక మహా[5]భూధరంబెక్కి
యానిత్యకృతి డించి యవనికి డిగ్గి । మాని నిర్భాగ్యత మదిలోన నగుచు
నాయతితోడ యయాతియున్నెడకుఁ । బోయి కార్యంబు చెప్పుటయు నారాజు
తనకట్టి తురగరత్నంబులు [6]లేమిఁ । దనయ మాధవి యనుదాని [7]రప్పించి
మునిఁజూచి పల్కె : "నిమ్ముగ్ధగాత్రి మీరు । గొనిపోయి చూపుఁ డీకువలయేశులకు ;
వడి [8]నిట్టిహయము లెవ్వనివీటనుండెఁ । దడయక యొకలక్షదాఁక వాఁడిచ్చు
నీలేమఁ గొను." మని యిచ్చినఁ [9]బోయి । గాలవమాని యిక్ష్వాకునిఁ గాంచి
యాయింతిఁ జూపి కార్యంబు చెప్పినను, । ఆయయోధ్యారాజు నంగీకరించి
"యిన్నూఱుతురగంబు [10]లీలక్షణముల । నున్నవి నావీట నున్న [11]యిన్నూఱు
గొనిపొమ్ము వలసినఁ గొమ్మ నిం." డనిన । మునినాథుఁజూచి యమ్ముగ్ధియు పల్కె :
"మున్నొకముని నాకు మొగిఁ బుత్త్రుఁగన్నఁ । గన్నెతికమ్మను గరుణించి పోయె.
కావునఁ బుత్త్రులు గలుగునందాఁక । [12]నీ విభునకు నన్ను నిచ్చి వెండియును

---

1. మొప్పైన యెనమనూఱింగిఁ దెమ్ము అనిన । నిమ్ముల మునియు. 2. నిమ్ముల వెదకి తా నెంతయు డస్సి । యెచ్చట. 3. డచ్చటి. 4. భుజాగ్రమునఁ । దడయక గొని వియత్స్థలి కేఁగ నతఁడు.

5. భూధరంబునను । నానొప్పు మానికన్యకఁ బొడగాంచి । యాయింతి యుగ్రదేహాగ్నిలోఁ దనకు । రాయుచు నటఁబోవ రాకున్న మగుడి । యాయనఁ గొనుచు యయాతి యున్నెడకుఁ । బోయి యశ్వంబులు పాలుపార నడుగఁ । దనకట్టి.

6. లేక. 7. నిప్పించి. 8. ఁజూప. 9. గరుడి । గాలవుతోడ నక్కన్యఁ దోకొనుచుఁ । దగ నయోధ్యేశు సుధన్వునిఁగాంచి । మగువఁజూపుటయు నమ్మనుజేశుఁడలరి । యిన్నూఱు. 10. లీక్షణంబునను.

11. నున్నవే నెఱుఁగఁ । గొనిపోవవలసినఁ గొమ్మ నాకిచ్చి । కొనిపొమ్ము నాఁ బక్షికుల వల్లభుండు । చెలియ నీతనికి నిచ్చిన శేషహరులు । కలుగునొకో యని కడు విచారించి । నిన్నుఁ బొందియు ధరణీనాథ, దీని । కన్నెతికము చెడకయ నిల్చుఁగాక । గావున.

12. భావింప నిది నీకుఁ బత్నిద్వయియుండి । వెనుక మాకెంటనె వెస వచ్చు ననుచు । మునుపుగాఁ జెప్పి యమ్ముదిత రాజునకు । నిచ్చి గుఱ్ఱంబు లన్నియును గైకొనుచు । నచ్చోట నున్నచో.

ఆవల నొక్కని కర్వామి." మ్మనిన । నావిధంబున నింతి నతఁడు రాజునకు
నిచ్చి యాగుఱ్ఱంబు లెన్నికఁ గొనుచు । నచ్చోటనున్నచో నామహారాజు
వసు మనస్సను పుత్త్రు వామాక్షియందు । వెసఁ గాంచి మునికి నవ్వెలఁది నొప్పించె.
అతఁ డంత నిచ్చిన హరులెల్లఁ గలుగు । గతభీతిఁ జనుమని గరుడు వీడ్కొలిపె
యటఁ బోయి కాశీశుఁడగు దివోదాసు । కట భోజపురనాథుఁ డౌసీనరునకుఁ
గ్రమమొప్పఁగాఁ దొంటిగతిఁ గాంతనిచ్చి । యమర సిన్నూఱు జేసిహయములఁ గొనియె.
వనిత కాన్నృపులు ప్రవర్ధన శిబులఁ । దనయులఁ గాంచి యత్తరలాక్షి నొసఁగ
గాలవముని యంతఁ గడమనిండుటకుఁ । గాలీచపడునట్లుగా నుర్విఁ దిరిగి
[1]దొరకొనకున్నను దుఃఖింపుచుండ । గరుడి క్రమ్మర వచ్చి గాలవుఁ దేర్చి :
"యింక నెక్కడఁగల్గు నీలాగు హరులు ? । శంకింపకీవు విశ్వామిత్రుఁ గదిసి
నుతలీల నీ యాఱునూఱు గుఱ్ఱముల । నతనికి నొసఁగు మీ యబలతోఁగూడ.
కౌశికుఁడును బుత్త్రుఁ[2]గాంచి నీసేవ । రాశికి నెక్కించు ర." మ్మని పోయి
గురునకు శిష్యునిఁ గొమరొప్పఁ జూపి । [3]హరులనిప్పించి యయ్యబల నిప్పించి :
"ఏకార్యము [4]నెఱుంగఁ డీచిన్నవడుగు ; । నీకు నోర్వకపోదు నిఖిలజ్ఞ ! వినుము.
జవనాశ్వము[5]లకును జాలని కడమ । యువతిఁ [6]జేకొనుము పుత్త్రోత్పత్తి." కనినఁ
గరుణ నమ్మని యింతిఁగైకొని యందు । హరితేజు నష్టకుఁ డను పుత్త్రుఁ గాంచి
యతివనంపినఁ బోయె నది [7]తపంబునకు ; । హితమతిఁ దార్క్ష్యుండు నేఁగె నవ్వచును.
కావునఁ బెద్దలు గాదన్న త్రోవ । వే విడువనివాఁడు వినువు నీరీతి;
వెన్నునిమాటలు వినుము మే." లనినఁ । గన్నుగానక నవ్వి కౌరవ్యుఁ డనియె:
"ఓ మునులార ! మీరొత్తిచెప్పకుఁడు ; । మామతమెఱుఁగరు. మఱి వేఱె గలదు ;
అరులు భీకరులని యని మానసింకఁ । దిరుగ [8]మేవిధమునఁ ; [9]దిరిపెమేమిటికి ?
నారాయణుం[10]డైన నరుఁ[11]డైనఁ బొడుతు । సారము లయ[12]మైన జయ[13]మైన వెఱవ."
అనిన నచ్యుతుఁ బల్కె నాంబికేయుండు : । "వినఁజెప్పు[14]మొకమాట వీనికి నీవు ;
నేనును విదురుండు నీనంజయుండు । వీని దుర్భాషల వేఁగుదు." మనిన

---

1. దొరకింపనేరక. 2. గాఁగ. 3. హరులను నిప్పించి యతివ. 4. ను నేరఁడే. 5. లు చాలి. 6. గైకొమ్మ. 7. దివంబునకు. 8. నే. 9. దేహశుద్ధికిని. 10, 11. షయ్యె. 12, 13. మయ్యె. 14. మామంటి.

## కృష్ణుఁడు దుర్యోధనునితో హితోక్తులు పలుకుట

శౌరి కౌరవుఁ బల్కె : "[1]సర్పాంక, నీవు । వీరమండల[2]మేల వెలితిచేసెదవు ?
ధృతరాష్ట్రు వెఱపెల్లఁ దీఱు శ్రీచేరు । నతిభక్తి[3]నామాట లాలింపవయ్య.
ఆఁకొని ముసిఁడి తిన్నట్లు రాధేయు । కాఁకమాటలు వింటి కార్యధారలను.
ఈ దురాత్ములు నిన్ను నెలయింపఁగాని । కోదండవిద్య ఫల్గును పాటి[4]వారె ?
ఇచ్చల నాజిష్ణుఁ డింక గోవులకు । వచ్చినగతి రాఁడు వడి సేనఁ దెచ్చు.
నీ తెచ్చు సేనలన్నియు భీమసేను । చేతిలోనికి లేవు చెండాడునపుడు.
సహదేవునకునైన సాటి మీయందు । మహితునొక్కని [5]నెన్నుమా ! వేలుసుడిచి.
నీపలిచినపాట్లు నెఱి నోర్చియుండు । నాపాండుసుతుల నేలా పిల్చుకొనవు ?
ఇరువాగుఁ గూడి యీరేడు[6]దీవులును । వరుస సాధించిన వైభవంబెక్కు.
పాండవులకు నీవు పాలిచ్చునంత । మండల మైదాఱుమణుఁగులై రాదె ?
రారాజ, ధృతరాష్ట్రు రాజుగాఁ గొలిచి । మీరు వారును గూడి మెలఁగ మేలగును."

## భీష్ముఁడు దుర్యోధనుఁ దేర్పఁజూచుట

అనుచోట భీష్ముఁ డయ్యహికేతుఁ బలికె : । "వినవన్న వెన్నుని [7]విమలవాక్యములు
గొనకొని మనవిందు గోవిందుఁ డిందుఁ । జనుదెంచె నుభయపక్షముల రక్షింప.
ఇతనిమాటకు దాఁటితేని మీతండ్రి । సుతనాశ ధననాశ శోకాబ్ధి [8]మునుఁగు,
కీడెవ్వఁ డొనరించుఁ గృష్ణార్జునులకు । [9]వీడక జము ప్రోల విడియు నాద్రోహి.
నీయొక్కనికిఁ గాఁగ నృపులఁ బెక్కండ్ర । నాయోధనాగ్నిలో [10]నడఁతురే ?" యనినఁ

## ద్రోణుఁడు దుర్యోధను ననునయించుట

గురురాజు నీక్షించి గురుఁ డిట్టులనియె : । "తరముగా దిట్టి యుద్ధము మానుమయ్య !
దొరలును గురులు నాప్తులుఁ దోడినృపులుఁ । బరమహితంబు చెప్పఁగ నీవు వినవు.
కటకటా ! నే మెఱుంగని లావు నీకు । నెటనుండి చనుదెంచు [11]నీయుద్ధమునను ?
ఘను నిన్ను గెలిచిన గంధర్వు గెలిచె । మనక్రీడి నెఱుఁగవే మనుజేంద్ర !" యనిన

---

1. సర్పధ్వజ. 2. పెల్లజెల్లిచేసెదవి. 3. మా. 4. గారు. 5. ఁజూపుమా. 6. భువనములు. 7. విశద. 8. బడును. 9. వేడుక. 10. నడతువే. 11. నిర్ధయుద్ధముల.

## ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుని బోధించి చూచుట

నాంబికేయుఁడు పక్క సప్రుతు సందనుని : । "అంబుజాక్షుని దైవమని కొల్వు మేలు ;
వాసి తక్కువగాదు వడి ధర్మజునకు । భాసిల్ల శరణని బ్రదుకు టుత్తమము.
హితచింత నీవింత యెఱుఁగవే పుత్త్ర ! । మతిమంతు పలుకేల మఱి విన ?" వనిన
మఱియు వానికి ద్రోణ మందాకినేయు । లఱిముఱి యొత్తి యిట్లని చెప్పిరపుడు :
"ఏ[1]వెంట నీచిత్త మెఱుఁగముగాక । నీవు ధర్మజుఁజేరి నెమ్మి మ్రొక్కినను
అతఁడు సంతుష్టాత్ముఁడై కౌఁగిలించు ; । [2]సతతంబు భీముండుఁ జలముచాలించు ;
నర్జున మాద్రేయు లర్థి మ్రొక్కుదురు ; । నిర్జరేశ్వరుఁడైన నినుబోలఁ డపుడు.
వినవయ్య కౌరవ్య, వెఱ్ఱివిగాక । జనుల సంతోషంబు సామాన్య మెట్లు ?
ఈ వచ్చియున్న భూమీశులనెల్లఁ । బోవనంపిన వారు [3]భూములకేఁగి
ముఖముఖంబులుచూచి ముదితలుఁ దారు । సుఖముందు రదినీకు సుకృతంబుగాదె !"

## దుర్యోధనుఁడు కొలువువీడి పోవుట

అన విని కురురాజు హరిఁజూచి పలికె : । "పొనరఁ బాండవులను బోధింపుఁ డిట్లు ;
ఏనెన్నఁడును దప్ప, నేమి[4]భాగ్యంబొ ! । [5]మీనోరి కొంతయు మెత్తనయ్యెతి ;
ఉద్ధతి సతిచీర లొలి[6]పించి రనుచు । యుద్ధార్థులౌట [7]తారో నేనో చెప్పుమ !
[8]వాసి పోనాడక వనితఁ గోల్పడక । గాసిల్ల కూరకే కలవె జూదములు ?
కావున నన్ను నిక్కడివారియట్లు । [9]నీవును దూఱక నిజము చింతింపు.
తారెత్తివచ్చినఁ దద్ద మేలయ్యె ; । ఘోరాజిసేయుట గుణము రాజులకు.
ఏనింక వెఱచిన ట్లిధర్మజునకుఁ । బూని మ్రొక్కఁగనోప భూమిఁ గేలూఁది.
తొడరినఁ జాలు నింద్రునకైన మ్రొక్కఁ ; । గడపట భూమిభాగము నీయఁ గృష్ణ !
నను [10]బిన్నగాఁజేసి నాతండ్రి తమకు । వెనుకకుఁ బాలు [11]దావిడిచెఁ బోనిమ్ము ;
ఆదట నేఁడు భీష్మాది సత్త్వమున । సూదిమోపినయంత చోటు [12]నేనీయ ;
పోరాడి [13]వారిచేఁ బొలిసిన నాకుఁ । బేరుఁ గీర్తియుఁ గల్గు బెరయు స్వర్గమును ;
[14]ధర వీరభోజ్యగదా కృష్ణ !" యనిన । నరుదారఁ గోపించి హరి వారి కనియె :

---

1. వంక. 2. ధృతినంత నమ్మారుతియుఁ గౌఁగిలించు. 3. పురముల. 4. కార్య. 5. మీరి మీ కొంతయు. 6. పించెననుచు. 7. తారొయ్యన. 8. వాసియుఁ బోవక. 9. నీవు దూషింపక 10. చిన్న. 11. గా విడిచి. 12. దా. 13. తమచేత. 14. తెలిపించి పెద్ద ద్రవ్యింపకుఁ డనిన.

" పాలిసెద రీవు నాపుత్రులు నాజిలోనఁ । [1]దలఁకక మఱియొందుఁ దప్పిపో[2]యెదరు ?
ఒగిఁ బాండవులకుఁ గీడొనరించినట్టి । జగదీశ, నీయందు సత్యమెక్కడిది ?
విషధిలోఁ ద్రోచియు విషముఁ బెట్టియును । విషధరంబులఁ [3]గఱపించి చూపియును
లక్క[4]యిల్ గాల్చియు లక్ష్మి చేకొనియుఁ । బెక్కురీతుల భంగి[5]పెట్టవే వారి !
వా రిన్నియును నోర్చి వసుధ రక్షింప । నీరీతి గాదని [6]యీవోర్వలేక
[7]బూది మాయపుజూదమున వారిగెలిచి । యాదేవి నీడ్పించి యాస్థానమునను
గొన్నిమాటలు హెచ్చు కుందులాడితివి ; । విన్నవారలుగదా! వీరె యున్నారు.
అదియుఁ బాండవులోర్చి ; రకార నెదురు । గుదురుగా వారిపైఁ గోడిమెలెన్నుచును
ఉండుట తగదు వా రుగ్రసాహసులు ; । రండని పిలిపించి రాజ్య మిం."డనిన
ఆ పలుకుల కాగ్రుడైన రారాజు । కేపార యువరాజు హితముగాఁ బలికె :
" [8]అన్న, నీవిచట [9]వీరల నమ్మియున్న । నిన్నింక దొరలెల్ల నీలవర్ణునకు
నొప్పించి చంపింప నున్నవా." రనిన । నప్పు డాతఁడు లేచి యచ్చోటు తొలఁగి
పోయినఁ, గర్ణుండుఁ బోయెఁ ; దమ్ములును । బోయిరి ; శకునియుఁ బోయె ; నవ్వేనుక
మఱికొంద ఱేఁగిరి మనుజనాయకులు ; । వెలిచె నాస్థానంబు ; వెలిచె లోకములు.
అందఱు నిట్లేఁగి [10]యనతిదూరమున । సందడించుచు నిల్వ సందేహ మొదవి
గాంగేయుఁ డిట్లనుఁ : " గమలాక్ష, వీని । భంగి [11]యెట్టులో కానఁబడదు[12]చింతింప ;
తానేల పోయె ? నిందఱు నేల చనిరి ? । [13]యీనేల నిలువమి కేమికారణమొ ?
ఏమి[14]పుట్టినఁ బుట్టు నీదురాగ్రహుఁడు । భూమీశుకడుపునఁ బుట్టెఁ గావునను."
నావుడుఁ గోపించి నలినాక్షుఁ డనియె : । " ఏ వీనినెఱుఁగుదు నిది కొత్తగాదు ;
కన్నతండ్రికి మీఱి కంసుఁ డిట్లైన । మున్ను చంపితి వంశమును విస్తరిల్లె ;
దుశ్శాసనా[15]గ్రజుఁ దూలించి చంపి । నిశ్శంక చేయుఁడు నెఱి భరతకులము.
కులమెల్ల నొకనికి[16] గూలనే." లనినఁ । గలఁగుచు భీతితోఁ గౌరవ్యతండ్రి
విదురుచే గాంధారి వేగ రప్పించి । చదురొప్ప నాయింతి [17]సరిగద్దె నునిచి
" మగువ, నీతనయుండు మా[18]మాటవినక । పగవానివలెఁ బోయి పన్నియున్నాఁడు;

---

1. దలఁకకు. 2. యెడిని. 3. జాల వేఁడి. 4. యిండ్లులు గాల్చి. 5. పెట్టితి. 6. నీవు కొండియును. 7. బూద (?). 8. నన్నింతే నిచట నెంతయు. 9. వారల నమ్మియుండ. 10. రతిదూరమునకు. – సందోహమై యున్న. 11. యేమియు. 12. చూచితివా. 13. ఈనీచుఁ డుండుట. 14. పుట్టువుఁబుట్టె నీదురాచారి. 15. దుల దూషించి నేఁడు. 16. గూలునే యనిన. 17. సమ. 18. బుద్ధి.

భుజగతల్పుఁడును [1]భూభుజులును వినఁగ । భుజగకేతను నీవు బోధింపు." మనిన
ముదితయు నమ్మహామూర్ఖునిఁ బిలువ । విదురునిఁ బుత్తేర, విదురుండు[2]పోయి
శకునియుఁ దానును సర్పకేతనుని । నొకరీతిఁ బ్రార్థించి యొసరఁ దోడ్తేర
నతఁడు కర్ణాదుల నచ్చోట [3]నిలిపి । మతిలోనఁ గోపాగ్ని మండుచుండఁగను
జనుదెంచి తన యథాస్థానంబునందు । వసు[4]మాలిఁ జూడక వరుస నున్నంత
గాంధారి వానికిఁ [5]గడు గారవమున । సంధికార్యము సర్వసమ్మతంబనియుఁ
పాండవు లత్యంత బలవంతులనియుఁ । బుండరీకాక్షుని బుద్ధి మేలనియుఁ
గులమును నిల్పుట గురుకృత్యమనియుఁ । బలుతెఱఁగుల బుద్ధి ప్రకటింప, వాఁడు
చెవికి నమ్మాటలు చేఁదుచూపుటయుఁ । దివిరి క్రమ్మఱ లేచి తెంపుమైఁ బోయి

## దుర్యోధనుఁడు కృష్ణునిఁ బట్టి బంధింప నెంచుట

కర్ణాదియోధులఁగలసి యిట్లనియె: । "దుర్ణయంబు[6]ను [7]శౌరి తొడఁగుచున్నాఁడు;
తాఁ గంసుఁ జంపుట తడవుచున్నాఁడు; । లోఁగక ననుఁబట్ట లోఁగుచున్నాఁడు;
చలము డింపక మీరు శౌరిఁ[8]బట్టుటకుఁ । దలపడుదురుగాక తడవేల?" యనిన
నాకీలెఱిఁగి సాత్యకి కృతవర్మ । నేకాంతమునఁ బల్కు: "నిదె చూడు వీఁడు
దామోదరునిఁ బట్టఁ దలఁచుచున్నాఁడు; । భూమిపాలురనెల్లఁ [9]బూన్చుచున్నాఁడు;
మసలక నీవింక మననేనఁ గూడి । పసదోఁప వాకిటఁ బదిలమైయుండు."
యని చెప్పి [10]యనిచి తానబ్జనాభునకుఁ । గనుసన్న చేసి యక్కార్యంబు దెలిపి
నొలువెల్ల నపుడు సంక్షోభింపఁ బలికె: । "తులువ యెంతటివని [11]దొడఁగినాఁడకట!
నీలాభ్రమునఁ బూవ నిలిచినవాఁడు । చేలకొంగున నగ్ని [12]చిక్కినవాఁడు
ఈ వార్ధి బడబాగ్ని [13]యింకినవాఁడు । శ్రీవిభు మఱిగదా చిక్కించు వీఁడు!
పార్థులచేఁ జావఁ బాలైన వీని । నర్థిఁ జంపుము." నన్న నామాట కులికి
విదురుఁ డావిధమెల్ల విభునితోఁ జెప్ప । మదిలోన భీతుఁడై మనుజనాయకుఁడు
విదురుచే నందను వేగ రప్పించి । మదినొవ్వఁ బలుకుచో, [14]మచ్చరంబునను

---

1. భూజనుల్. 2. వచ్చి. 3. నునిచి. 4. జాతు. 5. గారవంబునను. 6. న. 7. శార్ఙ్గి. 8. జంపుటకు. 9. బూటు. 10. పనిచి. 11. దొరకి. 12. చిక్కించు. 13. నింకించు. 14. మహి సంచలింప.

## కృష్ణుని దివ్యస్వరూప విజృంభణము

హరి వానిఁజూచి యుగ్రాక్షుఁడై పలికెః । "కురుకులాధమ, చూచుకొనరోరి [1]నిన్ను ;
నే నొంటివచ్చితి నిచ్చోటికనుచుఁ । బూనితి పట్టింప భూరి[2]గర్వమున ;
పట్టుమా చూతము బంట్వై." యనుచు । నట్టహాసము సేయ నతనిఫాలమున
సరసిజగర్భుండు సన్నిధియయ్యె ; । నురమున నీశానుఁ డుదయించి మించె ;
భుగులున నగ్నులుపొడమె నేత్రముల ; । మొగముచూపె భవాని ముఖగహ్వరమున ;
పొలసిరి దాపటఁ బురుహూతయములు ; । వలపటఁ దోఁచిరి వరుణార్థపతులు ;
అశ్వను లాదిత్యు లగ్రభాగమున । విశ్వులు వసువులు వెనుక నేర్పడిరి.
రుద్రులు బహుఖేచరులుఁ గిరీటమునఁ । గాద్రవేయులు పాదకమల పీఠమున
[3]బలుఁడు పాండుండుఁ దప్పక భుజంబులను । విలయసూర్యులు నాభివీధి వెల్వడిరి.
అదయులై వృష్ణిభోజాంధకవీరు । లుదయించి రంపార నూరుభాగముల.
అప్పుడు శార్ఙ్గ చక్రాది శస్త్రంబు । లొప్పారె బహుబాహుయుగళంబులందు.
రూఢిఁ గర్ణములందు రోమకూపముల । బాడబ భీకరప్రభ లుప్పతిల్లె ;
ఏడుగాడ్పులువీచె ; నిలరాలెఁ జుక్క ; । లోడక యొక్రమోఁత యుర్వి భేదించె.
ఆ మహామూర్తికి నందఱు వెఱచి । యామీలితాక్షులై హతచిత్తులైరి.
శౌరియు ద్రోణ సంజయ భీష్మ విదుర । నారదాదులఁ గరుణాదృష్టిఁ జూచి
చెలు[4]వైన దివ్యదృష్టియుఁ బ్రసాదింపఁ । బులకించి వారు సొంపుగఁ జూచునెడను
సురదుందుభులు మ్రోసె సురసుమవృష్టి । కురిసె గంధర్వులు కొనియాడి రతని.
కర మర్థి నమ్మహాకలకలంబెల్ల । హరిమహత్త్వంబని యాంబికేయుండు
ఘనభక్తిఁ దన రెండుకరములు మొగిచి । తనువు కంపింపఁ[5]గ దైత్యారిఁ బలికె:
"సర్వజ్ఞ ! సర్వేశ ! సర్వాం[6]తరాత్మ ! । సర్వ[7]భూతాత్మక ! శరణంబ వగుము
కలుషదైత్యునిఁ జంపి కావవే యనినఁ । జెలఁగి ప్రహ్లాదుఁ గాచిన దేవ, శరణు ;
చిక్కితి మకరంబుచేఁ గావుమనిన । యక్కరిఁ గాచిన హరి, నీకు శరణు ;
హాటకాచలధైర్య, హరమిత్ర, కపట । నాటకసూత్ర కృష్ణా, నన్ను బ్రోవు(!)
సత్యభామాప్రాణ, సత్యప్రవీణ, । నిత్యకల్యాణ, నన్నిపుడు రక్షింపు;

---

1. నన్ను. 2. సత్త్వమున. 3. బలులు పాండులును. 4. వగు. 5. దైత్యధ్వంసి. 6. భూతాత్మ. 7. విజ్ఞానభాజన, నీకు శరణు.

సాగరాత్మజనాథ, సకలలోకేశ, । నాగారివాహన, నన్ను రక్షింపు;
నీ విశ్వరూపంబు నేఁడు చూచెదను; । గావింపవే! నాకుఁ గన్నుల దృష్టి;
అటమీఁదఁ దొల్లిటియట్ల కావింపు । కుటిలశీలులఁ జూడఁ గోలఁదిగా." దనిన
జనులెల్లఁ జూడ నా జననాయకునకుఁ । గనుగవ[1]కును జూపు గలుగఁ బుట్టించి
తన విశ్వరూపంబు దర్శింపఁ జేసి । వెనుకఁ దొల్లిటియట్ల విరచింపఁ జేసి
యొనర నప్పటిరూప ముపసంహరించి । మునులనందఱఁ బ్రేమమునఁ [2]జూచి యనిచి
మోమునఁ గోపంబు మూర్తీభవింప । నేమియు ననక యయ్యెడనుండి లేచి
యనుజహార్దిక్యుల హస్తంబులూఁది । చనియెఁ బౌరులు భక్తి జయువెట్టుచుండ.
అని యిట్లు జనమేజయ క్షితిపతికి ।ముని వినిపించిన మోదించి యతఁడు
అనఘాత్మ, తరువాత నైన వృత్తాంత । మనువొప్పఁ జెప్పవే యని యడుగుటయు
వాసుదేవవిధేయ, వైభవావాస, । వాసవార్చిత, లోకవైఖరీశేష,
శేషశేషవివేక, సిద్ధసంకల్ప । ... ... ... ... ...
కల్పవృక్షసమాన, ఘనదమాకల్ప, । కల్పితబుధమోద, కల్యాణభావ,
భావజ్ఞశేఖర, ప్రభురంతిదేవ, । దేవసన్నిభ, నీకు దిగ్విజయంబు.
ఇది సదాశివభక్త హితగుణాసక్త, । సదయస్వరూప, కాశ్యపగోత్రదీప,
శ్రుతిపాత్ర ఎల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయనామధేయ
యోజిత భారతోద్యోగంబునందు । నోజతో నాశ్వాస మొనరె రెండవది.

---

1. చూపర. 2. వీడుకొలిపి.

# తృతీయాశ్వాసము



*శ్రీశేషశైలేశ, చిదచిత్ప్రకాశ, । ఈశ, దిగీశ, వాణీశ, హృదీశ,
కరధృతవరచక్ర, ఖండితనక్ర, । కరిరాజసంరక్ష, కమలదళాక్ష,
హరి, మురారి, ముకుంద, అవ్యయానంద, । నరసింహ, సురనుత, నారదవినుత,
వినుము వెండియు నిట్లు వివరింపఁదొడఁగె । జనమేజయునకు వైశంపాయనుండు:
ఆరీతి శ్రీ[1]కాంతుఁ డలిగిపోవుటయుఁ । గౌరవేశ్వరు తండ్రి గాంధారి ననిచి
హరివెంటఁ బుత్త్రమిత్రామాత్యసహిత । మరుదేర, వీక్షించి యతఁ డొక్కచోట
నిలిచి వారలనెల్ల నిలువఁబంచుటయుఁ । గలఁగుచు హరి నంబికాసూతి పలికె:

## ధృతరాష్ట్రుఁడు కృష్ణుని బ్రతిమాలుకొనుట

"గోవింద, నాయందుఁ గొదలేదుసుమ్ము; । నావాక్యమొల్లఁడు నాగకేతనుఁడు.
ఏనును భూభాగ మిప్పింపఁ[2]దలఁచి । వీనికిఁ జెప్పితి [3]వేభంగి బుద్ధి.

---

* తంజావూరి ప్రతిలో ఉద్యోగ పర్వ మంతయు రెండాశ్వాసములుగానే యున్నది. అనఁగా –

  " అనుజ హార్దిక్యుల హస్తంబులూఁది
  చనియెఁ బౌరులు భక్తి జయపెట్టుచుండ. (చూ. పు. 71. పంక్తి. 8.)
  ఆరీతి శ్రీకృష్ణుఁ డలిగి పోవుటయు. (చూ. పు. 72. పంక్తి. 5.)

అదిగా అంతయుఁ గలిసి ద్వితీయాశ్వాసముగానే యున్నది.

మద్రాసు ప్రతిలో అట్లుగాక :–

  " చనియెఁ బౌరులు భక్తి జయపెట్టుచుండ "

అన్నంతతో ద్వితీయాశ్వాసము పూర్తియై

  " ఆరీతి శ్రీకృష్ణుఁ డలిగి పోవుటయు "

అను ద్విపదతో తృతీయాశ్వాసము ప్రారంభ మగుచున్నది.

ఇందును అందును ఆశ్వాస విభాగములోనే భేదముగాని, తక్కిన విషయములలో తేడా అంతగా లేదు. తంజావూరి ప్రతిలో ఈ యాశ్వాస విభాగము లేదు గనుక, ఆశ్వాసాద్యంత సంబోధనలును లేవు; మద్రాసు ప్రతిలో అది యున్నది గనుక ఆశ్వాసాద్యంత సంబోధన లున్నవి.

1. కృష్ణు. 2. వలసి. 3. విహితమా.

పలుమాఱు నన్నుఁ జెప్పనివానిఁజేసె । పలుకకమూఁగరు ప్రజ లుర్విలోన.
నాగకేతనుఁ డొక్క నాబుద్ధిగాదు । బాగొప్పఁ గృపుబుద్ధి బాహ్లీకుబుద్ధి
కలశ[1]జాతునిబుద్ధి గాంగేయుబుద్ధి । విలసిల్లు నీబుద్ధి విఁడు చూచితివె!
వినని[2]వాఁడెట్లైన వినక పోనిమ్ము । నను వానిఁగూర్పకు నగధారి!" యనిన
ఆరాజు నూరార్చి [3]హరి భీష్ముఁ బలికె: । "ఏరీతి సంధిగా దేను బోయెదను.
[4]జననాథు ననరాదు; జననాథుఁడైనఁ । దనయంతవట్టును దాసు శుద్ధుండు.
బాహు[5]సత్వంబు లొప్పఁగ వారు వీరు । నాహవంబొనరింప నైనట్టులయ్యె.
అయ్యెడిదేమి! వారాజిలో గెలుతు । రియ్యెడ కిదెవత్తు రేఁదెత్తు." ననుచు
నిజ రథారోహణ[6]నియతుఁడై కదలి । గజపురా[7]ధిపులును గదిసిరాఁ బోయి
కుంతికిమ్రొక్కి యక్కురురాజు హృదయ । మెంతయు నయ్యెంతి కేర్పడఁ జెప్పి
క్రమ్మఱ నిట్లనెఁ: "గౌరవుల్ క్రొవ్వి । [8]యుమ్మడికూటమై యుద్ధంబుఁ గోరి
త్రుళ్లెదరదియుఁ బార్థులకు మేలయ్యె; । గొల్లకు లాభంబు [9]గొఱ్ఱె క్రొవ్వినను.
ఇప్పు డేఁ బోయెద నెల్లపార్థులకుఁ । జెప్పెడుబుద్ధి చెచ్చెరఁ జెప్పు." మనిన

పాండవులకు యుద్ధమే కర్తవ్యమని కుంతి కృష్ణునితోఁ జెప్పుట

పాండుని సతి పల్కెఁ: "బద్మపత్రాక్ష! । పాండవులకు బుద్ధి బవరంబు [10]సువ్వె.
తమకు నుత్తమరాజధర్మంబు [11]గలుగ । విమతుల నీభంగి వేఁడ నేమిటికి!
పాపమింతయుఁగాక పార్థమారుతుల । చాపంబు గదయును జగతి మోఁపునకె?
వలవనిసంధి దైవము మాన్చెఁగాక । కలయుట కష్టంబు కౌరవ్యతోడ.
అనిలోన [12]ఘనులెందఱైనఁ జానిమ్ము । మనసేన [13]లెంతయు మడియంగనిమ్ము
అలుగులఁ దమకు నొప్పైనఁ గానిమ్ము । కలహంబు కార్యంబు కౌరవ్యతోడ.
ఏను జెప్పితినని యీబుద్ధి పాండు । సూనుల కెఱిఁగింపు సునిశితార్థముగ.
గోవింద, మఱియు నాకుశల మేర్పఱపు । వేవేగఁ బొ." మ్మని వేడ్క దీవించి
యనిపిన మ్రొక్కి పద్మాక్షుండు గదలి । మనుజనాథుల నిల్పి మంత్రుల నిలిపి
యటఁ గర్ణుఁజూచి [14]నన్నసువ రమ్మనుచుఁ । గుటిలాత్ముఁడగువాని కొనరెట్ట వట్టి

1. సూతుని. 2. వాఁడట్లున్న. 3. యా. 4. జననాథ, ధృతరాష్ట్రు. 5. సత్త్వములు దాఁపక. 6. నిపుణుఁడై వెడలి. 7. ధీశులు గదలి. 8. డెమ్మరికూటమై దివిరి యుద్ధమున; యుమ్మరకూటమై. 9. గొఱియ. 10. బుద్ధి. 11. గలదు. 12. నృపు. 13. లెట్టెట్టు. 14. తన్నసుప.

తానున్న తేరిమీఁదకు రాఁగఁ దిగిచి । శైనేయుఁ గరినెక్కి చనుదేరఁ బనిచి
కృతవర్మ ననిచి సత్కృతుఁజేసి యనిచి । గతిమాంద్యముగఁ బోవఁ గని పౌర[1]జనులు
కేలెత్తి మ్రొక్కి పల్కిరి తమలోన : । "ఏలొకో పోయెడు నితఁ డాగ్రహించి !
యక్కట ! సంధిగా[2]దయ్యెఁ ; గౌరవులు । చిక్కి[3]రింతకుఁ జువ్వె జిష్ణునిచేత.
తమకు గాండీవమంతటి విల్లు గలదె ? । తమకు శ్రీకృష్ణునంతటి తోడుగలదె ?
గొయ్యలై హరి[4]బుద్ధి గొనియాడరైరి ! । ఇయ్యన కేలొకో యినజుతోమాట !"
అని పెక్కుభంగుల నాఁడగా వినుచు । వనజాక్షుఁ డిభపురద్వారంబు వెడలి

## పాండవులతోఁ గూడియుండుమని కృష్ణుఁడు కర్ణునకు బోధించుట

యేకాంతమునఁ గర్ణు నిట్లని పలికె : । "నీకేల కర్ణ, యీనీచులఁ గొలువ ?
నీతండ్రి పాండుఁడు నీతల్లి [5]కుంతి ; । నీతోడ నాప్తంబు నేఁడు చెప్పెదను.
మున్ను గొంతికి మంత్రమున సూర్యువలనఁ । గన్నియ వయసునఁ గన్నబిడ్డఁడవు.
ఈత్రోవ యెఱిఁగింతు నే ధర్మజునకు । క్షత్రియుండవు నీవు శంకింపవలదు.
ఆ పాండవులు నీకు నతిభక్తి సేయ । ద్రౌపది వరుసతోఁ దగఁ బాలువడసి
వసుధ యేలుము చక్రవర్తి వయ్యెదవు ; । పొసఁగ నీకొలువేల భూప, నీ ?" కనిన
నిట్టను రాధేయుఁ : "డిది మున్న వింటి ; । నట్టేటఁ గని కుంతి నను బాఱవైవ
మాధవ, సూతుండు మఱి నన్నుఁ దెచ్చి । రాధచేతికి నిచ్చె రక్షింపుమనుచు.
ఆ రాధయును నన్ను నారాధనముల । నారయఁ దొడఁగి బాల్యమున నాతోడ
నాయాసపడె ; నట్టి యాయాసఫలము । నాయందుఁ గానదు నాఁటినుండియును.
జాతకర్మాదుల సాగించినట్టి । సూతుని ఋణము దీర్చుటలేదు వినుము.
అన్నదమ్ములు మొదలైన విందులకుఁ । జెన్నార నుపకృతి సేయ నేమియును.
పితరులు నాచేతఁ బితృతర్పణములు । మతిఁ గోరుచున్నారు ; మఱి యట్లుగాక
యనుజవర్గముకంటె నాప్తులకంటెఁ । దనయులకంటె నెంతయు విశేషముగఁ
గురురాజు మన్నించుఁ గుతలంబెఱుంగ ; । నరుఁ జంపకున్న మానదు వానిఋణము.
[6]ఇప్పు డెన్నినవారి కేపాటియైన । నప్పుదీర్పక నాకు నరుదేర[7]దగదు.

---

1. జనము. 2. కైరి. 3. రింతియెగాని జిష్ణుచేఁదార. 4. మాట. 5. గొంతి. 6. ఇప్పు డిన్నియు.
7. రాదు.

ఏమి సేయుదు నీవు హితము సెప్పితివి ; । నామది యట్లుండె నాగేంద్రతల్ప !
అఱియుదుఁగాక యే నగ్రజుండగుట । మఱి చిన్న నన్న ధర్మజుఁ డెఱింగినను
మఱి రాజ్య మొల్లఁడు ; మహితాత్మ, దీని । నెఱిఁగింప[1]వలదు వాఁ డిలయేల[2]వలయు ;
కురురాజు నేఁగూడి కుంతిసూనులకుఁ । జిరకాలమును గీడుచేసితి మొదల ;
వారిలోనికి [3]నేఁడు వత్తునా ! రాను ; । వారు వత్తురుగాక వడి నాజి." కనిన
హరి వాని హస్తాగ్రమల్లన విడిచి : । "నరు గెల్తునంటి కర్ణా ! యింక వినుము ;
ఆ పార్థుగెలువ నింద్రాదిదేవతలు । [4]నోపరు నీవు మర్త్యుఁడ వోపఁగలవె !
ఓవుదునని నీకు నొగిఁ దోఁచుఁ జెల్ల । చూపింప రాజపుత్త్రుల మృత్యుమహిమ.
వినుము యుద్ధముసేయ విపరీతు వేళ । యెనిమిది దివసంబు లేఁక నమావాస్య
యాపుణ్యదినమున నాజిసేయుటకు । నోపిన మీరు నుద్యోగింపవలయు.
పవన [5]చండాతప ప్రాలేయబాధ । దవులగు నరు లిది హైమమాసంబు ;
ఫల జల కుసుమ వైభవమొందుఁగలదు ; । తలఁపఁ బంటలుఁ బాఁడి ధరనిండఁ గలవు.
ఒడలి నొప్పులుమాని యుత్తమాశ్వములు । జడభావములుమాని సకిలింపఁ [6]గలవు.
కటముల మదధార గాఱ వారణము । లెటువంటి వ్రేటున కిచ్చ భీతిలవు ;
ఇన్నియుఁ గురుపతి కెఱిఁగింపు." మనినఁ । జిన్నవవ్వున వాఁడు [7]శ్రీకృష్ణుఁ బలికె :
"అపజయ విషయంబులై యుండు కలలు । నృపసూనులకు నాకు నిత్యంబుఁ దోఁచు ;
కౌంతేయులకు గెల్పు గలుగఁ గల్గినను । బంతంబుచెడి నేను బార్థులఁ గలియ.
నరుఁ దెగటార్చి కానఁగవత్తు నిన్ను ; । నరుచేతఁ దెగియుఁ గానఁగవత్తు నిన్ను
విచ్చేయు." మని కృష్ణు వీడ్కొల్పి మరలి । వచ్చి కర్ణుఁడు కౌరవస్వామితోడఁ
గలహకాలముచెప్పి కడుసంభ్రమమునఁ । గొలువు విచ్చినఁ బోయెఁ గురురాజుఁగూడి.
అప్పుడు విదురుఁ డొయ్యనఁ గుంతిఁ గదిసి । ముప్పిరిగొను శోకమున మ్రొక్కి పలికె :
"ఎంతటి పనిపుట్టె నింతి, చూచితివె ! । కొంత మేలెఱుఁగఁడు కురురాజు క్రొవ్వి ;
ప్రార్థించి యడిగినఁ బాలీరు గానఁ । బార్థులు తన్నుఁ జంపక మానరింక.
ధర హింస యొల్లని ధర్మరాజునకుఁ । దరమిడి పీరినందఱఁ గూల్పవలసె.
సమరాబ్ధి నొందఱు సమయనున్నారొ ! । సమయమైనది నీవు సమబుద్ధి నుండు ;

---

1, 2. కుడుగు. 3. నేను వత్తునే. 4. నోపరీవును మర్త్యుఁ డోపంగఁ గలవె. 5. చంద్రాతప. 6. దొడఁగె. 7. శ్రీపతి.

మిది విష్ణుమాయఁగా నెఱుఁగుమీ." యనుచు । విదురుఁ డామాటలు వెండియు జరపి
యా యింతిపనుపున నావాసమునకుఁ । బోయెఁ; బోయినఁ గుంతి బుద్ధిలో నపుడు:

## కుంతి కర్ణునొద్ద కేఁగి నీవు నాతనయుఁడవని పల్కుట

"తమ లక్ష్మికొఱకు బాంధవుల రాసుతుల । సమయింపనేటికి సంగ్రామసీమ!
దుర్ణయంబగు రణోద్యోగంబు మాన్పఁ । గర్ణునిఁ జాలింతుఁ గదిసి ప్రార్థించి;
అతఁడు నాసంబంధ మావంత విన్నఁ । [1]బ్రతినవర్జించు నిప్పటి కయ్య." మనుచుఁ (?)
గర్ణుఁ డనుష్ఠానకాంక్షియై యపుడు । స్వర్ణది[2]కేఁగుట సఖులచే[3]నెఱిఁగి
యమిసంగ తటలింగ నతిమంగళాంగ । నమరంగ భవభంగయగు గంగఁ గదిసి
యందుఁ గృత[4]స్నానుఁడగు సూర్యతనయుఁ । [5]డందంద జపము సేయఁగఁ జేరఁబోయి
వెనుకఁగూర్చుండిన, వెనుకఁ గర్ణుండు । కనువిచ్చి యాతల్లిఁ గడుభక్తిఁ గాంచి
ధృతి సూతగోత్ర రాధేయనామముల । నతివృత్తి నభివాదనముచేసి నిలిచి
'యేలమ్మ విచ్చేసి తిచ్చోటి?' కనిన । నాలేమ పలికె నొయ్యన వానితోడ:
"సూతగోత్రముగాదు సుచరిత్ర, [6]నీకు; । నాతనూజుఁడవీవు; నాఁడేను నిన్ను
నున్నత మంత్రప్రయోగసత్త్వమునఁ । గన్నియవయసునఁ గంటి సూర్యునకు;
కావునఁ బాండవాగ్రజుఁడవు నీవు; । ఈవెంటఁ గురురాజు నేల సేవింప?
యమసూనుఁ డాదిగా ననఘాత్మ, నీకుఁ । గొమరొప్ప నూటనేగురు సహోదరులు;
రణకేళిమాన్పి కౌరవులతోడి పాలు । గుణమున రాఁ జూచుకొనవచ్చు[7]నీకు;
ధర్మరాజును బంధు దర్శనానంద । నిర్మలచిత్తుఁడై నిన్ను సేవించు."
అనునంత 'నది ధర్మ మట్లుగావింపు' । మని సూర్యబింబ మధ్యమున నాదించె.
ఆ నాదసరణికి నమ్మమాటలకు । మానసం[8]బీక క్రమ్మఱ వాఁడు పలికె:
"పుత్త్రుండ[9]నేనెట్లు పూఁబోణి, నీకు? । క్షత్త్రియసంస్కారఘనుఁ జేయవైతి;
సూర్యజాతుఁడఁ గాన శుద్ధుండనయ్యు । మర్యాదగాదు జన్మము చెప్పుకొనుట;
ఈపోటు తరు[10]వాయి నిట్టేనుబోవ । నాపార్థునకు భీతుఁడై పోయెనంద్రు;
నాలావు పస నమ్మి నాగకేతనుఁడు । పాలీయకున్నాఁడు పాండుపుత్త్రులకు;

---

1. బ్రతినివర్తించును. 2. కేఁగిన. 3. వినుచు. 4. స్నాతుఁడగు. 5. డందుల. 6. వినుమూ. 7. గాక.
8. బింక. 9. నెట్లైతి. 10. వాత.

వానికిని చంపవలసె నీసుతుల ; । నేనింక నీకొక్క యీగి యిచ్చెదను ;
నరుఁడొక్కరుఁడుదక్క నాకుఁ జిక్కినను । సొరిది వధింప నీసుతుల నల్వురను ;
అతఁడొండె నేనొండె హతమయ్యె మఱియు । సుతపంచకము నీకు సుస్థిరం." బనిన
నచ్చపలాక్షి యిట్లనె: "దొడ్డయీగి । యిచ్చితి ; నీపాటి యెవ్వరున్నారు !
వినుత దివ్యాస్త్రప్రవీణుండవీవు । పనివడి తొడిగిన బాణంబు తొడకు.
ఇమ్ముల నాకుఁగా నీ రెండు వరము । లి" మ్మన్న నాతఁడు నీకొనుటయును
బద్మాక్షి యామాట పదిలంబుచేసి । సద్మంబునకుఁ బోయె సంతసిల్లుచును ;
పూని మహాదానములు పెక్కుచేసి । కానీనుఁడును బోయెఁ గౌరవ్యసభకు.

## కృష్ణుఁ డుపప్లావ్యమునకు మరలుట

ఆలోన శౌరియు నటఁ బోయి పోయి । లాలితగతి నుపప్లావ్యంబు చొచ్చి
పాండవ సభ కేఁగి ప్రథమపార్థునకు । దండప్రణామంబు తగ నాచరించి
భీమాదులకునెల్లఁ బ్రియము[1]లు పల్కి । యా మహాత్ములచేత నర్చితుండగుచు
వరుసతోఁ దాఁబోయి వచ్చిన తెఱఁగు । సొరిది వారలకెల్ల సూచించి మఱియు :
"నయపరాఙ్ముఖుఁడైన నాగకేతనుఁడు । ప్రియమేమియెఱుఁగును ? బ్రీతియేమెఱుఁగు ?
అతఁడు సంగ్రామ రౌద్రారామ భీము । శిత గదాహతిఁ గాని శిక్షకు రాఁడు.
ఇది యేనెఱిఁగియు నీధర్మరాజు । సదయుఁడై యనిచిన సంధి కేఁగితిని."
అని రెండుమాటల నచ్చోట నాడి । తన పథశ్రమ మార్చు తలఁపుమై లేచి
యమనూనుఁ డనుప నాత్మావాసమునకు । రమణమైఁ బోయి విశ్రమ లీల నుండె.
ఆరాత్రి ధర్మజుఁ డనుజులుఁ దానుఁ । బేరోలగంబునఁ బ్రియ[2]మున నుండి
వెన్నునిఁ బిలిపించి వేడ్క నిట్లనియె : । "నిన్నుఁబుచ్చియు సంధి నృప, కానవైతి ;
మమ్మెంబికేయుఁ డేమాటలు పల్కె ? । నెమ్మి భీష్మ ద్రోణ నీతు లెట్లుండె ?
నీబుద్ధులకు వారు నేర్పు బుద్ధులకు । నాబుద్ధిహీనుఁ డేమనియెఁ గౌరవుఁడు ?

## కౌరవ సభలోఁ బుట్టిన విశేషములు కృష్ణుఁడు పాండవుల కెఱిఁగించుట

వివరింపు." మనుటయు వెన్నుఁ డిట్లనియె : । "అవనీశ, వాని నే నర్థిఁ బ్రార్థించి
పెద్దలు మదిమెచ్చఁ బెఱనృపుల్ మెచ్చ । [3]బుద్ధులు చెప్పితిఁ బుయిలోటదక్క.

1. లొనర్చి. 2. మెప్పు. 3. బుద్ధు లేర్పఱిచితి.

ఆ వాక్యములకు వాఁ డఱనవ్వు నవ్వ । నావేళ ధృతరాష్ట్రుఁ డతనిపైఁ గినిసి
హితమున నాభంగి యెఱిఁగించెఁ జువ్వె ; । యతని నూరక దోష మాడంగరాదు.
గురు భీష్ము లప్పుడు కురురాజుఁ జూచి । కురువంశ మొకభంగిఁ గొనసాగుననియుఁ,
బాండుఁడు ధృతరాష్ట్ర భక్తితోఁ గొలిచి । దండించె నిఖలశాత్రవుల మున్ననియు,
వెనుకఁ బాండవులు దిగ్విజయంబుచేసి । ఘనముగాఁ గురుభూమి గైకొనిరనియు,
[1]ఆభూమి నీకు ద్యూతాపదేశమున । లాభించె [2]నింతకాలముదాఁక ననియు,
సమయకాలము దీర్చి చనుదెంచెఁ గాన । యమసూనునకు భూమి యర్థ మిమ్మనియుఁ
జెప్పిన నతఁడు రోషితనేత్రుఁడగుచు । నప్పుడేమియుఁ బల్క కచ్చోటు వెడలె.
ధరణీశుఁ డంత గాంధారి రప్పించి । యురగాంకు విదురుచే నొప్ప రప్పించి
బుద్ధి చెప్పించినఁ బుత్త్రుతో సతియు । సిద్ధాంతముగ బుద్ధి చెప్పి వేఁడియును
'గొడుకులుగలదానఁ గులమురక్షింపు । విడువు మాగ్రహ.' మన్న వినక వాఁడనియె :
"పడఁతి, నీవింత చెప్పకు చాలుఁజాలు ; । నడపింతుఁ గలనికి నాసేననెల్ల
[3]నీవేల యీవేళ నివ్వెఱఁగంద ? । లావుచాలని రాజులకుఁగదా ! సంధి ;
భృగురాము గెలిచిన భీష్ముండు గలఁడు[4] । తగవొప్ప నేను యుద్ధము సేతు." ననఁగఁ
బెదపిన్న చూచి కోపించి యాలించి । యదరఁ[5]జూచితిఁ ద్రోచి [6]యాడిచూచితిని ;
అంతట వినకున్న నధముగా నెఱిఁగి । పంతంబుమాట [7]తేర్పఱచి చూచితిని ;
అప్పుడు వినకున్న సమరసంయముల । రప్పించి నియతి యేర్పఱచి చూచితిని ;
మఱియును వినకున్న మాయలు నెఱపి । వెఱపించి మనసెల్ల విఱిచి చూచితిని ;
అపుడును వినకున్న నాగ్రహంబుడిగి । విపులశాంతంబున వేఁడి చూచితిని ;
ఏలాగుచేసిన నిలలోన నీకుఁ । బాలిచ్చుమతి లేదు ఫణికేతనునకు ;
మీనేర్చుగతి యింక మీచిత్త." మనిన । నాననంబునఁ గోప మావహిల్లఁగను
అనుజులవీక్షించి యమసూతిపలికె : । "మొనలు సేయుము కయ్యమునకుఁబోవలయు ;
వెన 'పునశ్శ్వానో భవిష్యతి' [8]యనఁగఁ । బోనఁగక శత్రుతఁ బొందె రారాజు.
బకవైరి, నీ[9]యేపు పార్థ, నీ[10]యొప్పు । నకుల, నీ[11]మతి నీమనను సహదేవ !

---

1. ఆ భూమి నీవు ద్యూతాభిదేశమున ; ఆ భూమియును నీవ యపహరించేల. 2. లాభము నీకు ననియు(?). 3. యీవేళ ననుమాన్ప నెవ్వారుగలరు. 4. అనియొన ననుగెల్వ నలవియేతలఁపఁ । దను నొప్ప నేను యుద్ధముసేతు ననినఁ । బదటునఁ జూచి కోపమున నానీచ. 5. జైచితి. 6. యాడ. 7. లం పలికి తేర్పఱచి. 8. ... యనినఁ । బొసఁగంగ శత్రుల.. 9. రొప్పు. 10. యిచ్చు. 11. రతి.

రాయిడి మనకు వారలకుఁ గయ్యంబు । సేయఁగ నిదె కురుక్షేత్రంబు[1]గలదు."
అనిచెప్పి మఱియుఁ జింతాక్రాంతుఁడగుచు । వనమాలిఁ జూచి యవ్వసుధేశ్వరుండు
'మాను మానును రాచి మంట పుట్టించి । కానన[2]స్థలియెల్లఁ గాల్చుచందమునఁ
గురురాజుతో రాసి కులమెల్లఁ గాల్చి । దురిత దుష్కీర్తుల దొరయ నేఁజాల;
పట్టేఁడుకూటికై బంధురత్నముల । నెట్టన సాధింపనేరఁ బో.' మ్మనిన
ఆకృష్ణుఁ డిట్లను: "నాత్మలో నీకు । నీకృపాభ్యుదయంబు హితముగా దుడుగు.
ఒకటి నీతోఁ జెప్పకున్నాఁడ [3]నన్ను । బ్రకటించి కురురాజు పట్టంగఁదలఁచె.
ఆయితంబును జేసె నాతలంపునకు । వేయేల నాకది విదురుండు చెప్పె.
కుంతి తాఁ గురురాజుఁ గూల్పుఁ డీక్షణమె । చింతింపవలదని చెప్పి పుత్తెంచె.
సమరంబు మీకు నిశ్చయ కార్య." మనిన । సమవర్తిసూనుండు సంశయంబుడిగి
వేడుకఁ దనమోము వీక్షించుచున్న । తోడఁబుట్టినవారితోడ నిట్లనియె :
"వింటిరే హరిమాట! వెస గొంతియాజ్ఞ । వింటిరే? సమరోగ్రవిధి కార్యమయ్యె.
ఇంక శంకాతంక మింక నుంకించి । ఘాంకారపటువాహులై భటులును మీరు
నొనర [4]నానావ్యూహములు [5]పన్నవలయు । మనకు సేనాపతి మఱి యెవ్వ?" [6]రనిన
నకులుతమ్ముఁడుమత్స్యనాథుఁ బేర్కొనియె; । నకులుండు[7]ద్రుపద భూనాథుఁ బేర్కొనియె;
పావని పాండ్యభూపతియె మేలనియె; । నావేళ నృపులు సాత్యకియు మేలనిరి;
అర్జునుండును బుద్ధి ననుకూలమైన । కర్జంబు దెలిసి యగ్రజున కిట్లనియె :

## ధృష్టద్యుమ్నుఁడు పాండవ సేనాధిపతిగా నిర్ణయింపఁబడుట

"అన్న, ధృష్టద్యుమ్నుఁ డగ్నికుండమున । [8]నున్నత రథరథ్యయుతముగాఁ బుట్టె;
ఆ పుట్టుగను ద్రోణహరణార్థమంద్రు; । చాపప్రగల్భుండు సాహసి యతఁడు.
అతని సహోదరుండగు శిఖండియును । నతవైరి[9]యగు భీష్మునకు మృత్యువంద్రు.
కావున సైన్యరక్షణము శ్వేతుండు । గావింపఁగలఁడు సంగరములో." ననిన
ఆ యుధిష్ఠిరుఁడును హరియాజ్ఞఁగాని । చేయ నే ననినంత శ్రీ[10]పతి పలికె;
"పార్థుఁ డెన్నినయట్ల పాంచాలసుతునిఁ । బ్రార్థింపు సేనాధిపత్యంబునకును;

1. గలుగు. 2. స్థితి. 3. నేను. 4. గా. 5. చనవలయు. 6. డనిన. 7. పాంచాల. 8. నున్నతి. 9. యా. 10. హరి.

అతఁడు [1]కోదండ విద్యాకౌశలుండు । ప్రతిపక్ష భటకోటి భంజింపఁగలఁడు ;
అంత జయప్రాప్తియగు నీకు.'' ననిన । నంతకతఁనయుఁ డాహరితోడఁ[2]బలికె :
''అక్షౌహిణీనాథు లాతండు[3]గాక । యీక్షింప మనసేన కెవ్వారు[4]గలరు ?
ఎవ్వరెవ్వరు వారి నెఱిఁగింపు.'' మనిన । నవ్వసుధాధీశు నతఁడు వీక్షించి,

## సాత్యకి ప్రభృతు లక్షౌహిణీపతులుగా నిర్ణయింపఁబడుట

''పాంచాలుఁడొక్కఁడు [5]బలియుఁడాపనికి ; । మంచివాఁడగుఁ గొంత మత్స్యేశుఁడందు;
అతివీరుఁడైన సాత్యకి యొక్కరుండు, । [6]నుతకీర్తి చేకితానుం డొక్కరుండు,
చతురుండు మాగధసహదేవుఁ డొకఁడు, । క్షితిఁ జేదిపతి ధృష్టకేతుఁ డొక్కరుఁడు,
ఖండితవైరి శిఖండి యొక్కరుఁడు, । మండలాధీశ, యమర్తుగా.'' ననిన
నట్టనఁ గృష్ణుఁ డెన్నిన భూమిపతులఁ । బట్టంబుగట్టి సంభావించి పిదప
శ్వేత[7]వంశ్యుఁడు గాన శ్వేతనామమునఁ । జాతురి మెఱయ ధృష్టద్యుమ్నుఁ బిలిచి,
యధికాదరంబున [8]నఖిలసేనలకు । నధిపతి[9]గా వాని నభిషిక్తుఁ జేసి
తన లాంఛనములిచ్చి [10]తనసేనఁ జూపి, । ''యనఘాత్మ, నీవుదికైక [11]దీనిఁగాచి
యని నన్ను గెలిపింపు.'' మని నాఁటి కనిచి । యనఘుఁ డందఱు[12]నంచి యామఱునాఁడు

## పాండవులు యుద్ధసన్నద్ధు లగుట

ఆరూఢి రణచిహ్నమైన ప్రస్థాన । భేరి వేయించిన బెదరె లోకములు ;
గ్రక్కునఁ దలగ్రుచ్చెఁ గమఠేశ్వరుండు ; । గ్రుక్కవోయె విధాత కుత్తుకజపము.
అప్పు డానందించి రఖిలసైనికులు । నెప్పుడెప్పుడు కయ్య మింక మాకనుచు.
ఆజికిఁ గైసేసి యనుజులుఁ దాను । రాజు ద్రౌపది మందిరమునకుఁ బోయి
పోయివచ్చెదమని పొలఁతికిఁ జెప్పి । యాయింతి దీవింప నాప్రొద్దె కదలి
శుభతూర్యములు మ్రోయ సుభటులు గొలువ, । రభసంబుతో వచ్చి రథములెక్కినను

1. ఘోరాహవోద్ధతులైన భూమి - పతులకుఁ దలఁకఁడు పట్టంబుగట్టు. 2. మఱియు. 3. గాన. 4. వలయు. 5. ప్రబలుఁడా. 6. ధృతపరాక్రముఁ డందు ధృష్టకేతుండు । దహనాంశునిధి చేకితానుఁ డొక్కరుఁడు । సహజశూరుఁడు జరాసంధనందనుఁడు । ఖండితారాతి శిఖండి. 7. వంశము. 8. నధిక. 9. గమ్మని యభిషిక్తు. 10. తగ. 11. వీని. 12. బిల్చి.

ధవళాతపత్రంబు ధర్మరాజునకుఁ । బ్రవిమల చంద్రబింబముఁబోలె నొప్పె.
కీర్తికన్యలు రెండుకెలఁకుల నిల్చి । మూర్తి దాల్చినయట్లు మొలిచె సీవిర్లు.[1]
అనిలనందనునకు నస్త్రశస్త్రములు । ఘన గదా ఖడ్గంబుఁ గవచంబు నొప్పె.
నరునకుఁ గపికేతనముఁ గిరీటమును । హరి సూతకృత్యంబు నఖిలాస్త్రములును
గాండీవమును వైరిగర్భంబు వగులు । చుండెడి చిందంబు నొప్పె నెంతయును.
కవలును వేవేగఁ గట్టాయితముగఁ । బ్రవిమల తేజులై పార్థివేశ్వరునిఁ
గొలిచిరా నంత నక్షోహిణు లేడు । కలశాబ్ధులునుబోలెఁ గదిసి యేతేర
ద్రుపదుండు ధృష్టకేతుఁడు విరాటుండుఁ । దపనప్రభాసి సాత్యకి శిఖండియును
సహదేవుఁడును జరాసంధనందనుఁడు । దహనాంశనిధి చేకితానభూవిభుఁడు
ననువారు సప్తసంఖ్యాక్షోహిణీశు । లనికి రథారూఢులై చనుదేర
శేషప్రమాణ విశేషతుండాగ్ర । భీషణ మత్తేభ బృందంబు నడువ
హేషారవంబుల కిరవైన రత్న । భూషిత ఘోటకంబులు పెక్కు నడువ,
ఒఱపులైన రథంబు లొక్కొక్కయారి । పఱపున నెంతయుఁ బదిలమై నడువ,
భేరీ ధణంధణ పృథులవాదముల । చే రౌద్రగతి దిశల్ చిల్లులుపోవ,

---

1. నరునకుఁ గపికేతనము కిరీటమును । హరిసూతకృత్యంబు నర్జునాస్త్రములు
గాండీవమును వైరిగర్భంబు వగులు । చుండెడి భీష్మ మహోగ్రదండంబు
ధరియించి తమ్ములుఁ తనవెంట నడువ । దొరవెంట నేతేరఁ దోడైన నృపులు
దట్టమై సింహనాదముల లోకంబు । లిట్టట్టుగా వచ్చి రెల్లయోధులును.
వాద్యముల్ ఘోషింప వందిమాగధులు । హృద్యంబుగా స్తుతు లింపారఁ జేయ
శుభలక్షణములతోఁ జూపట్టి రాజు । ప్రభమీఱఁ జనుదెంచి బలములుఁ దాను .
సదమలశీలుఁడై శౌరితోఁగూడ । మొదలఁ గురుక్షేత్రమున విడిసె నప్డు.
ఆవార్త విని వేగ నహికేతనుండు । భావించి భీష్మకృపాదులఁ జూచి
పరఁగ ధృష్టద్యుమ్ను పట్టంబు చెప్పి । ధరణిపై మనకును దళకర్తగాఁగ
నెవ్వరి నియమింత మెఱిఁగింపుఁ డనిన । ... ... ... ... ...
గాంగేయుఁ గట్టుఁడు ఘనుఁ డితండనుచు । సంగడియోధులు సారె కిట్లనఁగఁ
గర్ణుఁ డుండినఁ గాదు గాన నాపెంపు । నిర్ణయంబని పల్కె నెఱి నుగ్రుఁడగుచు
రవిసూనుఁ డిట్లను 'రాజ, భీష్ముండు । భువిఁ బడ్డమీఁదటఁ బోవత్తు' ననిన
నెట్టన యోధులు నేర్పున జహ్ను । పట్టికిఁ బట్టంబు ప్రబలఁ జేయంగ
... ... ... ... ....। అట్టిచో నతఁడు కోపాటోపవహ్ని
తప్పక పురిలోఁ బతాక యెత్తించి (ఆదిగా మూలము).

వందిమాగధులు కైవారముల్ సేయ, । నందడి సేనాని జడియ వ్రేయింప
సరభసంబునఁ జని చని ధర్మరాజు । చిరతరగతిఁ గురుక్షేత్రంబు గదిసి
రంగత్తరంగ హిరణ్వతి నదికి । నంగికమునఁ జేరి యాప్రాంతసీమ
బలముల విడియించి పాంచాలవిభుఁడు । వెలయఁ గట్టించిన విడిదల నిలిచి
పడగలెత్తించి యేర్పడ నందునుండెఁ । బుడమితేఁ డెప్పుడెప్పుడు కయ్యమనుచు.
బాగొప్ప నావార్త ఫణికేతనుండు । వేగులవారిచే విని సంభ్రమమున
గురు భీష్మ కృప కర్ణ గురుతనూజాది । కురుభటావళిని బేర్కొని యిట్టులనియె:
"ఘనులార, నేఁ డిదె కౌంతేయవిభుఁడు । మునుపె కురుక్షేత్రమున దండువిడిసె.
ఇటమీఁద మనకార్య మెట్లుండవలెను? । భటకోటి నడప నుపాయంబు గలదె?
మనము పోకుండుట మర్యాదగాదు ; । మనకు సేనానియు మఱియెవ్వఁ?" డనిన
నాతనిఁ జూచి కృపాచార్యుఁ డనియె : । "భూతలాధిప, మనమును బోవుటొప్పు ;
నాపగాసుతుని సేనాధ్యక్షుఁజేయు । నీ పగ సాధింపనేర్చు ; నా ఘనునిఁ
బ్రార్థింపు." మనుటయు ఫణిరాజకేతుఁ । డర్థి భీష్మునకు సాష్టాంగంబు మ్రొక్కి-

భీష్ముఁడు సేనాధిపతిగాఁ గౌరవసైన్యము రణమునకు వెడలుట

... ... ... ... ... । "తాత, వివేకనిధానంబవీవు ;
ఈవేళ నాసేనలెల్లను నడప । నీవుగాకెవ్వరు నేర్తురు నాకు?
మనుమని చనువెల్ల మన్నించి నాదు । మొనలఁ గావుము వైరిమొనల నిర్జింపు.
నినునమ్మి పాండవనికరంబుతోడ । గొనకొని యేను డీకొనుతలం పనఘ!"
అనిన భీష్ముఁడు కౌరవాధీశుఁ జూచి : । "అనఘాత్మ, నీచెప్పినట్ల చేసెదను ;
బాండవబలముల భగ్నంబుగాఁగ । ఖండింతు నిండింతుఁ గౌరవజలధి.
ప్రణుతి నాకొక్కవరంబు నీవిమ్ము । రణము నేఁజేయ నీ రాధేయుఁ డున్న."
అనినఁ గర్ణుఁడు మందహాసంబు చేసి । కనుఁగవఁ గెంపారఁ గౌరవ్యుఁ బలికె:
"అద్దిరా! భీష్ముకోపావేశ మింకఁ! । దద్దయు నోర్తునే తనలావువలన!
తా నర్జునాగ్నిలో దగ్ధుఁడై పడక । నేను గయ్యమునకు నేతేర నంటి ;
నిజమాడి నే బొంకనేర నేఁ." డనిన । భుజగాంకుపని మఱి పూనె భీష్ముండు.
అప్పుడు నృపుఁడు తూర్యములు ఘోషింపఁ । దప్పక పురిలోఁ బతాక లెత్తించి
యర్థి నుజ్జ్వలరత్న హైమకుంభములఁ । దీర్థోదకంబులు దెప్పించి యందుఁ

బల్లవ మృత్తికా ఫల వల్కలాదు । లెల్లఁ బెట్టించి యనేకమంత్రముల
దానహోమంబుల [1]తరువాయి దీర్చి । తాను బాహ్లీకుఁడును దగ నస్త్రగురుఁడు
కలశంబులెత్తి లగ్నంబు శోధించి । చెలఁగి భీష్మున కభిషేకంబు చేసి,
"చతురాత్మ, [2]నాయున్న సకలసేనలకుఁ । బతివి నీ" వని వేడ్కఁ బట్టంబుగట్టె.
కట్టిన నపుడు రక్తపువాన గురిసె ; । దట్టమై [3]మింట గ్రద్దలు సంచరించె ;
నెమ్ములు జాలతో నిలమీఁద రాలె ; । [4]సొమ్మవోయిరి చూడఁజూడ సైనికులు.
ఉరగకేతనుఁ డట్టి యుత్పాతచయము । సరకుసేయక కొంత శాంతి సేయించి
తన తమ్ములును దానుఁ దల్లిదండ్రులకు । వినతుఁడై వారు దీవింపఁ దేరెక్కి
భటులు వాహనములపైఁ గూడి నడవఁ । గుటిల యాత్రాభేరి ఘోషింప వెడలె.
ఆ మహాసైన్య విన్యాసభారమున । నీమహిఁ దెరచీర యెత్తినట్లొగసి
నెఱిఁబాము తలల నన్నిట మోవకున్న । నొఱఁగెఁ బయోధి నీరొక్క తావునకు.
నెఱయవైచిన కోల నేలపైఁబడని । తెఱచున రథవాజిదంతులు నడవఁ
బగిలి త్రోవలు వ్రయ్యఁబడి మహానదుల । పగిదినై మఱి పంకపాంసువులీను.
రూఢిగా నిట్లు కురుక్షేత్రమునకు । వేడుకమై నేగి విభుఁ డొక్కచోట
బలముల విడియించి పఱపైన రాజ । నిలయంబు పన్నించి నిలిచెఁ దా నందు.
గొనకొన్న [6]ధృతి నిట్లు కురు పాండు సూను । లనిసేయ వెడలుట హలధరుం డెఱిఁగి
కరము[7]శోకించి యా కౌంతేయుసభకు । నరుదెంచి యతని నొయ్యనఁ గౌఁగిలించి
తనకు మ్రొక్కిన కృష్ణుఁ [8]దక్కభూపతులఁ । బొనర యథోచితంబుగ నాదరించి
పూజితుఁడై పల్కె భూపాలుఁ జూచి : । "రాజసూయఫలంబు రాఁ గాలమయ్యె ;
ననఘాత్మ, సంధికి హరిఁ [9]బంపఁదగునె ! । నినువంటి శాంతుఁడే నీలవర్ణుండు !
వారక యితఁ డింటివారిని లేపి । ధీరత ముచ్చుచేతికిఁ గోలయిచ్చె.
[10]వాసైన శిష్యులు ఫణికేతు భీము । లాసేన నీసేన నర్థి నున్నారు.
ఏనిట్టి ఘోరాజి నీక్షింపఁ[11]జాల । నానందముగఁ దీర్థయాత్ర చేసెదను."
అని లేచిపోయిన యంతలో రుక్మి । [12]యనెడి రుక్మిణి తమ్ముఁ డచ్యుతుమఱఁది
బలముఁ దానును వచ్చి పార్థివుచేతఁ । గొలువులోపలఁ బూజగొని వారిఁబలికె :

---

1. తరువాత. 2. యుద్ధ. 3. మిగుల. 4. సొమ్మవోయినరీతిఁ జూడ. 5. సఁగి. 6. తమి. 7. శోకించుచు. 8. దగిన. 9. బుచ్చఁదగదు. 10. పాసిన. 11. నోప. 12. యను రుక్మిణికి నన్న యచ్యుతు బావ.

"[1]మితశక్తి రిపులతో మీరు పోరాడ । నతిభీతులైన [2]వన్నను వుం డంపినను
నిమిషంబులో వారి నిర్జింతు." ననిన । నమరేంద్రసూనుఁ డిట్లనియె నవ్వుచును :
" వెలిచినవారి నివ్వెలి దీర్తువనుచు । నెఱుఁగమైంతిమి నిన్ను నింత వాఁడగుట.
ఇప్పటివెలవు మా కిందిరావిభుఁడు । తప్పింపఁగలఁడు నీదాఁక నేమిటికి ?
మఱియు [3]నీవును వచ్చి నూకుఁగాఁ జెడక । వెలిచినవారల వెదకి పొ." మ్మనినఁ
గ్రమమొప్ప [4]నతఁడేఁగి కౌరవుఁగాంచి । యమతనూభవుఁ బల్కినట్ల పల్కినను
'గడవనాడితి' వని కౌరవేశ్వరుఁడు । మెడవట్టి త్రోపింప మిన్నక[5]పోయె.
ఇట్టిరాముఁడు వాఁడు నిద్దఱుఁ దక్క । నెట్టనభువి సర్వనృపతిచక్రంబు
[6]నెలమిఁ బల్లముచేరు నీరుచందమున । నలిఁ గురుక్షేత్రంబునకు వచ్చి కూడె.
ధైర్యంబుపస నంతఁ దగిలి యారాత్రి । దుర్యోధనుఁడు కర్ణుతో విచారించి
లూనప్రతాపుఁ డులూకుఁ డన్ వానిఁ । గానిమాటలు [7]చేర్చి కౌంతేయునధకుఁ
బుత్తెంచుటయు వాఁడు పొంగుచు వచ్చి । యత్తోయజాక్షు నిట్లని మోఁ గొల్చినను :

ఉలూక రాయబారము

" బలశీల ! యేను నాపతి పల్కుమనిన । పలుకు పల్కెద నెగ్గుపట్టకుమయ్య !
యమసూతిఁ దోలుత నిట్లని పల్కుమనియె ; । 'సమరసాధనశక్తి చాలదు నీకు ;
వెడ నాజి కుడుముల వేట్లాటగాదు ; । తడయక తెమ్మయ్య తగినరాజులను ;
కరమర్థి నతి[8]నీడ్వఁ గన్నదానికిని । బర దేశిపాటులు పడినదానికిని
నోలిమైఁ బ్రతికార మొనరింపలేవు ; । చాలుఁ గ్రమ్మఱఁ బోయి సన్న్యాసివగుము ;
భీముఁడు తానేల బిగియుచున్నాఁడు ? । నామీఁద గదచాచి [9] నడ తేరఁగలఁడె ?
వలలనామముఁ దాల్చి వండిపెట్టుచును । జెలువేది విరటుఁ గొల్చినయట్లు గాదు.
క్రీడి తానేల మిక్కిలి ప్రతాపించెఁ । బేడివానికి నేల పెద్ద[10]ఱికంబు ?
తన గురుం డిదె నాకు దండనాయకుఁడు ; । తనకంటె [11]నధికశస్త్రము లీతఁ డెఱుఁగు.
గొల్లసారథి[12]యును గోఁతికేతనము । విల్లు తొల్లిఁటిప్రాఁత వీఁడఁడే తాను ?

---

1. మితిలేని. 2. నన్నాడ కంపినను. 3. నూరక 4. నందేఁగి. 5. చనియె. 6. మెలఁగి...... మిట్టు నీరనఁగ. 7. చెప్పి. 8. నీడ్చు. 9. నడిఁకి. 10. తనంబు. 11. నస్త్రశస్త్రము. 12. యయ్యొ.

గుఱ్ఱాల మాద్రేయుఁ గొలువ రమ్మనుము ; । నఱ్ఱుల సహదేవు నసుఁ[1]గూడుమనుము.
ఓ యన్నలార! మీ మెుల్మకటి మెచ్చితిని । నాయున్నచోటికి నయముతో నవుడు
తత్తఱించుచు దైత్యదమనుఁ బొలదుగఁ । బుత్తెంచితిరి మోసపోనైతిఁగాని
అనిచెప్పి పుత్తెంచె.'' ననిన భీముండు । కనుఁగవ [2]రోషాగ్నికణము లుప్పొంగ
లేవ నుంకించిన, లీల వారించి । గోవిందుఁ డాయులూకున కిట్టులనియె :
''ఇంక మీవిభుఁబల్కు మేనుఁగునెక్కి । [3]దుంకదూఱుము రేపు దురముసేయుదము.
తమ్ముల [4]నిన్న నంతకునిఁ గూర్పుదుము । నెమ్మి నేలుదు మూర్వి నిను వేఁడనేల ?
అనిలోన నినుఁ[5]జంప నంత తోడేల ? । వనజంబుఁ దునుమాడ వజ్రమేమిటికి ?
కలశజు బాణశిక్షయు మాగగన్న । కలగాక ముదుక దాఁకఁగ నేయఁగలఁడె ?
అమ్ముదుకలు [6]నీవు నాజిఁ గూలెదరు । [7]కొమ్మనేలితిమని కొవ్వకు మనుము.''
అనునంత ధర్మరాజా యులూకునకుఁ । గనకవస్త్రములిచ్చి కడు గారవించి
యనిసేయ [8]నెల్లిరండని కౌరవునకు । వినిపింపు[9]మని యంచె విభులెల్ల [10]వినఁగ.
అటఁ గౌరవేంద్రుతో నయ్యులూకుండు । ఘటితోగ్రముగ యుద్ధకాలంబు చెప్పి
చెలఁగి పాండవులు చేసిన మేలు చెప్పి । జలజనాభుని వాక్యసరణి చెప్పినను
గౌరవేశ్వరుఁ జూచి గాంగేయుఁ డనియె : । ''శౌరిమాటల కీవు సంచలింపకుము ;
బలములఁ బన్నింపు పాండునందనుల । బలదర్పములు[11]మాన్చి బాణా[12]బ్ధి ముంచి
యాజి నందఱుఁ జచ్చిరనఁ జంపి యేను । నీ జయోపాయంబు నిర్వహించెదను.
ధర్మరక్షయుకాని ధర్మ[13]పుత్త్రునకు । నర్మిలిఁ దోడు లే.'' దనినఁ గౌరవుఁడు :
''నేఁడుగదా భీష్మ, నీప్రతా[14]పాగ్ని । వేఁడిమి నాకోడ వెడలనాడితివి.
పాండుసూనులనెల్ల బవరంబులోన । ఖండించి సామ్రాజ్య ఘనుఁజేయు నన్ను.
నవరణ లీరాత్రి సమకూర్పఁ బనుపు ; । రవిపొడుపునఁ బోయి రణము సేయుదము.
రమణ నేర్పడ నతిరథ మహారథుల । సమరథులను నాకు సరి నర్థరథుల
నీపీట నాపీట నెఱిఁగింపు.'' మనిన । దేవవ్రతుండు ధాత్రీపాలుఁ జూచి

## తమ సేనయందలి యతిరథ మహారథులను భీష్ముఁడు దుర్యోధనున కెఱిఁగించుట

''చెప్పఁగా నెవ్వరిచిత్త మెట్లగునో ? । చెప్పుమంటివి గానఁ జెప్పెద వినుము.
అతిరథు లీపీట నవనీశ, నీవుఁ । గృతవర్మ శల్యుండుఁ గృపుఁడు బాహ్లీకుఁడు

---

1. గొల్వ. 2. రోషాస్రు. 3. దొంక. 4. నింక. 5. ద్రుంప నంత గొడ్డేల. 6. మీరు. 7. కొమ్మ.
8. రండని యని. 9. మనియె భూ. 10. బొగడ. 11. చూపి. 12. గ్ని. 13. రాజు. 14. పంబు.

భూరిశ్రవుం డలంబుసుఁ డేను గురుఁడు । శూరుఁ డశ్వత్థామ సోమదత్తుండు.
సమరథు లిందు [1] లక్ష్మణకుమారకుఁడు । క్రమమున గాంధార కాంభోజపతులు
మునుకొని నీదుతమ్ములు బృహద్బలుఁడు । విను భగదత్తుండు [2] వృషాచలులును.
ఇందు మహారథు లీ సైంధవుండు । క్రందుకొనంగఁ ద్రిగర్తులేవురును.
విను మర్ధరథు లిందు విందానువిందు । లనఘ, నీలుఁడు కర్ణుఁ." డనినఁ గర్ణుండు:
"ఇల నర్ధరథులలో నెన్నితి నన్నుఁ । దలఁప నీ[4]కెందైనఁ దక్కువె యేను?
ఎందు నేనోడి తీ వెందు గెల్చితివి? । యిందఱకుం దఱ నిట్లాడఁదగునె?
వార్ధకంబునను సత్త్వము గుందెఁ గాన । నర్ధరథుండ వీవని తోఁచె నాకు.
పతి నిన్ను సేనాధిపతిఁ జేయఁబట్టి । మృతికిఁ దప్పితి." వన్న మీసంబు లదర
దండనాథుఁడు పల్కెఁ 'దగఁ గర్ణ, కవచ । కుండలంబులు [5]సిపు [6]గోల్పోకఁ జేసి
యతిరథశ్రేష్ఠత యణఁగి యిట్లైతి; । పతికి నాప్తుఁడవని పలుకకు [7]తడవు.
పరశురాముని నేను [8]భంగించినాఁడ । సొరిది నీగెల్చిన చోటేది చెపుమ?
బలిమిఁ బార్థుల కీవు పాఱిన యెడలు । గలుగఁ [9]దెల్పెద సిగ్గుగలదె నీ[10]కింత?"
అని కోపముఖుఁడైన నధినాథుఁ డతని । సునిశిత ప్రియమాడి సుముఖుఁగాఁ జేసి
తోరంపువేడ్కఁ బార్థులయొద్ది భటుల । తారతమ్యములు చూతము చెప్పు." మనిన

భీష్ముఁడు పాండవానీకమందలి యతిరథ మహారథాదులఁ బేర్పేర వివరించి చెప్పుట

నతఁ డంత నిట్లను: "నతిరథోత్తములు । నుతికెంతు లందు ధర్మజుఁడు భీముండు
నభిమన్యు పాండ్యసాత్యకి ఘటోత్కచులు । శుభమూర్తి పాంచాలసుతుఁడు నుర్వీశ!
శౌరియుఁ బార్థుండు సమకక్ష్యవారు । వారలసత్త్వ మీశ్వరుఁ డొక్కఁ డెఱుఁగు.
రాజేంద్ర, విను మహారథులందుఁ గుంతి । భోజుండు సజుఁడుఁ బెంపున విరాటుండు
ద్రుపదుండు ధృష్టకేతుఁడు శిఖండియును । ద్రుపదాత్మజాతపుత్త్రులుఁ గేకయులును
ఒగి యుధామన్యుండు నుత్తమౌజుండుఁ । దగ నవ్విరాటుని తమ్ములు సుతులు
క్షత్రదేవుండును సత్యజిత్తుండుఁ । జిత్రాంగదుండును జేకితానుండు
మఱి జయంతుఁడు రోచమానుండు నధిప! । మఱి సమరథులందు మాద్రినందనులు;

---

1. లక్షణలు దక్షణలు. 2. వృషాచలుండు. 3. సైకొనని. 4. కం టెను. 5. నీకు. 6. గోల్పడ.
7. కడమ. 8. భంజించి. 9. జెప్పెద. 10. కెంత.

"లోలాక్షులార, మీలోనుండి తపము । శీలింతు నా కార్యసిద్ధికి" ననుచు
వా రెన్నిభంగుల వలదన్న వినక । ఘోరతపంబు గైకొని సేయుచుండ,
వరశిష్యుఁడగు [1]హోత్రవాహునిఁ జూడఁ । బరశురాముఁడు ధర్మపరుఁ డందు వచ్చి
యందఱుఁ బూజింప నప్పువ్వుఁబోఁడి । చందము కరుణావిశాలుఁడై యడుగఁ
గన్నీరు [2]తొడర భార్గవునకు నెఱిఁగి । కన్నియ తన పూర్వకథ చెప్పి మఱియు
"నగుఁబాటుగాదె యెన్నఁడుఁ బెండ్లిలేమి! । భృగురామ, చెప్పవే భీష్మునితోడ!
తమ్మునకైన నాతఁడు నన్ను నిచ్చు । నిమ్ములఁ దానైన నేలు నిక్కైన;
నృపవైరి, గురువని నిన్నుఁ గైకొనక । కుపితుఁడై నను భీష్ముఁ [3]గూల్పవే." యనిన

## పరశురాముఁ డంబను భీష్మునొద్దకుఁ దోడ్కొని వచ్చుట

[4]నలయకు నినుఁగాతు నని భార్గవుండు । పొలఁతిఁ గురుక్షేత్రమునకుఁ దోడ్తెచ్చి
తప్పక మునులతోఁ దనరాక నాకుఁ । [5]జెప్పంప నేనును శీఘ్రయత్నమున
భూరి పూజాద్రవ్యములు గొనివచ్చి । యారామునకు మ్రొక్కి యతనిఁ బూజింప,
నా వేడ్క గొనియాడి నాకు నయ్యింతి । భావంబు చెప్పి కృపాంబుధి యతఁడు :
"చేయుము దీని విచిత్రవీర్యునకు । జాయగా." ననిన విచారించి యేను :
"తనుమధ్య సాల్వుండు తన్ను వరించె । నని పోయెఁ; బోయిన ననుజున కేను
దీని సహోదరీ ద్వితయంబుఁ బెండ్లి । [6]మానక చేసితి మాట లెక్కడి[7]కి?
వనిత సాల్వుని నెట్లు వర్జించె?" ననిన । ననుఁజూచి "నీవైన నాతి వరింపు;
కన్నియ[8]ముదిసినఁ గడుదోష మనఘ! । చెన్నార [9]నిటు సేయు, సేయకుండినను
బంధుయుతంబుగాఁ బరిమార్తు నిన్ను; । నంధకాంతకుఁ డడ్డమైనఁ బోవిడువ.
ఇరువదియొక్కమా ఱెల్లభూపతులఁ । బొరిగొంటి నాలావు భూప్రసిద్ధంబు."
అని రాముఁ డాడిన నతనికి నెఱిఁగి । విను దీనిఁ జేపట్ట వేయిచెప్పినను;
అరయఁ బాతకమూలమైన నీమాట । గురువాక్యమని నాకుఁ గొనియాడరాదు.
ఈ యొక్కటియుఁ దక్క నేమైనఁగాని । నీయాజ్ఞ చేసెద నిజముగా." ననుచుఁ
బాదపద్మంబులఁ బడి సాఁగి మ్రొక్క । నాదరింపక రాముఁ డపుడు [10]నాకలిగి
యనిసేయఁ బిలిచిన సతనిచేఁ జచ్చు । పసిదైన మేలని పలు కియ్యకొంటి.

---

1. నకృతవర్ణునిఁ గూడి. 2. తోడ. 3. గూల్పుమీ. 4. వలయక నినుఁగూర్తు. 5. జెప్పింప. 6. మానక. 7. డి. 8. ముదియునే. 9. నీవిటు. 10. నా నలిగి.

## భీష్ముఁడు పరశురామునితో యుద్ధము సేయుట

అట్టియ్యకొనిపోయి యది సత్యవతికి । నెట్టన నెఱిఁగించి నృప, మంత్రు లేర్వ
వీరవేషముదాల్చి విప్రకోటులకు । భూరిదానములిచ్చి పురనైరికిఁ దలఁచి,
సన్నుత శస్త్రాస్త్ర సన్నద్ధమైన । యున్నత రథమెక్కి యొంటిగ వెడల,
నాకాశగంగ నన్నబలనై గాంచి । నాకు యుద్ధంబు మాఁగ బుద్ధిచెప్పి
యప్పటి యుత్సాహ మడఁపంగలేక । తప్పక చని రాము దర్శించి పలికె:
"ఓరామ, శిష్యుపై నుడుగు మాగ్రహము; । తారుపెట్టినచెట్టు తారుగూల్చుదురె?
నీకుఁ గీడొనరింప నెఱవాదియైన । కాకుత్స్థరాముండు గాఁడు భీష్ముండు;
మించిన విలువిద్య మెఱసి నిన్నొరయు । క్రౌంచదారణమూర్తిగాఁడు భీష్ముండు;
వలదు కోపం." బని వారింప నతఁడు । పలుకకుండినఁ బోయె భాగీరథియును.
అట నేను భార్గవు నల్లంతఁ గడసి । తటుకున సూతురథము నిల్పఁ బంచి
యవనికి డిగ్గి సాష్టాంగంబు [1]లేను । నవిరళమతిఁ జేసి యతనిఁ గీర్తించి,
"ధృతి నీవు ధరనుండఁ దేరెక్కి వెఱతు । నుత[2]పీర్య, నీకు వాహనమేది?" యనిన
నకృతవ్రణుండను నతనిశిష్యుండు । ముకుళీ[3]కృతారి రాముని చిత్తమెఱిఁగి
పృథుల దివ్యాస్త్రసంభృతమైన యొక్క । రథము ఘటించి సారధి దానయైనఁ,
గడఁక నత్తేరు భార్గవుఁ డెక్కఁ జూచి । నడచి యేనును వచ్చి నారథంబెక్కి
యంతరిక్షంబున నమరులు బెదర । సంతరించితి ఘోర శంఖనాదంబు.
ఆ రాముఁడును మార్గణా[4]రామమైన । నారి సారించుచు నను వచ్చి తాఁకి
[5]వాలికతూపుల వాన ముంచుటయుఁ । దూలక యవి నేను దుమురుగానేసి
యకలంక శరవృష్టి నతని సారథిని । నకృతవ్రణాశ్వంబు నప[6]నయించితిని(?)
ఆ మహారణమున నస్త్రదీధితులు । భూమి నభో[7]మధ్యమునఁ బిక్కటిల్లి
కట్టిన కరువులోఁ గ్రాఁగి నీరైన । దట్టంపు బంగారుఁ దలపించె నధిప!
సారథి నట్లేను శరముల గ్రువ్వఁ । గ్రూరుఁడై యతఁ డొక్కకోల నాయురము
క్రౌంచాద్రిఁ దాఁకిన కరణి నేయుటయు, । నంచలింపక యేను శరవృష్టిఁ బఱపి
రాముని యురముఁ బార్శ్వములు బాహువులు । మోమును నొప్పించి మూర్ఛపుచ్చితిని.

1. జెట్టి. 2. వీర. 3. కృతారాతి మునితలం పెఱిఁగి. 4. రాముఁడైన. 5. వాలిన.
6. హరించితిని. 7. భాగ.

అతఁడు మూర్ఛితుఁడైన నకృతవ్రణుండు । ధృతిదూలి దవ్వుగాఁ దేరు పో[1]విడిచె.
అంబయుఁ దాను శైత్యముగ నాతనికి । నంబరంబున వీవ నది యేను జూచి
నెమ్మి నా బల[2]మేను నిందించుకొనుచుఁ । దమ్ముని కంట నీఁదలఁచితి వెఱచి;
యొగి నాత్మవధకు నుద్యుక్తుండనైతి; । భృగురాముఁ [3]డంతఁ దెప్పిఱినఁ బొంగితిని.
ఆరీతి రాముఁ డొయ్యన మూర్ఛఁదేఱి । సారథి రథ మట్లు[4]జఱపుట కలిగి
రయమున నామీఁద రథముఁ దోలించి । నయనభీషణ మార్గణములేసి యార్చి
నాతత్తరముచూచి నగుచు నిట్లనియె: । "నా[5]తిఁ గైకొనుమన్న నా[6]మాటవినవు;
గొడవ నీతోడిది కుడువరమ్మనినఁ । బొడువవచ్చెదు గాని పోకడ లేదు.
అంబనొల్లని నిన్ను నారంభకైన । డంబునఁ బతిగా నొడంగూర్తు." ననిన
నవ్వుచు నిట్లంటి: "నాఁ డీవు నృపులఁ । ద్రెవ్వనేసితివని దివిరెదు; నేఁడు
ఆ పరువులువాఱ నబ్బదు నీకు; । నాపగేయుఁడుగాని యనద లేఁడిచట
నల్లనఁ బోరాడు." మని చెప్పి యతని । విల్లు భల్లంబున విఱిచి యార్చితిని.
చయ్యన నతఁ డొక్క శక్తివైచుటయు । నయ్యెడఁ దుమురుగా నదియు నేసితిని.
రాముఁడు మఱియుఁ జక్రము ద్రిప్పివైవ । నే మూఁడు విశిఖంబు లేసితిఁ గూల.
క్రమ్మఱ నతఁ డొక్కగద పూన్చివైవ । నమ్మహాస్త్రము[7]నేచి యంతరిక్షమున
ధగ ధగ ద్ధగ యను దహనార్చు లుమిసి । జగతి ననేకవృక్షములు గాల్చుచును
జనుదేర నది యర్థచంద్రబాణమునఁ । దునిమితి దేవదైత్యులు గొనియాడ.
అంత రాముఁడు దివ్యమగు విల్లుదాల్చి । పంతమాడుచు దివ్యబాణజాలములు
చెలఁగి నామేనగ్రుచ్చిన నేమిచెప్పఁ । దిలమాత్రమైనను దెలివి లేకుండె.
అట్టిబాధకు నేను నలసి మూర్ఛిల్లి । నెట్టన మార్జాల నిద్రనాఁ దెలిసి
భార్గవాంగంబునఁ బలు వార్వియందు । నిర్గమింపఁగ బాణ[8]నిచయ మేసితిని.
కయ్య మిట్లొనరింపఁ గౌరవ్య, మాకు । మున్యేడుదినములు మునుకొని [9]చనియె.
ప్రొద్దుగ్రుంకినఁ బోయి పొసఁగ నిద్రించి । [10]యిద్దఱ మరుదెంతు మినుఁడు దోఁచినను.
అమ్మఱునాఁడు కయ్యమున నే[11]నలిగి । క్రమ్మఱ నతని మూర్ఛాయుక్తుఁ జేసి
యుగయుగ్యచక్రంబు లొడుగా నేయ । భృగుఁడు నప్పుడు తేఱి పెద్దకోపమున
నాకుఁ జెప్పనికోల నాటినఁ బడితి; । పోక యాతఁడు నేసి పోఁగొనె సూతు.

---

1. విచ్చె. 2. మెల్ల. 3. డపుడు. 4. జఱపిన నలిగి. 5. తన్విగోను. 6. బుద్ధి. 7. లేచి; నేర్చి.
8. నిచయంబు నించి. 9. నడచె. 10. యిద్దఱు చనుదెంతు. 11. నరిగి.

అవ్వేళ నాకడ కరుదెంచి వసువు । లవ్విశారదము నూన్చి రల్లన విసరి.
త్రిదశగంగయు వచ్చి తేర[1]పై నునిచి । పదిలకైం [2]యుడిపె నప్పటి[3]సంకటంబు.
ఏనంత వారలనెల్ల వీడ్కొలిపి । స్నానైన సూతకర్మము చేసికొనుచుఁ
బరశురామునిమీఁద బాణ నాగాచ । పరశు పట్టిన కుంత పరిఘులు పఱపి
చేవేఁడి చూపినఁ జిఱునవ్వునగుచు । నావీరుఁడును నన్ను నట్ల నొప్పించె.
అంత నర్కుఁడు పశ్చిమాబ్ధిఁ [4]గ్రుంకుటయు । సంతసించుచు నాజి చాలించి యేను
నునికిపట్టున కేఁగి యుదకంబులాడి । తనర సంధ్యాదికృత్యములెల్లఁ దీర్చి
యురుదర్భశయ్యపై నుండి చిత్తమున । సురల సంయముల భూసురులఁ బ్రార్థించి

వసువులు సాక్షాత్కరించి భీష్మునకు సమ్మోహనాస్త్ర మొసఁగుట

"ఓ యయ్యలార! మీకోలిఁ బ్రమ్రొక్కెదను । రాయుచు [5]నున్న భార్గవు గెల్వనిండు.
తగిలి ధర్మాధర్మ తారతమ్యములు । తగవు నేయుఁడు పెద్దతడవుగాకుండ.
రణమెంత నేయరు రామ రావణులు! । రణ మెంతలేదు సుత్రామవృత్రులకు!
అలసితి నే నాతఁ డటమున్న యలసెఁ । బొలియింపుఁ [6]డీతనిఁ బోరిలో." ననుచు
నొయ్యన నిద్రింప నొనర స్వప్నమున । నయ్యష్టవసువులు నరుదెంచి నాకు
సమ్మోహనాస్త్రంబు సత్కరించుటయు, । నమ్మెఱునాఁ డేను హరుసించి లేచి
సారథి నొక్కని నవరించుకొనుచుఁ । దేరెక్కి చని రామదేవునిఁ దాఁకి
చెలఁగి వక్షోవీథి చినుగ నేయుటయు । నలుకమై నతఁడు బ్రహ్మాస్త్రంబు దొడిగి
వడి నన్ను మంత్రపూర్వముగ నేయుటయు, । నుకువీథి నది భాస్కరోపమంబగుచుఁ
[7]బక్షఘూత్కార సంభ్రమ దంభమగుచు । యక్షరాక్షస వీక్షణాభీలమగుచు
నేతెంచు గతిచూచి యేను[8]ను నట్ల । యాతనిమీఁద బ్రహ్మాస్త్ర మేసితిని.
అదియును [9]నిదియు బ్రహ్మాండభాండంబు । వదలక నొండొంటి వడిఁదాఁకి[10]పెనఁగె.

నారదాదులు భీష్మ పరశురాముల సమర ముడుపుట

అంత నే సమ్మోహనాస్త్రంబు దొడుగ । [11]నింతయు నారదుఁ డెఱిఁగి యేతెంచి
" విడువకు విడువకు [12]విషమసాయకము । విడిచిన నీకు నా విశ్వేశునాన.

1. ముంచుటయు; ముచ్చట్లు. 2. యుండె. 3. సంకటమున. 4. గ్రుంకినను. 5. నన్ను. 6. డొక్కని
7. పక్షసంకాశ సంభృతభయద మగుచు ।...... వీక్షణాక్షోభ మగుచు. 8. వెత్తెఱిఁగి. 9. నదియు
10. పెనఁగ. 11. నెంతయు. 12. విషసాయకంబు.

చెలువకై గురువధ సేయుట యొల్ల । నెలుకతో నలిగి నీయిలు గాల్చుకొనుట ;
ఇది మాన్పవచ్చినా రిదె దివ్యు." లనిన । [1]నుదితాస్త్రమేనును నుపసంహరించి
బ్రహ్మాస్త్రకలహంబు బహుళంబుసేయ । బ్రహ్మయు నెఱచె నప్పటి యుగ్రదశకు.
అప్పుడు జమదగ్ని యాకాశగంగ । తప్పక వసువులుఁ దమకించి వచ్చి
శరములు ద్రిప్పఁడు చనదింక ననుచు । [2]నిరువురి నచ్చోటి కెడ తాఁకి తాఁకి
మానుపనేరక [3]మఱియు నిట్లనిరి : । "[4] సూనులార, జగంబు చూడనోడెడిని ;
ఏవున నక్కట యిరువురు సములు ; । కోపాగ్ని విడువక గురుశిష్యు లయ్యుఁ
బోరాడితిరి దివ్య భూరిబాణముల ; । నారీతి నొచ్చితి రన్యోన్యహతుల.
హరియొక్కఁడిందులో నరయ స్వచ్ఛంద । మరణుఁడొక్కఁడు గాన మడియరుమీరు."
అని యిట్లు ప్రార్థింప నమరులమాట । వినకున్నఁ గాదని వెఱచి భార్గవుఁడు
తనతూపు ద్రిప్పె ; నాతనియట్ల యేను । వెనుకను ద్రిప్పితి విశిఖరాజమును.
అప్పుడు లోకంబు [5]లఖిలంబు లలరె । నొప్పార నతని దివ్యులు సన్నుతించి,
"భృగురామ, నీతోడ భీష్ముఁ డీభంగిఁ । బగగల్గి పోరఁ డేర్పడ విచారింపు.
పడఁతి [6]యీరాముల్లు పన్నెఁ గాకేమి । యడరి నీకిట్లు రా నప్రయోజనము
ఆతనిఁ గరుణింపు." మని చెప్పి వచ్చి । ఖ్యాతిగా నను దెచ్చి భర్గు శిష్యునకు
మ్రొక్కించుటయు, నన్ను ముదమొప్ప నతఁడు । చక్కఁ గౌఁగిటఁజేర్చి శాంతిగాఁ బలికి
దీవించి యనిచి యా దివిజుల ననిచి । యే వెంట గతిలేని యింతి నీక్షించి,
"ఏ నుపేక్షింపక యింతి, నీకొఱకుఁ । బూనితిఁ గార్యంబు పొందు గాదయ్యె ;
నీ[7]నేర్చున ట్లింక నీవుండు." మనిన । మానిని పాణిపద్మములొప్ప మొగిచి,
"పంపు మేఁబోయి తపంబుచే నతనిఁ । జంపునుపాయంబు [8] నవదరించెదను.
ఇల నీవు పెనఁగితి వేమిచేయుదువు ? । నలువొప్ప నిట్లుండె నా నోము ఫలము."
అని రాము యారాము ననిచి శోకమునఁ । జని నిరాహారయై [9]నర్వేశ్వరునకు
నుగ్రతపంబు సేయుటయును గంగ । నిగ్రహంబున వచ్చి నెలఁత కిట్లనియె :

### గంగ యంబను నదివై పాఱుమని శపించుట

"కుటిలచిత్తవు గాన గొంతి, నీనోము । అటుచూడు నిన్ను నీరై పాఱఁజేయు.
ధవశూన్యయువతు లెందఱు లేరు ? నీవు । భువినేల [10]పురదాళి పుట్టుకవైతి ?

1. ముదముతో నేనస్త్ర ముప. 2. నిరువు రచ్చోటికి నెడయాడి యాడి. 3. మముఁజూచి చూచి.
4. మానకే కయ్యంబు మహాత్ములార. 5. లన్నియు నమరె. 6. యారామునిఁ బన్నెఁ గాకేమి.
7. నేర్చి. 8. నంతరించెదను. 9. సర్వభూషణుకు. 10. వురదాళి ; వురుదాళి(?).

దారపుత్రులులేక తండ్రికై రాజ్య । దూరుఁడై నా[1]కొడ్కు దుఃఖాబ్ధినీఁద
నతనికి హృదయశల్యంబైతి తగునె? । ధృతి గోరుచుట్టుపై రోఁకటిపోటు(?)"
అని పుత్రమరణభయాసక్తిఁ బలికి । యనిమిష నదివోవ నది చలంబునను
ఒగి నంతనుండి యత్యుగ్రతపంబు । దగిలి యనేకతీర్థములఁ జేయుచును
గంగ చెప్పినయట్లు ఘన మత్స్యభూమి । నంగన కరఁగి నీరై పాఱె సగము.
అంబాఖ్య[2]నిప్పుడు నమ్మహాతటిని । యంబుధి[3]గామినియై ముక్తినిచ్చు.
ఆపగ యట్లయ్యు నాపగ నంబ । యాపగాధరుఁ[4]గొల్వ నతఁ డేఁగుదెంచి:

### పరమేశుఁ డంబకుఁ బ్రత్యక్షమగుట

"నెలఁత, మెచ్చితిలెమ్ము నీతపంబునకుఁ । గళవళించెదుగాదె గాంగేయుఁ జంప?
ధవళాక్షి, యింక మీఁదటిజననమున । భువి ద్రుపదున కీవు పుత్రివై పుట్టి
బహుకాలమున కంతఁ బౌరుషంబబ్బ । నహితునిఁ దెగటార్చి దాపగేయునిని.
తపమింకఁ జాలు నాతపములో." ననుచుఁ । ద్రిపురారి వోయినఁ దెలిసి యా క్షణమె
మదిరాక్షి యచ్చోట మానులు వగవ । సొదవేర్చి తనమేను జూర్ణంబుచేసె.
అటమున్న పాంచాలుఁ డనపత్యుఁడగుచు । నిటలాక్షుఁగుఱిచి పత్నియుఁ దానుఁ దపము
చేయంగ సన్నిధిచేసి రుద్రుండు । 'నీయభీష్టంబేమి నృపచంద్ర!' యనిన
ద్రుపదుఁ డిట్లను: "నాకుఁ దొల్లి భీష్ముండు । కపటవృత్తియొనర్చె [5]గౌరీశ, వినుము;
అతని వధింప వీర్యముగల తనయు । [6]నతవైరి నొసఁగవే! నా." కన్న నతఁడు:
"ఇట్టి బాహాసత్త్వ నిచ్చెదఁ బుత్త్రుఁ; । బుట్టునప్పుడు వాఁడు పొలఁతి గాఁగలఁడు;
మఱికొన్నియేండ్లకు మగవాఁడె యగును । వెఱవక పొమ్మని విశ్వేశుఁ డేఁగె.

### అంబ శిఖండియై ద్రుపదునింట జన్మించుట

అంచితగతి నంత నంబ యేతెంచి । పాంచాల భూపాలపతి గర్భమునను
పుత్రియై పుట్టిన భూపాలుఁ డపుడు । పుత్రుఁ గాంచితినని భువిలోన [7]బొంకి
ఘనశోకమేరికిఁ గానరా[8]నీక । వనితయుఁ దాను నీశ్వరుమాట నమ్మి
[9]వఱలిన పుత్రోత్సవంబు నేయించి । మఱియు శిఖండి నామము బిడ్డ కిచ్చి

---

1. తోడ. 2. నింపుగా. 3. గామినియై యచట వర్తించు. 4. నోమ. 5. కఱకంఠ. 6. నతధైర్య.
7. జొక్కి. 8. కుండ. 9. యరయఁ బుత్రోత్సవం బమర.

మై దేండ్ల కతఁ రాభ్యాసంబు చేసి । యాదట మగవాఁడ యని పల్కఁ బనిచి
తనర ద్రోణునియింట ధనువు నేర్చుటకు । ననిచియున్నంత నయ్యుత్పలాక్షికిని
నొడలు మించులు దేఱనొప్పెఁ జూపఱకు; । పొడచూపెఁ జన్నులు పోకలం[2]తేసి.
అతివయుఁ బురుషుండు నపుడు చిత్రముగ । శితికంఠు దూఱుచుఁ జిగురుఁబోఁడికిని
అడర దశార్ణదేశాధిశుకూఁతు । నడిగించి వెస వివాహంబు చేసినను
ఆ పత్ని యంత నొయ్యనఁ దనమగని । రూపంబు విగతపౌరుషముగాఁ[3]దెలిసి
యేకాంతమున దాది కెఱుఁగఁ జెప్పుటయు, । నాకాంత [4]తపుయూరి కప్పుడే పోయి
యల్లుని చారిత్ర మద్దశార్ణునకు । నల్లన నెఱిఁగింప నతఁడు కోపించి
కపటభావము నీవు గాంచి రమ్మనుచు । ద్రుపదుపాలికి నొక్కదూతఁ బంచుటయు
నతఁడేఁగి పాంచాలు నంతఃపురమున । నతివలయెదుట [5]నిట్లనియె నిందించి:
"నెమ్మితో మసిఁబూసి నేరేడుకాయ । నమ్మితి విల్లు మేలయ్యెఁ బాంచాల!
మోసపుచ్చితి రుల్లములు [6]కుట్టిచూడ । దోసకాయలుగావు ద్రుపద, నమ్మితిమి.
వేవేగ మీబిడ్డవిధము సర్వమును । భూవల్లభుఁడు చూడఁ బుత్తెంచె నన్ను
రప్పింపు." మనుటయు రాజు కోపించి । 'తప్పనాడితి' వని తమకించి వానిఁ
[7]జెనకఁజూచిన దూత చెయ్యాక పాఱి । తననాథుతోడ నంతయుఁ జెప్ప నతఁడు
సంచితకోపుఁడై సైన్యంబుఁ దానుఁ । బాంచాలభూపాలుపై దండువెడలి
పురముపై విడిసినఁ బొరలి యారాత్రి । పరిచాదభయమునఁ బాంచాలుఁ డేడ్చె.

## శిఖండి యక్షు ననుహాగ్రమునఁ బురుషరూపము నొందుట

తనకుఁగా నిట్లేడ్వఁ దద్దయు లజ్జ । వనమున కొంటియై వచ్చి శిఖండి
యందు స్థూణాకర్ణుఁ డను యక్షుఁ గాంచి । యందంద కొని యాడి యాతనిఁ గదిసి,
"యన్న, నేఁ బుట్టితి నాఁడుపుట్టు; । నన్నుఁ బ్రాణము[9]లతో నమలిపోవయ్య!
నారినై[10]యుదయించినను బౌరుషంబు । చేరు సంతానంబు శివుఁ డిచ్చి[11]పోవ
నను ద్రుపదుఁడు గాంచి నరులతోనెల్లఁ । దనయుఁ గాంచితినని తద్దయు బొంకె.
అంత నే నెదిగినయా[12]వల విభవ । వంతుని కూఁతు వివాహంబుచేసె.

---

1. నొడలు. 2. పొటి. 3. దలఁచి. 4. పడినూరి. 5. వాఁడనియె. 6. పట్టి; గుట్టు. 7. నొనర నుదాసీనమొప్పఁ బల్కుటయు. 8. పర. 9. వోవ. 10. యుదయింపనంత. 11. పోయె. 12. తల.

[1]ఏనంత మగఁటిమి కెదురులుచూడ । నానిర్ణయంబు వియ్యముచా రెఱింగి
కోపించి [2] కయ్యంబుగోరి యే తేర । [3] నేపేది మాతండ్రి యేడ్చుచో నేను
వదలెద మేనని వచ్చితి.'' ననిన । సదయుఁడై యక్షుఁ డాజంత నీక్షించి,
" యోపాప, నాకు నీ యువతిత్వ మిచ్చి । నాపౌరుషము పది[4]నాళ్ళులదాఁకఁ
బూని యిప్పటికార్యములు చక్కఁబెట్టి । మానక [5] యిమ్మమ్మ మఱి నాకు.'' ననుచుఁ
బౌరుషంబిచ్చినఁ బాంచాలుబిడ్డ । నారీత్వ మా యక్షునాథున కిచ్చి
తగిన వేడుక [6] వచ్చి తండ్రిఁ గాంచుటయు, । జగదీశుఁ డానందజలధి [7] నోలాడి
ఆ మఱునాఁడు వియ్యము కయ్యమునకు । వెమ్మచుఁ జనుదేర వేగిరపడక
గుణమాడుకొని యొక్క [8] గుప్తపువేళఁ । దృణమతి వారి సందేహంబు వాపి
కట్టనిచ్చినఁ బోయెఁ గడువేడ్క నతఁడు. । ముట్ట నంతయు విను మును [9]విన వీవు.
అత్తఱి నొకయక్షుఁ డలకాపురిపుఁ । దత్తరించుచు వచ్చి [10]ధనదునిఁ గాంచి

## కుబేరుఁడు స్థూణాకర్ణు నంగనవై యుండుమనిశపించుట

" అయ్యొ, స్థూణాకర్ణుఁ డంగనయయ్యె ; । నెయ్యెడఁ బోయెనో యితని పౌరుషము!
పౌరుషవాదంబు పాంచాలుపీట । నీకూపు వినఁబడె నితఁడె గాఁబోలు.
[11]పసపోయి సరివారిఁ బాడుచున్నాఁడు । పొసఁగునే యిటువంటి పూనిక ?'' లనినఁ
బౌలస్త్యుఁడును వానిఁ బట్టి తెప్పించి । యాలాగుదెసఁ జూచి యాత్మలో నలిగి,
" కొలువనొల్లక గినా కోపలివైతి ! । కలకాల మబలవు గమ్ము నీ.'' వనుచు
శాపింప నతఁడును సభయుఁడై మ్రొక్కి । కోపంబు విడుమని కొనియాడుటయును
అతఁడు ' శిఖండి యున్నంతకాలంబు । నతివ[12]వై వర్తించి యాపరోక్షమున
నీమగతనము పూనెదవు పో.'' మ్మనిన । నామహాత్ముఁడు పోయె [13]నాడెల్ల వగవ.
అది యెఱుంగమిఁజేసి యతనిసన్నిధికిఁ । బదునొకండవనాఁడు పాంచాల[14]సూతి
వచ్చి " నీ పురుషభావము నీకు మగుడ । నిచ్చెద'' ననిన వాఁ డింతయుఁ జెప్పి
" ద్రుపదజ, నీయొద్ద దోషంబులేదు ; । త్రిపురారి వరమేల తిరుగుఁ బో.'' మ్మనుచు
ననిచిన నేతెంచి యది తండ్రితోడఁ । దన భాగ్యవిభవ మంతయుఁ జెప్ప నతఁడు

1. యేనందు. 2. కార్యంబు. 3. నేపరి. 4. నాళ్లును నీవు. 5. యిమ్మన్న ; యిమ్మయ్య. 6. తోడ. 7. దేలాడి. 8. గుత్తపు. 9. విన్నవింప. 10. తనయుని. 11. పసచెడి. 12. యై. 13. నాడు వగవగను. 14. సుతుఁడు.

పట్టణాలంకార భవ మహోత్సవము । లిట్టలంబుగఁ జేసి యెలమితో మఱియుఁ
గడుకొని విలువిద్య కడమ నేర్చుటకుఁ । గొడుకుఁ గూఁతునుగాని కొడుకునేమించె.
కావున నేను శిఖండి మర్దనము । గావింపనోప సంగనయైన కతన.
అంగనాపూర్వుల నంగనాహ్వాయుల । సంగరంబున నాకుఁ జంపనివ్రతము.
వాని నొక్కనిఁదక్క వడి నెల్లనృపుల । నేను జంపుదు." నన్న నిచ్చలో మెచ్చి
భూమీశుఁ డిట్లనుఁ : "బుణ్యాత్మ, యింక । నీమర్మ మెవ్వరి కెఱిఁగింపవలదు.
ఏమిసేయఁగవచ్చు నిల[1]మీఁదఁ గమల । ధాముఁ డేమిటనైనఁ దక్కువసేయు.
ఆపని యట్లుండె ననఘ, [2]యెన్నాళ్ల । కోపుదు రిపుకోటి నుక్కణఁగింప ?"

## భీష్మాదు లిన్నిన్ని నాళ్లలో రిపులఁ జంపుదు మనుట

అనిన నాతఁడు నవ్వి : "యాత్మప్రశంస । చనదు సేయఁగ నెట్టి[3]సాహసికైన;
నడిగితి గాన నే నదియుఁ జెప్పెదను । వడి నొక్కనెలఁ జంపవచ్చు [4]నీరిపుల.
[5]నిత్యవేవుర వర్ణనీయ సాహసుల । మృత్యువునకుఁ బాఱమీఁట నోపుదును."
అన విని రాజు ద్రోణాచార్యుఁజూచి : । "యనఘ, నీవెన్నాళ్ల నరులఁ ద్రుంచె ?" తనిన
నతఁ 'డొక్కనెలపట్టు నరి ధరాపతుల । హతులఁజేయఁగ నాకు నధినాథ !" యనిన
ఆసూటిఁ గృపునడ్గ నతఁ: "డేను రిపుల । మాసద్వయంబులో మడియింతు" ననియె.
వరుస రాజంత నశ్వత్థామ నడుగఁ : । "బరులఁ ద్రుంపుదు నేను బది దివసముల."
నని ద్రోణసుతుఁ డాడ నారీతిఁ గర్ణు । జననాథుఁ డడుగ విచారింప కతఁడు :
'దినపంచకమున వధింతుఁ బాండవుల.' । ననిన భీష్ముఁడు [6]నవ్వి యదరంటఁ జూచి
[7]నొడుతనంబిట్టు కర్ణుని నోరెఱుంగు(?) । నొడువుల కొలఁది నానొడువు లెవ్వడును.
ఇల పీనిపల్కుల కేనోర్వఁ గాని । తలఁ[8]కక యర్జునాస్త్రములైన నోర్తు.
ఆ పార్థుఁగని గుండె [9]లావురింపఁగను । [10]ఈపన్న పడుపాటు నీవె చూచెదవు."
అనునంత ధర్మరా జా మాటలెల్లఁ । దన చారగణముచేఁ దగవొప్ప నెఱిఁగి
యనుజులఁ బిలిపించి యందఱఁ బలికె : । "అనుజన్ములార, [11]నేఁ డల సుయోధనుఁడు
పరుల [12]మీ రెన్నాళ్ల భంజింతురనుచు । దొరల[13]నందఱ నేర్పుతో విచారింప

---

1. వారి. 2. యెన్నాళ్లు । ఓపుదు. 3. సాధున. 4. నే. 5. నిత్యవేవుర వర్ణనీయ సాహసుల. 6. కర్ణు నదరంటఁ జూచి. 7. నొడుతనంబట్ట ... కడుపుల (?). 8. పంగన. 9. లావళింప. 10. ఈ పన్నుఁ డొదుగంగ నేనె చూచెదను. 11. నేఁడట. 12. నెన్నాళ్లకు. 13. తోడుత.

నెలచెప్పె భీష్ముండు నిఖిలారివధకు ; । కలశ[1]జాతుఁడు నంతకాలంబు చెప్పె ;
అలయక మాసద్వయముచెప్పెఁ గృపుఁడు ; । పలికె నశ్వత్థామ పది దివసములు ;
దినపంచకంబు రాధేయుండు చెప్పె ; । తునుమ మీకెన్నాళ్లు తూఁగుఁ గౌరవుల ?"
ననిన భీమునికంటె నందఱికంటె । మునుపె కవ్వడిపల్కె ముదముతో నృపుని :
"నిమిషమాత్రముపట్టు నిఖిలకౌరవుల । సమయింప నాకు[2]ను సంగ్రామభూమి.
నన్నెఱుఁగక పల్కినారు భీష్మాదు ; । [3]లెన్న నీభటులెల్ల నింతటివారు.
ఇన్ని కార్యములకు నిదె శౌరి గలఁడు । సన్నుత జయలక్ష్మి సమకూడు నీకు ;
కురుభూమి నీవె కైకొని యేలు."దనినఁ । (బరమహర్షముఁబొందె[4]బాండవాగ్రజుఁడు.)
అని ముని జనమేజయక్షితిపతికి । మును వినిపించిన ముఖ్యమార్గమున
నక్కథకుఁడు శౌనకాది సన్మునుల । కక్కథ నెఱిఁగింప హర్షించి వారు
నతనిఁ బూజితుఁజేసి యటమీఁది కథయు । హితమతి మాకు నీ వెఱిఁగింపుమనిన,
(శతకోటి పద్యవిస్తర పుణ్యచరిత ! । అతికాయ వాక్య విజ్ఞాతచారిత్ర !
రచిత చక్రద్వంద్వ రాత్రివియోగ ! । శుచితర యోగాంగ శుద్ధాంతరంగ !
దర్పాగ్నిహుత మహోదర మహాపార్శ్వ ! । సర్పకంకణచాప ! సన్నుతాటోప !
రావణసంహార ! రఘుకులాధార ! । పావనగుణధామ ! పట్టాభిరామ !
భోసలాన్వయ సుధాంభోధిచంద్రునకు । భాసుర శౌర్యానుభావసాంద్రునకు
భవ సముత్కట జటాభరణాయమాన । ధవళకీర్తి మనోజ్ఞ తరగాంగభంగ
గాహనైక పవిత్ర గంధర్వ గాన । మోహితామర వధూముఖ కాంక్షణీయ
మనుజభావునకు, రామామనోజునకు । ననఘుసన్నుతికి శాహావనీపతికి
నింబాజి వ్రాయించె నిఖిలార్థవితతి । కంభోధి యగుచుండునట్టి భారతము
నిటలాక్ష పదపద్మ నిహితప్రసన్న । పటుచిత్తుఁడైన కుప్పయమంత్రిచేత.
ఈ పుణ్యకథ నెవ్వ రేలమి వ్రాసినను । రూపించి చదివిన రుచిరపుణ్యులకు
గంగలోపల వేయి కపిలధేనువుల । నంగజ జనకున కర్పించుఫలము
నరుదారఁ బుత్త్రపౌత్త్రాభివృద్ధియును । జిరతరకీర్తులు శ్రీలు రాజ్యములు
నిహలోక పరలోక హితమైన సుఖము । మహితాయురారోగ్య మాంగల్యచయము
రమణమై నిచ్చు శ్రీరాఘువేశ్వరుఁడు । క్రమము దప్పక యెల్లకాలంబునందు.

1. జాత్ముఁడు. 2. శస్త్రాస్త్రభావమున. 3. లెన్నిక ; నెన్నని భటులెల్ల. 4. పార్థివేశ్వరుఁడు.

ఈ మహాకృతి మహి యెంతకాలంబు । హేమాద్రిశిఖరంబు లెంతకాలంబు
ఎలమిఁ జంద్రార్కులు నెంతకాలంబు । పొలుపొంద వెలయును భువనంబు లెఱుఁగ
ననుపమస్థితి నొప్పు నంతకాలంబు । మునుకొని కథల నిమ్ముల నొప్పుఁగాను.* )
ఇది సదాశివభక్త హితగుణాసక్త । సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరి సత్పుత్ర । మతిమద్విధేయ తిమ్మయ నామధేయ
యోజిత భారతోద్యోగపర్వమున । నోజతో నాశ్వాస మొప్పె మూఁడవది.

---

* పై కుండలీకృతభాగమునకు మాఱుగా మద్రాసు ప్రతిలో ఈ దిగువ ద్విపద లున్నవి.
"అని యిట్లు జనమేజయ క్షితిపతికి । ముని చెప్పుటయు విని మోదించె నతఁడు.
ఈ పుణ్యకథ యెవ్వరిల వ్రాసి చదివి । రేపార విననేర్చి రిట్టిపుణ్యులకు
ఘనత వేవురు కన్యకలఁ గాశిలోన । వేదవేత్తలకు రవిగ్రహణమున
నాదట దారవోయఁగ నైనఫలము । శంకర పురహూత చతురాస్యు లెఱుఁగ
[illegible]ధిపుఁడును వేడ్కతో నిచ్చు, । ఇది సదాశివభక్త (అదిగా మూలము)

# తప్పొప్పుల పట్టిక

## అ ర ణ్య ప ర్వ ము

| తప్పు | | ఒప్పు |
|---|---|---|
| ఒల్లవుగాని ఎన్నఁడు. | — | ఒల్లవుగానియెన్నఁడు. అర. 1 - 15 |
| మగుడింతు— | — | మగిడింతు-అర. ప. 1. ఆ. 23.పుట.24.పం. |
| గజభార...కుచభార | — | గచభార...కుచభార. అర.ప. 2.ఆ. 36. పు. 6. పం. |
| కఠీనంపు | — | కఠినంపు ,, ,, 7. పం. |
| పొడగానఁగంటి | — | పొడగనఁగంటి. అర. ప. 3. ఆ. 11. పం. |
| తొలఁగయున్న | — | తొలఁగకయున్న. అర. ప. 3. ఆ. 19. వ. పం. |
| తగగుస్తరించి | — | తగఁగుస్తరించి. అర. ప. 3. ఆ. 54. పు. 8. పం. |
| పలుకులేటికి పాఁతపగ | — | పలుకులేటికిఁబాఁతపగ. అర. ప. 5. ఆ.78.పు.7.పం. |
| దీర్పుట | — | దీర్చుట — అర. ప. 5. ఆ. 81. పు. 16. పం. |
| జర్ఝరితమై | — | జర్జరితమై — అర. ప. 5. ఆ. 93. పు. 22. పం. |
| అనవుడుకడువేగ | — | అనవుడుఁగడువేగః అర. ప. 5. ఆ. 97. పు. 5. పం. |
| నొరగె | — | నొఱగె ,, ,, ,, 22. పం. |
| కింకఁదక్కె | — | కింకదక్కె — అర. ప. 5. ఆ. 98. పు. 15. పం. |
| వేళప్రభులార | — | వేళఁబ్రభులార. అర. ప. 5. ఆ. 101. పు. 8. పం. |

## అ ర ణ్యా ప ర్వా ను బ ం ధ ము

| | | |
|---|---|---|
| తోచె | — | తోఁచె — అనుబం. 1. పు. 19. పం. |
| పరువడిపాంచాల | — | పరువడిఁబాంచాల- ,, 2. పు. 4. పం. |
| సఖీజనములు | — | సఖీజనములు - ,, 7. పు. 14. పం. |
| అనవుడుప్రీతితో | — | అనవుడుఁబ్రీతితో - ,, 22. పు. 11. పం. |

| తప్పు | | ఒప్పు | | |
|---|---|---|---|---|
| శమనసందునఁడు | — | శమనసందనుఁడు. | అనుబం | పు. 26. 27. పం. |
| విశేషపుకాంతి | — | విశేషపుఁగాంతి- | ,, | 26. పు. 29. పం. |
| అనవృకుపితరులు | — | అనవృకుఁబితరులు | ,, | 29. పు. 20. పం. |
| గలవు; యివి | — | గలవు ; ఇవి | ,, | 40. పు. 11. పం. |
| సత్పుత్రు | — | సత్పుత్రు | ,, | 44 పు. 15. పం. |
| సోమపీధులగా | — | సోమపీధులఁగా | ,, | 49 పు. 2. పం. |
| స్రుక్కగ | — | స్రుక్కఁగ | ,, | 59. పు. 13. పం. |
| పాతకుఁడగాను | — | పాతకుఁడఁగాను | ,, | ,, 14. పం. |
| బాయపరమ | — | బాయఁబరమ | ,, | ,, 18. పం. |
| సత్త్వాఢ్యమైన | — | సత్త్వాఢ్యమైన | ,, | 63. పు. 10. పం. |
| యిద్రుండు | — | యిఁద్రుఁడు | ,, | 84. పు. 24. పం. |
| నటుబట్టి | — | నటపట్టి | ,, | 101. పు. 25. పం. |

## విరాటపర్వము

| | | | | |
|---|---|---|---|---|
| యిరుగేలు | — | యిరుఁగేలు విరా. ప. | | 17. పు. 22. పం. |
| నన్నింపు | — | నన్నింపు ,, | ప్ర. ఆ. | 19. పు. 20. పం. |
| యోడుకట్టులు | — | యోడుఁగట్టు ,, | ,, | 21. పు. 20. పం. |
| సుధేష్ణ | — | సుదేష్ణ ,, | ప్ర. ఆ. | 27. పు. 15. పం. |
| అనవుడుచెలులు | — | అనవుడుఁజెలులు,, | ,, | 28. పు. 15. పం. |
| గాలికికొండ | — | గాలికిఁగొండ ,, | 2. ఆ. | 34. పు. 3. పం. |
| నెత్తురొలుకతక్కక | — | నెత్తురొలుకఁదక్కక,, | ,, | ,, 18. పం. |
| నీకు - అంగన | — | నీకు - నంగన ,, | ,, | 37. పు. 17. పం. |
| గండుతుమ్మెద | — | గండుఁదుమ్మెద ,, | ,, | 39. పు. 3. పం. |
| ఏలతీఁగ | — | ఎలఁదీఁగ ,, | ,, | 40. పు. 17. పం. |

| తప్పు | | ఒప్పు | | | | |
|---|---|---|---|---|---|---|
| సత్వోఁడు | — | సత్త్వోఁడు | విరా. ప. 2. | ఆ. 47. | పు. 10. | పం. |
| గరుపారు | — | గరుపాఱు | ,, | ,, | ,, | |
| వెఱఁగుపాటు | — | వెఱఁగుఁబాటు | ,, | ,, 50. | పు. 9. | పం. |
| ఇరుచెవి | — | ఇరుఁజెవి | ,, | ,, 60. | పు. 19. | పం. |
| నిచ్చుతుమ్మెద | — | నిచ్చుఁదుమ్మెద | ,, | ,, 62. | పు. 16. | పం. |
| చిగురాకుపాన్పు | — | చిగురాకుఁబాన్పు | ,, | ,, 64. | పు. 20. | పం. |
| తరుము | — | తఱుము | ,, | 3.ఆ. 87. | పు. 10. | పం. |
| డగ్గరి | — | డగ్గఱి | ,, | 4.ఆ. 101. | పు. 3. | పం. |
| నీచేత - ఏమాట | — | నీచేతనేమాట- | ,, | ,, 105. | పు. 8. | పం. |
| తోటిసీమ | — | తోంటిసీమ | ,, | ,, 120. | పు. 13. | పం. |
| జర్ఘరితము | — | జర్జరితము | ,, | 5 ఆ.130. | పు. 7. | పం. |
| చేయుటకు - ఇదె | — | చేయుటకనిదె | ,, | ,, 133. | పు. 16. | పం. |
| చూచెఁ బలముఁల | — | చూచె బలముల | ,, | ,, 136. | పు. 10. | పం. |
| ఎడఁజొచ్చి | — | ఎడసొచ్చి | ,, | ,, 143. | పు. 16. | పం. |
| సమ్మోనాస్త్ర | — | సమ్మోహనాస్త్ర | ,, | 5 ఆ. 145. | పు. 22. | పం. |
| ఉత్తరాయనము | — | ఉత్తరాయణము | ,, | ,, 147. | పు 22. | పం. |
| కౌరవుఁగెల్చి | — | కౌరవులగెల్చి | ,, | ,, 159. | పు. 25. | పం. |

## ఉద్యోగపర్వము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| వెనుకకౌరవు | — | వెనుకఁగౌరవు | ఉద్యో. ప. 1. | ఆ. 6. | పు. 3. | పం. |
| అందుకుతోషించి | — | అందుకుఁదోషించి | ,, | ,, | 15. | పం. |
| సమసత్వోలు | — | సమసత్త్వోలు | ,, | ,, 14. | పు. 6. | పం. |
| మనిన ఆరాజు | — | మనిననారాజు | ,, | ,, ,, | 10. | పం. |
| సరస దారది | — | సరసఁదారది | ,, | ,, 25 | పు. 11. | పం. |
| పాండవసత్వ | — | పాండవసత్త్వ | ,, | ,, 26. | పు. 11. | పం. |

| తప్పు | | ఒప్పు | | | | |
|---|---|---|---|---|---|---|
| తీర | — | తీవ్ర | ఉద్యో. ప. | 1. ఆ. | 26. పు. | 19. పం. |
| జనయిత్రి వేడప్పి | — | జనయిత్రిచేఁదప్పి | ,, | ,, | ,, | 23. పం. |
| గూడియ | — | గుండియ | ,, | ,, | 28. పు. | 7. పం. |
| ఊరకుండి | — | ఊఱకుండి | ,, | ,, | 32. పు. | 12. పం. |
| మారుగా | — | మాఱుగా | ,, | ,, | 39. పు. | 6. పం. |
| వాసనాజస్రములు | — | వాసనాస్రజములు | ,, | 2. ఆ. | 51. పు. | 7. పం. |
| నానంబులు | — | నానసంబులు | ,, | ,, | 56. పు. | 3. పం. |
| నెటసుండి | — | నెటనుండి | ,, | ,, | 66. పు. | 23. పం. |
| నేయుము | — | సేయుఁడు | ,, | 3. ఆ | 78. పు. | 23. పం. |
| అంబికయును. అంబాలికయు | | అంబికయు నంబాలికయు | | ,, | 87. పు. | 12. పం. |

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము.